# ఒక హిమగిరి గురువర్యులకు

శిష్యుడైన

# యోగి స్వీయకథ

## శ్రీ ఎమ్

శ్రీ ఎమ్, మన మధ్య జీవిస్తూ, మనం కలుసుకోడానికి సులువుగా
అవకాశమిస్తూండటం మనందరి అదృష్టం.

- బ్రిగేడియర్ నారాయణన్

# విషయసూచిక

# కృతజ్ఞతలు

ఈ క్రింది మిత్రులకు నా గాఢ కృతజ్ఞతాభావాలను వ్యక్తీకరిస్తున్నాను. వారి సహాయమే లేకపోతే ఈ పుస్తకం సంభవమయ్యేదే కాదు.

తరచు అస్పష్టంగా ఉండే నా గిలికి వ్రాతలను చాలా జాగ్రత్తతో బహు శ్రమకోర్చి చదవదగిన వ్రాతప్రతిగా చేసిన కైజర్ కరాచీవాలాకూ-

మొదటినుంచీ నిస్వార్థంగానూ, సమర్థంగానూ ప్రచురణ, వ్యాపార విషయాల భారాన్ని మోసిన బాలాజీ, శ్రీధరులకూ-

అతి విస్తారమైన ఫోటోల వరుసక్రమంను నిర్మించి, ఆ వ్యవహారాన్ని సమ్మతించడానికి నేనెంత అయిష్టాన్ని చూపించినా (పట్టు విడవకుండా) బహు శ్రద్ధతోనూ అంకిత భావంతోనూ వాటిని ఇక్కడ కనిపించే విధంగా సరికూర్చడంలో నాకు సాయపడి ప్రారంభం నుంచీ ఫోటోల బాధ్యతను నెత్తిన వేసుకున్న శోభారెడ్డికీ-

ఫోటోలను ఎంపిక చేయడంలోనూ వాటి ఆకార రేఖల పని పూర్తి చేయడంలోనూ ప్రముఖంగా సాయపడిన నా కొడుకు రోషన్‌కూ, నా స్నేహితురాలు రాధామహేంద్రుకూ-

ఆఫీస్ పనినిచూసుకున్న విజయ భాస్కర్‌కూ -

ఇంతవరకూ గుప్తంగానూ అజ్ఞాతంగానూ ఉన్న నా జీవితాధ్యాయాలను తెలుసుకొందామని నా ప్రియమిత్రులకు కలిగిన అభిలాష ఈ పుస్తకాన్ని మొట్టమొదట ప్రారంభించడానికి నన్ను పురికొల్పింది. వాళ్ళందరికీ-

పేరు పేరునా నా కృతజ్ఞతలు.

**- శ్రీ ఎమ్.**

# తెలుగు అనువాదానికి తొలిపలుకు

ముందుగా తమ జీవిత చరిత్రను అనువదించడానికి అనుమతించినందుకు శ్రీ ఎమ్ గారికి హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. వ్రాతప్రతిని వ్రాస్తున్నప్పుడే డీటీపీ చేస్తూ సహకరించిన మిత్రుడు శ్రీ రఘుకీ, ఆ డీటీపీ కాపీని చదివి కొన్ని సూచనలు చేసిన శ్రీమతి రాణీకుమార్ గారికీ, మిత్రులు డా॥ పోరంకి దక్షిణామూర్తి గారికీ, శ్రీ శిష్టా నాగేశ్వరరావు గారికీ నా హార్ధిక ధన్యవాదాలు.

మూలంతో వాక్యం వాక్యాన్నీ సరిచూసి గురువుగారి జీవిత చరిత్ర తాలూకు అనువాదం నిర్దుష్టంగా ఉండాలని పాటుపడిన మిత్రులు శ్రీ పబ్బా వెంకట రాజు గౌడ్ గారికీ, శ్రీ తిరుమల శ్రీనివాసాచారి గారికీ, శ్రీ ముక్కామల వెంకట సత్యానందు గారికీ ఎన్ని కృతజ్ఞతలు చెప్పినా సరిపోదు.

ఈ అనువాదంలో * గుర్తుతో ఉన్న పాద సూచికలు (footnotes) మూలంలో లేకపోయినా పాఠకులందరికీ అర్థం కావాలన్న దృష్టితో నేను చేర్చాను.

ఇంత చేసినా ఏమైనా దోషాలు ఇంకా కంట బడినట్లైతే మాకు తెలియజేస్తే వచ్చే ఎడిషన్లలో సరిదిద్దుకుంటాం.

డా॥ ముంజులూరి నరసింహారావు

(1943 సెప్టెంబరు 5న పుట్టిన డా॥ ముంజులూరి నరసింహారావు ఫిజిక్స్‌లో ఎమ్మెస్సీ; ఏస్ట్రోఫిజిక్స్‌లో పిహెచ్‌డి చేశారు. హైదరాబాదులోని వివేకవర్ధినీ కళాశాలలో పనిచేసి 2001లో రీడర్‌గా రిటైరయ్యారు. డా॥ పోరంకి దక్షిణామూర్తిగారితో కలిసి "అథర్వవేదంలో అక్షయ నిధులు" అనే శీర్షికతో ఆంధ్రప్రభ వార పత్రికలో ధారావాహికంగా రెండు సూక్తాల్ని వ్యాఖ్యానించారు. ఇప్పుడు www.telugubhakti.com లో ధారావాహికంగా ఋగ్వేద సంహితలోని సూక్తాలకు యోగపరంగా వ్యాఖ్యను వ్రాస్తున్నారు.)

శ్రీ గురుభ్యోనమః

# ముందుమాట

దక్షిణ భారత సముద్రతీరంనుంచి అద్భుతమైన ఆధ్యాత్మిక హిమవత్ శిఖరాల ఎత్తుల దాకా వెళ్తూనూ, మళ్ళీ తిరిగి వస్తూనూ అసాధారణ వ్యక్తుల్ని కలుసుకుంటూ, సామాన్యమూ, నమ్మశక్యమూ అనిపించని అనుభూతుల్ని పంచుకుంటూ నేను సాహసోపేతమైన ప్రస్థానం చేశాను. ఆ ప్రయాణంలో నాతోబాటు మిమ్మల్ని కూడా తీసుకు వెళ్ళడానికి ముందు, దీనినంతటినీ సరైన దృక్పథంలో చూపించగలిగే కొన్ని మాటలు ముందుగా చెబుదామనుకుంటున్నాను.

ఈ పుస్తకంలో నేను రాసిన చాలా అనుభవాల్ని ఇంతదాకా నా హృదయంలోనే దాచుకొన్నాను. ఆంతరంగిక స్నేహితుల్ని కూడా నా చైతన్యపుటగాధాల్లో సుగుప్తంగా ఉన్న ఈ విషయాలను సూచనామాత్రంగా తప్పించి, మరేవిధంగానూ చెప్పమని నన్ను ప్రలోభపెట్టడానికి నేనొప్పుకోలేదు.

ఎందుకని నేనీ విషయాల్లో ఇంత నిగూఢంగా ఉన్నాను? ఎందుకని ఇప్పుడు ఈ రహస్యాన్ని బయటపెడుతున్నాను?

అనే ఈ ప్రశ్నలకు ఇప్పుడు నేను జవాబు చెబుతాను:

నా గురువు బాబాజీ, ఎప్పుడో ఓ సమయాన నేను నా స్వీయకథను వ్రాస్తానని సూచనాప్రాయంగా చెప్పినా, ఆ పని చేయడానికి నేను ఎదురు చూస్తూన్న ఆయన అనుమతి మాత్రం ఓ రెండేళ్ళ క్రితం దాకా నాకందలేదు. ఆ తరువాత కూడా, అయిష్టంగానే వ్రాయడానికి మొదలెట్టడానికి ముందు దాదాపు ఆర్నెల్ల పై చిలుకు దాకా, చాలా జాగ్రత్తగా దాని గురించి ఆలోచించడానికి ముఖ్యంగా రెండు కారణాలున్నాయి:

శ్రద్ధావంతుడైన ఆధ్యాత్మిక సాధకుడు, విపరీత కల్పనల్లో తేల్చే ఆకర్షణీయ సాహస ఘట్టాల కథనాల్లో మునిగిపోయి, ఆధ్యాత్మిక ప్రస్థానంలో ఆవశ్యకమూ ఆచరణీయమూ అయిన అసలు విషయాలను ఏమరుస్తాడేమోనని నేను భయపడడం ఒకటి;

విమర్శనాదృష్టి కల పాఠకుడు ఈ కథలోని కొన్ని భాగాలు నమ్మరానంత వింతగా ఉన్నాయని భావించి మొత్తం పుస్తకాన్నే కాకమ్మకథగా తీసిపారేస్తాడేమోనన్నది మరొకటి.

అయినా, ఈ సమస్యను ఒక కొలిక్కి తెస్తూ ఈ స్వీయకథను వ్రాయడానికి అనువుగా నిలిచినవి ఈ క్రింది విషయాలు -

మొదటిది - నేను అనుభవించిన దాన్ని వ్రాయడమే నా పని; దాన్ని అవునని గ్రహించడమూ, లేకపోతే, కాదని నిరాకరించడమూ అన్నది ఆ కొంతమంది సందేహాగ్రస్తులైన చదువరులకు వదిలేయడమే మంచిదనిపించింది. ఆ అల్ప సంఖ్యాకులకు భయపడుతూ నా కథను చెప్పడానికి జంకడమన్నది అధిక సంఖ్యాకులైన పాఠకుల పట్ల అన్యాయమే అనిపించింది నాకు.

రెండవది - "ఒక యోగి ఆత్మకథ" వచ్చిన తరువాత, ప్రామాణిక ఆధ్యాత్మిక జీవిత కథలు చాలా విరివిగానే ప్రచురితమయ్యాయి; ఆ కథల రచయితలు కూడా (వాటిలోని విడ్డూరాలను) చర్చించడానికి జీవించిలేరు. అదీగాక, స్వామీ యోగానంద గారి ఆత్మకథ ఎంత అధికారికమైనదైనా ఆయన వ్యక్తిగతంగా చాలాకాలాన్ని హిమాలయాల్లో గడపలేదు కూడాను. అంచేత, ఇప్పుడే, నేను పాఠకుడికి ముఖాముఖీగా లభ్యం కాగలిగిన సమయంలోనే, ప్రత్యేకంగా నేను హిమాలయాల్లో పొందిన అనుభవాల్ని చెప్పడం చాలా ముఖ్యమని నేననుకున్నాను.

మూడవది - చాలా తక్కువ మందికే బాబాజీ, శ్రీగురువుల్లాటి మహా బోధకుల ఉనికి తెలిసినప్పటికీ, వాళ్ళు నేపథ్యంలో ఉంటూనే, నిశ్శబ్దంగా ఆధ్యాత్మిక వికాస ప్రవాహాన్ని ప్రభావితం చేస్తారన్న మాటను నిరూపిద్దామనుకున్నాను నేను.

శ్రీగురువు, బాబాజీల మహా ప్రబోధాలను పోగొట్టుకోకుండా ఉండడానికిగానూ, సత్యదూరంగా ప్రతీతమయ్యే భాగాలను, అవసరమైతే, ఉపేక్షించి, తతిమ్మా భాగాన్ని మాత్రమే చదవమని నేను పాఠకులను ప్రార్థిస్తాను.

నా గురువు గారి గురించి చెప్పాలంటే, స్వామీ వివేకానందులు తన గురువుగారి గురించి చెప్పిన వాక్యమే సరిపోతుంది: "ఆయన పవిత్రపాదాల తాలూకు ఒక్క ధూళికణం వెయ్యిమంది వివేకానందులను పుట్టించగలదు" అని.

"వివేకానంద" శబ్దాన్ని తీసి "ఎమ్"ను చేరిస్తే మీకు తెలుస్తుంది నా తాత్పర్యమేమిటో -

సరే, ప్రియమైన పాఠకుల్లారా! నాతోబాటు ఈ అద్భుత ప్రస్థానం చేయడానికి రండి. ఆ మహాత్ముల ఆశీస్సులు మీకూ చేరాలి.

# 1. ప్రారంభం

భారత్-టిబెట్ దేశాల సరిహద్దు ప్రాంతాలకు దగ్గరగా హిమాలయాల్లోని బదరీనాథ్ సమీపంలో ఉన్న వ్యాసగుహలో, నలభై ఏళ్ళ క్రితం, భారత దక్షిణాది రాష్ట్రాల్లో కొసనున్న కేరళ రాష్ట్రం నుంచి వచ్చిన ఒక పందొమ్మిదేళ్ళ యువకుడు గాఢ ధ్యానంలో నిమగ్నుడై కనిపించాడు. ఆ రోజుల్లో కూడా ఇరవై ఏళ్ళలోపు పిల్లాడొకడు ధ్యానం చేయడానికి హిమాలయాలకు పోవడం సాధారణంగా జరిగే విషయమేమీ కాదు. ఇప్పటి ఈ అబ్బాయి విషయంలో బొత్తిగా నమ్మశక్యం కాని దేమిటంటే, అతను ఒక హిందువు కూడా కాకపోవడం.

ఈ యువకుడు యోగి ఎలాగయ్యాడో, ఊహకందని శక్తీ వైభవమూ ఉన్న అద్భుత, ఆకర్షణీయ లోకం అతని కళ్ళెదుట ఎలాగ వెల్లడి అయిందో - అనేదే నా జీవిత కథ. ఆ యువకుణ్ణి నేనే.

మీరు అనుమతిస్తే (నా కథను) మొట్టమొదటినుంచీ ప్రారంభిస్తాను. ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా మనం శాశ్వత హిమావాసానికి కలిసి నడిచివెళదాం. అక్కడ, ఆ మంచుగావంచా చుట్టబెట్టుకున్న హిమగిరి శిఖరాల్లో నా స్నేహితుడూ, మహాతత్త్వవేత్తా, మార్గదర్శీ ఉండేవాడు; ఆ ప్రియతమ గురువు అధ్యాపకుడి దయానుగ్రహాలవల్లనే నేను మహోన్నత చైతన్య స్తరాల్లో ఎత్తుగా ఎగరడం నేర్చుకున్నాను.

ఆ ప్రాంతాల గొప్పతనాన్ని చెప్పడంలో మాటలు ఏ రకంగానూ న్యాయం చెయ్యలేవు; కానీ, మన దగ్గరున్న ఒక్కగానొక్క పనిముట్టు ఆ మాటలే మరి. అంచేత సహృదయుల్లారా! ఆ దుర్గమ అడవుల్లో నడుస్తూ సుకుమారంగా ఊగే ప్రదీప్త పుష్పాలూ, మధురంగా పాడే పక్షులూ, ఉరకలెత్తుతూ ప్రవహించే మహా నదీ, నిశ్శబ్దంగా నిలుచుని ఉన్న పొడుగాటి చెట్లూ మొదలైన అద్భుత దృశ్యాలను గురించి చెప్పుకుంటూ, చివరికి మలుపు తిరగ్గానే, అకస్మాత్తుగా శిఖరాయమానమైన మహాశ్వేతత్వాన్ని ప్రదర్శించే హిమాచ్ఛాదిత హిమాలయాలను చూసి, ఆశ్చర్యంతో నోట మాటరాని స్థితికి వచ్చే ఆ ప్రయాణాన్ని ఆరంభిద్దాం. సనాతన ఋషులు "యద్వాచానభ్యుదితం"* అంటూ మాటలకందనిదీ, అర్థంకానిదీ అయిన ఆ శక్తినీ మహిమనీ గానం చెయ్యలేదా మరి!

---

* యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే ।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥ (కేనోపనిషత్ 1-4)
మాటలు చెప్పగాలేని ఆ శక్తిలోని ఒకానొక లేశంతో, మాటలు రూపొంది ఉచ్చారితాలవుతున్నాయి. మాటలకందనిదే బ్రహ్మం; మనం మామూలు మాటలతో చెబుతూ సాధారణంగా ఉపాసిస్తున్నది బ్రహ్మం కానేకాదని తెలుసుకో.

పర్వతరాజు హిమవంతుడి ప్రియమైన కూతురు పార్వతితో ముఖాముఖి మిమ్మల్ని కలపడానికి నేనూ మీ అంత ఆతురతతోనే ఉన్నాను. కానీ మనం ఆరోహణాన్ని ప్రారంభించడానికి ముందు, కొన్ని ముఖ్యమైన సామగ్రులను పోగుచేసి కట్టకట్టు కోవాలి. ఇక సమయాన్ని వ్యర్థం చేయకుండా నేనా పనికోసం పూనిక వహించి బాగా అవసరమైన విషయాలకే కట్టుబడతాను.

నేను "అనంతశేషతల్పం మీద శయనించే విష్ణువు" పురమైన తిరువనంతపురంలో జన్మించాను. "అనంత" అంటే సంస్కృతంలో 'అంతంలేనిది', 'పరిమితిలేనిది' అని అర్థం. వందేళ్ళ పైబడి ఇండియాను పరిపాలించిన బ్రిటిషు వాళ్ళు ఈ ఊరుకు "త్రివేంద్రం" అని మరో పేరు పెట్టారు – ఇది సముద్రతీరంలో ఉన్న ఊరు; కేరళకు రాజధాని; ఇండియాకు దక్షిణ దిక్కు చివరిలో ఉంది. 1948లో గుట్టలూ నదులూ పుష్కలమైన ఆకుపచ్చదనంతోనూ కేరళ, సమృద్ధిగా పెరిగిన ఒక మహాగ్రామంగా ఉండేది.

కేరళకు వలస వచ్చిన ఒక పఠాన్ కుటుంబంలో 1948వ సంవత్సరం నవంబరు 6న నేను పుట్టేను. కేరళకు వలస వచ్చిన ఈ కుటుంబంలోని మా పూర్వీకులు విదేశీ సైన్యంలో పని చేయడానికి వచ్చిన సైనికవర్గంవాళ్ళు. వాళ్ళు అప్పటి శక్తిమంతుడైన తిరువాన్కూరు మహారాజు మార్తాండవర్మ సైన్యంలో చేరారు.

కేవలం శ్రద్ధా, ఏకాగ్రతతో కూడిన అవధానమూ, అపాయాలను ఎదిరించాలనే అభిలాష, ఓటమిని ఒప్పుకోవడానికి ఇష్టపడకపోవడమూ అనే గుణాలతో ఒక సామాన్య బాలకుడు, హిమాలయ శిఖరాలంత వ్యాప్తమైన చైతన్యాన్ని చేరుకోవడమనే విషయాన్ని "కుచేలత్వం నుంచి కుబేరత్వానికి కొనసాగిన కథ" అని మరో సందర్భంలో మామూలుగా వాడే నానుడితో పోల్చి చెప్పుకోవచ్చు.

సహజంగానే నేను అతి ముఖ్యమనుకొనే మరో విషయం కూడా ఉందనుకోండి ఇక్కడ. చాలావరకూ బొత్తిగా ఎరగని ప్రదేశం గుండా నేను ప్రయాణం సాగించడానికి, ప్రగాఢమైన ప్రేమాభిమానాలను చూపించిన ఒక మహా గురువు మార్గదర్శకత్వమూ ఆశీస్సులూ నాకు బాగా సహాయపడ్డాయి. ప్రశ్నించే నా స్వేచ్ఛను ఎప్పుడూ తుంచెయ్య లేదు ఆ గురువు; నేను సోమరిగానూ, ఇతరుల మీద ఆధారపడి ఉండే లాగానూ కాకుండా ఆయన నా చేతిని చాలాసేపు పట్టుకొనీ ఉండలేదు; నా లోటుపాట్లనన్నిటినీ, పరిస్థితులకు అనుగుణంగా చేసే నా ప్రతిక్రియలనన్నిటినీ క్షమించాడాయన. తల్లీ తండ్రీ గురువు ప్రియమిత్రుడూ – అన్ని భూమికలనూ కలబోసి ఒకటిగా రూపొందిన ఆ మహానుభావుణ్ణి నేనెప్పటికైనా మరిచిపోగలనా?

కనీసం తొమ్మిదేళ్ళు అయినా నిండని నా జీవిత పరిధిలోకి ఆయనను రప్పించినది ఆయన కనికరమా? లేక, ఆయుఃప్రమాణాల తాలూకు లౌకిక పరిగణనను మించిన మరేదైనా సంబంధముందా? కథ ముగింపులో దీన్ని మీరే నిశ్చయించుకోవడానికి వీలుగా అది మీకే వదిలేస్తున్నాను.

నేను నా గురువును "బాబాజీ" (నాన్నగారూ) అని పిలిచేవాణ్ణి. ఆయన నాకు తరచూ చెబుతూ ఉండేవారు – "సంగతుల్ని సీదాసాదాగానూ, సూటిగానూ చూడు. అర్థరహితమైన భేషజాలతో, భాషా శషభిషలతో అర్థంపర్థం లేని వాక్యాలను గానీ అల్లకు. లోకంలో అందరి మాదిరిగానే జీవించు. తమ గొప్పతనాన్ని ఎవరూ చాటుకోరు; దగ్గరికి వచ్చినవాళ్ళు, వారికి వారే దాన్ని కనుక్కుంటారు. ఈ లోకంలో సుఖంగా ఎలా బతకగలమో అనే విషయంలో నీ మిత్రులకూ సహచరులకీ నువ్వు దృష్టాంతంగా నిలిచి ఉండు; అదే సమయంలో అనంత చైతన్యం తాలూకు పుష్కలశక్తితోనూ మహత్త్వంతోనూ శ్రుతి కలుపుకొని ఉండు".

అయితే, నా తొమ్మిదో పుట్టినరోజు దాటిన ఆరు నెలల తర్వాత దయామయుడైన మా గురువుగారు నా జీవితంలోకి అడుగుపెట్టిన విధికృతమైన ఆ రోజుకన్నా ముందర జరిగిన కొన్ని విషయాలను చెప్పకుండా ఉండలేను –

(1) నేను పుట్టిన దగ్గరనుంచి, ఒక కాలిని రెండో కాలితో మెలిక వేసే స్వభావం ఉండేది నాకు. నేను పుట్టిన తరువాత రెణ్ణెల్లకు తీసిన నా మొట్టమొదటి ఫోటోలో ఈ భంగిమను మీరు చూడవచ్చును. ఆ అలవాటు నేను పెరుగుతున్న కొద్దీ కొనసాగింది; సనాతనమైన యోగుల బాసినపట్టు ఆసనం నాకు చాలా సుఖతమంగా అనిపించే ఆసనమని నేను తెలుసుకున్నాను. ఈ రోజుకీ, నేనెక్కడికి వెళ్ళినా, భోజనం చేసే కుర్చీ మీద కూడా కాళ్ళు మడిచిపెట్టి, మఠం వేసుకొని కూచోడమే ఇష్టపడతాను, ఆతిథ్యమిచ్చే వాళ్ళకు ఏ అభ్యంతరమూ లేకపోతేనే అనుకోండి.

(2) ఐదున్నర ఏళ్ల నుంచీ దాదాపు పదేళ్ళ వయస్సు వరకూ ఒకే విధంగా ఉండే భయంకరమైన దుఃస్వప్నాలతో నేను బాధపడ్డాను. అర్ధరాత్రి ప్రాంతంలో నాకు నిద్రలో పెద్దపెద్ద వాడికోరలూ గోళ్ళతో, ఓ కథకళీ నృత్యగాడికి మల్లే ఉన్న ఓ పెద్ద అర్ధమానుష రాక్షసరూపం నన్ను దొరకబుచ్చుకొని తీసుకొని పోదామని చూస్తున్నట్టుగా కనిపించేది. బయట ప్రపంచానికి నేనింకా నిద్రలో ఉన్నట్టుగా ఉంటూ కూడా నేను భయంతో అరుస్తూ వెంట తరుముకొస్తున్న ఆ దయ్యాన్ని "నేనక్కడికి వెళ్ళిపోవాలి" అని కేకలేస్తూ ఇంట్లోంచి బయటకు పరుగులెత్తేవాణ్ణి.

మా తల్లిదండ్రులు తరచూ నా వెంట పరుగెత్తి వచ్చేవాళ్ళు; నా విభ్రమ, స్థితి నుంచి నా చెవిలో గట్టిగా నా పేరు పలికి నాకు మెలకువ వచ్చేలాగ చేసేవాడు మా నాన్న మాత్రమే. అయితే, ఒక్కసారి కూడా ఆ దయ్యాలు నన్ను పట్టుకోవడంలో కృతకృత్యం కాలేదు.

రకరకాల చికిత్సలను చేయించారు; రక్షరేకులు కట్టడమన్నది కూడా చేసినా ఏ ప్రభావమూ కలగలేదు. మా గురువుగారిని మొదటిసారి కలవగానే ఈ పీడకలలు చివరికి పూర్తిగా మాయమైపోయాయి. నేను ఎక్కడి నుంచి పారిపోతున్నానో ఎక్కడికి వెళ్ళదలచుకున్నానో అర్థం చేసుకోడానికి నాకు చాలా ఏళ్ళే పట్టింది.

(3) సూఫీలతో సంబంధ బాంధవ్యాలున్న మా అమ్మమ్మ ఆ సూఫీ కథలతో నన్ను ఆకట్టుకొనేది. సూఫీ మహాత్ముడు పీర్ మొహమ్మద్ సాహిబ్ జీవిత కథ ఆవిడకు చాలా ఇష్టమైనది (నాకు కూడాను); ఆయన అప్పటి తిరువాన్కూరు రాజ్యంలో ఉన్న తక్కలే (Tuckaley) అనే కుగ్రామంలో వందేళ్ళ క్రితం ఉండేవాడు. సుప్రసిద్ధుడైన కాశీ మహాత్ముడు కబీర్ దాసులాగానే తక్కలే పీర్ మొహమ్మద్ సాహిబ్ కూడా సాలెవాడు. ఆయన, చేతి మగ్గంతో పనిచేస్తూ తమిళంలో భక్తి గీతాలనూ, అద్భుతమైన లోచూపును కనబరిచే పాటలనూ పాడేవాడు. తమిళ్నాడులోని కొన్ని సూఫీ సమూహాల్లో "పాడల్"గా పేరొందిన ఈ పాటలు ఇంకా ప్రచలితాలే. పెద్దయిన తరవాత అతను గుడ్డివాడయ్యాడు; అతని శిష్యుడైన ఒక చిన్న కుర్రాడు అతనికి సహాయంగా ఉండి తిప్పుతూ ఉండేవాడు.

ఈ సూఫీ మహాత్ముడి జీవిత కథలోని ఒక సంఘటన మా అమ్మమ్మ మళ్ళీ మళ్ళీ చెప్పడానికి ఇష్టపడుతూ ఉండేది; నేనూ దాన్ని వినడానికి ఇష్టపడేవాణ్ణి. ఆ సంఘటన ఇలా సాగుతుంది – దక్షిణ భారతంలో ఒక మహాత్ముడు ఉన్నాడని తెలిసి ఇద్దరు అరబ్బీ మతపెద్దలు అతన్ని చూడ్డానికి వచ్చారు. వారికి అన్నీ నచ్చాయి. కాని, మక్కా పవిత్ర నగరానికి తీర్థయాత్రగా వెళ్ళడానికి మాత్రం అతను ఇష్టపడక పోవడం వాళ్ళకు సరిపడలేదు. సమర్థమైన శరీరమున్న ప్రతి ముసల్మానుడూ తన మతధర్మాల్లో ఒక భాగంగా ఈ తీర్థయాత్రను చేయవలసినదే. తక్కలే మహాత్ముడు తాను గుడ్డివాడు కనక ఆ తీర్థయాత్రను చేయలేననీ అయినా అంత దూరం తాను వెళ్ళడం సంభవం కాదనీ అంటూనే, తాను ఆ తీర్థ ప్రదేశాన్ని చూశాననీ, మక్కా ఇక్కడే తానున్న చోటనే ఉందనీ నొక్కి చెప్పేవాడు.

ఆ అరబ్బు యాత్రికుల ఉద్దేశంలో ఇది మతధిక్కారం; వాళ్ళు దాన్ని ఒక పిచ్చివాడు పిచ్చికూతల్లాగ తీసిపారేశారు. కానీ, పీర్ మొహమ్మద్ సాహిబ్ మాత్రం

తన వాదనను వదిలిపెట్టేవాడు కాదు. తన శిష్యుణ్ణి పాతనీళ్ళకుండను (ఒకదాన్ని) పట్టుకు రమ్మనమని ఆదేశించాడు; ఆ అరబ్బు యాత్రికులను ఆ నీళ్ళలోకి తొంగి చూడమన్నాడు. వాళ్ళు ఒక్కొక్కళ్ళు ఆ నీళ్ళకుండలో మక్కా తీర్థయాత్ర సన్నివేశాన్ని మొత్తమూ చూశారు; ఆశ్చర్యాల్లోకల్లా ఆశ్చర్యమేమిటంటే, వాళ్ళు దాంట్లో ఆ గుడ్డి నేత నేసే మహాత్ముడు తమతోబాటు కాబాకు ప్రదక్షిణం చేస్తూన్నట్టుగా చూశారు. అంతే, వాళ్ళు అతని పాదాలమీద పడి అతని శిష్యులయ్యారు.

ఈ మహాత్ముడి గోరీకి దగ్గరగా అతని శిష్యుడే అయిన మా పైతృక పూర్వీకుల్లో ఒకరి సమాధి ఉంది.

(4) ఐదేళ్ళనుంచి తొమ్మిదేళ్ళ వయస్సు మధ్యలో నాకు హిందూమతం గురించీ క్రైస్తవం గురించి తెలిసింది. ఆ వయస్సులోనే నేను ఒకానొక మతానికి సంబంధించిన వాళ్ళకు, ఇతర మతాలను గురించి ఎంతగా పూర్వనిశ్చితాభిప్రాయాలతో కూడుకొన్న సంకుచిత బుద్ధి ఉంటుందో గుర్తించడం ప్రారంభించాను. మాటవరసకు, ముస్లిమ్ మహాత్ముల గురించి అత్యంత హర్షంతో చెప్పే మా అమ్మమ్మ, హిందూ మతాన్నీ హిందూ దేవతలనీ అసహ్యించుకునేది. మా ఇరుగుపొరుగు హిందూ ఇళ్ళల్లో ఏ ఇంట్లోనైనా అన్నం తినడం గురించి ఆమె హెచ్చరిస్తూ జాగ్రత్తగా ఉండమనేది; ఆవిడ అపవిత్రులుగా భావించే ఆ హిందూ దేవతలకు ఆ అన్నం నివేదన చేసినదేమో నని భయం వ్యక్తపరిచేది. తరచుగా ఆవిడ హిందువులను విగ్రహారాధకులుగా చెప్పేది. ఇస్లాం ప్రాదుర్భావం మానవజాతికి ఇప్పటివరకూ సంభవించిన వాటిలోకల్లా అత్యంత గొప్ప విషయంగా ఆవిడ నమ్మేది. మంచి ముస్లిములకు స్వర్గంలో స్థానం పదిలం అని ఆవిడ విశ్వాసం.

ఒక కోవకు చెందిన సన్యాసినులు నడిపే ప్రసిద్ధమైన ఒక ఇంగ్లీషు మీడియం స్కూలుకు నన్ను పంపించారు. ఇక్కడ క్రైస్తవ ప్రార్థనాలయం (ఛాపెల్) మీదుగానూ వర్జిన్ మేరీ కృత్రిమ గుహ మీదుగానూ వెళ్ళేటప్పుడు గుండెమీద శిలువ గుర్తును వేసుకోమని మమ్మల్ని బలవంత పెట్టేవాళ్ళు కాదు గానీ, అలా చేయమని మాత్రం ప్రోత్సహించేవాళ్ళు; మాకు చాలా క్రైస్తవ స్తుతిగీతాలనే నేర్పారు. ఆ ప్రదేశంలో అంతటా ఉన్న చిత్రాల్లో జీసస్ క్రీస్తును గొఱ్ఱెల కాపరిగా చిత్రించారు; వాటిలో అతని గడ్డమున్న తరహా ముఖం నాకు చాలా నచ్చేది. అక్కడి సన్యాసినుల్లో ఒకామె ముస్లిములు సూర్యోపాసకులనీ, హిందువులు పెంకిదయ్యాలను ఆరాధిస్తారనీ చెప్పడం విని నేను ఆశ్చర్యపోయేవాణ్ణి.

మా ఇరుగుపొరుగు వాళ్ళు అందరూ హిందువులే; వాళ్ళ ఇళ్ళకు చూడదానికి

వెళ్ళినప్పుడు వాళ్ళు ఆరాధించే బహువిధ దేవుళ్ళంటే నేను బాగా ఆకర్షితుణ్ణయ్యే వాణ్ణి. సనాతన బ్రాహ్మణ వంశానికి చెందిన ఒకావిడ నేనంటే చాలా వాత్సల్యం చూపేది; ఆవిడ నాకు స్వీట్లు తినిపించడానికి బాగా ఇష్టపడుతూ ఉండేది, కానీ, మా అమ్మమ్మ మాత్రం వాటిని తినవద్దని నిషేధించేది. మరోవైపు, రమ్జాన్, బక్రీదు సమయాల్లో మా అమ్మ తయారు చేసి మా పొరుగు నాయర్లకు పంచి పెట్టే రుచికరమైన నంజుడు (మాంసం) బిర్యానీ కోసం మా హిందూ పొరుగు వాళ్ళు ఎదురు చూసేవాళ్ళు కూడానూ. నాకుగా నేను మాత్రం లేత అరిటాకుల మీద వడ్డించే సంప్రదాయపు మలయాళీ శాఖాహారమన్నా, ఇడ్లీ సాంబారన్నా ఇష్టపడేవాణ్ణి.

మా ఇరుగుపొరుగు ఇళ్ళల్లో ఉన్న చిన్న చిన్న దేవుడి గదుల్లో పూజలు జరిగే దేవుళ్ళ బొమ్మలనూ చిత్రాలనూ మినహాయించి, హిందూ భక్తియుత పద్ధతులతో నాకు ఏర్పడ్డ మొదటి పెద్ద సంబంధం ఒక ఆదివారం నాటి పొద్దున్నే మా ఇంటి ముందున్న రోడ్డుమీద అకస్మాత్తుగా కనిపించిన కీర్తనమండలితో కలిగినదే. నేనప్పుడు వంటింటి దగ్గర కూచొని, యంత్రపు ఆటవస్తువు ఒకటి ఎలా పని చేస్తుందో చూద్దామని దాని భాగాలను విడదీసి తిరిగి అమర్చడానికి ప్రయత్నిస్తూ విఫలుణ్ణి అవుతూ ఉన్నాను. అప్పుడే ఆత్మోద్దీపకమైన స్పందన ధ్వనీ ("రిదిం వదిష్యామి")× దానితో శ్రుతి కలిపిన మధుర తాళధ్వనులూ నా మనస్సును పూర్తిగా వశం చేసుకున్నాయి.

నా పై శరీరం నగ్నంగా ఉంది; కింద నిక్కరే ఉంది. ఆ ఆట వస్తువునక్కడే విసిరేసి హృదయం వేగంగా కొట్టుకుంటూండగా నేనలాగే గేటు దగ్గరకు పరుగెత్తాను. ఒక వింతైన దృశ్యం నా కంటబడింది. రోడ్డుమీద నలుగురు మధ్య వయస్కులైన మగవాళ్ళు పాడుతూ నాట్యం చేస్తున్నారు. ఒకడు తప్పించి తతిమ్మా అందరూ మొలల చుట్టూ పసుపుపచ్చని గోచీలు చుట్టబెట్టుకొని ఉన్నారు. ఆ ఒక్కడూ అటూ ఇటూ ఊగే గెడ్డంతోనూ, పొడుగుపాటి జుట్టుతోనూ, మెడచుట్టూ స్వచ్ఛమైన తెల్లపూలదండ తోనూ పొడుగ్గా, అందంగా, ఆకర్షణీయంగా ఉన్నాడు. అతను ఒక సన్నపాటి జేగురు గుడ్డగోచీ పెట్టుకున్నాడు? ఆ గుడ్డ అతని జననేంద్రియాన్ని మాత్రం అచ్ఛాదించింది; అది వినా అతను పూర్తిగా గుడ్డలు విప్పుకున్నవాడికిందే లెక్క

ఆ నలుగురూ చెప్పుల్లేనివాళ్ళే. ఒకతని మెడనుంచి మద్దెల వేళ్ళాడుతోంది. దీన్ని అతను కళ్ళు మూసుకొని రెండు చేతులతోనూ వాయిస్తున్నాడు; అలా వాయిస్తూ అప్పుడప్పుడు హర్షోద్రేకంతో నవ్వుతున్నాడు. మరొకడు చిన్న తాళాల జంటను మోగించడంలో పూర్తిగా నిమగ్నుడైనట్టు కనిపించాడు; తాళాలను మోగిస్తూ అతను తన తలను ఆ పక్కకు ఈ పక్కకు ఊపుతున్నాడు. మూడోవాడు ఇంటింటికీ వెళ్ళి, పండ్లూ కూరగాయలూ బియ్యమూ తీసుకుంటున్నాడు. వాళ్ళ గేట్ల దగ్గర నిలుచొని

కొంతమంది మా ఇరుగుపొరుగువాళ్ళు చాలా గౌరవం చూపుతూ ఇస్తూన్న డబ్బును కూడా అతను అప్పుడప్పుడు తీసుకొంటున్నాడు.

ఇక ఆ నాలుగో ఆయన మంచి పొడుగరీ అందమైన గెడ్డమున్నవాడూ ఆ సమూహానికి నాయకుడిలాగ ఉన్నాడు. సుందర మృదంగ స్పందన ధ్వనితోనూ కంచుతాళాల లయబద్ధమైన నాదాలతోనూ శ్రుతికలుపుతూ అతను ఆ సామూహిక గానాన్ని నడుపుతూ, కళ్ళు మూసుకొని కన్నీళ్ళు చెక్కిళ్ళమీద కారుతూండగా నాట్యం చేస్తూ "హరే రామ హరేరామ..." అని పాడుతున్నాడు.

అతను ఒక రకమైన అర్ధచేతనత్వ స్థితిలో ఉన్నాడు. నాకు అగపడిన కొంతమంది ఇరుగుపొరుగువాళ్ళు అతడి దగ్గరగా పోయి అతని పాదాల మీద సాగిలపడుతున్నారు.

ఒక విచిత్రమైన ఆనందం నా గుండెను నింపింది. నేను కూడా నవ్వడం ప్రారంభించానని నాకు గుర్తుకొస్తోంది. అప్పుడు నేను లోపలికి (మా ఇంట్లోకి) పరుగెత్తి, ఎంతో ఇప్పుడు నేను గుర్తు తెచ్చుకోలేను గానీ, ఒక నాణేన్ని తీసుకొని గేటు దగ్గరికి తిరిగి పరుగెత్తి, రోడ్డు దాటి నడిచి, జోలె చేతపట్టుకున్న ఆ సంగ్రామకుడి చిన్న సంచిలో వేసేను. నన్ను పిలుస్తూన్న మా అమ్మమ్మ పిలుపు అప్పుడు నాకు విని పించింది. నేనేదో చెయ్యకూడని మహాపరాధం చేశానేమోనన్న బెరుకుతో ఇంట్లోకి పరుగెడుతూ వెనక్కి చూశాను దాదాపు నగ్నంగా వీథిలో నాట్యం చేస్తూన్న ఆ విచిత్రమైన మనిషిని చివరిసారిగా చూద్దామని. అతని కళ్ళు తెరుచుకున్నాయి; నేనింట్లోకి వెళ్లేలోపులో మా చూపులు కలిశాయి, కొద్దిసేపు.

ఆ సంకీర్తన బృందం ముందుకు సాగింది. ఆ సంగీతం నెమ్మదిగా సద్దు మణిగింది; ఓ వింతైన నిశ్శబ్దం దాని స్థానే నిలిచింది. నేను చేసినదాన్ని మా అమ్మమ్మ ఒప్పుకోలేదు. కానీ చిన్నపాటి మతపరమైన సలహానిచ్చి నన్ను వదిలేసింది. నేనున్న చోటునుంచి అనతి దూరంలో ఉన్న ఒక ఆశ్రమంలో ఉన్న స్వామీ అభేదానందులే (ఆ రోజు) నేను చూసిన హర్షావేశితుడైన మనిషి అని నాకు చాలా ఏళ్ళ తరవాత తెలిసింది. కాలేజీ విద్యార్థిగా ఆయనతో నాకు చాలా ఉల్లాసకరమైన సమావేశాలే జరిగాయి. కానీ, వీటి గురించి మరికొంత తర్వాత చెబుతాను.

(5) మా అమ్మగారి మేనమామ మంచి ఉత్సాహవంతుడైన ఫోటోగ్రాఫర్. సుమారు ఈ సమయంలోనే ఆయన తూర్పు కోట లోపల (ఈస్ట్ ఫోర్టు) జరుగుతూన్న "అరట్" (Aratu) ఉత్సవం చూడడానికి నన్ను తీసుకొని వెళ్ళాడు. ఆ పురాతన దుర్గాన్ని మహారాజులు తమ కులదేవతైన అనంతపద్మనాభస్వామి మహాదేవాలయానికి దగ్గరగా కట్టారు. నేను ముందు చెప్పినట్టు, త్రివేండ్రం సిటీకి మూలనామం

తిరువనంతపురం - "ఎవరి బొడ్డు నుంచి పద్మం ఉద్భవించిందో" అని వర్ణితుడయ్యే దేవుడి పేరునుంచే ఈ ఊరి పేరు పుట్టింది. ప్రతి ఏడాదీ, ఈ గుడిప్రాకారాన్ని గొలుసుకట్టులాగ అల్లిన పువ్వులూ ఆకులూ దీపాలతో అలంకరిస్తారు. అన్ని హిందూ దేవతల బొమ్మలూ రంగురంగుల బట్టలూ విభూషణాలతో మనిషి పరిమాణంలోనో అంతకన్నా పెద్దగానో ప్రదర్శితమై ఉంటాయి. ఆ పురాతన దేవాలయం తాలూకు గోపుర శిఖరాలను చూస్తూంటే, నా బొడ్డులో ఏదో కదులుతూన్నట్టనిపించింది. దగ్గర దగ్గరగా ఆరేళ్ళ వయస్సులో ఉన్న నాకు ఆలయం లోపల ఏముందో అన్నది తెలియకపోయినా, గుళ్ళోకి వెళ్ళాలన్న ఆపరాని కోరిక నన్ను చుట్టుముట్టింది. మా అమ్మ మేనమామ, మనం హిందూ మతస్థులం కాదు కాబట్టి మనల్ని లోపలికి వెళ్ళనీయరని చెప్పారు.

"హిందువులు కానివాళ్ళకు ప్రవేశం లేదు" అని మలయాళంలోనూ ఇంగ్లీషు లోనూ తెల్లని పెయింట్‌తో రాసి ఉన్న బోర్డును ఆయన స్పష్టంగా చూపించినట్టు నాకు జ్ఞాపకముంది. ఒకే రకమైన మనుషులున్న ఆ రెండు సమాజాల మధ్య ఆ తేడా నన్ను పూర్తిగా తికమక పెట్టింది. ఆ సమయంలో, ఓటమి నంగీకరించి వెను దిరగడం తప్పించి మరో గతి లేదు నాకు. కాలక్రమేణా నేను పెరుగుతూన్న కొద్దీ, మతోన్మాదులు మతం పేరిట మనుషుల మధ్య తెచ్చిపెట్టిన భయంకరమైన జాతి భేదాలను చూడగలనని అప్పుడు నాకెలాగ తెలియగలదు?

నన్ను బుజ్జగించడానికి మా అమ్మ మేనమామ కొన్ని పెప్పర్‌మింట్లు తెచ్చి యిచ్చాడు; నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉన్న కేంద్రీయ సచివాలయ భవనం తాలూకు దక్షిణం గేటు దగ్గరకు తీసుకువెళ్ళాడు. అక్కడ ద్వారానికి మరీ దూరం కాని చోట, తెల్లజుట్టుతోనూ గెడ్డం మీసం తీయని అందమైన ముఖంతోనూ ఒక మాదిరిగా బొద్దుగా ఉన్న మనిషి ఒక మంచంమీద పడుకొని ఉన్నాడు; అతనికి శరీరంపై భాగం మీద బట్టలేవీ లేవు, కిందిభాగం మాత్రం కేరళ "ముండు"తో (Mundu) ఆచ్ఛాదితమై ఉంది. అతను నాతో చాలా మృదువుగా మాట్లాడి, చేతులు కలిపి నాకో స్వీటు ఇచ్చాడు. నేను ఎర్రని నిక్కర్లు తొడుక్కొని ఉండడం చూసి సంతోషంగా ఉందన్నాడు.

ఆ తరవాత తెలిసింది అతను బాగా అనుభవమున్న కమ్యూనిస్టు నేత ఎ.కె. గోపాలన్ అని. అప్పుడతను అప్పటి కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆమరణ నిరాహార దీక్ష చేస్తున్నాడుట. మా అమ్మ మేనమామ వామపక్షవాదులవైపు మొగ్గుదల ఉన్నవాడు. అతను బాగా గౌరవించే ఆ కమ్యూనిస్టు నేతను చూడ్డానికే నన్నక్కడికి

తీసుకొని వెళ్ళాడు. బహుశా ఆ గోపాలన్ మెత్తటి చూపులో గానీ మృదువైన స్పర్శలో గానీ ఏదో గారడీ ఉందనుకుంటాను, అది నా కాలేజీ రోజుల్లో కార్ల్ మార్క్స్ (అతను రాసిన) "దాస్ కేపిటల్"ల వైపుకు నన్ను ఆకర్షించింది.

(6) గారడీ గురించి మాట వచ్చింది కనక నాకు చాలా స్పష్టంగా గుర్తు కొస్తు న్నాయి, మా ఇంటి పెరట్లో చాలా సాయంత్రాలు మేఘాలను చూస్తూ కూచున్నప్పటి ఆ మంత్రముగ్ధ క్షణాలు. నా ఊహకు, అవి ఆవిష్కరింపబడడానికి వేచి ఉన్న మంచు శిఖరాల్లాగ అనిపించేవి. చాలా రోజుల తరవాత, కాఫీ టేబుల్ బుక్కులో హిమాలయాల బొమ్మను చూసినప్పుడు నేననుకున్నాను – "నేను పట్టుమని ఆరేళ్ళైనా నిండకముందు మా ఇంటి దొడ్లో కూచొని మబ్బుల్లో వీటిని చూడలేదా?" అని.

హిమాలయాల నుంచి దిగివస్తూ పలువంకలు తిరుగుతూ ప్రవహించే భాగీరథీ నదీతీరంలో ఒక ప్రశాంత స్థలంలో మా గురువుగారి దగ్గర కూర్చొని ఉండగా ఆయన నాకు చెప్పిన ఈ కథతో ఈ అధ్యాయాన్ని ముగిస్తాను –

మన ప్రయాణంలోని తరవాతి అధ్యాయానికి వెళ్ళకముందే ఇప్పుడే ఇది చెప్పడం సబబని తోస్తున్నది. కానీ మా గురువు గారు నాకు చెప్పిన మాటనే తిరిగి మీకూ చెబుతాను "నేను చెప్పే ఈ కథ పట్ల నీ అభిప్రాయాలను నువ్వే నిర్ణయించుకో. కానీ ఆ పనిలో తొందరేమీ పడకు" అని.

సముద్రమట్టానికి 13,000 అడుగుల ఎత్తున ఉన్న పవిత్ర హిమాలయ దివ్య వేదిక అయిన ప్రసిద్ధ బదరీనాథ దేవాలయం వెనక దాదాపుగా చేరరాని గుట్టల మీద చిన్నా పెద్దా గుహలు కొన్ని ఉన్నాయి. వేసవి కాలం నెలల్లో మాత్రమే ఆ గుడి, తీర్థ యాత్రికులకోసం తెరిచి ఉంటుంది. మిగిలిన సంవత్సరమంతా ఆ మొత్తంభూమి మంచుతో కప్పి ఉంటుంది. (ఆది) శంకరాచార్యుల (వందలాది ఏళ్ళ క్రితం కేరళ నుంచి వచ్చి ఈ గుడిని ఉద్ధరించిన మహాత్ముడు) సమయం నుంచీ పురోహితులుగా వ్యవహరిస్తున్న కేరళీయ నంబూద్రి పురోహితులు కూడా కిందనున్న జోషీమఠ్ అనే గ్రామానికి దిగి వచ్చి తరవాతి తీర్థయాత్రా సమయం దాకా అక్కడే వేచి ఉంటారు. అసాధారణులైన ఏ కొంతమందో బదరీలో ఉండిపోయి, ఆ చలికాలంలో కూడా ఆ గుహల్లో ధ్యానం చేస్తూ ఉంటారు.

ఓ వందేళ్ళ క్రితం, అటువంటి ఒక అసాధారణ యోగి అక్కడి గుహల్లోని ఒక గుహలో ఆసీనుడై, తన అంతరాత్మనుద్దేశించి గాఢధ్యానంలో నిమగ్నుడై ఉన్నాడు. మొలకు చుట్టుకున్న ఒక నూలుబట్ట తప్పించి తతిమ్మా ఒళ్ళంతా దిగంబరంగా

ఉంది అతనికి. అతను చాలా అందంగానూ ఆకర్షణీయంగానూ ఉన్నాడు; అతని నల్లజుత్తు కిందికి వేళ్ళాడుతోంది; నల్లగెడ్డం ఉన్న అతను కళ్ళు మూసుకొని ఉన్నాడు. అంతరాత్మానుసంధానంతో కలిగిన అంతరానందాన్ని అనుభవిస్తూన్న అతని ముఖం ప్రశాంతమైన చిరునవ్వుతో వెలుగుతోంది. పవిత్ర వారణాసీ నగరంలోని విశిష్ట వైదిక విద్వాంసుల వంశానికి చెందిన ఈ యోగి పందొమ్మిదేళ్ళ ప్రాయంవాడు మాత్రమే.

అతని పూర్వీకులు శ్రీ గురు బాబాజీ అనే ఒక సనాతన యోగి శిష్యులు; ఆయన (శ్రీగురు బాబాజీ) చాలా వందల ఏళ్ళ నుంచీ, ఈ రోజుకి కూడా, తన భౌతిక దేహాన్ని యౌవన స్థితిలో ఉంచుతూ ఉన్నారని అందరూ నమ్ముతారు.

ఈ యువకుడి తండ్రి కూడా బాబాజీ శిష్యుడే; ఆయన తన ఈ కొడుకును తొమ్మిదేళ్ళ లేత ప్రాయంలోనే ఈ మహాయోగి చేతుల్లో పెట్టాడు. అప్పట్నించీ అతను (ఒక స్థిరమైన ఠికానా అంటూ ఏదీ లేని) తన గురువుతో హిమాలయాల్లో అంతటా తిరిగేడు. ఒక ఏడాది క్రితం, అంటే, పద్దెనిమిదేళ్ళప్పుడు అతను ఒక స్వేచ్ఛాయోగి స్థాయిని పొందాడు. అప్పట్నించీ అతనొక్కడే ఒంటరిగా – మంచుతో నిండిన కేదార, బదరీ శిఖరాల్లో – తిరుగుతున్నాడు.

మన యోగి యువకుడు 'సమాధి' అనే యోగస్థితిలో పూర్తిగా అచలంగా కూచొని ఉండగా, మూతబడిన అతని కళ్ళముందు ఓ వింత నాటకం వివృతమవుతోంది. ఒక ముసలాయన దగ్గరదగ్గరగా నిట్రమైన ఆ సన్నని రాతి సానువు మీదికి చేతివేళ్ళ సాయంతో పాక్కుంటూ వస్తున్నాడు. ఆ ప్రాంతాల్లో అటువంటి తరహా వాడు అరుదుగా కనిపిస్తాడు. గుహ ముందుగా ఉన్న చపటారాయి మీదకు అతను అప్పుడు ఎగబాకాడు. మురికిగా ఉన్న ఆకుపచ్చ తలపాగా, అప్పటికి దాదాపుగా ముక్కలైపోయిన మకిలిగా ఉన్న పై బట్ట, మెడ చుట్టూ ఉన్న జపమాల, గోరింటాకు (హెన్నా) లాటి రంగుదేలిన గెడ్డం ఇవన్నీ అతనొక ముస్లిం ఫకీరని స్ఫుటంగా సూచిస్తున్నాయి.

అతని చేతులమీదా కాళ్ళమీదా అనాచ్ఛాదిత భాగాలమీదా గీరుకుపోయిన గంట్లూ దెబ్బలూ ఉన్నాయి; ఆ వ్రణాలనుంచి రక్తం ఓడుతూ ఉంది. చలిచలిగానూ ఆకలిగానూ ఉన్న అతను కింద పడిపోయేలా ఉన్నాడు. కానీ అతని కళ్ళు గుహలో కూచొని ఉన్న ఆ యువయోగిమీద వాలగానే అతని ముఖంమీది బాధాకవళిక నవ్వుగా మారి ఆపైన ఉన్మత్తహాసనంగా వ్యాపించింది. "అల్లాకు జయం" అని నిట్టూరుస్తూ గట్టిగా అరిచి, తన బాధా, దుఃఖం పూర్తిగా మర్చిపోయి, ఇంకా ధ్యానం చేస్తూన్న ఆ యోగివైపుకు నడిచి అతని కాళ్ళమీద పడ్డాడు. ఆపైన, ఏ హిందువూ ఒక యోగికి కలలో కూడా చేద్దామని అనుకోని పని అతను చేశాడు – అతన్ని వాటేసుకున్నాడు.

తన సమాధిస్థితిలోంచి ఎవరో తనను మోటుగా గుంజినట్లయి ఆ యోగి కళ్ళు తెరిచాడు; తన ఒంటికి అతుక్కొని ఉన్న ఆ ముసలాయనను విదిలించుకున్నాడు. (క్లిష్టమైన) ప్రయాణంతో మురికిగానూ రక్తమోడుతూన్న ఆ వింత మనిషి నుంచి వస్తూన్న కంపును వదిలించుకోడానికి ముక్కు చీది కోపంగా అరిచాడు: "ఎంత ధైర్యం నీకు? నా నుంచి దూరంగా జరుగు." అప్పుడప్పుడు ఋషులక్కూడా అదుపులో పెట్టడానికి కష్టమైన కోపమనే ఆ శక్తిమంతమైన విషం, ఆ యువకయోగి గుండెలో సైతమూ ప్రవేశించింది.

"దయ ఉంచండి స్వామీ' అని ఆ ఫకీరు బతిమాలాడు: "నా కథను చెప్పడానికి నాకో అవకాశం ఇవ్వండి". "పో" అని యోగి అరిచాడు: "నేను భాగీరథిలో మునిగి రావాలి. నా ధ్యానాన్ని కొనసాగించాలి. నీలాటి మాంసం తినే మ్లేచ్ఛుడికి ఇక్కడ స్థానం లేదు. కనిపించకుండా పో".

ఫకీర్ లొంగలేదు. "దయ ఉంచి నా మాట వినండి మహాయోగీ! నేనొక సూఫీని, నక్షాబన్దియా (Naqshabandiya) వర్గానికి చెందిన ఓ గొప్ప సూఫీ గురువుకి నేను ముఖ్యమైన శిష్యుణ్ణి. మా గురువుగారు చనిపోవడానికి ఆర్నెల్ల ముందు నాతో ఇలా అన్నారు: 'మిత్రమా, నేను నిన్ను తీసుకెళ్ళగలిగినంత ఆధ్యాత్మికతాస్థాయికి నువ్వు చేరుకున్నావు. త్వరలో నేను శరీరాన్ని వదిలేస్తాను. ఇంతకన్నా తర్వాతిదీ పైదీ అయిన స్థాయికి నిన్ను నడిపించడానికి ఇష్టపడి సాయంచేసే మరో సూఫీ గురువు ఇక్కడ లేదు. కానీ, బాధపడకు. హిమాలయాల్లో బదరీదగ్గర యువకుడైన ఒక హిమాలయ యోగి ఉన్నాడు. అతన్ని కనుక్కొని అతని సాయాన్ని అర్థించు'. అలా ఆయన చెప్పిన ఆ యోగి మీరే. మీరే నన్ను ఇప్పుడు రక్షించగలరు.

"మిమ్మల్ని కనుక్కొనే లోపున రెణ్ణెల్ల పాటు నేను లెక్కలేనన్ని బాధలూ దురదృష్టాలూ ఎదుర్కొన్నాను. ఈ విపరీతమైన అలసటతో నేను చచ్చిపోవచ్చు. కానీ మీరు నన్ను శిష్యుడిగా స్వీకరిస్తే చాలు, నా ఆత్మ ప్రశాంతంగా నిష్క్రమించగలుగుతుంది. దానికోసం నేను మిమ్మల్ని యాచిస్తున్నాను".

"మీ గురువు గురించి గానీ నువ్వు అంటూన్న ఆ సూఫీల గురించి గానీ నాకేమీ తెలియదు. అటువంటి సూచనలేవీ నాకందలేదు. అదీగాక నేను శిష్యులను స్వీకరించను" అని ఆ యువక యోగి అన్నాడు, ఇంకా కోపంగానే ఉన్న అతను, "ఇప్పుడిక దోవలోంచి వైదొలగు. నా అలకనందాస్నానానికి ఆలస్యం చెయ్యకు. నువ్వు అతి మొరటుగా ఆపు చేసిన ధ్యానాన్ని తిరిగి మొదలు పెట్టుకోనీ. వెళ్ళిపో!".

"సరే, మహాయోగీ, అదే కనక మీ చివరి మాటైతే, నేనింక బతికి ఉండదలచు కోలేదు. నా జీవితపు ఏకైక స్వప్నం చెల్లాచెదరైపోయింది. నేను నదిలోకి దూకి ప్రాణం తీసేసుకుంటాను. విశ్వానికి మహాప్రభువైన వాడే నన్ను నడపాలి", అని ఫకీరన్నాడు.

"ఏది కావాలంటే అది చేసుకో" అని ఆ యోగి దృఢంగా అన్నాడు. "నేను మాత్రం నీకేమీ చేయలేను. నా కోపంలో నిన్ను శపించలేదు. అంతవరకూ నువ్వు అదృష్టవంతుడివి. నీ తోవన నువ్వు పో, నా తోవన నన్ను పోనీ".

ఆ యోగి పాదాలమీద వాలి ఆ ఫకీరు వీడ్కోలు తీసుకున్నాడు. కంట నీటితో, చాలా అడుగుల కిందుగా ప్రవహిస్తున్న నదివైపుకు నడిచాడు. పెదవుల మీద ప్రార్థనతో, ఆ మహామహోత్తముణ్ణించి మార్గదర్శకత్వాన్ని కోరుకుంటూ అతను, సుళ్ళు తిరుగుతూ ఉరకలేస్తూ ప్రవహిస్తున్న ఆ నీళ్ళలోకి ఉరికి తన జీవితాన్ని అంతం చేసుకున్నాడు.

ఆ యువక యోగి తాను చేసింది సరైన పనే అనే విశ్వాసంతో, ఏ రకమైన పశ్చాత్తాపమూ పడకుండా ఆ నదీతీరాల్లో ఒక అందమైన స్థలానికి దిగి వచ్చి, పరిశుద్ధం కావడానికి తగిన మంత్రాలను జపిస్తూ ఆ పవిత్ర నదిలోని అతిశీతల జలాల్లో మునిగాడు. నీళ్ళలోంచి బయటకు వచ్చి, తనకున్న ఆ ఒక్క తువ్వాలుతో ఒంటిని పొడిగా తుడుచుకున్నాడు. అక్కడ రాతిమీద కూచొని తన శరీరమనస్సులను విశుద్ధపరిచిన పవిత్రనదికి అభివాదం చేశాడు. ఇక ఆ గుహకు తిరిగి ఎక్కిపోదామని అనుకుంటూన్నప్పుడు అతనికి సుపరిచితమైన అతని గురువుగారి తీయని గొంతు, "మధూ" అని పిలుస్తూ వినిపించింది.

ఒక శిలాసానువు వెనక నుంచి మహాగురువు బాబాజీ వస్తూ కనిపించారు. రాబోతూన్న సాయంత్రపు చీకటి, ఆయన ప్రదీప్తమైన సన్నిధితో అకస్మాత్తుగా వెలిగినట్టనిపించింది. పొడుగ్గా, అందంగా, దాదాపుగా యూరోపియన్ శరీరచ్ఛాయతో ఉన్న బాబాజీకి పొడుగుపాటి గోధుమరంగు జుట్టు వెనకాల వేలాడుతోంది; ముఖం మీద మాత్రం చాలా తక్కువ వెంట్రుకలున్నాయి. ఆయన దాదాపు పదహారేళ్ళ వాడిలా కనిపించారు. పుష్టిగా, అలంకారరహితమై ఉన్న ఆయన భౌతిక శరీరం ఒక తెల్లని మొలకట్టు వినా పూర్తిగా అనాచ్ఛాదితంగా ఉంది. కాళ్ళకు చెప్పుల్లేవు. ఆయన నడక చాలా హుందాగానూ అందంగానూ ఉంది.

ఆయనగారి ధ్యాననిమగ్నమైన విశాలనేత్రాలు తన యువ శిష్యుడు మధు మీద వాలాయి. "నాన్నా, ఎంత ఘోరమైన పని చేశావు నువ్వు!" అని మృదువుగా

అన్నాడాయన.

వెంటనే, కొన్ని నిముషాల ముందు తాను చేసిన పని ఎంత ఘోరమైనదో ఒక పిడుగుపాటులాగ తాకింది అతన్ని. "బాబాజీ!" అని మాత్రమే అనగలిగాడతను. ఆపైన ఆయన పాదాలమీద సాగిలపడుతూ ఏడ్చేశాడు.

"నిన్ను నువ్వు నిగ్రహించుకో నాన్నా. నీ గుహ దగ్గరికి ఎక్కి వెళదాం రా". త్వరగా వాళ్ళిద్దరూ పైకి ఎక్కి గుహను చేరుకొని ఒకరొకరికి ఎదురెదురుగా కూచున్నారు. "నువ్వు అనబోయేదాన్ని చెప్పడానికి ముందు, ఎవరితో అంటున్నావో, ఏ పరిస్థితుల్లో అంటున్నావో అనే విషయాలను ఆలోచించుకోవాలని నీకు ఎప్పుడూ చెబుతూ రాలేదా నేను? మరికొంత ఓర్పు ఉండవల్సింది నీకు. ఆ ముసలాయన చెప్పడానికి ప్రయత్నిస్తున్నదాన్ని జాగ్రత్తగా వినాల్సింది. బయటి ఆకృతిమీద ఆధారపడి ఒక పవిత్ర పురుషుడి గురించి మనం నిర్ణయిస్తామా చెప్పు? నా మహాశిష్యుడు కబీర్ చెప్పినట్టు, కత్తి కంటే ఒరకి ఎక్కువ ప్రాముఖ్యాన్నిస్తావా నువ్వు? నువ్వు ఒక దైవభక్తుణ్ణి బాధపెట్టి హింసించావు. చాలా ఏళ్ళుగా నువ్వు చేసిన కఠిన తపస్సుల ఫలాలను ఒక్క త్రుటిలో నాశనం చేసేసుకున్నావు. దయను చూపించే ఒక్క నిముషం వందేళ్ళ తీవ్రతపస్సుల కన్నా అధికమయిన విలువ కలది. దీనికి నువ్వు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి" (అని బాబాజీ అన్నారు).

ఆపాటికి ఆ యువ శిష్యుడు తనను తాను సంబాళించుకొని శాంతుడయ్యాడు. "గురువుగారూ, మీరేమంటే అది చేయడానికి నేను సిద్ధమండి", అని అన్నాడు. "ఆ ఫకీరు విషయమై, అతని ఆధ్యాత్మిక అవసరాల గురించి నేను బాధ్యత తీసుకుంటాను. నీ దర్పప్రవర్తనతో నీ ఆధ్యాత్మిక ప్రగతిని నువ్వు ఆటంకపరచుకున్నావు. తిరిగి నువ్వు దారిలో పడాలంటే, ఆ ఫకీరు పడ్డ బాధనీ, తిండీ వెచ్చదనమూ మొదలైన ముఖ్య జీవావసరాల లేమినీ, లేకపోతే వాటితో సమానమైన దుఃఖాలనీ నువ్వు అనుభవించాలి. పూర్ణ ఖేచరీముద్రతోడి చివరి క్రియను చేయడానికి సిద్ధమవు. ఆజ్ఞాకేంద్రం ద్వారా నీ ప్రాణం నిష్క్రమించనీ, అప్పుడు ఆ దురదృష్టవంతుడు ఏ బాధననుభవించాడో దానితో సమానమైన బాధను నువ్వు పొందేలాగ మేము నీ ఆత్మకు మార్గాన్ని నిర్దేశిస్తాం. ఇప్పుడు నువ్వు ఆ పని చెయ్యి".

"బాబాజీ, మీ అభిలాష నాకెప్పుడూ ఆజ్ఞే. నేను మీరన్నట్టుగా శీఘ్రమే చేస్తాను. కానీ నాకో చివరి కోరిక ఉంది".

"చెప్పు నాన్నా" బాబాజీ అన్నారు.

అతని కంఠధ్వని గాఢావేశంతో గద్గదమైంది; చేతులు ప్రార్థనాపూర్వకంగా జోడించి ఆ యువ శిష్యుడు ఇలా అన్నాడు: "గురుదేవా! నేను మిమ్మల్ని పూర్ణ హృదయంతో ప్రేమిస్తాను. నన్ను విడిచి పెట్టనని నాకు మాటనివ్వండి. నా గురించి తెలుసుకొంటూ నేను ప్రాపంచిక ఆలోచనలతోటీ ప్రవృత్తులతోటీ లొంగిపోకుండా ఉండేలాగ కాపాడుతూ పదిలంగా చూస్తూ ఉండండి. నన్ను మీరు పరికిస్తూ మీ పవిత్ర పాదాల దగ్గరకు తిరిగి నేను చేరేలాగ అనుగ్రహిస్తానని మాటివ్వమని యాచిస్తున్నాను."

"దానికి నేను మాట ఇస్తున్నాను" మెరుస్తూన్న కళ్ళల్లో స్నిగ్ధమైన అనుకంప ప్రస్ఫుటంగా ప్రవహిస్తూండగా ఆ మహాగురువు అన్నారు. "నువ్వింతవరకూ కలుసుకోని నా ముఖ్యశిష్యుడైన మహేశ్వరనాథుడు నీ మరుసటి జన్మలో చాలా ముందుగానే నీ దగ్గరకు వస్తాడు. అతనే నీకు మార్గదర్శకుడవుతాడు. నీ భవిష్యజన్మలో ఒక సమయంలో నన్ను కూడా చూస్తావు, ఇప్పుడు మాట్లాడుతూన్నట్టే మాట్లాడతావు కూడాను. ఇక ఇప్పుడు నువ్వు తొందరపడు, ఎంచేతంటే, ఇదే సరైన సమయం వెళ్ళిపోవడానికి".

అప్పటికి సూర్యుడస్తమించాడు. అందమైన వెండి జాబిల్లి, మబ్బుతెరను తీసి జరుగుతూన్న పవిత్ర రూపకానికి సాక్షిగా నిలిచింది. యువక శిష్యుడు కళ్ళనిండా నీళ్ళతో తన సంరక్షకుడి పాదాలమీద మరోసారి సాగిలపడ్డాడు. బాబాజీ తన కుడిచేతిని సాచి అతని తలమీద ఉంచి దీవించి వెంటనే ఆ చీకటి రాత్రిలో కలిసిపోయారు. ఇప్పుడు ఒంటరిగా ఉన్న మధు, పద్మాసనం వేసుకొని కొన్నిసార్లు గాఢంగా ఊపిరి పీల్చి, బలవంతంగా శ్వాసప్రక్రియనాపే ఖేచరీముద్ర వేశాడు. కనుబొమ్మల మధ్య కేంద్రం మీద దృష్టిని కేంద్రీకరించి శరీరాన్ని వదిలేశాడు.

మా గురువుగారు మహేశ్వరనాథులు చెప్పిన కథకు ఇదే ముగింపు.

# 2. మంచుమల గురువు వచ్చి దర్శనమిచ్చారు

మా గురువుగారు నన్ను కలిసి మునపటి సంబంధాన్ని పునఃస్థాపించడమన్నది ఎంత వింతగా జరిగిందో చెప్పడానికి ఇప్పుడు సమయమాసన్నమయింది.

ఆ సమయంలో నా వయస్సు తొమ్మిదేళ్ళ కన్నా కొంచెం ఎక్కువ. అంబుజ విలాసం రోడ్డులో బాగా పెద్దగా ఉన్న ఒక ఇంట్లో మా అమ్మా నాన్నా చిన్న చెల్లెలూ మా అమ్మమ్మా నేనూ అందరం ఉండేవాళ్ళం. కొన్ని ఊళ్ళను కలిపే ప్రధాన మార్గానికి బాగా దూరం కాకపోయినా అది నిశ్శబ్దంగా ఉండే వంచియూర్ అనే ప్రదేశం. ఆ ఇంటిని 'పళ్లివీడు' అనేవారు. ఆ రోజుల్లో ఎంతో ఎక్కువనిపించే నలభై రూపాయల నెలసరి బాడుగను చెల్లించేవాడు మా నాన్న.

మా ఇంటి ముఖద్వారానికీ రోడ్డుమీదికి దారి తీసే గేటుకీ మధ్య తక్కువ ప్రాంగణమే ఉండేది కానీ మా పెరడు మాత్రం బాగా విశాలంగా ఉండేది – చాలా కొబ్బరిచెట్లూ పనస చెట్లూ పూలపొదలతో నిండి దాదాపు అర ఎకరం వరకూ ఉండేది. మా అమ్మ ఒక ఆవరణంలో కోడిపెట్టల్ని ఉంచింది. ఆ కోడిపెట్టలు, గులాబి రంగు వేసిన లేత ఈకలముద్దలాగున్న కోడిపిల్లలతో కలిసి తిరుగుతూ ఉంటే చూడ్డానికి ఎంతో ఆనందంగా ఉండేది. గద్దలు ఎత్తుకుపోకుండా ఉండడానికి గానూ ఇలా (గులాబి రంగు వేయించడం) చేసేవారు. మాకో రెండు మేకలు కూడా ఉండేవి.

మా నాన్న కట్టడాల గుత్తేదారు (Building Contractor) పనితోబాటు చిత్తు కాగితాలతో కూడా ఓ రకమైన వ్యాపారం చేసేవాడు. అచ్చు యంత్రాల నుంచి పోగు చేసిన చిత్తు కాగితాల బస్తాలను పెట్టుకోడానికి పెరట్లో ఒక పక్క ఒక పెద్ద షెడ్డును వేసారు. ఇది నాకూ, నా కన్నా రెండున్నరేళ్ళు చిన్నదైన మా చెల్లెలికీ ఇష్టమైన ఉనికిపట్టు. ఇక్కడ మేము దాగుడుమూతలాడుకొనేవాళ్ళం; లేకపోతే ఆ బస్తాల మీద కూచొని కొత్త పదాలనూ అర్థంపర్థం లేని పద్యాలనూ అల్లుతూ మహా సరదాగా పాడేవాళ్ళం.

వెనక ఆవరణ చుట్టూ ఉన్న ప్రహరీగోడ చాలా కిందికి ఉండేది – బంకమట్టితో కట్టిన అది మూడడుగుల ఎత్తు కూడా ఉండదు. ఆ ప్రాకారం మధ్య భాగంలో ఒక పెద్ద పనసచెట్టు కొమ్మనుంచి ఓ పెద్ద ఉయ్యాల వేలాడుతూ ఉండేది. ఆ ఉయ్యాల మీద ఊగుతూ ఆనందించేవాళ్ళం. తరచుగా మా ఇరుగుపొరుగు పిల్లలు సులువుగా ఆ పొట్టి ప్రహరీ గోడ ఎక్కి వచ్చి మాతో కలుస్తూ ఉండేవాళ్ళు. అక్కడ మరో పనస

చెట్టు కూడా ఉంది; (ఉయ్యాల కట్టిన) దానికన్నా పెద్దది, బహుశా దానికన్నా వయస్సులో కూడా పెద్దది. అది ఈ ప్రాకారానికి కుడిమూల ఆ చివరికి ఉంది. ఈ చెట్టుకిందే నా జీవితాన్ని పూర్తిగా మార్చిన సంఘటన జరిగింది.

నేనూ మా చెల్లెలూ ఇద్దరం మా ఇంటినుంచి నడిచి వెళ్ళగలిగే దూరంలో ఉన్న హోలీ ఏన్జెల్స్ కాన్వెంట్‌కు వెళ్ళేవాళ్ళం. ఇంటికి రాగానే మా మామూలు అలవాటు ఏమిటంటే (కాళ్లూ చేతులూ) కడుక్కోవడం, ఏదో కొంత అల్పాహారం తినడం, సూర్యాస్తమయం దాకా పెరట్లో ఆడుకోడమూను. సూర్యాస్తమయం కాగానే, మేము ముఖమూ కాళ్ళూ చేతులూ కడుక్కొని, మా అమ్మమ్మతో కూచొని ఓ చిన్న ప్రార్థనను అరబిక్, ఉర్దూలలో చదవడం చెయ్యాలి. స్కూలులో ఇచ్చిన హోమ్‌వర్కు చేసుకోవాలి; తరవాత రాత్రి భోజనం. ఒక్కోసారి కొన్ని అరేబియన్ నైట్స్ కథలు మా అమ్మమ్మ చెప్పేది; లేకపోతే ఆవిడ సొంత అనుభవాలు చెప్పేది. ఆ తరవాత పడుకొనేవాళ్ళం.

ప్రత్యేకమైన ఆ రోజున, నా కన్నా బాగా చదువుకొనే మా చెల్లెలు (అంచేతనే పెద్దయిన తరవాత ఆవిడ ఓ సీనియర్ ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్ (ఐ.ఏ.ఎస్) కావడంలో మనం ఏమీ ఆశ్చర్యపడనక్కర్లేదు) తన ఆటల సమయం తగ్గించి మామూలు కన్నా ముందరే ఇంట్లోకి వెళ్ళిపోయింది. నేను ప్రత్యేకంగా ఏ పనీ చేయకుండా ఆ ప్రాకారం చుట్టూ తిరుగుతున్నాను. చీకటి పడడానికి ఇంకెంతో వ్యవధి లేదు. కొంచెం మెత్తని బంగారు పసుప్పచ్చ వన్నెలోకి (సంధ్యా) కాంతి మారింది. నేనూ ఇంట్లోకి పోదామనీ, వంటింట్లో కొన్ని తినుబండారాలు తినచ్చుననీ అనుకుంటూ ఇంటివైపు తిరిగాను.

కానీ, ఈ రోజు వరకూ కూడా నేను చెప్పి వివరించలేని కారణాలు వలన దానికి (అంటే, లోపలికి వెళ్ళడానికి) బదులుగా అటు తిరిగి ప్రాకారానికి ఆ చివరనున్న పనస చెట్టు దగ్గరకు నడిచాను. అక్కడ ఆ చెట్టుకింద ఎవరో నుంచొని నన్ను ముందుకు రమ్మనమని సైగ చేస్తున్నారు.

(అటువంటప్పుడు) సాధారణంగా పిల్లలు చేసే పని (భయంతో) అక్కణ్ణించి పారిపోవడమే. కాని, దానికి బదులు నాకే రకమైన భయమూ వెయ్యట్లేదని తెలిసి ఆశ్చర్యపోయాను. ఆ అగంతుకుడి దగ్గరగా వెళదామన్న ఒక వింత ఆతురత నా గుండెలో నిండింది. నేను వేగంగా నడిచి త్వరగా ఆయన ముందు నిలుచున్నాను. ఇప్పుడు నేను (ఆయనను) స్పష్టంగా చూడగలిగాను. ఆ ఆగంతుకుడు పొడుగ్గా,

చాలా అందంగా ఉన్నాడు. అతని పుష్టికరమైన ధృడశరీరం, నడుముకు చుట్టబెట్టి మోకాళ్ళ దాకా ఉన్న ఒక తెల్ల గావంచా వినా, అంతా నగ్నంగా ఉంది. ఆయన పాదాలకు చెప్పులు కూడా లేవు.

ఈ వింత మనిషి నన్ను కుతూహలపరిచాడు. కొంచెం లేడివన్నె ఉన్న జెడలు కట్టిన పొడుగాటి జుట్టు ఆయన తలమీద ఓ పెద్ద ముడిగా అమరింది. అది ఓ పెద్ద టోపీలాగ కనిపించింది. ఆయన పెద్దగానూ చామనచాయ రంగులోనూ ఉన్న, బహుశా, రాగి చెవిపోగులను ధరించాడు. ఆయన కుడిచేతిలో నున్నగా తోమిన నల్లటి నీటి కమండలం వుంది. ఆయన వదనంలో గొప్పగా ఆకట్టుకొనేవి ఆయన కళ్ళు; అవి విశాలంగా, తవుడు రంగుతో కలిసిన నలుపుతో మెరుస్తూనూ ప్రేమాభిమానాలను ఒలకబోస్తూ ఉన్నాయి.

ఏ సంకోచమూ లేకుండా ఆయన నా తలమీద తన కుడిచేతిని బెట్టాడు. తన దయాపూరిత కంఠంతో హిందీలో "కుఛ్ యాద్ ఆయా?", అంటే, "ఏమైనా గుర్తు కొచ్చిందా?" అని అన్నాడు.

నేను ఆ కొత్త మనిషి పలుకుల్ని పూర్తిగా అర్థం చేసుకున్నాను. మా కుటుంబం కొన్ని తరాలుగా కేరళలో స్థిరపడి ఉన్నా, హిందీ భాషతో చాలా పోలి ఉండే "దక్షినీ" అనే ఓ ప్రత్యేకమైన వాడుక ఉర్దూ భాషను మేం మాట్లాడుకునేవాళ్ళం. "నై" (లేదు) అని నేనన్నాను.

అప్పుడాయన నా తలమీద పెట్టిన చేతిని తీసి నా ఛాతీ మధ్యభాగాన్ని తట్టుతూ "బాద్‌మే మాలూం హోజాయెగా, అబ్ వాపస్ ఘర్ జావో" ("నీకు తరవాత అర్థమవు తుందిలే. ఇప్పుడు ఇంట్లోకి తిరిగి పో") అని అన్నాడు. ఆయన ఏం చెప్పడానికి చూస్తున్నారో అప్పటికీ నాకర్థం కాలేదు. అయినా, వెంటనే ఇంటికి వెళ్ళు అనే అతని ఆజ్ఞను విధేయంగా పాటించాను. నేను వెనక్కి ఇంట్లోకి త్వరత్వరగా వెళుతూంటే, అతని స్పర్శ నాగుండెను తేలికపరిచినట్టనిపించింది. మా ఇంటి వెనక ద్వారం చివరి మెట్టు మీదకు వచ్చిన తరవాత, పనస చెట్టు కింద ఆగంతకుణ్ణి చివరిసారిగా చూద్దామని వెనక్కి తిరిగాను. కాని (అప్పటికే) ఆయన వెళ్ళిపోయాడు. అక్కడెవ్వరూ లేరు.

చీకటి కూడా పడుతోంది. నేను గొప్ప ఉత్సాహంతో వంటింట్లోకి పరుగెత్తాను. మా అమ్మతో చెప్పడానికి, మా చెల్లెల్ని ఏడిపించడానికి ఎంత మంచి అసాధారణ అనుభవం అది! వంటింట్లోంచి మంచి వాసన వస్తోంది. మా అమ్మ రాత్రి భోజనానికి

రొయ్యల కూర వండుతోంది. నా కథను మొదలెట్టడానికి నోరు తెరిచాను గానీ నా నోటిలోంచి ఒక్కమాట కూడా పెగలలేదు. ఎవరో, ఏదో నా కంఠతంతువుల్ని కట్టేసి నట్టయింది. మళ్ళీ ప్రయత్నించాను; (చేతగాలేదు) ఇక వదిలేశాను. అప్పటికి నేను ఆయాసపడుతున్నాను. 'నువ్వు ఆయాసపడుతున్నావు. ఏమయింది? వేగంగా పరిగెత్తావా?" అని మా అమ్మ అడిగింది.

"అవును" అని నేననడం విన్నాను. అప్పుడే నాకర్థమయింది ఆ వింతైన అనుభవం చెప్పడానికి ప్రయత్నిస్తేనే నేను మాట్లాడలేకపోతున్నానని.

మరికొన్ని సమయాల్లో కూడా నేను ఆ కథను చెబుదామని ప్రయత్నించాను గానీ ఆ పనిని ససేమిరా చెయ్యలేకపోయాను. ఏదో ఒక తెలియని శక్తి ఆ సన్నివేశాన్ని బయట పెట్టడాన్ని అడ్డుకుంటోందని అర్థమై, ఇక అన్ని ప్రయత్నాలూ మానేశాను. ఇతరులకు దాని గురించి చెప్పడానికి నాకు పదేళ్ళు పట్టింది. నేను దీన్ని గురించి చెప్పినది పనస చెట్టు కింద నేను ముందుగా కలిసిన ఆ ఆగంతుకుడికే – నా గురువుకే. నేను ఆయనను మళ్ళీ, పూర్తిగా భిన్నమైన పరిస్థితుల్లో, హిమాలయాల్లో కలుసుకున్నాను.

ఆ కలయికలో నేను లాంఛనప్రాయంగా శిష్యుడిగా స్వీకృతుణ్ణయ్యాను. అయితే, ఈ విషయం గురించి తరవాత చెబుతాను.

పనస చెట్టు కింది ఘటన తరవాత, ఆ వయస్సులో ఉండే ఏ అబ్బాయైనా ఎలా ఉంటాడో పైకి నేను అలాగే కనిపించినా, నా వ్యక్తిత్వం మాత్రం గొప్ప మార్పు చెందింది. దైనందిన జీవితానికి సంబంధించిన సామాన్య క్రియలతో బాటు, లోపల ఒక రహస్యమయ జీవితం సాగడం ప్రారంభమయింది. అంతఃప్రస్థాన మారంభ మయింది. ధ్యానమనే శబ్దం గురించి కూడా తెలియకపోయినా, నేను ధ్యానం చేయడం మొదలు పెట్టడమే దాని ప్రథమ చిహ్నం.

అది ఈ విధంగా జరిగింది. నాకు సంభవించిన ఆ అసాధారణ అనుభవం ఎవరితోనూ పంచుకోడం నాకు చేతకావట్లేదని నాకర్థమైనా, ఆ ప్రేమపూర్వక నయనాలు మాత్రం నా గుండెనెప్పుడూ విడవలేదు. ఓ రాత్రి ఈ దయాపూరితమైన చూపు కలిగిన మనిషిని తలుచుకుంటూ మామూలుగానే మా అమ్మాచెల్లెళ్ళ పక్కన నిద్రపోయాను. సామాన్యంగా నేను బాగా నిద్రపోయేవాణ్ణి. నేను పొద్దున్న లేవడానికి నన్ను చాలాసార్లు పిలవవలసి వచ్చేది కూడాను. కానీ ఆ రాత్రి మాత్రం పూర్తిగా వేరుగా జరిగింది. మధ్య రాత్రి ప్రాంతానికి నేను అకస్మాత్తుగా లేచాను. నా వక్షస్సు

మధ్యలో ఒక ప్రేమపూరితమూ ఆనందాన్వితమూ అయిన భావాన్ని అనుభవించాను. ఓ మెత్తటి ఈకతో నా గుండెను ఎవరో కితకితలు పెడుతూన్నట్టు అనిపించింది. జలదరింపజేసే ఒక సంవేదన నా వెనుబాము మీదుగా నెమ్మదిగా పైకి పాకడం ప్రారంభించింది. నేను కూచుందామనుకున్నాను, కానీ మా అమ్మ లేవవచ్చుననీ, అదేమిటో తెలుసుకోవాలని అనుకుంటుందనీ అనిపించి అలా చెయ్యలేదు. అంచేత అలాగే పడుకొనే నా కళ్ళు మూసుకొని అంతర్ముఖం చూడడానికి ప్రయత్నించాను.

మొదట ఆ ప్రేమాన్విత నేత్రాలు కనిపించాయి. తరవాత అవి మాయమై వాటి స్థానే చల్లని తెల్లని వెలుగు నా వెనుబాము మీదుగా పైకి వచ్చి నా గుండెను నింపింది. అప్పటికి నాకు రత్యానందోత్కర్షమేమిటో తెలిసుంటే దాన్ని మైథునభావరహితమైన విచిత్ర హృదయరత్యానందోత్కర్షంగా వర్ణించి ఉండేవాణ్ణి, కానీ ఆ ఉపమానం చెప్పడానికి అప్పటికి నేను చాలా చిన్నవాణ్ణి. నాకు అర్థమైందేమిటంటే, ఆ పరమానంద కరమైన చిత్తవృత్తి నన్ను మత్తెక్కించిందని.

ఈ మొదటి సమాధి అనుభూతి ఎంతసేపు ఉందో నాకు తెలియదు. "లేరా అబ్బాయీ! స్కూలుకెళ్ళాల్సిన టైమైపోయింది" అనే మా అమ్మ కేక నన్ను మేలుకొల్పింది. కొన్ని పొదుపుల తరవాత నేను కళ్ళు తెరిచి లేచి కూచున్నాను. ఆ ఆనందమూ లేదు, ఆ కాంతీ లేదు, ఒళ్ళు ఝల్లుమన్న ఆ సంవేదనా లేదు. అంతా చటుక్కుమని మాయమైపోయింది. నేను శుభ్రపడడానికి పరుగెత్తా; టిఫిన్ తిన్నాను, బట్టలేసుకొని స్కూలుకు వెళ్ళడానికి సిద్ధమయ్యాను. ఆ అనుకంపాపూరిత నేత్రద్వయం ఇంకా నన్ను వెన్నాడుతూనే ఉంది.

అప్పట్నించి ప్రతి రోజు రాత్రీ ఆ ధ్యానం కొనసాగుతూనే ఉంది. నాకు కొన్ని అసాధారణ అనుభవాలు కలిగాయి. వాటిని త్వరలోనే చెబుతాను. అయితే అన్నిటికన్నా ముఖ్యమైందేమిటంటే, పవిత్ర పురుషులూ వికసితాత్ములూ నా జీవితంలోకి రావడం, అలాగే నేను చదవవలసిన పుస్తకాలు, దైవికంగా అన్నట్టు, నా చేతుల్లోకి వచ్చి పడడమూను.

# 3. గాయత్రీ మంత్రం

విద్యారమైన నా అనుభవాల్లో మొట్టమొదటిదానితో ప్రారంభిస్తాను.

నాకు బాగా దగ్గరగా ఉండే మా అమ్మా అమ్మమ్మలాటివాళ్లు తప్పించి ఇంకెవ్వరూ నా వ్యక్తిత్వంలో వచ్చిన మార్పుల్ని గమనించలేదు. అంతకుముందు కన్నా ఎక్కువగా అంతర్ముఖుణ్ణి కావడం జరిగేది. మా అమ్మ నన్ను తరచుగా ఆ పనస చెట్టు కింద కూచొనో నిలుచొనో ఆకాశంలోకి తేరిపార చూడటమో, లేకపోతే ప్రత్యేకంగా దేన్నీ చూడకుండా ఉండడాన్నో పరికించేది. నేను నిద్రలో అప్పుడప్పుడూ వింతభాషలో మాట్లాడుతూ ఉండేవాణ్ణి అని ఆవిడ చెప్పేది. అయితే, నేను మొదటి అధ్యాయంలో చెప్పిన వింతరోగం – నిద్రలో అరవడం, ఇంట్లోంచి బయటకు పరుగెత్తడం – నుంచి బాధపడడం లేదని తెలుసుకొని ఉపశమనం చెందింది ఆవిడ. పనస చెట్టు కింద ఆ కొత్తమనిషిని కలుసుకొన్న రోజు నుంచీ నన్ను తరుముకొచ్చి పట్టుకొందామని చూసే దెయ్యాల్లాంటివాళ్ళు ఒక్క ఆనవాలు కూడా లేకుండా కనిపించడం మానేశారు. మా అమ్మమ్మని మహాత్ముల కథలూ సూఫీ మహాశయుల కథలూ చెప్పమని ప్రాణం తీసేవాణ్ణి. ఆవిడ కథల నిధులైపోతే, చెప్పిన కథలే మళ్ళీ చెప్పినా నేను పట్టించుకొనేవాణ్ణి కాదు.

రాత్రి ధ్యానం చేస్తూంటే నాకు మహదానందంగా అనిపించేది. చాలాసార్లు ధ్యానం చేస్తూ చేస్తూ గాఢనిద్రలోకి వెళ్ళిపోయేవాణ్ణి; అప్పుడు నాకు స్పష్టమూ, సంక్లిష్టమూ అయిన కలలు వచ్చేవి. వీటిలో కొన్నిటిని మరిచిపోయాను; కానీ కొన్ని మాత్రం మనస్సులో గాఢమైన ముద్ర వేసుకొని ఉండిపోయాయి; అవి నా ఆధ్యాత్మిక ప్రస్థానంలో జరగబోయే ముఖ్య సంగతులను సూచించేవి. పనస చెట్టు కింద ఘటన తర్వాత మూణ్నెళ్ళకు, అటువంటి ఒక కల నాకు వచ్చింది.

(దానిలో) అందమైన ఒక ఆకుపచ్చ లోయ చుట్టూ ఎత్తైన మంచుగప్పిన పర్వతాలున్నట్టు కలగన్నాను. వాటిలో ఒక శిఖరం కిందిభాగంలో ఒక గుహ ఉంది. నాకు అర్థం కాని భాషలో ఒక మధురమైన పాట ఆ గుహలోంచి ఇవతలకు వస్తోంది. అయినప్పటికీ అది నాకు సుపరిచితమనే అనిపించింది. నేను ఆ గుహ ముఖద్వారం వైపుకు వెళ్ళి లోపలికి తొంగిచూశాను. అది బాగా పెద్ద గుహే. దాని నేల మధ్య భాగంలో, వెల్లడిగా ఉన్న వహ్నిప్రదేశంలో, కాలుతూన్న దుంగల నుండి నారింజ పండురంగు జ్వాలలు పైపైకి ఉరుకుతున్నాయి. గుహకి ఆ చివరన, ఎత్తుగా ఉన్న వేదిక మీద నాకూ అగ్నికీ అభిముఖంగా పొడుగుపాటి నల్లజుత్తూ గెడ్డంతో ఉన్న ఒక మధ్య వయస్కుడు కూచొని ఉన్నాడు. ఆయన శరీరం కింది భాగం ఒకరకమైన టేకువన్నె చెట్టు బెరడుతో ఆచ్ఛాదితమై ఉంది. ఆయన వక్షస్సు మీద అడ్డంగా నూలు తాడులాగనిపించే ఒక తెల్లని పటకా వేలాడుతోంది.

ఆయన ప్రారంభించి పాడుతూన్న పాటను చాలామంది చిన్న కుర్రాళ్ళు ప్రతిధ్వనిస్తున్నారు – వాళ్ళందరూ కూడా పాడుగుపాటి జుత్తుతో, అటువంటి బట్టలూ పటకాలూ కట్టుకొని ఉన్నారు. ఆ కుర్రాళ్ళు ఆయననూ అగ్నినీ చూస్తూ అర్ధచంద్రాకారంలో కూచున్నారు. ఆ పాట చేత పరవశుణ్ణై అకస్మాత్తుగా నేనూ వాళ్ళను గట్టి గొంతుతో అనుకరించడం మొదలెట్టాను.

ఆ గానం తటాలున ఆగిపోయింది. వేదిక మీద ఉన్న మనిషి కళ్ళు నా మీద నిలిచాయి. "ముందుకు రా నాయనా!" అని అన్నారతను. అతను ఒక వింత భాష మాట్లాడినా నేను పూర్తిగా దాన్ని అర్థం చేసుకోవడం నాకాశ్చర్యాన్ని కలిగించింది. నేను గుహలోకి నడిచాను. ఆ సమయానికి ఆ పిల్లల తలలన్నీ నా వైపుకి తిరిగాయి. నేను నిక్కరేసుకున్నాను, చేతుల్లేని జుబ్బాతో జుట్టుకొనలు దగ్గరగా కత్తిరించుకొన్న రూపంలో ఉండడంతో తత్తరపడ్డాను. ఆ పిల్లలు ముసిముసి నవ్వులు నవ్వడం మొదలెట్టి ఒకళ్ళతో ఒకళ్ళు గుసగుసలాడుకున్నారు.

"ఆపండి!" అని ఆ మనిషి అరిచాడు. పిల్లలందరూ నిశ్శబ్దమైపోయారు. నావైపుకు తిరిగి "నువ్వు పాడు" అని అన్నారాయన. నేను పూర్తిగా లయ తప్పి పాడుతున్నానని తెలిసి నట్టుతూ నట్టుతూ పాడాను. మళ్ళీ పిల్లలు ముసిముసిగా నవ్వడం మొదలెట్టారు. "ఆపు! నువ్వు సరిగ్గా పాడడం మర్చిపోయావు. ఇంటికి తిరిగి వెళ్ళి ఎలాగ పాడాలో నేర్చుకో" అని ఆ ఉపాధ్యాయుడు అన్నాడు. "కానీ, ఎలాగ?" అని నేననేలోపులో ఆ కల కరిగిపోయింది. మా అమ్మ "లేరా! లేరా!" అని అనడం వినిపించింది.

నేను ఆ కల గురించి విస్తుపోతూ లేచా! ఆ రోజు ఆదివారం. నేను స్కూలుకు వెళ్ళక్కర్లేదని సంతోషించాను. పెరట్లో చుట్టూ తిరగవచ్చు, లేకపోతే బొమ్మలెయ్యచ్చు, రంగులెయ్యచ్చు, లేకపోతే అటక మీదున్న పాత గడియారాలనూ చిన్నచిన్న యంత్రపు వస్తువులనూ అతుకులు పెట్టి బాగు చేయవచ్చు. రుచికరమైన "అప్పం", ఉడకబెట్టిన బంగాళాదుంప, ఒక ఆమ్లెట్టూ పొద్దున్న నాస్తాగా తిని, హాల్లో బెత్తంతో చేసిన ఒక పెద్ద చేతుల కుర్చీ మీద కూచొని తరవాత ఏం చేయాలబ్బా అని చూస్తున్నాను.

ఆ హాల్లో ఒక మూలను మా నాన్న తన ఆఫీసుగా వాడుకొనేవాడు. ఈ మూల ఓ పెద్ద నూకమాను వాలుబల్ల (Rosewood desk) ఉంది. దాని సొరుగును ఎప్పుడూ ఆయన తాళం వేసి ఉంచేవాడు. నా కళ్ళు ఇప్పుడు ఈ బల్ల మీదకు తిరిగాయి. దాని తాళంలో చెవి వేలాడుతూ కనిపించింది. "బహుశః సొరుగుకు తాళం లేదేమో" అని నేననుకున్నాను. దాంట్లో ఏం పెట్టారో అని నాకెప్పుడూ కుతూహలంగా ఉండేది. ఇప్పుడు దొరికింది బంగారమైన అవకాశం. పొద్దున్నే మా నాన్న వైద్యపరీక్షల కోసం వెళ్ళారు. ఆ బల్ల నన్ను తిన్నగా పిలిచింది.

క్షణంలోనే నేను మా నాన్న కుర్చీలో కూచొని ఆ తాళం చెవిని బెదురుబెదురుగా అటూ ఇటూ తిప్పడం మొదలెట్టాను; సొరుగు తెరుచుకుంది. దాని లోపలికి చూశాను. చాలా రకాల ఫైళ్ళూ లావుపాటి జమా ఖర్చుల పుస్తకాలూ, బిల్లులూ, ముద్రల మెత్తలూ (స్టాంపు పేడ్‌లూ), అందమైన పాత పార్కర్ పెన్నూ కొన్ని ప్రశస్తమైన పెన్సిళ్ళూ దాంట్లో ఉన్నాయి. ఎవరూ నన్ను చూడటం లేదని రూఢీ చేసుకోడానికి చుట్టూరా చూస్తూ, ఇంకా లోపలికి వెతుకుతూంటే రెండు లావుపాటి ఫైళ్ళ దొంతర్ల కింద రెండు పుస్తకాలు కనిపించాయి. ఒకటి చిన్నది, కమలాపండు రంగులో ఉన్న "జప యోగ అండ్ గాయత్రి" (Japayoga & Gayatri) అనే చిన్న పుస్తకం; మరొకటి వివరించే చిత్రాలతో నిండి ఉన్న యోగసంబంధమైన పుస్తకం. దాంట్లో చాలా భంగిమల్లో ఒక మనిషి బొమ్మలున్నాయి. అవన్నీ నేను సాముగరిడీలకు (జిమ్నాస్టిక్స్) సంబంధించిన అభ్యాసాలని అనుకున్నాను.

ఆ చిన్న పుస్తకం ప్రముఖ వేదాంత అధ్యాపకుడైన స్వామీ చిన్మయానంద రాసినదని నాకు తరవాత తెలిసింది. ఆ సమయంలో మటుకు, నేను కనుక్కొన్న ఆ పుస్తకాలతో పూర్తిగా ఆకర్షితుణ్ణయ్యాను. మా నాన్న అవి పోయినట్టుగా గుర్తించకుండా ఉంటాడని ఆశిస్తూ నేను వాటిని ఆయన అనుమతి లేకుండానే ఉపయోగించడానికి మార్గం చూడాలనుకున్నాను.

ఇక్కడ, మా నాన్న గురించి కొంత మీకు చెప్పాలి. ఆయన బతుకు తెరువును – ఆయనొక కట్టడాల గుత్తేదారు – మినహాయించి, దృఢమైన శరీరం కోసం చేసే కసరత్తులూ, కలరి పయట్టు (నిరాయుధంగా పోట్లాడడానికీ, స్వయంరక్షణ చేసుకోడానికీ చేసే మలయాళీ తరహా కసరత్తు పద్ధతి Kalari Payatu) హిందూ తత్త్వశాస్త్రం, సినిమాలు ఆయన ముఖ్యంగా ఇష్టపడేవి. ఆయన కేరళ విశ్వవిద్యాలయంలో భారతీయ తత్త్వశాస్త్రాన్ని ఐచ్ఛిక విషయంగా తీసుకొని మలయాళ సాహిత్యంలో పట్టభద్రు డయ్యారు. ఆయనకు వేదాంతమన్నా, దానికి సంబంధించిన ఇతర విషయాలన్నా మహా ఇష్టం; వాటిమీద గొప్ప నిపుణులు చేసే ఉపన్యాసాలకు ఆయన వెళ్ళేవారు కూడాను. ఆయన బహిరంగంగా ఒక ప్రత్యేకమైన మతానుయాయిగా కనిపించేవాడు కాదు. ఆయన ఇస్లామిక్ మూలాలకు తార్కాణం ఏడాదికి రెండుసార్లు, రంజానప్పుడూ బక్రీదప్పుడూ, జుమా మసీద్‌కి వెళ్ళి ఆ సమాజంలో కలియడం మాత్రమే. అది మినహా, ఆయన భవిష్యత్తు గురించి పట్టించుకోకుండా ఆనందంగా ఉంటూ ఏ కొత్త సినిమానూ వదిలిపెట్టకుండా చూస్తూ ఉండేవాడు. యోగాభ్యాసం మొదలెట్టడానికి ముందు ఆయన బాగా పొగ తాగేవాడు. యోగాన్ని ప్రారంభించడానికి ముందు కూడా ఆయన తెల్లవారుఝామునే లేచి ఓ

గంటన్నర పాటు గట్టి ప్రయత్నంతో బలంగా కసరత్తు చేసేవాడు. అప్పుడప్పుడు నన్ను లేపి కొన్ని చిన్న కసరత్తులు నాకు నేర్పుతూ ఉండేవాడు.

ఆ రోజున మా నాన్న సొరుగులో దొరికిన రెండు పుస్తకాల్లోకల్లా, సాముగరిడీల పుస్తకం కన్నా కమలాపండు రంగున్న ఆ చిన్న పుస్తకం నన్ను బాగా ఆకట్టుకుంది. కానీ నేను రెండూ తీసుకోడానికే నిశ్చయించుకున్నాను. తరువాత సొరుగును మూసి తాళం వేశాను; (అంతకుముందు) ఎలా ఉందో అలాగే తాళం చెవిని వదిలినట్టుగా రూఢి చేసుకున్నాను. చప్పుడు కాకుండా కాలివేలిమొనల మీద నడుస్తూ కిందనున్న పడగ్గదికి వచ్చాను. అక్కడ నేను నా బడిసంచీ పెట్టుకున్నాను. దాంట్లోకి ఈ పుస్తకాలు తోసి తిరిగి మళ్ళీ హాల్లోకి వచ్చేను. ఆ పైన ఆ చిన్న పుస్తకం చదవడానికి అవకాశం కోసం వేచి చూస్తూ ఆడుకుంటూనే విశ్రాంతంగానూ కాలక్షేపం చేశాను.

మధ్యాహ్న భోజనం కాగానే, చడీచప్పుడూ కాకుండా నా బడిసంచీలోంచి ఆ పుస్తకం తీసుకుని పెరట్లోకి పరిగెత్తాను. దారిలో, హోమ్‌వర్కు చేసుకుంటూన్న మా చెల్లెల్ని చూశాను – ఆమె దగ్గర నుంచి నాకేం ఉపద్రవమూ రాదు. పనస చెట్టు దగ్గరికి చేరి, దానికింద కూచొని పుస్తకాన్ని తెరిచాను. అక్కడ ఉంది నేను కలలో విన్నదీ, బాగా అనకపోయినా గానం చేయడానికి ప్రయత్నించినదీ అయిన ఆ మంత్రం. అప్పుడప్పుడే మేం స్కూల్లో హిందీ నేర్చుకోవడం మొదలుపెట్టేం గనక మూల దేవనాగరీ లిపిని నేను చదవలేకపోయాను. కానీ ఇంగ్లీషు మీడియం విద్యార్థిని కనక ఇంగ్లీషులో రాసి ఉన్న ఆ గొప్ప భాషను సులువుగా చదవగలిగాను:

**"ఓం భూర్భువఃసువః**
**తత్ సవితుర్వరేణ్యం**
**భర్గో దేవస్యధీమహి**
**ధియో యో నః ప్రచోదయాత్॥"***

క్రితం రాత్రి కలలోని మంత్రగానం నా తలలో మోగుతూండగా, నాకు సరైన నాదమూ స్వరమూ అవరోహణమూ కూడా వచ్చేయి. త్వరలోనే నా కలలోని గుహాంతర బాలకులు పాడినంత మధురంగా నేనూ పాడడం మొదలెట్టా; ఆనందించాను కూడా. ఎప్పుడైనా ఏకాంత స్థలం దొరికితే నేను దానిని అభ్యసించడం మొదలెట్టాను. చుట్టూ మంది ఉంటే మాత్రం మానసికంగా పాడుకొనేవాణ్ణి. బుద్ధిని ప్రకాశింపజేయడానికి సూర్యదేవుణ్ణి గురించి చేసే ప్రార్థన ఇది అని ఆ పుస్తకంలో ఉంది. చాలా ఏళ్ళ తరవాత, నా గురువు ఆ మంత్రాన్ని నాకు వివరించి చెప్పారు. సూర్యుడంటే

* *ఋగ్వేదసంహిత (3-62-10):*
*జగత్తును ప్రసవించి (కని), కర్మబీజాలను భర్జించే (వేయించే) విధంగా మా క్రియా బుద్ధులను ప్రేరేపించే మహోత్కృష్టమైన భర్గస్సు (తేజస్సు)ను మేము ధ్యానం చేస్తాం.*

అంతరాత్మ: మన చైతన్యం తాలూకు హృదయం. ఆఖరి పాదాన్ని "నా తెలివిని ప్రేరేపించు" అని బాగా ఖచ్చితంగా అనువదించవచ్చునని కూడా చెప్పారు.

రెండో పుస్తకంలో నా అవధానాన్ని ఆకర్షించినదొకటే - 'పద్మాసనమనే మెలిపెట్టిన కాళ్ళ స్థితిని చూపించే బొమ్మ. పిల్లల కోసం బొమ్మలతో సహా ప్రచురించిన చరిత్ర పుస్తకంలో ఇదే రీతిలో ఉన్న బుద్ధుడి చిత్రాన్ని నేను చూశాను. ఆ స్థితిని అభ్యసించడం చాలా సుళువనిపించింది నాకు. రహస్యంగా ఆ ఆసనం వేసి నేను బుద్ధున్ని ఊహించుకొనేవాణ్ణి. ఒక రోజున గిడ్డంగి (స్టోర్‌రూము)లో ఉన్న ఒక పాత చెక్కపెట్టె మీద నేను పద్మాసనంలో కూర్చుని ఉండగా మా అమ్మ నన్ను అకస్మాత్తుగా చూసింది. "నీకెవరు నేర్పారిది?" అని అడిగింది ఆవిడ. "ఎవరూ చెప్పలేదు" అని నేనన్నాను. "అది యోగం" అని చెప్పి ఆమె వెళ్లిపోయింది.

మా నాన్న ఎప్పుడూ ఆ పుస్తకాల గురించి అడగలేదు కాబట్టి నా దొంగతనాన్ని ఆయన కనుక్కోలేదనే అనుకున్నాను. ఇక నాకు వాటి అవసరం లేదు కనక వాటిని అక్కడ పెట్టేసే అవకాశం కోసం వేచి చూస్తున్నాను. ఒక రోజున మళ్ళీ తాళం చెవి ఆ సొరుగు తాళంలో ఉండడంతో నాకా అవకాశం కలిగింది. చుట్టూ ఎవరూ లేరని చూసి, నెమ్మదిగా ఆ సొరుగు తీసి, ఆ పుస్తకాలను ఎక్కడ ఉన్నాయో సరిగ్గా అక్కడే పెట్టేసి ఆరాటం తీరిందన్న తృప్తితో "అమ్మయ్య" అని నిట్టూర్చాను. మా నాన్నకు ఈ జరిగిందంతా తెలియదనుకొని నే ఊహించినదంతా తప్పని (తరువాత) తేలింది. ఒక రోజున పొద్దున్న అల్పాహారం చేసే సమయంలో మా నాన్న, "నా సొరుగు బల్లలోంచి నువ్వు తీసుకొని చదివిన పుస్తకాలు గురువు సహాయం లేనిదే ఏమీ అర్థం కావు. సరైన మార్గదర్శకత్వం లేకుండా దేనినీ అభ్యసించకు. యోగం చెయ్యాలని నీకుంటే, ఈస్ట్‌ఫోర్టు నుంచి వచ్చే శర్మగారిని నువ్వు కలుసుకోవచ్చు. ఆయన రేపు పొద్దున్న నాకు యోగంలో సాయపడ్డానికి ఇక్కడకు రాబోతున్నారు" అన్నారు. నాకు గుండె ఝల్లుమంది. "తప్పకుండా!" అని నేనన్నాను.

ఆ మర్నాడు మధ్యవయస్కుడూ పూర్తిగా క్షౌరం చేసుకున్న బ్రాహ్మణుడూ అయిన శర్మగారిని కలుసుకున్నాను. ఆయన నాకు యోగాసనాలూ ప్రాణాయామమూ నేర్పడానికి తక్షణమే ఒప్పుకున్నాడు. కొన్ని నెలల్లోపులోనే నేను చాలా సులువుగా ఆ అభ్యాసాలను చేయడం మొదలెట్టాను. ఒక రోజున మా నాన్నతో "ఇతను చాలా మంచిగా చేస్తున్నాడు. రోజూ అభ్యసిస్తే చాలా ముందుకు సాగగలడు" అని ఆయనసనడం నేను పక్కనుంచి విన్నాను. అప్పట్నించీ నేను యోగాన్ని అభ్యసిస్తూనే ఉన్నాను. ఇప్పటికీ ప్రతి రోజూ కొన్ని యోగాసనాలూ, శ్వాస ప్రక్రియలూ కనీసం ఓ అరగంట పాటైనా చేస్తూ ఉంటాను. నా మంచి ఆరోగ్యాన్నీ, బలాన్నీ, హెచ్చైన ఉత్సాహవీర్యాలనూ యోగాభ్యాసానికే నేను ఆపాదిస్తాను.

# 4. యోగి గోపాల స్వామి దర్శనం

మా యింటికి దగ్గరగానే ఉన్న ఓ గొప్ప వికసితాత్ముడు నాకు ఎదురుపడడం గురించి ఇప్పుడు చెబుతాను. అప్పటికి నేను నా ఐదో క్లాసు పూర్తి చేశాను. హోలీ ఏన్జెల్స్ కాన్వెంటులో ఐదో క్లాసు దాటిన తర్వాత మగ పిల్లల్ని రానివ్వరు కనక, నన్ను మోడల్ హైస్కూల్‌లో భర్తీ చేశారు.

క్లార్క్ అనే ఆంగ్లేయుడు స్థాపించిన మోడల్ హైస్కూల్‌ను స్వాతంత్ర్యం తరవాత ప్రభుత్వం తీసుకుంది; ఆ స్కూలుని పురాతన ఇంగ్లీషు పబ్లిక్ స్కూలు తరహాలోనే ఎర్ర ఇటుకలూ నల్ల రాళ్ళతోనే కట్టేరు; దానికి విశాలమైన ఖాళీ స్థలం ఉంది. అదొక మగపిల్లల బడి; విద్యా సంబంధమైన శ్రేష్ఠతకే కాక సంగీత, నాటక, కళా శిల్పాల విభాగం తాలూకు ప్రావీణ్యతకు కూడా ఆ బడి ప్రసిద్ధమైనదే.

ఆ స్కూలు మా ఇంటి నుంచి దాదాపు మూణ్ణాలుగు కిలోమీటర్ల దూరంలో ఉంది. రోజూ స్కూలుకు నడిచి వెళ్ళే పెద్ద పిల్లల సమూహంలో నేనూ ఒకణ్ణి; అందరం కలిసి బాగా సరదాగా ఉండేవాళ్ళం. వాళ్ళలో నాకన్నా పెద్దవాళ్ళైన ఓ ఇద్దరు పిల్లలు మా ఇంటికి అర కిలోమీటరు అవతల ఉండేవాళ్ళు. వాళ్ళిద్దరూ అన్నదమ్ములు; మంచి కుర్రాళ్ళు. అయితే వాళ్ళు వాళ్ళ చదువు గురించి కొంచెం ఎక్కువ జాగ్రత్తగా ఉండేవాళ్ళు. పొరుగు తమిళ్నాడు నుంచి (కేరళకు) వలస వచ్చిన తమిళ భాషీయులు.

వాళ్ళ నాన్నగారు అనంతనారాయణ పిళ్ళై. ఆయన పోలీసు శాఖలో ఓ చిన్న అధికారిగా పని చేసి అప్పటికి రిటైరయ్యారు. వాళ్ళ అమ్మ పేరు కమలమ్మ; ఆవిడ చాలా ప్రేమ గల వ్యక్తి. ఆ ఇద్దరిలో పెద్దవాడు మార్తాండ పిళ్ళైని 'పెరియతంబి' అనీ, చిన్నవాడు శివానంద పిళ్ళైని 'చిన్నతంబి' అనీ ఇంటి దగ్గర పిలిచేవాళ్ళు. మార్తాండ పిళ్ళై చాలా శ్రద్ధగా చదివేవాడు. అతను (తరవాత) న్యూరాలజిస్టు అయ్యాడు. ఒక సమయంలో అతను త్రివేంద్రం వైద్యకళాశాల తాలూకు ఆసుపత్రిలో న్యూరోసర్జరీ శాఖకు అధినేతగా కూడా ఉండేవాడు. ఇప్పుడతనికి త్రివేంద్రం పొలిమేరల్లో "అనంతపురి" అనే సొంత మల్టీ స్పెషాలిటీ ఆసుపత్రి ఉంది. శివానందుడు ఇంజనీరయ్యాడు. తమిళనాడు ప్రభుత్వపు విద్యుచ్ఛక్తి శాఖలో అతను సీనియర్ ఇంజనీర్‌గా రిటైరయ్యాడు. ఇది చాలా చెప్పుకోదగినదే – ఎందుకంటే, వాళ్ళింట్లో విద్యుచ్ఛక్తి ఉండేది కాదు; వాళ్ళు కిరోసిన్ దీపాల వెలుగులోనే హోమ్‌వర్కు చేసుకొనేవాళ్ళు.

పెరియ తంబి, చిన్న తంబిల కుటుంబం పెద్ద ప్రాకారమున్న ఒక చిన్న యింట్లో ఉండేది. దాంట్లో ఒక భాగాన్ని కట్టెల దుకాణంగా మార్చారు. అక్కడ వంట చెరుకును

అమ్ముతారు. అనంతనారాయణ్ గారు రిటైర్‌మెంట్ తరవాత వంట చెరకు దుకాణం తెరిచారు. ఎందుకంటే ఆ రోజుల్లో వంటకు అన్ని ఇళ్ళ వాళ్ళూ వంట చెరకునే వాడేవాళ్ళు. వాళ్ళ దగ్గర నుంచి వంటచెరకు కొనుక్కొనే వాళ్ళం కనక వాళ్ళతో మాకు పరిచయం కలిగింది మొదట్లో. వాళ్ళ కుటుంబం తమిళనాడులోని కన్యాకుమారి జిల్లా నుంచి వచ్చింది. అక్కడ మా అమ్మ తాతగారు ఉండేవారు. ఆ రెండు కుటుంబాల వాళ్ళు పరస్పరమూ ఎరుగుదురని ఆ తరవాత తెలిసింది.

నేను దాదాపు ప్రతి రోజూ తంబీలను కలుసుకొనడానికి వెళ్ళేవాణ్ణి; వాళ్ళతో బాటు స్కూలుకు వెళ్ళి తిరిగివచ్చేవాణ్ణి. ఈ కారణంగా మా స్నేహం ఇంకా దృఢపడింది. వాళ్ళమ్మ కమలమ్మ మృదుహృదయం కలది; నేనంటే చాలా ఇష్టపడేది. ఆ రోజుల్లో నేను చాలా అందంగా ఉండేవాణ్ణి; కొంచెం గుండ్రటి బుగ్గలుండేవి నాకు. పొద్దున్న వాళ్ళింటికి నే నడిచి వెళ్ళేసరికి నా బుగ్గలు కందిపోవడం చూసి ఆవిడ బాధపడుతూ, వాటిని నిమురుతూ, ఆవిడ కూతురితో "అయ్యో చూడవే ఈ పిల్లాడి బుగ్గలు టమాటాల్లాగ ఎంత ఎర్రగా కందిపోయేయో!" అని అనడం నాకింకా గుర్తుంది.

వాళ్ళది పెద్ద కుటుంబం. ముగ్గురు మగపిల్లలే కాకుండా (గోపాల్ అని ఓ చిన్న కుర్రాడు కూడా ఉన్నాడు) ఆ ఇంట్లో వాళ్ళ తల్లిదండ్రులూ, శ్యామలా, తంగం అనే వాళ్ళిద్దరి అక్కలూ ఉండేవాళ్ళు. పెద్దక్క శాంతని కొలసు పిళ్ళైకిచ్చి పెండ్లి చేశారు; వాళ్ళు శుచీంద్రంలో ఉండేవాళ్ళు (ఇప్పుడున్న) ఇద్దరిలోకల్లా పెద్దపిల్ల శ్యామల ఓ ప్రైవేట్ కంపెనీలో టైపిస్టుగా పనిచేసేది; తంగం కాలేజీలో చదువుతోంది. శ్యామల, వాళ్ళ బంధువు రామస్వామిని పెళ్ళి చేసుకుంది; అతను కేరళ ప్రభుత్వం జనాభా లెక్కల విభాగంలో పని చేసేవాడు. అతను లెక్కల్లో ఎమ్మెస్సీ డిగ్రీ తీసుకున్నాడు. ఒక విధంగా ఈ రామస్వామే నేను గోపాలసామిని కలుసుకోడానికి కారణమయ్యాడు.

నేను హోలీ ఏన్జెల్స్ కాన్వెంట్‌లో ఉండగా ఇంగ్లీషూ, హిస్టరీ, సైన్సుల్లో బాగానే ఉండేవాణ్ణి కానీ, లెక్కల్లో మాత్రం తక్కువ శ్రద్ధ ఉండేది నాకు. కొత్త స్కూల్లో చదవవలసినది కఠినంగా ఉండడంతో, నాకు గణితం బాగా కష్టంగా ఉండేది. రామస్వామిగారు నాకు లెఖ్ఖలు చెప్పడానికి తనంత తానే ఒప్పుకున్నారు. నేనిచ్చే చిన్న జీతాన్ని అయిష్టంగానే తన రాబడిని పెంచుకోడానికి గ్రహించాలనుకోవడం కన్నా, లెక్కల మీద తనకున్న ఇష్టంతోనే దానికి ఒప్పుకున్నాడు. వారంలో మూడు సాయంత్రాలు నేను పిళ్ళై గారి ఇంటికి వెళ్ళేటట్టుగా ఏర్పాటు చేసుకున్నాం.

ఒక సాయంత్రం, పుస్తకాలు పుచ్చుకొని ట్యూషన్‌కి వెళ్ళే సమయానికి రామస్వామిగారు గుమ్మం అవతల నిలుచుని ఉన్నారు. ఈ రోజుకి క్లాసు లేదని

అన్నాడాయన. అతనికి వేరే పని ఉందని నన్ను మర్నాడు తిరిగి రమ్మని చెప్పాడు. "తప్పకుండా" అని నేను ఇంటికి తిరిగి వెళ్ళి ఆడుకోవచ్చునని సంతోషిస్తూ అన్నాను. "కానీ, పెరియ తంబీ చిన్న తంబీ ఎక్కడ ఉన్నారు?" అని నేనడిగాను. "వాళ్ళు లోపల ఏదో చేస్తూ ఉన్నారు" (అనేసరికి) నాకు అర్థం కాలేదు; కుతూహలం కలిగింది. ఏదో వింతైనది జరుగుతోంది. ఇంటి లోపల నుంచి అగరువత్తుల ఘాటు వస్తోంది; అప్పటికి, శ్యామలా, ఆవిడ తల్లిదండ్రులూ, చిన్న తంబీ ఇంటి బయటకు వచ్చారు; ప్రతివాళ్ళూ సద్దు చేయకుండా మాట్లాడుతున్నారు.

నేను సూటిగా (అడిగేద్దామని) నిశ్చయించుకున్నాను. "అగరొత్తుల వాసన వస్తోంది. ఏం సంగతి?" అని నేనడిగాను. వాళ్ళు మాట్లాడలేదు. ఒకళ్ళ ముఖం ఒకళ్ళు చూసుకున్నారు. చివరికి వాళ్ళ అమ్మ చెప్పింది "సామి వచ్చారు. నువ్వు చూస్తావా?" అని.

సామాన్యంగా బ్రాహ్మణుల్ని 'సామి' అని సంబోధిస్తారు. ఇది కాకుండా, దీక్ష తీసుకొని నల్లబట్టలు కట్టుకొని శబరిమలైకి తీర్థయాత్రకు వెళ్ళే వాళ్ళను కూడా సాములనీ, అయ్యప్ప సాములనీ అంటారు. ఈ సామి ఎటువంటి వాడో నాకు తెలియలేదు కానీ, ఎవరైనా చూద్దామనే నిశ్చయించుకున్నాను: "అవును చూస్తాను" (అని జవాబు చెప్పేను).

అనంత నారాయణ్ గారు "ఆగు" అని లోపలికి వెళ్ళారు. కొన్ని నిముషాల తరవాత వెనక్కి వచ్చి "లోపలికి రా" అని అన్నారు. నేను లోపలికి ప్రవేశించాను. ఒక చిన్న గది మధ్యలో ఓ లావుపాటి ముసలాయన ఒక కుర్చీలో కూచుని ఉన్నారు; ఆయన కాళ్ళు ఒక పాదపీఠం మీద ఉన్నాయి. ఆయన నీలమూ తెలుపూ చారలున్న సగం చేతుల చొక్కాను వేసుకున్నారు; చుట్టూ అంచులేని సరళమైన తెల్లని "ముండు" కట్టుకున్నారు. నేనక్కడ నుంచొని తేరిపార చూశాను. ఆయన తెల్లజుట్టు చిన్నదిగా కత్తిరించినట్టుంది; చదరపు దవడలతో (square-jawed) ఆకట్టుకొనే ఆయన ముఖం కొన్ని రోజుల బట్టీ క్షౌరం చేసుకోనట్టుగా ఉంది. కొన్ని వారాల నుంచీ కత్తిరించని వెంట్రుకల దుబ్బు ఆయన చిబుకాన్నీ బుగ్గల్నీ పై పెదవినీ ఆవరించి ఉంది. మందు కూరే గూటంలాగ నిటారుగా నిలుచున్న వెన్నుతీరు తప్పించి అంతా చాలా సాధారణంగానే ఉంది. తరువాత ఆయన కళ్ళను చూశాను. నేనంతకు ముందెన్నడూ అంతగా చొచ్చుకుపోయి చూసే చురుకైన కళ్ళను చూడలేదు.

తెలియకుండానే, నా బట్టలను తడిమి చూసుకున్నాను, అవి ఇంకా ఉన్నాయా లేవా అన్నట్టు. ఎందుకంటే, నన్ను ఎక్స్‌రే తీస్తున్నట్టనిపించింది నాకు. ఆ కళ్ళు

నాలోకి, నాగుండా చూస్తున్నాయి. "దేవుడా! ఈ మనిషికి నా రహస్యాలన్నీ తెలుసును" అని అనుకున్నాను. ఆయన అప్పుడు నవ్వి "వరూ,(రా)" అని సైగ చేశారు. ఆయన కంఠం చెప్పలేనంత మృదువుగా ఉంది. నేను దగ్గరగా వెళ్ళేను, కుర్చీ చేతుల్ని దాదాపుగా తాకుతున్నట్టుగా నిలుచున్నాను. ఆయన నవ్వుతూనే ఉన్నారు. ఆ మీద ఆయన తన కుడి చేతిని చాచి క్షణం పాటు నా నొసటిని ముట్టుకుని వెనక్కి తీసుకున్నారు.

వర్ణించ శక్యంగాని, మాటలతో చెప్పలేని ఆనంద తరంగాలు నా నుదుటి నుంచి పైకి లేచి నా శరీరాన్ని ముంచెత్తాయి. సుమారు ప్రతి రాత్రీ నేను పొందుతున్న అనుభూతి కన్నా వేరుగా ఉంది. సముద్రపు కల్లోల తరంగాలు తటాలున ఆగిపోయి, ఆ జలతలం, కెరటాల్లేని సరస్సంత శాంతంగా ఉండడమనే ఏకైకరీతిలో మాత్రమే ఆ అనుభవాన్ని నేను వర్ణించగలను. నాకు అవతల చప్పుళ్ళేవీ వినిపించట్లేదు. నా మనస్సు అగాధంలోంచి నాకు అర్థం కాని ఓ పాట వెదలివచ్చింది. నా కళ్ళల్లోంచి నీళ్ళు కారడం మొదలెట్టాయి. నేను అక్కణ్ణుంచి బయటకు వచ్చి ఎక్కడో ఓ చోట నాకుగా నేను కూచోవాలి (అని అనిపించింది నాకు). నేను వెనుదిరిగి ఆ గదిలోంచి ఒరుగుతూ, వణకుతూ ఇవతలికి వచ్చాను. అకస్మాత్తుగా ఆ నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ ఎవరో "వంగి నమస్కరించి ఆయన పాదాలను స్పృశించు" అని అన్నారు. ఆ సమయానికి నేను గుమ్మం దగ్గరకు వచ్చేశాను. అంచేత నేను ఇతరులు అలా చేయడం చూసి ఆ గుమ్మం గడపని ముట్టి, ఆ మీద నా తలను ముట్టి బయటకు పరుగెత్తాను.

మళ్ళీ ఈ మనిషిని నేను చూడలేదు. నేను త్వరగా పరిగెత్తి నిముషాల్లో ఇంటికి వచ్చిపడ్డానని గుర్తుంది నాకు. నేను లోపలకు రావడం ఎవరూ చూడలేదు. ప్రాకారం పక్కనున్న దారి మీదుగా మా పనస చెట్టు దగ్గరికి త్వరగా వెళ్ళి దానికింద కూచున్నాను. ఆపాటికి ఆ ఆనందం సద్దుమణిగింది కాని ఆ విచిత్రమైన నిశ్శబ్దం మాత్రం కొంతసేపటి వరకూ కొనసాగింది. మా అమ్మ వెనక తలుపు నుంచి "ఏమైందిరా, ట్యూషన్ లేదా?" అని అరవడంతో అది కూడా భంగమయింది. "లేదు" అని నేను బదులు కేక వేశాను. "రారా, వచ్చి ఏమన్నా తిను" అని అంది ఆవిడ. "వస్తున్నాను" అని నేనన్నాను. నాకు తిండి పెట్టడమంటే మా అమ్మకు మహా ఇష్టం.

మర్నాడు నేను ట్యూషన్‌కి వెళ్ళేసరికి రామస్వామిగారూ, ఇతరులూ నిన్న ఏం జరిగిందంటూ అడుగుతూనే ఉన్నారు. కానీ నేనేమీ చెప్పలేదు. అటువంటి రహస్యాలను, ప్రేమికులు పంచుకునే విషయాల్లాగ, దాచుకోవాలని తట్టింది నాకు. వాటిని బంగారంలాగ, అమూల్యమైన వజ్రాల్లాగ భద్రంగా బోషాణంలో దాచుకోవాలి; తగిన సమయం వచ్చినప్పుడు ఇతరుల ప్రయోజనం కోసం వాటిని బహిరంగంగా ప్రదర్శించవచ్చు.

పిళ్ళై కుటుంబం నుంచి అతని పేరు గోపాల పిళ్ళై అనీ, అతని మీద గౌరవం కొద్దీ అతనిని గోపాలసామి అని పిలుస్తారనీ తెలుసుకున్నాను. చాలా ఏళ్ళ తరవాత, ప్రభు అనే ఒకాయన అచ్చొత్తించి ప్రచురించిన ఆయన బోధనల సంగ్రహాన్ని "అరుల్ మొళిగల్" (Arul Mozigal) – "విజ్ఞానపు తీపి పలుకులు" అనే పేరుతో చూడడం తటస్థించింది. క్రమరహితంగా ఇష్టమొచ్చినట్టు పేజీలు తిప్పుతూంటే నా కళ్ళకు కనిపించిన మొదటి పేజి మీద గోపాలసామికి ఇష్టమైన పలుకులూ, ఆయన తరచుగా చెప్పే మాటలూ "ఆనందోఽహం, ఆనందోఽహం, అచలపరోఽహం" అనేవి ఉన్నాయి.

దాదాపు ఆరేళ్ళ క్రితం నేను ఆయనను కలుసుకొన్న రోజున నే విన్నదదే పాట అని నాకర్థమయింది. అప్పుడు స్పష్టంగా నేనా మాటలను తెలుసుకోలేక పోయాను; ఎప్పుడైతే వాటి అర్థం నాకు తెలిసిందో, కొద్దిసేపటికైనా అది నేను అనుభవించానని అనుకున్నాను. ఆనందోఽహం, ఆనందోఽహం, అచలపరోఽహం, అచలపరోఽహం: "నేను ఆనందాన్ని; నేను ఆనందాన్ని; కలతలకందని వాణ్ణి నేను, కలతలకు దొరకని వాణ్ణి నేను".

దక్షిణ ట్రావెన్‌కోరులోని కొళ్ళంకోడులో 1900 ఆగస్టులో గోపాల పిళ్ళై పుట్టారు. ఆయన తల్లి కున్నిపరాంబ వీటిల్ కొచ్చు కుంజమ్మ; తండ్రి నారాయణ పిళ్ళైగారు. ఆయనకు ఇద్దరు అన్నలూ, ఇద్దరు అక్కలూను. వాళ్ళ కుటుంబం తరవాత తిరువనంతపురానికి (త్రివేంద్రానికి) మారింది. పెద్దన్న శంకరపిళ్ళై గారు ఆ కుటుంబాన్ని సాకేవారు.

హెడ్మాస్టర్‌గా రిటైరైన విద్వాన్ శ్రీవరాహం ఇ.వి. పిళ్ళై గారు గోపాల పిళ్ళై గారి బాల్య స్నేహితుడు. ఆయన చెప్పినదేమంటే ఫోర్టు హైస్కూల్లో విద్యార్థిగా ఉన్న రోజుల్నించీ గోపాల పిళ్ళై గారి పద్ధతులే వింతగా ఉండేవట. ఆయన చాలా గంటలు కూర్చుని కళ్ళు తెరిచే ధ్యానం చేసేవాడు; తరచుగా సమాధిలోకి వెళ్ళేవాడు. ఓసారి, ఆయనకు 12 ఏళ్ళున్నప్పుడు, వెన్ను విల్లుగా వెనక్కి వంగి ఉండగా బాసినపట్టేసుకొని మధ్యాహ్నపు సూర్యుణ్ణి సూటిగా చూస్తున్న ఆయనను చూశారుట. ఆయన అన్నగారు శంకర పిళ్ళైకి ఈ విషయం చెప్పగా, ఆయన "మీరు జోక్యం చేసుకోకండి. అతనికేదిష్టమో దానిని చేసుకోనివ్వండి" అని జవాబు రాశారట.

ఇరవై ఏళ్ళప్పుడు, ఇంకా సెకండరీ స్కూలు పరీక్ష కూడా ఉత్తీర్ణం కానప్పుడు, ఆయన తల్లి బాగా కష్టపడి చదవమని ఒప్పించడానికి ప్రయత్నించింది. "నేను కావాలనుకుంటే సులువుగానే పాసు కాగలను. కానీ ఎందుకు? ఎలా అయినా,

నేను డబ్బు కోసం గానీ లాభం కోసం గానీ పని చెయ్యనని నిశ్చయించుకున్నాను. నన్ను ఒకరు కనిపెట్టుకొని సాకుతారు" అని గోపాలసామి జవాబు చెప్పేడట. ఆ తరవాత ఆయన స్కూలుకి వెళ్ళడం మానేశాడు.

యౌవనంలో, గోపాల పిళ్ళై విచిత్రమైన స్థలాల్లో తిరగడానికి ఇష్టపడేవాడు. ఆయనకిష్టమైన ప్రదేశాల్లో ఒకటి ముట్టతర (Muttathara). ఆయన కంటే ముందు, శ్రీ నారాయణ గురువు, చట్టాంబిస్వామి ("శ్రీ నారాయణ గురువు కథ" అనే అధ్యాయంలోని 54వ పేజీ చూడండి) ముట్టతరకు వెళ్తూ ఉండేవాళ్ళు. ముట్టతర దగ్గర ఎవరైనా మొదట, వెలుగులీనే పచ్చని వరి పొలాల్లో ఎకరాలకెకరాల పాటు నడుస్తారు. ఆ పొలాలు అంతం కాగానే, సముద్ర తీరపు స్వచ్ఛధవళసైకతాలూ, చాలా ఇసుక దిబ్బలూ మొదలయ్యేవి. ఇంకా పైకి, గాఢ నీలపు అరేబియన్ సముద్రం కనిపించేది. దాని కెరటాలు ఒక్కోసారి పైపైకి లేస్తూ ఒడ్డు మీద హోరు చేస్తూ చితికి పోయేవి; ఒకోసారి ఇసుకల్లోకి నెమ్మదిగా దొర్లుతూ రకరకాల కడలి చిప్పలను వదిలిపెట్టేవి.

ఆయన స్నేహితుడైన ఇ.వి. పిళ్ళై గారు గోపాల పిళ్ళైగారితో బాటు చాలాసార్లే ముట్టతరకు ప్రయాణం చేశారని చెప్పారు. వరి పొలాల్లో నడుస్తూండగా ఆయన వేదాంతం గురించి చాలా ఉపన్యసించేవారట. ఇసుక దిబ్బల పక్కకు రాగానే గోపాల పిళ్ళై గారు మౌనంలో దిగిపోయేవారట. *'వీరాసనం'లో కదలకుండా కూచొని కళ్ళు తెరుచుకుని చాలాసేపే ఉండేవారాయన. ఆ సమాధిలోంచి బయటకు వస్తూ విచిత్రమైన గుర్రుగుర్రుమనే ధ్వనులను చేసేవాడు; అప్పుడప్పుడు ఏ కారణమూ లేకుండానే గట్టిగా నవ్వేవాడాయన. ఇది చూసి ఇ.వి. పిళ్ళై భయపడిపోయేవారు.

ముట్టతర దాటిం తరవాత, పూంతరా (Poonthura) దగ్గర, పూర్తిగా నిర్జనమైన ఒట్టపనమూడు (Ottapanamoodu) అనే అడవి ప్రాంతం ఉందని రాశారు ఇ.వి. పిళ్ళై గారు. ఒక సమయంలో సెంట్రల్ జైల్ తాలూకు తలారి ఉరి తీసిన హంతకుల శరీరాలను పడెయ్యడానికి ఈ ప్రదేశాన్ని ఉపయోగించేవాళ్ళు; అదీకాకుండా, ప్రభుత్వం వారి శవాగారం (Mortuary) నుంచి అనాథ శవాలనూ, కుళ్ళిపోయిన శవాలనూ కుప్పలుగా పోసే భూమిగా ఉపయోగించేవారు. అక్కడ, ఒక మధ్యాహ్నం,

---

* (హఠయోగ ప్రదీపిక 1-23):
ఏకంపాదం తథైకస్మిన్విన్యసేదూరుణిస్థితం। ఇతరస్మింస్తథాచోరుంవీరాసనమితీరితమ్ ॥
(ఒక పాదాన్ని రెండో తొడ మీదికి, రెండో పాదాన్ని మొదటి తొడ మీదికి పెట్టి కూచోడాన్ని వీరాసనమని అంటారు.)

గోపాలసామితో కలిసి వెళుతూ బాగా ముడుతలు పడ్డ ఒక ముసలివాణ్ణి అతను చూశాడు; అతనికి జడలు కట్టిన జుట్టుంది. కాలిపోతున్న ఇసుక మీద పూర్తిగా నగ్నంగా కూచొని ఉన్నాడతను. గోపాల పిళ్ళై, ఆ వింత మనిషీ ఒకళ్ళనొకళ్ళు కావలించుకున్నారు. ఇ.వి. పిళ్ళైని ఓ చింతచెట్టు నీడలో వేచి ఉండమని చెప్పి వాళ్ళిద్దరూ దూరంగా ఉన్న తాడిచెట్ల తోపులోకి ప్రవేశించారు.

ఓ గంట తరవాత, (చూసి చూసి), అలసి, బాగా ఆతురతలో ఉన్న ఇ.వి. పిళ్ళై ఆ తోటకు వెళ్ళారు. వాళ్ళిద్దరూ ఒకళ్ళ పక్కనొకళ్ళు గాఢనిద్రలో ఉన్నట్టుగా పడుకుని ఉండడాన్ని చూశారు. అతను కొంచెం దగ్గరగా వెళ్ళగానే వాళ్ళు అదిరినట్టుగా గభాలున పైకి లేచారు. గోపాల పిళ్ళై తరవాత ఇ.వి. పిళ్ళైతో ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు. ఇ.వి. పిళ్ళై చెప్పినదేమంటే, గోపాలసామీ, ఆ వింత మనిషీ ఒకళ్ళనొకళ్ళు తరచుగానే కలుస్తూ ఉండేవాళ్ళు. కానీ ఆ ముసలి మనిషి గురించి ఏ ప్రశ్నలు వేసినా నిశ్శబ్దమే జవాబుగా ఉండేది.

చాలా ఏళ్ళ తరవాత గోపాల పిళ్ళైని "గోపాలసామి" అంటూ ఆధ్యాత్మిక సాధకుల చిన్నపాటి బృందం పిలవడం మొదలెట్టిన సమయానికి, ఆయన అర్ధరాత్రి క్లాసులు నడిపేవాడు. ఆ క్లాసులు సిటీలోని హోమియోపతీ వైద్యశాలలో నిర్వహించేవారు సాధారణంగా. ఇక్కడ వేదాంత సంబంధమైన గొప్ప సత్యాలను చర్చించేవారు. ఈ చర్చలనన్నిటినీ సంకలనం చేసి "అరుల్ మొళిగల్"గా ప్రచురించారు.

గోపాలసామి మరో ఉనికిపట్టు – "సమాధి తోటం" (Samadhi Thotam). ఈ ప్రదేశం శ్రీరామదాస స్వామి వారి సమాధి. ఆయన జలన్ధర్ యోగి హరిహర బ్రహ్మశాస్త్రి గారికి గురువు. శాస్త్రి గారు ట్రావన్కోర్ మహారాజు అయిల్యం తిరునాళ్ (1805–1880) పాలించిన కాలంలో ఉండేవారు. ఆ సమాధిని జీవసమాధిగా చెప్పేవారు: అంటే, తనకు తానే ఒక యోగి బతికుండగానే సమాధిలోకి ప్రవేశించిన తరవాత ఆ గురువు గారి సూచనలను బట్టి అతని శిష్యులు దానిని మూసివేస్తారు. 'సమాధి తోటం' అనేది గోపాలసామి సాంప్రదాయిక పూజలను (ఆరాధనను) చేసిన చివరి ప్రదేశం. తనకు బాగా సన్నిహితులైన అనుయాయులకు అది ఆయన అక్కడికి చివరిసారిగా వెళ్ళడమని చెప్పాడని చెబుతారు. ఆ మర్నాడు ఆయనకు పొత్తికడుపులో విపరీతమైన బాధ పుట్టింది. మూడో రోజున ఆయనకు ఆపరేషన్ చేశారు. చాలా బతిమాలగా ఆయన ఆ ఆపరేషన్‌కి అయిష్టంగానే ఒప్పుకున్నాడు. శస్త్రచికిత్సే చేయడం జరిగితే అది మళ్ళీ చేయాల్సి వస్తుందని చెప్పాడాయన. ఆయన జోస్యం చెప్పినట్టుగానే శస్త్రచికిత్సకుడు రెండో శస్త్రచికిత్స అవసరమని నిశ్చయించాడు.

✻ ఒక హిమగిరి గురువర్యులకు శిష్యుడైన

ఆ రెండో శస్త్రచికిత్స కోసం వేచి ఉన్న సమయంలో గోపాలసామి గారు పక్కమీద కూచొని గాఢంగా ఊపిరి పీల్చి వెనక్కి పడిపోయారని చెబుతారు. ఆయనను చూచేవాళ్ళు ఆయన గాఢ సమాధిలో ఉన్నాడని అనుకున్నారు. ఆయనను శస్త్రచికిత్సా లయంలోకి చక్రాల బండిలో తీసుకెళ్ళేసరికి, ఆ శస్త్రచికిత్సకుడూ, మత్తు మందునిచ్చి తాత్కాలిక చేతనత్వాన్ని మరుగుపరిచేవాడూ (Anaesthetist) ఇద్దరూ అతను చనిపోయాడని ధ్రువీకరించారు. ఆ రోజు 1960వ సంవత్సరం, మార్చి 8.

# 5. భగవద్భావోన్మత్తుడైన ఒక సూఫీ

గోపాలసామి గారిని కలుసుకొని ఒక నెల పై చిలుకు కావచ్చు. మా అమ్మ మేనమామ, మా అమ్మమ్మ, ఓ దూరపు అత్త, బీమపల్లికి వాళ్లతో పాటు రమ్మనమని నన్ను పిలిచారు.

ముస్లిమ్ మహాత్మురాలు బీమాబీబీ సమాధే బీమపల్లి. అది త్రివేండ్రం ఎయిర్ పోర్టుకి అనతి దూరంలో ఉన్న సముద్ర తీరాన ఉంది. అది దయ్యాలను వదిలించే మంత్రవాదానికి పెట్టింది పేరు. పిశాచావేశితులయ్యారని అనుకునే వాళ్ళను అన్ని వైపుల నుంచీ తీసుకొచ్చి కొంతకాలం ఇక్కడ ఉంచుతారు. ఉగ్రమైన వాళ్ళను బండలకో, కట్టి స్తంభాలకో కట్టేస్తూ ఉంటారు. సాధారణంగా గురు శుక్రవారాల్లో ఆ దౌర్భాగ్యులు పారవశ్యంలోకి పోతారు; దానిని సరిగ్గా చెప్పాలంటే ఉన్మాదం అని చెప్పాలి. తలలను గిరగిరా తిప్పుతూ, కళ్ళను గుండ్రంగా తిప్పుతూ బిగ్గరగా బొబ్బలు పెడుతూ, "మమ్మల్ని హింసించవద్ద"ని బీమాబీబీని యాచిస్తూ, వాళ్ళు తాత్కాలికంగా ఉంటూన్న ఆ శరీరాన్ని వదిలి వెళ్ళిపోతామని వాగ్దానం చేస్తూ, చివరకు తలకాయలను సమాధి గుమ్మం మెట్టుకేసి కొట్టుకుంటూ సొమ్మసిల్లిపోతారు. ఈ ప్రవర్తనలన్నీ ఒక్కొక్క దౌర్భాగ్యుణ్ణి పట్టి పీడిస్తూన్న దయ్యం తాలూకు పనులని చెబుతారు. దయ్యాన్ని తోలేసిన తరవాత, ఆ మనిషి దయ్యం నుంచి విడివడ్డాడనీన్నూ, ఒకసారి స్పృహ వచ్చిందంటే చాలు అతను తన సాధారణ అవస్థకు తిరిగి వస్తాడనీ చెబుతారు.

ఈ స్వస్థత కలగడానికి కారణం మహాత్మురాలు బీమాబీబీ ప్రత్యక్షంగా జోక్యం చేసుకోవడం వల్లనే జరిగిందని నమ్ముతారు. ఆ మహాత్మురాలి శవమూ, ఆవిడ కొడుకు శవమూ ఉన్న శవపేటికను అరేబియన్ సముద్ర తరంగాలు ఎత్తుకు పోయి తిరిగి తీరం మీదకు, ఇప్పుడు ఆ సమాధి ఉన్న దగ్గరకు పట్టుకొచ్చి ఉంచాయిట. ఆ శవపేటికను తాకితే చాలు, దయ్యాలు పట్టాయనుకొనేవాళ్ళు బాగు పడడం చూసి అక్కడి స్థానికులు ఆవిడకు ఓ సమాధి కట్టారు. ఆ ప్రదేశంలో ఉండే ముస్లిం బెస్తవాళ్ళు బీమా బీబీ ఒక అరబ్బీ ముస్లిం మహాత్మురాలని చెబుతారు. ఆ సమాధికి అనుబంధంగా ఉన్న మసీదుని దర్గా అని అంటారు.

మేము ఆ దర్గా దగ్గరికి ఓ శుక్రవారం సాయంత్రానికి చేరుకున్నాం. సముద్రతీరం లోని తెల్ల ఇసుక ఇంకా వేడిగానే ఉంది. మేము ఆ ఇసుక నేలమీదుగా అడ్డంగా నడుస్తూ దర్గాకు చేరుకున్నాం. దర్గా ప్రాకారం ఒక పక్క నుంచి మరో పక్క వరకూ వెదజల్లినట్టుగా కొన్ని అడ్డదిడ్డంగా కట్టిన విడుదులున్నాయి. వాటిని ఆ రోగుల కోసమూ వాళ్లను సంరక్షించే వాళ్ళ కోసమనీ కట్టారు. కొన్ని కొబ్బరి చెట్లు,

రాతిస్తంభాలూ, చెక్కస్తంభాలూ ఇటూ అటూ చెదురుమదురుగా అక్కడక్కడ ఉన్నాయి. కొంతమంది జబ్బు పడ్డవాళ్ళను కొన్ని స్తంభాలకూ కొబ్బరిచెట్లకూ గొలుసులేసి కట్టేశారు; కొంతమంది మరీ జాలిగొలిపే స్థితిలో ఉన్నారు – వాళ్ళు నిరాశతో గూడిన కళ్ళు ఆ గుంటల్లోంచి నివ్వెరపోయి చూస్తున్నాయి; వాళ్ళు అస్థిపంజరాల్లాగ ఉన్నారు. మేము అటువంటి ఒక బంధిత స్త్రీ పక్కగా వెళుతూంటే, ఆవిడ తన పచ్చ పళ్ళను ఇకిలించి చూపిస్తూ, కళ్ళు గిరగిరా తిప్పుతూ మమ్మల్ని చూస్తూ గుర్రుగుర్రుమంటూ అరిచింది. మా అత్త భయంతో అరిచి అటు పక్కకు దుమికింది. నేను తప్ప అక్కడ ప్రతి ఒక్కడూ నవ్వారు. నేను భయపడలేదని చెప్పట్లేదు కానీ, ఆ దురదృష్టవంతుల్ని చూస్తూంటే భయం కన్నా, నా గుండెను గాఢమైన దుఃఖం ఆవరించింది.

దర్గాలో ప్రవేశించాం. సమాధి ఉన్న ఆవరణకు ఎదురుగా ఉన్న హాలు పూర్తిగా జనాలతో నిండిపోయి ఉంది. ఒకవైపు జబ్బు పడ్డవాళ్ళ కోసమూ మరోవైపు భక్తుల కోసమూ కేటాయించడం జరిగింది. మేము ఆ సమాధి దగ్గరకు నడిచి ఆ ఆవరణ ద్వారం దగ్గర వేచి ఉన్నాం. సమాధిని మిలమిలలాడే ఆకుపచ్చని శాటిన్‌తో ఆచ్ఛాదించారు; రెండువైపులా ఉన్న తెరలు ఎర్ర వెల్వెట్‌వి. ఆవరణ లోపలి భాగం ఆకుపచ్చని బల్బులతోనూ నీలం బల్బులతోనూ వెలిగించడంతో దానికి విచిత్రమూ భయంకరమూ అయిన రూపు వచ్చింది.

హిందూ పూజారికి ప్రతిరూపమైన ముస్లిం ముల్లా మేము అర్పిద్దామని తీసుకెళ్ళిన అరటిపళ్ళను తీసుకొని ఖురాన్ నుంచి కొన్ని వచన పద్య పాదాలు చదివాడు. మా అందరి చేతులూ ప్రార్థనాపూర్వకంగా జోడించి ఉన్నాయి; మా తలలు ఒక గుడ్డతో ఆచ్ఛాదితమై "ఆమీన్, ఆమీన్" అంటూ ఉన్నాం. తరవాత మా ముఖాలను అరచేతులతో రాసుకుని, ముల్లా నుంచి భగవదర్పితమైన ఎండిన గులాబి రేకు ముక్కలనూ పంచదారనూ గ్రహించాం. బీమాబీబి నుంచి ఆశీస్సులను మనకు బదిలీ చేయడానికి ముల్లా ఉపయోగించే నెమలి ఈకల గుత్తితో తట్టే తట్టుల్ని మేము తలలు కిందికి వంచి స్వీకరించాం. మా అమ్మమ్మ హుండీలో కొంత డబ్బు వేసింది. ఆ తరవాత దయ్యం పట్టనివాళ్ళ భాగంలోకి వెళ్ళి కూచున్నాం.

పక్కనున్న మసీదు నుంచి ప్రార్థించడానికి అనుమతిగా పిలుపు వినిపించగానే పిశాచగ్రస్తులని చెప్పబడే వాళ్ళందరూ ఒక్కుమ్మడిగా లేచారు క్రియావేశితులైనట్టుగా. వాళ్ళు వికృతమైన ధ్వనులనూ వికృతతరమైన కదలికలనూ చేయడం మొదలెట్టారు. ఆ వాతావరణం భరించడానికి వీలు లేనట్టుగా తయారైంది.

అకస్మాత్తుగా, సహజంగా ఉన్నాడని అనుకుంటూన్న, మా పక్కనే కూర్చున్న ఒక మధ్యవయస్కుడు నిలుచొని వింతగా ప్రవర్తించడం మొదలుపెట్టాడు. అతను తన శరీరాన్ని వర్తులంగా తిప్పుతూ అటువైపున్న జనుల్లాగే "హూమ్ హూమ్" అనడం ప్రారంభించాడు. తరవాత అతను ఆగి నా వైపుకు తిరిగి వెక్కిరిస్తూన్నట్టు "నువ్వు! నువ్వు! నువ్వు నన్ను కనుక్కున్నావు. నన్ను కాల్చేద్దామని ప్రయత్నించావు. కానీ నేను వెళ్ళను" అన్నాడు. ముందుకు ఉరికి సమాధి ఉన్న ఆవరణ ద్వారం వైపుకు పరుగెత్తాడు. అక్కడ అతను తన తలను గుమ్మం మెట్టుకి కొట్టుకుని భయంతో అరిచాడు: "సరే, నేను వెళతాను. ఆ కుర్రాడు నన్ను కనుక్కున్నాడు. బీబీ, నేను వెళ్ళిపోతాను. నన్ను దహించవద్దు. నేను దహించుకుపోతున్నాను". దానితో మళ్ళీ ఓ భయంకరమైన అరుపు అరిచి సొమ్మసిల్లిపోయాడు. మొట్టమొదటిసారిగా నేను భయంతోనూ, విసిగి పోయాను.

మా అమ్మమ్మకిది అతిగా అనిపించింది. "సాబ్‌జాన్" అని ఆవిడ తన సోదరుడితో గుసగుసలాడుతూ "ఇక్కణ్ణించి పోదాం పద" అంది. నన్ను ఏదైనా లాక్కుపోతుందేమోనన్న భయంతో అన్నట్టుగా నా చెయ్యి గట్టిగా పట్టుకున్న మా అమ్మమ్మతో సహా మేం అందరం అవతలకు వెళ్ళిపోయాం. అవతలకి వచ్చి, మరో విచిత్రమైన దృశ్యం చూశాం. తెల్లజుట్టుతోనూ ఏ మాత్రమూ ఆకట్టుకోని నల్లటి పిల్లిగడ్డంతోనూ ఉన్న ఒక దిసమొల ముసలాడొకడు ఇసుకమీంచి పరుగులెడుతూ మేం నిలుచున్న ప్రదేశం వైపుకు చేరుతున్నాడు. తనకు తానే నవ్వుకుంటూ, ఒకోసారి పగలబడి నవ్వుతూన్న కహకహ ధ్వనులతో ఆకాశం వైపు చూస్తూ చేతులను తిప్పుతున్నాడు. అతని తల పైకీ కిందికీ కుదుపుడు కదలికలతో తిరుగుతోంది; అతని శరీరం ఇసుకతో ఆచ్ఛాదితమై ఉంది. నల్లటి శరీరం మీద తెల్లటి ఇసుక!

ఎవరైనా అతనిని కూడా ఒక పిశాచగ్రస్తుడిగా పొరబాటు పడేవాళ్ళే. కానీ అతని వెనక చాలామంది మగాళ్ళూ ఆడవాళ్ళూ సమ్మానపూర్వకంగా చేతులు కట్టుకొని నడుస్తూ అతనితో నడవడానికి చూస్తూండడాన్ని బట్టి అది పొరబాటే యని తెలుస్తుంది. మమ్మల్ని దాటి వెళ్ళాడాయన. తటాలున ఆగాడు, మేమున్న చోటికి తిరిగి వచ్చి సరిగ్గా నా ముందు నిలుచున్నాడు. ఒక నిముషం పాటు అతని శరీరం గంభీరంగా తయారైంది. దాదాపు భీతిని కొలిపేలాగ అయింది. రక్తరంజితమైన కళ్ళు నా ముఖాన్ని వెదికాయి. ఆ పైన నేను నవ్వును పుట్టించేలాగ కనిపించినట్టు అతను మళ్ళీ నవ్వుతూ తమిళంలో ఇలా అన్నాడు. "సెరి సెరి పోపో అప్పురాం వాడా" (సరే సరే ఇప్పటికి వెళ్ళు తరవాత రా అబ్బాయీ!) అని మళ్ళీ వెళ్ళిపోయాడు. ఎందుకోగానీ ఈసారి నేను భయపడలేదు.

అయితే, నేనతన్ని పిచ్చివాడిగా అనుకున్నాను. పిచ్చికీ ఆధ్యాత్మిక ఆనందమత్తతకీ మధ్యనుండే గీత చాలా సన్నమని నాకప్పుడు తెలియదు. మా అమ్మ మేనమామ తరవాత చెప్పాడు అతనిని కలడి మస్తాన్ అంటారనీన్నూ అతను గొప్ప శక్తులున్న వాడనీన్నూ, భగవత్ప్రేమలో మత్తెక్కి ఉన్నాడతను: బయటి ప్రపంచమంటే పూర్తిగా స్పృహ కలిగిలేదు. "కొంతమంది పుణ్య పురుషులు అలా ఉంటారు" అని ఆయన చెప్పేడు, అదేదో ఆ విషయమంతటినీ వివరించినట్టుగా, కానీ నాకేమీ అర్థం కాలేదు. "కానీ ఆయనెందుకని బట్టలు లేకుండా ఉన్నాడు?" అని నేనడిగాను. మా అమ్మ మేనమామ "నాకు తెలియదు. అప్పుడప్పుడూ ఎవరో ఒకరు అతని నడుం చుట్టూ ఓ కొత్త ధోతీ చుట్టబెడుతూ ఉంటారు. కానీ నిముషాల్లోనే అది ఏ పేద బిచ్చగాడికో ఇచ్చేసి తిరిగి దిసమొల వాడైపోతాడు" అని చెప్పాడు.

అది అర్థమైంది. ముఖ్యంగా వేసవిలో నాకు బట్టలు వేసుకోవడమంటే అసహ్యంగా ఉండేది. అప్పుడు నా బట్టలు ఏ బీద బిచ్చగాడికో ఇచ్చేసి స్వేచ్ఛగా దిసమొలతో తిరగడం నాకు ఇష్టమనిపించేది. కానీ అలాగ చెయ్యలేనని తెలుసును. ఎంచేతంటే నేను నాగరికంగానూ సరిగ్గానూ ఉండాలని అందరూ చూస్తుంటారు కనక.

"సరే మళ్ళీ రా కుర్రాడా" అని అతను అన్న మాటలు కొన్నేళ్ళ తరవాత సత్యమయ్యాయి. అయితే ఆ కథను మరో అధ్యాయానికి కేటాయిస్తాను.

# 6. సుబ్రహ్మణ్యుడి కోవెల లోపల

శ్రీనివాసరావు నా సహాధ్యాయుల్లో ఒకడు. అతనితో నేను చాలా స్నేహంగా ఉండేవాణ్ణి. మొట్టమొదటిసారిగా ఓ హిందూ దేవాలయంలో నేను ప్రవేశించడానికి అతను కారణమయ్యాడు.

స్కూలుకు వెళ్ళడానికి రెండు దారులున్నాయి – ఎక్కువ రాకపోకలుండే మెయిన్ రోడ్డు దారి దగ్గర దారి; రాకపోకలు బొత్తిగా తక్కువగా ఉండి, గాలి బాగా వీచే పక్కదారి చాలా పొడుగాటి దారి. మా స్నేహితులు కొంతమందీ నేనూన్నూ నెమ్మదిగా ఉండే పొడుగు దారినే ఎంచుకొనే వాళ్ళం. మామిడికాయలను కొట్టడానికి రాళ్ళు రువ్వుతూ, సామాన్యంగా జీవిత నూతన అనుభూతుల కోసం మా కుతూహలాన్ని తృప్తి పరుచుకుంటూ అక్కడ మేము తీరికగా తాపీగా నడిచేవాళ్ళం.

ఈ రోడ్డు మీద, ఏటవాలుగా ఉన్న చోట ఎక్కి కుడివైపుకు తిరిగితే చాలు, సుబ్రహ్మణ్య సామి దేవాలయం ఉంది. అది ఓ చిన్న గుట్ట మీద పెంకులతో కట్టిన కప్పుతో కేరళ పద్ధతిలో నిర్మితమై ఉంది. దేవళం సరసనే ఒక పెద్ద ఆకుపచ్చ కోనేరు ఉంది. దాని వైపుకి దారితీసే నాలుగు వైపుల నుంచీ ముతక నల్లరాళ్ళతో చేసిన మెట్లున్నాయి. భక్తులు ఆ కొలనులో స్నానం చేస్తారు; పర్వదినాల్లో ఆ దేవతామూర్తిని దానిలో స్నానం చేయిస్తారు. కోనేటికి అనతి దూరంలోనే ఉన్న చిన్న పెంకుటింట్లో సకుటుంబీకుడై ఆ గుడి పూజారి ఉంటాడు. శ్రీనివాసు ఆ పూజారి కొడుకు. అతను తన తల్లిదండ్రులతోనూ, అందమైన సోదరితోనూ కలిసి అక్కడ ఉంటాడు.

పూజారి కర్ణాటక నుంచి వచ్చిన ఒక తుళూ బ్రాహ్మణుడు (Tulu Brahmin). తుళూలు లిపి లేని ఒక భాషను మాట్లాడతారు; దానిని వాళ్ళు కర్ణాటక రాష్ట్ర భాష అయిన కన్నడంలోనే సామాన్యంగా రాస్తారు. వాళ్ళలో బ్రాహ్మణుల్ని కేరళలో 'పోటీలు' (Potis) అని అంటారు. వాళ్ళు మంచి వంటగాళ్ళు. "పాటీ హోటల్" అనేది శాకాహారశాలకు పర్యాయపదమే.

ఓ రోజున, నేనూ శ్రీనివాసూ స్కూలు నుంచి బరువుగా కాళ్ళను ఈడ్చుకుంటూ తిరిగి వస్తూండగా, శ్రీనివాసు నన్ను వాళ్ళింట్లోకి రమ్మని పిలిచాడు. వాళ్ళ ఇంటి ప్రాకారం లోపల నెమళ్ళున్నాయి కనక అతను నాతో "నువ్వు నెమళ్లను చూడవచ్చు" అని అన్నాడు. సరేనని నేను వెళ్ళాను. ఆ తోట చాలా అందంగా ఉంది. ఆకుపచ్చ జలాలతో ఉన్న ఆ కొలను చాలా అద్భుతంగా కనిపించింది. అక్కడ నిజంగానే పొడుగ్గా కాంతివంతమైన తోకలున్న చాలా నెమళ్ళున్నాయి. కొన్ని చెట్లమీద వాలి ఉన్నాయి; కొన్ని ప్రాకారం లోపల చుట్టూ తిరుగుతూ, గడ్డిలో మాకు కనిపించని

ఏవో వాటిని ముక్కుతో పొడుచుకొని తింటున్నాయి. ఒకటేమో అనేక వర్ణాలతో నిండిన తన తోకను విసనకర్రలాగ విప్పార్చి నాట్యం చేస్తోంది.

ఇంటిలోపల నుంచి, శ్రీనివాసు తండ్రిగారు బయటకు వచ్చారు. ఆయన శరీరం పుష్టిగా ఉంది; అందంగా ఉన్నాడు; పై బట్ట లేని ఛాతీ మీద అడ్డంగా జందెం వేసుకుని ఉన్నాడు. ఆయన మీగడవన్నె (Cream) పట్టు ధోతీని కట్టుకుని ఉన్నాడు. ఆయన జుట్టు నల్లగానూ పొడుగ్గానూ ఉంది; పెనవేసి ముడిపెట్టిన అది అతని మెడ వెనక వేలాడుతోంది. అన్నిటికన్నా ఆయనలో ఆకట్టుకొనే అవయవం ఆయన ముక్కు – జూలియస్ సీజర్‌కి ఉండేదని చెప్పుకునే విధంగా గరుడ పక్షికి మల్లే వంగిన వాడి ముక్కు, అతని నిశితమైన కళ్ళు ఒక నియంతకళ్ళ కన్నా తక్కువ క్రూరంగా లేవు. నిజం చెప్పాలంటే, (ఆయనను చూడగానే) నేను కొంచెం జడిశాను.

మా మిత్రుడు శ్రీనివాసు తూళూలో ఏదో చెప్పాడు. దాంట్లో నాకర్థమైంది నా పేరొక్కటే. ఇప్పుడు అతని తండ్రి నన్ను చాలా పట్టిపట్టి చూస్తున్నాడు; అతని వైఖరి భయంకరంగా ఉంది. "ముస్లిమ్‌వా?" అని అడిగాడాయన.

"అవును"

"ఊఁ, నెమళ్ళంటే ఇష్టమా నీకు!"

"అవును"

"సుబ్రహ్మణ్య దేవుడు నెమలిని వాహనంగా ఉపయోగిస్తాడు. నెమలి మీద ఆయన చాలా వేగంగా ఎగురుతాడు".

"ఆయన అలాగ చేయడం మీరు చూశారా?"

సమాధానం చెప్పేందుకు కొంత తటపటాయించాడాయన. "ప్రతివారూ అది చూడలేరు. మంచివాళ్ళూ పవిత్రులైన వాళ్ళూ మాత్రమూ చూడగలరు. కోవెలలో ఆయన మూర్తిని మేము ఆరాధిస్తాం".

"నేను చూడవచ్చునా?"

ఈసారి అతని ఆకృతి గంభీరంగా తయారయింది. ఆయన నిరాకరిస్తాడేమో అని సందేహించాను. ఓ నిముషం తర్వాత, ఆయన గట్టిగా నిట్టూర్చి నవ్వుతూ "ఎలాగూ నేనక్కడికి వెళుతున్నాను; రా, కానీ నువ్వు గర్భగుడికి అవతల నిలుచొని మాత్రమే చూడాలి. నన్ను తప్ప లోపలికి ఎవరినీ అనుమతించరు. సరేనా!" అని అన్నాడు.

శ్రీనివాసు ఇంట్లోకి వెళ్ళాడు. నేను పూజారితో వెళ్ళాను. ఆయన నన్ను హాల్లో

వదిలేసి గుళ్ళోకి వెళ్ళిపోయాడు. కొంతసేపైన తరవాత బరువైన (ముందు) ద్వారాన్ని తెరిచాడు. నేను నిలుచున్న దగ్గర్నుంచి, రెండువైపుల బహు చిన్న మూర్తులున్న ఒక చిన్న మూర్తిని చూడగలిగాను నేను. ఆ మందమైన కాంతికి నా కళ్ళు అలవాటు కాగానే, నెమలి మీద కూచున్న పడుచు సుబ్రహ్మణ్యుడి స్పష్టమైన ముఖాన్ని చూశాను. ఒక చేతిలో ఈటెను పట్టుకున్నాడాయన; రెండో చెయ్యి ఆశీర్వాదముద్రతో పైకి లేచి ఉంది. అతని కుడి ఎడమల్లో అందమైన అమ్మాయిల మూర్తులున్నాయి.

నేను తరచూ ఊహించుకునే విధంగా అతి చిన్న తప్పుకే మొహం ముడుచుకొని నిప్పులు చెరిగే గుబురు గెడ్డపు దైవంగా కాకుండా దానికి పూర్తిగా వ్యతిరేకంగా సుబ్రహ్మణ్యుడు నున్నగా క్షౌరం చేసిన ఆనందమయ ముఖంతో ఉన్నాడని చూసి నేను చాలా ఆనందించాను.

"ఆయన చేతిలో ఉన్న ఆ ఆయుధమేమిటి?" అని నేను అడిగాను.

"వేల్ – మానవజాతిని రక్షించడానికి ఈటెలాటిది" ఆయన చెప్పారు.

"అటూ ఇటూ ఉన్న ఆ స్త్రీలెవరు?"

"(ఆయన) భార్యలు" – ఆ పొడుగాటి పూజారి కళ్ళల్లో మిణుకుమిణుకుమని మెరుస్తూండగా "ముస్లింలలాగ, మా దేవుళ్ళకు భార్యలెక్కువ మందే ఉంటారు" అని కొసరుతూ అన్నాడాయన. ఆ చివరి వ్యాఖ్య నాకర్థం కాలేదు. ఎంచేతనంటే ముస్లింలు ఒకసారి కన్నా ఎక్కువసార్లే పెళ్ళి చేసుకోవచ్చునన్న మాట నాకు తెలియదు. కానీ ఆయన మాటను పట్టించుకోలేదు నేను. ఆయన నా చేతుల్లోకి విసిరిన అరటిపండు తిన్నాను. ఆయనిచ్చిన పవిత్ర విభూతిని ఏం చేయాలబ్బా అని విస్తుపోయాను. "దానినీ తినవచ్చు" అని పూజారి అన్నారు. "ముస్లింలు దానిని నొసళ్ల మీద పూసుకోరు". ఆ విబూది పిసరును నేను నోట్లో వేసుకున్నాను.

బయటకు రాగానే, ఓ స్టీల్ గ్లాసులో కొంత కాఫీ పట్టుకొని ఉన్న శ్రీనివాసుని చూశాను. "మా అమ్మ నీకోసం చేసింది" అని అన్నాడనతు. ఆ కొలను దగ్గర నిలుచని రుచికరమైన దక్షిణభారత కాఫీని తాగాను. గ్లాసు తిరిగి ఇచ్చేసి నా తోవన నేను వెళ్ళిపోయాను. అక్కణ్ణించి అనతిదూరంలోనే ఇప్పటికీ మంచి మిత్రుడిగా ఉంటూన్న శాంతికుమార్ అనే మిత్రుడున్నాడు. నేను గుడిలోంచి ఇవతలకు రావడం చూశాడు. "నువ్వు గుడికి వెళ్ళావా?" ఆశ్చర్యం ధ్వనిస్తూండగా అడిగాడు అతను. "అవును, శ్రీనివాసు వాళ్ళింటికి రమ్మన్నాడు. దేవతామూర్తిని కూడా చూశాను" అని నేనన్నాను.

❈ ఒక హిమగిరి గురువర్యులకు శిష్యుడైన

ఆ సాయంత్రం మా అమ్మ వేస్తూన్న వేడివేడి దోశలూ రుచికరమైన సాంబారూ తింటూ "ముస్లింలకు ఎక్కువమంది పెళ్ళాలుంటారా?" అని అడిగాను. "అవును, ముస్లింలకు ఆ అనుమతి ఉంది" అని చెప్పిందావిడ. "కానీ మన కుటుంబంలో మూడు తరాల బట్టీ ఎవరికీ ఒక భార్యకన్నా ఎక్కువ భార్యలు లేరు" అని చాలా గర్వంగా వక్కాణించింది ఆవిడ. ఇద్దరు తల్లులుండడమనేది ఎంత తబ్బిబ్బుగా ఉంటుందో కదా అని చోద్యపడుతూ తినడం సాగించాను.

# 7. ఆరోహణానికి సిద్ధం కావడం

మిమ్మల్ని హిమాలయ ఔన్నత్యాలకు తీసుకు వెళదామని నేనెంతో ఆతురతతో ఉన్నా, నా భవిష్యత్తును తీర్చిదిద్దే ఏళ్ళు. కింది గుట్టల దగ్గర మరికొంతసేపు ఆగవలసే వస్తోంది. ఆ మహా ఆరోహణానికి తయారీలు చేసుకునే ముఖ్యమైన సంవత్సరాలివి.

మోడల్ హైస్కూలు నిజంగా సరదాలతో నిండిన గొప్ప విద్యానుభూతినిచ్చింది. (అక్కడ) చదువు చెప్పడం అంకితభావమున్న సుశిక్షిత అధ్యాపకుల చేతిలో ఉంది; దాని (చదువు) కన్నా నా శ్రద్ధేమో కళలు, శిల్పాలూ, వినోదాలూ, ఆటలచుట్టూ భ్రమించేది.

మాలో ఒక అల్పసంఖ్యాకవర్గం బొమ్మలు గీయడంలోనూ వర్ణచిత్రలేఖనంలోనూ వడ్రంగంలోనూ బాగా ముందంజ వేశారు (ఈ రోజుకీ బొమ్మలు గీయడం, రంగుల చిత్రాలను వేయడం నా ఇష్టమైన అలవాటే). ఫుట్‌బాల్, హాకీ ఆటలు కూడా బాగా సరదాగా ఉండేవి. మమ్మల్ని మేము రాటుదేరిన వాళ్ళమనుకొనే కొంతమందిమి ఇసుక తిన్నెల్లో చెడుగుడు ఆడేవాళ్ళం. చెడుగుడులో ఎక్కువగా ఒకళ్ళొకళ్ళను చేతులతో తోసుకోడం, లాక్కోడం లాటి శరీర సంబంధమైన పెనుగులాటలుంటాయి; కలరీలోను జు-జిట్సూ (Ju-Jitsu) లోనూ నిపుణుడైన మా నాన్న దగ్గరనుంచి నేను నేర్చిన, దగ్గరదగ్గరగా ఉండి చేసే కయ్యాల పద్ధతులను ప్రదర్శించడంలో నేనానందించేవాణ్ణి. సరైన పద్ధతిలో నీకన్నా రెండింతల పరిమాణమున్న కజ్జాకోరుని కూడా నిలవ తొక్కుకోనీయకుండా స్తంభింపజేయచ్చు. నా ద్వంద్వయుద్ధ పటిమల వల్లా, బలహీనుల్ని జగడాలమారుల నుంచి రక్షించాలనే నా పక్షపాతం వల్లా, మంచిని చేయాలనే ఉద్దేశమున్న ఒక సంరక్షక వర్గం అప్పుడే నా చుట్టూ పెరగడం మొదలైంది.

నేను పెరుగుతూన్న కొద్దీ, కొత్త ప్రపంచం గురించిన జ్ఞానం నాముందు విప్పారుతోంది. పాతపురాణాలూ సాంప్రదాయికమైన స్థిరభావనలూ నెమ్మదిగా వదిలిపోతున్నాయి. మాటవరసకి, స్కూలుకు దగ్గరగా ఇళ్ళున్న వాళ్ళు తప్పించి, చాలామంది పిల్లలు తరగతి గదులకు సుదూరంగా ఉన్న సామూహిక భోజనశాలలుగా చెప్పుకొనే చోట కలిసి కూర్చునేవాళ్ళు.

(అవి) చాలా ఏళ్ళ క్రితం తరగతి గదులుగా ఉండేవి, ఇప్పుడు వాటిని వదిలి వేశారు. సమయం గడిచిన కొద్దీ అవి శిథిలమైపోయాయి. లోపల, తేళ్ళూ, రోకలిబండలూ (Centipedes), ముట్టుకుంటే చుట్టచుట్టుకుపోయే పెద్దపెద్ద గొంగళి పురుగులూ తరచుగా కనబడుతూ ఉంటాయి. చాలాచోట్ల ఆ గోడలకు పెద్దపెద్ద

పగుళ్ళున్నాయి; సిమెంటునేల అక్కడక్కడ పాడైపోయి ఉంది. అక్కడ కుర్చీలూ బల్లలూ లేవు కాని, అవతల మూల నీటి కుళాయి ఒకటి ఉంది.

పర్యవేక్షించే ఉపాధ్యాయులు ఉండరు కాబట్టి భోజన సమయాలు మాకు పెద్ద తెగువ చేసేవేళలయ్యాయి. తల్లులు చిన్నచిన్న అల్యూమినియం టిఫిన్ డబ్బాల్లో సర్దిన మా భోజనాలను మేము తెచ్చుకొనేవాళ్ళం. మా అమ్మ నన్ను బలంగానూ తెలివిగానూ తయారు చెయ్యడానికి కావలసిన మాంసకృత్తులుండాలని నా టిఫిన్ బాక్సులో మెదడు మసాలా, కాలేయం వేపుడూ, మూత్రపిండాల వేపుడూ, చేపల వేపుడూ, ఆమ్లెట్టూ మొదలైనవన్నీ పెట్టి ఎంత వీలైతే అంత నిండుగా నింపి కట్టిచ్చేది. తగిన పౌష్టిక ఆహార విషయంలో మాంసానికీ చేపలకూ ప్రత్యామ్నాయమేమీ లేదని ఆవిడ నమ్మకం.

ఆ రోజుల్లో నా దగ్గర స్నేహితుల్లో చాలామంది పాల్ఘాట్ అయ్యర్లు – వాళ్ళు తమిళమూలం ఉన్న బ్రాహ్మణులు; వాళ్ళ పూర్వీకులు పాల్ఘాట్ సరిహద్దు ప్రాంతాల్లో ఉంటూ తర్వాత కేరళలోని ఇతర ప్రదేశాలను వలస వెళ్ళారు. వాళ్ళు బుద్ధి కుశలతకూ, కష్టాల నుంచి తెలివితోనూ యుక్తితోనూ బయట పడగలిగే నేర్పుకూ పెట్టింది పేరు. అంచేత ఈ బ్రాహ్మణులు తరతరాల కొద్దీ ముఖ్యమైన పరిపాలనా స్థానాల్నీ సాంస్కృతిక, బౌద్ధిక పదవుల్నీ అలంకరించేవాళ్లు. వలస వచ్చిన ఆ భూమి తాలూకు సంస్కృతిలో ఎంతగా మమేకమయ్యారంటే వాళ్ళు ఇళ్ళల్లో మాట్లాడుకొనే తమిళ భాష కూడా మలయాళ మాండలికంలాగ ధ్వనిస్తూ ఉంటుంది. వాళ్ళు తమను తాము మలయాళీలుగా చెప్పుకోడంలో మహా గర్వాన్ని పొందేవాళ్ళు.

ఈ నా స్నేహితులు – శంకర నారాయణన్, అనంతనారాయణన్, విశ్వనాథ అయ్యర్, వెంకటేశ్, కృష్ణమణి మరికొంతమంది – నన్ను వాళ్ళ వర్గంలో ఒక భాగంగా ఓ విధంగా దత్తత చేసుకున్నారు. మా భోజన సమయంలో మా టిఫిన్ బాక్సులు పట్టుకుని కూచునేవాళ్ళం; కథలను చెప్పుకుంటూ, మహా వినోదంతో అన్నాలు తినే వాళ్ళం.

అప్పుడప్పుడు, ఈ అబ్బాయిల్లో ఒకడు గానీ యింకా కొంతమంది గానీ నా టిఫిన్ బాక్సులోంచి వచ్చే మసలాల ఘాటు వాసనలకు ఆకర్షితులై, దానిలోకి తొంగి చూసేవాళ్ళు. లోపల ఏముందో నేను వివరించగానే భీతితో వెనక్కి జంకేవాళ్ళు. అయితే వాళ్ళు నావైపు ఏ వ్యతిరేక భావాన్నీ కనబర్చలేదు; వాళ్ళ విషయంలో ఇది పొగడవలసినదే. మేమెంతగా సన్నిహిత మిత్రులుగా ఉన్నామంటే వాళ్ళు నాతోబాటే కూచోడం కొనసాగిస్తూ వాళ్ళు వాళ్ళ మితంగా తిండిని తింటూ ఉండేవాళ్ళు.

నేను వాళ్ళ సరళమైన తిండి పదార్థాల జాబితాను ఆశ్చర్యంగా పరిశీలించేవాణ్ణి. దాంట్లో తప్పకుండా పెరుగన్నం, కూర, ఊరగాయి; ఒక్కోసారి ఇడ్లీ, చెట్నీ లేకపోతే సాంబారూ – అన్నీ పూర్తిగా శాఖాహారాలే ఉండేవి. అవిచ్ఛిన్నంతగా చాలా కాలం మళ్ళీమళ్ళీ అదే సాదా శాఖాహార భోజనం. సాంవత్సరిక పరీక్షల ఫలితాలు గానీ, మధ్యకాలీన పరీక్షల ఫలితాలు గానీ ప్రకటితమైనప్పుడు (మాత్రం) వాళ్ళు లెక్కల్లోనూ సైన్సులోనూ అత్యధికమైన మార్కులను సంపాదించేవాళ్ళు; నేనూ, నా మరో స్నేహితుడు సిద్దిఖీ మాత్రం బొటాబొటీగా (పాసు మార్కులను) గోకినట్టు తెచ్చుకొనేవాళ్ళం.

ఒకరోజు పొద్దున్న మా అమ్మ ఎంత ఎక్కువగా కుక్కగలిగితే అన్నన్ని వేపుడు చేపముక్కలూ, అన్నం, చేప కూరా టిఫిన్ బాక్సు పట్టగలిగినంతగా కూరి నా భోజన సామగ్రిని కట్టి ఇస్తూన్నప్పుడు "అమ్మా! ఆహారం గురించిన నీ ఉద్దేశాలన్నీ పూర్తిగా అర్థరహితాలే. పెరుగన్నం, ఊరగాయీ నీ మత్స్యమాంసాలతో సమానంగానే మేధస్సుని నిర్మించగలవు" అని అన్నాను. ఆవిడ మాత్రం ఏ మాత్రమూ ఈ విషయాన్ని ఒప్పుకోలే దనుకోండి. నేను ఇంకా వాదించడం కొనసాగిస్తూంటే, ఆవిడ, మన పూర్వీకులైన పఖ్తూన్‌లు (Pakhtoons) మాంసం తిన్నారు కనకనే బలంగా ఉండేవారని కొసరి చెప్పింది.

నేను ఒప్పుకోలేదు. అప్పటి నుంచీ ఆహారం గురించి నా భావాలు మార్పును చెందాయి. తగిన పుష్టి అవసరమని నేనూ నమ్ముతాను కానీ, కేవలం శాఖాహారం కూడా ఆ పనిని చెయ్యగలదు. ఇష్టముంటే మాంసం తినవచ్చు కానీ, అది వినా మానవ శరీరం నిలవలేదని చెప్పడం మాత్రం సరైన మాటకాదు.

నా జీవితాన్ని ప్రభావితం చేసిన కొంతమంది అధ్యాపకుల గురించి చెప్పడం మాత్రం నేను మరువకూడదు. ఆ జాబితాలో ప్రథమ స్థానంలో ఉన్నవారు మా హెడ్మాస్టర్‌గారు టైగర్ కుట్టాన్ పిళ్ళై; ఆయన మాకు క్రమశిక్షణను నేర్పారు. అయితే, ఆయన "బెత్తాన్ని వదిలితే పిల్లవాణ్ణి పాడు చేసినట్టే" అనే సూక్తిని నమ్మినవారే. ఇతరుల్లో (ఈ జాబితాలో) కలపవలసిన వాళ్ళు ఆక్స్‌ఫర్డులో శిక్షితుడై మాకు ఇంగ్లీషు లోని మాటల అర్థాల్లోని సూక్ష్మ మర్మాల్ని సైతం బోధించగల అధ్యాపకుడు జార్జిగారు, నిజానికి సైన్సు ఉపాధ్యాయుడైనా, కోనన్ డాయిల్ రాసిన "హౌండ్ ఆఫ్ ది బేస్కర్‌విల్స్" (Hound of the Baskervilles) ని నాటకీయంగా ప్రదర్శించి నా స్మృతిపథంలో చెక్కినట్టు చెరగని ముద్ర వేసిన హరిహరన్ అయ్యర్‌గారూ; గణితం బొత్తిగా ఎక్కని నా బుర్రలోకి ఏదో విధంగా గణితాన్ని ఎక్కించడంలో కృతకృత్యులైన గోపాలకృష్ణన్

అయ్యర్‌గారూ; సంక్లిష్టమూ చిక్కులతో కూడినదీ అయిన ఈ జీవితం ఏకకణ జీవి నుంచి ప్రారంభమయిందన్న యథార్థానికి మొట్టమొదటిసారిగా నా కళ్ళు తెరిపించిన మా జీవశాస్త్ర అధ్యాపకుడు టార్బాస్ దామోదరన్ పిళ్ళై గారూ; ఎప్పుడూ తెలుపు బట్టలతోనూ మడతలు నలగని బట్టలతోనూ కనిపించడంతో 'ఇస్త్రీ పెట్టె' అనే ఎగతాళి పేరును పొందిన ఎన్‌సీసీ సేనాధిపతీ, సాంఘిక శాస్త్ర అధ్యాపకులు అయిన మాధవన్ నాయర్ గారూ; తొమ్మిదో క్లాసులో మా క్లాసు టీచరూ సుమారు విచిత్రమైన ఆగమశక్తితో (Intuition) నా జీవితంలో చాలా ఇష్టపడే సత్యాన్వేషణ, లేకపోతే, భగవంతుడూ, లేకపోతే దాన్నే పేరుతో పిలిస్తే అదీ అని జోస్యం చెప్పిన నాయకం గారూను.

మా తరగతి భారాన్ని (నాయకం గారు) తీసుకున్న మొదటి రోజున, తనను తాను సంక్షిప్తంగా పరిచయం చేసుకున్నారాయన. మాలో కొంతమంది మా వాలు రాతబల్ల వెనక సగం అణచుకున్న నవ్వుతో ఆయనను చూస్తున్నాం: ఎంచేతనంటే నుదుటికి అడ్డంగా ధూసరవర్ణంలో బూడిద గీతలు గీసుకొని మా కంటబడ్డ మొదటి క్లాసు టీచరు ఆయన. తాను శివదేవుణ్ణి నమ్మినవాణ్ణనీ, భస్మాలు శివుడి చిహ్నామనీ ఆయన మాకు చెప్పాడు, త్వరలోనే, మా చర్చ మతంవైపుకు మళ్ళింది. కొంతసేపై తరవాత ఆయన మాలో ఒక్కొక్కరిని లేచి నిలుచోమని మేము భగవంతుణ్ణి నమ్ముతున్నామా లేదా అనే దానిని రూఢిగా చెప్పమన్నాడు. ఒకడు తప్పించి అందరూ భగవంతుణ్ణి నమ్ముతామని చెప్పారు. నేనే ఆ మినహాయింపుని. "నేను భగవంతుణ్ణి నమ్మను" అని అన్నాను నేను. "ఎందుకని?" అని అడిగారు నాయకం గారు. "ఎందుకని (నమ్మాలి) సార్? నేను భగవంతుణ్ణి చూడలేదు; నాకే ప్రమాణమూ లేదు. ఎప్పుడైతే (చూడడం) జరిగిందో, అప్పుడింక నేను నమ్మవలసిన పని లేదు. వాస్తవాలకు నమ్మకాలు అనవసరం" అని నేనన్నాను.

స్వల్ప నిశ్శబ్దం తరవాత ఆయన అన్నాడు: "నాకు ఏ దేవుణ్ణీ నమ్మని ఓ సహాధ్యాయి ఉండేవాడు – ముప్పై ఏళ్ళ తరవాత, గుండు గీసుకొని కాషాయ వస్త్రాలు కట్టుకున్న అతనిని చూశాను. రామకృష్ణ వర్గంలో అతనొక సన్యాసి అయ్యాడు. అంచేత మేము అర్థం చేసుకోగలం (నీలాటి వాళ్ళను). భగవంతుడి కోసం నువ్వు చేసే అన్వేషణకి ఇది ప్రారంభం కావచ్చు. నీ నిజాయితీకి నేను సంతోషిస్తున్నాను. నీ పేరేమిటి?" నేను నా పేరు చెప్పగానే ఆయన గాభరా పడ్డట్టు కనిపించాడు. నా మతవర్గానికి చెందిన కుర్రాడు తాను భగవంతుణ్ణి నమ్మనని చెబుతాడని బహుశా ఆయన భావించి ఉండడు. సుమారు ప్రతి రాత్రీ నా అంతరంలో ఏం జరుగుతోందో

ఆయనతో పంచుకుందామని ఆకాంక్షించాను గానీ, నా అనుభవాలను ఎవరితోనైనా పంచుకోవడాన్ని ఏదో ఒక వివరించరాని శక్తి నిరోధిస్తూ ఉండేది.

చెబుతున్న వరసలో చివరివాడైనా, ప్రముఖతలో ఏ మాత్రమూ తక్కువ కానివాడు కుట్టన్ ఆచారి గారు. ఆయన సాంఘిక శాస్త్రమూ, బొమ్మలు గీయడం, రంగుల చిత్రాలు వేయడం, కొద్దిగా వడ్రంగమూ నేర్పేవాడు. కానీ దీనికన్నా కూడా ఎక్కువగా చెప్పుకోదగిందేవిటంటే పాఠశాల నాటక నటవర్గాల వెనకనున్న స్ఫూర్తీ ఉద్దీపనమూ ఆయనే అని. ఆయన మార్గనిర్దేశనంలో ఇంగ్లీషు, మలయాళం నాటకాలు ప్రదర్శితాలయ్యేవి. ఇంగ్లీషు మీడియం పిల్లలమైన మేము షేక్స్పియర్ రాసిన 'మర్చంట్ ఆఫ్ వెనిస్' (Merchant of Venice) లోని న్యాయస్థాన సన్నివేశాన్ని అభినయించాం. నేను ఏంటోనియో పాత్రను వేశాను. షైలాక్‌గా కెవిన్ ఫెర్నాన్డిజ్ ఎంత బాగా నటించాడంటే రాష్ట్ర యువకుల ఉత్సవంలో ఆ నాటకాన్ని ఎన్నిక చేశారు; పురస్కారాలను గెలుచుకోవడం జరిగింది. కెవిన్ ఫెర్నాండెజ్ తరవాత ఆర్మ్‌డ్ ఫోర్సెస్ వైద్య కళాశాలలో చేరాడు; ఎయిర్ కామొడోర్‌గా రిటైరయ్యాడు.

స్వభావరీత్యా స్నేహపూర్వకంగా ఉండేవాణ్ణి కనక నాకు స్కూల్లో చాలా మిత్రులుండేవాళ్ళు. కానీ వారిలో కొంతమందితో నేను ప్రత్యేక సాన్నిహిత్యాన్ని కలిగి ఉండేవాణ్ణి. వాళ్ళలో ఒకడు సిద్దీఖీ. అతను గుజరాతీ మాట్లాడే మెమాన్. అతని పూర్వీకులు పోరుబందర్ నుంచి వచ్చారు. అతని తాతగారు అబ్దుల్లా ఇబ్రహీమ్. త్రివేండ్రంలోని చెలై బజారులో అతిపెద్ద టోకు బట్టల షాపుకి ఆయన యజమాని. ఆయన వేలాడే తెల్లగెడ్డంతోనూ నిష్ఠుర లక్షణాకృతులతోనూ పాత నిబంధన (బైబిలు) తాలూకు ప్రవక్తలాగ ఉంటారు. సిద్దీకీయే బహుశా అనారోగ్యంగా సన్నగా బలహీనంగా ఉండేవాడు. ఆ వయస్సులోనే తీవ్రమైన కంటిరోగంతో బాధపడేవాడు. రమారమీగా ఒక కన్ను గుడ్డిగా కాబోతోంది. అతనికి నేను స్నేహితుడవడానికి కారణం స్కూల్లోని జగడాలకోరుల నుంచి అతనికి సంరక్షణ కావాలని నేననుకోవడమే.

అతను తన తల్లిదండ్రులతోనూ అక్కగారితోనూ ఉండేవాడు. వాళ్ళిళ్ళు మా ఇంటికి పెద్ద దూరమేమీ కాదు. అతనింటికి నేను తరచు వెళ్ళేవాణ్ణి. అలాగ అతని అమ్మగారితో ప్రేమపూర్వక సంబంధాన్ని పెంపొందించుకున్నాను. ఆవిడ నాకు తినిపించడానికి చూసేది. (నా అంతర్జీవితం గురించి ఒక్కమాట కూడా చెప్పక పోయినా) ఆవిడ నా మానసిక ప్రవృత్తిలో ఏదో కనిపెట్టి నన్ను సూఫీ మహాత్ముల కథలతోనూ రోగాలను నయంచేసే వాళ్ళ కథలతోనూ సమ్మోహపరుస్తూ ఉండేది.

సెలవులప్పుడు సిద్దీకీ తరచుగా ముంబయికి వెళ్ళేవాడు. ఆ మహా ఆకర్షణీయమైన ముంబయి పట్టణం గురించిన కథలనూ, నిషిద్ధ సుఖాలనూ వినడానికి అతని పునరాగమనం కోసం నేను ఆత్రుతతో ఎదురు చూసేవాణ్ణి. అతను ఆ నిషిద్ధ సుఖాలను గొప్ప కళానైపుణ్యంతో చెప్పడంలో బాగా కుశలుడు. హిందీ సినిమాల నాయికా నాయకులు, డబ్బు తీసుకొని రాత్రిని గడిపే స్త్రీలు, ఆ గొప్ప తాజ్‌మహల్ హోటల్, గేట్ వే ఆఫ్ ఇండియా – ఇవి సిద్దీకీకి ఇష్టమైన విషయాల్లో కొన్ని. అనంత నారాయణ్, నేనూ ఆ కథలను మా కౌమార చిత్తాలకు బాగా ప్రేరేపకంగా ఉన్నాయని అనుకునేవాళ్ళం.

ఇదిగాక మరో చిన్నదీ, అంత అముఖ్యంగానిదీ అయిన సానుభూతిపరమైన అంశమొకటి ఉంది. నాకూ సిద్దీకీకి మా యిద్దరికీ సాంబారూ (చిక్కుడు గింజల్లాటి గింజలూ, కూరగాయలతో తయారయ్యేది) ఇడ్లీ అంటే ఇష్టం. మా అమ్మకు ఇడ్లీ సాంబార్లు చేయడంలో నైపుణ్యం ఉన్నా, అంతకన్నా ఎక్కువ నైపుణ్యం మా స్నేహితుడు అనంత నారాయణ్ అమ్మగారికి ఉంది – ఆవిడ శాఖాహారీ, అతిథుల్ని ఆదరించడంలో గొప్పది. ఆవిడ తన కొడుకు ముస్లిమ్ మిత్రులైన మా ఇద్దర్నీ తన పూర్వాచార పరాయణ బ్రాహ్మణ గృహంలోకి నవ్వుతూ ఆహ్వానించేది; వాళ్ళ ఇష్టమైన తినుబండారాలను మాకు పరిపూర్ణంగా తినిపించేది; దానికి తోడుగా స్టీల్ గ్లాసులో కప్పుడు వేడి వేడి ఫిల్టర్ కాఫీని కూడా అందించేది ఆవిడ.

విశ్వనాథయ్యర్ గారి కొడుకు అనంత నారాయణ్‌కి కూడా ముంబయి పట్టణంతో సంబంధముండేది. అతని తండ్రి జీవిత భీమా సంస్థలో పనిచేసేవారు. ఆయన్ని అక్కడికి పోస్టు చేశారు. అంచేత ఆరో తరగతి వరకు అతను ముంబయిలో చదివాడు; త్రివేండ్రం (భీమా) శాఖకు బదిలీ చేయడంతో విశ్వనాథ అయ్యర్‌గారు తన కుటుంబంతో త్రివేండ్రానికి రావలసి వచ్చింది.

స్వాదిష్టమైన భోజనమో లేకపోతే, సరిగ్గా తగినట్టుగా "సువర్ణ" (బంగారం) అని పేరున్న అతని అక్కవైపు నాకేర్పడిన ఆకర్షణో, లేకపోతే రెండూనో, నన్ను అనంత నారాయణ్ ఇంటికి తరచుగా వెళ్ళడానికి ప్రలోభపెట్టేవేమో మరి నాకు తెలియదు. బ్రాహ్మణ కుటుంబం గురించిన చాలా విషయాలు నేను తెలుసుకున్నాను. మాటవరసకు, వాళ్ళమ్మ బయట చేరినప్పుడు ఆవిడను వంటింట్లోకి రానివ్వరనే విషయం. విశ్వనాథ అయ్యరు గారు మెరుగైన వంటవాడు కనక ఆ సమయంలో భోజనం మరింత రుచికరంగా ఉండేది.

వీటినన్నిటినీ పక్కనుంచి, తరవాత నా ఆధ్యాత్మిక జీవితంలో నిగూఢ ప్రాముఖ్య మున్న సంఘటన ఒకటి, జీవిత భీమా సంస్థలో టైపిస్టుగా ఉన్న విశ్వనాథ అయ్యర్ గారి నిరాడంబరమైన చిన్న ఇంట్లో జరిగింది. ప్రత్యేకంగా ఆరాధన కోసమనే, వాళ్ళింట్లో పూజగది అని ఒకగది ఉండేది. దాంట్లో చాలా హిందూ దేవతల బొమ్మలుండేవి. వాటి విలక్షణతలను (నాకు) చాలా ఓర్పుతో వివరించడం జరిగింది. ఆ గోడ మీద ప్రముఖమైన స్థానాన్ని ఆక్రమించిన అన్నిటికన్నా పెద్ద బొమ్మ ముస్లిం ఫకీర్‌లాగ అనిపించే ఒక మనిషిది - ఆయన చిరిగిన బట్టను కట్టుకొని ఉన్నారు; అతని తలచుట్టూ అపూర్వ రీతిలో ఒక గుడ్డ చుట్టబడి ఉంది.

1918లో మరణించిన షిర్డీ సాయిబాబా చిత్రం మీద నా కళ్ళు మొదటిసారిగా నిలిచినది అప్పుడే. ఇక్కడ ఈ బ్రాహ్మణ కుటుంబంలో ఆ ఫకీరుకు హిందూ దేవతలకిచ్చిన గౌరవాన్నిచ్చేవాళ్ళు. ఆయనను స్తుతి చేస్తూ పాటలు పాడేవారు, గంటలు మోగించేవారు, హారతి ఇచ్చేవారు. నా ఆసక్తి బాగా రేకెత్తేది. గురువారం షిర్డీ సాయిబాబాకు ప్రత్యేకమైన రోజు. చాలా గురువారాల్లో నేనూ ఆ గానంలో కంఠం కలిపేవాణ్ణి, హిందీలో నా ప్రప్రథమ భజన కూడా రాశాను: "హే ప్రభు, హే సాయినాథ్" (అంటూ). నాకు విశ్వనాథ్ అయ్యర్ గారు సంక్షిప్తంగా షిర్డీ సాయిబాబా జీవితం గురించి చెప్పారు. ఆయన భగవంతుడే అన్న తన విశ్వాసాన్ని వ్యక్తీకరించాడు. నేను విని విస్తుపోయాను.

ఒక రాత్రి బాహ్య ప్రేరేపణలేవీ లేకుండానే దానికదే కుదిరే గాఢమైన ధ్యానంలో నేనుండగా రివాజుగా కనిపించే నా హృదయంలోని కాంతి నుంచి షిర్డీసాయిబాబా రూపం ఉద్భవించి నా ముందు నిలిచి, తరవాత అది, దానికదే పనసచెట్టుకింద కనిపించిన విచిత్రయోగి రూపంలోకి మారిపోయింది. ఇది ఎవరికీ తెలియదు. అలవాటు మాదిరిగానే నా అనుభవాన్ని ఎవరికీ చెప్పలేకపోయాను. ప్రస్తుతానికి షిర్డీసాయిబాబాతో నా బాంధవ్యానికి సంబంధించిన కథనూ, నేను మొట్టమొదటి సారిగా షిర్డీనెలాగ చూశానన్న విషయాన్ని చెప్పడాన్నీ వాయిదా వేస్తున్నాను. తగిన సమయం వచ్చినప్పుడు చెబుతాను.

కేరళలోని త్రిచూర్ దగ్గరున్న గురువాయూర్ కృష్ణాలయంలో నా ప్రవేశ విషయంలో కూడా విశ్వనాథ అయ్యర్ పాత్ర ఉంది.

# 8. శ్రీ నారాయణ గురువు కథ

నాకింకా కొంతమంది సన్నిహిత మిత్రులున్నారు - డాక్టరైన నారాయణ ప్రసాద్, జకరయ్య, అతని సోదరుడు మామెన్ జకరయ్య. ఈ జకరయ్యల తండ్రి ఒక క్రైస్తవ ధర్మోపదేశకుడు. జకరయ్య కూడా డాక్టరయ్యాడు. విదేశంలో స్థిరపడ్డాడు. తర్వాత, తొల్లిటి యూఎస్ ప్రెసిడెంట్ జార్జి డబ్ల్యు బుష్‌కి వ్యక్తిగత హృద్వ్యాధి నిపుణుడయ్యాడు; రిపబ్లికన్ పార్టీకి నిధిని కూడబెట్టేవాడు కూడా అయ్యాడు. ఇంకా మోహన్‌దాసు, సుధీర్, వెంకటేశ్ (ఇతను ఆ సమయంలోనే తనను తాను శాస్త్రజ్ఞుడిగా ఊహించుకునే వాడు) మొదలైన వాళ్ళున్నారు. ఆ రోజుల్లో నాతో ప్రత్యేకమైన బాంధవ్యమున్న వాడు మాత్రం రంజిత్ సదాశివన్.

ఆయన మోడల్ హైస్కూల్లో తొమ్మిదో తరగతిలో చేరాడు. అతను బి సెక్షన్లోను, నేను ఎ సెక్షన్లోను ఉండేవాళ్ళం. కానీ మేం కలుసుకున్న దగ్గర్నుంచి మా మధ్య పరస్పర ప్రేమా ప్రశంసలూ ఉండేవి; అవి కాలంతో పెరిగేయి. అతను సుదృఢ దేహమున్న ధైర్యవంతుడు. ఏ రకమైన బెదిరింపులూ అతనిని భయపెట్టలేవు. అతను అన్యాయమనుకుంటే చాలు, దెబ్బలాడడానికి సిద్ధమవుతాడు. అతను సైనిక స్కూలు - అంటే సైనికవర్గం నడిపే స్కూలు నుంచి వచ్చాడు. అతని ద్వారానే నేను, (పెద్దైన తరవాత) ఎయిర్ కామొడోర్ అయిన వేలాయుధన్ నాయర్‌తోనూ, వైస్ ఎడ్మిరల్ అయిన మాధవన్ నాయర్‌తోనూ, ఎయిర్ వైస్ మార్షల్ అయిన రాధాకృష్ణన్‌తోనూ, వింగ్ కమాండర్ హోదా వచ్చిన తరవాత స్వచ్ఛందంగా ఉద్యోగ విరమణ చేసి, ఇండియన్ మిలిటరీ అకాడెమీలోకి ప్రవేశించడానికి ఆకాంక్షించే యువకులకు ఒక శిక్షణ పాఠశాలను ప్రారంభించిన మోహన్ చందూతోనూ స్నేహాన్ని పెంపొందించు కున్నాను.

రంజిత్, ఈజవా (Ezava) వర్గం నుంచి వచ్చినవాడు. ఆ కులం వాళ్లు 150 ఏళ్ళ క్రితం సంఘ శ్రేణిలో అట్టడుగు మెట్టుమీద ఉండేవాళ్ళు. మహానుభావుడైన శ్రీ నారాయణ గురుస్వామి గారి స్ఫూర్తితోనూ ఆశీస్సులతోనూ ఈజవాలు తమ అధమ స్థాయిని విడిచిపెట్టి విజయ నిశ్రేణికను ఆరోహించగలిగారు. నేను చెబుతున్న సమయానికి, వాళ్ళు చాలా ధనవంతులూ విద్యావంతులూ అయి సాంఘికంగానూ రాజకీయంగానూ ఆశించదగిన స్థానంలో ఉన్నారు.

శ్రీ నారాయణగురువు ఒక ఈజవా కుటుంబంలో 1854 ప్రాంతంలో త్రివేండ్రం పట్టణానికి శివార్లలో ఉన్న చెంపళన్తి (Chempazanthi) అనే పేరున్న గ్రామంలో పుట్టాడు. ఆయన తండ్రి మదన్ అసన్ పట్టి రైతే కాదు, ఖగోళ శాస్త్రంలోనూ ఆయుర్వేద

వైద్యశాస్త్రం లోనూ పారంగతుడైన పండితుడు కూడాను. ఆ గ్రామంలో అతనిని ఉపాధ్యాయుడిగా ఆమోదించారు. గ్రామస్థులు అతనిని 'ఆశన్' అని పిలిచేవాళ్ళు. 'ఆశన్' అనేది 'ఆచార్య' శబ్దానికి వాడుకలో వాడేమాట. అతనిని 'ఆశన్' అని పిలవడానికి కారణం అతను రామాయణ మహాభారతాలను వ్యాఖ్యానించి వివరిస్తూ ఉండడమే.

ఆ రోజుల్లో సంస్కృత విద్యను నంబూద్రి బ్రాహ్మణులు బహు ఉత్సాహంతో సంరక్షించేవాళ్ళనీ, అబ్రాహ్మణుల్ని వేదాధ్యయనం చేయకుండా అవరోధించేవాళ్ళనీ మనం గుర్తుంచుకోవాలి. ఏదేమయినా, వైద్యులు, అంటే ఆయుర్వేద వృత్తినవలంబించిన వాళ్ళు చరక, సుశ్రుత సంహితలనే వైద్యగ్రంథాలను అధ్యయనం చేయడానికి సంస్కృతం నేర్చుకొనేవాళ్ళు. కానీ, అంతకన్నా ముందుకు పోడానికి ఇతరులు ఒప్పుకొనేవాళ్ళు కారు. పదిహేనేళ్ళ ప్రాయంలోనే నారాయణుడు తన తల్లిని కోల్పోయాడు; ముప్పై ఏళ్ళప్పుడు అతని తండ్రి మరణించాడు. ఆ సమయానికి 'నానూ' అని అందరూ పిలిచే నారాయణుణ్ణి 'నానూ ఆశన్' (నానూ అనే ఆచార్యుడు) అని కొంతమంది సంబోధించేవారు. ఆయన భిక్షమీదే బతుకుతూ, చాలా నెలలకొకసారి మాత్రమే ఇంటికి వస్తూ ఉండేవాడు.

ఆయుర్వేద అధ్యయనాన్ని మించి చదవడానికి ధైర్యం చేశాడతను. వైదిక గ్రంథాలనూ వేదాంత గ్రంథాలనూ లోతుగా అవలోకించాడతను. అతని దగ్గరకు వచ్చిన కొంతమంది విద్యార్థులకు సంస్కృతం కూడా నేర్పాడాయన. ఛాందసవాదం, కింది వర్ణాల వారిని వేరుగా ఉంచాలని దబాయించి చెప్పినా, అందరినీ సమానంగా చూసే నానూకి, రామన్ పిళ్ళే ఆశన్ అనే ఒక అసాధారణ ఉచ్ఛ తరగతి సంస్కృత ఆచార్యుడు దొరికాడు. త్వరలోనే నానూ తనకు తాను అధ్యయనం చేసిన ఉపనిషత్తులే కాకుండా కవిత్వమూ, నాటకమూ, సాహిత్య విమర్శ, అలంకార శాస్త్రం కూడా చదువుకున్నాడు. అతను దక్షిణాన ఉన్న కన్యాకుమారి నుంచి ఉత్తరాన ఉన్న మంగుళూరు దాకా అధ్యయనం చేస్తూనూ, ధ్యానం చేస్తూనూ, తన చేతనత్వాన్ని పరిశోధించుకుంటూనూ విస్తృతంగా తిరిగాడు.

మరో ఇద్దరు అధ్యాపకులు నానూని ప్రభావితం చేశారు. ఒకతను కున్జన్ పిళ్ళె. ఇతనిని చట్టాంబి స్వామి (Chattambi Swami) అని కూడా అనేవాళ్ళు. సంస్కృత అలంకార శాస్త్రాన్ని బోధించే తరగతికి నాయకుడిగా ఉండేవాడతను. తరవాత తరవాత నానూ చేసే సంచారాల్లో అతన్ని చట్టాంబిస్వామి అనుసరిస్తూ

ఉండేవాడు. రెండోవాడు తమిళ మూలాలున్న తైకాడ్ అయ్యావూ (Tycaud Ayyavoo) అనే అతను. అతను త్రివేండ్రంలోని బ్రిటిషు వైస్‌రాయ్ ప్రతినిధి గారి బంగళాకు నిర్వాహకుడిగా ఉండేవాడు. అతని నుంచి, తమిళ ఆధ్యాత్మిక సంప్రదాయాల్లో భద్రపరిచి ఉన్న నిగూఢమైన యోగ బోధనలను ఇతను (నానూ) నేర్చుకున్నాడు. సారాంశమేమిటంటే, అతను త్వరలోనే తన చేతనత్వపు అగాధాల్లోకి మునక లేసినవాడిగా ప్రసిద్ధికెక్కాడు; ఉపనిషత్తులు ప్రవచించే సర్వవ్యాప్తమైన సదాత్మను కనుగొన్నవాడయ్యాడు.

ఒకవైపు ఆధ్యాత్మిక బోధనలూ మరోవైపు సాంఘిక సంస్కరణలూ పరిఢవిల్లడంలో అంతరనుభూతి వెల్లడయింది. ముఖ్యంగా అతని భార్య చిన్న జబ్బుతో మరణించిన తరవాత (వాళ్ళకు సంతానం లేదు), నానూ, కొంత అనుచర వర్గమున్న స్వతంత్ర సన్యాసి అయ్యాడు. అతనిని అందరూ శ్రీ నారాయణగురు అని పిలిచేవాళ్ళు. జనాలు వెళ్ళడం మానేసి పాడుబెట్టిన గుళ్ళను అతను నవీకరించడానికి సాయంచేశాడు. వాటిలో దేవతలను తానే ప్రతిష్ఠించేవాడు; అంతకుముందు ఆచారంలో లాగ దేవతా ప్రతిష్ఠలకు బ్రాహ్మణులను పిలిచేవాడు కాదు. ఒక గుడిలో దేవత లుప్తమయింది. దానిలో ఆ దేవతకు బదులుగా ఒక అద్దాన్ని ప్రతిష్ఠించి "మనిషీ! నిన్ను నువ్వు తెలుసుకో!" అనే వేదాంతప్రోక్తమూ సోక్రటీసు ప్రోక్తమూ అయిన ప్రథితోక్తిని నిరూపించాడు.

అల్‌వాయేలో ఒక ఆశ్రమాన్నీ, వర్కలాలో గుట్టమీద మరో ఆశ్రమాన్నీ నిర్మించాడు అతను. వర్కలా అనేది సముద్రతటంలో ఉన్న పట్టణం. త్రివేండ్రానికి కొద్దిదూరంలోనే ఉంది. దానిని శివగిరి అని పిలిచాడాయన. కేరళ చరిత్రలో మొట్టమొదటిసారిగా అబ్రాహ్మణులకు వైదిక విద్య ప్రారంభమయింది. శివగిరి ఆశ్రమం లోనేమో అన్ని వర్ణాల వాళ్ళకీ (వైదిక విద్య తలుపులు తెరుచుకున్నాయి) (నా సంచారాల్లో నేను శివగిరి ఆశ్రమంలో రెండు నెలలు గడిపాను).

గొప్ప వేదాంత సత్యాన్ని సరళమైన భాషలో వ్యక్తీకరిస్తూ ఆయన గానం చేశాడు-

**"తీరులో ఒకటే**
**విశ్వాసంలో ఒకటే**
**భగవంతుడిలో ఒకటే**
**ఈ మనిషి.**
**ఒకే రకమైన గర్భకోశగతుడితను**

**ఇతనిది ఒకే రూపం**
**ఎంతమాత్రమూ తేదాలు లేవు, లేవంటే లేవు"**

తన తోటివారిని తమ న్యూనతను పోగొట్టుకోమనీన్నూ అనంతోన్నతులకు పెరగమనీన్నూ ఉద్బోధించాడతను. 74 ఏళ్ళు వయసు వచ్చిన తరవాత 1928వ సంవత్సరం సెప్టెంబరు 20న ఆధ్యాత్మికమూ సాంఘికమూ అయిన ఆస్తులను ఉత్తమమైన ఉత్తరదాయిత్వంగా వదిలిపెడుతూ ఆయన మరణించాడు.

ఇక రంజిత్ విషయానికి తిరిగి వస్తే, ప్రమాదకర పరిస్థితుల్లో మిత్రుల్ని రక్షించే విషయంలో ఎదుర్కోడానికి అతనికున్న సామర్థ్యమే అతనంటే నాకు ఇష్టం ఏర్పడడానికి కారణమయింది. మేము కాలేజీ విద్యార్థులుగా ఉన్నప్పుడు యథాలాపంగా మేము ఎదుర్కొనే వీధి దెబ్బలాటల్లో కూడా, ముఖ్యంగా సంఘవిరుద్ధశక్తుల బాధలకు ఎర అయ్యే సభ్యమిత్రుల్ని రక్షించడంలో ఇది మాటిమాటికీ ఋజువయింది.

ఇదేగాక, శ్రీరామకృష్ణ పరమహంస వాడుకగా చెప్పే "ఆయత్తపరిచేవాడు"గా (Provider) అయ్యేవాడు రంజిత్. తరవాత, నేను నెమ్మదిగా ఏకాంత స్థలాలకూ జారుకుందామనుకునేటప్పుడు రంజిత్ ఆ నా పర్యటనలకు ద్రవ్యసహాయం చేసేవాడు. అదీగాక ఆ పర్యటనల్లో నేనెక్కడున్నదీ, నాతో ఏ విధంగా సంపర్కం చేయాలన్నదీ తెలిసిన ఒక్కగానొక్కడు అతను. తాను నాతో సంపర్కంలో ఉన్నాననీన్నూ ఏ అత్యవసర పరిస్థితిలోనైనా నన్ను వెనకకు తీసుకురాగలననీన్నూ చెబుతూ మా తల్లితండ్రులకు ఊరట కలిగించేవాడు అతను. ఏ ప్రశ్నలూ అడగకుండా సహాయం చేయడానికి ఎప్పుడూ సిద్ధంగా ఉండేవాడు. అతనింట్లోనే అనుకోకుండా శ్రీ నారాయణ గురువు ఫోటోను నేను మొదటిసారిగా చూశాను.

# 9. విచిత్రాలూ సమయోచితాలూ అయిన సాధకాలు

నాలో అంతఃపరివర్తనా ప్రక్రియ ప్రారంభమయింది. నా అంతరం లోతుల్లో చైతన్యనది మౌనంగా కొత్త ఉపనదులను పుట్టిస్తోంది; అవి చివరకు మహాసముద్రంలోకి చేరతాయి. ఈ ప్రక్రియను త్వరితపరచడానికి నాకు కావలసిన బాహ్య సాధకాలు వింత వింత మార్గాల్లో సమకూరాయి.

యోగాభ్యాసం గురించీ, తత్త్వశాస్త్రమూ మతాల సంబంధమైన సూక్ష్మతర విషయాల గురించీ ఏదైనా వివరణ నాకు కావలసి వస్తే సరిగ్గా ఆ ప్రశ్నలనే చర్చించిన పుస్తకాలు నా చేతిలోకి వచ్చేవి గారడీ చేసినట్టు. నేను పెద్దవుతూన్న కొద్దీ, నాకుగా నేను తిరగడానికి (పెద్దల) అనుమతి దొరికిన దగ్గర నుంచీ నేను త్రివేంద్రం సార్వజనిక గ్రంథాలయానికి తరచుగా వెళ్లడం మొదలుపెట్టాను. అది ఒక పురాతన విక్టోరియన్ కట్టడం – తత్త్వశాస్త్రం, మతం, ఆచారబద్ధమైన గారడీ విద్యలకు సైతమూ సంబంధించిన పురాతన గ్రంథాలకు అది దాదాపుగా వాస్తవికమైన ఒక ఖజానా.

అక్కడ పొడుగుపాటి జుట్టూ గెడ్డమూ ఉన్న పుస్తక భాండాగార అధికారి ఒకడు – నాకిప్పుడు అతని పేరు గుర్తు లేదనుకోండి – తనకు తానే నాకు సలహాదారుగా నియమించుకొని, అద్భుతాలకన్నా అద్భుతమైనట్టుగా, తగిన సమయంలో తగిన పుస్తకాన్ని సూచిస్తూ ఉండేవాడు. ఈ విధంగా నేను "ద కంప్లీట్ వర్క్స్ ఆఫ్ స్వామీ వివేకానంద" (The Complete Works of Swami Vivekananda), "ద గాస్పెల్ ఆఫ్ శ్రీ రామకృష్ణ" (The Gospel of Sri Ramakrishna), "ఐసిస్ అన్‌వీల్డ్" (Isis Unveiled), మదామ్ బ్లావట్స్కీ రాసిన "ద సీక్రెట్ డాక్ట్రిన్" (The Secret Doctrine), "ద జోహర్", (The Zohar), "ద ఉపనిషద్స్" (The Upanishads), "ద భగవద్గీత" (The Bhagavad Gita), యవన తత్త్వవేత్తలైన అరిస్టోటిల్, ప్లేటో మొదలైన చాలామంది (గురించిన పుస్తకాలను) చదివాను.

రెండు సంఘటనలు ఎంత వింతైనవంటే, వాటిని కాకతాళీయంగా కొట్టిపారెయ్యడానికి నాకు కఠినమనిస్తుంది. విద్యారణ్యులు "పంచదశి" అనే ప్రామాణిక వేదాంత గ్రంథంలో నాకు తారసిల్లిన కొన్ని వైరుధ్యాలను వివరించేదేమైనా కనిపిస్తుందేమోనన్న ఆశతో ఒక పొద్దున్న నేను బ్రిటిష్ కౌన్సిల్ గ్రంథాలయానికి నడిచి వెళ్ళాను. అది మా యింటి నుంచి ఏమంత దూరమేమీ కాదు. తత్త్వశాస్త్రం, మతం గురించిన భాగం (లోని పుస్తకాలను) వినోదంగా చదువుతూ ఉన్నాను. అక్కడ నాకు ప్రత్యేకంగా ఉపయోగించేదేదీ కనిపించలేదు.

ఆ తరవాత డాక్టర్ రాధాకృష్ణన్ అనువాదమూ ఉపనిషత్తుల వ్యాఖ్యానమూ అయిన ఒక ప్రతి, కింది అరలో కనిపిస్తే, నేను దానిని బయటకు లాగుదామని

కిందికి వంగాను. సరిగా అదే క్షణంలో గట్టి అట్టలేసిన మూడు పుస్తకాలు పై అర నుంచి నా మెడమీద పడ్డాయి. ఆ నొప్పిని పోగొట్టుకోడానికి చేతులతో మెడని మర్దనా చేసుకున్న తరవాత, ఆ పుస్తకాలను ఎత్తి తీసుకున్నాను. ఒకటేమో ఆల్డస్ హక్సలే రాసిన "ద పెరెన్నియల్ ఫిలాసఫీ" (The Perennial Philosophy). తతిమ్మా రెండూ జె. కృష్ణమూర్తి రాసిన "ద కామెంటరీస్ ఆన్ లివింగ్" (The Commentaries on Living) అనే సంపుటాలు. అదే నాకు కృష్ణమూర్తి గారి గురించిన మొదటి పరిచయం. వివిధ సమస్యల విషయంలో నేను కృష్ణమూర్తి గారితో పూర్తిగా ఏకీభవించకపోయినా, "ద కామెంటరీస్ ఆన్ లివింగ్" అనేది చాలా వేదాంతిక క్లిష్ట సమస్యలను పరిష్కరించడానికి తప్పకుండా పనికి వస్తుందని మాత్రం నేను చెప్పి తీరాలి. ఏదేమైనా, ఆ పుస్తకాలు నా మీద ఎలా పడ్డాయో అన్నది నేను వివరించలేను. ఎందుకంటే, ఆ ఫలానా పుస్తకాల బీరువా అరల దగ్గర నేను తప్ప మరెవ్వరూ లేరు కనక.

మరో సంఘటన ఇంకా వింతైనదే. నాకప్పుడు పద్నాలుగేళ్ళు. అప్పటికి నేను యోగం, మార్మికవాదం, మతం, తత్త్వశాస్త్రం మీద చాలా పుస్తకాలనే చదివాను. ఛాతీలో కనిపించే కాంతి మీద అప్రయత్నంగానే నేను చేసే రాత్రిపూట ధ్యానం కొనసాగుతూనే ఉంది. కానీ, చాలా గంభీరమనిపించిన ఒక విశేష సమస్య నాకు ఎదురయింది. వేరువేరు గురువులూ వేరు వేరు గ్రంథాలూ హృదయ కేంద్రానికి వేరువేరు స్థానాలను చెప్పడం జరిగింది. రమణ మహర్షి హృదయ కేంద్రం ఛాతీకి కుడివైపున ఉందని నొక్కిచెబుతారు; కబీరు మార్మీయులూ రామకృష్ణ పరమహంస కూడా అసలైన గుండెకు దగ్గరగా ఎడమవైపునే (దానికి స్థానంగా) చెప్పారు.

హఠయోగ ప్రదీపికతో సహా చాలా యోగగ్రంథాలు ఛాతీ మధ్యనే హృదయ కేంద్రానికి స్థానాన్ని నిర్దేశించి, దానిని అనాహత చక్రమని (నాలో స్వతస్సిద్ధంగానే ఉత్తేజితమైన కేంద్రం) వ్యవహరించారు. ఆధ్యాత్మిక ప్రముఖులైన రమణ మహర్షి రామకృష్ణ పరమహంస లాంటివాళ్లు వ్యక్తిగతంగా, ఆధ్యాత్మికానుభూతి తాలూకు మహా ఉన్నతులను చేరినవాళ్ళని అందరూ అనుకునే వాళ్ళు, ఇంత ప్రముఖమైన మానసిక కేంద్రపు స్థాన విషయంలో ఒకళ్ళనొకళ్ళు వ్యతిరేకించడమన్నది అత్యంతమూ చకిత పరిచే విషయం. ఒకరు ఒప్పైతే రెండోవారు తప్పే కదా! అసలు ఈ కేంద్రాల ఉనికి మీదే నాకు తీవ్రమైన అనుమానాలు పుట్టుకురావడం మొదలుపెట్టాయి. ఇదంతా ఊహేనా? నాదీ, ఇతరులది కూడానూ?

నా ఆధ్యాత్మిక యాత్రలో అదే మొదటి గడ్డు సంకటం అనుకుంటాను నేను. దీనిని వెంటనే సరిచేసుకొని నిశ్చయించుకోవాలనుకున్నాను. నేనో ప్రణాళిక ప్రకారం ప్రయత్నించాను. నాకు వైయక్తికంగా శిక్షణనిచ్చిన అధ్యాపకుడు రామస్వామి గారు ఆ సమయానికి మా యింటికి బాగా దూరంగా ఉన్న మనకోడ్ (Manacaud) అనే ప్రాంతానికి మారిపోయారు. ఒకరోజున, నాతోబాటే స్కూల్లో ఉన్న ఆయన బావగారితో నేను గణిత విషయంలో కొన్ని సమస్యల గురించి రామస్వామి గారితో సంప్రదించాలని చెప్పాను. ఆ తరవాత నేను ఇంటికి వెళ్ళి మా తల్లిదండ్రులతో అదే మాట చెప్పాను. బాగా ఆలస్యమైతే మాత్రం నేనక్కడే నిద్రపోతాననీన్నూ ఆ మర్నాటి పొద్దున్న, అంటే ఆదివారం ఇంటికి వస్తాననీన్నూ చెప్పాను.

నేను మా ఇంటికి అవతల గడపబోయే మొదటి రాత్రి అదే. మొదట్లో కొంత భయం కనబర్చిన తరవాత మా అమ్మ చివరికి నన్ను వెళ్ళనిచ్చింది. నిజంగా నాకు కొన్ని రేఖాగణిత సంబంధమైన సమస్యలున్నాయి. అవి రామస్వామి గారి సాయంతోనే పరిష్కరించగలుగుతానని నాకు తెలుసు. కాని అది మాత్రం సగంపాటి సత్యమే.

ఆ మిగతా సగం ఏవిటంటే మనకోడ్‌లోని రామస్వామిగారి ఇంటికి అనతి దూరంలోనే 'సమాధి తోటం' అనే ఒంటరి తోపు ఉంది. ట్యూషన్ పూర్తి చేసుకొని, తిరిగి ఇంటికి పోతున్నానని చెప్పి బయటపడి, నిజానికి సమాధి తోటానికి నడిచి రాత్రి అక్కడ గడుపుదామని నా ఉద్దేశం. నా రాత్రి సంబంధిత సాహస కృత్యానికి ముందుగా సమాధి తోటం గురించీనూ, నేనక్కడికి ఎందుకు వెళ్ళాలనుకున్నానీన్నూ మీకు చెప్పాలి.

మనకోడ్‌కి సుదూరంగా జనసంచారం లేని మారుమూల కొబ్బరిచెట్లూ ఇతర చెట్లూ ఉన్న, సంరక్షణకు నోచుకోని తోపు ఒకటి ఉంది. దానిలో తరచూ కుక్కలూ నక్కలూ చేరుతూ ఉండేవి. దానిలో, ఒక ప్రాచీన వటవృక్షం కింద శ్రీరామదాస స్వామి అనే ఒక మహాయోగి సమాధి ఉంది. ఆయన త్రివేండ్రం మహారాజు ఆయిల్యం తిరునాళ్ రాజ్యం చేసినప్పుడు జీవించారు (1865-1880). ఇంతకుముందు చెప్పినట్టు, "సమాధి" అంటే స్వచ్ఛందంగా మహాత్ములూ యోగులూ ప్రవేశిస్తారని చెప్పుకొనే గోరీ.

జీవసమాధులనేవి ఇంకా ప్రత్యేకమైనవి: వాటిలోకి ఒక యోగి బతికుండగానే ప్రవేశిస్తాడని విశ్వసిస్తారు; ఆయన మఠం వేసుకొని బుద్ధభంగిమలో కూర్చొని తన శిష్యులకు సమాధిని మూసెయ్యమని ఆదేశిస్తాడు. మనకోడ్ దగ్గర సమాధి, జీవసమాధిగా చెప్పుకుంటారు. మునుపు, శ్రీ గోపాలసామితో సహా చాలామంది మహాయోగులు 'సమాధి తోటం'లో రాత్రిపూట ధ్యానం చేసేవాళ్ళనీన్నూ,

ప్రకాశవంతమైన ఆధ్యాత్మికానుభూతులు వాళ్ళకు కలిగాయనీన్నూ నేను విన్నాను. నేను కూడా అలాగ చేద్దామని అనుకున్నాను. నన్ను కలవరపెడుతూన్న సమస్యకు బహుశా సమాధానం దొరుకుతుందని భావించాను. అయితే, సమాధి తోటం గురించి మా ట్యూషన్ మాస్టారికి గానీ ఆయన కుటుంబీకులకు గానీ నేనేమీ చెప్పలేదు.

నేనొక బస్సెక్కి ఈస్ట్ ఫోర్టు టెర్మినస్ దగ్గర దిగేను. తరవాత రామస్వామి గారి ఇంటికి నడిచి వెళ్ళాను. నేనక్కడికి రాత్రి ఏడూ ఆ ప్రాంతాలకి చేరి ఉంటాను. నా ట్యూషన్ అయిపోయేసరికల్లా, రాత్రి ఎనిమిది అయింది. రామస్వామి గారి కుటుంబం వాళ్ళు రాత్రికి నన్ను అక్కడే ఉండమని పట్టుపట్టారు గానీ, నాకు బస్సు దొరుకుతుందని సాకు చెబుతూ నేనేదో విధంగా బయటపడ్డాను. రామస్వామి కుటుంబానికి టెలిఫోను లేకపోవడం నాకు పెద్ద ఊరటనిచ్చింది. ఎందుకంటే నేనక్కడ రాత్రిని గడపలేదన్న విషయం నా తల్లిదండ్రులకు తెలియదు.

నా మిత్రుడు మార్తాండ పిళ్ళై కొంతదూరం పాటు నాతో నడిచి వచ్చాడు. కానీ అతనిని ఏదో విధంగా వదిలించుకుని, ఒక్కణ్ణే సమాధి తోటానికి వెళ్ళాను. కొన్ని దర్యాప్తులు చేసిన తరవాతనే నేను చివరకు ఆ చోటుకి చేరగలిగాను. మూడు వంతులు అప్పటికి రాత్రి తొమ్మిదిన్నర అయి ఉంటుంది; అలా అని ఖచ్చితంగా చెప్పలేను ఎందుకంటే నా దగ్గర గడియారం లేదు కనక.

ఆ చిన్న గేటు తెరిచి ఉంది. లోపల ఏ దీపాలూ లేవు. ఘనాకారమైన సమాధి కట్టడం ముందు ఒక నూనె దీపం మాత్రం వెలుగుతోంది. గాలిలో ఆ దీపం మినుకు మినుకుమంటూ అల్లల్లాడుతోంది. నాకు విపరీతమైన భయం వేసింది. అనతిదూరంలో నక్కలు ఊళలు వేస్తున్నాయి. అక్కడ మనుష్యులెవరూ కనిపించడం లేదు. ఆ మసక దీప కాంతిలో, గాలిలో ఊగుతూన్న చెట్లూ దుబ్బుల మధ్య విచిత్ర భూతాలు నక్కి తిరుగుతూన్నట్టు నేను ఊహించుకున్నాను. అకస్మాత్తుగా బలంగా వీయడం ప్రారంభించిన గాలి నుంచి నన్ను రక్షించుకుంటూ సమాధి వెనక నేను కూర్చున్నాను. మబ్బుల్లోంచి నెమ్మదిగా అర్ధ చంద్రుడు ఇవతలకి వస్తూండగా పరమ ఆధ్యాత్మికమైన శాంతి నన్ను ఆవరించింది. నేను చాలా అలసిపోబట్టి సమాధి మీద వాలి త్వరలోనే నిద్రపోయాను.

నేనెంతసేపు నిద్రపోయి ఉంటానో నేను చెప్పలేను. ఎవరో, ఏదో నా కాళ్ళను ప్రచండంగా ఊపినట్టయి నేను తుళ్ళిపడి లేచేను. నేను కూర్చోగానే నా జుట్టు లేచి నిలిచింది; నా ఒంటినిండా వెంట్రుకలన్నీ నిక్కపొడుచుకొన్నాయి. నేను అక్కడ స్తంభించుకుపోయాను. నా దగ్గర ఒక జీవి కూర్చొని ఉంది. ఉన్నంతలో దానిని వికృతంగానూ భీతిని పుట్టించే దానిగానూ వర్ణించవచ్చు. సన్నని, రమారమి

అస్థిపంజరంలాగ, నల్లరంగుతో గుంటల్లాగ ఉన్న పెద్ద కళ్ళూ, పొడుగుపాటి జడలు కట్టిన జుట్టూ, పెద్ద గడ్డముతో నగ్నంగా ఉన్న మనిషిని నేను చూశాను. అతని అధౌతశరీరం నుంచి నిర్గమిస్తూన్న మధుర పరిమళం తాలూకు ఘాటువాసన ఒక్కటి భయదోషం నుంచి విముక్తినిచ్చే గుణం.

నా భుజాన్ని తన సన్నని, పొడుగుపాటి గోళ్ళున్న వేళ్ళతో తట్టుతూ "భయపడ వద్దు" అని మలయాళంలో చెబుతూ, తన పసుప్పచ్చ పళ్ళను ఇకిలిస్తూ కొద్దిసేపు వికృతంగా పగలబడి నవ్వేడతను. "నువ్వెవరివి?" అని అడగడానికి ధైర్యం చేశాను అతని స్నేహపూర్వక వైఖరిని చూసి. "నేనా? అహ్హహ్హా. ఎవరినీ కాను. ఎవరినీ కాను. వట్టి పొగ, ఆవిరీను". నేను మౌనంగా ఉండిపోయా. "అయితే, నీకో సమస్య ఉందన్నమాట, అవునా! హృదయపద్మం ఎక్కడుందో నీకు తెలియదు. అంతేనా? అది అన్నిచోట్లా ఉంది, ఇక్కడ, అక్కడ, అన్ని చోట్లా? హ్హహ్హా వేరు వేరు జనులకు వేరు వేరు కేంద్రాల్లో ప్రకాశిస్తుంది. వైరుధ్యమేమీ లేదు."

తరవాత ఆయన నా ఛాతీ మధ్యలో తట్టి "నీది, ఇదిగో ఇక్కడే, అనాహత, దీనికే కట్టుబడి ఉండు. బాబాజీ ఆజ్ఞ ఇది". ఇంతకుముందు నేనెప్పుడూ చూడని ఊదారంగుతో నా హృదయకేంద్రం నిండింది. కళ్ళు తెరిచి ఉన్నా కూడా దానిని నేను అనుభవించగలుగుతున్నాను. నేనాయన మాటలకు ఏదో తీరువుతో జవాబు చెప్పేలోపులోనే తటాలున పైకి ఎగిరి చీకట్లోకి పరిగెత్తిపోయాడు. సుదూరంగా ఒక తెల్లని జ్వాల నేలమీంచి పైకి ఎగిరినట్టనిపించింది. లేకపోతే నేను అలా ఊహిస్తున్నానా? అదే అతనిని చివరిసారిగా చూడడం.

నా కళ్ళు ఇంకా తెరిచి ఉన్నాయి - నేనా ఊదా రంగు వెలుగు తాలూకు ఆనందాన్ని అనుభవిస్తూనే ఉన్నాను. ఇక ఏ రకమైన భయమూ వేయలేదు. నెమ్మదిగా, రాత్రి చీకటిని ఉషఃకాంతి జయించింది. దానితో ఆ ఊదారంగు జ్వాల కూడా మందగించిపోయింది. నేను నిలుచున్నాను. చూపుదూరంలో ఒక్కరు కూడా లేరు. నేను దగ్గరదగ్గరగా మూడు కిలోమీటర్లు నడిచాను. అదృష్టం కొద్దీ నాకో బస్సు దొరికింది. చింతచెట్టు బస్సుస్టాపు దగ్గర దిగి ఇంటికి వెళ్ళిపోయాను.

ఎవరూ ఏ ప్రశ్నలూ అడగలేదు. ఒక్క అమ్మ మాత్రం "ట్యూషన్ ఎలాగ నడిచింది?" అంది. "బాగానే" అని జవాబు చెప్పాను. "ఇప్పుడింక వెళ్ళి స్నానం చేసి ఉపాహారం చెయ్యి. ఇడియాప్పం, బంగాళాదుంప కూరా చేశాను". నేను ఉపాహారం చేస్తూండగా రాత్రి చేసిన సాహసిక కృత్యం మీదనే నా మనస్సు లగ్నమై ఉంది.

# 10. మస్తాన్ దీవెనలు

పధ్నాలుగున్నరేళ్ళప్పుడు నేను ఎస్సెస్సెల్సీ (హైస్కూలు) పూర్తి చేశాను. తొమ్మిది మార్కుల తేడాతో ప్రథమ శ్రేణి తప్పిపోయింది. కారణం – గణితమూ హిందీల్లో కష్టపడడానికి బదులు వేదాంత గ్రంథమైన విద్యారణ్యుల "పంచదశి" తాలూకు ఇంగ్లీషు అనువాదాన్ని చదవడంలో పూర్తిగా మునిగిపోవడమే.

లయోలా కాలేజీకి పంపించాలని కొంతమంది పిల్లల తల్లిదండ్రులు అనుకున్నారు. అలాంటి అతి తక్కువ మంది పిల్లల్లో నేనూ ఒక్కణ్ణి. ఆ కాలేజీ త్రివేండ్రం పొలిమేరల్లో ఉన్న శ్రీకార్యం దగ్గర అప్పుడే ప్రతిష్ఠాపితమైంది. ఇతరులు మార్ ఇవేనియస్ (Mar Ivanius)లో ఉన్న ప్రభుత్వ ఇంటర్మీడియట్ కాలేజీకీ, మహాత్మాగాంధీ కాలేజీకీ వెళ్ళారు. కొన్ని పాత స్నేహాలు మరుగున పడిపోయాయి; కొత్త స్నేహాలు కలిశాయి. నా పాత నేస్తాల్లో కొంత మంది లయోలా కాలేజీ వసతి గృహం (హాస్టల్)లో ఉండేవాళ్ళు. నేను పగటిపూట చదువుకొనే విద్యార్థి (డే స్కాలర్) గానే ఉందామని నిశ్చయించుకున్నాను. బస్సుమీద కాలేజికి చేరుకోడానికి నాకు గంటకన్నా ఎక్కువసేపే పట్టేది.

నా మిత్రుల్ని – థామస్ కురియన్, రాజరాజవర్మ, జానీ జోసెఫ్, నారాయణన్ – గురించి చెప్పడం నేను మర్చిపోకూడదు. నేను స్వతంత్రంగా ఉండడం మొదలు పెట్టిన సమయమది. అవసరమనిపిస్తే ఆ సాకుతోనో ఈ సాకుతోనో ఇంటి నుంచి అప్పుడప్పుడు కొద్ది సమయం పాటు దూరంగా ఉండగలిగేవాణ్ణి. పధ్నాలుగేళ్ళ నుంచి పందొమ్మిదేళ్ళ వరకూ ఉన్న ఈ ప్రాయంలోనే లౌకికమూ లోకోత్తరమూ అయిన రెండు రకాల బహు అనుభూతులకు నేను గురి కావడమూ లోబడడమూ జరిగింది.

మనస్సును పరిపక్వంగా మలచి, దృఢపరిచి, అధికోన్నత ఆధ్యాత్మిక స్థితిని అందుకోవడానికి కావలసినదంతా నాకు ఐదేళ్ళలోనే అబ్బిందని సింహావలోకనంలో నేను నిశ్చయంగా గ్రహించగలిగాను. దానికి నిజానికి సాధారణ పరిస్థితుల్లో ఒక పుష్కరమో అంతకన్నా ఎక్కువ ఏళ్ళో పడుతుంది.

ప్రాపంచిక స్థాయిలో నిషిద్ధమనుకొనేదల్లా నేను రుచిచూడడం తటస్థించింది. కౌమారంలో చాలామంది లాలసపడే మత్తుమందులూ, మాదకపానీయాలూ మొదలైన ఇతర వస్తువులన్నిటినీ (రుచి చూశాను). కానీ సరి అయిన అదనులో నేను వాటినుంచి బయట పడగలిగాను. ఏదో, ఎవరో నాకు కావలిగా ఉంటూ నన్ను కాపాడుతూనే ఉన్నారు. తరవాత మా గురువుగారు ఈ సమయాన్ని "తాంత్రిక దశ" అని నిర్దేశిస్తూ ఉండేవారు. ఈ రోజుకి కూడా, ఆ దశలో నా అనుభూతులను అందించిన ప్రతీ

మిత్రుణ్ణీ ప్రతీ సహచరుణ్ణీ నేను ఉపగురువుగా అనుకుంటాను; హృదయపూర్వకంగా అతనికి గానీ ఆమెకు గానీ ధన్యవాదాలు తెలుపుకుంటూ ఉంటాను.

తరవాత నా జీవితంలో తాగుబోతులూ, మత్తుమందుల దాసులూ, కామాతురులూ ఉచ్చావచాలుగా దారితప్పిన వాళ్ళు నా దగ్గరకు సాయానికి వస్తారని అప్పుడు నాకే రకంగానూ తెలియదు. ఆ ఐదేళ్ళూ నేను తీవ్రంగా (అటువంటి ప్రమాదకర పరిస్థితులకు) గురికావడమన్నదే లేకపోతే వాళ్ళను అర్థం చేసుకోవడం గానీ, ఏ విధంగానైనా వాళ్ళకు సహాయపడడం గానీ నా వల్ల జరిగేది కాదు. ఇంకా అంతకన్నా చెడ్డదేమి జరిగి ఉండవచ్చునంటే, నేను మళ్ళీ వాళ్ళ భయంకరమూ యాతనామయమూ అయిన జీవన విధానాల్లోనే పడిపోవడానికి ప్రలోభ పడిపోయేవాణ్ణేమో -

ఇదొక ఆధ్యాత్మిక జీవితకథగా చిత్రితమవుతోంది కనక ఆధ్యాత్మిక స్థాయిలో ఏం జరిగిందన్న విషయంలో నేను మరికొంచెం విశదపరుస్తాను.

మొట్టమొదట, కలడి మస్తాన్ (బాబా) (Kaladi Mastan) తో నా సమావేశం గురించి చెప్పాల్సిందే. సముద్రతీరాన సూఫీ మహాత్మురాలి సమాధికవతల పిచ్చివాడిలాగ కనిపించిన ఒకతన్ని కలుసుకున్నానని నేను మూడో అధ్యాయంలో చెప్పిన విషయం మీకు గుర్తుండే ఉంటుంది. అతను నా ముఖాన్ని చూసి నవ్వుతూ "సరే వెళ్ళు కుర్రాడా! తరవాత రా!" అని అన్నాడు. అప్పుడు నేను దానికి ఎక్కువ ప్రాముఖ్యత నివ్వలేదు. కానీ ఇప్పుడు దాదాపు ఆరేడేళ్ళ తరవాత, ఆ మనిషికే ముఖాముఖి అగపడ్డాను. అతనిని కలుసుకోవడం ఇది రెండోసారి.

పదహారేళ్ళప్పుడు, కాలేజీలో నా ప్రథమ సంవత్సరం రమారమి చివరలో, నేను ఎన్‌సీసీలో చేరాను. మహాత్మాగాంధీ కాలేజి ఆవరణంలో సైన్యానుబంధమైన శిబిరానికి నన్ను ఎంపిక చేశారు. మూడు రోజులు శిబిరంలో ఉన్న తరవాత, జ్వరమూ, తలనొప్పి, కీళ్ళనొప్పి వచ్చాయని మొరబెట్టుకుని అనారోగ్య కారణంగా సెలవు పెట్టాను. సెలవు మంజూరయింది. నేను శిబిరంలోంచి బయటకు వచ్చేశాను. మజిలీ నుంచి బయటకు రాగానే నాకు బాగానే ఉందనిపించి ఆశ్చర్యపోయాను. ఇంటి దగ్గర నేను ఒక వారం తరువాత తిరిగి వస్తానని అనుకుంటున్నారు. నాకు చాలా సమయమే ఉంది. అందుచేత నేను కొంచెం తిరుగుదామని నిశ్చయించుకున్నాను. రెండు బస్సులు మారి, మధ్యాహ్నానికల్లా బీమపల్లి తాలూకు కడలిగట్టు సమాధి పుణ్యస్థలానికి చేరుకున్నాను. ఆ పవిత్రస్థానం ప్రవేశద్వారంలో నిలుచుని, సంఘటిత మత సంబంధ

మైన ప్రభావం, ఎక్కడో సుదూరంగా ఉన్న కదలితట్టు గ్రామంలోకి కూడా చొరబడిందని గమనించాను. ఆ పుణ్యస్థానం పక్కన ఉన్న చిన్న మసీదు స్థానే (ఇప్పుడు) ఓ పెద్ద రంగురంగుల మసీదు ఉంది. బహుశా దానిని స్వదేశం నుంచి వలస వెళ్ళిన వాళ్ళిచ్చిన చందాతో నిర్మించి ఉంటారు. అదొక శుక్రవారం. ఆ పుణ్యసమాధి లోపల తాము పిశాచగ్రస్తుల మనుకొనేవాళ్ళు చేస్తూన్న గడబిడను గ్రహించి, నేను లోపలకు వెళ్ళ దలుచుకోలేదు. సైన్యంవాళ్ళ ఫక్కీలో ఉన్న నా హోల్డాలును బలంగా గుంజుకుంటూ ఇసుక తిన్నెల మీదుగా అడ్డంగా నడుస్తూ, టీ కొట్టు కోసం చూస్తూ రోడ్డు దాటాను. నాకు ముందస్తుగా ఓ కప్పుడు స్ట్రాంగు టీ కావాలనిపించింది.

సరిగ్గా ఎదురు గుండానే నా ముందు "దర్గా టీ స్టాల్" అనే కొట్టు ఉంది. అదొక పురిగడ్డితో కట్టిన కట్టడం. దాని ముందు ఒక చిన్న ఎత్తైన వరండా ఉంది. నేనా (కొట్టు) వైపుకు వెళుతూంటే, అక్కడ వరండా చుట్టూ మౌనంగా దాదాపుగా ఒక డజను మంది ఉన్న జన సమూహం నా వైపు వీపులు పెట్టి నిలుచొని ఉండడం గమనించాను. ఆ గుంపులో నేనూ చేరాను. నేలమీద నక్కి కూర్చొని తనకు తాను నవ్వుకుంటూన్న సన్నని దిగంబరుడైన మకిలి మనిషిని వాళ్ళందరూ పరికిస్తూన్నట్టు చూశాను.

అతని బూడిద వన్నె జుట్టు, వేసవికాలంలో అంట కత్తిరింపు చేయించుకున్న ట్టుగా చిన్నగా కత్తిరించి ఉంది. అతని నల్లటి ముఖం ఒప్పుగా కత్తిరించబడ్డ తెల్లగెడ్డంతో చట్రం కట్టినట్టుగా ఉంది. అయితే అతని కళ్ళు మాత్రం ఆకర్షణీయంగా ఉన్నాయి; విశాలంగానూ ప్రేమగానూ ఉన్న ఆ కళ్ళు ఇప్పుడు నావైపుకు చూస్తున్నాయి. నా మనోనేత్రంలో ఒక సన్నివేశం మెరిసింది. ఆ రోజున జోస్యం చెప్పినట్టే నేను మళ్ళీ అతని దగ్గరకు వచ్చాననీ, ఇతను అతనేనని నాకు తటాలున తెలిసింది.

అతని ముందరి మాటలు దీనినే నిర్ధారించాయి. నా కళ్ళలోకి తేరిపారజూస్తూ "వంతిట్టాన్, చిన్న మాదిరి వంతిట్టాన్... నేను చెప్పినట్టుగానే అతను వచ్చాడు" అని గభాలున పగలబడి నవ్వాడు. "పెద్ద దొంగా! నా నిధిని దొంగిలించడానికి వచ్చావా?" అంటూ అతను అట్టహాసాల మధ్య అన్నాడు. త్వరగా నేను తొలి దిగ్భ్రాంతి నుంచి కోలుకొని, అతను ఎవరో ఒకతను వెలిగించిన ఒక సిగరెట్టు కాలుస్తూ ఒక గాజు గ్లాసుతో టీ తాగుతున్నట్టు గమనించాను. ఆ సిగరెట్టు విసిరేసి 'కూర్చో ఇక్కడ' అని సైగ చేశాడు.

హోల్డాలుని అక్కడ వరండా మీద పడేసి నేలమీద కూర్చున్నాను. "అందరూ వెళ్ళిపొండి" అని అతను తమిళంలో అనగానే జన సముద్రమంతా కరిగిపోయింది. టీ కొట్టు యజమాని మరో కప్పుడు తాజా టీ పట్టుకువచ్చి ఇచ్చాడు. ఆ ముసలతను "అతనికి పైసలియ్యి" అన్నాడు. నేను అర్ధ రూపాయిచ్చాను. సగం టీ తాగి మిగిలినది నాకిస్తూ "తాగు ఈ టీ ని" అని అన్నాడు. జీవితంలో ఎప్పుడూ కూడా కడగనట్టున్న అతని పసుప్పచ్చటి పళ్ళను చూసి నేను తటపటాయించాను. టీ కొట్టు యజమాని "తాగు, తాగు. నువ్వెంత అదృష్టవంతుడివో నీకు తెలియదు. చాలా అరుదుగా ఈ పని చేస్తాడతను" అని గుసగుసలాడుతూ నెమ్మదిగా చెప్పాడు. 'ఎందుకు తాగకూడదు' అని నాకు నేను అనుకొని ముఖ్యంగా వాత్సల్యంతో నిండిన ఆ కళ్ళమీది ప్రేమతో కళ్ళు మూసుకొని ఆ టీ తాగేను. అప్పటికి, బాగా చీకటి పడుతోంది. ఆ ముసలాయన తటాలున పైకి లేచి "రా! రా!" అని అరుస్తూ పరిగెత్తడం మొదలెట్టాడు. నిర్దిష్టమైన నమూనాలో ఉండే నా (సైన్య సంబంధమైన) హోల్డాలు గురించి అంతా మర్చిపోయి అతని వెనకాల పరిగెత్తాను.

త్వరలోనే మేము కదలి ఒడ్డుకు వచ్చాం. సగం కప్పు ఎగిరిపోయిన ఒక పాడుపడ్డ బెస్త గుడిసె ముందు అతను ఆగాడు. సాగరాన్ని చూస్తూ ఆ పాడుపడ్డ వరండాలో కూర్చున్నాడతను. "కూచో"మని చెప్పాడు. నేను మఠం వేసుకుని కూర్చున్నాను. మేమిద్దరమూ అరేబియన్ సముద్రానికి అభిముఖంగా ఉన్నాం. "అతను హిమాలయాల నుంచి వచ్చాడు కదా?" అన్నాడు.

"ఎవరు?"

"బాగా అందమైనవాడూ, జడలు కట్టిన జుట్టున్నవాడూ నీ తలను ముట్టుకున్నాడుగా".

"అవును" ఇతనికెలాగ తెలిసిందబ్బా అని ఆశ్చర్యపడుతూ అన్నాను.

"సరే, నేనిప్పుడు నీ తలను తాకుతాను. పెద్ద దొంగా! నా నిధిని కొల్లగొట్టడానికి వచ్చావు".

"మీరలాగనడం చాలా విచారకరం. నేను దొంగనేమీ కాను. నేనేమీ దొంగిలించలేదు" అని ఈసారి కోపంగా అన్నాను.

"కన్నన్ లాగ కృష్ణన్ లాగ వెన్న దొంగిలించడం, గోపికల హృదయాలను దొంగిలించడం. ప్రేమ ద్యోతకమైన కటాక్షాలను దొంగిలించడం. అపహరించడం! మహా దొంగ!"

"అయితే?"

"అహ, అహ" అంటూ అతను నా ఛాతీనీ నా నుదుటినీ తన కుడి చేతివేళ్ళతో తాకాడు.

తొలుత, ఒక ధవళకాంతి నా హృదయాన్ని ముంచెత్తింది. తరువాత అది నా శిరస్సులో విస్ఫోటం చెందింది. నా నొసలుకీ గుండెకీ మధ్య అటూ ఇటూ ప్రవహించే ఆ కాంతి సన్నిధి తప్ప ఇంక అన్నీ మర్చిపోయాను. పారవశ్యపు తరంగాలు నా హృదయంలో నిండాయి. అక్కణ్ణించి అవి నా మొత్తం శరీరాన్ని పూరించాయి. నా జుట్టు లేచి నిలుచుంది. మొత్తం ప్రపంచాన్ని కౌగిలించుకుందామన్న కోరిక పుట్టింది. నేనలాగ అక్కడ ఎంతసేపు కూర్చున్నానో, బయటి ప్రపంచంలో అప్పుడేం జరిగిందో నాకు తెలియదు.

ఈ మైమరపు కొంత ఉపశమించిన తరవాత, నా కళ్ళు తెరిచాను. నేను ఆ బెస్తవాడి గుడిసె లోపల కూర్చుని ఉన్నట్టుగా గమనించాను. ఆ ముసలాయన నా దగ్గర కూర్చుని, నా తలమీద, బొక్కెనతో ఇసుకను గుమ్మరిస్తూ "చాలు, చాలు, ఇక వెనకకు రా, పాపం చిన్న వాడివి" అని అన్నాడు.

నా ముఖం మీది ఇసుకను తుడుచుకుంటూ నేను నిలుచున్నాను. నేనప్పుడు దిగంబరంగా ఉన్నానని తెలుసుకున్నాను. ఇబ్బందీ, చీకాకూ పడుతూ "నా బట్టలెక్క డున్నాయి?" అని అడిగాను.

"అన్నీ ఇక్కడే ఉన్నాయి. నువ్వెళ్ళి స్నానం చేసి రా" నా పక్కనే నిలుచొని టీ కొట్టు యజమాని అన్నాడు. చుట్టబెట్టుకోడానికి అతనొక తువ్వాలిచ్చాడు. స్నానం చేయడానికి తన ఇంటికి తీసుకొని వెళ్ళాడతను. తెల్లారుతోంది. స్నానం చేస్తూండగా, నా గుండె కేంద్రంలో ఇంకా మందమందంగా ఆనంద తరంగాలను అనుభవిస్తూనే ఉన్నాను. (స్నానం) పూర్తయిన తరవాత, టీ కొట్టు యజమాని హమీద్, ఉతికి, ఇస్త్రీ చేసి, సిద్ధంగా ఉంచిన నా బట్టలను ఇచ్చాడు. అవి వేసుకొని నేను బయటకు వచ్చాను.

నేను నాలుగు రోజుల పాటు ఆ ఉన్మత్త పారవశ్యంలో ఉన్నాననీ, దిసమొలతో తిరగకుండా ఉండడానికి గాను భౌతికంగా నన్ను అదుపులో పెట్టవలసి వచ్చిందనీ హమీదు చెప్పాడు నాకు. ఆ ముసలాయన ఆజ్ఞానుసారంగా ఆ హోల్డాలునీ, నా జేబులో ఉన్న డబ్బునీ పదిలంగా అతని దగ్గరే ఉంచాడు. "మస్తాన్ సాహెబ్ అవతల వేచి ఉన్నాడు. త్వరగా రా" అని అన్నాడతను.

కలడి మస్తాన్ సాహెబ్ అని హమీద్ ఆయనను సంబోధిస్తాడు. ఆయన అప్పుడు అవతల టీ కొట్టు వరండా మీద కూర్చొని ఉన్నారు. ఆయనెప్పుడూ ఒక కొట్టులోకి గానీ, ఒక ఇంటిలోకి గానీ వెళ్ళడు. నన్ను చూసి పగలబడి నవ్వుతూ ఆయన "పుతు మాపిళై (కొత్త పెళ్ళికొడుకు), పెద్ద దొంగ. మళ్ళీ ఇక్కడకు తిరిగి రావద్దు. ఇంక సొమ్ము దొరకదు. వెళ్ళు" అని అన్నారు. నేను వంగి మకిలిగా ఉన్న ఆయన పవిత్ర పాదాలను ముద్దెట్టుకున్నాను. ఎప్పటిలాగే నగ్నంగా నిలుచొని, పరుగెత్తుకొని వెళ్ళిపోయాడు. మళ్ళీ కలడి మస్తాన్ దగ్గరకు వెళ్ళడానికి పరిస్థితులు అడ్డుపడ్డాయి. చాలా ఏళ్ళ తరవాత ఆఖరికి నేను వెళ్ళేసరికి, ఆయన సమాధిని మాత్రమే చూడగలిగాను.

పొద్దుటి అల్పాహారం పెట్టిన తరవాత, తనకు కలడి మస్తాన్ గురించి తెలిసిన స్వల్ప విషయాలను హమీదు నాకు చెప్పాడు. కొన్ని ఏళ్ళ క్రితం, అప్పుడే పుట్టిన పిల్లవాడిలాగ దిగంబరంగానూ అధౌతంగానూ, ఆయన ఆకస్మికంగా దర్శనమిచ్చాడు. చాలాకాలం వరకూ (అందరూ) అతనిని పిచ్చివాడుగానే పొరబడ్డారు. ఒకసారి పెద్ద తుఫాను ఆ ప్రదేశాన్ని దెబ్బ తీసింది; అప్పుడు హైటెన్షన్ కరెంట్‌తీగ ఒకటి తెగి, వరద రోడ్డు మీద పడింది. మొత్తం రాకపోకలు స్తంభించి పోయాయి; ఎవ్వరూ రోడ్డు మీద నడవలేకపోయారు. ఆ నీటిని ఎవరు తాకినా అతను విద్యుద్ఘాతం వల్ల చచ్చిపోతాడు. అప్పటికే ఇద్దరు చచ్చిపోయారు. జనులూ పశువులూ నిశ్చిత మృత్యుముఖంలోకి పోకుండా ఆపడానికి అగ్నిమాపకదళం వాళ్ళు, సైన్యమూ, పోలీసు వాళ్లు అడ్డుగోడను ఏర్పరచారు.

కలడి మస్తాన్ వేగంగా పరిగెడుతూ ఆ అడ్డుగోడను దూకి వెళ్ళడం చూసి చూసేవాళ్ళందరూ భయభ్రాంతులయిపోయారు. ఎవరేనా అతనిని ఆపేలోపులో అతను మోకాలు లోతు నీటిలో నడుస్తున్నాడు. వాళ్ళను అపరిమితంగా ఆశ్చర్యపడేలాగ చేసినదేమిటంటే, అతను విద్యున్మరణం పొందడానికి బదులు దాని నుంచి చెక్కు చెదరకుండా బయటకు వచ్చి నిశ్చింతగా సముద్రం వైపుకు నడిచి వెళ్ళడమే. ఆయన పాదాలను తాకి సాగిలపడ్డవాళ్ళలో మొదటివాడు ఒక సైనికుడు.

అప్పట్నించీ ఆయన స్థానికుల్లోనూ మహా సమ్మతుడయ్యాడు. జనులందరూ అతనికి టీ ఇవ్వడం మొదలుపెట్టారు. అతను దానిని తరచుగా తాగుతూ ఉండేవాడు. అతను అరుదుగా తినేవాడు; కొన్నిసార్లు పొగతాగేవాడు; అతనికి బట్టలు కడదామంటే మాత్రం ప్రతిఘటించేవాడు. నగ్నంగా తిరగడం ఇస్లాం నియమాలకు విరుద్ధం కనుక

అత్యుగ్ర పూర్వాచార పరాయణుడైన ముస్లిం ఎవడైనా అతని నుంచి దూరంగా ఉండేవాడు. సూఫీ బోధనలను గురించి కొంతైనా గ్రహించిన వారెవరైనా అతనిని రబియా (Rabia) తోనూ, దిగంబరుడైన మన్సూర్ అల్ హల్లాజ్ (Mansoor al Hallaj) తోనూ పోలుస్తూ, ఒక మహాత్ముడికి ఇవ్వవలసిన గౌరవాన్ని ఇచ్చేవాళ్ళు. హిందూ బెస్తవాళ్ళు అతనిని అవధూతగా – సాంఘిక రీతిరివాజుల నుంచి తనను తాను విముక్తపరుచుకున్న పారవశ్యమగ్నుడైన మహాత్ముడిగా భావించేవాళ్ళు.

సామాన్యంగా ఆ కుగ్రామంలోని చాలామంది ప్రజలు అతనికి అన్నం పెడితే అదృష్టం వస్తుందని నమ్మేవాళ్ళు. హమీదు అతనిని మస్తాన్ సాహిబ్ – అంటే, మైకంలో ఉన్న మహాత్ముడు – అని పిలుస్తూ ఉండేవాడు. అతని వాదన ప్రకారం మస్తాన్ సాహిబ్ తమిళనాడులోని కలడి నుంచి వచ్చిన గొప్ప సూఫీ మాస్టరు. సామాన్య ప్రజానీకానికి తెలియని ఒక చిన్న శిష్యవర్గం ఆయనకు ఉండేది – తాను ఆ వర్గంలో ఒకణ్ణని హమీదు చెప్పేవాడు. ఘనతరమైన ఆధ్యాత్మిక వికాసానికి సిద్ధం కమ్మని నన్ను ప్రత్యేకంగా మస్తాన్ సాహిబ్ దీవించాడని అతని నమ్మకం. ఇప్పుడు నేను వర్ణించిన ఘటన జరిగిన ఒక ఏడాది తరవాత హమీదు చనిపోయాడు.

# 11. ముగ్గురు సన్యాసులు

ఇప్పుడు కొంతమందితో ప్రత్యేక జనులతో నా సహచర్యాన్ని గురించి చెబుతాను. వీళ్ళలో ఉన్నారు ముగ్గురు సన్యాసులు. వాళ్ళు ఒకరికన్న ఒకరు విలక్షణులు - స్వామీ అభేదానంద, చెంపజన్ని స్వామీ, రామకృష్ణ మిషన్‌కి చెందిన స్వామీ తపస్యానంద.

ఒకటో అధ్యాయంలో, హిందూ భక్తిరీతులతో నేను వర్ణించిన నా మొదటి సమావేశంలో ఏ విధంగా నేను మృదంగ తాళాల లయలతో అభిభూతుణ్ణై ఇంట్లోంచి బయటకు పరుగెత్తుకొని వచ్చి, వేలాదుతూన్న గడ్డం ఉన్న ఒక పొడగరి సుందర స్వరూపుడి చుట్టూ పాడుతూ నాట్యం చేస్తూన్న ఒక చిన్న బృందాన్ని చూశానో అదంతా మీకు గుర్తు ఉండి ఉండవచ్చు. ఆయనే స్వామీ అభేదానంద.

స్వామీ అభేదానందకు తూర్పు కోట ప్రాంతంలో (ఈస్ట్ ఫోర్ట్ ఏరియా) ఆశ్రమం ఉంది. అప్పటికి నేను ఒక సైకిల్ సంపాదించాను. కొత్తగా దొరికిన నా గతిశీలతని నలుగురికీ కనబరుస్తూ సంతోషాన్ని పొందడం కోసం చాలా క్రమబద్ధంగా తూర్పు కోటకు సైకిల్ తొక్కుకుంటూ వెళ్ళేవాణ్ణి. శ్రీపద్మనాభ దేవాలయాన్ని సంరక్షించడం కోసం తూర్పుకోటను ట్రావన్కోర్ మహారాజులు నిర్మించారు. అది బ్రాహ్మణులకు ఆవాసస్థానంగా ఉండేది. దానిని అగ్రహారమనేవాళ్ళు. అది చివరికి కొట్టూ, అల్పాహార శాలలు, పెద్దపెద్ద నగల కొట్టూ ఉన్న ఒక చిన్న బస్తీ అయింది. గుడి కోనేరు దయాపూర్ణంగా ఈ రోజుకీ ఉంది.

కోనేరుకి పడమటివైపున అభేదానందుల ఆశ్రమం ఉంది. ఆ రోజుల్లో, ఆశ్రమంలో ఉన్న కట్టడాలు – స్వామివారి నిరాడంబర నివాస స్థానమూ, కొద్దిమంది స్థిర నివాసుల కోసమున్న కొన్ని వసతి విభాగాలూ, ఒక ఆరుబయటి సభా భవనం, కీర్తనకి ఉపయోగించే చిన్న హాలుకి ఎదురుగా రాధాకృష్ణుల ఆలయం మాత్రమే.

స్వామీ అభేదానంద ఒక పరిత్యాగి – బట్టలతో సహా ప్రతిదానినీ వదిలేసిన సన్యాసి. మొలగుడ్డనొకదానిని మాత్రమే అతను కట్టుకున్నారు – సాంప్రదాయికంగా కౌపీనమని చెప్పేది దీన్నే. నేనాయనను చూడడానికి వెళ్ళినప్పుడు ఆయనకు దాదాపు 55 ఏళ్ళ వయస్సు. పాదచారిగా హిమాలయ పుణ్య క్షేత్రాలతో సహా భారతదేశంలోని పుణ్యతీర్థాలనన్నిటినీ తిరిగి ఆయన ఇక్కడ స్థిరపడ్డారు.

ఆయన పొడుగ్గా, అందంగా, చూడముచ్చటగా ఉంటారు. ఆయన ఉంగరాలు తిరిగిన జుట్టు భుజాలను తాకుతూ ఉంటుంది. తెలుపూనలుపూ వెంట్రుకల మాసికలతో ఉన్న ఆయన గడ్డం ఆయనకు రాచరికపు వన్నెనిచ్చింది. నేను చూసిన

వాళ్ళలోకల్లా అతి మృదుహృదయుడాయన. ఆయన మాటలు ఎప్పుడూ మెత్తగానూ వాత్సల్యభరితంగానూ ఉంటాయి. ఆయన బుద్ధిపరమైన వేదాంతి కాదు; ఆయన భక్తిలో మునిగిపోయినవాడు - ప్రేమికుడైన అలకాపరి కృష్ణుణ్ణి పరిపూర్ణంగా ప్రేమించిన భక్తుడు; అతనికి తనను తాను పూర్తిగా సమర్పించుకున్న భక్తుడు ఆయన.

ఆయన నుంచే నాకు "మధురభావం" (గొల్ల స్త్రీల్లాగ, బృందావన గోపికల్లాగ కృష్ణుడికి తానొక ప్రేమికురాలిగా భావించడం) అనే భావన నాకు అర్థమయింది. ఆయన భక్తిగీతాలు పాడుతూంటే, ఆయన కంఠధ్వని తానంలోనూ స్వరస్థాయిలోనూ స్త్రీపరంగా మారిపోయేది; భక్తితో అశ్రువులను కారుస్తూ పారవశ్యంలో మునిగిపోయే వాడాయన.

నేను ఆశ్రమానికి వెళ్ళినప్పుడల్లా, స్వామి విశ్రాంతి తీసుకొనే సమయమొక్కటీ తప్పించి, ఆయన దగ్గరకు నాకు స్వేచ్ఛాప్రవేశముండేది. భక్తుల చిన్న సముదాయంతో పాటు కూర్చొని నేను ఆ చర్యలను ఆస్వాదించేవాణ్ణి. ముఖ్య విషయం భక్తే. నన్నెప్పుడూ స్వామి చిరునవ్వుతో స్వాగతించేవారు; ఆయనతో మధ్యాహ్న భోజనం చేయకుండా నన్ను వెళ్ళనిచ్చేవారు కాదు.

ఒక శుక్రవారం నేను పొద్దున్న పదకొండూ ఆ ప్రాంతాల్లో వెళ్ళాను. అప్పుడు స్వామి ఏకాంతంగా ఉన్నారు. ఆయన నా కోసం నిరీక్షిస్తున్నట్టుగా ఉన్నట్టు నన్ను స్వాగతించారు. ఆయన కూర్చొన్న కుర్చీలోంచి లేచి నా దగ్గరగా నేలమీద కూర్చొన్నారు. ఆయన కళ్ళు వాత్సల్యంతో నిండి ఉండగా నా చుబుకాన్ని తాకి "కావలసినదల్లా ప్రేమే. అన్ని వాదనలూ చర్చలూ ఆ అపరిమితుణ్ణి చేరడంలో అసమర్థమైనవే. ప్రేమ ఒక్కటే ఆ పని చెయ్యగలదు. గుండెను తెరిచి కృష్ణుణ్ణి చూడు. అతన్ని గోపికల్లాగ ప్రేమించు" అని అన్నాడు.

ఆ మీద తన చేయి నా భుజం మీద ఆన్చి సమాధిలోకి జారిపోయారు. ఆయన చెక్కిళ్ళమీంచి కన్నీళ్ళు జాలువారాయి. కొంతసేపైన తరవాత ఆయన శరీరం అకస్మాత్తుగా కంపించింది. దానితో ఆయన తన మామూలు చైతన్యస్థితికి తిరిగి వచ్చేశారు. "నువ్వు దూరాన ఉన్న హిమాలయాలకు ప్రయాణం చేస్తావు. గురువు నీకోసం వేచి ఉన్నారు. జాగ్రత్తగా ఉండు. రాధాకృష్ణులు నిన్ను కాపాడుతూ ఉండాలి గాక!" అని అన్నారు. నా తల మీద చేతులుంచి ఆయన ఏడుస్తూ దీవించారు నన్ను.

ఆ రాత్రి, రివాజైన నా ధ్యాన సమయంలో నాకో అసాధారణ దర్శనం కలిగింది; నేనొక అందమైన ఆటవిక గ్రామసీమలో ఉన్నాను. ఒక నది నెమ్మదిగా పక్కన

ప్రవహిస్తోంది. చాలాదూరం నుంచి నమ్మశక్యంగానంత మధురమైన పిల్లనగ్రోవి ధ్వని వినవస్తోంది. ఆడవాళ్ళ నవ్వును విని నేను చుట్టూ చూశాను. అప్పుడే కౌమార దశకు వచ్చిన అందమైన ఆరుగురు ఆడపిల్లలు కనిపించారు. వాళ్ళందరూ రంగురంగుల బట్టలూ ఆభరణాలూ పెట్టుకొని నా దగ్గరగా నిలుచున్నారు. "వెళ్ళు, ప్రేమదేవుడు, నీ ప్రియుడైన కృష్ణుడు తన వేణువుతో నిన్ను పిలుస్తున్నాడు" అని ఒకావిడ నన్ను కవ్వించింది. తతిమ్మావాళ్ళు నన్ను ఉసిగొలుపుతూ ముసిముసి నవ్వులు నవ్వారు. నా గాజుల మణికట్లను ఘల్లుఘల్లుమనే గజ్జెల్నీ చూసుకొన్నాను. అకస్మాత్తుగా నేను ఆ పడుచుల్లో ఒకత్తెనని తెలుసుకున్నాను.

నా సహచరుల్లో ఒకత్తె "ఇక్కడ ఈ అద్దంలో ఒకసారి చూసుకొని నీ రూపాన్ని సరిదిద్దుకో" అంది. నాకో గుండ్రని అద్దం చేతికందించింది. దాంట్లో నగలు పెట్టుకొన్న అందమైన పడుచు నన్ను చూసి నవ్వుతూన్నట్టు చూశాను. తటాలున నేను కలవర పడ్డాను. అద్దంలో నా బుగ్గలు సిగ్గుతో ఎర్రబారడాన్ని చూశాను. ముసిముసి నవ్వులు నవ్వుతూ నా సహచరులు "ఈవిడ సిగ్గుపడుతోంది!" అని అన్నారు. విల్లులా వంగిన నా కనుబొమ్మల్నీ, మత్తుతో బరువెక్కిన కనురెప్పల వెంట్రుకల్నీ, ఎర్రని పెదవుల్నీ చూసుకున్నాను. ప్రతీదీ బాగుంది. నేను నా ప్రియతముణ్ణి కలుసుకోడానికి సిద్ధంగా ఉన్నాను.

నేను సిగ్గుతోనూ ఆవేశంతోనూ కొంచెం కంపించాను. సంగీతం ఆగిపోయింది. మంచి గంధం తాలూకు ఘాటైన వాసన అక్కడ వాయువులో నిండిపోయింది. వెనక నుంచి ఎవరో నా భుజాలను పట్టుకున్నారు. గజ్జెలూ గాజులూ గలగలలాడుతూ ఉండగా ఆడపిల్లలందరూ పారిపోయారు. నేను వెనక్కి తిరిగి నా నల్లటిప్రియుడైన కృష్ణుడి తామరస నేత్రాల్లోకి తొంగిచూసి స్పృహ తప్పిపోయాను. నేను తిరిగి లేచేసరికి తెల్లారిపోయింది. మరొక్కసారి మాత్రమే నా జీవితంలో ఇటువంటి అనుభవం కలిగింది. అది చాలా ఏళ్ళ తరవాత బృందావనంలో జరిగింది.

తిరువనంతపురంలో సామూహిక సంకీర్తనమనే "నగర సంకీర్తన"ను ప్రవేశ పెట్టిన వాళ్ళలో ప్రథముడు స్వామీ అభేదానంద. అవిచ్ఛిన్నంగా పవిత్రమైన దైవ నామాలను సంకీర్తించడమనే "అఖండ నామసంకీర్తన" ను ప్రారంభించిన వాళ్ళలో కూడా ఈయనే ప్రథముడు. అది ఈ రోజుకీ సాగుతూనే ఉంది. అభేదానందాశ్రమంలో వంతులవారీగా జనుల సంకీర్తన చేస్తూ ఉంటారు. ఆ సంకీర్తనం ఆగనే ఆగదు.

ఆ ప్రక్రియల గుణాలను కానీ దోషాలను కానీ చర్చించడం నా ఉద్దేశం కాదు. బహుశా అవి కొంతమందికి ఉపయోగకరంగానే ఉంటాయి. కానీ స్వామీ

అభేదానందుల సరళమూ అమాయకమూ అయిన భక్తి ప్రవృత్తి, నాలో గాఢమైన భక్తి వైఖరిని లేవదీసింది. అది నా చైతన్యపు మూలమూలల్లో ఎంత లోతులోతుగా దాగి ఉందంటే దాని ఉనికి నాకే తెలియదు.

చెంపజన్నిస్వామి తరహా వేరుగా ఉంటుంది. ఆయన చూడడానికి అంతగా మనోహరంగా ఉండడు. ఆయన శరీరం సన్నగా, దాదాపుగా అస్థిపంజరంలా ఉంటుంది. ఆయన జడలుకట్టిన జుట్టు తల చుట్టూ ఒక విచిత్రమైన టోపీలాగ చుట్టినట్టుంటుంది. "సొగసు" అనే మాటకున్న సాంప్రదాయికమైన అర్థాన్ని బట్టి చూస్తే ఆయన సొగసైనవాడు కాదు; ఆయన చాలా తక్కువగా మాట్లాడతాడు. రోడ్డుమీద ఎవరైనా ఆయన్ని కలుసుకుంటే పిచ్చివాడని పొరబాటు పడవచ్చును. ఆయన మామూలుగా తన నడుము చుట్టూ ఒక తెల్ల తువ్వాలు చుట్టబెట్టుకొని చిన్న పూరి గుడిసెలో నేలమీద కూర్చొని ఉంటారు.

చెంపజన్ని అనేది ఒక కుగ్రామం పేరు. అది తిరువనంతపురం పొలిమేరల్లో ఉంది. అది శ్రీనారాయణ గురువు జన్మస్థలంగా అప్పటికే ప్రసిద్ధమయింది. నేను ప్రీ డిగ్రీ చదివిన మా లయోలా కాలేజీ, చెంపజన్నీకి పెద్ద దూరమేమీ కాదు. అంచేత ఒక మధ్యాహ్నం ఆ స్వామిని కలుసుకోవచ్చునని అక్కడికి నేను వెళ్ళాను.

అప్పటికి మేము ఓ కొత్త ఇంటికి మారిపోయాం. అక్కడి మా ఇరుగుపొరుగు వాళ్ళలో ఒకరు స్వామివారి పేరును చెప్పారు. అలా చెప్పిన వారి పేరేమిటో నాకిప్పుడు గుర్తులేదు కానీ, ఆ పొరుగువారి నుంచే స్వామి మునుపు చెంపజన్నీ గ్రామంలో టీ కొట్టు నడిపేవారని తెలిసింది. ఒక రాత్రి ఉత్తరాది నుంచి వచ్చిన ఒక సంచారక సాధువు ఆయనకు శ్రీరామ మంత్రదీక్షనిచ్చాడు. ఆ నామాన్ని అవిచ్ఛిన్నంగా జపిస్తూండగా త్వరలోనే నామం తనను పూర్తిగా ఆవరించిందని తెలుసుకున్నాడు స్వామి. దానితో ఆయనకు ఎంత మత్తెక్కిందంటే భౌతికమైన ఏ పనీ చేయగలిగేవాడు కాదు. టీ కొట్టుని వదిలేసి దగ్గర్లోనే ఉన్న అడవిలో ఉంటూ చాలాకాలం గడిపాడు.

కొన్ని సమయాల్లో రామభక్తుడూ వానరరూప దేవుడూ అయిన హనుమంతుడి భావం ఆయనను ఆవరించింది. అప్పుడాయన కోతిలాగే ప్రవర్తిస్తూ చెట్లకొమ్మల మీదే ఉంటూ, గింజలు తింటూ ఒక చెట్టు నుంచి మరో చెట్టుకి ఊగుతూండేవాడు. తన దేవుడైన రాముడి దర్శనమైన తరవాత చెట్లమీద నుంచి కిందకి వచ్చి, రాములవారి చిన్న గుడి పక్కనున్న పూరిగుడిసెలో ఉండడం మొదలుపెట్టాడని చెబుతారు. ఆయనను కలుసుకోడానికి అక్కడికే నేను వెళ్ళాను.

గుడిసె అవతల ఒక్కగానొక్క మనిషే ఉన్నాడు. నేను నా ఉద్దేశాల్ని వివరించ గానే, అతను గుడిసెలోకి వెళ్ళి చిటికలోనే తిరిగివచ్చాడు. "నువ్వు లోపలికి వెళ్ళవచ్చు" అని మామూలుగా అన్నాడు. మట్టీ, ఆవుపేడలతో చేసి అలికిన ఎత్తైన వేదిక మీద వేసిన వెదురు చాప మీద కూర్చుని దుర్బలంగానూ జడలు కట్టిన జుట్టుతోనూ ఉన్న స్వామిని చూశాను. "రా" అని ఏ రకమైన భావనాపూర్వక పరిచయాలు లేకుండానే నాకు సైగ చేశారాయన. నేనాయన దగ్గరకు వెళ్ళేను. "కూచో" అన్నారాయన. ఆయన ఎదురుగుండా నేను కూర్చున్నాను.

నావైపు తీక్షణంగా చూస్తూ "రామాయణం" అని అన్నాడాయన. "నేను చదివాను కానీ నేను...." అని చెబుతూండగా మధ్యలోనే నన్ను ఆపుతూ "అది సరిపోదు" అని అన్నారు.

"మరి?"

"రా–మాయనం" అని అన్నాడాయన.

ఈసారి నాకు అర్థమైంది. నొక్కి చెప్పడంతో స్పష్టమయింది. ఆయన రామాయణ మహాకావ్యం గురించి మాట్లాడడం లేదు. ఆయన ఆ మాటను రెండుగా – 'రా'–'మాయనం'గా విడదీశాడు. అప్పుడాయన చెప్పాడు – "రా" అంటే రాత్రి, చీకటి, 'ఇరుట్టు' (Irrtu). ఆ చీకటి పోవాలి. అప్పుడే నువ్వు రాముణ్ణి చూస్తావు" అని.

నేను నా చెవులను నమ్మలేకపోయాను. పూర్వం టీ చేసుకునే (బతికే) ఒక నిరక్షరాస్యుడు ఇక్కడ ఇంత సూటిమాటల్లో ఒక గొప్ప వేదాంత సత్యాన్ని ప్రకటించాడు. సత్యమైన రాముణ్ణి దర్శించడానికి ముందు అజ్ఞానాంధకారం పోవలసిందే. చెట్టునుంచి చెట్టుకు ఉరుకుతూ గింజలు తింటూ కోతిలాగ ప్రవర్తించిన అతనేనా ఇతను!

ఆయన మౌనంలోకి వెళ్ళిపోయాడు. నేనొక అరగంటపైగా వేచి ఉండి తరవాత సెలవు తీసుకుందామని నిశ్చయించుకున్నాను. వెళ్ళి వస్తానని చెప్పడానికి లేచి నిలుచుని ఆయన పాదాలను తాకాను. ఆయన స్ఫుటంగా కోతి మాదిరి ధ్వనిని చేసి తన కుడిచేతి చూపుడు వేలుతో నా నుదుటిని తాకాడు. నేనక్కణ్ణించి అవతలకి నడిచి, అప్పటికే ఆలస్యమైపోయింది కనక త్వరత్వరగా బస్సుస్టాండుకి వెళ్ళాను. బస్సులో కూర్చొని నేను, "చీకటి పోవాల్సిందే – అవును, చీకటి పోవాల్సిందే" అని ఆలోచిస్తూనే ఉన్నాను.

ఈ ఇద్దరు మహాత్ములకన్నా స్వామీ తపస్యానంద పూర్తిగా వేరైనవాడు. అప్పుడాయన షష్ఠమంగళం దగ్గరున్న రామకృష్ణ మిషన్‌కి అధ్యక్షుడుగా ఉండేవాడు.

రామకృష్ణ మిషన్ వాళ్ళు ఉచితమైన ఒక ఆసుపత్రిని కూడా నడిపేవాళ్ళు. నేను మహాత్ముడైన రామకృష్ణ పరమహంస గురించీ, ఆయన ప్రఖ్యాత శిష్యుడు, సాటిలేని స్వామీ వివేకానంద గురించీ చదివాను తప్ప, త్రివేండ్రంలో రామకృష్ణ మిషన్ శాఖ ఒకటి ఉందన్న సంగతి నాకు తెలియదు. దాని ఉనికిని ఈ విధంగా కనుక్కొన్నాను;

త్రివేండ్రం సార్వజనిక గ్రంథాలయం నుంచి అనతి దూరంలో 'మ్యూజియం గార్డెన్' అనే అందమైన తోట ఉండేది. అక్కడే నేను మొదట "ద కంప్లీట్ వర్క్స్ ఆఫ్ స్వామీ వివేకానంద" అనే అద్భుత పుస్తక సంపుటాలను చదివాను. గ్రంథాలయం నుంచి తోటకు నడచి అక్కడ ఉన్న బల్లల్లో ఒకదాని మీద మౌనంగా కూర్చోడం నా అలవాటు. ఒక రోజున ప్రకాశవంతమైన ముఖంతో జేగురు బట్టలు కట్టుకున్న ఒక యువక సన్యాసిని కలుసుకున్నాను. కుతూహలంతో అతనెవరని అడిగాను. అతనొక శిశువులాగ నవ్వి తాను రామకృష్ణ మిషన్ తాలూకు వాణ్ణని చెప్పాడు. అది ఎంతో దూరం కాదు. నేను ఆశ్రమాన్ని దర్శించవచ్చునా అని అడిగాను. "తప్పకుండా నీవు, మా నాయకుడూ, మహాత్ముడూ అయిన స్వామీ తపస్యానంద గారిని కలుసుకోవాలి. ఎప్పుడైనా రా. నా పేరు గోలకానంద" అని మళ్ళీ నవ్వుతూ అన్నాడతను.

అంచేత ఒక ఆదివారం పొద్దున్న నేను వెళ్ళేను అక్కడికి స్వామీ గోలకానంద నన్ను స్వామీ తపస్యానందజీకి పరిచయం చేశాడు. ఆయన రామకృష్ణ వర్గ సన్యాసులందరిలాగానే కాషాయ కుర్తా ధోతీల్లో ఉన్నాడు. ఎవరికైనా (ఆయనను చూడగానే) కలిగే మొదటి మనోభావం - నిష్ఠురత్వమూ, క్రమశిక్షణాను. అయితే, రోజులు గడిచిన కొద్దీ ఉద్దేశపూర్వకంగా నిర్మించినట్టున్న (నిష్ఠుర) ముఖభాగం వెనక బాగా దాగి ఉన్న మార్దవమూ వాత్సల్యమూ ఉన్నాయని నేను తెలుసుకున్నాను.

నేను చాలా విషయాలను - ముఖ్యంగా రామకృష్ణ, వివేకానంద ఉద్యమం గురించి- ఆయన నుంచి తెలుసుకున్నాను. మొదటిసారిగా నేను "మానవజాతికి చేసే సేవ మాధవ సేవే" అనే స్వామీ వివేకానంద సూక్తిని అర్థం చేసుకోగలిగాను. ఆ మహా సన్యాసి వివేకానందుడి ప్రేమ భావమయమైన హృదయం, దుఃఖతప్తమైన మానవకోటి కోసం ఏ విధంగా ఎంతగా బాధపడిందో నాకు తోచింది. రామకృష్ణ ఉద్యమం గురించీ రామకృష్ణుల శిష్యుల్లో అత్యంతమూ గొప్పవాడైన స్వామీ వివేకానంద ఆజ్ఞకు లోబడి అవిశ్రాంతంగా పనిచేసిన ప్రముఖుల గురించీ తపస్యానంద నాకు బోధపడేలా చెప్పారు. ఆయనేమో (తపస్యానంద) స్వామీ శివానంద శిష్యులు.

శివానందులు మహాపురుష మహరాజ్‌గా ప్రసిద్ధులు - ఆయన శ్రీ రామకృష్ణ పరమహంసకు ప్రత్యక్ష శిష్యులు. శ్రీరామకృష్ణుల భార్య అయిన శారదాదేవిని సేవించిన వాడాయన; ఆవిడ ఆయనను చాలాసార్లు దీవించింది.

స్వామీ తపస్యానంద గానే నన్ను ప్రొఫెసరు బాలకృష్ణన్ నాయర్‌కు పరిచయం చేశారు. నాయర్‌గారు, స్వామి ఉద్దేశరీత్యా, భార్యాబిడ్డలతో కుటుంబ జీవనం నడుపుతూనే అత్యున్నతమైన వేదాంత శిఖరాలను అధిరోహించినవారు. చాలా ఆదివారాలు, 'కలరి' అభ్యసించడానికి నేను షంగుముఖం బీచ్‌కి వెళ్ళే తోవ మధ్యలో ప్రొఫెసర్ బాలకృష్ణన్ నాయర్ గారి ఇంట్లోకి వెళ్ళి, సరళమైన భాషలో, చాలావరకూ శ్రీరామకృష్ణ పరమహంస చెప్పిన పిట్టకథల్ని ఉపయోగిస్తూ వేదాంత ప్రబోధాలను ఆయన వ్యాఖ్యానిస్తూ ఉండగా నేను వినేవాడ్ని.

చాలా ఏళ్ల తరవాత,స్వామీ తపస్యానంద చెన్నైలోని రామకృష్ణ మిషన్‌కు ప్రధాన నాయకుడుగానూ, మొత్తం రామకృష్ణ వర్గానికి ఉపాధ్యక్షుడు గానూ ఉన్నప్పుడు, ఆయన ఉదారంగా నాకు రామకృష్ణ మంత్రదీక్షనిచ్చారు. అంతకు ముందు రామకృష్ణ పీఠం తాలూకు వివిధ కేంద్రాల్లో శిష్యుడిగా కొంతకాలం గడిపినప్పటికీ నన్ను ఆ మంత్రం చేరలేదు. దీనికోసం (మంత్రదీక్ష) వారికి (స్వామీ తపస్యానందకు) ఎప్పటికీ కృతజ్ఞుడ్నై ఉంటాను.

# 12. మాయీ మా

ఇప్పుడు నేను విచిత్ర నగ్నజీవి అయిన మాయీ మా గురించీ, ఆవిడను నేను కలుసు కోవడం గురించీ చెప్పాలి. మీకు గుర్తుండవచ్చు నేను గోపాలస్వామిని మొట్ట మొదటిసారిగా అనంత నారాయణ పిళ్ళై గారింట్లో కలుసుకున్నానని. అనంత నారాయణ పిళ్ళైగారి నుంచే నేను ముందస్తుగా మాయీ మా గురించి విన్నాను. ఆవిడ అవధూతి అనీ, ఆధ్యాత్మికంగా చాలా ముందంజ వేసినదనీ, సామాజిక ప్రవర్తనల తాలూకు నాజూకుతనాలను ఏ మాత్రమూ పట్టించుకోనిదనీ, కన్యాకుమారి బీచ్ ఇసుకల్లో, ఊరకుక్కలే సహచరులుగా నగ్నంగా ఉంటుందనీన్నూ ఆయన చెప్పారు.

ఈ సమాచారం దొరికిన రెండు రోజుల తరవాత, నేను త్రివేంద్రం నుంచి కన్యాకుమారికి వెళ్లే ఉదయం బస్సెక్కాను. ఆ రోజు ఆదివారం. మధ్యాహ్నానికి కొంత ముందుగా బస్సు కన్యాకుమారికి చేరింది. అదొక వేడి వేసవి దినం. కన్యాకుమారి, (అంటే), కేప్ కోమొరిన్, ఇండియాకి దక్షిణతమ కొన మీద ఉంది. బంగాళాఖాతం, హిందూ మహా సముద్రమూ, అరేబియన్ సముద్రమూ అన్నీ అక్కడ కలుస్తాయి.

ముఖ్యంగా సూర్యోదయ, సూర్యాస్తమయ మరియు పౌర్ణమి రాత్రులు ఆ ప్రదేశం హృద్యంగా గోచరిస్తుంది. ఏ ప్రదేశానిదైనా సరే, దానికున్న సహజ సౌందర్యాన్నీ పవిత్రతని కొల్లగొట్టే మనుష్యకృతమైన ఇటుకా సిమెంటు కట్టడాల నుంచి ఆ ప్రదేశం (కన్యాకుమారి) ఇంకా ముక్తమయ్యే ఉంది, నేను ఉట్టంకిస్తున్న సమయంలో. ఆటు వేళల్లో సాగరానికి అడ్డంగా ఎవరైనా వివేకానంద శిలగా చెప్పుకునే పెద్ద బండ దగ్గరకు ఈది వెళ్ళవచ్చు. వెళ్ళి హుందాగా గర్జించే తరంగాల మధ్య కూర్చొని ధ్యానం చేసుకోవచ్చును. స్వామీ వివేకానందులు ఇక్కడ ధ్యానం చేస్తున్నప్పుడే, బీదల కోసమూ అణగారిన పీడితుల కోసమూ పని చెయ్యాలన్న ఉత్తేజం కలిగింది ఆయనకు.

సముద్రానికి అభిముఖంగా కుమారి దేవత అయిన కన్యాకుమారి తాలూకు ఐతిహాసిక దేవాలయం నిలిచి ఉంది. పూర్వపు రోజుల్లో ఆ దేవతకు ముక్కెరగా పెట్టిన అమూల్యమైన వజ్రం సంకేతదీపంలా పని చేస్తూ నావికులకు తమ ఓడలను నడుపుకోవడంలో సాయం చేసేదని చెబుతారు. అన్ని ఇతిహాసాల్లాగే ఈ కథను నిరూపించడానికి గానీ, కాదని చెప్పడానికి గానీ మనకు ఏ మార్గమూ లేదు. బహుశా అప్పుడు అక్కడ అటువంటి అమూల్యమైన వజ్రం ఉండి ఉండవచ్చు; ఇప్పుడది మాయమై పోయింది. దేవతలు కూడా మనిషి లోభానికి బలి కావలసినదే.

మధ్యాహ్నానికి మూసేస్తారని నేనెరుగుదును కనుక ముందుగా నేను గుడిని చూద్దామని నిశ్చయించుకున్నాను. చవకదైన కృత్రిమ వజ్రం పెట్టిన బులాకితో కూడా ఆ దేవత చాలా అందంగానే ఉందని నేననుకున్నాను. మామూలుగా జరిగేటట్లుగానే, పురోహితుడు నా జేబులో డబ్బుని పసిగట్టి, దేవత ముందు హారతి దీపాన్ని తిప్పాడు. చాచిన పళ్ళెంలో ఒక రూపాయి వేసి, దానిలో ఉన్న చేమంతి పువ్వునీ గంధపు ముద్దనీ తీసుకొని, అవతలకు వెళ్ళడానికి ముందు కిందికి వంగి నమస్కరించాను.

ఇప్పుడింక నేను మాయీ మా కోసం వాకబు చేయాలి. కానీ, అకస్మాత్తుగా పొద్దుట నాస్తా చెయ్యకపోవడం వల్ల నాకు ఆకలి బాగా వెయ్యడం మొదలుపెట్టింది. ఒక అల్పాహారశాలకు పోయి ఏమన్నా తిని, (ఆవిడ గురించి) దర్యాప్తులు కూడా చేద్దామనుకున్నాను. నాకు ముందుగా కనిపించిన 'హోటెల్ మురుగ విలాస్"లో ప్రవేశించి గల్లాపెట్టె ఉన్న స్థలానికి చాలా దగ్గరగా ఉన్న ఒక బల్ల పక్కన కూర్చున్నాను. నేను రుచికరమైన దోసెలు కతుకుతూనే, గల్లాపెట్టె దగ్గర కూర్చుని, బూడిద రంగు జుట్టుతో కళ్ళజోడు పెట్టుకొని వాల్రస్ (ఉత్తర ధ్రువ ప్రాంతంలో ఉండే ఏనుగులాటి జల జంతువు)తో పోలిన మీసంతోనూ బంగారు చేతి గడియారం తోను ఉన్న ఆ హోటల్ యజమానిలా కనిపిస్తున్న అతనిని అడిగాను (మాయీ మా గురించి).

"అవును నేనెరుగుదును మాయీ మా ను" అని అతను చెప్పాడు. ఆవిడ ఎక్కణ్ణించి వచ్చిందో తెలుసునా మీకు అని అడిగాను నేను. "ఎవరికీ తెలియదు. ఓ ముప్ఫై ఏళ్ల క్రితం ఆవిడ కన్యాకుమారిలో కనిపించిందంతే" అని అతను సమాధానం చెప్పాడు. తన చిన్నప్పట్నించీ, తను మొదట చూసిన దగ్గర్నుంచీ, ఆవిడ అలాగే ఒకలాగే ఉంది అని అతను అన్నాడు. ఆవిడ అరుదుగా బట్టలు వేసుకుంటుంది; ఎప్పుడూ ఆవిణ్ణి ఊరకుక్కలు చుట్టుముట్టి ఉంటాయి – వాటితో ఆవిడ అన్నం పంచుకొని తింటూ ఉంటుంది.

అప్పుడు మధ్యవయస్కుడైన హోటల్ సేవకుడొకడు మాతో మాటలు కలుపుతూ, ఆవిడ మనుష్యరూపంతో ఉన్న జగన్మాతేనని నొక్కి చెప్పాడు. అతనికెలాగ తెలుసునని నేనడిగినప్పుడు అతను తనకు తేలికగా కొట్టిపారెయ్యలేని చాలా అనుభవాలు కలిగాయని చెప్పాడు. "ఆవిడకు అన్నం ఎక్కణ్ణించి దొరుకుతుంది?" అని నేనడిగాను. మొదట్లో జనమంతా ఆవిడను పిచ్చిదనుకుని అన్నం పెట్టడానికి నిరాకరించేవాళ్ళు. ఆవిడ కడలి దగ్గరకు నడిచి కేవలం తన చేతులతోనే చేపలు పట్టుకొందని చెబుతారు. ఆవిడ తడిగా ఉన్న కడలి కలుపు మొక్కల్ని, ఆ చేపల మీద పోగుగా పోసి, ఆ

పొగులోకి కొన్నిసార్లు ఊదింది. అంతే, చూడండి, హఠాత్తుగా నిప్పు ప్రజ్వరిల్లి చేపలు తినడానికి సరిపోయేలాగ కాలాయి.

ఈ సంఘటన తరవాత, కొంతమంది ఆవిడకు అన్నం పెట్టడం మొదలు పెట్టారు. ఒక అన్నశాలకి వెళ్ళి ఆవిడ అన్నం కోసం అడిగిందంటే చాలు అది వాళ్ళకు మంచి అదృష్టానికి గుర్తు అని, చాలా భోజనశాలాధిపతులు ఇప్పుడు నమ్ముతారు; ఆవిడకు సుష్ఠుగా అన్నం పెడతారు. అయితే, అలాగ ఆవిడ అరుదుగానే చేసేది.

"ఆవిడను నేనెక్కడ చూడగలుగుతాను?" అని నేనడిగాను. కోవెలకు అవతల ఉన్న రాతి కట్ట మీదుగా కిందకు దిగి వెళ్ళమని నాకు సలహా ఇచ్చారు. ఆవిడ సాధారణంగా తన కుక్కలతో ఒడ్డున వెదజల్లినట్టున్న బండల చాటున కూర్చొని ఉంటుంది.

నేను తినడం పూర్తయింది. కొన్ని దోసెలను పొట్లంగా కట్టించుకొని, నాకు వివరాలు చెప్పిన వాళ్ళ సలహా ప్రకారం, పట్టు దొరకకుండా సంచరించే మాయీ మా ను చూద్దామని నేను బయలుదేరాను. ఆ సమయానికి, ఇసుక సలసలా కాగుతూన్నట్టు వేడిగా ఉంది. మడమలకు కట్టే పట్టీలున్న కాలిజోళ్ళను వేసుకొని ఉన్నానని సంతోషపడ్డాను.

ఒడ్డు గట్టు మీదుగా ఒక్కోసారి, ఇసుక మీదుగా ఒక్కోసారి, రాళ్ళమీద ఎక్కుతూ దిగుతూనూ కిందకు వచ్చాను. కుక్కల గుర్రుగుర్రుమనే శబ్దం వినగానే ఆగాను. అన్ని రంగుల్లోనూ పరిమాణాల్లోనూ ఉన్న ఆరు కుక్కలు అర్ధచంద్రాకారంగా ఒక పెద్ద బండ ముందు నిలుచొని పళ్ళు చూపిస్తూ నన్ను చూసి గుర్రుమంటున్నాయి. ఆగి, మిటకరిస్తూ చూడడం తప్పించి నేనేమీ చెయ్యలేకపోయాను; అవి నా మీద దాడి చేయకుండా ఉంటాయని ఆశించాను. బండ వెనక నుంచి సంగీత ధ్వనిలాంటిదే (అయినా) విసుగు పుట్టించే లయలో ఉన్న ఆడ గొంతుక వినిపించింది. ఆ మాటలేమీ అర్థం కాలేదు కానీ, ఆ ధ్వనులు మాత్రం ఉపశమింపజేసేలాగ ఉన్నాయి. కుక్కలు గుర్రమనడం మానేసి నెమ్మదిగా తప్పుకుంటూ రాళ్ళ వెనకకు వెళ్ళిపోయాయి. ధైర్యాన్ని పుంజుకొని నేను ముందుకు సాగి, బండ వెనకకు చూశాను.

అక్కడ ఆవిడ మరో రాతిమీద జార్లాపడి చంటిపిల్లలాగ నగ్నంగా కూర్చొని ఉంది. ఒక సమయంలో ఈ సూర్యదగ్ధమైన నల్లబారిన ముఖం ఎంత అందంగా ఉండేదో కదా అని నేను ఆశ్చర్యపోకుండా ఉండలేకపోయాను. బూడిద రంగులో

ఉన్న అధౌతమైన ఆమె జుట్టు బాగా ఒత్తుగానూ ఎక్కువగానూ ఉంది. ఆవిడ నవ్వినప్పుడు ఆవిడ ముఖం మిలమిలా మెరిసింది. ఆవిడ కళ్ళు ఓహో! ఆవిడ కళ్ళు... ఏమని వర్ణించగలను నేను! విపరీతమైన ప్రేమతో తన బిడ్డను పిలిచే తల్లిలా ఆవిడ "ఆవో" (రా) అని అంది.

కన్నీరు కారుస్తూ చంటిపిల్లాడిలాగ బిగ్గరగా ఏడుస్తూన్న నన్ను చూసి నేనే విస్తు పోయాను. నా శరీరమంతటినీ కుదిపేస్తూన్నట్టున్న ఆ వెక్కులు నా గుండెలోని ఒక లోతైన కుహరం నుంచి బయటకు తోసుకు వస్తూన్నట్టనిపించాయి. ఆవిడ పాలిండ్లను చీకి, మానవ కరుణాక్షీరాన్ని తాగుదామనిపించింది. కాని నా పెంపకం నన్ను అడ్డగించింది.

మాయీ మా తన చేతులను చాచి నా శరీరంలోని ప్రతి అంగుళాన్నీ వాత్సల్యంతో లాలనగా స్పృశించింది. ఆవిడ తన శ్రావ్య కంఠధ్వనితో ఏవో అర్థం కాని మాటలు అంటూనే ఉంది. కొంతసేపైన తరవాత, కన్నీరు కార్చడం వల్ల భారాలన్నీ కడిగేసినట్టయ్యి నేను తేలిక పడ్డాను. నన్ను నేను కుదుటపరచుకొని నేను తెచ్చిన దోసెలను గుర్తుకు తెచ్చుకొని అవి ఆవిడకు అందించాను.

ఆ పొట్లం విప్పి ఆవిడ ఒక దోసెను తన కోసం అట్టే పెట్టుకొని, మిగిలినవన్నీ తనతో బాటుండే కుక్కలకి పంచి పెట్టింది. ఒక ముక్కను నా నోట్లో పెట్టి, నా ముఖం మీద మెల్లగా తట్టి నేనర్థం చేసుకున్న ఒక మాట అంది – "జావో, జావో" (వెళ్ళు, వెళ్ళు) అని. అదే వెళ్ళిపొమ్మన్నదానికి గుర్తుగా తీసుకొని ఆవిడ పాదాలమీద సాష్టాంగపడ్డాను. తరవాత లేచి, ఇవతలకి వచ్చేశాను.

నేను బస్స్టాండు వైపుకు నడుస్తూండగా, సుదూరంగా మూడు సాగరాల తరంగాలతోనూ మాటిమాటికీ ప్రక్షాళితమవుతూ ఉన్న వివేకానంద శిలను చూశాను. తన ప్రియతముడైన శ్రీరామకృష్ణను కలుసుకొన్నప్పుడు ఇటువంటి మానసికావేశాలనే స్వామీ వివేకానందులు పొందుంటారేమో! (అని అనిపించింది) త్రివేండ్రం వెళ్ళే బస్సు సిద్ధంగానే ఉంది. నేనా బస్సెక్కి త్రివేండ్రం చేరాను.

చాలా ఆలస్యంగా ఇంటికి చేరుకున్నాను. మా అమ్మ ఇంకా మెలకువగానే ఉంది. రాత్రి భోజనాన్ని వేడిచేసి డైనింగ్ బల్ల మీద పెట్టి ఆవిడ పడక గదికి తిరిగి వెళ్ళిపోయింది. ఏ ప్రశ్నలూ అడగలేదు. ఆవిడ (లోపలికి) వెళ్ళిపోతోతూ "చాలా ఆలస్యమయింది. తిని పడుకో ఇక" అని మాత్రమే అంది.

ఆ రాత్రి నాకో దర్శనం కలిగింది. భారీ మర్రిచెట్టు ఒకటి (రోడ్ల) కూడలి మధ్య ఉంది. ఆ చెట్టు కింద బుద్ధాసనంలో నేను మఠం వేసుకొని కూర్చొని ఉన్నాను. నేను సన్నటీ, ఒక్క గోచీ గుడ్డ తప్ప మరే బట్టలూ లేకుండా, జడలు కట్టిన జుత్తుతోనూ నల్లటి గడ్డంతోనూ ఉన్నాను.

ఆ రోడ్లలో ఒక రోడ్డు నుంచి ఒక మొరటు చేతికర్ర పుచ్చుకొని ఎవరో వచ్చారు. ఆవిడ దగ్గరకి రాగానే, నేను ఆవిడను పోల్చుకున్నాను. ఆవిడ మాయీ మా. కానీ ఇప్పుడావిడ వంగవన్నె చీర కట్టుకొని ఉంది. నేను ఆవిడను చూస్తూండగానే ఆకస్మికంగా ఆవిడ పొడుగెదిగింది – దాదాపు ఆ వటవృక్షమంత పొడుగయింది. ఆవిడ నా వైపు చూసి నవ్వుతూ ఇలా అంది: "నాకు ఆకలిగా ఉంది. ఏమన్నా తినడానికి పెట్టు" అని. నా దగ్గర ఏమన్నా అన్నం ఉందన్నమాట నాకు గుర్తు లేకపోవడం వల్ల నేను చిక్కులో పడ్డాను.

"నీ భిక్షాపాత్రలో చూడు" అందావిడ. దాంట్లోకి చూస్తే ఒక అన్నం మెతుకు ఉంది. అది ఆవిడకు క్షమాపణ చెప్పుకుంటూ ఇచ్చాను. దానిని ఆవిడ చాలా ఆస్వాదిస్తూ తింది. కుడిచేత్తో నా నుదుటిని తాకింది. "నీ కళ్ళు మూసుకో" అంది ఆవిడ. నా నుదుటి మీద నుంచి అనిర్వచనీయమైన ఆనందతరంగం నా శరీరంలో ప్రవేశించి ప్రతికణంలోనూ వ్యాపించింది! అప్పుడు నేను మేలుకున్నాను. తెల్లారి చాలా సేపే అయింది. అద్భుతాల్లోకల్లా అద్భుతమేమిటంటే, నా శరీరం ఇంకా ఆనందంతో స్పందిస్తోంది. అది ఎంతగా స్పందిస్తోందంటే నేను నా కాళ్ళ మీద నిలకడగా నిలుచోలేని తాగుబోతులాగ ఉన్నాను.

ఏదో విధంగా స్నానాల గదివైపుకు తప్పటడుగులతో నడిచి వెళ్ళి, తేలికపడి మళ్ళీ పక్కమీదకు తిరిగి వెళ్ళి పడుకున్నాను. నాకు ఒంట్లో బాగోలేదనీ నేను కాలేజీకి వెళ్ళలేననీ అమ్మకు చెప్పాను. నా నుదుటిమీద చెయ్యేసి చూసి నాకు చాలా జ్వరముందనుకొంది ఆవిడ. ఆ రోజు పొద్దున్న అల్పాహారంగా నాకు "కంజి" (అన్నపు గంజి) మాత్రమే దొరికింది. సాయంత్రానికి ఆ తాపం చల్లారింది. నేను సామాన్యస్థితికి తిరిగి వచ్చేశాను. ఆ గుర్తు మాత్రం ఎప్పటికీ నిలిచే ఉంది.

# 13. పవిత్రోన్నతత అవగతం కావడం

మనం ముందుకు సాగబోయేముందు మరొక పవిత్రమైన సమావేశాన్ని చెప్పాల్సి ఉంది. మాకు తెలిసిన ఒక వడ్రంగి ద్వారా పూంతురాలో ఒక విచిత్రమైన మహాత్ముడున్నాడని విన్నాను. ఆయన జనులను తన్నుతూ ఉంటాడుట. నేను కలడి మస్తాన్‌ను కలిసిన బీమపల్లికి పూంతురా అంత దూరమేమీ కాదు. క్రిస్టమస్ సెలవుల్లో ఒక శుక్రవారం నాడు నా కుతూహలం నా వైముఖ్యాన్ని కాదని ఒక విపరీత మనస్తత్వమున్న వాళ్ణి చూడడానికి సిద్ధమై పూంతురాకి వెళ్ళే పొద్దుటి బస్సు ఎక్కించింది. అక్కడికి చేరిన తరవాత, ఇసుక మీద కూర్చొని ఉన్న ఒక అపురూపపు మనిషి చుట్టూరా చిన్న గుంపు ఉండడం చూశాను.

అతని శుష్కించిన నల్లటి శరీరం మీద మకిలి పొరలున్నాయి. ఒక నడుము వస్త్రం తప్పిస్తే మరే బట్టా లేదు అతనికి. అతని జెడలు కట్టిన జుట్టూ, గడ్డమూ ఎంత పొడుగ్గా ఉన్నాయంటే అవి నేలకు తాకుతున్నాయి; అతని కళ్ళు భయంకరంగా ఉన్నాయి. అవి అస్తమానూ అటూ ఇటూ కదులుతూ బోనులో ఉన్న జంతువుకి మల్లే వ్యాకులంగా ఉన్నాయి. నేనూ ఆ గుంపులో చేరాను. కొంతసేపైన తరవాత, ఇక వెళ్ళిపోవడం ఉత్తమం అని నేను అనుకొంటూండగా, ఆ విచిత్రమైన మనిషి నన్ను దగ్గరగా రమ్మనమని సైగ చేశాడు. నేను వెనుదీస్తూంటే నా దగ్గర నిలుచుని ఉన్న ఎవరో ఒకతను "వెళ్ళు, వెళ్ళు, మంచి అదృష్టం" అని అన్నాడు.

అనిష్టంగానే నేను ముందుకు వెళ్ళి అతని సమీపంలో నిలుచున్నాను. వంగమని సైగ చేశాడు అతను. నేను మోకరిల్లి ఒక్కసారి గుప్పున దట్టమైన కంపు తాకుతుందని ఎదురుచూస్తూ, నా తలను అతని వైపుకు వంచాను. ఆశ్చర్యంగా, నాకు వేసినది సువాసన. కానీ మరొకటి మాత్రం నన్ను తాకింది; అది కూడా గట్టిగా వాయగొట్టే లాగ తాకింది.

హెచ్చరించకుండానే ఆ వింత మనిషి కూర్చున్న దశలో ఉంటూనే, మోచేతుల మీద వంగి నా కుడి చెంప మీద గట్టితాపునిచ్చాడు. నేను ఒక మెరుపును చూశాను; నేలమీద పడి ఒక దొర్లు దొర్లాను. ఆ మీద నేను లేచి నా చెంపను చేతితో రాసుకున్నాను. ఏ మాటలు మా మధ్య జరగలేదు. ఆ స్వామికి నామీద ఇష్టం తప్పి నట్టుంది. ఆయన మరోవైపు చూస్తున్నాడు. ఇంక అక్కడ వేళ్ళాడి లాభం లేదని చూసి నేను అవతలకు నడిచి బస్‌స్టాప్‌కు వచ్చేశాను.

గతంలో కొన్ని నెలల క్రితం తల కిందపెట్టి వేసే శీర్షాసనం అభ్యసిస్తూ పడిపోయినప్పుడు, నా వెన్ను కింద భాగంలో కుడివైపున నొప్పి వచ్చింది. బస్సెక్కిన

తరవాత ఆ నొప్పి పూర్తిగా మాయమైపోయిందని అర్థమైంది నాకు. నేను వెనక్కి తిరిగి వెళ్ళి ఆయనకు ధన్యవాదాలు చెబుదామా వద్దా అని లోపల చర్చించుకుంటూ ఉండగా బస్సు కదలడం మొదలుపెట్టింది. ఆ వింత మనిషికి మానసికంగానే ధన్య వాదాలను చెప్పుకున్నాను. మళ్ళీ ఎప్పుడూ అతనిని నేను చూడలేదు. పూంతురా స్వామి నా ఆధ్యాత్మిక వికాసాన్ని ఎంతవరకూ ప్రభావితం చేశారన్న మాట నేను చెప్పలేను గానీ, స్వభావసిద్ధంగా నేను సంశయాళువుని కనక నడుంనొప్పి మాయం కావడం తటాలున వచ్చి పడిన అదృష్టమని భావించాలా అని విస్తుపోయాను.

నాకు జరిగిన సమావేశాల వివరణలు చదివిన తరవాత మీకు బహుశా ఆశ్చర్యం వేయవచ్చు – నేను కలిసిన విశిష్ట వ్యక్తుల్లో చాలామంది అసాధారణ జీవితాన్ని గడుపుతూ విచిత్ర పద్ధతుల్లో ప్రవర్తిస్తూ నగ్నంగానూ మురికిగానూ ఉన్నట్టుగా ఉన్నా రేమిటబ్బా అని. హిందూ ఆచారంలో ఆ విధంగా ఉన్మత్తంగా కనిపించే పవిత్ర స్త్రీ పురుషులను అవధూతలని పిలుస్తారు; సూఫీ ఆచారంలో వాళ్ళను మస్తులనీ, లేకపోతే, మస్తానులనీ పిలుస్తారు.

నిర్నిబంధమైన సత్యం తోటి సంసర్గం కారణంగా, అవధూతలూ మస్తానులూ అని మనం చెప్పుకొనే ఆధ్యాత్మికంగా ముందంజ వేసిన వర్గం వారు, నాగరికమని వ్యవహృతమయ్యే ఈ సమాజం, మానవుల మీద మోపిన అన్ని రకాల నిబంధనల నుంచీ షరతుల నుంచీ విముక్తులైన వాళ్ళే. సాధారణ సాంఘిక ప్రవర్తనల ప్రమాణాలను తెగదెంచుకొని వాళ్ళు (సామాన్యంగా మనం అనుకొనే) స్వస్థచిత్తత ఉన్నవాళ్ళకన్నా పిచ్చివాళ్ళలాగే ఎక్కువగా అనిపిస్తారు. వారిలో ఒకడ్ని, అతని పిచ్చి ధోరణుల గురించి అడిగినప్పుడు, ఈ భూమ్మీద ఎక్కడైనా స్వస్థచిత్తత ఉన్నవాడ్ని తాను ఇంకా కలుసుకోవడం పడలేదని చెప్పాడని చెబుతారు. "ప్రతివాడూ ఏదో ఒకదాని గురించో మరో దాని గురించో పిచ్చిలో పడే ఉంటాడు" అని అన్నాడుట ఆయన. అతని ప్రకారం, ఒక పిచ్చివాళ్ళ సంస్థలో ఉన్నవాళ్ళకీ, దాని బయట ఉన్నవాళ్ళకీ ఉన్న ఒకే ఒక్క తేడా ఏమిటంటే – వాళ్ళు "లోపల" ఉన్నారు, వీళ్ళు "బయట" ఉన్నారు – అని మాత్రమే.

అవధూత తాలూకు సహజ స్థితిని అనుకరిస్తూ దిగంబరంగా ఉంటూనో వింత విధాలుగా ప్రవర్తిస్తూనో ఉండే పవిత్ర జనుల వర్గం కూడా ఒకటి ఉంది. నాగసాధులూ దిగంబర జైనులూ ఏమో, వాళ్ళ నగ్నత్వాన్ని త్యాగానికి ప్రతీకగా చెబుతారు – బట్టలతో సహా అన్నిటినీ వదిలిపెట్టి చంటిపిల్ల తాలూకు సహజ సరళత్వానికి తిరిగి చేరడమని దానిని వాళ్ళు వివరిస్తారు.

సూఫీ సంప్రదాయం తాలూకు 'మస్తుల'ను మస్తులని పిలవడానికి కారణం, వాళ్ళెప్పుడూ ప్రేమపారవశ్యమనే మత్తుదశలోనూ, ప్రియతముడితో సతత సంసర్గం లోనూ ఉన్నట్టుగా చెబుతారు. మామూలు పిచ్చివాడికీ పవిత్ర ఉన్మాదికీ మధ్య తేడాని చూపించే గీత ఎంత సన్నమంటే, చాలా సందర్భాల్లో ఒక పిచ్చివాణ్ణి మహాత్ముడిగానూ, లేకపోతే, దానికి వ్యతిరేకంగానూ కూడా మనం పొరబాటు పడవచ్చు. నిజానికి ఇలాగ జరగడం ఏమీ అసాధారణ సంఘటన కానేకాదు. రెంటినీ (రెండు వర్గాలనూ) వేరుపరచడానికి మనకు చాలా తక్కువ మార్గదర్శక సూత్రాలున్నాయి. (ఆధ్యాత్మిక) అన్వేషకుల్లో చాలామందికి, స్థిరచిత్తతతో కనిపించే ఎవరినుంచైనా మార్గదర్శకత్వాన్ని అంగీకరించడమే మేలని చెప్పుకోవాలి.

విపరీత పద్ధతుల్లో ప్రవర్తించే మరో వర్గం మహాత్ములు కూడా ఉన్నారు. వీళ్ళు వ్యక్తిగత సమయాల్లో పూర్తిగా సంతులనతోనే ఉంటారు గానీ, అయోగ్యులను దూరంగా ఉంచడానికి వింత ధోరణులతోనూ అశ్లీల వైఖరులతోనూ ప్రవర్తిస్తూ ఉంటారు. సూఫీ వర్గంలో ఉన్న అటువంటి ఒక తెగని మలమతీలంటారు. (Malamathis)

ఇప్పుడిక నేను పరిచితమైన వాటి బంధాలనూ, ప్రియులూ సన్నిహితులూ అయిన వారి బంధాలనూ తెంచుకొని విశాలతర మార్గాలనూ దృశ్యాలనూ పరిశీలించడానికి ఆరాటపడుతూన్న స్థితి ప్రారంభంలో నిలిచి ఉన్నాను. నిశ్చితమైన అడుగు వేయడాన్ని గానీ, తప్పుదారిలో మళ్ళడాన్ని గానీ అడ్డగించగలిగిన రెండు ముఖ్యమైన సంగతులు నాకు సంతుష్టినిచ్చే విధంగా విచ్చుకొనిపోయాయి. నేను (దీన్ని) వివరిస్తాను –

మొదటిది – సాంప్రదాయికమైన ఇస్లాం, మార్మికమైన అభ్యాసాలంటే ముఖం చిట్లిస్తుంది. నేనే కనక 'వాహబీ' (Wahabi) సంప్రదాయంలో శిక్షితుణ్ణయి ఉంటే నేను ఇంటిని వదిలిపెట్టి వెళ్ళాలని గానీ, కొంతసేపటికైనా నా సామాజిక బాధ్యతలను వదిలిపెడదామని గానీ అనుకొనేవాణ్ణే కాను. అదృష్టం కొద్దీ, మా చెల్లెలికీ నాకూ ఖురానూ, షరియతూ నేర్పడానికి నియుక్తుడైన ఇబ్రహీం భాయీ అనే అధ్యాపకుడు సూఫీ మార్గీయుడిగా తేలాడు. సూఫీ బోధనల్లోని అంతర్మర్మాలను నాకు తెలియజెప్పి నందుకు గానూ ఆయనకు నేను ఎల్లప్పటికీ ఋణగ్రస్తుణ్ణై ఉంటాను. చాలా రోజులు, ముఖ్యంగా, ఏదో ఒక కారణం మూలంగా, మా చెల్లెలు ఆ క్లాసులో లేకపోతే, ఆయన ఆ మార్గ ప్రయాణీకుల బోధనలను చక్కగా నా ఎదుట విపులీకరించేవాడు. దానితో, ఎటువంటి త్యాగాలు చెయ్యవలసి వచ్చినా (వెనుదీయకుండా), ఆ ఆధ్యాత్మిక ఖజానాను వైయక్తికంగా వెదకడానికి నన్ను ఉత్తేజితుడిగా చేసి ఉత్సాహపరిచేవాడు.

రెండోది - మహితాత్ములు ఆధ్యాత్మికాన్వేషకులందరికీ చేసే ఒక్కగానొక్క ముఖ్యమైన హెచ్చరిక: అద్భుత శక్తులుగా చెప్పుకొనే శక్తులూ వాటిని పొందాలనే కోరిక కలగజేసే ఆకర్షణకు లోబడకుండా జాగ్రత్తపడాలని (వాళ్ళు పదేపదే చెబుతూ ఉంటారు). "ఒక మహాత్ముడు గారడీశక్తుల్ని ప్రదర్శిస్తుంటే అతని దగ్గర నుంచి వీలైనంత దూరంగా పారిపో" అని చెప్పేంతవరకూ కూడా (చొరవ చూపించారు) శ్రీ రామకృష్ణ పరమహంసగారు. చిన్నప్పట్నించీ గారడీ అంటేనూ అతి ప్రాకృతిక శక్తులనుకొనే శక్తులంటేనూ మహా ఇష్టముండేది నాకు. అప్పటికే గారడీ చమత్కారాల గురించీ, విధివిహితమైన గారడీ గురించీ రాసిన గ్రంథాలతో నాకు బాగా పరిచయం ఉంది. అంతేకాదు, నేను చాలా మంత్రగాళ్ళను కలుసుకొని, వాళ్ళ కపట తంత్రాలనూ ఉపాయాలనూ వృత్తి రహస్యాలనూ వ్యక్తిగతంగా ఎంత నేర్చానంటే కాలేజీలోనూ, ఇతర చిన్నిచిన్ని సభల్లోనూ పూర్తిస్థాయి ఇంద్రజాల ప్రదర్శన నిర్వహించేవాణ్ణి - వాటిలో గాలిలోకి తేలడం, గొప్ప ఇండియన్ మోకుమాయను చూపించడం, స్త్రీని రెండు ముక్కలుగా రంపంతో కోయడం అనేవి ఉండేవి.

గాలిలోంచి విబూదిని పుట్టించడం, బంగారపుటుంగరాల్నీ స్ఫటిక లింగాలనూ ఉత్పాదించడం వగైరా వగైరా నాకు పసిపిల్లలాటలాంటివి. ఈ అసాధారణ కార్యాలను వారి వారి శిష్యుల ముందు ప్రదర్శించి ఆయా "మహాత్ములకు" కోపాన్ని తెప్పించిన వాణ్ణయ్యాను కూడా. ఇక్కడ చెప్పొచ్చే విషయమేమిటంటే, గారడీని, అద్భుతాలను చెప్పుకొనే వాటినన్నిటినీ బాగా లోతుగా అధ్యయనం చేసినా కూడా వాటికి నేను మునుపటిలాగ లోబడి లేను. (అదీగాక) వాటి ప్రదర్శనను నేను పెద్ద గొప్పనుకోను. అంచేత నేను, వీటిని ఎరగా ఉపయోగించి భోళా జనాన్ని దోపిడీ చేసే "మహాత్ముల" చేత ఆకర్షితుణ్ణై తప్పుదోవ పట్టే మహా అపాయం నుంచి విముక్తుణ్ణయ్యాను. ఎంత కష్టమైనా సరే, విశుద్ధుడైన ఆధ్యాత్మిక గురువుని వెతికి పట్టుకోడానికే నేను సంసిద్ధమయ్యాను; కాషాయ బట్టలు చుట్టుకున్న మాంత్రికుల మాయలో ససేమిరా పడదలచుకోలేదు.

# 14. ప్రయోగాత్మకమైన పరీక్ష

ఈపాటికి నాకు వెళ్ళాలనే అభిలాష ఎక్కువైపోయింది. హిమాలయాల ఆకర్షణ ఆపుకో లేనిదయింది. గొప్ప మేఘాలు ఏర్పడటాన్ని చూసిన ప్రతిసారీ నా ఘనమైన ఊహ హిమవత్ శిఖరాలనే ఆవాహనం చేసేది. మంచు ఆవరించిన మనస్సుతో నగ్నమైన బండరాళ్ళ గుట్టలకు కూడా నేను తెల్ల రంగే పూసేవాణ్ణి.

హిమావాసం నన్ను దూరం నుంచి పిలుస్తూనే ఉంది. నా కలల్లో, ఎత్తైన వెండిరంగు కొండల పక్కనున్న గుహల్లో ధ్యానం చేస్తున్న మహా యోగుల్ని చూశాను. ఒక ప్రత్యేకమైన కలలో నేనొక యోగిని చూశాను – నేను తొమ్మిదిన్నర ఏళ్ళున్నప్పుడు పనస చెట్టు కింద చూసిన ఆయనే ఆ యోగి అని నాకు రూఢిగా తెలిసింది. ఆయన హిమాలయాల్లో ఎక్కడో ఒక గుహ దగ్గర నాకోసం వేచి చూస్తూ నిలుచొని ఉన్నారు.

అదే నా కల చేసిన సూచన. హిమాలయాల గురించి చెప్పే, దొరికే పుస్తకాల నన్నిటినీ – యాత్రావర్ణనలూ రైల్వేగైడ్లతో సహా – అన్నీ చదివి క్రియా ప్రణాళికను విపులంగా చిత్రీకరించుకున్నాను.

అసలు సమాగమానికి ముందుగా పరీక్షార్థం ప్రయోగపూర్వకమైన ప్రయాణం ఒకటి చేయడం మంచిదని నాలోని క్రియారూపమైన భాగం చొరవ చూపించింది. ఇంటి నుంచి దూరంగా వెళ్ళే పదిరోజుల చిన్నపాటి (ప్రయాణం) ఒకటి నా లక్ష్యాన్ని నెరవేరుస్తుంది. ఒకటేమిటంటే, అంత సమయం పాటు నాకుగా నేను బతకగలనా లేదా అన్నది తెలుస్తుంది; రెండోది – తిరిగి వచ్చినపుడు నా తల్లిదండ్రులు, ముఖ్యంగా నన్ను బాగా ఇష్టంగా ప్రేమించే మా అమ్మ, దానినెలాగ స్వీకరిస్తుందో నాకు తెలుస్తుంది; మూడోది – నాకు బాగా ఇష్టమైన ఐదున్నరేళ్ళ మాత్రమే ఉన్న మా రెండో చిన్న చెల్లెలితో కలిగే ఎడబాటు నన్నెంతగా ప్రభావితం చేస్తుందో తెలుసుకోవచ్చు.

తిరునల్వేలికి కొద్ది దూరంలో, తామ్రపర్ణి నదీతీరంలో, పోత్తాల్‌పుత్తూర్ (Pottalputhur) అనే కుగ్రామంలో ఒక సమాధి ఉందని రిటైర్డ్ మేజిస్ట్రేట్ అయిన మా చుట్టం ఒకరు చెప్పగా విన్నాను. అక్కడ ఒక చెప్పుల జత ఉంది. ఆ చెప్పులు గొప్ప సూఫీ మహాత్ముడైన అబ్దుల్ ఖాదిర్ గిలానీవని జనులు నమ్ముతారు. అక్కడ (ఆ ఊళ్ళో) ఖాదరియా సూఫీ ఫకీర్ల చిన్న వర్గం ఉండేది.

అదీగాక, అక్కణ్ణించి కొద్దిదూరంలో ఉన్న దట్టమైన అడవుల్లో ఒక గుట్టమీద ఉన్న గుహలో ఒక అనామక మహాత్ముడి గోరీ ఉందని నాకు చెప్పారు. ఈ సూఫీ

సముదాయం తరచు అక్కడికి పోతూ ఉంటుంది. కొన్ని రాత్రుల్లో ఈ గుహను విచిత్ర జీవులు దర్శిస్తూ ఉంటారని పుకారు ఒకటి పుట్టింది కూడానూ.

నా గమ్యంగా పోత్తాల్‌పుత్తూరును ఎన్నుకున్నాను. త్రివేండ్రం నుంచి అదేమంత దూరం కాదు. చిల్లర ఖర్చుల నిమిత్తం పెద్దవాళ్ళు అప్పుడప్పుడిస్తూ ఉండే డబ్బు నా దగ్గర చాలినంతగా ఉండడం వల్ల, ఇప్పుడు టికెట్లు కొనుక్కోడానికీ ఇతర ఖర్చుల కోసం కొంత అట్టే పెట్టుకోడానికీ అది సరిపోతుంది. నాగర్‌కోయిల్ పోయే బస్సు నెక్కాను. అక్కడికి వెళ్ళిన తరవాత తిరునల్వేలికి బస్సు దొరికింది. సాయంత్రానికల్లా పోత్తాల్‌పుత్తూరు చేరుకున్నాను. నేను తొడుక్కున్న తెల్లచొక్కా తెల్ల ధోతీ మాత్రమే నా దగ్గరున్నాయి. నా మెడ చుట్టూ చుట్టబెట్టుకున్న తెల్లటి పెద్ద తువ్వాలు కూడా ఒకటి ఉంది. నేనెక్కడికి పోతున్నాననేది ఇంటి దగ్గర ఎవ్వరికీ తెలియదు.

పోత్తాల్‌పుత్తూరులో నేను విన్న సూఫీ వర్గాన్ని కనుక్కోడానికి నాకెంతో సమయం పట్టలేదు. సమాధికీ దానికి అనుబంధంగా ఉన్న మసీదుకీ పెద్ద దూరం కాని చోట ఉన్న వెల్ల వేసిన భారీ మిద్దె, ఆ సూఫీ వర్గం వారి అనువంశిక నాయకుడైన ఈనాందారు షేక్ ఇల్లు అని నాకు తెలిసింది. ఆ షేక్‌గారి మేడకు వెళ్ళాను. కొంతసేపు నిరీక్షించిన తరవాత ఆయన సన్నిధికి నన్ను పిలిచారు. (అతన్ని చూడగానే) నేను ఆశ్చర్యపడ్డాను. మామూలుగా ఉన్నాడాయన; మామూలు బట్టలే వేసుకొని ఉన్నాడు – తెల్ల చొక్కా తెల్ల పంట్లామూను. శుభ్రంగా ఒబ్బిడిగా ఉన్న నల్ల గడ్డాన్నీ, సన్నని మీసాల్నీ సరదాగా కనబరుస్తూన్న అందమైన మధ్యవయస్కుడాయన. తలపాగా లేదు; చివరికి టోపీ కూడా లేదు.

ఆయన కుర్చీ వెనక గోడ మీద, ఆకుపచ్చ బట్టలతోనూ జేగురు రంగు తలపాగాతోనూ, వేలాడుతూన్న గడ్డంతోనూ ఉన్న ఒక విశిష్ట పురుషుడి చిత్రం ఉంది. నేను దానిని చూస్తున్నానని చూసి ఆయన "మా నాన్న" అని చెప్పేడు. ఇష్టాగోష్ఠిగా కొన్ని విషయాలను చర్చించుకున్నాం. సూఫీ వర్గంలోకి నన్ను చేర్చుకోమని అడిగినప్పుడు ఆయన రెండు కారణాలు చెబుతూ మర్యాదగానే నా మనవిని తిరస్కరించాడు: ఒకటి, అభ్యర్థికి నలభై ఏళ్ళు వస్తేనే గానీ దీక్ష సంభవం కాదు; రెండోది – సూఫీగా అయ్యేవాడు సమగ్ర జీవితాన్ని గడపాలి, అంచేత, వైవాహిక జీవితానుభవం విధాయకం. నేను అవివాహితుణ్ణి కనక వేచి ఉండాల్సిందే. దీక్ష మినహాయించి సూఫీ తత్త్వం గూర్చి చర్చించడానికి సిద్ధంగానే ఉన్నాడాయన. మసీదుకు అనుబంధంగా ఉన్న శయనాగారంలో నేను నిద్రపోడానికి ఆయన

అయిష్టంగానే ఒప్పుకున్నారు; అయితే, ఆయనతో బాటు నన్ను భోజనం చేయమని మాత్రం పట్టుబట్టారు.

నేను మసీదు దగ్గరకు పోయి రాత్రి హాయిగా నిద్రపోయాను. మర్నాటి తెల్లవారు ఝామునే "ము అజ్జిన్" (Muazzin) ప్రార్థనా శబ్దానికి నాకు మెలకువ వచ్చింది. నేను సాంప్రదాయిక "నమాజ్" విధిని నమ్మకపోయినా, అక్కడ కూడిన కొద్దిమందితో నేనూ కలిశాను. వజ్రాసనంలో* కూర్చొని తరువాత ధ్యానం చేసాను. మసీదు మీద ఉన్న పావురాలు అవిచ్ఛిన్నంగా వాటి కువకువల బృందగానాన్ని చేస్తూనే ఉన్నాయి.

షేక్‌తో పొద్దుటి నాస్తా తిని, తరవాత ఖాదరీయ వర్గంలోని కొంతమంది ఫకీర్లను కలుసుకున్నాను. వారి ప్రముఖుడి మాదిరిగా కాకుండా, వాళ్ళు పూర్తిగా సూఫీ ఫకీర్ల సాంప్రదాయికమైన పొడుగుపాటి గెడ్డాలనూ కాషాయపు తలపాగాలనూ ధరించి ఉన్నారు. వాళ్ళకు షేక్ గారు నన్ను పరిచయం చేశారు. వాళ్ళతో మా మధ్య జరిగిన చర్యలను గురించి చెప్పారాయన.

మళ్ళీ నేను షేక్‌ను భోజన సమయంలో కలుసుకున్నాను. (అప్పుడు) సూఫీ సిద్ధాంత అభ్యాసాల గురించి చాలా విషయాలు తెలుసుకున్నాను. ఆయన నాకు అలీ హుజివిరి (Ali Hujiwiri) రాసిన సూఫీ బోధనల ప్రముఖ గ్రంథం కస్ఫ్ అల్ మెహ్‌జూబ్ (Kasf-al-Mehjoob) (గుహ్య రహస్యోద్ఘాటనలు) తాలూకు అనువాదాన్నీ, సర్దార్ ఇక్బాల్ అలీ షా రాసిన "ద సూఫీస్" అనే పుస్తకాన్ని చదవడానికి ఇచ్చారు. వారి వర్గంలోని బాగా అనుభవం ఉన్న సభ్యుణ్ణి ఒకతన్ని నాతో ఆ బోధనల గురించి స్వేచ్ఛగా చర్చించమని ఆదేశించారు కూడాను. ఆ విధంగా నాకు కాలక్షేపమయింది అక్కడ; రాత్రింబగళ్ళు నాకు చాలా మంచి ఆనందకరమైన ధ్యానాలు సాగేవి. అక్కడి భోజనం కూడా బాగుంది.

ఏడు రోజుల తరవాత, అడవిలో ఉన్న ఆ గుహకి వెళ్ళే విషయాన్ని గురించి మాట కదిపి ఏ దిశలో ఏ విధంగా వెళ్ళాలీ అనే సంగతులను అడిగాను. నాకు వెళ్ళే దిశానిర్దేశాలైతే ఇచ్చారు కానీ, షేక్‌గారు మాత్రం నేనొక్కణ్ణీ అక్కడికి వెళ్ళడానికి

---

* *(ఘేరండసంహిత 2-12):*
*జంఘాభ్యాం వజ్రవత్కృత్వా గుదపార్శ్వేపదావుభౌ*
*వజ్రాసనం భవేదేతద్యోగినాం సిద్ధిదాయకమ్ ॥*
*(కాలి పిక్కలను వజ్రప్రాయంగా దృఢంగా ఉంచి గుదానికి అటూ ఇటూ కాళ్ళు నుంచి నిటారుగా కూర్చోడమే వజ్రాసనం.)*

ఒప్పుకోలేదు. ఆ అడవి చాలా దట్టమైనదనీన్నూ, చుట్టూ చిరతపులులు తిరుగుతూ ఉంటాయనీన్నూ, అదీగాక ఆ గుహకు మార్గం అంత సులువుగా దొరకదనీన్నూ ఆయన చెప్పారు. అంచేత ఆ హల్కా (సమాజం) లోని దృఢంగానూ పొడుగ్గానూ మేక గెడ్డం మాదిరి తెల్లటి గడ్డమున్న ఇబ్రహీమ్ అనే ఒక పురాతన సభ్యుణ్ణి నాతో వెళ్ళేలాగానూ, అతనితోబాటు మితభాషీ, పొట్టిగానూ దృఢంగానూ ఉన్న అతని సహాయకుడైన ఒక యువకుడు కూడా వచ్చేలాగానూ ఏర్పాటు చేయడం జరిగింది.

ఇక అపరాహ్ణం వేళ మేమొక బస్సెక్కాం. అది మమ్మల్ని ఒక గంట తరవాత దూరంగా ఏకాకిగా ఉన్న ఒక గ్రామం దగ్గర వదిలిపెట్టింది. షేక్ (చెప్పిన) మాట సరి అయినదే. అది నిజంగా మహా గహనమైన అడవే; చాలాచోట్ల సహాయానికి వచ్చిన ఆ యువకుడు దారిలో వెళ్ళడానికి వీలుగా చేయడానికి కొన్ని ముళ్ళ పొదలను కొట్టవలసి కూడా వచ్చింది. అక్కడక్కడ భయంకరంగా కనిపించే పెద్దపెద్ద బొమ్మలున్నాయి: అవి ఆదివాసులు ఆరాధించే ప్రసిద్ధికెక్కిన కుశల బేతాళ మాంత్రికులవి. కొన్నిచోట్ల ఈ వనదేవతలకు (అడవి దేవతలకు) బలి ఇచ్చిన జంతువుల తలలూ ప్రేవులూ మాకు కనిపించాయి. అది చాలా భయంకరంగా ఉంది.

దాదాపు చీకటి పడుతున్న వేళకు మేము ఆ గుట్టకు చేరుకున్నాం. ఆ రాతిని మెట్ల మాదిరిగా మలిచారు. పది నిమిషాల్లోనే మేము పైకి ఎక్కేశాం. పురాతనమైన భారీ వృక్షాలు గుహ చుట్టూ (పహరా కాస్తున్నట్టు) రక్షిస్తూ నిలిచి ఉన్నాయి. చీకటి పెరుగుతోంది. ఆ యువకుడు హసన్ వంటచెరకుని పోగు చేయడంలో మునిగిపోయాడు. ఇంతలో నేను గుహను పరిశీలించాను. అది పెద్దదేమీ కాదు; ఖాళీగానే ఉంది కానీ ఎవరో ఇంతకుముందే వచ్చి, దాన్ని శుభ్రపరిచినట్టుగా ఉంది.

గుహ ద్వారంలో గోరీ ఉంది. అది మలంగ్ బాబా అనే సంచారక సూఫీ మహాత్ముడి గోరీ అని ఇబ్రహీమ్ సాహెబ్ వివరించారు. అతను అగరువత్తులు వెలిగించి కళ్ళు మూసుకొని ప్రార్థన చేశాడు. అప్పటికి, గుహ దగ్గరగా ఉన్న పెద్ద చదును రాతి ప్రదేశం మీద ఒక పెద్ద మంట వెలిగించారు. గుహకు కొద్దిగా అవతల ఉన్న ఒక సహజమైన బుగ్గ నుంచి మంచినీటిని హసన్ సంపాదించాడు. నా సహచరులు గుడ్డ సంచుల్లో కొన్ని సామగ్రులు పట్టుకొచ్చారు. వెలిగించిన అగ్ని మీద ప్రత్యక్షంగానే చపాతీలు చేయడంలో నిమగ్నమయ్యాడు హసన్. చింతపండు, ఉల్లిపాయలు, కొబ్బరి కోరు, ఎర్రమిర్చి, ఉప్పు అన్నీ కలిపి నూరి చెట్నీ చేశారు. నేనూ ఇబ్రహీమ్ సాహెబూ చేతులూ, ముఖమూ, కాళ్ళూ కడుగు కొని ధ్యానం చేసుకున్నాం.

కొంతసేపైన తరవాత మేము కలిసి కూర్చొని మా ఆకలితో రుచికరంగా పదునెక్కిన చెట్నీలో రొట్టెలను నంజుకుంటూ కడుపు నిండా తిన్నాం.

భోజనం తరవాత, ఇబ్రహీం సాహెబూ, హసనూ వాళ్ళ గిలకల తప్పెట్లు తీసి (వాయిస్తూ) ఉర్దూలో ప్రియతముడి మీద ప్రేమనూ కాంక్షనూ ప్రకటించే రెండు అందమైన సూఫీ గీతాలు పాడారు. తరువాత మేము వాళ్ళిద్దరూ తెచ్చిన గడ్డిచాపల మీద సాగిలపడి పడుకున్నాం. అగ్ని ఇంకా ప్రదీప్తంగా మండుతూనే ఉంది. నేను నిద్రలోకి కూరుకుపోబోయే ముందు ఇబ్రహీం సాహెబ్ "మేము తప్పించి ఎవరైనా రాత్రిపూట లేపితే నన్ను పిలవండి. చీకట్లో అడవిలోకి పోయే పొరపాటు మీరు చేయకండి. రాత్రిపూట మీరు దేహబాధ తీర్చుకోడానికి (మలమూత్ర విసర్జనానికి) ఈ రాళ్ళతిప్ప అంచు వరకూ మాత్రమే వెళ్ళండి" అని అన్నారు. దీని తరవాత, కొంతసేపటి వరకూ భయం కొద్దీ నిద్ర పోలేకపోయాను. అయితే, అప్పుడప్పుడే వీచడం మొదలుపెట్టిన చల్లగాలి సాయంతో నా అలసట నన్ను గాఢనిద్రలోకి తోసి జోకొట్టింది. నేనెంతసేపు నిద్రపోయానో చెప్పలేను గానీ తెల్లవారడానికి కొంతసేపుందనగా నా కుడిభుజాన్ని ఎవరో లాగుతూన్నట్లై మెలకువ వచ్చింది నాకు. ఏదో ఒక అడవి జంతువు నా వేళ్ళను నమలడానికి ప్రయత్నిస్తున్నదని నాకు ముందస్తుగా అనిపించింది. కానీ నేను కుడివైపుకు తిరిగి నా దృష్టిని నిలపగానే నా కంటబడినది నన్ను భయంతో కొయ్యబారేలాగ చేసింది; నా జుట్టు నిక్కబొడుచుకొంది.

ఒక చీపురు చంకన పెట్టుకొని విషణ్ణ ముఖంతో ఉన్న ఒక పళ్ళు లేని ముసలి వగ్గు నా పక్కన మోకరిల్లి ఉంది. బొమికల్లాటి తన వేళ్ళతో నా కుడిభుజాన్ని గుంజుతూనే మూలుగుతూన్న కంఠంతో "రా అబ్బాయీ! నాతో రా. నేను జబ్బుపడ్డ ముసలిదాన్ని. నాకు సాయం చేయడానికి రా, రా, రా ....." అని గుసగుసలాడింది.

ఇబ్రహీమ్ సాహెబ్బు గారి హెచ్చరిక వెంటనే గుర్తుకొచ్చింది. కానీ నేను నాకు దగ్గరగానే నిద్రపోతున్న ఇబ్రహీం సాహెబ్‌ను తాకడానికి కూడా నా ఎడమచేతిని కదల్చలేకపోయాను; పోనీ అని సాయం కోసం అరవనూ లేకపోయాను. నా మొత్తం శరీరం స్వరతంత్రులతో సహా స్తంభించుకుపోయింది. అంతా భయావహంగా ఉంది. ఆ ముసలిది తన ముఖాన్ని నా ముఖం దగ్గరగా తెస్తోంది. కుళ్ళిన మాంసపు కంపు నా ముక్కుపుటాల్ని కొట్టినట్టు తాకింది. నేను కళ్ళు మూసుకున్నాను. ఒక ఆఖరి తెగింపు చేద్దామని నిశ్చయించుకున్నాను.

నా హృదయకేంద్రం మీద మనస్సును నిలిపి ఉంచాను; దాని నుంచి ధగధగ మనే వెండికాంతి తీగ ఒకటి బయల్దేరి సాయాన్ని అర్థిస్తూ ఇబ్రహీమ్ సాహెబ్ వైపుకు వెళ్తోందని ఊహించాను. అది పని చేసింది. నా ఎడమవైపు నుంచి ఒక పెద్ద అరుపు వినవచ్చింది. ఇబ్రహీం సాహెబ్ ఒక గెంతు గెంతి, గుహ బయట వేసిన అగ్ని నుంచి మండుతూన్న కట్టెనొకదాన్ని తీసుకొని నా వైపుకు వచ్చాడు. ఆ దయ్యం ఆయనకు కూడా కనిపిస్తోందని నేను ఊహించాను. ఆయన ఆ కట్టెను ఆ దయ్యం వైపుకు పెట్టి బిగ్గరగా తమిళంలో ఏదో మంత్రాన్ని చదివాడు.

అది మాయమైపోయింది. స్తంభనం వీడిపోయింది. నేను లేచి కూర్చున్నాను. హసన్ కూడా లేచాడు. కొంతగా విచలితుడైనట్టుగా కనిపించాడు. ఇప్పుడేమైంది చాలా సామాన్యంగా అని నేను అడిగినప్పుడు ఇబ్రహీమ్ సాహెబ్ ఉత్తినే ఇలా అన్నాడు: "ఆటవిక ప్రేతాల్లో ఒకటి అది. (అవి చాలా) దుష్టమైనవి" అంతకన్నా మించి మరేమీ చెప్పలేదు.

తెల్లారగానే స్నానాదులు చేసి ధ్యానం చేసుకొని తిరుగు ప్రయాణం మొదలు పెట్టాం. నేను రెండు రాత్రులుందామని అనుకున్నాను. కానీ హడలుగొట్టిన ఆ రాత్రి అనుభవం సరిపోయింది ఆ అంశాన్ని తేల్చవేయడానికి. ఇబ్రహీం సాహెబ్, హసన్‌లతో నేను వెనక్కి వెళ్ళిపోయాను.

పొత్తాల్‌పుత్తూర్‌లో మరో రోజున్న తరువాత, ఈనాందారు దగ్గర సెలవు తీసుకొని బస్సెక్కి త్రివేంద్రానికి సాయంత్రానికి చేరుకున్నాను. స్థానిక బస్సు ఎక్కడానికి నా దగ్గర డబ్బుల్లేకపోవడం వల్ల, అంత దూరమూ నడిచి మా ఇంటికి వెళ్ళాను. నేను ఏ బట్టలు కట్టుకొని వెళ్ళానో ఆ బట్టలతోనే తిరిగివచ్చాను. ఆ బట్టలు చాలా మురికిగా తయారయ్యాయి; నా ముఖం గెడ్డం గీసుకోకుండా ఉండడంతో మాసిపోయి ఉంది. ప్రతి అంగుళమూ నేను ఒక దేశదిమ్మరిగా కనిపించాను.

నన్ను చూసిన వాళ్ళలో మా అమ్మ మొదటిది. నన్ను కౌగిలించుకొని ఏడ్చేసింది. మా చిన్న చెల్లెలు చాలా ఉత్తేజితురాలయింది. ఇప్పుడు అది నా పడక గదికి వచ్చి నాతో మళ్ళీ ఆడుకోవచ్చు. మా మరో చెల్లెలు పైకే భావననూ చూపించలేదు కానీ నేననుకున్నాను అది కూడా సంతోషించిందని. మా నాన్న నాతో ఒక నెలపాటు మాట్లాడలేదు కానీ ఆ తరవాత కరిగి మెత్తబడ్డాడు.

నేను, మేం మారిన కొత్త ఇంట్లో పైనున్న చిన్న అటక మీద ధ్యానం చేస్తూనే చాలాసేపు గడపడం మొదలుపెట్టాను. ఆ ఇంటికి "చంద్రవిలాస్" అని పేరు పెట్టారు. నాకు ధ్యానంలో కొత్తకొత్త ఊహించని అరుదైన అనుభూతులు కలుగుతూ ఉండేవి.

ఇంటినుంచి దూరంగా ఉండడమనే దానిని రుచిచూశాను కనకనూ, నా కుటుంబం నుంచీ మిత్రుల నుంచీ మానసికోద్వేగ సంబంధ భావాల నుంచీ నన్ను నేను విముక్త పరచుకోవడమనే స్వీయ పరీక్షలో ఉత్తీర్ణుడనయ్యాను కనుకనూ, నేను ఆ సుదూర హిమాలయాలకు ఇక ఎగిరి వెళ్ళిపోదామని ఉవ్విళ్ళూరుతున్నాను. నా కోసం ఎవరో నిరీక్షిస్తున్నారక్కడ. ఆ పిలుపు రోజురోజుకీ బలవత్తరమవుతోంది. నేను తగిన అవకాశం కోసం ఎదురు చూస్తున్నాను.

పరీక్ష రుసుము చెల్లించడానికి నాకిచ్చిన డబ్బు రూపంలో ఆ అవకాశం నాకు ప్రస్తుతమయింది. దీన్ని మరో పరీక్షను, నాకు ఇంతకన్నా ముఖ్యమైన పరీక్షను పాస్ కావడానికి ఉపయోగించవచ్చునని నేను నిశ్చయించుకున్నాను. నా స్నేహితుడు రంజిత్ కొక్కడికే నా దీర్ఘ ప్రయాణ ప్రణాళికల గురించి తెలుసును. అతను మరికొంత డబ్బు సాయం చేశాడు. నేను వెళ్ళడానికి సిద్ధమయ్యాను.

# 15. హిమాలయాల వైపు

ఫిబ్రవరిలో ఒక సుందరమైన సాయంత్రం పూట చెన్నై ఎక్స్‌ప్రెస్ ఎక్కాను. హిమాలయాల వైపు నా ప్రయాణం ప్రారంభమయింది. నాకు రమారమి ఇరవై ఏళ్ళు వచ్చాయి.

ఆ రోజుల్లో చెన్నై చేరడానికి ఇరవై నాలుగు గంటల కన్నా ఎక్కువ సమయమే పట్టేది. ఎంత వీలైతే అంతగా నా తోటి ప్రయాణికులతో మాట్లాడడాన్ని తప్పిస్తూనే వచ్చాను. మరుసటి రోజు సాయంత్రం ఏదో ఒక టైముకి ఎగ్మోర్ స్టేషన్‌లోకి వచ్చింది మా ట్రైన్. మా తాతగారు (అమ్మ నాన్నగారు) చెన్నైలో ఉండేవారు. సెలవుల్లో అక్కడికి మూడుసార్లు వెళ్ళాను కనక ఆ ప్రదేశంతో నాకు పరిచయం బాగానే ఉంది. చెన్నైలో బస్సుల సర్వీస్ బావుంటుంది. థియోసాఫికల్ సొసైటీకీ, రామకృష్ణ మిషన్‌కీ, మైలాపూర్‌లోని కపాలీశ్వర దేవాలయానికీ మొదలైనవాటికి ఎలా వెళ్ళాలో నేను ఎరుగుదును. కానీ ముందుగా హిమాలయాలకు వెళ్ళే దారిలో ఉన్న ఢిల్లీకి టికెట్టు కొనాలి.

ఎగ్మోర్ స్టేషన్ నుంచి చెన్నై సెంట్రల్‌కి వెళ్ళడానికి బస్సెక్కాను. బుకింగ్ ఆఫీసులో ఢిల్లీ వెళ్ళడానికి సెకండ్ క్లాసు స్లీపర్ టికెట్ ఆ రోజు నుంచి మూడో నాటికి దొరికింది. దగ్గర్లో ఉన్న చిన్న చవక హోటల్‌లో గది తీసుకున్నాను. గదిలో చేరగానే, బట్టలు మార్చుకుని స్నానం చేసి మసాలా దోశ ఒకటి తిన్నాను. తరువాత పక్కమీద కూర్చొని ధ్యానం చేసుకున్నాను. అలసిపోయాను కనక త్వరగానే నిద్రపోయాను. మర్నాడు రామకృష్ణ మిషన్, కపాలీశ్వరుడి కోవెల, థియోసాఫికల్ సొసైటీలను చూస్తూ గడిపాను.

థియోసాఫికల్ సొసైటీతో సంబంధాలన్నీ తెంచుకొని ఆ దివ్యజ్ఞానుల తాలూకు మాస్టర్లనందర్నీ వారి ఊహాకల్పితమైన కట్టుకథలుగా కొట్టిపారేసిన జె. కృష్ణమూర్తి గారి జీవిత కథనీ బోధనలనీ నేను చదివాను. అయితే, వైయక్తికంగా నాకు మాత్రం ఖచ్చితంగా మహా ఆధ్యాత్మిక గురువులు ఉన్నారని దృఢమైన అభిప్రాయముంది. ఇంతకు ముందు ఒకసారి సముద్రం దగ్గరున్న విశాలమైన థియొసాఫికల్ సొసైటీ ప్రాంగణాన్ని దర్శించినప్పుడు నాకు వారి వాస్తవికమైన, స్పర్శవేద్యమైన సన్నిధీ మహా శాంతీ కలిగాయి. ఈసారి అక్కడున్న పెద్ద మర్రిచెట్టు దగ్గరున్న ఒక బల్లమీద నేను కూర్చొన్నప్పుడు ఒక విశాలత్వమూ, నిశ్శబ్దతా నన్ను ఆవరించాయి. నేను తలపెట్టిన సాహసిక కార్యం గురించిన నా ఆరాటాలన్నీ దీనితో సద్దుమణిగాయి; పునరాశ్వాసనం కలిగింది.

తరువాత మోతీబాబా అనే ఒక ప్రసిద్ధ సూఫీ మహాత్ముడి సమాధిని దర్శించి సాయంత్రానికి హోటల్‌కి తిరిగి వచ్చాను. చాలా ఆకలిగా ఉంది. పూర్తి దక్షిణాది భారతీయుడి భోజనం ఆరగించాను. తరవాత ధ్యానానికి కూర్చొనే ముందు, బట్టలు మార్చుకుని నాతో బాటు తెచ్చుకున్న స్వామీ వివేకానందుడి కంప్లీట్ వర్క్స్‌లోని రెండో సంపుటాన్ని చదివాను.

ధ్యాన సమయంలో నా హృదయ కేంద్రంలో తప్పకుండా నిశ్చలంగా కనిపించే తెల్లటి కాంతి ఆ రాత్రి కెంపు వన్నెగా మారింది; ఆ మీద దట్టమైన ఊదా రంగుగా పరిణమించింది. ఆ ఊదా ఫలకం పరుచుకొనిపోయి మధ్యలో పగిలి ఒక హిమాలయ సన్నివేశాన్ని గోచరింపజేసింది: మంచుబట్ట కట్టిన ఆ శిఖరం పాదం దగ్గర ఒక చిన్న గుహను చూశాను. ఎవరో ఒకతను బయట నిలుచుని ఉన్నారు. స్పష్టంగా ఆ రూపాన్ని చూడలేకపోయాను. అది పొగమంచు కమ్మినట్టు మసకగా ఉంది. నన్నేదో వింత పేరుతో పిలుస్తూన్న కంఠధ్వనిని విన్నానని అనిపించింది నాకు. అది కూడా నాకు అర్థం కాలేదు. త్వరలోనే నేను నిద్రపోయాను.

మర్నాడు పొద్దున్నే న్యూఢిల్లీ ఎక్స్‌ప్రెస్సు ముప్పరస (త్రీటయిర్) స్లీపర్ రైలు పెట్టెలో నేను కూర్చున్నాను. అదొక సాదాసీదాగా నడిచిన ప్రయాణం. అదంతా చాలా వరకు నాకే పరిమితంగా ఉంచుకున్నాను. నలభై ఎనిమిది గంటల తరవాత పొద్దున్నే రైలుబండి న్యూఢిల్లీకి చేరింది. ఢిల్లీకి ఇది నా మొదటి ప్రయాణం. ఇంద్ర ప్రస్థమనే ఈ పాండవుల పురాతనపురం తాలూకు ఆధునిక ప్రతి నాకేమీ ప్రీతిని కలిగించలేదు.

హరిద్వార్‌కి బండి పాత ఢిల్లీ రైల్వేస్టేషన్ నుంచి బయలుదేరుతుందని దర్యాప్తులతో తెలిసింది. నేనొక సైకిల్ రిక్షానెక్కి త్వరలోనే ఆ స్టేషన్‌కి చేరాను. ఇది పాతదీ, మురికితరమైనదీ అయిన ఢిల్లీ భాగం. చాలా మేడలు, ఆకృతిలో అతి ప్రభావ వంతమైన ఎర్రకోట (Red fort), జామా మసీదు అనేవి దీర్ఘకాలం సాగిన మహ్మదీయ పరిపాలన తాలూకు జ్ఞాపక చిహ్నాలు. ఢిల్లీని పరిపాలించిన వృద్ధుడూ బలహీనుడూ అయిన చివరి మొగలాయీ చక్రవర్తి బహదూర్ షా జఫర్ ఎర్రకోట నుంచే ఇంగ్లీష్ వాళ్ళకు విరుద్ధంగా సిపాయిల తిరుగుబాటును నడిపించాడు. కానీ మహా ఘోరంగా ఓడిపోయాడు.

పొద్దున్న ఎనిమిదింటికి డెహ్రాడూన్ రైలు ఎక్కాను. అది హరిద్వార్ దగ్గర ఆగింది. దానికి ఎనిమిది గంటల కన్నా ఎక్కువే పట్టింది. హరిద్వార్ సాయంత్రానికి చేరింది.

ఋషీకేశానికి వెళ్ళే రైలు పొద్దున్నే వెళ్ళిపోయింది. అంచేత హరిద్వారంలో కొంత సమయం గడుపుదామని నిశ్చయించుకున్నాను.

బద్రీనాథ దేవుడు "హరీ", కేదారనాథ దేవుడు "హరుడూ" ఉంటూన్న ఉచ్ఛ హిమాలయ శ్రేణికి ద్వారం కనుకనే ఈ ఊరిని హరిద్వారం అంటారు. మొట్టమొదటి సారిగా "హరీకీ పౌరీ" దగ్గర ఠీవిగా ప్రవహిస్తూన్న నది, గంగ, మీద నా దృష్టిని సారించాను. ఆశ్చర్యకరంగా ఉంది. అక్కడ చాలామంది పర్యటకులూ తీర్థయాత్రీకులూ వారి వారి వ్యవహారాల్లో మునిగి ఉన్నా అవేమీ నన్ను ఆ స్వచ్ఛశీతల నిత్యప్రవాహ జలాల నుంచి నా ధ్యాసను మళ్లించలేకపోయాయి.

అప్పుడు నేను చటుక్కున నా మనస్సుకు తట్టిన ఒక పని చేశాను: నేను ఒక పసుప్పచ్చ ధోవతుల జత నీ, పసుప్పచ్చటి, పొట్టిచేతులతో మోకాళ్ళ దాకా సాగి ఉండే ఒక కుర్తా జత నీ, ఒక పసుప్పచ్చటి గుడ్డ సంచీనీ నా కోసం కొనుక్కున్నాను. అప్పుడు నేను మంగలి షాపుకు పోయి నా తలవెనక ఒక చిన్నమేర గుండ్రటి భాగాన్ని తప్పించి తలనూ మీసాలనూ గొరిగించుకున్నాను. వందల ఏళ్ళ నుంచీ హిందూ సంప్రదాయపు బ్రహ్మచారులు ధరించే పిలకలాటి శిఖ ఇది.

మహాదూరమూ, చేరడానికి అత్యంత కష్టమూ అయిన హిమగిరిశిఖరాలకు, అక్కడ ఉన్నాడని తాను నమ్మిన మహాగురువును వెదుక్కుంటూ ప్రయాణానికి సిద్ధపడిన ప్రదీప్త యువక బ్రహ్మచారిగా నా రూపాన్ని మంగలివాడి అద్దంలో చూసుకొని మురిసిపోయాను.

"హరాకీ పౌరి" దగ్గర గంగలో స్నానం చేసి నేను పసుప్పచ్చటి ధోతీనీ కుర్తానూ కట్టుకున్నాను. చాలామంది సాధువులు రబ్బరు చెప్పులు ధరించడం చూసి నాకున్న రబ్బరు చెప్పులు సరైనవే (అనుకున్నాను). సమీపగతకాలపు లేశమాత్రమైన జాడలను – అంటే, నేను ఇంతదాకా ధరించి ఉన్న పాంటూ చొక్కాలను నా ఎయిర్ బేగ్‌లో కుక్కేసి, కావలసిన వారికి అవి దొరుకుతాయిలే అని ఆశిస్తూ దానిని స్నాన ఘట్టాల దగ్గర వదిలేశాను.

ఇప్పుడు నేను మిగతా సాధువుల్లాగానే కనిపించాను. నా కుడి భుజం మీంచి వేళ్ళాడుతూన్న గుడ్డ సంచీలో కొన్ని పుస్తకాలూ, ఒక తువ్వాలూ, ఒక పెన్సిలూ, ఒక టూత్‌బ్రష్షూ ఉన్నాయి. నా ఎడం భుజం మీద ఒక ఉన్ని దుప్పటి వేళ్ళాడుతోంది – దానిని ధ్యానం చేసుకోడానికీ ఉపయోగించుకోవచ్చు, నిద్రపోడానికీ ఉపయోగించు కోవచ్చు. ఇక నాకు కావలసినదల్లా ఒక జల పాత్ర – (కమండలం). చక్కగా ఉన్న

ఇత్తడి కమండలువు నొకదానిని దగ్గర షాపు నుంచి కొన్నాను. నా దగ్గర ఇంకా మిగిలి ఉన్న సొమ్మును పరిశీలించుకున్నాను. ఇంకా బాగానే ఉంది డబ్బు (నా దగ్గర); దానిని నా కుర్తా జేబుల్లో పెట్టుకున్నాను.

మా తాతగారు రెండేళ్ళ క్రితం బహూకరించిన ఎనికార్ వాచ్‌ని చూసి, ఇది ఇప్పుడు ఈ సంచరించే సత్యాన్వేషి సామాన్య స్వరూపానికి ఎంత ఎబ్బెట్టుగా ఉంటుందో గమనించి దాన్ని తీసి నెమ్మదిగా స్నానాల ఘట్టం మెట్ల దగ్గర వదిలేశాను. ఇహ ఇప్పుడు హరిద్వారాన్ని పరిశీలించడానికి సమయం. బహుశా ఇక్కడే నాకు ఒక మహాయోగి కలవచ్చు.

"హరీ కీ పౌరీ" నుంచి నాకు శివాలిక్ గుట్టలూ, చాలా దేవాలయాలపై కప్పులూ, ఆశ్రమాల ఛత్తులూ కనిపించాయి. నేను రోడ్డు మీద నడుస్తూంటే రామాయణంలోని మహాబలి వానరదేవుడూ అయిన హనుమంతుడి చిన్న గుడి కనిపించింది. (అక్కడి) ముసలి బ్రాహ్మణ పురోహితుడు నా నుదుటి మీద రక్తతిలకాన్ని దిద్దాడు. రివాజుగా ఇచ్చే దక్షిణ నానుంచి రాకపోవడం వల్ల అతను కొంత చిన్నబుచ్చుకున్నట్లనిపించింది. త్వరగా అతనికొక రూపాయినిచ్చాను. అతను నన్ను దీర్ఘాయుష్షుతోనూ, సౌఖ్యంతోనూ ఉండేలాగ దీవించాడు.

నేను చాలా కోవెళ్ళనూ ఆశ్రమాలనూ దర్శించాను; సాధువులనూ అన్ని విధాల సత్యాన్వేషకుల్నీ చూశాను - నొసటిమీద నిలువుగా వైష్ణవ శాఖాభిమాని గీతలతో వైష్ణవులూ, అడ్డంగా గీసిన విబూధి రేఖలతో శైవులూ, రక్తతిలకాలతో శాక్తేయులూ, నేనెప్పుడూ ఇంతకు ముందు చూడని వింత వింత లక్షణాలతో ఉన్న ఇతరుల్నీ చూడడం జరిగింది. వాళ్ళు వేసుకున్న బట్టల విలక్షణత, అపరిచితమైన వాటి నుంచి మొదలుపెట్టి సామాన్యమైన కాషాయ ధోవతుల వరకూ సాగింది; కొందరి బట్టలు నడుం చుట్టూ చుట్టబెట్టుకున్న సన్నని గుడ్డ పేలికలు మాత్రమే.

జడలు కట్టిన జుత్తున్న నాగా దిగంబరులు - పూర్తిగా నగ్నంగా ఉన్నవాళ్ళు త్రిశూలాలు పట్టుకొని నిర్వికారంగా తిరుగుతూ, మహాజనానికి వాళ్ళంటే ఉన్న ఆకర్షణలో ఆనందోత్సాహాలను పొందుతున్నారు.

నిర్వాణీ పరమహంస అఖాడాకు చెందిన మహామండలేశ్వరుడు అధిపతిగా ఉన్న ఒకానొక ఆశ్రమంలో నాకొక కేరళీయుడు కనిపించాడు. అతను తనను ఆ మండలేశ్వరుడి సన్నిహిత శిష్యుడిగా చెప్పుకున్నాడు. బహుశా నా ఉచ్చారణ విలక్షణత నుంచి నన్ను సహకేరళీయుడిగా గుర్తించాడో ఏమిటో, అతను నన్ను భోజనశాలలోకి

తీసుకువెళ్ళి ఒక పెద్ద గ్లాసుడు వేడివేడి ఆవు పాలు ఇప్పించాడు. తరవాత, చాలా విషయాలు మాట్లాడుకున్నాం మేము. అతను రిటైరైన ఒక భారత ప్రభుత్వ ఉద్యోగి. ఉద్యోగ విరమణ తరవాత తన గురువుగారి ఆశ్రమంలో స్థిరపడ్డాడు. అతని భార్య చనిపోయింది. ఆశ్రమ పాఠశాలలో చదువు చెప్పే అతని కూతురితో సహా అతను అక్కడున్నాడు; అతని కూతురు చాలా అందమయినది.

నా అసలు పేరు చెప్పగానే అతను ఖంగుతిన్నాడు. కానీ, కొంతసేపు నాతో మాట్లాడిన తరవాత హిందూ తత్త్వంలో నాకున్న నిజమైన శ్రద్ధతోనూ తీవ్రమైన సంబద్ధతతోనూ అతను సంతృప్తి చెందేడు. "నువ్వు చాలా గంభీరమైన అన్వేషకుడిగా కనిపిస్తున్నావు. నీ అసలు పేరు చెబితే మాత్రం నువ్వు నీ అధ్యయనాన్నీ కొనసాగించ లేకపోవచ్చు, ఆధ్యాత్మిక అభ్యాసాల్లో దీక్షనూ పొందలేకపోవచ్చు. ఎందుకంటే, దురదృష్టవశాత్తూ ఇంకా కొంత ప్రాచీన సంప్రదాయపు స్థాయి కొనసాగుతూనే ఉంది" అని అన్నాడు.

"నువ్వు ఒక హిందువు పేరు పెట్టుకోడం మంచిదని నా సలహా. హిందువుల్లో కూడా కొత్త శిష్యులు దీక్ష పుచ్చుకోగానే పేర్లు మార్చుకుంటారు. హిందూ దేవతల్లో నీకెవరంటే ఇష్టం?"

"శివుడు – కైలాస పర్వతం మీద ఆసీనమై ఉండే ధ్యాన యోగీశ్వరుడు" అని నేను చెప్పాను. "మంచిది. నేను సూచించేది నీకు నచ్చితే, శివప్రసాదనే పేరు చాలా గొప్ప పేరు. ఇప్పుడే దాన్ని నీ పేరుగా చేసుకో. స్వామిని నువ్వు కలిసినప్పుడు, నిన్ను నేను శివప్రసాదుగా పరిచయం చేస్తాను. సరేనా?" అని అతనన్నాడు.

"నా అన్వేషణలో అది నాకు సాయపడుతుందని మీరు నిజంగా అను కుంటున్నారా?" అని నేనడిగాను.

"అవును" అని అతను తన కూతురు శ్రీదేవిని పిలిచి నన్ను ఆమెకు పరిచయం చేశాడు: "ఇతను బ్రహ్మచారి శివప్రసాదు" అని. ఆ సమయం నుంచి నా ఆధ్యాత్మిక యాత్రలో చాలామటుకు 'శివప్రసాద'నే పేరుకే నేను కట్టుబడి ఉన్నాను. అది నాకు చాలా విధాలుగా సాయపడింది.

సాయంత్రం మహామండలేశ్వరుణ్ణి (ఆయన పేరు నేను చెప్పట్లేదు) కలుసు కున్నాను. నా మిత్రుడు అయ్యర్ గారు నన్ను పరిచయం చేసిన తరవాత, ఆయన, నేను ఆశ్రమంలో ఉంటూ స్కూల్లో కొంతకొంత పని చేస్తూ ధ్యానం చేస్తూ ఉండవచ్చునని సూచించాడు. నేనిష్టపడితే మర్నాడు నాకు ధ్యానదీక్షనిస్తానని కూడా

చెప్పాడాయన. "హరిద్వారం ఒక పవిత్రస్థలం. ఆశ్రమంలో ఉంటూ నీ ఆధ్యాత్మిక అభిరుచుల్ని అనుసరిస్తూ ధ్యేయాన్ని అన్వేషిస్తూ ఉండవచ్చు. అవతలకు వెళ్ళేటప్పుడు మాత్రం జాగ్రత్తగా ఉండు. ఇది కలియుగం. చాలామంది సాధువులూ సన్యాసులూ మోసగాళ్ళే. వాళ్ళు నీకు 'సత్యాని'కి దగ్గరి దోవలు చూపిస్తామంటారు. నువ్వు చివరికి నిరుత్సాహపడిపోతావు.

"విదేశీ శిష్యుల కోసం ఏసీ ధ్యాన కక్ష్యలుంచిన హెలికాప్టర్ల యజమానులైన ఆధునికులు (సన్యాసులు) అతి నికృష్టులు. వాళ్ళు యువకులూ చదువుకున్నవాళ్ళూ అయిన శిష్యుల కోసం చూస్తూ ఉంటారు. నీకు తెలిసే లోపులోనే, వాళ్ళ వలలో పట్టుబడిపోతావు. ఆ తరవాత (వీళ్ళుగాక) గంజాయి బానిసలున్నారు. వాళ్ళు సాధువుల్లాగ నటిస్తూ జీవికను గడించుకుంటూ ఉంటారు. వాళ్ళ దగ్గరినుంచి నువ్వేం నేర్చుకోగలవు? ఇప్పుడిక వెళ్ళు. అయ్యర్‌గారు నీకు నీ గది చూపిస్తారు" అని చెప్పాడాయన.

అయ్యర్ గారు నాకు నా గదిని చూపించారు. గంగానదికి అభిముఖంగా దానికో కిటికీ ఉంది. అక్కడ నేను కొన్ని రోజులు సుఖంగా ఉన్నాను. ఆశ్రమానికి అరవైపైన ఆవులతో పెద్ద సంస్థానం ఉంది. అక్కడ అన్నం బావుంటుంది. దానిలో చాలా పాలూ, పళ్ళూ, నెయ్యీ కూడా ఉంటాయి. అయ్యర గారూ, అతని కూతురు శ్రీదేవీ నాతో చాలా స్నేహంగా ఉండేవాళ్ళు. త్వరలోనే నేను శ్రీదేవికి దగ్గరవుతున్నాననీ ఆవిడ నాకు దగ్గరవుతోందనీ తెలుసుకున్నాను.

విషయాలు మరీ జటిలం కాకముందే, నేను ఇక్కణ్ణించి కదిలిపోవాలనీ పై హిమాలయాలకు వెళ్ళాలనే నా మౌలిక ప్రణాళికకు కట్టుబడి ఉండాలనీ నిశ్చయం చేసుకున్నాను. ఏ విషయమూ నన్ను తప్పుదారి పట్టించడం నాకిష్టం లేదు. అంచేత, ఓ రోజు పొద్దున్న, నా కొద్దిపాటి ఆస్తుల్నీ సంగ్రహించుకొని ఋషీకేశానికి బయల్దేరాను.

ఋషీకేశానికి వెళ్ళిన ఆ రైలు యాత్ర చాలా మంచి అనుభవాన్నిచ్చింది. వేరువేరు కోవల సాధువులే దానిలోని చాలామంది ప్రయాణీకులు. బహుశా టిక్కెట్టున్నది నాకొక్కడికే అనుకుంటాను. టీటీఈ సాధువులకు నమస్కరిస్తూ, బాగున్నారా అని అడుగుతూ అటూ ఇటూ రైలులో తిరుగుతున్నాడు తప్ప టికెట్లనసలు అడగలేదు. నాకు దగ్గరగా కూర్చున్న ఒక బైరాగి బావాజీని ఈ టికెట్ ఎగ్జామినర్ అసలు టిక్కెట్లడగదేమిటి అని అడిగితే ఆయన పగలబడి నవ్వుతూ "అబ్బాయీ, నువ్వు ఈ ప్రదేశానికి కొత్త అని స్పష్టమవుతోంది. ఇది భగవంతుడి రైలు. అది మా కోసమనే. టికెట్లను ఎవరడగ్గలరు?" అని అన్నాడు.

రైలులోంచి దిగి ఇతర సాధువులననుసరిస్తూ "మునీ-కీ-రేతీ"కి వెళ్ళాను. గంగానదికి అటూ ఇటూ గట్ల మీద ఉన్న ఆశ్రమాల్లో చాలా వరకూ అక్కడే ఉన్నాయి. సాయంత్రమయింది. వంద పై చిలుకు ఉన్న మెట్లనెక్కి స్వామీ శివానంద సరస్వతి స్థాపించిన ప్రసిద్ధమైన "దివ్యజీవ సమాజం" (డివైన్ లైఫ్ సొసైటీ) లోకి ప్రవేశించాను. ఆయన (శివానందులు) అప్పటికే జీవించిలేరు. ఆశ్రమం ఆయన ప్రముఖ శిష్యుల్లో ఒకరైన స్వామీ చిదానంద గారి అధ్యక్షతన నడుస్తోంది. బయలుగా ఉన్న సభాభవనంలో సత్సంగం (ప్రార్ధనా సమావేశం) జరుగుతోంది.

ఎత్తైన పీఠం మీద మఠం వేసుకొని స్వామీ చిదానంద ఆసీనులై ఉన్నారు. ఆయన పొడుగ్గా చాలా సన్నగా ఉన్నారు. మందు కూరే రోకలిలాగ నిటగా కూర్చుని ఉన్నారు. అక్కడ ఓ ఏభై మంది వరకూ ఉన్నారు; వాళ్ళలో కొంతమంది పాశ్చాత్యులు. ఎవరో (పాశ్చాత్యుడు) అడిగిన ప్రశ్నకు ఇంగ్లీషులో ఆయన జవాబు చెబుతున్నారు. నేను నిశ్శబ్దంగా వెళ్ళి ఒక మూల కూర్చున్నాను.

మధ్యలో ఆగి నా వైపుకు తిరిగి దయార్ద్రమైన దరహాసంతో పాత స్నేహితుడితో మాట్లాడుతున్నట్టుగా "నువ్వెప్పుడు వచ్చావు?" అని అడిగారు ఆయన. ఆశ్చర్యపడుతూ నేను "ఇప్పుడే" అని నత్తిగా చెప్పాను. "నువ్వు ఇప్పుడు వెళ్ళు. స్నానం చేసి విశ్రాంతి తీసుకో. రేపటి సత్సంగానికి వద్దువు గాని" అని అన్నారాయన.

తన పక్కన నిలుచుని ఉన్న యువక బ్రహ్మచారి వైపుకు తిరిగి ఆయన ఏదో గుసగుసలాడుతూ చెప్పారు. ఆ బ్రహ్మచారి నా దగ్గరకు వచ్చి "రా" అని అన్నారు. స్వామికి ప్రణామం చేసి అతనితోనే వెళ్ళాను. "హరి ఓం" అని స్వామి మధురస్వరంతో ఉచ్చరించారు.

గిరిపాదాల దగ్గరగా పైన ఉన్న ఒక గదిని చూపించారు. అక్కడ కనీసమైన హంగులే ఉన్నా, స్వచ్ఛంగానూ శుభ్రంగానూ ఉంది. ఆ బ్రహ్మచారి తమిళనాడు నుంచి వచ్చినవాడు. నేనూ తమిళం మాట్లాడగలనని తెలిసి సంతోషించాడు. నాకు రెండు నూలు తువ్వాళ్ళు ఇచ్చి భోజనశాల ఎక్కడ ఉందో వివరించి చెప్పాడు. "రాత్రి భోజనం ఖచ్చితంగా ఏడున్నరకి. నేనక్కడ నిన్ను కలుస్తాను" అని చెప్పి త్వరత్వరగా వెళ్ళిపోయాడతను.

నేను చన్నీళ్ళ స్నానం చేశాను. వణుకు తగ్గిన తరవాత, మరో కొత్త పసుప్పచ్చ ధోవతీ, పొట్టి చేతుల కుర్తాను ధరించి మెట్ల మీదుగా కిందికి దిగాను. భోజనశాలకు వెళ్ళాలంటే రోడ్డు దాటాలి. ఇంకా బాగా టైముంది కాబట్టి నేను (గంగా) ఘట్టానికి

వెళ్ళి, గంగానదీ ప్రవాహాన్ని పరికిస్తూ అక్కడి ఒక మెట్టుమీద కూర్చున్నాను. నది మీదుగా యథాక్రమంగా నావలు ఆవలి ఒడ్డుకి సాగుతూ ఉన్నాయి. ఆవలి గట్టున చాలా ఆశ్రమాలు ఉన్నాయి. 'బాబా కాలీకంబ్లీవాలా' గారి స్వర్గాశ్రమం పురాతనతమమైన ఆశ్రమం.

మునిమాపు వేళ అయింది. నదికి అవతలి ఒడ్డున జనులు ఆరతి ఇస్తున్నారు. నదీమతల్లికి చిన్నచిన్న దీపాలు వెలిగించి భక్తిపాటలు పాడుతూ వాటిని జలతలం మీదుగా వదిలిపెడుతూ ఆరాధిస్తున్నారు. అది చాలా అందమైన సాయంత్రం. నదిమీదుగా ఆ ఆశ్రమాల నుంచి సనాతన సంస్కృత భాషలో సమ్మోహక గాన తరంగాలు వినవస్తున్నాయి.

తటాలున, భోజనశాల గంట మోగింది. నేను గబుక్కున మెట్లమీంచి లేచాను. నా ఆత్మకు ఆవశ్యకమైన ఆహారంతో అది నిండే ఉంది కానీ నా శరీరానికి ఆకలిగా ఉంది. ఆ పెద్ద భోజనశాలలో సాధువులూ దండిస్వాములూ ఒక వైపు కూర్చున్నారు; ఇతరులు రెండోవైపు కూర్చున్నారు. ప్రతివాడూ నేలమీద కూర్చొని స్టీలు పళ్ళేల్లో తిన్నారు. ఇంకొంతమందితో కలిసి అన్నాన్ని వడ్డిస్తూ తమిళనాడు నుంచి వచ్చిన ఆ బ్రహ్మచారి కూడా అక్కడ ఉన్నాడు. భోజనం దక్షిణ భారత సంబంధమైనదే – అన్నం, కూరలూ, సాంబారు; ఒక్కొక్కళ్ళకు ఒక్కొక్క లడ్డూ. నేను చాలా ఆకలితో ఉన్నాను. రెండుసార్లు వడ్డించుకొని సుష్టుగా భోంచేసాను.

కడుపు నిండగానే నాకు నిద్రగానూ అలసటగానూ అనిపించింది. రోజువారీ కార్యక్రమాన్ని గురించి ఆ బ్రహ్మచారి నుంచి దర్యాప్తు చేసి, నా గదికి వెళ్ళి, తెరిచి ఉన్న కిటికీలను అలాగే ఉంచి, కొంతసేపు నా మంచం మీదనే కూర్చొని ధ్యానం చేసుకున్నాను. పిదప పక్కమీద సాగిలపడి దాదాపు ఒక చిటికలోనే నిద్రలోకి జారుకుపోయాను.

స్ఫటికంలాగ శుభ్రంగానూ స్వచ్ఛంగానూ ఉన్న జలం వేగంగా ప్రవహిస్తున్న ఒక లోయలో ఉన్న చిన్న బాటమీదుగా నేను నడుస్తున్నట్టుగా కలగన్నాను. ఆ ప్రవాహం ఒడ్డున ఒక చిన్న పూరిగుడిసె ఉంది. ఆ గుడిసె దగ్గరకు నేను చేరగానే, ముఖానికి తెల్ల ముసుగు వేసుకున్న ఒక మనిషి ఇవతలకు వచ్చాడు. నేను కొంతగా భయపడి గడ్డకట్టాను.

"భయపడవద్దు. నేను స్నేహితుణ్ణి. నిన్ను పిలవబోయే విధంగానే నన్ను 'ఎమ్' అని పిలుస్తారు. (ఉన్నదానితో) సంతృప్తి పడిపోకు. పర్వతపాదాల దగ్గరే ఉండిపోకు.

నదు. పర్వతాల్లోకి ఆరోహించు. నీకోసం అతను వేచి ఉన్నాడు" అని అతను చెప్పాడు. ఆ మీద అంతా మాయమైపోయింది - లోయా, ప్రవాహమూ, గుడిసె, ముసుగు వేసుకున్న ఆకృతీ అన్నీ, నేనొక్కణ్ణే ఉన్నాను. నా చుట్టూ అన్ని వైపులా వ్యాపించిన ఒక మంచుదిబ్బ మాత్రమే ఉంది. చలిగా ఉంది. వణకడం ప్రారంభించాను. "ప్రభూ నాకు సహాయపడు" అని నేను అరిచాను. అప్పుడు మెలకువ వచ్చింది. నాకు నిజంగానే చాలా చలిగా ఉంది, ఇచ్చిన రొజాయితో నన్ను నేను కప్పుకోలేదు కనక. తెల్లారబోతోంది. ఎవరో ఒక శంఖాన్ని ఊదుతున్నారు.

ఆశ్రమం దగ్గర ప్రొద్దుటి నిత్యకృత్యం చాలా ముందుగానే మొదలయింది. గుడిసేవ కాగానే, ఆరింటికి యోగాసనాల క్లాసుంటుంది; ఆ తరవాత అరగంట పాటు ధ్యానం; ఆ మీద స్నానాదులకు విరామం, ఎనిమిదింటికి ఉపాహారం. తరవాత, పదిన్నర వరకూ గ్రంథాలయంలో కానీ తన గదిలో గానీ ఎవరైనా స్వేచ్ఛగా స్వాధ్యాయనం చేసుకోవచ్చు. పొద్దున్న పదిన్నరకు డివైన్ లైఫ్ సొసైటీ ప్రధాన కార్యదర్శీ, సొసైటీ సంస్థాపకుడైన స్వామీ శివానంద గారి విశిష్ట శిష్యుడూ అయిన స్వామీ కృష్ణానంద గారు తీసుకునే ఉపనిషత్ తరగతి ఉంటుంది. మధ్యాహ్నం భోజనం తరవాత మూడింటి వరకూ విశ్రాంతి. సాయంత్రం ఆరున్నరకు సత్సంగం, ఏడున్నరకు రాత్రి భోజనం. ఆశ్రమవాసులు రాత్రి భోజనం తరవాత బయటికి పోవడం, లక్ష్య రహితంగా తిరగడం అనేవి చేయడాన్ని ఒప్పుకోరు.

ఆ పాటికి నాకు మంచి మిత్రుడైపోయిన బ్రహ్మచారి పొద్దున్న తొమ్మిదిన్నరకు వచ్చి స్వామీ చిదానందజీ ఆయన వసతి గృహంలో పదిన్నరకు నాతో మాట్లాడదలచు కున్నారని చెప్పాడు. నాకు చాలా ఉత్తేజం కలిగింది. అధ్యక్ష మహారాజు గారి వసతికి తీసుకువెళ్ళడానికి వచ్చే బ్రహ్మచారికోసం వేచి ఉన్నాను. స్వామీ కృష్ణానంద గారి ఉపనిషత్తరగతిని నేను పోగొట్టుకోవలసి వస్తుంది. అయితే, ఇది దానికన్నా ముఖ్యమే కాదు, గొప్పదైన ప్రత్యేక హక్కు కూడాను. సరిగ్గా పదీ ఇరవైకి నన్ను తీసుకు వెళ్ళడానికి బ్రహ్మచారి వచ్చాడు. "స్వామీజీ మహరాజ్‌ను చూసినప్పుడు నువ్వు నీ మోకాళ్ళ మీద వంగి మోకరిల్లు" అని బ్రహ్మచారి చెప్పాడు.

నా గురించిన తొలి దర్యాప్తులు - నేనెక్కణ్ణించి వచ్చాను, నా కెంత వయస్సు, ఎంతమంది తోబుట్టువులున్నారు, నాకు కేటాయించిన గది బాగుందా వగైరా కుశల ప్రశ్నలు అయిన తరవాత, ఆయన అకస్మాత్తుగా "నీ పేరేమిటి?" అని అడిగారు. కొత్తగా నేను పెట్టుకున్న పేరుకే కట్టుబడుతూ "శివప్రసాదు" అని నేను చెప్పాను.

"ఇంతకు ముందు యోగాన్ని అభ్యసించావా?"

"అవును మహరాజ్! ఎనిమిదో ఏడాది నుంచి"

"సంస్కృతం? నీకు తెలుసునా?"

"అంత ఎక్కువేమీ రాదు. కానీ నేను దేవనాగరీలిపిని చదవగలను. హిందీ నా రెండో భాష".

"ఊఁ – మరి ధ్యానం?"

ఏదో ఒకరకమైన ధ్యానం నాకు సహజంగానే అబ్బింది. మీకు తెలుసుగా మహరాజ్! నా చిన్నప్పుడు నేనొక యోగిని కలుసుకున్నాననీ, ఆయన నన్ను దీవించారనీ...."

ఇంతకుముందు పనసచెట్టు కింద కలిసిన విచిత్రయోగి సంబంధమైన కథను చెబుదామని ప్రయత్నిస్తే మామూలుగా స్తంభించే నా కంఠతంత్రులు స్తంభించకుండా ఇంతపాటి మాత్రమైనా చెప్పగలిగాననని దిగ్భ్రాంతి చెందాను. కానీ ఆ పైన ఏ మాటా పెగిలిరాలేదు. మళ్ళీ తాళం పడిపోయింది. నేను ప్రయత్నించడం మానేశాను.

నా కళ్ళవైపు సావధానంగా చూస్తున్నారు స్వామీ చిదానందజీ. ఆయన గాఢంగా నిట్టూర్చి "హరి ఓం" అని తన గంభీర కంఠంతో పలికి నా తలను తట్టేదాయన. "ఊఁ క్రితం జన్మ ప్రభావాలు. దేవుడు నిన్ను దీవించాలి. నీ జన్మ నామమేమిటి?". నేను ఈ రోజున పడ్డ రెండో ఆఘాతాన్నించి బయటపడి నోరు తెరిచే లోపునే ఆయన అన్నాడు: "సర్లే. నువ్వు చెప్పక్కర్లేదులే. మా ఆసనాచార్యుణ్ణించి ఆసనాలనూ మరికొంత ప్రాణాయామమూ నేర్చుకో. ఇక్కడ ఎన్నాళ్ళుండదలచుకుంటే అన్నాళ్ళూ ఉండు. మీది హిమాలయాలు నిన్ను అనివార్యంగా ఆకర్షిస్తున్నాయని నేను ఎరుగుదును. అలా అనిపించినప్పుడు నువ్వు స్వేచ్ఛగా వెళ్ళిపోవచ్చు. బహుశా నీ అదృష్టం ఆ పర్వతాలతో ముడిపడి ఉందేమో. నీకేమైనా సమస్యలుంటే నాకు చెప్పు. దేవుడు నిన్ను దీవించును గాక. హరి ఓం".

ఆశ్రమంలో నేను ఒక నెల్లాళ్ళు అపురూపంగా గడిపాను. యోగ తరగతిలో చేరేను; నిజంగా ఆలోచనోత్తేజకాలైన స్వామీ కృష్ణానంద గారి ఉపనిషత్సమావేశాలకు హాజరయ్యాను; విరివిగా సేకరించిన పుస్తకాలున్న గ్రంథాలయాన్ని ఉపయోగించాను; స్వామీ చిదానందగారి సాయంత్ర సత్సంగాల్లో చాలాసార్లు కూర్చొనేవాణ్ణి. ఋషీకేశాన్ని పరిశీలించడానికి ఇంకా నాకు చాలా టైమే ఉంది. పడవలో అవతలి ఒడ్డుకి వెళ్ళి అక్కడ చాలా ఆశ్రమాలనే చూశాను. అత్యంత పురాతనమైన వాటిలో ఒకటి

స్వర్గాశ్రమము. దాన్ని గురుబాబా కాలీకంబ్లీవాలా ప్రారంభించారు. ఆయన ఎప్పుడూ ఒక్క నల్లని ఉన్ని దుప్పటి కనుకనే ఆయనకా పేరు వచ్చింది. సంచరించే సాధువులకు హిమాలయ యాత్రా మార్గం పొడుగునా ఉన్న కాలీకంబ్లీవాలా క్షేత్రాలు అనే వసతి గృహాల మనుగడకు మూలం పందొమ్మిదో శతాబ్ది మొదట్లో ఉన్న ఈ ప్రసిద్ధ సన్యాసే. ఆయన గురించిన చాలా కథలున్నాయి కానీ నేను ఒక కథను మాత్రమే వినిపిస్తాను.

సుల్తానా అనే అపఖ్యాతిపాలైన గుజ్జర్ గజదొంగ ఒకడుండేవాడు. డబ్బున్న యాత్రికుల బిడారాల్ని దోపిడీ చేసేవాడు; ధనిక ఆశ్రమాలను కొల్లగొట్టేవాడు. సుల్తానా పేరు వినితే చాలా మంది ధనికులు భయంతో వణికిపోయేవారట. అతని అపూర్వ ప్రత్యేకత ఏమిటంటే తాను దాడి చేయబోతున్నానని ముందే కబురు పంపి వచ్చి పట్టపగలే కొల్లగొట్టడం. ఒకసారి బాబా కాలీకంబ్లీవాలాకి, తన ముఠాతో ఫలానా తారీఖున స్వర్గాశ్రమాన్ని ఆక్రమించి అక్కడున్న నిధిని దోపిడీ చేస్తానని కబురు పంపించాడట. బాబా తప్ప ఆశ్రమ సిబ్బందీ భక్తులూ అందరూ భయపడ్డారు. సుల్తానా కోసం అతని జట్టు కోసమూ భారీ శ్రమతో మధ్యాహ్న భోజనాన్ని తయారు చేయించాడాయన. తన కుటీరం మొగసాలలో అతనికోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడాయన.

గజదొంగ తన ఆరుగురి జట్టుతో కత్తులూ తుపాకులూ పట్టుకొని వచ్చాడు. గుర్రంమీంచి దిగగానే, బాబా అతని దగ్గరకు వెళ్ళి స్వాగతించాడు. అతన్నీ అతని ముఠానీ మొగసాలలో కూర్చొని నీళ్ళు తాగి సేదతీరమని ఆహ్వానించాడు. ఆ మీద ఆయన భోషాణం తాలూకు తాళం చెవులిచ్చి "నీకు కావలసింది నువ్వు తీసుకు వెళ్ళవచ్చు కానీ నాకు హింసా, రక్తపాతమూ పనికిరావు. నీకెవరినైనా చంపాలని అనిపిస్తే ప్రతివాళ్ళనీ వదిలిపెట్టి, వాళ్ళకు బదులుగా నన్ను చంపు. నాకు చావూ బతుకూ ఒకటే. ఈ బస్తీ పోలీస్ అధికారి నా భక్తుడే. అతని సాయాన్ని కోరి ఉండవచ్చును గానీ అప్పుడు హింసా దౌర్జన్యాలు జరుగుతాయి, కొన్ని ప్రాణాలు పోవచ్చు. నాకు అటువంటివి ఇష్టం లేదు.

"భోషాణం నుంచి నీకు కావలసినది తీసుకొన్న తరవాత, వెంటనే గుర్రం ఎక్కి వెళ్ళిపోకు. నేను నీకోసం విందు ఏర్పాటు చేశాను. నువ్వూ నీ మిత్రులూ ఆ విందు ఆరగించి, అలసిపోయుంటే విశ్రాంతి తీసుకొని, ఆ మీద వెళ్ళిపొండి. నువ్వన్నా, మరే జీవమన్నా నాకే రకమైన ద్వేషమూ లేదు. ఇప్పుడు నీకేది తగినదనిపిస్తుందో అది చెయ్యి" అని అన్నారు.

ఆ బందిపోటు దొంగకి ఇటువంటి మనిషి ఎప్పుడూ తారసపడలేదు. అతను ఆయనకు వంగి నమస్కరించి, క్షమించమని వేడుకొని, ధోషాణాన్ని కొల్లగొట్టడానికి బదులు, కొన్ని బంగారు నాణేలు దానంగా ఇచ్చి, సమృద్ధమైన భోజనాన్ని పెట్టినందుకు బాబాకు ధారాళంగా ధన్యవాదాలు చెప్పి వెళ్ళిపోయాడు.

నేను చూసిన కొన్ని ఆశ్రమాలు – యోగనికేతన్, పరమార్థ నికేతన్, గీతాభవన్, "టీఎమ్*" ప్రతిష్ఠ ఉన్న మహేశ్ యోగి తన శిష్యులైన బీటిల్స్ కోసం కట్టించిన వాతానుకూలమైన గుహలూను. సమశీతోష్ణ స్థితి ఉన్న ఆ గుహల వెనక ఒక దట్టమైన అడవి ఉంది. కొండమీదున్న నీలకంఠ మహాదేవుడి దగ్గరకు వెళ్లడం కోసం కష్టమైన ప్రయాణం చేసేవాళ్ళకు దారి అక్కణ్ణించే ప్రారంభమవుతుంది.

ఆ అడవి మధ్యలోంచి వెళ్ళే సన్నని దోవ లక్ష్మణ్ ఝూలాకు తీసుకొని వెళ్తుంది. (దీనికి) అటూ ఇటూ చిన్న చిన్న పాకలూ పూరిగుడిసెలూ ఉన్నాయి. వాటిలో ఏకాంతంగా సాధువులూ యోగులూ సన్యాసులూ ఉంటున్నారు. వాళ్ళు నిత్యమూ ప్రవహించే గంగాజలాలకు సన్నిహితులుగా ఉండేవాళ్ళు; అక్కడొక హాయిగొలిపే చిన్న గుహ ఉంది. అది నదికి అభిముఖంగా ఉంది; దాని చుట్టూ పెద్ద పెద్ద గండశిలలున్నాయి. అక్కడ మస్త్‌రామ్ బాబా అనే గుండ్రని ముఖమున్న పొట్టి మనిషి ఉన్నారు. అతను ఎప్పుడూ ఆనందమగ్నుడై ఉండేవాడు. ఆనందంలో మత్తెక్కినట్టు ఉండేవాడు. ఆయన భక్తులు ఆ గుహ దగ్గర ఉన్న కట్టెదుంగల ఆవరణలో చేరి భక్తిగీతాలు పాడేవాళ్ళు. మస్త్‌రామ్ బాబా అరుదుగా మాట్లాడేవారు.

కొద్దిగా అవతల, ఆ గండశిలల మీద నడిచి, ఒక రాళ్ళగుట్టకు ప్రదక్షిణం చేస్తే అక్కడ గుప్తంగా ఉన్న ఒక చిన్నపాటి ఇసుక తీరం ఉంది. అది రోడ్డుమీంచి కనిపించదు. ఋషీకేశం వచ్చినప్పుడు బాబాజీ ఇష్టపడే ప్రదేశాల్లో ఇదొకటి. ప్రవహిస్తూన్న స్ఫటిక స్వచ్ఛమైన నీరాలను పరికిస్తూనో, గంభీరమైన చర్చలో మునిగో, నిశ్శబ్దంగా ధ్యానం చేస్తూనో – ఆయనతో నేను చాలా సాయంత్రాలే ఇక్కడ గడిపాను.

లక్ష్మణ్ ఝూలా నిండా ఆశ్రమాలే; అది రకరకాల సాధువులతో నిండి ఉంటుంది. ఈ ప్రదేశాన్ని రామాయణ నాయకుడైన రాముడి విశ్వసనీయ సహచరుడూ, తమ్ముడూ అయిన లక్ష్మణుడి పేర పిలుస్తారు. ఝూలా అంటే ఉయ్యాల. గంగ మీదున్న ఈ వంతెన ఒక సస్పెన్షన్ బ్రిడ్జి – గంగానదీ ప్రవాహాలను దాటడానికి

* ట్రాన్సెండెంటల్ మెడిటేషన్ – ధ్యానంతోనూ, ఏదైనా మంత్రజపంతోనూ ప్రశాంతినీ సంగతత్వాన్నీ పొందడానికి పనికివచ్చే ప్రక్రియ.

గొలుసులతో కింద ఏ ఆధారమూ లేకుండా అమర్చిన వంతెన - అందుకనే ఈ వంతెనను లక్ష్మణ్ ఝూలా అని అంటారు. వంతెనను దాటగానే ఋషీకేశం నుంచి పైన హిమాలయాల్లో ఉన్న బదరీనాథ దేవాలయానికి తీసుకుపోయే మెయిన్ రోడ్డు దగ్గరికి వస్తాం.

లక్ష్మణ్ ఝూలా దగ్గర నేను తట్‌వాలే బాబాను కలుసుకున్నాను. ఆయన జడలుకట్టిన పొడుగాటి జుట్టుతో, దాదాపు నగ్నంగా, అడవికి దగ్గరగా ఉన్న ఒక గుహలో ఉండే సాధువు. ఆయన భక్తుల్లో చాలామంది ఆయననే మృత్యురహితుడైన మహావతార్ బాబాజీ అని వాదిస్తారు. నాకు మాత్రం అటువంటి అభిప్రాయం కలగలేదు. కొన్ని ఏళ్ళ తర్వాత, ఆయన తన గుహకు నడచి వెళ్తుండగా ఆయనను కాల్చి చంపారని విన్నాను. అదొక దారుణమూ, అపరిష్కృతమూ అయిన హత్య - దాన్ని పత్రికల్లో విపులంగా ప్రచురించారు.

ఋషీకేశం ఆ రోజుల్లో, జనుల యాత్రావేళలను తప్పిస్తే, ఆధ్యాత్మిక అన్వేషకుడికి మహా గొప్ప ప్రదేశం. యాత్రా వేళలంటే యాత్రీకులు, బదరీనాథ్, కేదారనాథ్, గంగోత్రి, యమునోత్రి అనే చతుర్ధామాలకు వెళ్ళడానికి గుంపులు గుంపులుగా దిగే సమయాలు. ఆ యాత్రీకులు పట్టణప్రాంతపు విపరీత పెంపకాలతోనూ, కర్కశ ధ్వనులతోనూ అక్కడి పవిత్ర నిశ్శబ్దతను పాడుచేస్తూ ఉంటారు. అక్కడ చాలా ఆశ్రమాలను చూడవచ్చు; రకరకాల సాధువులనూ సంచారక సన్యాసులనూ కలవవచ్చు; విశాలమూ విపులమూ అయిన హిందూ సంస్కృతి నుంచి ఎవడు ఎంత గ్రహించగలడో అంత గ్రహించవచ్చు.

ఆ ప్రదేశం ఇంకా శుచిగానే ఉంది. నదిలో స్నానం చేస్తూ ఎవరూ సబ్బును ఉపయోగించేవారు కారు. ఆ నీళ్ళు స్ఫటికశుద్ధంగా ఉండేవి. ఈ రోజుల్లో కనిపించే అసంఖ్యాకమైన విడుదులు అప్పుడు ఉండేవి కావు. నది పక్కన కుప్పలు కుప్పలుగా పోసి ఉండే ప్లాస్టిక్ కప్పులూ, నాశనం చేయడానికి వీలులేని ఇతర చెత్తాచెదారాలూ అప్పుడు అరుదుగా ఉండేవి. అప్పుడు కనిపించే కొద్దిమంది విదేశీయులూ తీవ్రాన్వేషకులో, హిమాలయపు ఉన్నతులకు ఆకర్షితులై కష్టపడి నడిచేవాళ్ళో పర్వతారోహకులోగానీ అయి ఉండేవాళ్ళు. ఇవన్నీ ఎంత అందంగా ఉన్నా వట్టి పర్వత పాదాలు మాత్రమే. నేను మంచుబట్ట కట్టిన ఆ శిఖరాలకోసం ఆరాటపడేవాణ్ణి.

అదీగాక, నేను చూసిన సాధు సన్యాసుల్లో ఏ ఒక్కరూ నేను అంతరంలో దర్శించిన హిమాలయ యోగి రూపానికి తగిన వాళ్ళు కారు. కొంతమంది నిజంగా

గొప్ప పండితులే; కొంతమంది పెద్ద పెద్ద మఠాలకు అధిపతులు; కొంతమంది యోగనిపుణులు. గంజాయిదాసులైన సంచారక బైరాగులు కూడా ఉండేవాళ్ళు. వాళ్ళలో చాలామంది పవిత్రంగా కనిపించే బిచ్చగాళ్ళు మాత్రమే. సాధారణంగా వాళ్ళందరూ హిందూ మతతత్త్వాల నిగూఢ భావాల విషయంలో పూర్తిగా అజ్ఞానులే. ఈ ఆఖరి వర్గం వాళ్ళంటే నాకు పూర్తిగా ఏవగింపుగా ఉండేది.

అయినప్పటికీ నేను కొంతకాలం – ధ్యానం చేస్తూనూ, ముందుముందుకు సాగిపోయే గంగా ప్రవాహాలను పరిశీలిస్తూ గంటలకు గంటలు కాలక్షేపం చేస్తూనూ, యోగాన్ని అభ్యసిస్తూనూ, ఎంత చదువుకోగలిగితే అంత చదువుతూనూ, నేను నిర్వచించలేని ఏదో దానికోసం ఇంకా ఎదురు చూస్తూనూ – అక్కడ కొనసాగించాను.

నది పక్కన కూచొని చూస్తూ ఉంటే పౌర్ణమి నాటి రాత్రులు మహా అందంగా ఉండేవి. ఒక రాత్రి ఆ దృశ్యంతోనూ గలగల ప్రవహిస్తూన్న నీటి స్వనాలతోనూ ఆకర్షితుణ్ణై నేనక్కడ కూర్చుని ఉండగా, నాతో బాగా స్నేహంగా ఉంటూన్న ఒక దక్షిణ భారత వృద్ధ సన్యాసి వచ్చి నా పక్కన కూర్చున్నాడు. ఆ సన్నివేశం నిజంగా అందంగా ఉందని నాతో ఏకీభవిస్తూ ఆయన "నీతో కొంతసేపు మాట్లాడదామని అనుకుంటున్నానని నీకు తెలుసు కదా! ఇప్పుడు మాట్లాడవచ్చునా?" అని అన్నాడు. రాత్రి చేస్తూన్న ఈ గారడీ, మర్త్య సంభాషణలతో పాడైపోబోతోందని బాధపడుతూనే నేను అయిష్టంగానే "సరే" అన్నాను.

"ఈ ప్రాంతాల్లో నేను చాలా ఏళ్ళ బట్టీ ఉంటున్నాను. మొదట్లో ఆ సత్సంగాలూ, భావావేశంతో నిండిన గానాలూ, కాషాయ వస్త్రాలు కట్టిన సన్యాసులూ, ఆ నదీ, ఆ కొండలూ మొదలైనవన్నీ చాలా పులకరింపును కలిగించేవి. ఇప్పుడు లేని ఒక పెద్ద స్వామి చిత్రించి చెప్పిన సన్యాసపు ఉత్తమ చిత్రాన్ని చూసి ఆకర్షితుణ్ణై నేను మంచి ఉద్యోగాన్నీ, నా పెళ్ళాంబిడ్డల్నీ వదిలేసి ఇక్కడకు వచ్చాను.

ఆ మీద ఆశ్రమాల్లో పదవీ వ్యామోహంతో జరిగే కుమ్ములాటలూ, ఆశ్రమవాసుల మధ్య ఏర్పడే ముఠాలూ మొదలైన మిథ్యాచారాలను చూడగానే నెమ్మదిగానూ, ఖచ్చితంగానూ ఆ కపటత్వపు ముసుగులన్నీ తొలగిపోయాయి. కానీ అప్పటికే ఆలస్య మయిపోయింది. నా పిల్లలు నన్ను అసహ్యించుకున్నారు; నా పెళ్ళాం హాయిగా మరొకణ్ణి పెళ్ళి చేసుకొంది. ధ్యానంలో నాకేమీ కనిపించదు. నేనింకా గతంలో మాదిరిగానే, అదే విధమైన కామనాపూరితుణ్ణీ, కోపిష్ఠినీను. నేను సన్యాసాన్ని గ్రహించాను కనక ఆ పాత్రను వదలలేను. సంఘానికి నేను ఎందుకూ పనికిరాని వ్యక్తిని. అలాగే

ఇప్పుడు బతుకును కొనసాగిస్తున్నాను ఏదో ఒక రోజున చావు వస్తుందని ఆశిస్తూ, కనీసం నాకు అన్నమూ గూడూ ఉన్నాయి".

ఆ ముసలి సన్యాసి చెప్పిన మాటలతో కలవరపడ్డాను. ఆయన ఒక మహాస్వామికి వృద్ధ శిష్యుడని నేననుకున్నాను. "ఇదంతా నాకెందుకు చెబుతున్నారు మీరు?" అని అడిగాను.

"ఏమీ లేదు, ఏమీ లేదు. కానీ, చూడు, నువ్వు బాగా యువకుడివి. అందగాడివి. చదువుకున్నవాడివి. అందుకే ఆలస్యం కాకముందే నిన్ను హెచ్చరిద్దామనుకున్నాను. ఇక్కడ ఒక పిసరు హిమాలయ సంబంధమైన సాహసకృత్యం తప్ప మరేమీ కనిపించదు. అంచేత, కొంతపాటి తిరిగిన తరవాత వెనక్కిపోయి ఒక పుస్తకం రాయి. ఇదిగో మరో ప్రత్యామ్నాయం (కూడా) ఉంది.

"నువ్వు తొమ్మిది నుంచి ఐదు వరకూ పని చేస్తూ సాధారణంగా జీవించదలచుకోక పోతే నిన్ను నువ్వు గురువుగా ప్రకటించుకొని కోట్లు సంపాదించుకోవచ్చు. విదేశీయులను ఆకర్షించడానికి వలసిన ప్రధాన లక్షణాలన్నీ ఉన్నాయి నీకు. వాళ్ళకు ఒక చిన్న సూత్రాన్ని ఇయ్యి. అంతే, వాళ్ళు వలలో పడ్డట్టే. ఆ వాతానుకూల గుహలు చూసే ఉంటావు?"

ఈసారి నాకు కోపం వచ్చింది. ఈ ముసలాడు మూర్తిమంతుడైన సైతాన్‌లాగ నన్ను ప్రలోభపెట్టి తప్పుదారి పట్టించడానికి వచ్చినట్టున్నాడు. "అయ్యా! ఆపండి. నేను మరొక్క మాట కూడా వినదలచుకోలేదు" అని అన్నాను.

"అహ్హో! మహాయోగి తన కోపాన్ని అదుపులో పెట్టుకోలేకపోతున్నాడు. సరేలే, ఇహ నీ కర్మ. నీకు సాయపడదామని ప్రయత్నించాను, అంతే". అని అంటూ ఆయన లేచి చక్కా పోయాడు. మళ్ళీ ఎప్పుడూ నన్ను బాధపెట్టలేదు. కానీ అతను చెప్పినది మాత్రం నన్ను చాలా కలవరపెడుతూనే ఉంది. నాకు తారసిల్లే సాధు, సన్యాసుల్లో ఎవర్నీ కూడా, ముఖాన్ని చూసి ఇక స్వీకరించదలచుకోలేదు. ఇంతదాకా ముక్కు సూటిగానూ అమాయకంగానూ ఉన్న నా మనస్సును అస్థిరపరిచే సందేహాలు ప్రారంభ మయ్యాయి. నేను (ఇక్కణ్ణించి) వెళ్ళాల్సిందే, యాత్రిక మార్గం మీదుగా పైకి ఎక్క వలసిందే అనుకున్నాను. బహుశా ఒక సంస్థకు గానీ, దాని క్రమానుగతిక ఛత్ర చామరాదుల్లాటి అలంకారాలకు గానీ అంటుకోని ఒక నిజమైన సంచారక ఋషి కనిపిస్తాడేమో నాకు –

నేను స్వామీ చిదానందంతో మరో సమావేశాన్ని ఏర్పరచమని ప్రార్థించాను. అది మంజూరు అయింది. ఆ ముసలి సన్యాసితో జరిగిన నా సంభాషణ గురించి నేనాయనకు చెప్పలేదు. కానీ, నేను సంతోషంగా లేననీ, ఏదేమైనా నేను బదరీనాథ మొదలైన ఇతర హిమాలయస్థ దేవాలయాలకు వెళ్ళాలనుకుంటున్నాననీ, మర్నాడే బయలుదేరదలచుకున్నాననీ చెప్పాను. ఆయన దీవెనలను కోరుకున్నాను. స్వామీ చిదానంద నా తలను స్పృశించి దీవించారు.

ఇంతకాలమూ నేను ఆశ్రమాన్ని (ఎప్పుడో ఒకప్పుడు) వదిలిపెట్టి వెళ్తాననే ఆయన అనుకున్నాడని చెప్పారు. బహుశా ఇంతకన్నా గొప్ప అనుభవాలు కాచుకొని ఉన్నాయేమో – "కనీసం రెండు ఉన్ని దుప్పట్లేనా తీసుకొని వెళ్ళు. ఏమన్నా డబ్బు కావాలా?" అని అడిగాడాయన. ఇంకా నా దగ్గర కొంత డబ్బుంది కనక ఆయన దగ్గర డబ్బు తీసుకోడానికి నేనిష్టపడలేదు. వద్దని, వంగి నమస్కరించి, స్వేచ్ఛను పొంది తేలిక పడినవాణ్ణై అక్కణ్ణించి వెళ్ళిపోయాను.

# 16. వశిష్ఠ గుహ

మర్నాడు ప్రొద్దున్నే ఐదున్నరకి బయల్దేరాను. ఆ క్రిందటి రాత్రి నేను ఏ రకమైన ప్రయాణ సాధనాన్నీ ఉపయోగించకూడదని నిశ్చయించుకున్నాను. నేను కలుసుకున్న కొంతమంది సంచార సాధువుల్లాగ బదరీనాథ్‌కి నడిచే వెళ్దామని అనుకున్నాను.

బదరీనాథ్‌కి వెళ్ళే రోడ్డు అందమైన గంగానదీ తీరం మీదుగా వంకర్లు తిరుగుతూ వెళుతుంది. రెండోవైపు రాళ్ళకొండలూ అడవులూ ఉన్నాయి. ఆ రోజుల్లో చెట్ల మధ్య నెమళ్ళు నాట్యం చేస్తూ కనిపించేవి; వాటి బిగ్గర కేకలు (క్రేంకారాలు) వినిపించేవి. అదంతా ఉత్తరాఖండ్‌లో ఆనకట్టలు కట్టకముందు, నదులను అనుసంధానించి అక్కడి వాస్తవ్యులకు వెలుగునివ్వడానికి పవర్‌స్టేషన్లు సమకూర్చక ముందూను. ఇప్పుడు నెమళ్ళన్నీ మటుమాయమైపోయాయి.

ఏ చీకూ చింతా లేకుండా ఒంటరిగా నడిచే స్వేచ్ఛాసుఖాన్ని నేను అనుభవించాను. నా వీపు మీద పట్టీతో కట్టిన ఒక దుప్పటీ, ఒక తువ్వాలూ మాత్రమే ఉన్నాయి; నా దగ్గర ఒక చిన్న రాగి జలపాత్ర ఉంది. నా భుజాల మీంచి వేళ్ళాడుతూన్న గుడ్డసంచిలో ఒక అగ్గిపెట్టె, రాసుకోడానికి వీలుగా ఒక పుస్తకమూ, ఒక చురకత్తి, రెండు పెన్సిళ్ళూ ఉన్నాయి. బ్రాహ్మణ వైఖరిలో కట్టుకున్న పసుప్పచ్చ ధోతీని ధరించాను. పూర్తిగా గొరిగిన తలమీద పిలకతో, కూచి మొనలున్న నడక కర్ర అనే ఆయుధంతో నేను ఒక జిజ్ఞాసువు రూపావతారంగా కనిపించాను.

రాత్రి పదేసరికల్లా వశిష్ఠ గుహకు చేరాలన్నది నా లక్ష్యం. వశిష్ఠ గుహ ఇరవై రెండు కిలోమీటర్ల అవతల ఉంది. నేను ప్రతి రోజూ అంతదూరం ప్రయాణం చేద్దామనుకున్నాను. ఋషీకేశం నుంచి బదరీనాథ్‌కి రెండు వందల నలభై కిలోమీటర్లు.

రోజు ప్రొద్దెక్కుతున్న కొద్దీ సూర్యుడి తేజస్సు పెరిగి ప్రచండమయింది. నాలోని తెంపూ ధైర్యమూ తగ్గుతూ వచ్చాయి. మొదట, నా కాళ్ళు బాధించడం మొదలు పెట్టాయి. నేను వేసుకున్న రబ్బరు చెప్పుల్లో ఒకదాని పట్టీ తెగిపోయింది. అంచేత చెప్పుల్ని వదిలిపెట్టాల్సి వచ్చింది. మధ్యాహ్నానికి రోడ్డు మహా వేడెక్కిపోయింది. నా కాళ్ళు కాలిపోతున్నాయి. ఎప్పుడూ చెప్పుల్లేకుండా నడవకపోవడం వల్ల, ఆ గరుకు, కరకు, ఎగుడుదిగుడు నేల మీద నడవడం మహా బాధాజనకమయింది. సూర్యుడు బొత్తిగా దయ లేకుండా చితకబాదుతూన్నట్టు కాలుస్తున్నాడు. నా నెత్తిని తువ్వాలుతో కప్పుకొని శ్రమపడుతూ నడకను సాగించాను. పాదరక్షల్లేని కాళ్ళతో ఆనందంగా నడిచిపోయే చిరకాలానుభవం కల సాధువులను వదిలిపెట్టేశాను. వాళ్ళు అప్పుడప్పుడు మంచి నీడనిచ్చే చెట్టుకింద ఆగి చిలుం (గంజాయి కానీ చరస్ కానీ కూరిన గరాటా

లాటి గొట్టం) తయారు చేసుకొని ఏదో పొగ పీలుస్తూ ఉంటారు. నాకు అనుమానం అది చరస్సో మరో ఇతర మత్తు పదార్థమో అయి ఉంటుందని. నన్ను వాళ్ళలో కలవమని పిలుస్తూ ఉన్నారు కానీ నేను మాత్రం తిరస్కరిస్తూ వచ్చాను. నేను హిమాలయాలకు మత్తుమందు బానిసగా తయారవడానికి రాలేదు.

ఇప్పుడు నన్ను ఆకలి అలమటించింది. ఇంకా కొన్ని పైసలున్నాయి నా దగ్గర. రోడ్డు పక్కనున్న ఒక ధాబా (అల్పాహార గృహం)ను చూసి మరత్యమాత్రుల అక్కరను చల్లార్చడానికి అటు పరుగెత్తాను. గఢ్వాలీ ధాబా యజమానికి సాధువులంటే ఏ మాత్రం గౌరవమూ లేదు. నేను తిన్న రెండు చపాతీలకూ బంగాళాదుంప కూరకూ అతిగా వసూలు చేశాడు అతను. ఇప్పుడిక నా దగ్గర ముప్పై రూపాయలే మిగిలాయి.

అయితే ఆ ప్రదేశం మాత్రం మంచి నీడగా ఉంది. అంచేత, ట్రక్కు డ్రైవర్లకు గంటకు ఐదు రూపాయల చొప్పున బాడుగకిచ్చే కట్టె మంచాల్లో ఒక దానిని అద్దెకు తీసుకొని ఓ కునుకు తీద్దామని పడుకున్నాను. నేను చాలా గాఢంగా నిద్రపోయాను.

నేను లేచేసరికల్లా, సూర్యుడు అంత తీక్షణంగా లేడు; నీడలు పొడుగుసాగడం మొదలుపెట్టాయి. నా కాళ్ళను, ఉపశమన కలిగించే చల్లని కుళాయి నీటిలో కడుగుకొని నా ప్రయాణాన్ని కొనసాగించాను. సూర్యుడు అస్తమించడానికి సిద్ధపడుతూంటే నా మనస్సుకి ఆరాటం పట్టుకుంది. 'వశిష్ఠ గుహ' కనుచూపు మేరలో లేదు; ప్రతి అడుగూ బాధాకరమూ బాధాకరతరమూ అవుతోంది. నా అరికాళ్ళు తెగి గాయపడ్డాయి. నా పిక్కల కండరాలూ తొడల కండరాలూ దారుణంగా నొప్పి పెడుతున్నాయి.

చివరికి, ఇక ముందుకు వెళ్ళలేనని నేననుకుంటూండగా, సాయం కోసం ఉద్రేకంతో ప్రార్థిస్తూండగా, ఋషీకేశం నుంచి వస్తూన్న ఒక జీప్ వచ్చి నా పక్కన ఆగింది. "మహరాజ్, ఎక్కడికండి?" అని డ్రైవర్ హిందీలో అడిగాడు. "బదరీనారాయణ్ అయితే ప్రస్తుతానికి మాత్రం వశిష్ఠ గుహ" అని నేను అన్నాను. "రెండు కిలోమీటర్లు ఎక్కండి. అక్కడికి నేను ఐదు నిముషాల్లో తీసుకుపోతాను. అక్కడ దీపాలేవీ లేవు. చీకటి పడుతోంది. గుర్తులు తెలిపే ఏ ఒక్క బోర్డు కూడా ఉండదు" అని అన్నాడతను.

నేనొక క్షణమాలోచించాను. నడవడం చాలా కష్టమైపోతోంది. నిజమే, నేను ఏ రకమైన ప్రయాణ సాధనాన్నీ వినియోగించనని శపథం చేసుకున్నాను. కానీ ఇప్పుడు పరిస్థితులు వేరుగా ఉన్నాయి. రామకృష్ణ పరమహంస చెప్పిన మాటలు "ధర్మపరాయణంగా ఉండడమంటే మూర్ఖంగా ప్రవర్తించడం కాదు" గుర్తుకొచ్చాయి. "సరే" అని నేను జీపులోకి ఎక్కాను.

అది పాత విల్లీస్ జీప్. డబడబమంటూ బాగా త్వరగానే నడిచింది. ఆ యువ డ్రైవర్ కొండమీద బండి నడపడాన్ని బాగా నేర్చినవాడు. త్వరలోనే, ఆ జీపు రోడ్డు పక్కన ఆగింది. "మహరాజ్! దిగండి. నేను మిమ్మల్ని ఆశ్రమానికి తీసుకువెళ్తాను. అక్కడ కేరళ నుంచి వచ్చిన ఒక యువ బ్రహ్మచారి మహరాజ్ ఉన్నారు. పెద్ద స్వామి కొన్ని ఏళ్ళ క్రితం చనిపోయారు. రండి" అని డ్రైవర్ అన్నాడు.

నేను జీపు నుంచి దిగాను. ఆ యువకుడు మార్గదర్శకుడిగా నేను, చాలా వరకూ నిటారుగా ఉన్న ఆశ్రమ మార్గం మీదుగా చాలా కష్టపడుతూ దిగాను. ఆ ప్రదేశంలో కరెంటు లేదు. హరికేన్ లాంతర్ల మందకాంతిలో నేను దేన్నీ స్పష్టంగా చూడలేక పోయాను. తలమీద బ్రహ్మచారి కుచ్చుజుత్తుతో తెల్ల దుస్తుల్లో ఉన్న ఒక యువకుడు గదిలోంచి ఇవతలకు వచ్చి "హరి ఓం, నేను బ్రహ్మచారి ఆత్మచైతన్యను. నువ్వెవరివి?" అని అన్నాడు.

"మహరాజ్! ఈ యువ సాధువు రోడ్డుమీద కుంటుతూ తడబడుతూ నడుస్తూ ఉండగా చూశాను. అతను బదరీనాథ్ వెళ్తున్నాడు. అతనిని బండిలో ఎక్కించుకొని తీసుకొనివచ్చాను. అతను వశిష్ఠ గుహ కోసం చూస్తున్నాడు" అని నా సహచరుడు రాజేశ్ అన్నాడు.

"హరి ఓం మహరాజ్!" అని నేను అతనిని సంబోధించాను. ఆ మీద అతని ఉచ్చారణ నుంచి, అతను, నా సహచరుడు చెప్పిన ఆ కేరళీయ బ్రహ్మచారి అని తెలుసుకొని, నేను మలయాళంలో మాట్లాడాను: "బదరీనాథ్ వెళ్తున్నాను. వశిష్ఠ గుహ గురించి విని చూద్దామని అనుకున్నాను. కానీ చాలా చీకటి పడిపోయింది. నా కాళ్ళ నిండా గాయాలయ్యాయి. నేను...."

ఆ బ్రహ్మచారి ఒక కరుణాత్ముడు. "సరే. సమస్యేమీ లేదు. నువ్వు ఈ రాత్రి ఇక్కడ గడుపుకోవచ్చు. నువ్వెక్కడి నుండి వచ్చావు?" అని మలయాళంలో అతనన్నాడు.

"మహరాజ్! నేనింక సెలవు తీసుకుంటాను. నేను బ్యాసీలో ఉంటాను. అది ఇక్కణ్ణించి కొద్ది దూరంలోనే ఉంది. అక్కడ నాకు ఒక చిన్న కొట్టూ, రోడ్డు పక్క ఢాబా ఉన్నాయి. మీకిష్టమున్నప్పుడెప్పుడైనా రండి" అని ఆ యువ గఢ్వాలీ అన్నాడు (నాతో). ఆ తరవాత అతను బ్రహ్మచారి పాదాలనూ, ఆ మీద నా పాదాలనూ స్పృశించి వెళ్ళిపోయాడు. రాత్రి నిశ్శబ్దంలో ఇంజన్‌ను ప్రారంభించి, వెళ్ళిపోయే శబ్దాన్ని విన్నాం.

"నువ్వు చాలా అలసిపోయి ఉంటావు. నీకు ఒక చిన్న గదిని చూపిస్తాను. అవతల స్నానాల గది ఉంది. స్నానం చేసి కొంతసేపు విశ్రాంతి తీసుకో. ఒక అరగంటలో ఆ వరండా మీద అన్నం వడ్డిస్తారు. పొద్దున్నే, నీకు వశిష్ఠ గుహను చూపిస్తాను" అన్నాడు, ఆ బ్రహ్మచారి. ఒక చిన్న గది దగ్గరకు నన్ను తీసుకొని వెళ్ళాడతను. ఒక మంచమూ రెండు దుప్పట్లూ ఉన్నాయి దానిలో. మరో లాంతరు వెలిగించి దానిని నా కోసం వదిలిపెట్టి "మనం రాత్రి భోజనం టైములో కలుసుకుందాం" అంటూ వెళ్ళిపోయాడు.

రాత్రి భోజనం చాలా సామాన్యంగా ఉంది - చపాతీలు, ఒక రకం బీన్స్ పులుసు, అన్నం, బంగాళాదుంప కూర, భోజనం తరవాత, మేము కొంతసేపు కబుర్లు చెప్పుకున్నాం. ఆ బ్రహ్మచారి నేను నిజమైన జిజ్ఞాసువునే అని రూఢి చేసుకున్నట్టుగా ఉన్నాడు. "ఇప్పుడు నువ్వు నిద్రపో. మనం పొద్దున్న కలుసుకుందాం" అని అన్నాడతను. అతను తోటి కేరళీయుడ్ని కలుసుకున్నందుకు చాలా సంతోషించాడని నేననుకున్నాను.

ఆపాటికి, గాలిలో చల్లనితనం ప్రబలింది. దుప్పట్లలో నన్ను చుట్టబెట్టు కున్నాను. అలసిపోయాను కనక త్వరగానే గాఢంగా నిద్రపోయాను. నమూనా సంగీతం వాయిస్తూన్నట్టున్న కీచురాళ్ళ ధ్వనులే నేను విన్న ఆఖరి ధ్వనులు. నేను ఒక దుంగలాగ నిద్రపోయాను.

మర్నాటి పొద్దున్న నేను లేచాను. తెల్లారి చాలాసేపే అయిందని చూసి పక్కమీద నుంచి లేచి గభాలున దిగి నొప్పితో అరిచాను. నా అరికాళ్ళ నిండా బొబ్బలున్నాయనీ, నా మడమలు వాచిపోయాయనీ గమనించాను. కొన్ని బొబ్బలు పగిలిపోయాయి. నొప్పి తీవ్రంగా ఉంది. నా ఒళ్ళంతా తీపుగా ఉంది, ముఖ్యంగా పిక్కల కండరాలు. కానీ నేను ఉత్కంఠతో ఉన్నాను, లేచి పరిశీలించాలని నిశ్చయం చేసుకున్నాను.

కుంటుకుంటూ ఆ చిన్న గదిలోంచి ఇవతలకు వచ్చి, ఒక కుళాయి దగ్గర్లోనే ఉందనీ, నేలమీద ఒక సామాన్య రంధ్రంలాగ ఉన్న టాయిలెట్ కొద్ది దూరంలోనే ఉందనీ చూసి ఉపశమించాను. శుభ్రపడ్డ తరవాత, నేను నెమ్మదిగా ఆ బ్రహ్మచారి గదిగా అనుకున్న చోటికి నడిచి వెళ్ళాను. ఆ బ్రహ్మచారి అక్కడ ఉన్నాడు. అటుకులూ ఆవుపాలూ ఉపాహారంగా తీసుకున్న తరవాత కొంతసేపు మేము మలయాళంలో మాట్లాడుకున్నాం. నేను నిజమైన ఆధ్యాత్మిక జిజ్ఞాసువునని అతను నిశ్చయించు కున్నాడు.

నా భౌతిక స్థితిని చూసి ఆందోళన పడుతూ, నేను కాళ్ళతో నడవడానికి యోగ్యంగా అయ్యేంతవరకూ అక్కడ ఉండాలని అతను అన్నాడు. నేను సంతోషం గానే సమ్మతించాను. ఆ మీద, అతను నన్ను వశిష్ఠ గుహ, అతని గురువు సమాధి (గోరీ), నది తాలూకు రాళ్ళ ఒడ్డులూ, రాతి అంచుమీద ఉన్న అరుంధతీ గుహ అనే చిన్న గుహ అనేవాటిని తానే మార్గనిర్దేశనం చేస్తూ పర్యటింపజేశాడు. అప్పుడు నాకు తెలియదు (ఆ తరవాత) కొన్ని రోజులు బాబాజీతో నేను అరుంధతీ గుహలో గడుపుతానని.

వశిష్ఠ గుహ బాగా విస్తృతమైన గుహగా అంతమయ్యే సహజమైన ఒక పెద్ద సొరంగం. ప్రవేశమార్గం ద్వారా వస్తున్న స్పష్టాస్పష్టమైన కాంతికి కళ్ళు అలవాటు పడేవరకూ లోపల చిమ్మచీకటే. గుహకు ఆ చివరన ఒక నల్ల శివలింగం ప్రతిష్ఠితమై ఉంది. ప్రాచీన కథ ప్రకారం ఈ సొరంగం ఒకప్పుడు గుహకు అవతల కూడా కొనసాగి నది దగ్గరగా తెరుచుకునేదిట. గుహలో కూర్చుంటే బాహ్య ప్రపంచం తాలూకు ధ్వనుల నుంచీ క్రియల నుంచీ పూర్తిగా విడివడిపోతాం. లోపలి గంభీరమైన నిశ్శబ్దం, అప్పుడప్పుడు కీచురాళ్ళు తమ సమక్షాన్ని నమోదు చేసే ధ్వనితో మాత్రమే భంగమవుతూ ఉంటుంది. ఎవడైనా అక్కడ శాంతంగా కూర్చుంటే చాలు, అతని మనస్సు దానికదే ధ్యానంలో నిమగ్నమైపోతుంది.

ఇది (ఈ గుహ) బాగా పురాతనమనీ, మహర్షి వశిష్ఠుడు తన తపస్సు కోసం వినియోగించుకున్నాడనీ తెలిసి ఉన్నప్పటికీ, ఇటీవలి సమయంలో ఆ మలయాళీ బ్రహ్మచారి చాలా ఏళ్ళ వరకూ సేవ చేసిన స్వామీ పురుషోత్తమానంద దీన్ని తన నివాసంగా చేసుకున్నాడు. స్వామీ పురుషోత్తమానంద కూడా కేరళీయుడే. ఆయన స్వామీ నిర్మలానంద శిష్యుడు. స్వామీ నిర్మలానంద కూడా కేరళ నుంచి వచ్చిన సన్యాసే. ఆయన రామకృష్ణ వర్గం తాలూకు అనుభూతిపరుడైన సన్యాసి. చాలా చిన్నవయస్సులోనే ఆయన, మహానుభావుడైన రామకృష్ణ పరమహంసను దర్శించారు. అతని జీవితంలో తరవాత, రామకృష్ణ మిషన్ తాలూకు అధికార శ్రేణిని ధిక్కరించి తానే స్వతంత్రంగా కేరళలోని ఒట్టపాలంలో రామకృష్ణాశ్రమాన్ని ప్రారంభించాడు.

1879వ సంవత్సరం నవంబరు 23న పుట్టిన స్వామీ పురుషోత్తమానందను స్వామీ నిర్మలానందులు 1916లో రామకృష్ణ వర్గపు మొదటి అధ్యక్షుడైన స్వామీ బ్రహ్మానంద నుంచి దీక్షను స్వీకరించమని ఆదేశించారు. ఆ తరువాత 1923లో స్వామీ శివానంద గారు ఆయనకు సన్యాసిగా దీక్షనిచ్చారు. స్వామీ శివానందగారు

కూడా రామకృష్ణ గారికి మరో ప్రత్యక్ష శిష్యుడు. ఆయనను సామాన్యంగా "మహాపురుష్ మహరాజ్"గా పిలుస్తారు. 1928లో వశిష్ఠ గుహకు వచ్చి, స్వామీ పురుషోత్తమానంద ఆ గుహలో చాలా ఏళ్ళు గడిపారు. ఆయన సమాధి, గుహ అవతల ఉన్న ఆవరణలో ఉంది. 82 ఏళ్ళప్పుడు 1961 ఫిబ్రవరి 13 నాడు రాత్రి 10.50కి శుభప్రదమైన మహాశివరాత్రి నాడు ఆయన పరమపదించారు.

నేను ఆశ్రమానికి వెళ్ళిన సమయంలో అక్కడ కొన్నే కుటీరాలూ (ఆధ్యాత్మిక జిజ్ఞాసువులు వాడుకునే సామాన్యమైన గదులు) ఒక చిన్న వంటిల్లూ ఉండేవి. ఆ బ్రహ్మచారీ, ఒక వంటవాడూ, అతని సహచరుడూ, ఒకరిద్దరు సందర్శకులను అటుంచితే, ఆ ప్రదేశం మామూలుగా చాలా ఏకాంతంగానూ ధ్యానానికి తగినట్టుగానూ ఉంటుంది.

అంచేత అక్కడ చల్లని గంగాజలాల్లో స్నానం చేస్తూనూ, యోగాభ్యాసాలను చేసుకుంటూనూ గుహలో ధ్యానం చేస్తూనూ పదిహేను రోజులు గడిపాను.

ఆహారం సరళంగా, సరిగ్గా కావలసినంతగా ఉండేది. చాలా బాగుండేది. ఆ బ్రహ్మచారి అప్పుడప్పుడు నాతో మలయాళంలో మాట్లాడుతూ తన గురువుతోనూ, అక్కడకు వచ్చి, ఒక్కోసారి కొన్నాళ్ళున్న ఇతర సంచారక సాధు సన్యాసులతోనూ సాగిన తన జీవితం గురించీ కథలు చెప్పేవాడు.

పదిహేను రోజుల్లో నా బొబ్బలన్నీ నయమయ్యాయి. ఇంక మరో రోజు ఉండదలచు కోలేదు నేను. ఆ స్థానం చాలా గొప్పదే కాని నేను నా సొంత మార్గాన్ని కనుక్కోవాలి. సంశయాలు హింసించాయి నన్ను. ఆ ముసలి సన్యాసి పలికిన విరసపు పలుకులు నాకు అప్పుడప్పుడు గుర్తుకొస్తూ ఉండేవి. నా సంశయాలను పోగొట్టి నా ప్రశ్నలకు సమాధానాలు చెప్పే నిజమైన గురువును నేను కనుక్కోవాలి. అటువంటి గురువు ఉన్నాడా అసలు?

"నువ్విప్పుడే ప్రారంభించావు. ఓర్పుతో ఉండు. ప్రయత్నాన్ని వదిలిపెట్టకు. యాత్ర ఇప్పుడే మొదలయింది. దారిలో నడు". అని నాకు నేను చెప్పుకొనేవాణ్ణి. ఒకరోజు పొద్దున్న ఆ బ్రహ్మచారికి ధన్యవాదాలు చెప్పి, సెలవు తీసుకొని మళ్ళీ బదరీనాథ్ వైపుకు నా ప్రయాణాన్ని కొనసాగించాను.

## 17. నాగ (సాధువు); మహామంత్రాన్ని నేర్వడం

ఋషీకేశం నుంచి బదరీనాథుకి పోయే తోవ ఐదు ప్రయాగల గుండా సాగుతుంది. భారతదేశపు పవిత్రనదులు ఆ ప్రయాగల్లో సంగమిస్తూ ఉంటాయి. దేవప్రయాగ దగ్గర, గంగోత్రి నుంచి కిందికి ప్రవహించే భాగీరథి, బద్రీనాథు నుంచి కిందికి ప్రవహించే అలకనందాతో కలుస్తుంది. ఈ చిన్న ఊళ్ళో నదీసంగమం పక్కన శ్రీరాముడికి అంకితమైన గుడి ఒకటి ఉంది. (అక్కడి వాళ్ళు) శ్రీరాముడు తన ముసలితనంలో ఇక్కడ తపస్సు చేశాడని నమ్ముతారు. పర్వత పంక్తుల నుంచి ప్రగర్జిస్తూ అవతరిస్తున్న నదుల సంగమం ఒక అద్భుత దృశ్యం.

మరికొంచెం పైగా రుద్రప్రయాగ ఉంది. అక్కడ కేదార్‌నాథ్ నుంచి వచ్చే మందాకిని అలకనందతో కలుస్తుంది. తరవాతది కర్ణ ప్రయాగ. అక్కడ పిండార, అలకనందతో కలుస్తుంది. ఆ తరువాత వచ్చేవి నందప్రయాగ, విష్ణుప్రయాగలు. విష్ణుప్రయాగ దగ్గరున్నదే ప్రసిద్ధమైన జ్యోతిర్మఠం. దీనినే స్థానికంగా జోషీమఠ్ అని అంటారు. మహావేదాంతి అయిన ఆదిశంకరులు ఈ జోషీ మఠాన్ని స్థాపించారని చెబుతారు. అది ఆయన ప్రతిష్ఠాపించిన మఠాల్లో ఉత్తమోత్తమమైన మఠం. ఆదిశంకరులు స్థాపించిన ఇతర మఠాలు పడమటిలో ద్వారక, తూర్పున పూరీ, దక్షిణ భారతాన శృంగేరీ మఠాలు.

ఇంకాపైన పాండుకేశ్వర్‌లో పూలలోయకూ, సముద్రమట్టానికి 15,000 అడుగుల పైనున్న సిక్కుల పావన సరస్సు హేమకుండ సాహెబ్‌కూ పోయే కఠిన మార్గం ప్రారంభమవుతుంది. పాండుకేశ్వర్ దాటిన మీద బదరీ పుణ్యాలయమున్న పవిత్ర పర్వతం ఉంది. బదరీనాథ్‌లోని ప్రధాన పురోహితుడు జోషీమఠంలో శీతాకాలం ఆరు నెలలూ గడుపుతాడు.

వశిష్ఠ గుహ నుంచి బదరీనాథ్‌కున్న మొత్తం దూరం రమారమి 220 కిలోమీటర్లను, నేను ఇరవై ఐదు రోజుల్లో ప్రయాణించాను. ఆ మొత్తం దూరం ఏ ప్రయాణ సాధనమూ ఉపయోగించకుండా నడవగలిగినందుకు నాకు గర్వంగా ఉంది. నేను పరిణతి పొందిన సంచారక సాధువుగా తయారయ్యాను. కొన్ని వేళల్లో అన్నం దొరకడానికి కష్టాలను ఎదుర్కోవలసి వచ్చింది; ఎవరూ వాడకుండా వదిలేసిన పాకల్లో చలితో వణికిపోతూనే నిద్రపోవలసి వచ్చింది – కానీ ఇవన్నీ నా ప్రయాణాన్ని కొనసాగించడంలో నా ఉత్సాహాన్నీ ఆరాటాన్నీ తగ్గించలేకపోయాయి.

భౌతికమైన అసౌకర్యాలు నాకు లేశమాత్రమైన సమస్యలు. నా మనస్సు మాత్రం ఒంటరి వేళల్లో ఆందోళన చెందేది; ఒక్కోసారి (ఎవరో దొరుకుతారన్న) భ్రాంతి వీడిపోతూ ఉండేది. (ఇంతలోనే) కొండల అందాలూ నదుల అందాలూ ఆ

మంచుకొండల ఎత్తుల్లో నా ప్రశ్నలకు సమాధానాలను చెప్పి, నాకు సాయపడే ఎవరో ఒకరున్నారన్న ఆశ నన్ను ముందుకు సాగింపజేస్తూ వచ్చాయి.

నా ప్రయాణంలో చెప్పదగిన రెండు అనుభవాలున్నాయి.

దేవప్రయాగలో పూర్తిగా నగ్నంగా ఉన్న ఒక నాగ సాధువు నన్ను సమీపించి సంభాషించాడు. నేను దేవప్రయాగ చేరుతూంటే చీకటి పడిపోతోంది. నాకెక్కడ తిండి దొరుకుతుందీ, ఎక్కడ పడుకోగలుగుతానా అని చకితపడుతూండగా జెడలు కట్టిన ఒక పొడుగుపాటి నల్లటి దిసమొల వాడు నా దగ్గరికి వచ్చి "నువ్వు ఉండదానికి స్థలం కోసం చూస్తూన్నట్లైతే నాతో రా" అని అన్నాడు.

ఒక నాగుడితో ఉండడం కొత్త అనుభవమే. నేను ఒప్పుకొని అతనితో వెళ్ళాను. నది ఒడ్డుకి దగ్గరగా ఒక చిన్న కుటీరంలో ఉన్నాడతను. ఆ కుటీరం రాముడి గుడికి మరీ అంత దూరమేమీ కాదు. కుటీరం ముందు ఒక 'ధుని' (పవిత్రమైన పెద్ద మంట) ప్రజ్వలిస్తోంది.

నన్ను నేను నదిలో శుభ్రపరచుకొని వెనక్కి వచ్చేసరికల్లా అతను ధునిముందు కూర్చుని ఉన్నాడు. "కూర్చో, అగ్నిదేవుణ్ణి ప్రార్థించు. వంగి నమస్కరించు. మనం తిందాం. ఆ మీద సిద్ధిని పొందుదాం" అని అన్నాడతను.

"సిద్ధి?" అంటే ఏమిటని అడిగాను నేను. ఎందుకంటే "సిద్ధి" అనే మాట, యోగులకుంటాయనుకునే లోకాతీత శక్తులకు వాడతారు. "అవునవును. నువ్వు చూస్తావుగా" అని అన్నాడతను.

మేము వేడి వేడి చపాతీలను బంగాళాదుంప కూరతో తింటూండగా అతను నా జీవితం గురించీ నేనెక్కడకు పోతూన్నదీ అనే విషయాలను అడిగాడు. నేనొక జిజ్ఞాసువుననీ, నా పేరు "శివప్రసాదు" అనీ, బదరీనాథ్‌కు వెళ్తున్నాననీ, తగిన గురువు కోసం చూస్తున్నాననీ నేను చెప్పాను. నా గురించి ఒక నిర్ణయానికి రావడానికి అతను (ప్రశ్నిస్తున్నాడని) నేననుకున్నాను. అది సరైనదే. మేము తినడం కాగానే, అతను లోపలికి వెళ్ళి ఒక మట్టి చిలుం తెచ్చి దానిని గంజాయి పొగాకులతో నింపి అంటించాడు. మఠం వేసుకొని కూర్చొని "భం భోలే, హరహర మహాదేవ్ శంభో" అని బిగ్గరగా అరిచి ఒక గట్టి పీల్పు పీల్చాడు. తరవాత పొగను నెమ్మదిగా అవతలకి వదిలి ఆ చిలుంను నా వైపుకు చాచాడు. "సిద్ధి. దీనితో నువ్వు శివలోకానికి ప్రయాణం చేసి శక్తులన్నీ పొందుతావు; నేను నీ గురువును కాగలను. శివ మహాదేవుడు నాకు ఒక చక్కటి అందమైన శిష్యుణ్ణి పంపించాడు. పొగ తాగు, పొగ తాగు. ఇదెలాగ చేయాలో తెలుసునా నీకు?" అని అడిగాడు అతను.

ఆ పొగలోంచి వచ్చే వాసనతో అది గంజాయి అని తెలిసింది నాకు. త్రివేండ్రం లోని కొంతమంది మిత్రులు గంజాయి పీల్చేవాళ్ళు. నేను కొన్నిసార్లు (దానిని పీల్చడానికి) ప్రయత్నించాను. కానీ నేనంత ప్రత్యేకంగా దానికి ఆకర్షితుడ్ని కాలేదు. అది ఒక రకంగా ధ్యానావస్థలోకి తీసుకు వెళ్ళగలదు కానీ తాత్కాలికంగా మాత్రమే. అయితే దానికి బానిస అయిపోయే అపాయం ఎక్కువ. నేను తిరస్కరించాను. అతనికి (నాగుడికి) చాలా కోపం వచ్చింది. "ఒక నాగుడు అగ్నిసమక్షంలో ఇచ్చే సిద్ధిని ఎవ్వరూ తిరస్కరించరు. తీసుకో!" అని గట్టిగా అరిచాడు.

అనిష్టంగానే అతని నుంచి చిలుం తీసుకొని కొన్ని పీల్పులు పీల్చాను. కొన్ని నిముషాల తరవాత అతను హఠాత్తుగా "దక్షిణ. నిన్ను ధ్యాన రహస్యాల్లోకి ప్రవేశ పెట్టినందుకు గాను నువ్వు నాకు దక్షిణ, డబ్బు ఇవ్వాలి, ఇయ్యి!" అని అన్నాడు. అతనితో వాదించడం ఇష్టంలేక, నేను అతనికి పది రూపాయలిచ్చాను. "ఎక్కువ, ఎక్కువ" అని గర్జించాడు అతను.

మరో పది ఇచ్చి "ఇంతే నా దగ్గరున్నది" అని చెప్పాను. అతను సంతోషంగా ఇకిలించాడు. "చాల్లే, చాల్లే. ఇప్పుడు నువ్వు ఆశీస్సులను పొందావు" అని అతను తన చేతుల్ని నా నెత్తిమీద పెట్టాడు. "మరికొంచెం సిద్ధిని స్వీకరించు" అని అన్నాడు. నేను కాదన్నాను. "నువ్వు వరండాలోనైనా, లోపల గానీ పడుకోవచ్చు" అని అన్నాడు. నేను అలసిపోయాను. గంజాయి నాకు నిద్రమత్తు కలగజేసింది. నా దుప్పట్లో నన్ను చుట్టబెట్టుకొని, నా సంచినే తలగడగా ఉపయోగించి నిద్రపోయాను. నా సంచిలో మరికొన్ని రూపాయలున్నాయి. ఆ నాగుడు వాటిని దొంగిలించడానికి ప్రయత్నిస్తాడేమో అని అనుమానపడ్డాను. ఆ రాత్రి, నిద్రపోయే ముందు నేను మామూలుగా చేసే ధ్యానం అనుజ్వలంగానూ అశాంతంగానూ సాగింది. నా ఉనికి చీకటితో ఆవృతమైనట్టూ, నా ఆత్మస్థూలంగానూ భారీగానూ ఉన్న మోకులతో బిగించినట్టూ అనిపించింది నాకు. ఆ నాగుడు ఇంకా ఆ చిలుంలోని మత్తుమందుని తాగుతూనే ఉన్నాడు.

మర్నాటి పొద్దున్న నేను తెల్లారకుండానే లేచాను. ఆ నాగుడు బిగ్గరగా గుర్రు పెడుతూ కుటీరం లోపల ఇంకా నిద్రపోతున్నాడని చూసి నేను ఉపశమిల్లాను. చప్పుడేమీ చేయకుండా, నా దుప్పట్లను చుట్టబెట్టుకొని, నా సంచీని, నీటి కమండులువునీ, కర్రనీ తీసుకొని నెమ్మదిగా మసకమసక చీకట్లోనే అవతలకి వెళ్ళి పోయాను. తెల్లారేసరికి నేను దేవప్రయాగ నుంచీ ఆ నాగ సిద్ధుడ్నించీ చాలా దూరమే నడిచేశాను.

కొన్ని రోజుల తరవాత, రుద్రప్రయాగకు మరీ దూరం కాని చోట, ఒక దట్టమైన అడవిలోకి వెళ్ళిపోయాను. త్వరలోనే అర్థమయింది నేను దారి తప్పినట్టు. చీకటి పడిపోతోంది. నేనా రాత్రినెక్కడ గడపాలబ్బా అని ఆరాటపడుతూండగా నా వైపుకే వస్తూన్న ఒక మధ్య వయస్కుణ్ణి చూశాను. అతని వీపుమీద వంట చెరకు మోపు ఉంది. "మహరాజ్! మీరెక్కడకు వెళ్తున్నారు?" అని అడిగాడతను. "బదరీనాథ్. కానీ నేను దారి తప్పినట్టున్నాను. ఈ రాత్రికి నేను ఇంత తిండి తిని, విశ్రాంతిని తీసుకోగలిగిన చోటు ఇక్కడ నీకేమైనా తెలుసునా?" అని అడిగాను. "నాతో రా! బావాజీ గారి ఆశ్రమం ఇక్కణ్ణించి ఎంతో దూరం కాదు. ఆయన నా గురువు. రా" అని అన్నాడతను.

హిమాలయాల్లో ఎక్కడో బాబాజీ అనే చిరంజీవి అయిన మార్మిక యోగి ఉన్నాడన్న మాటను నేను చదివాను. అంచేత నేను నిజంగా చాలా ఉత్తేజితుణ్ణయ్యాను. "అంటే మహానుభావుడైన బాబాజీ నీ గురువా?" అని చట్టుకున్న ఆలోచనారహితంగా అన్నాను.

నేను ఏ బాబాజీ గురించి మాట్లాడుతున్నానో అతనికి అర్థం కాలేదు. అతని గురువు ఒక వైష్ణవ బాబాజీ. వైష్ణవ సాధువులను బావాజీలని అంటారు.

నిట్రంగా ఉన్న ఒక దారి మీదుగా నదీతీరానికి మేము దిగాం. నదికి బాగా దగ్గరగా, పండ్ల చెట్లూ పూలమొక్కలూ చుట్టూరా ఉన్న, నల్లరాతితో కట్టిన చిన్న గుడి ఉంది. ఆ గుడి చుట్టూ చిన్నచిన్న కుటీరాలూ, భోజనశాలగానూ వంటిల్లుగానూ ఉన్న స్వరూపాలూ ఉన్నాయి. గంటలూ జేగంటలూ మోగుతున్నాయి. గుడిలో సాయంత్రం పూజ సాగుతోందని అర్థం చేసుకున్నాను.

స్త్రీలూ పురుషులూ రెండు రకాల వారూ ఆ పూజకు హాజరై ఉన్నారు. పొడుగ్గానూ, అంగసౌష్ఠవంతోనూ, పూర్తిగా క్షౌరం చేసుకున్న ముఖంతోనూ, గోచీ గుడ్డ వినా ఒళ్ళంతా ఏ ఇతర బట్టా లేకుండానూ, ఛాతీకి అడ్డంగా పవిత్రమైన జందేన్ని వేసుకొని, బోడిగుండు వెనక పొడుగ్గానూ దట్టంగానూ ఉన్న పిలకను ముడిపెట్టుకొని ఉన్న ఒకాయన కృష్ణుడూ, ఆయన భార్య రాధాదేవీ సుందర విగ్రహాల ముందు దీపారతినిస్తూ దానితోబాటు చిన్న గంటను మోగిస్తున్నాడు.

అది పూర్తి కాగానే ఆయన ఇటు తిరిగి ఆ ఆరతి దీపాన్ని కళ్ళకు అద్దుకోడానికి జనానికి పంపిస్తూండగా, ఆయన నుదుటిమీద, కంఠం మీద, పై చేతులమీదా సుగంధ లేపనంతో పెద్దగా కనిపించే U – ఆకారంలో ఉన్న వైష్ణవ చిహ్నాలను ధరించి ఉన్నారని గమనించాను. ఆయన మెడ చుట్టూ చిన్న తులసి పూసల మాల ఉంది. నన్ను తీసుకు వచ్చిన అతను ఆయన పాదాలను ముట్టుకొని గుసగుసలతో ఏదో చెప్పాడు.

ఆ బావాజీ నవ్వి నా వైపుకు వచ్చారు. ఆచారం ప్రకారం నేను ఆయన పాదాలను తాకేను. 'జై శ్రీకృష్ణ! ఆశీస్సులు. ఇప్పుడు గంగామయ్యా (గంగమ్మ తల్లి)లో స్నానం చేయడానికి వెళ్ళి తిరిగి రా. ముందు, మనం ప్రసాదం (దేవుడికి నివేదించినది, అంచేత పవిత్రమైనదీ) తిందాం. తరవాత మనం మాట్లాడుకుందాం. నమో నారాయణ" అని ఆయన అన్నారు.

మాకు కొంచెం దూరంగా చదునుగా ఉన్న కట్టెపీఠం మీద మఠం వేసుకొని బావాజీ కూర్చొన్నారు. తతిమ్మా మేమంతా బాసినపట్టు వేసుకొని భోజనశాలలో నేలమీద కూర్చున్నాం. భగవద్గీతలోని పదిహేనో అధ్యాయం (పురుషోత్తమ ప్రాప్తియోగం) చదివారు. ఆ మీద మాకు సాత్త్వికమూ స్వాదిష్టమూ అయిన శాకాహార భోజనాన్ని వడ్డించారు. ఆడవాళ్ళు ఒక పంక్తిలోనూ మగవాళ్ళు మరో పంక్తిలోనూ కూర్చున్నారు. అక్కడ నలుగురు యువ స్త్రీలూ ఆరుగురు మధ్య వయస్కులైన పురుషులూ ఉన్నారు. వాళ్ళు అందరూ తెల్లబట్టలు కట్టుకొని నొసళ్ళ మీద U – ఆకారంలో చిహ్నాలు ధరించి ఉన్నారు. ఒక్క బావాజీ మాత్రమే కాషాయ ధోతీని ధరించారు.

రాత్రి భోజనం కాగానే, బావాజీ నన్ను మాటామంతీ కోసం తన చిన్న కుటీరానికి రమ్మనమని ఆహ్వానించారు. నా బాల్యం గురించీ నా ఆధ్యాత్మిక అన్వేషణ గురించీ కొన్ని దర్యాప్తులు చేశారాయన. నేను చెప్పగలిగినంతగా జవాబులు చెప్పాను. నేను ఏ మతస్థుడిగా పుట్టానన్న మాటను నన్నాయన ఒక్కసారి కూడా అడగలేదు. వాళ్ళందరూ పూర్వాచారపరాయణులైన బ్రాహ్మణులని నేను అనుకున్నాను. కనక ఇది నన్ను కొంచెం ఆశ్చర్యపరిచింది. వాళ్ళొక కృష్ణభక్త సమాజమనీ, అందరూ శ్రీకృష్ణచైతన్య అనుయాయులనీ ఆయన చెప్పగా నేను తెలుసుకున్నాను.

భక్తి ఒక్కటే భగవత్సేవకు మార్గమనీ, శ్రీకృష్ణుడే పరమేశ్వరుడనీ వాళ్ళ నమ్మకం. కృష్ణుడూ, అతని భార్య రాధల ముందు వాళ్ళు నాట్యం చేస్తూనూ పాడుతూనూ క్రమం తప్పకుండా ఆరాధిస్తూ ఉంటారు. వాళ్ళు స్వచ్ఛమైన శాకాహారులు. వాళ్ళ మతారాధన వ్యవస్థలోకి ఎవరైనా చేరితే చాలు అతను వెంటనే బ్రాహ్మణుడైపోతాడని వాళ్ళు నమ్ముతారు. శంకరాచార్యుల వర్గానికి చెందిన అద్వైత వేదాంతులను వాళ్ళు ద్వేషిస్తారు. వాళ్ళ ఉద్దేశంలో ఆ వర్గంవారు మాయావాదులు, అంటే జగత్తుని మిథ్యగా తలచేవాళ్ళు. ఈ వైష్ణవుల ప్రకారం, ప్రపంచం మాయ కాదు. అది యథార్థం; కృష్ణుడే దాని పరమప్రభువు, నియామకుడూను.

సాంప్రదాయిక సన్యాసం గురించీ, లేకపోతే, సన్యాసి కావడం గురించీ బావాజీ అభిప్రాయం నాకు చాలా సబబనిపించింది. "నువ్వు జగత్తుని విడిచిపెట్టాలనీ, కాషాయం ధరించాలనీ, ముక్తి స్థితికి పిలవకుండానే సునాయాసంగా దూరిపోదామనీ

ఉత్సుకతతో ఉన్నావని నేను ఎరుగుదును. కానీ యువకుడా! జాగ్రత్తగా ఉండు. తక్కువ ఎత్తు నుంచి పడితే అంత ఎక్కువగా దెబ్బలు తగలవు; పైకి లేచి, కొంత నయం చేయించుకొని, తిరిగి మామూలు మనిషివవుతావు. కానీ సన్యాసమనే పెద్ద ఎత్తు నుంచి పడ్డావనుకో, నీకు తీవ్రంగానో లేకపోతే ప్రాణాంతకంగానో దెబ్బలు తగలచ్చు. తిరిగి నువ్వు తిన్నగా నిలుచోలేకపోవచ్చు. అంచేత నిశ్చయం చేసుకునే ముందు చాలా జాగ్రత్తగా ఉండు.

"మా విషయమంటావా, మేము వైదిక సూత్రాలను అనుసరిస్తూ ముందు గృహస్థాశ్రమాన్ని (వైవాహిక జీవితాన్ని) పాటించి ఆ మీదనే సన్యసించే ప్రయత్నం చేస్తాం. మేమందరం పెళ్ళైన వాళ్ళమే. పెళ్ళి చేసుకున్నవాడు దేవుని దీవెనలతో దేవుణ్ణి కనుక్కోగలడు. దేవుడి అనుగ్రహం లేకుండా సన్యాసి కూడా దేవుణ్ణి కనుక్కోలేడు. నేనూ పెళ్ళి చేసుకున్నవాణ్ణే. నా పెళ్ళాం చనిపోయిన తరవాత నేను సన్యాసం తీసుకున్నాను.

"మరో మాట. వాళ్ళెంత చదువుకున్న వాళ్ళైనా సరే, గంజాయి పొగ తాగే సాధువులతో కలవకు. నీ కళ్ళు మీద హిమాలయాల మీద ఉన్నాయని నాకు కచ్చితంగా తెలుసు. అక్కడ కూడా వీళ్ళుంటారు. మాతోబాటు ఉండి భక్తి అభ్యాసాల్లో మునిగి తేలడం నా కిష్టమే కానీ, నువ్వు పైపైకి వెళ్దామని ఆరాటంగా ఉన్నావు. సరే అలాగే కానీ.

"నువ్వు ఒక స్వచ్ఛాత్మవు. నీకు ఇష్టముంటే, నేను మా మహామంత్రాన్ని ప్రదానం చేయగలను. క్రమం తప్పకుండా దానిని జపించు. ఎప్పుడు నీకు రావాలనిపించినా మా దగ్గరకు తిరిగి రా. దేవుడు దీవిస్తాడు నిన్ను జై శ్రీకృష్ణ!"

ఆయన పాదాలను తాకి ధన్యవాదాలు చెప్పి నాకు "ఓం నమో భగవతే వాసుదేవాయ" అనే మంత్రదీక్ష ఇమ్మని ప్రార్థించాను. ఆ మీద నేను నాకు కేటాయించిన గదికి వెళ్ళి మౌనంగా కొంతసేపు మంత్రాన్ని జపించి, నిద్రపోయాను. నేను చాలా గాఢంగానూ శాంతంగానూ నిద్రపోయాను.

నేను పొద్దున్న పెందరాళే లేచాను. మంచులాగ చల్లగా ఉన్న గంగాజలాల్లో మునిగి, బావాజీ ఆశీస్సుల కోసం ఆయన దగ్గరకు వెళ్ళేను. ఆయన నా తలమీద చేతులు పెట్టి చాలా వాత్సల్యం కొద్దీ దీవించారు: "ఆధ్యాత్మిక పరిపూర్ణతకు నిన్ను శ్రీకృష్ణుడు నడిపించును గాక! జై శ్రీకృష్ణ!" అని. నన్ను బావాజీ దగ్గరకు తీసుకు వెళ్ళిన నా మిత్రుడు దామోదరుడికి వెళ్తున్నానని చెప్పి, మళ్ళీ బదరీనాథ్‌కి అభిముఖంగా బయలుదేరాను.

# 18. చెప్పులు కుట్టేవాడూ, సన్యాసీ

కొన్ని రోజుల తరవాత ఒక చల్లటి సాయంత్రానికి నేను కర్ణప్రయాగ చేరుకున్నాను. ఆ చిన్న ఊరుపొలిమేరల్లో, నది పక్కగా ఒక శివాలయాన్ని చూశాను. దానినుంచి ఒక బ్రాహ్మణ పురోహితుడు ఇవతలకు వచ్చాడు. రాత్రి గడపడానికి తగిన చోటును చెప్పమని దర్యాప్తు చేస్తే, అతను ఆలయంలోనే గడపమని సిఫారసు చేశాడు. యాత్రికులకు ఒక మంచి గది ఉంది; అది ఇప్పుడు ఖాళీగా ఉంది అని అతను చెప్పేడు. ఒకటే సమస్య ఉంటుంది - తిండికి రెండు అరటి పళ్ళూ, ఒక బెల్లం ముక్కతో సర్దుకుపోవాలి మరి. ఎందుకంటే అతను ఇవ్వగలిగినది అంతే అప్పటికి. ఇప్పుడతను ఊళ్ళో ఉన్న తన ఇంటికి వెళ్తున్నాడు. మర్నాటి పొద్దున్నకు అన్నాన్ని సమకూర్చగలనని అతను అన్నాడు.

అలసిసొలసి ఆకలితో ఉన్నాను కనక అది బాగానే ఉంది అని నేనన్నాను. ఆ బ్రాహ్మణుడు వెళ్ళిపోయాడు. అక్కడున్న ఒక కిరోసిన్ దీపం వెలిగించుకున్నాను. బల్లమీద వేసిన పరుపు మీద కూర్చున్నాను. నేను అరటిపళ్ళు తినడం ప్రారంభించడమే తడవు, అవతల నుంచి "రామ్ రామ్, మహరాజ్!" అనే కేక విన్నాను.

తలుపు అవతల పొడుగుపాటి తెల్లటి పైజామా కుర్తా వేసుకుని తలమీద విశిష్టమైన గాంధీటోపీ పెట్టుకొన్న పొట్టి నల్లటి మనిషి ఒకడు నమస్కారపూర్వకంగా చేతులు జోడించి నిలుచొని ఉన్నాడు.

"మహరాజ్! నేను రామ్‌ప్రసాదును. ఈ ఊళ్ళో ఉండే చెప్పులు కుట్టేవాణ్ణి. మా ఆవిడకు నిన్న ఒక పవిత్రుడు ఇంటికి వస్తాడనీ అన్నం తింటాడనీ కలవచ్చిందిట. నేను అంటరానివాణ్ణి, ఇదేమో బ్రాహ్మణుల గుడి. నేనిక్కడికి రాకూడదని అనుకుంటారు. కానీ మీరు లోపలికి రావడం బ్రాహ్మణుడు వెళ్ళిపోవడం అనేవాటిని చూసి నేను ధైర్యం తెచ్చుకొని లోపలికి అడుగువేశాను. దయచేసి నా మీద కోపమూ తెచ్చుకోవద్దు, నన్ను శపించనూ వద్దు. మహరాజ్! నేను మీకు అన్నం పట్టుకు రావచ్చు నంటారా? నా భార్య లుచ్చీలూ, పప్పూ, హల్వా చేసింది. ఆవిడ కలగన్న ఆ పవిత్రుడి కోసం ఎదురుచూస్తోంది. నేను మిమ్మల్ని ఇంటికి ఆహ్వానించడం ఎబ్బెట్టుగా ఉంటుంది; అంచేత నేను ఇక్కడకు అన్నాన్ని తేవచ్చునా?" అని అతను మృదువుగా మందధ్వనితో అన్నాడు.

అతను దాదాపు కన్నీళ్ళు పెట్టుకొనేట్టుగా ఉన్నాడు. నేను లేచి నించొని "నేను మీ ఇంటికి వస్తాను. నీ భార్య నాకు అన్నం పెడుతుందిలే" అని అన్నాను. అతని చెవులనతను నమ్మలేకపోయాడు. అలాగే నన్ను అతను, హరిజన్ వాడలో, మిగతా

గ్రామానికి దూరంగానూ వేరుగానూ ఉన్న తన ఇంటికి తీసుకొని వెళ్ళాడు. "మహారాజ్! మీరు ఇక్కడ వేచి ఉండండి" అని తన ఇంటి వరండాను చూపించి అతను ఇంట్లోకి త్వరగా వెళ్ళాడు. చాలా ఉత్తేజితుడై భార్యతో బిగ్గరగా "లీలావతీ! ఒక మహానుభావుడు వచ్చారు" అని అరిచాడు.

ఇద్దరూ కలిసి నా అభ్యంతరాలను వినిపించుకోకుండా నా కాళ్ళను కడిగారు. వేడి లుచ్చీలు, పప్పూ, నేతితో వండిన రుచికరమైన కూరలనూ వడ్డించారు. అక్కడ నేను కూర్చొని అన్నాన్ని తృప్తిగా తింటూండగా వాళ్ళిద్దరూ నిలుచొని నన్ను చూస్తూ ఆనందబాష్పాలు కార్చారు. రాంప్రసాదు తలను ఊపుతూ పెళ్ళాంతో అన్నాడు: "లీలావతీ! ఇది జరుగుతోందని నేను నమ్మలేకుండా ఉన్నాను. నీ కల నిజమైంది. మనం దీవెనలను పొందినవాళ్ళమయ్యాం. ఇప్పుడు తప్పకుండా నీకు పిల్లాడు పుడతాడు. మాకు బిడ్డడు కలగాలని మీరు దీవించండి మహారాజ్!" అని.

భోజనం చివర్లో పెట్టిన వేడి వేడి తీపి హల్వాను తిన్న తరవాత, రాంప్రసాదు మెరుపు దీపంతో నా తోడు రాగా నేను గుడికి తిరిగివచ్చాను. నా ఆకలి తీరింది. నేను కొంతసేపు ధ్యానం చేసుకొని నిద్రపోయాను.

పొద్దున్న పెందరాళే గట్టిగా అరుస్తూ బ్రాహ్మణ పురోహితుడు నన్ను నిద్ర నుంచి లేపాడు. అతను ఎర్రగా కమిలిన ముఖంతో కోపంగా ఉన్నాడు. "నువ్వు ఎటువంటి సాధువువయ్యా? అంటరానివాడి ఇంట్లో అన్నం తింటావా? పొద్దున్నవరకూ అంత ఆగలేవా? ఎటువంటి బ్రహ్మచారివి నువ్వు? చెప్పులు కుట్టేవాడి ఇంట్లో కూర్చొని నీచవర్ణపు అస్పృశ్యులు తయారు చేసిన అన్నాన్ని తింటావా? ఇప్పుడు నిన్నూ అపవిత్రం చేసుకున్నావు. ఈ గుడి స్థలాన్నీ అపవిత్రం చేశావు. నేనెవరినో తీసుకు వచ్చి నిన్ను కొట్టి తోసిపారెయ్యక ముందే ఇక్కణ్ణించి అవతలికి వెళ్ళిపో. నిన్ను పరిశుద్ధపరుచుకోడానికి వెళ్ళి పవిత్ర నదిలో మునుగు. ఈ గదిని ఇప్పుడే నేను పవిత్రజలంతో కడగాలి. పో, వెళ్ళిపో!" అని అరిచాడు.

ఒక్కమాట కూడా మాట్లాడకుండా, నా వస్తువులను తీసుకొని ఆ చోటు వదిలి వెళ్ళిపోయాను. అతనితో మాట్లాడి లాభం లేదు. నా గుండె బాధతో నిండిపోయింది. ఒక మనిషి మరొక మనిషిని అంటరానివాడని ఎలాగ అనగలడు? మహాయోగులు మనుగడ సాగించే మహా పవిత్ర భూమేనా ఇది? సందేహాలు నన్ను ముట్టడించాయి. కానీ నేను అంతటినీ నా అంత నేను, చివరి వరకూ చూసి నిర్ధారణ చేసుకోదలిచాను. అజ్ఞానపు చీకటిని తొలగించి ప్రకాశాన్ని చూపించే ఒక మహాయోగి ఎవడైనా ఎక్కడైనా కనిపిస్తాడా నాకు?

బదరీనాథుకు ముందున్న చివరి ప్రముఖ ధార్మిక కేంద్రం జోషీ మఠం. ఒక సాయంత్రం నాలుగు గంటలకు నేను జోషీ మఠం చేరుకున్నాను; చాలా చలిగా ఉంది. దగ్గరనే ఉన్న లోయ నుంచి మంచుతో నిండిన మహా హిమాలయ శిఖరాలు కనిపిస్తున్నాయి. శంకర మఠం వాళ్ళు ఒక బ్రాహ్మణ బ్రహ్మచారులకీ సన్యాసులకీ మాత్రమే వసతిని సమకూరుస్తారని చెప్పారు నాకు. మఠానికి మరీ అంతదూరం కానిచోట ధర్మశాల ఒకటి ఉంది. అంచేత అక్కడికి పోయి ఒక గదిని సంపాదించి, జోషీ మఠాన్ని చూడడానికి తిరిగి వెళ్ళాను.

శంకరాచార్యుల గుహనీ, పెద్ద స్ఫటిక లింగాన్నీ, కోరికలు తీర్చే చెట్టుగా చెప్పుకొనే చెట్టునీ చూశాను. చాలా మంది బ్రహ్మచారులూ సన్యాసులూ అక్కడ ఉండి సంస్కృతాన్నీ వేదాంతాన్నీ అధ్యయనం చేస్తున్నారు. వాళ్ళలో ఒక విద్యార్థి భవిష్యత్తులో ఏదో ఒక రోజున తరవాతి శంకరాచార్యుడు కాగలుగుతాడు. దండి స్వాములని వ్యవహృతులయ్యే బ్రాహ్మణ సన్యాసులు దండాలను పట్టుకొని సంచరిస్తున్నారు. అక్కడ నిలుచొని, వర్ణ వ్యవస్థ తాలూకు సంక్లిష్టత గురించీ, మానవ మనస్సు ఎంతగా దారి మళ్ళగలదో అనే దాని గురించీ విస్తుపోతూ ఆలోచిస్తూ ఉండగా, ముండిత శిరస్కుడైన ఒక పొడుగాటి సాధువు (Monk) నా వైపుకు వచ్చి నన్ను పలకరించాడు:

"ఎక్కడికి వెళ్తున్నావు నువ్వు?"

"బదరీనాథండి"

"ఎక్కడుంటున్నావు?"

"ధర్మశాలలోనండి. అబ్రాహ్మణులకు ఇక్కడ చోటు లేదని నాకు చెప్పారండి".

"నువ్వు పుట్టుబ్రాహ్మణుడివి కావు కానీ చాలావరకూ అలాగే అనిపిస్తున్నావు"

"కాదండీ, నేను బ్రాహ్మణుణ్ణి కాను"

"ఇదంతా ఏమిటని నువ్వు ఆశ్చర్యపోవచ్చు. నేను చెబుతాను విను. నా దృష్టిలో ఇవన్నీ అర్థంపర్థం లేనివి నేనొక దండిస్వామిని, బ్రాహ్మణ సన్యాసిని. కానీ నేను నా దండాన్ని గంగలోకి విసిరిపారేశాను. ఇప్పుడు నేను స్వతంత్రుణ్ణి. నేను దండి స్వామిగా ఉన్న దగ్గర్నుంచీ ఇక్కడి మహంత్ నన్నెరుగును కనక, నేను వచ్చినప్పుడల్లా ఇక్కడ ఉండనిస్తూ ఉంటారు.

"ఈ దశనామీ వర్గాన్ని స్థాపించిన శంకరాచార్యుడు ఒకరోజున స్నానం చేసి నది నుంచి నడిచి వస్తూండగా చాలా ఊరకుక్కలు సహచరులుగా ఉన్న గిరిజన వేటగాడొకడు ఎదురుపడ్డాడు. 'నా దారి నుంచి తొలగిపో! క్షుద్రజన్మివీ అస్పృశ్యుడివీ

అయిన నువ్వు నా ముందు నిలుచోడానికి ఎంత ధైర్యం నీకు?" అని శంకరుడు గట్టిగా అరిచాడు. ఆ కథ ఏమిటంటే, ఆ వేటగాడు నిజానికి మహాయోగి అయిన శివుడే. ఆయన అకస్మాత్తుగా మన మౌలిక (శివ) రూపానికి మారిపోయి శంకరుణ్ణి, జన్మ దృష్ట్యా, మనుష్యుల మధ్య తేడాను పుట్టించవద్దని హెచ్చరించాడు.

"ప్రతివాడిలోనూ ఒకే ఆత్మ, సర్వాతీతమైన ఆత్మ ఉంది. ఇటువంటి స్థలాల్లో జరుగుతూన్న దీన్ని చూసి నాకు చాలా బాధ కలుగుతూ ఉంటుంది. కానీ ఈ వ్యవస్థను మార్చే శక్తి లేదు నాకు" అని అన్నాడు ఆ వృద్ధ సన్యాసి.

వేదాంతాన్ని చర్చిస్తూ కొంతసేపు ఆయనతో నేను గడిపాను. తరవాత నా గదికి పోయి తిండి తిని, నిద్రపోడానికి వెళ్ళిపోయాను. మర్నాటి పొద్దున్న, మళ్ళీ రోడ్డెక్కాను నేను. గోవింద ఘాట్, పాండుకేశ్వరుల మీదుగా బదరీనాథ్ చేరడానికి నాకు నాలుగు రోజులు పట్టింది. దారిలో చెప్పుకోదగినదేమీ జరగలేదు. యితే, నా మనస్సు మాత్రం సంకట స్థితిలో స్థిమితం లేకుండా ఉంది. ప్రయాణంలోని తీవ్ర కష్టాలు నా శరీరం మీద ప్రభావం చూపించడం ప్రారంభించాయి. నేను బాగా అలసిపోయాను.

# 19. బదరీనాథ్‌లో జిజ్ఞాసువు

నేను ఒక మధ్యాహ్నానికి బదరీనాథు చేరాను. నరనారాయణ పర్వతాల దృశ్యమూ, హిమాచ్ఛాదితమైన నీలకంఠ దృశ్యమూ, బదరీనాథ్ కోవెలను దాటుతూ మహాశక్తితో ఉరికి వచ్చే అలకనందా నది తాలూకు స్వచ్ఛ జలాలూ నా సర్వ మానసిక, భౌతిక సంకటాలనన్నిటినీ కడిగివేశాయి. నేను నిశ్చలతనూ ప్రశాంతినీ ఆనందాన్నీ అనుభవించాను.

బదరీనాథ్‌ను పరిశోధించే ముందు నేను బదరీనారాయణ్ ప్రధాన పురోహితుడైన రావళ్జీని కలుసుకోడానికి ప్రయత్నించాలని నిశ్చయించుకున్నాను. పురాతన కాలం నుంచీ రావళ్జీలందరూ కేరళ నుంచి వచ్చిన నంబూదిరి బ్రాహ్మణులే అని చెప్పారు నాకు. ప్రముఖుడైన శంకరాచార్యులు బదరీనారాయణ దేవాలయాన్ని బౌద్ధుల ప్రభావం నుంచి విముక్తపరిచి పునఃప్రతిష్ఠాపించినప్పుడు, కేరళ నుంచి వచ్చిన నంబూదిరి బ్రాహ్మణుణ్నే ప్రధాన పురోహితునిగా నియమించాలని నిర్దేశించారు. నాకు మలయాళంలో మాట్లాడాలని కోరికగా ఉంది. తోటి మలయాళీ అయిన రావళ్జీతో మాట్లాడడానికి ఆతురతతో ఎదురుచూస్తున్నాను.

సహజంగానే వేడినీటి బుగ్గలు ఏడాది పొడుగునా నీళ్ళను సరఫరా చేసే వేడి "తప్తకుండం"లో స్నానం చేసిన తరవాత నేను నా దగ్గర అదనంగా ఉన్న ఒక జత శుభ్రమైన బట్టల్ని కట్టుకున్నాను. గుడి ప్రవేశ ద్వారం నుంచే శ్రీ బదరీనారాయణ్‌కి వంగి నమస్కరించి రోడ్డుకు అడ్డంగా నడిచి రావళ్జీ అధికారిక వసతి గృహానికి వెళ్ళాను. ఆయన గారి సహాయకుడితో మలయాళంలో మాట్లాడి, ముందు గదిలో కొన్ని నిముషాలు వేచి ఉన్న తరవాత రావళ్జీగారి సన్నిధికి నన్ను రమ్మన్నారు. ఆయన పేరు కేశవన్ నంబూదిరి అని నేను తెలుసుకున్నాను. ఆయన ఉల్లాసంగానూ, మర్యాదగానూ, చూడడానికి చక్కగానూ ఉన్నాడు. చాలావరకూ మలయాళంలోనే సాగిన అతనితోటి సంభాషణ ఉజ్జాయింపుగా ఇలా నడిచింది:

"నీ పేరేమిటి?"

"శివప్రసాదు" అని చెప్పాను, పూర్వాచారపరాయణుడైన నంబూదిరి బ్రాహ్మణుడొకడు నా నిజం పేరు చెబితే ఏ విధంగా ప్రతిక్రియ చూపిస్తాడో అని భయపడుతూ.

"అయితే ఇంత పిన్న వయస్సులోనే నిన్ను ఏది ఇక్కడకు తీసుకొని వచ్చింది?"

అప్పుడు నా ఆధ్యాత్మిక అన్వేషణ గురించీ, ఏ విధంగా నేను చిన్నప్పట్నించీ ధ్యానం చేస్తూ, మహాత్ములను కలుసుకుంటూ ఉన్నానో అంతా వివరించాను. పనస చెట్టు కింద కలిసిన విచిత్ర యోగి గురించి చెప్పడం వదిలేశాను. ఎందుకంటే, ఆ

సంఘటనను చెబుదామని ఏ ప్రయత్నం చేసినా అది వ్యర్థమే అవుతుంది; నా ధ్వన్యుత్పాదక తంత్రులు తోడుపడడానికి తిరస్కరిస్తాయి.

నా లేత వయస్సులోనే నేనే విధంగా హిమాలయాలంటే పట్టరాని ఆకర్షణతో ఉండేవాణ్ణో దానితోనే ఇప్పుడు హిమాలయాల్లో ఒక ఆధ్యాత్మిక మార్గదర్శిని వెదుకు కుంటూ వచ్చానని చెప్పాను అతనికి. హిమాలయ పర్వతాల్లో మహాయోగులు ఏకాంతంలో ఉంటారని నేను విన్నాను. ఆయనకు తెలిసిన ఎవరైనా నాకు మార్గదర్శనం చేయగలరా? (అని అడిగాను).

రావల్జీ మనస్ఫూర్తిగా నవ్వేడు. "పాపం నేస్తం! బదరీనారాయణ్ గుడిని పునః ప్రతిష్ఠాపించడానికి ఒక మహాయోగి కేరళ నుంచి ఇంత దూరమూ రావలసి వచ్చిందని నీకు తెలుసునా? నువ్వు ఆ రాష్ట్రం నుంచే గురువును వెదుక్కుంటూ బదరీనాథ్‌కు వచ్చావు. గొప్పగా ఉంది!"

"ఏదేమైనా, ఇక్కడ నాకటువంటి వారెవరూ తెలియదు. యాత్రికులు వచ్చే సమయంలో ఇక్కడకు సాధువులూ సన్యాసులూ వస్తూంటారు; తీవ్రమైన శీతాకాలంలో తిరిగి వెళ్ళిపోతారు. మేం కూడా చలికాలంలో జోషీ మఠం వరకూ వెళ్ళి ఉంటూ ఉంటాం. బదరీనాథ్ సముద్ర మట్టానికి 11,000 అడుగుల ఎత్తున ఉంది; ఇక్కడ ప్రతీదీ గడ్డకట్టుకొనిపోతుంది.

"కొంతమంది నిగూఢలైన మహాత్ములు వ్యాసగుహ, ముచుకుంద గుహల్లాటి గుహల్లో ఏడాది పొడుగునా ఉంటూ ఉంటారని పుకార్లు వింటూ ఉంటాను. కానీ నేను వ్యక్తిగతంగా అవన్నీ వట్టి పుకార్లు మాత్రమే అని అనుకుంటాను. అయితే, అవి బదరీనారాయణ్‌కి ఆకర్షణను పెంచుతాయి.

"నీకు మార్గదర్శకత్వమే కావలసి వస్తే సమర్థుడైన వైదిక విద్వాంసుడి సాయంతో శంకరుల గొప్ప గ్రంథాలు – ఉపనిషత్తుల మీద వ్యాఖ్యానాలూ, వివేక చూడామణీ మొదలైనవి – చదవడం మంచిది. నీకు సంస్కృతం వచ్చునా?"

"చాలా స్వల్పంగా వచ్చు. మీరు చెప్పిన ఆ గ్రంథాల ఇంగ్లీషు అనువాదాలు మాత్రం చదివాను" అని నేనన్నాను.

"ఉహూ, అది చాలదు. అవి (మూలంతో) ఒకటి కావు. నువ్వు ఉండడానికి ఏదో స్థలం కావాలి కదా, అవునా? ఇక్కడ వసతి చాలా పరిమితం. కానీ ఇక్కణ్ణించి ఎక్కువ దూరం కానిచోట, అలకనంద అవతల ఒక చిన్న కుటీరం నీకోసం చూడగలను. ఇక్కడ రోజుకి రెండుసార్లు అన్నం తినవచ్చు. నా సహాయకుడికి ఆ

సూచనలిస్తాను. ఇప్పుడు నీకు ఆకలిగా ఉంటే అవతలి గదిలో ఏదో ఒకటి తినవచ్చు. బదరీనారాయణుడి ఆశీస్సుల వల్ల మాకు ప్రసాదమెప్పుడూ తక్కువ కాదు.

"కొంతకాలం ఇక్కడ ఉండి, ఈ సుందర ప్రదేశాన్ని పరిశీలించి, పరిశోధించి తిరిగి కేరళకు వెళ్ళిపొమ్మని నీకు నా సలహా. పై చదువులు చదువుకో. మాటవరసకి, భారతీయ తత్త్వశాస్త్రంలో పిహెచ్.డి లాంటివి. మీ తల్లిదండ్రుల గురించి శ్రద్ధ వహించు. హాయిగా జీవితాన్ని నడుపుకో. అప్పుడప్పుడు ఇక్కడికి వచ్చి కొన్ని రోజులు గడుపు. చెప్పొచ్చేదేమిటంటే, ఎవరో హిమాలయ యోగి కోసం చూడడమూ వగైరాలతో నీ సమయాన్నీ శక్తినీ వ్యర్థం చేసుకోవద్దని. అలా కాకపోతే మటుకు, చివరకు బహుశా నీ భ్రమలన్నీ పోతాయి; అక్కణ్ణించి వెనకకు రావడం చేతకాకపోవచ్చు.

"యువకులూ చదువుకున్న వాళ్ళూ అయిన శిష్యుల కోసం కొంతమంది దొంగ మహాత్ములు చూస్తూ ఉంటారు కాబట్టే నిన్ను ప్రత్యేకంగా హెచ్చరిస్తున్నాను. నిన్ను మంచి పట్టుకోదగిన వస్తువుగా అనుకుంటారు వాళ్ళు. ఇక ఆ మీద గంజాయి సాధువులున్నారు. వాళ్ళలో చాలామంది వట్టి మత్తుమందు బానిసలు. మత్తుమందు ప్రభావంతో వాళ్ళు చూసే దృశ్యాలను వాళ్ళు నిజమని అనుకుంటారు. వీళ్ళను పసికట్టి, మహమ్మారిని వదిలినట్టు వదిలిపెట్టాలి.

"ఇప్పుడు నువ్వు భోజనం చెయ్యి. నా సహాయకుడు నీకు కుటీరాన్ని చూపిస్తాడు. బదరీనారాయణుడి సాయంత్రపుటారాధన కోసం నేను తయారీలు చేయాలి. సాయంత్రపుటారతి సమయానికి గుడికి రా. తరవాత ఇక్కడకు వచ్చేయి. మరికొన్ని సంగతులు మాట్లాడుకోవచ్చు. సరేనా?" అని ముక్తాయించాడాయన.

నాకు మంచి కేరళీయ భోజనం దొరికింది. తరవాత నన్ను వంతెన మీదుగా కాలీకంబ్లీవాలా కుటీరానికి తీసుకొని వెళ్ళాడు. రోజంతా ప్రగర్జిస్తూ ప్రవహిస్తున్న అలకనందాను చూడడమనేది మహాదృశ్యం. నేను క్రమం తప్పకుండా గుడిలోని పూజలకు వెళ్ళేవాణ్ణి; రావల్జీ గారి దగ్గర అన్నం తినేవాణ్ణి. ఆయన బొత్తిగా ఖాళీ లేని మనిషి. చాలామంది చూడడానికి వస్తూ ఉంటారు. కానీ మూడు రోజులకు ఒకసారో రెండుసార్లో నా కోసం కొంత సమయం కేటాయించేవాడు. ఆయన దగ్గరనుంచే నేను బదరీనాథ్, ఆ చుట్టుపట్ల ప్రదేశాల గురించి తెలుసుకున్నాను.

బదరీనాథ్ కేదార్‌ఖండ్‌లోని భాగం; అది నరనారాయణుల తపోభూమిగా చెబుతారు. అది వారి పేరన ఉన్న పర్వతాల మధ్య ఉన్న అలకనందా నది తాలూకు లోయ. తప్తకుండం, బ్రహ్మకపాలిలోని వేడినీటి బుగ్గలు అక్కడి పవిత్రమైన

స్నానఘట్టాలు. బదరీనారాయణుడి గుడిని ఆదిశంకరాచార్యులు పునఃస్థాపించినట్టు ప్రసిద్ధి. ఆయన అక్కడున్న బుద్ధ విగ్రహాన్ని తొలగించి నారాయణ విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. మౌలికమైన (నారాయణ) విగ్రహాన్ని బౌద్ధులు ఒక పాత నూతిలో పడేశారు. దీనికి చారిత్రక ప్రమాణమేమీ లేదు కాని, ఒకప్పుడు ఈ బదరీ ఒక బౌద్ధ కేంద్రంగా ఉండేదన్న మాటను తీసిపారెయ్యలేము. ఎందుకంటే, టిబెట్టు సరిహద్దు దగ్గరలోనే ఉంది కనక.

బదరీ నుంచి అలకనందా తీరం మీదుగా ఆరేడు కిలోమీటర్లు నడిస్తే భారతదేశపు చిట్టచివరి గ్రామం 'మనా'ను చేరుకుంటాం. ఈ గ్రామంలో టిబెట్టు మూలాలున్న గిరిజనులుంటారు.

బదరీ దేవాలయానికి ఉత్తరంగా రెండు కిలోమీటర్లవతల గౌడపాద శిల అనే రాయి ఉంది. అది అలకనందా నది తాలూకు ఎడమ ఒడ్డు మీద ఉంది. శుకదేవుల శిష్యుడైన గౌడుపాదుడనే గొప్ప ఋషి స్థానంగా చెప్పుకుంటారు దాన్ని. గౌడపాదులు మాండూక్యోపనిషత్తు మీద రాసిన కారికలను (వివరణలను) అక్కడే రాశారని చెబుతారు. శంకరాచార్యులు గౌడపాదులను కలుసుకున్నారనీన్నూ, గౌడపాదులు తాను రాసిన కారికల మీద వ్యాఖ్యానం రాయవలసినదని శంకరులకు అప్పగించారనీన్నూ ప్రసిద్ధి.

'మనా' గ్రామానికి దగ్గరగానే వేదాలను వర్గీకరించి, బాదరాయణుడని (బదరీ వృక్షాటవిలో ఉండేవాడని) పేరుపొందిన వ్యాసమహర్షి గుహ ఒకటి ఉంది. వేసవి సమయపు నెలల్లో గొప్పగొప్ప మహాత్ములు అప్పుడప్పుడు వ్యాస గుహనీ, దాని చుట్టుపట్ల ఉన్న బహు ఇతర గుహలనీ సందర్శిస్తూ ఉంటారని నేను విన్నాను. కేశవప్రయాగ దగ్గర అలకనందా నది సరస్వతీ నదిని కలుస్తుంది. సరస్వతి భూమ్యంతరమైన ఒక సొరంగం నుంచి వస్తుంది. అక్కణ్ణుంచి సముద్రమట్టానికి 18,000 అడుగుల ఎత్తున ఉన్న మనా కనుమ మీదుగా టిబెట్‌కు వెళ్ళే దోవ బయలుదేరుతుంది.

ఇంకా పైన వసుంధరా జలపాతాలూ, స్వర్గారోహిణీ ఉన్నాయి. మహాభారతం ప్రకారం స్వర్గారోహిణి దగ్గర్నుంచే యుధిష్ఠిర మహారాజు ఇంద్రరథంలో స్వర్గానికి ఆరోహించాడు.

బదరీనారాయణ్ చాలా సుందరమైన ప్రదేశం. హిమ శిఖరాలతో ఆవృతమై, అలకనందా నదీ ప్రవాహ జలాలతో చుంబితమై ఉండే ఈ ప్రదేశం ఏకాంతాన్నీ ధ్యానాన్నీ ప్రేమించేవాళ్ళకు ఒక ఆదర్శ ప్రదేశంగా ఉండేది. "ఉండేది" అని చెప్పడ

మెందుకంటే, ఇప్పుడు, బాధ్యతారహిత యాత్రికుల రద్దీ కొద్దీ, వాళ్ళకు పవిత్రత అంటే అవగాహన లేకపోవడం వల్లా ప్రతీదీ పాడైపోయింది. లోభులైన వ్యాపారులు పెట్టుకున్న అనేకమైన కొట్లు అజాగ్రత్తగా ఉండే యాత్రికుడి కోసం ఎదురు చూస్తూండటమే ఇప్పటి రివాజు. ఇటీవల నేను వెళ్ళినప్పుడు, ఒక అందమైన గఢ్వాలీ అమ్మాయిని ఒక రాత్రి కోసం ఒకడు అమ్మకానికి పెట్టడం నేను చూశాను.

బదరీనాథ్ తాలూకు చెరగని ముద్రల్లో ఒకటి, నా గుండెను ఎప్పుడూ ఆనందంతో నిండేలా చేసింది: మంచు కురిసిన రోజు – అదొక పూర్ణిమ నాటి రాత్రి; ఆ ప్రదేశమంతా వెండి ద్రవంతో పూత పూసినట్టుగా వెలిగింది.

అయితే అందమైన దృశ్యాలు, వలసినంత ఉపశమనాన్ని ఇవ్వలేకపోయాయి నాకు. అసలే ముందటే నా మనస్సు విచలితమై ఉంది. దానికి తోడు నాలాటి చదువుకున్నవాడికి ఇక్కడేమీ దొరకదనీ, నేను ఇంటికి వెనక్కు వెళ్ళిపోవాలనీ చెప్పిన రావల్జీగారి మాటలు నా సంశయాల్ని మరింత పెంచాయి –

ఒక రోజున, కుటీరం ముంగిట్లో కూర్చుని ఒక నిర్ణయం తీసుకున్నాను; మనా గ్రామానికి పోయి ఒక మహాయోగి కోసం అక్కడున్న గుహల్లో వెదుకుదామని. నాకు సరైన మహాత్ముడు దొరకకపోతే, అలకనందా నదిలోకి ఉరికి ఆత్మహత్య చేసుకుందామని అనుకున్నాను. బహుశా, నేను మళ్ళీ ఇంతకన్నా అనుకూలమైన పరిస్థితుల్లో పుడతానేమో! ఈ సంశయమూ ఈ కుంగుబాటూ కలిగించే హింసకు నేను తాళలేకపోయాను.

# ౨౦. బాబాజీ దర్శనం

మర్నాడు పెందరాళే నేను మనా గ్రామానికి బయల్దేరాను. మధ్యాహ్నానికి ఆ గ్రామాన్ని చేరాను. టిబెట్టు మూలీయులైన గొఱ్ఱెల కాపర్లు అక్కడ ఉంటారు. వాళ్ళు రంగు రంగుల, జటిలమైన అల్లికలున్న ఉన్ని రగ్గుల్ని చేతి మగ్గాల మీద అల్లుతూ ఉంటారు. వాళ్ళు అందరూ బౌద్ధులే. నేను వ్యాసగుహ వరకూ నడిచాను. అది మధ్యమ పరిమాణమున్న ఒక సహజమైన గుహ.

చుట్టుపక్కల ఉన్న ఇతర గుహలను కూడా పరిశీలిద్దామని రాళ్ళమీదుగా పైపైకి ఎక్కుతూ ఒక సొరంగం గుండా సరస్వతి వేగంగా ప్రవహిస్తూ అలకనందతో కలవడాన్ని చూశాను. మరో గంట రాళ్ళ మీదుగా నడిచి వసుంధరా జలపాతాలకు చేరాను. నా ఉద్దేశం స్వర్గారోహిణిని చేరదామని. యుధిష్ఠిరుడి స్వర్గారోహణ కథలో ఏదో ఉండి ఉండాలి. బహుశా అసాధారణ మనుష్యులక్కడ వసించేవాళ్ళేమో?

అప్పుడే నాకు తట్టింది త్వరలో చీకటి పడబోతోందని. గాలి మంచు మాదిరిగా అతి చల్లగా ఉంది. కనుచూపు దూరంలో ఎవ్వరూ లేరు. నాకు చాలా ఆకలిగా వుంది. కనీసం మనా గ్రామానికి దిగి వెళ్దామని నిర్ణయించుకున్నాను. రాత్రి పడుకోడానికి ఇంత స్థలాన్నీ, కొంత తిండినీ ఇచ్చే ఎవరో ఒక కరుణాత్ముణ్ణి పట్టుకోవాలి. సంశయమూ, భయమూ, ఆకలీ, వైఫల్య భావమూ నాలో నిండి పోయాయి. నేను అన్వేషణని మొదలు పెట్టి భంగపడ్డాను. నిజం రాస్తున్నామని వంచించే కట్టుకథలల్లేవాళ్ళ ఊహల్లో తప్పించి మహాత్ములు ఎక్కడా లేరు. ఇలాగ బతకడం కన్నా చావడం మేలు. అలకనందలో దుమికి ఆత్మహత్య చేసుకుందామని నిర్ణయించుకున్నాను.

ఆపాటికి దాదాపుగా చీకటి ఆవరించింది; మంచు మాదిరి జివ్వుమనే చల్లగాలి హోరుమని వీస్తోంది. నేను వ్యాసగుహకు చేరుకున్నాను మళ్ళీ. అద్భుతమనిపించిందేవిటంటే అప్పుడు, గుహ ద్వారంలో ఒక ధుని ఉజ్జ్వలంగా మండుతోంది. దుంగలు కాలుతూంటే ప్రకాశవంతమైన జ్వాలలు పైకి ఎగురుతూ నాట్యం చేస్తున్నాయి. చలితో కొయ్యబారుస్తూన్న ఆ వాతావరణంలో నిప్పు తాలూకు ఆ వెచ్చదనం ఆహ్వానిస్తోంది. ఎవరు అంటించుంటారా ఈ అగ్నిని అని ఆశ్చర్యపోతూ దానివైపుకు వెళ్ళాను. బహుశా ఎవడైనా గొఱ్ఱెల కాపరేమో! లేకపోతే, చివరికి నేను ఒక యోగిని చూడబోతున్నానా?!

గుహలోంచి ఒక కంఠధ్వని వినిపించింది. అది నాకు పరిచితమైనదేనా? ఏళ్ళ నుంచీ నా అంతరాంతరాల్లో లోలోతుగా పాతినట్టున్న ఆ ధ్వని ఇప్పుడు వైఖరీ శబ్దం× లాగ వినిపిస్తోందా? నేనా గుహవైపుకు కంపిస్తూ పరుగెత్తాను. ఆ లోపల

నుంచి పొడుగుపాటి జుత్తున్న చాలినంత బట్ట కట్టిన పొడుగరి ఇవతలకి వచ్చాడు. స్పష్టమైన హిందూస్తానీలో "రా. ఎక్కడెక్కడ తిరుగుతున్నావు నువ్వు, మధూ?" అని అన్నాడు.

"మధూ?" – ఈ పేరును నేను ఎప్పుడో మర్చిపోయిన కలలో విన్నానా? ఈ మనిషి ఎవరు? "నేను మధును కాను. నేను ముం..." అని నేనన బోయాను.

"చాలు చాలు నాకు తెలుసు. వంచియూర్‌లోని పనస చెట్టు కిందినుంచి సుదూరమైన ఉత్తరాదిలోని వ్యాస గుహకు. రా. నిప్పు దగ్గరగా కూర్చో. మొదట, నీకు నేను కొంత ఆహారాన్ని తెచ్చి పెడతాను. ఆ పైన నువ్వు నిద్రపోదువు గాని, రేపు మనం మాట్లాడుకుందాం". ఆయన తన కుడిచేత్తో నా ఎడమ భుజం మీద మహావాత్సల్యంతో తట్టారు – "ఇక్కడ కూర్చో".

ఆ క్షణంలో నేను మా ఇంటి పెరట్లో పనస చెట్టు కింద నాకు తొమ్మిదేళ్ళప్పుడు చూసిన అతనే ఇతను అని అర్థం చేసుకున్నాను. అవును, అంతే! ఆ కంఠమూ అదే. నా గురువునీ, తండ్రినీ, తల్లినీ, ఉపాధ్యాయుణ్ణీ – అందరినీ కలగలిపిన ఆయనను నేను కనుక్కున్నాను. అంతే, ఇక నేనాయనను తరవాతి మూడున్నరేళ్ళూ వదిలిపెట్టక పోవడం సంభవించింది.

ఆయన గుహలోకి ప్రవేశించి త్వరగానే తన కమండలం (సాధువులు ఆహారాన్ని గానీ నీళ్ళను గానీ పెట్టుకొంటూ ఉండే కోలగా ఉండే చెంబు)తో బయటకు వచ్చారు. దానిలో రెండు తాజా గోధుమ రొట్టెలూ, వేడి బంగాళాదుంపల కూరా ఉన్నాయి. నా ముందు పెట్టి "తిను" అని అన్నారు. నేను వంగి ఆయన పాదాలకు నమస్కరించాను. "నేను మిమ్మల్ని బాబాజీ అని పిలుస్తాను. నాకు మరో బాబాజీ ఎవరూ తెలియదు. మీరే నా బాబా, నా తండ్రి. నేను మీకు జీవితాంతమూ ఋణపడి ఉంటాను. నా ఓర్పు ఉడిగిపోతూంటే మీరు నన్ను పట్టుకున్నారు". నా దృష్టి కన్నీటితో మసకబారింది.

"అదంతా సరే. నువ్వు ఇప్పుడు కూర్చొని తిను" అని ఆయన చాలా ఆప్యాయంగా అన్నారు.

అక్కడ అగ్నికి ముందుగా, హిమాలయ పంక్తులు చుట్టూ ఉన్న ఆ చోట మా గురువుగారి ప్రేమమయ దృష్టిచ్ఛాయలో కూర్చొని చాలా ఇష్టంగా తిన్నాను. మళ్ళీ ఆయన లోపలికి వెళ్ళారు. ఈసారి ఆయన ఒక జిలేబీ అనే తీపిని పట్టుకొచ్చి ఆయనే చేతితో పట్టుకొని నాకు తినిపించారు. భోజనమైన తరవాత, బాబాజీ నాకు అందించిన

* ధ్వని తంత్రుల స్పందనలతో పుట్టే శబ్దాన్ని వైఖరీ వాక్కు అని అంటారు.

అలకనందాలోని స్వచ్ఛమైన జలాన్ని తాగాను. వెంటనే నాకు మగతగా అనిపించింది. ఎన్నో ఏళ్ళుగా నిద్రపోనట్టుగా అనిపించింది.

బాబాజీ నన్నుగుహలోకి తీసుకొని వెళ్ళారు. లోపల నిప్పు తాలూకు మందకాంతిలో, ఎండిన ఆకులూ రెమ్మల మీద దుప్పటి నొకదానిని పరిచి నా కోసం ఆయన తయారు చేసిన పక్కను చూశాను. మందవాయువు నిప్పు వేడిని లోపలికి తోస్తూన్నట్టుగా నేననుకున్న చోట, బాబాజీ ఇక నా బాగోగులు చూస్తారన్న ఆలోచనా సంరక్షణలో తక్షణమే నిద్రపోయాను. మడతపెట్టిన ఉన్ని దుప్పటి మీద, మఠం వేసుకొని, అగ్నికి అభిముఖంగా, స్థిరంగా, అచలంగా కూర్చున్న బాబాజీనే నేను చివరగా (నిద్రపోయే ముందు) చూసినట్టు గుర్తు నాకు.

# 21. నా ప్రథమ దీక్ష

ఇది ఒక కొత్త జీవితానికి నాంది; ప్రేమించి సంరక్షించే ఒక మార్గదర్శకుడితో చేసే కొత్త ప్రయాణానికి ఇది మొదలు. మర్నాటి ప్రొద్దున్న, తెల్లవారడానికి చాలా గంటలు ముందుగానే నన్ను బాబాజీ మేలుకొల్పారు. "బ్రహ్మముహూర్తం - ధ్యానానికి గాలి శుచిగా ఉండే సమయమిది. గడ్డ కట్టేలాగ చేసే అలకనందా జలాల్లో మునిగే స్నానానికి నువ్వు పోకూడదు. (అలా చేస్తే) బహుశా నీకు న్యుమోనియా (ఊపిరితిత్తుల వాపు జబ్బు) రావచ్చు; దగ్గరగా మంచి ఆసుపత్రులేవీ లేవు ఇక్కడ. నా కమండలం నుంచి నీళ్ల తీసుకొని నీ నోరూ ముఖమూ పరిశుభ్రం చేసుకో"

"నీ దగ్గర బ్రష్ ఉందా"

"ఉంది బాబాజీ"

"సరే దాన్ని ఉపయోగించు. నిప్పులోంచి కొంత బూడిదను తీసుకొని పళ్ళు తోముకోడానికి ఉపయోగించు."

అగ్ని మండుతూనే ఉంది. రాత్రంతా బాబాజీ మెలకువగా ఉంటూ నిప్పును ఆరిపోకుండా కట్టెలేస్తూన్నారా అని విస్తుపోయాను. "అది నిన్ను చంపేలాగ ఉన్నా సరే, ధ్యానానికి ముందు స్నానం చెయ్యాల్సిందే" మొదలైన పాతబడిన ఆచారాల వైపు మొగ్గకుండా, ఎంత ఆచరణయోగ్యంగానూ, యథార్థ పరిధికి ఎంత దగ్గరగానూ ఆయన అభిప్రాయాలుంటాయో అనేదాన్ని చూడడం నాకు ఇదే మొదటిసారి. తలదాచు కోడానికి ఒక చోటంటూ లేక, జరూసలెం రోడ్ల మీద తిరిగిన ఒక మహా ఆధ్యాత్మిక జ్ఞాని చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి - "మనిషి కోసం నియమం ఏర్పడింది, నియమం కోసం మనిషి ఏర్పడలేదు" అని.

నేను తిరిగి రాగానే నాకు ఆయన మడత పెట్టిన దుప్పటి ఒకటి ఇచ్చారు. "ఇప్పట్నించీ ఈ దుప్పటినే ఉపయోగించు. మరెవ్వరూ దీన్ని ఉపయోగించకూడదు. ఇది నీకే" అని అన్నారు.

ఆయన నా ఆసనాన్ని సరిదిద్దారు. పద్మాసనంలో సరిగ్గా ఎలాగ కూర్చోవాలో చెప్పారు. ఆయనకు ఆయన గురువుగారు నేర్పిన క్రియాయోగ ప్రక్రియ తాలూకు రహస్యాలలో నాకు దీక్షను ఇచ్చారు. ఆయన గురువు పురాణ ప్రసిద్ధుడైన మహావతార్ బాబాజీ అని తెలియగానే నాకు పులకలు పుట్టాయి. నేను ధ్యానం చేస్తూండగా ఆయన నా ఛాతీనీ, ఆ మీద నొసటిని నెమ్మదిగా తాకేరు. నేను గాఢమూ ఆనందమయమూ అయిన ధ్యానంలో నిమగ్నుణ్ణయ్యాను. నా మనస్సు ఇంతకు ముందు కలలో కూడా కనని పరిధుల్లోకి ప్రయాణం చేసింది; నా చైతన్యం అపరిమితంగా పెంపొందింది.

"వెనకకు రా, వెనకకు రా. అంతా ఒక్కసారే కాదు, నాన్నా" అని బాబాజీ అంటూన్న కంఠధ్వనిని విని నేను తిరిగి మెలకువ స్థితికి వచ్చాను.

అప్పుడే సూర్యుడు ఉదయిస్తున్నాడు. మంచుబట్టలు చుట్టబెట్టుకున్న శిఖరాలు అల్లంత దూరాన; నదీధ్వానం; వికీర్ణమైన ప్రశాంత కాంతి నిండిన ఆ దృశ్యం సమ్మోహనంగా ఉంది. బాబాజీ చాలా వాత్సల్యంతో నవ్వుతున్నారు. మొట్టమొదటి సారిగా ఆయన లక్షణాలన్నీ స్పష్టంగా చూశాను. దాదాపు యూరోపియన్ ఛాయతో పొడుగ్గా లేత లేడివన్నె కళ్ళతో, నలుపూ టేకువన్నె కలిసిన దట్టమైన పొడుగుపాటి జుట్టుని తన నెత్తిపైన గుండ్రని రొట్టె రూపంలో ముడిచిన కొప్పుతో ఆయన చాలా అందంగా ఉన్నారు. ఆయనకు కొంతగా నేపాలీ లక్షణాలున్నాయి; ఆయన ముఖం మీద రోమాలు కొద్దికొద్దిగానే ఉన్నాయి – మీసమూ గెడ్డమూ లఘువుగానే ఉన్నాయి. చెవులు ఉపాస్థి నరాలను (Cartilage) పొడిపించుకొన్నారు – వాటిలో పెద్దపెద్ద రాగి చెవిపోగులు ధరించారు. మెడలో పెద్దపెద్ద రుద్రాక్ష పూసల మాల ఉంది.

కొరుకుతూన్న చలిలో కూడా, నడుము చుట్టూ కట్టుకున్న ఒక్క దట్టమైన తెల్లటి నూలుబట్ట మినహా, ఆయన దృఢమైన కాయం అనాచ్ఛాదితంగా ఉంది. అదీ మోకాళ్ళ దాకానే. కాళ్ళకు చెప్పుల్లేవు. ఒక నల్లటి కొయ్య కమండలువూ, ధ్యానార్థం ఉపయోగించే ఒక దుప్పటీ, వీపుకు కట్టుకున్న పట్టీలో ఒక చిన్న గొడ్డలీ – ఇవే ఆయన ఆస్తులు.

"ఇంతకు ముందు నేనిక్కడున్నట్టుగా, ఈ పరిసరాలన్నీ నాకు చాలా సుపరిచితంగా ఉన్నట్టున్నాయి. అప్పుడు కూడా మీరు నాతో ఉన్నారా!" అని నేనడిగాను. "నేను కాదు. నా గొప్ప గురువు, సర్వప్రసిద్ధులైన శ్రీగురు బాబాజీ ఉండేవారు. ఆయన అప్పుడు నీకు గురువు. ఆయన మొట్టమొదటి శిష్యుల్లో ఒకణ్ణి నేను. నా పేరు మహేశ్వరనాథ్, భవిష్యత్తులో ఒకప్పుడు, నిన్ను అందరూ 'ఎమ్' అని పిలుస్తారు.

అప్పుడు నేను నీకు నిత్యమూ గుర్తుకొస్తూనే ఉంటాను. శ్రీగురు బాబాజీ నువ్వు సిద్ధమయ్యేంత వరకూ చూడమని నిన్ను నాకప్పగించారు" (అని ఆయన సమాధానం చెప్పారు).

"నేను ఆ మహా గురువు శ్రీ గురు బాబాజీని చూస్తానా?" నా ఉత్సుకతను అరికట్టకోలేక ఆతురతతో అడిగాను. "నీకెప్పుడు అవసరమో అప్పుడు. కానీ ఒక విషయం గుర్తుంచుకో: క్రియాభ్యాసం చేసి ధ్యానం చేయడమన్నది శ్రీ గురు బాబాజీని

తెలుసుకోడానికి కాదు; ఆయన దేనికి ప్రతీకో, దాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకొని అనుభవించడానికి పొందవలసిన ఉత్తమ స్థాయి చైతన్యాన్ని అందుకోడానికే. మనం అదే (చివరికి) తెలుసుకోగలుగుతాం.

"ఇంతలో మనం ముందుకు సాగుతూ ఉందాం. నేనీ వ్యాసగుహకు తరచూ వస్తూ ఉండను. నిన్ను స్వీకరించడానికే, నిన్ననే ఇక్కడికి వచ్చాను. బదరీలో గుడి ఉన్న నారాయణ పర్వతం వెనక చరణపాదుక ఉంది. దాని దగ్గర్లో ఉన్న గుహల్లోని ఒక గుహలో నేను మామూలుగా ఉంటూ ఉంటాను. అక్కడికి వెళ్ళిన తరవాత నీ పాఠాలను మొదలుపెడదాం. నడు."

ఆ విధంగా మేము బయలుదేరాం - యువ శిష్యుడు అతని గురువుతో; ఆ గురువు కూడా పురాణ ప్రసిద్ధుడైన దక్షిణామూర్తిలాగ చాలా యువకుడిలాగ ఉన్నారు. బాబాజీ ఎంత చకచకా నడుస్తారో అప్పుడు నాకర్థమయింది. నేను ఆయనను అనుసరించడానికి చాలా ప్రయత్నం చేయాల్సి వచ్చింది. అప్పుడప్పుడు, నన్ను కొంచెం సేపు విశ్రాంతి తీసుకోనిస్తూ ఆయన (మధ్యమధ్యలో) నన్ను ఉత్సాహపరిచేవారు: "కుర్రవాడా! నువ్వు కొంచెం త్వరగా నడవాలి. నీలో పుష్కలమైన శక్తి ఉంది. (ఆఁ. అలాగ. ఇప్పుడు) బాగుంది."

మేము బదరీనాథు చేరుకున్నాం. గుడి వెనకనున్న దారికి మళ్ళీ, చరణపాదుక వచ్చేంతవరకూ పైకి ఎక్కుతూనే ఉన్నాం. జైనులు ఈ ప్రదేశాన్ని పవిత్రంగా భావిస్తారు. వాళ్ళ తీర్థంకరుల్లో ఒకరు ఈ ప్రదేశాన్ని తన ఉనికితో అలంకరించారు. దీనికి పైన పసరిక బయళ్ళు, ఇటూ అటూ గుహలున్న ఒక సన్నని లోయా ఉన్నాయి. కొద్దిమంది యోగులు ఆ గుహలు కొన్నిట్లో ఉన్నారు. బాబాజీ నడుస్తూ వెళ్తుంటే వాళ్ళు ఆయనకు అభివాదం చేశారు. ఇంకా పైకి పోయి ఒక విశాలమైన గుహ ముందు ఆగేం. గుహ ప్రాంగణంలో మోటురాళ్ళతో ఏర్పరిచిన అగ్నిస్థానంలో అగ్ని ఇంకా కొలిమి కాలుతూనే ఉంది.

"కొంతకాలం పాటు ఇది మన నివాసంగా ఉంటుంది. లోపలికి పోయి నీ దుప్పట్లూ సంచీ పెట్టుకో. లోపల ఒక పెద్ద, వదులుగా ఉండే ఉన్నితో చేసిన దట్టమైన నిలువుటంగీ ఉంది. అది వేసుకో. నువ్వు జబ్బుపడటం నాకిష్టం లేదు. అలాగే, అక్కడ వెదురుబుట్టలో ఉన్న నీలి తలపాగాతో చెవులను కప్పుకుంటూ, నీ తలను సక్రమంగా చుట్టబెట్టుకో. ఇప్పటికి నువ్వు విశ్రాంతి తీసుకోవచ్చు. సాయంత్రం మన మొదటి పాఠం ప్రారంభమవుతుంది" అని అన్నారు బాబాజీ.

సాంప్రదాయిక పాఠాలకూ చర్చలకూ నియమిత సమయాలున్నా కూడా,

బాబాజీతో ఉండడమే ఒక పెద్ద అవగాహన ప్రక్రియ. గుహను శుభ్రం చేయడం, అప్పుడప్పుడు మంచుముక్కలతో నిండి ఉండే, దగ్గరనే ఉన్న జలపాతం నుంచి నీళ్ళు తీసుకొని రావడం, గొడ్డలి పట్టడం నేర్చుకొని వంట చెరకును తెచ్చి పోగు చేయడం, గుడి దగ్గరున్న బజార్లో ఉన్న కొట్ల వాళ్ళ నుంచి గానీ అన్నక్షేత్రాల నుంచి గానీ గోధుమ పిండీ మొదలైన సరుకుల్నీ కూరగాయలనూ అడుక్కొని తెచ్చుకోవడం, గుజ్జర్ల నుంచి గేదె పాలను తెచ్చుకోవడం (మొదలైనవి) నేర్చుకున్నాను.

నేను బాబాజీ ఛేలానని (శిష్యుణ్ణని) తెలుసుకున్న వ్యాపారులు సంతోషంగానే ఇచ్చినా, యాచించడమన్నది నా అహంకారానికి పెద్ద అఘాతమే అయింది. బాబాజీ అంటే అందరికీ ఎంత గౌరవమో నేను గమనించాను. ఆయన పక్కనుంచి నడిచి వెళుతూంటే, చాలామంది వర్తకులు గౌరవం చూపిస్తూ లేచి నిలబడేవాళ్ళు; చేతులు జోడించి "రామ్‌రామ్ మహారాజ్" అని అభివాదనం చేసేవాళ్ళు. కుడిచేతిని గుండెమీద ఉంచి, తలవంచి, వాళ్ళ అభివాదానికి బదులు చెప్పేవారు బాబాజీ.

నాకు అన్నం విలువ తెలిసివచ్చింది. నాకు మొట్టమొదటిసారిగా వండడం నేర్పారు. తిండి సరళంగానే ఉండవచ్చును గానీ అది బాగుండాలి. కూరగాయలు సరిగా కోయడం దగ్గర్నించీ తగినంతగా ఉడకబెట్టేంత వరకూ ఏ రకమైన రాజీ పడడాలూ లేవు. "నీకు కూరగాయలు సరిగ్గా కోయడం చేతకాకపోతే, అన్నాన్ని చక్కగా వండడం చేతకాకపోతేనూ ఇక ఏ విధంగా నువ్వు పరిపూర్ణత్వాన్ని పొందగలవు చెప్పు" అని ఒకసారి బాబాజీ నాతో అన్నారు: "అది ఎలాగ ఉంటుందంటే, రాత్రింబగళ్ళు అబద్ధాలాడుతూ ఉండే ఒకడు 'నేను ఆత్యంతిక సత్యాన్ని అన్వేషిస్తున్నాన'న్నట్టు ఉంటుంది. రాజకీయవాదులు సత్యప్రమాణమంటూ ఒట్టు వేసుకోరా? 'సత్యమేవజయతే' (సత్యమొక్కటే గెలుపొందుతుంది). దైనందిన జీవితాన్ని బాగు చేసుకోడం నేర్చుకో. అదే పరిపూర్ణత్వానికి తోవ".

ధ్యానమూ, యోగాసనాలూ, ఆ మీద పాలూ ఏదో ఒక పండు – మామూలుగా జామపళ్ళు గానీ లిచ్చీలు గానీ – ఉపాహారంగా తిన్న తరవాత పొద్దున్న పాఠాలు రమారమి ఒక గంటవరకూ కొనసాగేవి. "నీ అవధాన వ్యవధి ప్రస్తుతానికి ఒక గంట మాత్రమే. అదీగాక, తెలుసుకున్నదాన్ని సరిగా జీర్ణించుకొనడమే సబబు" అని బాబాజీ అన్నారు. పాఠాలు కాగానే, ధునీని మండుతూ ఉండేలాగ ఉంచడానికి అవసరమైతే కట్టెలు పోగు చేయడానికి వెళ్ళేవాణ్ణి; ఆ మీద అన్నం వండేవాణ్ణి. మొదటి కొన్ని రోజుల శిక్షణ తరవాత, బాబాజీ కొండల వరకూ నడిచి అన్నం

సిద్ధమయ్యే టైముకి తిరిగి వచ్చేవారు. ఆయన చాలా తక్కువగా తినేవారు.

భోజనం తరవాత కొంతసేపు విశ్రాంతి తీసుకునేవాళ్ళం. ఆపైన నాకుగా నేను తిరగడానికి స్వేచ్ఛగా వదిలేసేవారు; ఒక్కోసారి బాబాజీతో తిరిగేవాణ్ణి. అస్తమయానికి ధ్యానం సమయం కనక, ఎక్కడుంటే అక్కడే మేము కూర్చొని ధ్యానం చేసేవాళ్ళం. ఆ మీద ఒక గంట విద్యా సమావేశం. ఆ తరవాత, సరళమైన భోజనం; అది కాగానే అగ్ని పక్కనే కూర్చొని ఇష్టాగోష్ఠి చేసేవాళ్ళం. ఒక్కోసారి, పైకెగస్తున్న జ్వాలలు నృత్యం చేస్తూండగా, సమిధలు చిటపటలాడుతూ కాలుతూండగా గంటలకొద్దీ మాట్లాడుకోడం, చర్చించుకోడం చేసేవాళ్ళం. నిద్ర వస్తోందనిపిస్తే గుహ లోపలే పడుకొని నిద్రపోయేవాణ్ణి. బాబాజీ అగ్ని దగ్గరే కూర్చొనేవారు; ఒక్కోసారి కళ్ళు మూసుకొని పడుకొనేవారు. కానీ ఆయన నిజంగా నిద్రపోయేవారనిపించేది కాదు.

మా సమావేశాలు బాగా విపులంగా సాగేవి; పాఠకులైన మీకు బహుశా విసుగు కలగవచ్చు. అంచేత నేను ముఖ్యమనుకునే వాటికి పరిమితమవుతాను. అయితే, నాకున్న జ్ఞానమంతా బాబాజీతో గడిపిన అద్భుతమైన ఆ మూడున్నరేళ్ళలో గడించినదేనని నేను మీకు చెప్పాలి.

# 22. కుండలినీ అగ్నిని రగిలించడం

బాబాజీతో నా మొట్టమొదటి శిక్షణా సమావేశం చీకటి పడబోతూన్న సమయంలో ఒక సాయంత్రం జరిగింది. ధునిలోని జ్వాలలు మా ముందు నాట్యం చేస్తూండగా దానికి అభిముఖంగా కూర్చున్నాం మేము.

"అగ్ని అన్ని పురాతన నాగరికతలకూ పవిత్రమైనదే. వైదిక కాలంలో అగ్నిదేవుడు ప్రతిరోజూ ఆవాహితుడవుతూనే ఉండేవాడు. అగ్ని ఎందుకు అంత ముఖ్యమో నువ్వు ఆలోచించావా?" అని బాబాజీ అడిగారు.

"అన్నం వండుకోడానికి అగ్ని కావాలి. చలికాలంలో అగ్ని మనలను వెచ్చగా ఉంచుతుంది; క్రూరజంతువుల్ని దూరంగా ఉంచుతుంది. బహుశా ఇందుకనే పురాతనులు అగ్నిని పూజించేవారు" అని నేను చెప్పాను.

బాబాజీ నవ్వేరు. "అవునవును. కానీ ఇంతకన్నా కూడా ఎక్కువే ఉంది. పూర్వకాలంలో అగ్గిపెట్టెల్లేవు; నిప్పు పుట్టించాలంటే అగ్ని మంత్రాలతో ఎండుకట్టెల్ని రాపాడడమనే శ్రమపూర్వక కర్మకాండను చేసేవాళ్ళు. నిప్పు కణం కనిపించడమంటేనే అద్భుతంగా ఉండేది. 'అగ్ని ప్రకటం కాకముందు, అది ఎక్కడుంది?' అని ప్రశ్నించు కున్నారు సనాతన విచారపరులు. ఖచ్చితంగా, అది ఎప్పుడూ కట్టెలో దాగొని ఉంది. సరైన పరిస్థితులు రాగానే అది ప్రకటమవుతోంది. ఆ విధంగా అగ్ని పరమాత్మకు ప్రతీకగా సర్వవ్యాపకమైనదిగా ఉన్నా, కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లోనే ప్రకటమవుతుంది అది.

"అగ్నిని పరమాత్మ చిహ్నంగా ఉపయోగించుకోడానికి మరో కారణం ఏమిటంటే, అగ్ని ఎప్పుడూ పైపైకే మండుతూ ఉంటుంది. వంటచెరకు కిందికి ఉంచి పట్టుకో. అగ్ని జ్వాలలు మాత్రం ఎప్పుడూ పైపైకే కదులుతూ ఉంటాయి. అదీగాక, ఒక్క విస్ఫులింగం చాలు మొత్తం అడవిని కాల్చెయ్యడానికి. ఒక జ్వాల నుంచి వెయ్యి కొవ్వొత్తులు మనం వెలిగించవచ్చు; కానీ మూలమైన మాతృజ్వాలకు ఏ లోటూ రాదు. ఇంక ఇంతకన్నా పరమాత్మకు మరో గొప్ప చిహ్నం ఎక్కడ దొరుకుతుంది?

"అది వినాశకారిగా మారినప్పుడు, అన్నిటినీ బూడిద చేసేస్తుంది; ప్రతీదాన్నీ ధూళిగా చేసేస్తుంది. ప్రేమా, కరుణల పావనాగ్ని స్వార్థాన్నంతనీ బూడిదగా కాల్చేస్తుంది. తాము ఏ విధంగా పరిమితుల నుంచి విడివడ్డారో చూపించడానికే తపస్వులు శరీరాలకు బూడిద పూసుకుంటారు.

"కనిపించే నిప్పును మాత్రమే అగ్ని అని అనరు. దహించే రూపాలన్నీ అగ్నులే. మానవ శరీరాన్ని పోషించే నిర్మాణాత్మక, జీవశక్తి వ్యయాత్మక ప్రక్రియలను జీర్ణకారి అగ్నులని అంటారు; అంతేగాక, ఉన్నతమైనదైనా నీచమైనదైనా కోరిక (కూడా) అగ్నే.

"నీకొక ప్రేమికురాలుంటే, నువ్వు ఆవిడను 'పురాతన జ్వాల' (Old Flame) అని పిలవవా; ఎవ్వరూ 'పురాతన జలమ'ని గాని 'పురాతన వాయువ'ని గానీ అనరు. ఎందుకంటే ప్రేమ, కోరిక, ఉత్తేజన - ఇవన్నీ ఒక్కొక్కరకమైన అగ్నే. అలాగే కల్పన కూడా. అందుకనే యుగయుగాలబట్టీ అగ్నిని ఆరాధించడం జరుగుతోంది. నాథ సంప్రదాయానికి చెందిన మాకు అగ్ని స్వాత్మభాగమే. మేము ధునిని వెలిగించి గంటలకొద్దీ ఆ జ్వాలలను చూస్తూ కూర్చుంటాం. అగ్ని మా స్నేహితుడు, మా సంరక్షకుడు. మా మనస్సులు ఆ జ్వాలలతో కలిసిపోతాయి; మేము ఒకటైపోతాం. ప్రకృతిలో ఉన్న అన్నిటిలాగానే అగ్నికి కూడా సొంత మనస్సంటూ ఒకటుందని చెబుతూన్న నా మాటను నమ్ము. మన మనస్సులు అతి సన్నిహితంగా అగ్నితో సంధింపబడి ఉన్నాయి; ఎంతగా ముడిపడి ఉన్నాయంటే ఆ జ్వాలలు మనం కోరుకొనే ఏ కోరికనైనా తీరుస్తాయి.

"అలాగే, అంతస్సులో ఉన్న కుండలినీ అగ్ని నిజంగా విశ్వజనీనమైన దహనశక్తిలో ఒక బాగం. అది తనను తాను బాహ్యాగ్ని కంటె భిన్నం కానని పోల్చుకొని ఏకీభూతమై ధునిలో ప్రకటమవుతుంది. అగ్నిజ్వాలలు దాని నుంచి హఠాత్తుగా నిర్గమించి సహస్రదళ పద్మానికి చేరతాయి; మనిషి దేవుడవుతాడు. అటువంటప్పుడు చైతన్యం తాలూకు విపుల పరిమితులను మనం చేరుకోవచ్చును; వాటిని మనం వినియోగించుకోవచ్చును. దుఃఖం మటుమాయమవుతుంది. జాగ్రత్తగా పరిశీలించు."

బాబాజీ అప్పుడు అగ్నిని తీవ్రావధానంతో చూస్తూ ఇలా అన్నారు:

"ధునిలో నృత్యం చేసే నా హృదయజ్వాలా! నువ్వు పైపైకి, ఇంకా పైకి సాగి నీ ప్రతాపాన్నీ ఘనతనీ చూపించు". అప్పుడు అగ్నిజ్వాలల్లోని ఒక జ్వాల పొడుగెదగడం మొదలు పెట్టింది. సంశయాళువైన నా మనస్సు తటాలున దీన్ని, అప్పుడు వీచడం మొదలుపెట్టిన చలిగాలికి ముడిపెట్టబోయింది. అప్పుడే, నేను చూశాను ఒక్క జ్వాలే పెరుగుతోందని. ఆ మంట ఊగిసలాడే అగ్నిస్తంభంలాగ పైకి లేచింది; దాదాపుగా దూరంగా ఉన్న ఒక దేవదారు చెట్టంత పొడుగెదిగింది.

"ఇప్పుడు నువ్వు అగ్నీ! ఈ కుర్రాడి బొడ్డును స్పృశించు. మధు అంతస్సులోని అగ్ని నీ దీవెనలతో మేల్కొనాలి". అగ్ని తాలుకు దీర్ఘజిహ్వ నా వైపుకు వంగి, త్రుటిలో నా నాభిని నాకి నా మొత్తం శరీరాన్ని అగ్నిమయం చేయడంతో నేను భయాశ్చర్యాలతో కంపించిపోయాను. ఆ అగ్ని ఊర్ధ్వానికి ప్రసరించి అన్ని ఆటంకాలను బూడిద చేసి చివరికి నా మెదడుకి చేరింది. అక్కడ అది బహుదీప్తియుక్తమైన, బహువర్ణవంతమైన మెరుపుగా విస్ఫోటించింది. ఆశ్చర్యాన్ని కలగజేస్తూ అది నా వెనుబాము మీదుగా కిందికి ఒక చల్లని, ఇంపైన భావాన్ని ప్రసరింపజేసింది. ఊర్ధ్వాధోభాగాల మధ్య ఒక సంధి ప్రతిష్ఠాపితమయింది. తోవ తేటపడింది. నేను దాని మీదుగా, బాబాజీ దయాపూర్వక ఉత్సాహం దన్నుగా ఓర్పుగా ప్రయాణం చేయాలి.

నా కళ్ళు తెరిచేసరికల్లా ఆ మంటలు సాధారణ స్థాయికి తిరిగి వచ్చేశాయి. వెర్రి ప్రేమతో తన బిడ్డడు వేసే మొదటి తప్పటడుగుని చూసే అమ్మలాగ బాబాజీ సంతోషంగా నవ్వుతున్నారు. "బాగుంది. ఈ రోజుకిది చాలు. ప్రశాంతంగా ధ్యానం చెయ్యి. ఆ తరవాత నిద్రపో" అని ఆయనన్నారు.

"బాబాజీ! ఇది నిన్ననే అడుగుదామనుకున్నాను – మీరెప్పుడైనా అసలు నిద్ర పోతారా? అని. మీరు రాత్రంతా మెలకువగానే ఉన్నారని నేననుకున్నాను. అవునా?" అని నేనడిగాను.

"నాన్నా! నాకు నిద్ర అవసరం లేదు. నీ శరీరమూ మనస్సూ అలసిపోతాయి; వాటికి పునఃశక్తి కావాలి కనకనే నీకు నిద్ర అవసరం. నాకు అలసటగానీ బడలిక గానీ ఉండదు. నువ్వు కొంత ముందుకు సాగిన తరవాత, కనీసం కొంతగానైనా ఈ విషయాన్ని అర్థం చేసుకోగలుగుతావు.చాలా ఏళ్ళ తరవాత, చాలా పనుల్లో నువ్వు మునిగి తేలుతూన్నప్పుడు, ఇదెలాగో నీకు అర్థమవుతుంది".

ఆ రోజు రాత్రి నేను చాలా గాఢంగా ధ్యానం చేశాను. నా మనస్సు ఇంతదాకా పరిశోధన చేయని పరిమితుల్లోకి ఆరోహించి, నన్ను బాధిస్తూన్న వివిధ ప్రశ్నలకు జవాబులను తీసుకొని తిరిగి వచ్చింది. ఆ తరవాత బాబాజీకి నమస్కరించి గుహలోకి వెళ్ళి నిద్రపోయాను. బాబాజీ శిలలాగ స్థిరంగా అగ్నిమీదనే తన కళ్ళను నిలిపి నిటారుగా పద్మాసనంలో కూర్చొని ఉన్నారు.

# ౨౩. టిబెట్టీయ వృద్ధ లామా

ఒక రోజున ధ్యానమూ ఉదయం ఉపాహారమూ అయిన తరవాత బాబాజీ నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తూ 'ఈ రోజున నీకు ఏ స్థిరమైన కార్యక్రమ నిబంధనా లేదు. నీ ఇష్టం వచ్చినట్టు ఈ చుట్టూ తిరగవచ్చును. బహుశా నువ్వు ఈ గుట్టలపైకి వెళ్ళి గుహలను పరిశీలించడాన్ని ఇష్టపడతావేమో? కానీ చీకటి పడేలోగా ఖచ్చితంగా తిరిగి రావాలి సరేనా?" అని అన్నారు.

గుట్టల మీద నడుస్తూ తెలియని ప్రదేశాలను పరిశోధించడం కన్నా నాకు మరో ఆనందం లేదు. నేను నీటి కూజానూ చేతికర్రనూ మాత్రమే తీసుకొని బయల్దేరాను. బాబాజీ ఒకటీ రెండు సందర్భాల్లో ఎక్కినట్టు చూసిన ఆ నిట్రమైన సన్నని దారి మీదుగా నేనూ ఎక్కేను. కొంతసేపైన తరవాత అలా ఎక్కడం బాగా కఠినమైపోయింది; బాగా చల్లగా కూడా అయింది. దానికి తోడు, సన్నగా జల్లు కురవడం ప్రారంభమయింది; తేలికపాటిగా మంచు కురవడం కూడా మొదలయింది.

ఆ దారికి రెండు వైపులా కొన్ని సహజమైన గుహలున్నాయి. ఈ గుహల్లో ఒక్కోసారి హిమాలయపు ఎలుగుబంట్లు ఉండవచ్చునని బాబాజీ నన్ను హెచ్చరించారు. అంచేత ఆ గుహల్లో ఒక గుహ నుంచి ఎప్పుడైతే నేను ఒక రకమైన కలకల ధ్వనినీ గొణుగుడు ధ్వనినీ విన్నానో అప్పుడు నాకు భయం పట్టుకొని గడ్డకట్టుకుపోయాను. ఆ తరవాత ఆ గుహ నుంచి అగురు వాసన వస్తున్నట్టనిపించింది.

జాగ్రత్తగా, ఉద్రిక్తతతో కంపిస్తూ, ఆ గుహ ముఖం దగ్గరికి నెమ్మదిగా పాకుతూ లోపలికి వెళ్ళాను. ఒక నిముషంలోనే నా కళ్ళు లోపలి మందకాంతికి అలవాటు పడ్డాయి. గుహకు అటు మూల ఉన్న లోతైన గోతిలో మండుతూన్న చిన్నపాటి అగ్ని నుంచి ఆ కాంతి వస్తోంది. ఆ అగ్నివైపు ముఖం చేసుకొని శరీరంమీద చాలినంత బట్టలే ఉన్న మనిషి ఒకరు అగ్నిలోకి పరిమళ ద్రవ్యం వేస్తూ నాకు అర్థం కాని దానినేదో కూనిరాగంతో జపిస్తూ ఉన్నారు. నా ప్రవేశాన్ని ఆయన గమనించారని రూఢిగా అనుకున్నాను కనకనే ఆయన నా ఉనికిని గుర్తించేంత వరకూ వేచి చూస్తూ నేను నెమ్మదిగా కొంతదూరంలో కూర్చున్నాను.

కొంతసేపైన తరవాత, ఆయన నా దిక్కుగా తిరిగి దగ్గరగా రమ్మని సైగ చేశారు. నేను అగ్నికి దగ్గరగా వెళ్ళాను. ఇప్పుడు ఆయన ముఖం స్పష్టంగా కనిపించింది. అది ముడుతలు పడిన, కష్టసుఖాలు బాగా ఎదుర్కొన్న, మంగోలియన్ల వంశానికి చెందిన ముదుసలి ముఖం. నెరసిన వెంట్రుకల పాయలుకొన్ని మాత్రమే అతని గడ్డంగానూ సన్నని మీసంగానూ ఏర్పడి ఉన్నాయి. ఆయనది పూర్తిగా బట్టతల.

ఆయనేదో ఒక రకం బౌద్ధ సన్యాసి కావచ్చునని నేను ఊహించాను. ఆశ్చర్యకరంగా, ఆయన కొంత తచ్చాడుతూనూ తటపటాయిస్తూనూ ఇంగ్లీషులో మాట్లాడారు. ఆయన కంఠం మోటుగా రమారమి కప్పకూతలాగ ఉంది. చేతులు జోడిస్తూ ఆయన "అభివందనాలు. అవలోకేశ్వరుడైన బుద్ధుడు నిన్ను ఆశీర్వదించు గాక!" అని అన్నారు. నేను ఆయన ముందు సాష్టాంగపడి నేనెవర్నో ఎందుకని అక్కడున్నానో వివరించాను.

"నాకు తెలుసును, నాకు తెలుసును" అని ఆయన అన్నారు. "మీ బాబాజీని నేనెరుగుదును. మేము తరచు కలుసుకుంటూ ఉంటాం. నేను టిబెట్టువాణ్ణి. మిలరేప అనే మహాయోగి తాలూకు కార్గ్యపా శాఖకు చెందిన సంచారయోగిని. మిలరేప అంటే నూలుబట్ట చుట్టుకున్నవాడని అర్థం. మేము తీవ్రతమమైన శీతాకాలాల్లో కూడా ఒక చిన్న నూలుగోచీ గుడ్డను మాత్రమే ధరిస్తాం.

"మీరు ఏమి గానం చేస్తున్నారు సార్? మీకు ఇంగ్లీషు ఎలాగ వచ్చు?"

"నీ రెండో ప్రశ్నకు సమాధానం చెప్పను. అది నీకు చివరికి తెలుస్తుంది. మొదటి ప్రశ్న విషయమంటావా, నేను జపిస్తూ ఉన్నది 'ఓం మణిపద్మేహూమ్' అనే బౌద్ధమంత్రం"

"అయ్యా మీరు చలి ముమ్మరంలో కూడా గుడ్డల్లేకుండా ఎలాగ ఉండగలుగుతారో మిమ్మల్ని అడగవచ్చునా? బాబాజీ కూడా మీలాగే ఉంటారు"

"నీకు వివరిస్తాను బిడ్డా! మిలరేప గారి ఆధ్యాత్మిక పరంపరకు చెందిన మేము దర్శనాభ్యాసంతో కూడిన 'తుమ్మో' అనే ఒక శ్వాస ప్రక్రియను అభ్యసిస్తాం. ఇది నాభీకేంద్రమైన మణిపూరం దగ్గర అంతరంలోని అగ్ని తాలూకు వేడిని పెంపొందించి దాన్ని శరీరమంతటా వ్యాపింపజేస్తుంది. నువ్వు గమనిస్తే నాకు బాగా చెమట పడుతోందని చూడగలవు. అది అంతరంలోని ఉష్ణంవల్లనే. మాలో కొంతమంది యోగులు తడి దుప్పట్లను వీపుల మీద చుట్టబెట్టుకొని చలికాలంలో కూడా నిముషాల్లో ఎండిపోయేలాగ చేయగలరు.

"నిన్న నిన్ను అగ్ని ఎక్కడ ముట్టిందో అదే ఈ మణిపూరం. నీకు అవసరమైనప్పుడు మీ బాబాజీ, ఆయన అభ్యసించే తుమ్మోలాటి సాధనను నీకు నేర్పుతారు"

"ఒక్క క్షణమాగండి! నా బొడ్డును తాకిన అగ్ని గురించి మీకెలా తెలుసును? ఆ సంఘటన తరవాత బాబాజీ నా పక్కనుంచి కదలలేదు. రాత్రిపూట నేను నిద్రపోయి నప్పుడు ఆయన జారుకొని వచ్చి మీతో ఆ విషయం చర్చించారేమో మరి. అలా అని నేననుకోవట్లేదు..."

"బాబూ, చాలామందికి తెలియని వార్తాప్రసార సాధనాలు మాకున్నాయి. అవి రహస్యమైనవేమీ కావు. మనస్సు ప్రశాంతమైనప్పుడు, ఏకాగ్రమైన అవధానం కుదిరినప్పుడు ఆలోచనలను వినిమయం చేసుకోవచ్చును. ఇప్పుడు నేనిది చెప్పానని చెప్పి, పవిత్ర పత్రికల్లోనూ వార్తా పత్రికల్లోనూ రుసుము పుచ్చుకొని దూర శ్రవణాన్ని నేర్పుతామనే వాటి గురించిన వాణిజ్య ప్రచార ప్రకటనలతో మోసపోకు సుమా! అదంతా అర్థంపర్థం లేనిది. అసలైనది అంత సులభమేమీ కాదు"

"నేను అడగవచ్చునంటే మరో రెండు ప్రశ్నలున్నాయండి"

"సరే కానియ్యి"

"భూ వాతావరణానికి వెలుపలి పురాతన నాగరికతల అవశేషాలు టిబెట్టులోని కొన్ని ప్రాంతాల్లో గుప్తంగా ఉన్నాయని కొన్ని గ్రంథాల్లో ఉంది. అది నిజమేనా? రెండోది, 'యతి' (Yeti) అనే అసహ్యాకరమైన మంచుమనిషి నిజంగా ఉన్నాదా? మీరు చూశారా?"

"మొదటి ప్రశ్నకు (జవాబు): అవును, అటువంటి ప్రదేశాలున్నాయి. టిబెట్టులోని దాదాపుగా చేరరాని ప్రాంతంలో ఒక గుహను నాకుగా నేను చూశాను. అక్కడ చాలా చక్కగా భద్రపరిచిన దుర్బల సౌష్ఠవమున్న కిన్నర శరీరాలను (Humanoids) నేను చూశాను. ఆ కిన్నరుల పుర్రెలు మనవాటి కన్నా పెద్దవి; వారి చాయ నల్లగా, రమారమి బూడిదరంగులో ఉంటుంది. అయితే, మేము మాత్రం వాళ్ళు భూమిమీద ఒక పురాతన జాతి అనే విశ్వసిస్తాం తప్ప మరేదో గ్రహంనుంచో, పాలపుంతనుంచో వచ్చిన వాళ్ళుగా అనుకోము. ప్రత్యేకమైన ఈ జాతి రెండు నాగరికతల మధ్య జరిగిన ఒక యుద్ధం కారణంగా నాశనమైపోయిందని మా గురువులు చెబుతారు. ఆ శత్రు నాగరికతలు రెండూ బౌద్ధికంగా బాగా ఉన్నతులకు వికసించినవి; వాళ్ళు ప్రేమా కరుణా అనే భావాలను పూర్తిగా ఉపేక్షించారు. మన ప్రస్తుత నాగరికత పురోగతిని చూస్తూంటే మనకేం గతి రాసిపెట్టుందో అని విస్తుపోతూ ఉంటాం.

"ఇక, 'యతి' గురించి. అది ఉంది. కానీ చూశామని చెప్పిన మాటలన్నీ అబద్ధాలే కావచ్చు. బదరీనాథ్ నుంచి కైలాసానికి వెళ్ళే పురాతన మార్గంలో, ఇప్పుడెక్కువగా ఉపయోగించనటువంటి 'మనా కనుమలకు' అడ్డంగా, టిబెటు వైపు తోలింగ్ మఠమనే (Tholing Mutt) ఒక పురాతన బౌద్ధ సంఘారామం ఉంది. తోలింగ్ మఠానికి మరీ దూరం కాని గుహల్లో ఇటీవల కూడా కొంతమంది లామాలు 'యతి'ని చూశారు. నేను కూడా ఒకణ్ణి చూశాను. నిన్ను తోలింగ్ మఠానికి గానీ

కైలాసానికైనా సరే తీసుకెళ్ళగలరా అని బాబాజీని అడుగు. ఆయనకు ఆ దారి సుపరిచితం. అక్కడకు ఆయన చాలాసార్లు వెళ్ళారు. నువ్వు కూడా ఒక 'యతి'ని చూస్తావేమో మరి!?"

"నేను ప్రయత్నం చేస్తాను. చివరి ప్రశ్న-మీరొక లామానా?" అని నేనడిగాను.

"కాదు. నువ్వనుకొనే తీరులో కాదు. పవిత్రుడికి వాడే సాధారణమైన శబ్దం లామా. అతను లాంఛనప్రాయంగా నియమితుడైన లామా కావచ్చు; వివాహితుడు కావచ్చు, అవివాహితుడూ కావచ్చు. లేకపోతే అతను టిబెట్‌లోని 'బాన్-పా' అనబడే షామాన్‌లాటి ప్రాగ్బౌద్ధ శాఖకు చెందిన వాడైనా కావచ్చును. ఫలానా తెగకు చెందిన వాళ్ళమని ప్రకటించే అనుబంధ చిహ్నాలను అనుసరించే కార్మ్యపాలు సంప్రదాయబద్ధమైన అంగీలు తొడిగే 'కర్మపా' అనే ఆదిష్ట సన్యాసి ఆధీనంలో ఉన్నప్పటికీను, మిలరేప (పైన) చెప్పిన లాటి యోగే. లౌకికమూ ధార్మికమూ అయిన అధికారాలు రెండూ ఉన్న పెద్ద హోదా గల లామా ఆధ్యాత్మికంగా ప్రగతి సాధించినవాడు కానక్కర్లేదు"

"దలైలామాను ఏ స్థానంలో ఉంచుతారు మీరు?" (అని నేను తిరిగి అడిగాను).

ఆ ముసలాయన కొంతసేపు తటపటాయించాడు. తరవాత చాలా సుదీర్ఘమైన చూపుతో ఆయన "కీర్తిశేషులైన పదమూడో మహా దలైలామా ఆధ్యాత్మికంగా చాలా వికసించినవాడని అందరూ ఒప్పుకున్న విషయం. మంగోలియా విజేత అయిన చెంగిజ్‌ఖాన్ మునిమనవడైన కుబ్లైఖాన్ ఆజ్ఞకు లోబడి మొదటి దలైలామా రాజకీయంగా నియమితుడయ్యాడు. 'దలై' అంటే సముద్రమని అర్థం. చైనాను పరిపాలించిన కుబ్లైఖాన్ టిబెట్టు రాజకీయాల్లో మహత్తర పాత్రను నిర్వహిద్దామన్న కోరికతో మహాలామా పదవిని సృష్టించాడు. రెండో దలైలామా నిజానికి అతని చుట్టమే. రాజకీయం మతంతో మెలిపడే ఉంది ఎప్పుడూను. ఇంతకన్నా నేనింకేమీ చెప్పను.

"ఇప్పుడు నీకు ఆకలిగా ఉండవచ్చు"

ఆయన నాకు దారుణమైన రుచి ఉన్న జిగట వస్తువునేదో ఒకదాన్ని ఇచ్చారు. వేయించిన బార్లీ పిండిని జడల బర్రె కొవ్వుతో కలిపిన ఈ పదార్థాన్ని సంపా (Tsampa) అని అంటారు. వీలైనంత త్వరగా నేను దానిని గుటక వేసి మింగేశాను. తరువాత ఆయన పోసిన నల్ల టీని తాగి ఆయన ముందు సాగిలపడి సెలవు పుచ్చుకొని గుహను వదిలిపెట్టి వచ్చేశాను.

నేను తిరిగి వచ్చేసరికల్లా బాబాజీ గుహ వెలుపల కూర్చొని ఏదో ఒక పాత తాళపత్ర వ్రాతప్రతిని నిశితంగా పరిశీలిస్తున్నారు. "యువ పరిశీలకుడు ఎలాగ ఉన్నాడు?" అని అడిగారు నవ్వుతూ. "టిబెట్టీయ వృద్ధయోగితో సమావేశం ఏ విధంగా జరిగింది? ఆయనను చాలా ప్రశ్నలే అడిగావు".

"అవును బాబాజీ" అని అన్నాను నేను. నేను చేసిన ప్రతి చర్య లోనూ ఆయనకున్న సన్నిహిత జ్ఞానం గురించి నేను ఏమీ ఆశ్చర్యపోలేదు. "నేను మిమ్మల్ని అడగాల్సి ఉంది...."

"తరువాత. ఇప్పుడు నువ్వు పడుకొని ఒక చక్కటి కునుకు తియ్యి. సాయంత్రం మనకొక ముఖ్యమైన సమావేశం ఉంది". నేను గుహలోకి వెళ్ళి చాచుకొని పడుకున్నాను. తక్షణమే గాఢనిద్రలోకి ఒరిగిపోయాను.

# 24. యోగం, వేదాంతం, నాథ్ పంథ్

అదొక చల్లటి ప్రాతః సమయం. చుట్టూ ఉన్న చాలా కొండకొమ్ములు మంచు టోపీలు పెట్టుకున్నాయి. రాత్రంతా తేలికపాటుగా మంచు కురుస్తూనే ఉంది. కానీ 'ధుని' మాత్రం మండుతూనే ఉంది.

"ఈ రోజు మనం ఉపనిషత్తులతో ప్రారంభిద్దాం" అన్నారు బాబాజీ.

"కానీ బాబాజీ, ఉపనిషత్తులను అర్థం చేసుకోవడం చాలా కష్టం కాదా? అయినా అవి సన్యాసులకూ గొప్ప గొప్ప విద్వాంసుల కోసమని మాత్రమే అంటూంటారు కదా"

"ఈ పురోహితులు జనసామాన్యంలో వ్యాపింపజేసిన భావం అది. సూటిగా, తెలివిని మేలుకొనేలాగ చేసే మాటలతో ఉపనిషత్తులను బోధిస్తే అవి జనులను తర్కబద్ధంగా ఆలోచింప చేయడం మొదలు పెడతాయనీ, తాము లోకుల్లో ప్రచారం చేసిన అసంబద్ధమైన నమ్మకాల నుంచీ, పొరపాటు అభిప్రాయాల నుంచీ జనానీకాన్ని దూరం చేస్తాయనీన్నూ ఆ పురోహితుల భయం. సామాన్య జనం తమకు తాము ఆలోచించడానికి మొదలుపెడితే వారి మీద తమకున్న అదుపు తప్పిపోతుందని వాళ్ళు భయపడతారు. వారికీ వారి దేవుళ్ళకూ మధ్య దళారుల్లా పనిచేసే జీతగాళ్ళమారి పూజారులు రాజుల్నీ వారి ప్రజల్నీ తమ అదుపులో ఉంచుకోవడానికి ఉపనిషత్తుల అధ్యయనాన్ని నిరుత్సాహపరిచారు. ఈ మన మహానాగరికత పతనం కావడానికి కారణమైన దానిలో ఒక అంశం స్వచ్ఛమైన విజ్ఞానాన్ని ఉపేక్షించడమే.

"ఉపనిషత్తులు సన్యాసులకు మాత్రమే అనేది కూడా ఈ పూజారులు పుట్టించిన మరో అభూతకల్పన. ఉపనిషత్తులను నువ్వు ఒకసారి పరికిస్తే చాలు, అవి చాలామటుకు వివాహితులూ, సంతానవంతులైన వాళ్ళూ అయిన మహర్షులు బోధించినవని నీకు తెలుస్తుంది. వారిలో జనకుడి లాటి కొంతమంది మహారాజులున్నారు. గాయత్రీ మంత్రాన్ని ప్రసాదించిన విశ్వామిత్ర మహర్షి, ఋషి కాకముందు ఒక క్షత్రియుడు (యోధుడు).

"వేదాలను వర్గీకరించి బ్రహ్మసూత్రాలను రచించిన మహానుభావుడైన వ్యాస మహర్షి ఒక బెస్తకన్నె కడుపున పుట్టాడన్న మాట మనం మర్చిపోకూడదు. అర్హతా యోగ్యతా ముఖ్యమైనవి తప్పించి ఏదో ఒక ప్రత్యేకమైన వర్ణంలోనో వంశంలోనో పుట్టడం కాదు. నీకు అభౌతికమైన ఆత్మ ఒకటి ఉందని నువ్వనుకుంటే దానికి తల్లితండ్రులుంటారా? ఆ రోజుల్లో మహా ఋషులు తమ పిల్లల్ని ఉపనిషత్ఛ్రవనం

కోసం ఇతర ఋషుల దగ్గరకు పంపేవారు. అది ఉపనిషద్యుగం; జ్ఞానవంతమైన యుగం. ఆ యుగం వర్ణంతో గానీ మత సంప్రదాయంతో గానీ సంబంధం లేకుండా సర్వజిజ్ఞాసువులకూ ద్వారాన్ని తెరిచి ఉంచింది.

"మనం ఉపనిషత్తుల దగ్గరకు తిరిగి వెళ్ళవలసినదే అనీనూ, పరబ్రహ్మమైన 'సత్యం', వివేకం (తర్కించడం) ద్వారా తప్పించి మరోలా కనిపించదనీనూ నంబూదిరి బ్రాహ్మణ వేదాంతి అయిన ఆదిశంకరాచార్యులు బోధించినప్పుడు ఆయనకు పురోహిత వర్గం 'ప్రచ్ఛన్న బౌద్ధుడు' (మారువేషంలో ఉన్న బౌద్ధుడు) అని ముద్ర వేసింది. కర్మకాండ విధానాలతో నిండిన మతానికి దీనివల్ల పెద్ద అఘాతమే తగిలింది. ప్రజల మీద తమకున్న పట్టు పోతుందేమోనని పురోహితులూ పూజారులూ భయపడిపోయారు. చివరకు ఆది శంకరాచార్యుడు స్థాపించిన మఠాలను కూడా వాళ్ళు ఎంతగా ప్రభావితం చేయగలిగారంటే ఈ రోజున అవి చాలామటుకు కర్మకాండల మీద ఆధారపడే సంస్థానాలుగా మారిపోయాయి. ఇదే, ఆ పూజారులు ఎంత కుటిలమైన తెలివిగల వాళ్ళో అనే విషయాన్ని నిరూపిస్తుంది.

"ఉపనిషద్విద్యార్థి కాదగినవాడికి కొన్ని గుణాలు అవసరమనే మాటను నేను ఒప్పుకుంటాను. అతనికి నిర్మలమూ పక్షపాతరహితమూ అయిన మనస్సు ఉండాలి; చాలినంత బుద్ధి సామర్థ్యమూ, స్వస్థమైన శరీరమూ ఉండాలి. ఈ రకమైన స్వాధ్యాయ ప్రక్రియలో కావలసిన లోతైన విచారణ కొనసాగించడానికి ఆవశ్యకమైన శక్తి, ఒక జబ్బు మనిషికి ఉండదు. ఈ అన్వేషణలో ఎక్కువ మోతాదులో ఉండవలసిన ఓర్పు అనే గుణం వ్యాధి పీడితమయ్యే శరీరానికి ఉండదు. అంచేత (దీనికి) యోగాభ్యాసమూ, యుక్తమూ ఆరోగ్యకరమూ అయిన ఆహారమూ, ఒక నిశ్చితమైన ప్రశాంతరూప జీవనమూ తప్పనిసరిగా కావాలి".

"కానీ బాబాజీ! సరైన బోధకుడూ ఉండాలిగా!" అని నేనన్నాను.

"నేను ఒప్పుకుంటాను. కానీ తప్పుగా అధ్యాపనం చేసే అధ్యాపకుడికన్నా అధ్యాపకుడు లేకపోవడమే మంచిది. బోధకుడి పని మార్గాన్ని చూపించడమే; విద్యార్థిని తనమీదే ఎప్పటికీ ఆధారపడేలాగ చేయకూడదు అతను. తన కాళ్ళమీద తాను నిలబడగలిగే జ్ఞాన స్థాయినీ, అనుభవాన్ని పొందగలిగే స్థాయినీ అందుకొనేలాగ విద్యార్థికి దారి చూపించాలి, ఆధ్యాత్మిక గురువు. స్వాతంత్ర్యము వైదాంతిక బోధనకు ఆత్మ.

"అంచేత ఇప్పుడు నేను ఉపనిషత్తులంటూంటే నా ఉద్దేశం మొట్టమొదటివైన పదకొండు ప్రధాన ఉపనిషత్తులు అని – ఈశావాస్య, కేన, ఛాందోగ్య, బృహదారణ్యక, ముండక, మాండూక్య, కఠ, ప్రశ్న, శ్వేతాశ్వతర, ఐతరేయ, తైత్తిరీయ ఉపనిషత్తులు. తరవాతి ఉపనిషత్తుల్లో చాలా ఉపనిషత్తులు వాటి స్వచ్ఛరూపంలో లేవు. శాఖాభిమానపు నమ్మకాలకు వత్తాసు పలకడానికి కొన్ని ఉపనిషత్తులు కల్పితమయ్యాయి. అంచేత వాటిని మనం వదిలేద్దాం.

"ఉపనిషత్తు అనే శబ్దం 'ఉప' అనే ఉపసర్గతో ఏర్పడింది. 'ఉప' అంటే 'దగ్గర' అని అర్థం. గురువుకు సమీపంగా కూర్చొన్న* వాళ్ళకే 'ఉపనిషత్తు' అర్థమవుతుందని తాత్పర్యం. బహు మితీయమైన (Multi - Dimensional) యథార్థాన్ని అర్థం చేసుకోడంలో గురువుతో సన్నిహితంగా సంలగ్నమై ఉన్నవాళ్ళకే ఉపనిషత్తు ఒంటపడు తుంది – ఈ అనుభూతిని మాటల్లో వర్ణించలేము; సామాన్యంగా సంకుచిత పరిమితు ల్లోనే పనిచేసే మనస్సుకు దీన్ని వివరించలేము.

"సాధారణంగా అటూ ఇటూ భ్రమిస్తూ ఉండే మనస్సు (ఒక చోట స్తిమితంగా) కూర్చెదం ('షద్ ౄ'* – 'ఉపనిషద్'లోని చివరి పదాంశం) నేర్చుకోవాలి – అంటే, ఆలోచనల అన్ని అనవసరగతులూ ఆగిపోవాలి; అన్యథా ఎప్పుడూ క్షుభితమై ఉండే మనస్సుకు ఆ ప్రశాంత క్షణంలో ఆలోచనా పరిధులకు మించినది (సత్యం) ప్రకాశిస్తుంది.

"సామవేదీయ కేనోపనిషత్తు 'మనస్సు భావించలేనిదీ, మనస్సు అస్తిత్వానికే కారణమైనదీ అయినదే బ్రహ్మమూ, సత్యమూ అని తెలుసుకో శిష్యుడా!; నువ్వు ఇక్కడ ఆరాధించే ఇతరమైనదేదీ కాదు'** అని వర్ణిస్తుంది.

"మూలాలు అర్థం చేసుకోడానికి వీలుగా నువ్వు సంస్కృతం నేర్చుకుందువు గాని. సంస్కృత భాషను అనాదరించడమే ఈ దేశ ప్రజ్ఞానాన్ని బొత్తిగా ఉపేక్షించడంగా పరిణమించింది. మూలాలు తెలియకపోవడం వల్ల నీతినియమాల్లేని అనువాదకులూ వ్యాఖ్యాతలూ జనానీకాన్ని తప్పుదారి పట్టిస్తున్నారు; వాళ్ళు సాధారణంగా తమతమ శాఖాభిమానపు నమ్మకాలకు తగినట్లుగా పవిత్ర గ్రంథాలను కూడా మెలితిప్పుతారు.

---

* ఉప+ని+షద్ ౄ (సద్). 'ఉప', 'ని' – రెండూ ఉపసర్గలే. 'సద్' ధాతువుకు కూర్చోడం, నివసించడం, నశించిపోవడం, బాధపడడం, కష్టంలో ఉండడం మొదలైన అర్థాలున్నాయి.

** *యన్మనసా న మనుతే యేనాహుర్మనోమతమ్ ।*
*తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥ (కేనోపనిషత్ 1-5)*

మనం కేన, ఈశావాస్య, మాండూక్య ఉపనిషత్తులను[1] ఒక్కొక్కటిగా అధ్యయనం చేస్తూ కొనసాగుదాం"

"బాబాజీ, బుద్ధుడి బోధనలు ఉపనిషద్బోధనలకు దగ్గరగా ఉంటాయా?"

"పూర్వాచార పరాయణులైన పురోహితులు శంకరాచార్యుణ్ణి ప్రచ్ఛన్న బౌద్ధుడని పిలవడమే రెండు బోధనల సారూప్యాన్నీ నిరూపిస్తోంది. మాండూక్యోపనిషత్తు మీద ప్రసిద్ధ వ్యాఖ్యానం రాసిన శంకరుల పరమగురువైన గౌడపాదాచార్యుణ్ణి కూడా చాలామంది బౌద్ధుడిగానే పరిగణించారు. దీనికి కారణమేమిటంటే, 'అజాతవాద' సిద్ధాంతంలో ఆయన జగత్తుని 'ఒక ఆభాసంగానూ, ఇంచుమించుగా ఒక మాయ గానూ బ్రహ్మమొక్కటే నిత్యసత్త్వమున్న సత్యంగానూ బోధించడమే'. బ్రహ్మానికి బదులుగా బౌద్ధ శబ్దమైన 'శూన్యాన్ని' (అభావాన్ని) పెడితే, మహా బౌద్ధ గురువైన నాగార్జునుడి 'ప్రజ్ఞాపారమిత' తాలూకు ప్రధాన విషయం మన ఎదురుగా నిలుస్తుంది".

"ఇది మహా తాత్త్వికంగా తయారౌతోంది బాబాజీ! దయ ఉంచి నాకు యోగం గురించీ యోగాభ్యాసం గురించీ కొంత చెప్పండి" అని నేనన్నాను.

"సరే నీ ఇష్ట ప్రకారమే కానియ్యి" అని బాబాజీ నవ్వుతూ అన్నారు: "మధూ! జాగ్రత్తగా విను. యోగమనేది ఒక సనాతన శాస్త్రం. దానిని తరువాత పతంజలి మహర్షి క్రోడీకరించాడు. పతంజలి (రాసిన) అష్టాంగ యోగసూత్రాలు అమూల్యమైన రత్నాలు. అష్టాంగయోగ లక్ష్యం చిత్తవృత్తి నిరోధం - అంటే, మనసు తాలూకు ఆందోళనలను తొలగించడం అని అర్థం. ధ్యానయోగికి విధించిన యమ నియమాలను అనుసరించినప్పుడూ, ఆసనాలనూ ప్రాణాయామాన్నీ, బంధాలనూ, ముద్రల్నీ, క్రియనూ అభ్యసించినప్పుడూ మనస్సు నిశ్చలమై సమాధి స్థితిలోకి ప్రవేశిస్తుంది.

"చాలా రకాలైన సమాధులున్నాయి. సమాధి అనేది మౌలికమైన అవసరం. ఆ తరవాత, ఔపనిషదిక తత్త్వాలను ఆకళించుకున్న మనస్సు ఉచ్చతర చైతన్య స్థాయిల్లోకి ప్రవేశించి అన్ని ఇతర ఆశ్రయాల నుంచీ, నిబంధనల నుంచీ విడివడి స్వతంత్ర మవుతుంది. ఈ స్వాతంత్ర్య స్థితే, ఈ కైవల్యమే యోగం తాలూకు ఆత్యంతిక ధ్యేయం"

"కానీ బాబాజీ సర్వవ్యాపిత్వమూ, సర్వశక్తిత్వము, సర్వజ్ఞత్వమూ అనే లోకాతీత యోగసిద్ధుల మాటేమిటి?" అని నేనడిగాను.

---

1 ఈ పై ఉపనిషత్తుల గురించిన పూర్తి పర్యాలోచన కోసం శ్రీ ఎమ్. గారి "విజ్‌డమ్ ఆఫ్ ద ఋషీస్" ను చూడండి.

బాబాజీ గట్టిగా నవ్వి ఇలా అన్నారు: "ప్రతివాడికీ యోగశక్తులంటేనే ఇష్టం 'యోగశక్తులను ఏ విధంగా పెంపొందించుకోవాలి?' అనే దానితో పోలిన శీర్షిక ఉన్న ఏ పుస్తకమైనా వేడివేడి ఇడ్లీల్లాగ (క్షణంలో) అమ్ముడైపోతుంది. యోగశక్తులున్నా యన్న మాట నిజమే కాని అవి చాలా అరుదు. అద్భుతాలుగా చెలామణీ అయ్యే చాలా ప్రదర్శనలు వట్టి గారడీ పన్నుగడలే.[1] యోగాభ్యాస ప్రక్రియలో మనస్సు ఎంత ఏకాగ్రమవుతుందంటే, సామాన్యుడు ఏళ్ళ తరబడిగా సాధన ఫలితాన్ని పొందే, దానిమీదనే మనస్సును లగ్నం చేసే యోగి కొద్ది సమయంలోనే పొందవచ్చు. ఈ మాట (అక్షరాలా) నిజమే.

"అదీగాక, యోగి మనస్సు స్థిరంగానూ ప్రశాంతంగానూ కావడం వల్లా, స్వార్థం నుంచి చాలావరకూ విడమర కలగడం వల్లా, ఇతర మనస్సులతో సంబంధమేర్పడు తుంది – దానితో ఇతరుల మనస్సుల్లో జరిగే దానిని యోగే కాదు, యోగారంభకుడు కూడా తెలుసుకోవచ్చు. నిజానికి ఒకే మనస్సు ఉంది. ఇది సైద్ధాంతికంగా కాకుండా యథార్థంగా అర్థం చేసుకున్న యోగి తాలూకు ఆలోచనలూ క్రియలూ, మనస్సులను ఇంకా విభక్తంగా చూసే వాళ్ళకు అసాధారణంగానూ, అద్భుతంగానూ కనిపిస్తాయి.

"కానీ ఇది మాత్రం నిజం – స్త్రీ పురుషుల భౌతిక సంయోగం వల్ల పుట్టిన స్త్రీ గానీ పురుషుడు గానీ, ఆవిడ గానీ అతను గానీ ఎంతెంతగా పురోగమించినా కూడా ఎప్పటికీ సర్వజ్ఞత్వాన్ని గానీ, సర్వశక్తిమత్తతను గానీ, సర్వవ్యాప్తిత్వాన్ని గానీ పొందడం జరగదు. పుట్టిన ప్రతి శరీరమూ యుక్తాహారం, యోగోపాయాల ద్వారా పొందే పునర్యౌవనంతోనూ ఎంత దీర్ఘంగా జీవించినా కూడా చనిపోవలసినదే. చాలా వందల ఏళ్ళ నుంచి జీవించి ఉన్న మా గురువైన శ్రీగురు బాబాజీ కూడా చివరికి చనిపోవలసినదే. నేనూ ఏదో ఒక రోజున మరణిస్తాను.

"సామాన్యుడు అద్భుతాలుగా చెప్పుకొనేవి, అతను ఇంతదాకా అర్థం చేసుకోనివీ ఇంతవరకూ కనుక్కోనివీ అయిన కొన్ని ప్రాకృతిక సూత్రాల పర్యవసానాలే. ఈ సూత్రాల్లో కొన్నిటినెరిగిన యోగికి వాటిని పని చేసేలా చేయడం కూడా చేతనవుతుంది".

ఆ తరవాత నేను ఆయనను నాథుల గురించి అడిగాను.

"బాబాజీ, మీరొకసారి నాకు నాథ సంప్రదాయం వాళ్ళని చెప్పారు. దాన్ని గురించి నాకు కొంచెం చెబుతారా?"

---

1 జేమ్సు టాల్బట్ రాసిన "హౌ టు లెవిటేట్ అండ్ అదర్ గ్రేట్ సీక్రెట్స్ ఆఫ్ మేజిక్"ను చూడండి.

"అం కొంత చెబుతాను ఇప్పుడు. తరవాత తరవాత నీకింకా ఎక్కువగా తెలుస్తుంది. ఆదినాథుడుగా చెప్పబడే శివమహాదేవుడు స్థాపించిన పురాతన వర్గీయులే నాథులంటే. ఆయన తరవాతి బోధకుడు మహా మత్స్యేంద్రనాథుడు. ఆయన ప్రసిద్ధుడైన గోరఖ్‌నాథుడి గురువు. నాథ సంప్రదాయంలో బాలక్‌నాథ్‌గా వ్యవహృతుడయ్యే యోగి మరెవరో కాదు, మా గురువులు శ్రీగురు బాబాజీయే. ఆయన ఎప్పుడూ కౌమారంలోనే ఉన్నట్టుంటారు కాబట్టి ఆయనకా పేరు వచ్చింది. గతంలో కూడా ఆయనే నాకు గురువు.

"నాథులు సాటిలేని యోగులు. గోరక్షాశతకం, ఘేరండసంహిత, హఠయోగ ప్రదీపిక మొదలైన ప్రముఖ యోగ గ్రంథాలనన్నిటినీ నాథయోగులే రాశారు. వాళ్ళు ఆసనాలనూ, ప్రాణాయామాన్నీ, క్రియాయోగాన్నీ, బంధాలనూ, ముద్రలనూ అభ్యసించి నిర్దుష్టంగా చేశారు. వాళ్ళు సామాన్యంగా సంచార యోగులు; సాధారణంగా వాళ్ళను "కాన్‌ఫటా"లు, అంటే, విద్ధకర్ణులని పిలుస్తారు – ఎందుకంటే, నాకున్నట్టుగా వాళ్ళందరూ కర్ణోపాస్థి నరాలకు రంధ్రాలు చేసి పెద్దపెద్ద చెవిపోగులు ధరిస్తారు కనుక.

బాబాజీ తన చెవి పోగుల్ని పరీక్షించడానికి నాకు అవకాశాన్నిచ్చారు. "బాబాజీ! నా సంగతేమిటి? నా ఉపాస్థిని ఎప్పుడు పొడిపిస్తారు?" అని అడిగాను.

"నీ చెవుల ఉపాస్థులకు కన్నాలక్కర్లేదు, నువ్వు తిరిగి లోకంలోకి వెళ్ళి మామూలు మనిషిగా బతకాలి కనుక. కానీ ఉపాస్థికి బదులు నీ చెవితమ్మెలను నేను పొడుస్తాను. నువ్వు నా దగ్గరున్నంతవరకూ రాగి చెవిపోగుల్ని ధరిద్దువు గాని. తర్వాత నువ్వు మైదాన ప్రాంతాలకు పోయేటప్పుడు వాటిని తీసేద్దువు గాని. ఆ కన్నాలు కొంత కాలానికి పూడుకుపోతాయి.

"అదీగాక, నాథులు ఎక్కడున్నా సరే ధునులను వెలిగిస్తారు. షిరిడీలో సాయినాథుడు ధునిని అవిచ్ఛిన్నంగా ప్రజ్వలింపజేశాడు; ఇప్పటికీ అది అలాగే ఉంది. నీకు ప్రత్యేకమైన అనుమతినివ్వడం జరిగింది. నీ పనితీరు అటువంటిది కనక నువ్వు ధునిని అస్తమానూ వెలిగించి ఉంచక్కర్లేదు. నీ కిష్టమైనప్పుడూ విశేష సందర్భాల్లోనూ నువ్వు ధునిని వెలిగించవచ్చు." అని బాబాజీ చెప్పారు.

"బాబాజీ! మీరు నాకు వెచ్చని క్రియాప్రాణాయామమూ, చల్లని క్రియాప్రాణా యామమూ చెప్పారు. క్రియాయోగం గురించి మరికొంత వివరించండి"

"దాన్ని తరవాత టిబెట్టులోని తోలింగ్ మఠం మీదుగా కైలాస్‌కి కాలినడకన వెళ్ళే మన తొలి యాత్రామార్గంలో చెబుతాను. అక్కడే నీ చెవితమ్మెలను పొడిచి రాగి చెవిపోగుల్ని ఇస్తాను. నువ్వు టిబెట్టుకీ తోలింగ్ మఠానికీ వెళ్ళడానికి ఆతురతతో లేవా?" అన్నారు బాబాజీ.

నా మనస్సును చదివే ఆయన సామర్థ్యానికి ఆశ్చర్యపోయాను. టిబెట్టీయ వృద్ధ జోగి, తోలింగ్ మఠం గురించి చెప్పిన దగ్గర్నుంచీ మనం కలిసి అక్కడకు ప్రయాణం చేద్దామని బాబాజీని అడుగుదామని అనుకున్నాను గానీ ఏదో ఆ కారణానికనో ఈ కారణానికనో వాయిదా వేస్తూనే వచ్చాను. "అది చాలా గొప్పగా ఉంటుంది బాబాజీ!; కైలాసం, మహాయోగి శివుడి సంస్థానం" అని ఆవేశంతో కోలాహలంగా అరిచాను.

"తోలింగ్ మఠానికి సరే కాని, కైలాసం గురించి తరవాత చూద్దాం. ఇప్పుడు మధ్యాహ్న భోజనాన్ని సిద్ధం చేయాల్సిన సమయమయింది. ధునికోసం కొంత వంట చెరకును తీసుకొని రా. ఒకసారే అత్యధికంగా చదవడం, ఒకేసారి ఎక్కువ తిండి తినడంలాగ ఉంటుంది. సరిగ్గా అరగదు. ఓం శాన్తిఃశాన్తిఃశాన్తిః". దానితో ఆ సమావేశం ముగిసింది.

# ౨౫. తోలింగ్ మఠమూ, గిరిమానిసీ

ఒక సాయంత్రం బాబాజీ "మధూ! ఎల్లుండి మనం పశ్చిమ టిబెట్టులో ఉన్న తోలింగ్ మఠానికి వెళ్తున్నాం" అని చెప్పగానే నేను చాలా ఉత్తేజితుడినయ్యాను. ఇది బాబాజీతో నేను చేసే తొలియాత్ర అవుతుంది.

మర్నాడు పొద్దున్న రావల్జీని కలవడానికి మేము వెళ్ళాం. నన్ను బాబాజీతో ఉండడం చూసి రావల్జీ గారి స్పందన ఎలా ఉంటుందో అనుకున్నాను. కానీ అంతకన్నా ఎక్కువ ఆశ్చర్యమే నా కోసం కాచుకొని ఉంది. రావల్జీ బాబాజీని చూడగానే లేచి నిలుచొని జోడించిన చేతులతో అభివాదనం చేస్తూ "నమస్తే. రండి స్వామీజీ" అని మలయాళంలో అన్నారు. తరవాత వాళ్ళ సంభాషణ ఉత్తర ట్రావన్కోర్ తాలూకు స్వచ్ఛమైన మలయాళంలో కొనసాగింది. నా చెవులను నేను నమ్మలేకపోయాను. బాబాజీ ఒక మలయాళీ కన్నా కాశ్మీరీలాగ కనిపిస్తారు. ఆయన ఎప్పుడూ నాతో మలయాళంలో మాట్లాడలేదు. అప్పుడు నేననుకున్నాను ఆయన కూడ కేరళీయుడే మోనని. ఇంతవరకూ ఏమేమి జరిగినా, నిజానికి నేను ఆయనను మొదట చూసింది త్రివేంద్రంలోనే కదా!

"నేనీ యువకుణ్ణి తీర్థస్థలాల్లో నిండుగా ఉండే దగాకోరు గురువుల గురించి హెచ్చరించాను. వెనక్కి తిరిగి వెళ్ళి ఏదైనా ఉపయోగకరమైన పని చేసుకోమని సలహా ఇచ్చాను. అదృష్టమే అతను మిమ్మల్ని కనుక్కోడం; లేకపోతే, స్వామీ! మీరే అతన్ని కనుక్కున్నారా?" అని రావల్జీ అన్నారు.

"మాకొక పురాతనమైన సంబంధం ఉందిలే. అయినా నువ్వు అతనితో అలాగ మాట్లాడడం నాకు సంతోషమే. రేపు పొద్దున్న, మేము తోలింగ్ మఠానికి వెళ్తున్నాం. దానికి నీ సాయం కొంత కావాలి" అని బాబాజీ అన్నారు.

రావల్జీ "చిత్తం" అని అన్నారు.

వ్యాసగుహలో రాత్రి గడిపి, తెల్లారుతూనే మనా కనుమల వైపుకు బయలు దేరాం. ఫతే బహదూర్ అనే నేపాలీవాడు ఒకడు వంటవాడిగానూ కూలివాడుగానూ పని చేయడానికి మాతో వచ్చాడు. అతను దృఢమైనవాడు, నాకన్నా కొంచెం పెద్దవాడు. టిబెట్టీయుడైన మనా గ్రామపు పెద్ద మాకొక పొట్టి జాతి గుర్రాన్ని సమకూర్చాడు. ముగ్గురికి సరిపోయే ఒక గుడారాన్నీ, వెచ్చదనాన్ని చేకూర్చే బట్టలనూ, సరుకులనూ, ఒక గేస్ స్టౌవ్‌నూ, కొన్ని గిన్నెలున్న సంచుల్నీప్రయాణానికి అవసరమైన అన్ని ఇతర వస్తువుల్నీ ఆ గుర్రం మోస్తూ వచ్చింది. ఆ గుడారం ఒక మార్వాడి వ్యాపారస్థుడు ఇచ్చినది. రావల్జీ దయతో ఇచ్చిన కొంత డబ్బును నేను తీసుకొని బయల్దేరాను.

దళసరిగా ఉన్న కాశ్మీరీ ఉన్ని అంగీని తొడుక్కొని గొఱ్ఱెతోలు టోపీని, మేజోళ్ళను, గొఱ్ఱెతోలు పాదరక్షల్నీ వేసుకొన్నాను నేను. ఎప్పటిలాగానే బాబాజీ తమ శరీరం చుట్టూ చుట్టబెట్టుకున్న నూలుదుప్పటీ, లేడి వన్నెలో ఉన్న కిత్తనార గుడ్డతో (Canvas) చేసిన బూట్లూ తప్ప ఇంకేమీ వేసుకోలేదు.ఫతే బహదూర్ ఏదో ఒక దళసరి బొచ్చు పదార్థంతో చేసిన కోటునీ దళసరి చర్మంతో చేసిన బూట్లనీ వేసుకున్నాడు. మునుపు భారతీయ వ్యాపారుల్నీ టిబిట్టీయ వాణిజ్యకారుల్నీ అనుసరించి తోడుగా వెళ్ళాడు కనక తనకు ఆ దారి తెలుసునని అతను చెప్పాడు. ఈ విషయంలో పెద్ద ఆందోళన పడాల్సినదేమీ లేదు; తానే చాలాసార్లు ఆ దారిలో ప్రయాణించానని బాబాజీ అన్నారు.

మేము బయల్దేరగానే, కైలాసానికి చేరడానికి ఎంతసేపు పడుతుందని నేను బాబాజీని అడిగాను. శ్రీరాముడూ పాండవులూ శుకదేవుడితో సహా చాలామంది మహాఋషులూ కైలాసానికి వెళ్ళడానికి అనుసరించిన పురాతన మార్గమే ఇది అని నాకు చెప్పారు. "మొదట మనం తోలింగ్ మఠానికి చేరదాం. ఆపైన కైలాసానికి వెళ్ళడాన్ని నిశ్చయించుకుందాం," అని బాబాజీ అన్నారు. ఇదే అమంగళ సూచకమైంది. నేను విపరీతంగా జబ్బు పడటం వల్ల మేము తోలింగ్ మఠం నుంచి తిరిగి వెనక్కి రావలసి వచ్చింది. కైలాసాన్ని దర్శించాలనే నా కోరిక తీరడానికి నాకు నలభై ఏళ్ళు పట్టింది. నా వయస్సు అరవై దాటిన తరవాత, ఏభై ఏడుగురున్న ఒక మిత్రబృందంతో నేను చివరికి కైలాసానికి ప్రయాణం చేశాను. దారి మాత్రం వేరు – మేము ఖాట్మండునుంచి ప్రయాణించాం.

అలకనందా సరస్వతుల సంగమం అయిన కేశవప్రయాగనుంచి మేము సరస్వతీ తీరం మీదుగా ఉత్తరానికి ప్రయాణం చేశాం. ఆ దారి చాలా కష్టమైనది; విపరీతంగా చలిగా ఉంది. రోజుకి పది కిలోమీటర్ల కన్నా ఎక్కువ నడవలేకపోయే వాళ్ళం. అన్నానికి ఏ సమస్యా లేదు – మా నేపాలీ పోర్టర్ ఫతే బహదూర్ తన గేస్ స్టౌ మీద చపాతీలు చేసి బంగాళాదుంపలు వండేవాడు. నానబోసిన గుప్పెడు సెనగ గింజలూ, బెల్లమూ మా శక్తిస్థాయిలను బాగానే ఉంచేవి. మేము పైపైకి ఎక్కుతూంటే, బాబాజీ చెప్పిన ప్రత్యేక ప్రాణాయామం, గాలిలో ప్రాణవాయువు (Oxygen) కొరతను ఎదిరించి పోరాడడంలో సాయం చేసింది. రాత్రిపూట మేము ముగ్గురం చక్కగా విశాలంగా ఉన్న గుడారంలో నిద్రపోయేవాళ్ళం.

మార్గం మాత్రం మహా గడ్డుదే. వ్యాస గుహ తరవాత రోడ్డనేదే లేదని చెప్పాలి. మేము బండల మీదుగానూ మంచు దిబ్బల మీదుగానూ ప్రయాణం సాగించవలసి



మా అమ్మమ్మగారు



పూజ్యులైన తల్లిదండ్రి

❋ ఒక హిమగిరి గురువర్యులకు శిష్యురైన



నా సోదరీమణులు

నా బాల్య దశ - 6వ సంవత్సరం





నా 3వ సంవత్సరం



జీవశాస్త్ర పితామహుడగు ఆరిస్టాటిల్ యొక్క గ్రంథం చదివే నా 16వ యేట.



14 వత్సరాలు గడిపిన నా చిన్ననాటి వ్యాంచియూర్‌లోని నివాస గృహం



పద్మనాభ స్వామి ఆలయం మరియు పవిత్ర తీర్థం



థైకాడ్‌లోని నా పాఠశాల - ప్రభుత్వ మోడల్ ఉన్నత పాఠశాల



పీర్ మహ్మద్ సాహిబ్ సమాధి - టకాలే



వివాహానికి పూర్వం నా భార్య సునందతో



నా కుటుంబ సభ్యులు రోషన్, ఎమ్. సునంద ఆయేషా - తుంగనాథ్‌లో



సునంద యొక్క తల్లిదండ్రులు, సోదరుడు మరియు మా పిల్లలు



బద్రీనాథ్ మందిరం



కేదార్‌నాథ్ మందిరం



శ్రీ గోపాల స్వామి



శ్రీ కలాడి మస్తాన్



స్వామి పుంతురా



శ్రీ నారాయణ గారు



స్వామి అభేదానంద



శిరిడి సాయి



శ్రీ ఛట్టాంబి స్వామి



గణేష్‌పూరిలో యువకుడైన
అవధూత నిత్యానంద



కన్యాకుమారిలో సన్యాసిని 'మాయి మా'



శ్రీ రామకృష్ణ పరమహంస



దేశ సంచారంలో స్వామి వివేకానంద



రమణ మహర్షి యొక్క
మంచి స్నేహితుడు



గురు బాబాజీ యొక్క శిష్యుడగు
యోగిరాజ శ్రీ శ్యామచరణ లాహిరీ



రామకృష్ణ మఠాధిపతియగు స్వామి
తపస్యానంద



నీమ్ కరోలీ బాబా - క్రైంచీ ఆల్‌మోరాలో



శ్రీ జిద్దు కృష్ణమూర్తి



ఋషీకేశ్‌లోని డివైన్ లైఫ్ సొసైటీ
యందు స్వామి చిదానంద



సైనా స్వామి



స్వామి పురుషోత్తమానంద



కేదార్ ప్రాంతంలోని మంచు పర్వతాలు



వశిష్ఠ గుహ దగ్గర కల అరుంధతి గుహ



కన్యాకుమారి దగ్గర గల మరుత్తువమలై గుహ



చిర్‌బాస దగ్గర పారే పవిత్ర గంగానది



బద్రీనాథ్ ఆలయం వెనక ప్రాంతమైన చరణ్ పాదుకా



పవిత్ర గంగానది జన్మస్థలమగు గోముఖ్



మాయి మా నివసించిన సముద్రతీరం - కన్యాకుమారి



ఋషీకేష్‌లో అర్ధమత్స్యేంద్రాసన్‌లో



ప్రకృతి శోభతో గంగానది ప్రవాహం - ఋషీకేశ్



యు.ఎస్.ఏ.లో మొట్టమొదటిసారిగా అడుగిడిన గ్రాండ్ క్యాన్‌యన్



జర్మనీ స్నేహితుడి కొరకు వేస్తున్న చిత్రం



జర్మనీలోని ఫ్రీబర్గ్‌లో కాథిడ్రల్ లోని టీ కొట్టుయందు


భగీరథీ పర్వత శిఖరాలు


గంగోత్రిలోని సూర్యకుండ్ వద్ద
గల ప్రవహించే గంగానది


బద్రీనాథ్‌లోని వ్యాసగుహ దగ్గర సత్సంగ్ ఎడమవైపు ప్రదీప్
కుడివైపు విరాజ్ మరియు బాలాజీ



రాయల్‌పాడ్‌లోని నీల్‌బాగ్ పాఠశాల



త్రివేంద్రంలో నా ప్రియమైన తోటి విద్యార్థులు - ఎడమవైపు రంజీత్, సదాశివన్
కుడివైపు డా॥ నారాయణ ప్రసాద్



పూర్వ పరిచయస్థులు - వివేకమహేంద్రు ఢిల్లీ నుండి



నా ప్రియమైన స్నేహితులు రామస్వామి పిళ్ళై మరియు న్యూరాలజిస్ట్ మార్తాండ పిళ్ళై



జర్మనీలోని అచన్‌లో హాన్స్ కేలీ చావెస్త్



యు.ఎస్.లో స్నేహితుడగు
జెర్రి జోన్స్‌తో



డా॥ వి.ఎస్. రామచంద్రన్,
న్యూరాలజిస్ట్ మరియు సీతారామ్
నాయుడు స్నేహితులతో



భారతీయ విద్యాభవన్‌లో
ఉపన్యాసం - బెంగళూర్



యు.ఎస్.ఎ. - పోర్ట్‌ల్యాండ్‌లో ఉపన్యాసం



యునైటెడ్ నేషన్స్‌లోని మతాధిపతుల సమ్మేళన సభలో - మర్ థోమ సిరియాన్ చర్చ్ - జోసఫ్ మర్ ఇరనీయస్, ప్రస్తుత జోసఫ్ మర్ థోమతో



బ్రహ్మకుమారీ అధ్యక్షురాలితో - యునైటెడ్ నేషన్స్



మాజీ భారత అధ్యక్షుడగు అబ్దుల్ కలామ్, నేను, సునంద, న్యాయమూర్తి వెంకటచాలయ్య మరియు డా॥ అజయ్‌కుమార్ సింగ్ సాదామ్‌లోని పీపుల్ గ్రోవ్ పాఠశాల



ప్రారంభ దశలో సత్సంగ్ విద్యార్థులతో



స్వగృహంలో స్నేహితులతో - మదినపల్లెలో. (ఎడమ దా॥ విజయనారాయణ రెడ్డి, మోహన్ కుమార్, సూర్యడియో, జ్యోతి నారంగ్, కిరణ్ రెడ్డి, శోభరెడ్డి మరియు ప్రభారెడ్డి)



సత్సంగ్ విద్యాలయ విద్యార్థులతో మరియు ప్రధానోపాధ్యాయిని



కైలాసయాత్ర - యమద్వారం - (కైలాస పర్వత ప్రదక్షిణ యొక్క ముఖ ద్వారం)



పీపల్ గ్రూ
పాఠశాల వెరుక్
దగ్గర - సాదక్



ద్విగ్విజయ యాత్రా సమయం - పీపల్ గ్రూప్ పాఠశాల - సాదమ్
(ఎడమ నుండి కుడి అజయ్ కైజర్, గీత, రాధిక, శోభ, అంజలి, అభిజిత్, శ్రీధర్)



కైలాసయాత్ర : గురుపూర్ణిమ రోజు - ప్రయాగ



కైలాస యాత్ర : కార్మ్యుప్త బౌద్ధ మఠం - హర్ర్యు

అమృత్‌సర్ - స్వర్ణ దేవాలయం





పవిత్ర కైలాస పర్వత అద్భుత దృశ్యం



సిక్కు రూపంలో దర్శనమిచ్చిన బాబాజీ - తాజ్‌మహల్ ముంబాయి



ట్రావన్‌కోర్ ప్రాంత నివాసియగ్ మార్తాండ వర్మ ఆశీస్సులతో చర్చా కార్యక్రమం - త్రివేంద్రం



డా॥ కరణ్‌సింగ్ నివాసంలో



శ్రీకృష్ణదాస్ గారితో



సంత్ మహాత్ములతో - పూర్ణ కుంభమేళ - హరిద్వార్



నా నివాసగృహంలోని ధ్యానమందిరం - మదనపల్లి



ప్రియ స్నేహితులగు క్యాత్యాయిని రతన్ మరియు దీపక్ రతన్



ఫెడిరికో గ్రంథి ప్రారంభోత్సవం - జ్యువల్, లోటస్‌లోని స్పానిష్‌లో బ్యూనోస్ ఎరీస్ అర్జెంటీన్

వచ్చేది. మేము సరస్వతీనదిని అనుసరించాం అంతే. మా చుట్టూ మంచు కప్పిన పర్వతాలు నిలుచొని ఉన్నాయి. మేము దాటవలసి వచ్చిన సరస్వతి తాలూకు ఉపనదుల్లో చాలామటుక్కు గడ్డకట్టినంత చల్లగా ఉన్నాయి. మేము చాలా కష్టంతో వాటిని దాటగలిగేం. బదరీనాథ్ నుంచి దాదాపు ఏభై కిలోమీటర్లు దాటిన తరవాత ప్రకృతి దృశ్యం కఠినమైపోయింది. దారి మంచుతో కప్పుడిపోయి ఉంది; బాగా జారుడుగా ఉంది. కొన్నిచోట్ల పారతో (Shovel) ఫతే బహదూర్ మంచును తొలగించి దారిని బాగు చేయవలసి వచ్చింది.

మేము సముద్రమట్టానికి 18,000 అడుగుల ఎత్తునున్న మనా కనుమలకు నడుస్తున్నాం. అది మామూలుగా నిష్ణాతులైన పర్వతాధిరోహకులు ప్రయత్నించే కార్యం. పురాతన కాలాల నుంచి ప్రసిద్ధికెక్కిన ఈ కనుమ మెరుగుపెట్టిన స్వచ్ఛమైన వెండిలాగ మిరుమిట్లు గొల్పుతూ మా ముందు నిలుచొని ఉంది. ముదురు నీల పర్వత మొకటి త్వరలో కనిపించింది. పూర్వం ఒకానొకప్పుడు ఈ నీలపర్వతం మీద మహర్షి కాకభుషుండి ఉండేవాడని బాబాజీ చెప్పారు.

పదకొండో రాత్రికి మనా కనుమకు కిందుగా సుమారు పన్నెండు కిలోమీటర్లు దూరంలో మేము గుడారం వేశాం. ఫతే బహదూర్ గుడారం అవతల ప్రవేశద్వారం దగ్గర చిన్న ధునిని వెలిగించాడు, నేను చిన్నగా సహకరించాను. బాబాజీ తన కుడిచేతితో దానిచుట్టూ ఒక సంరక్షక వర్తులాన్ని గీశారు. దానితో అవతల చల్లగాలులు వీస్తూన్నా కొన్ని గంటలపాటు అది (ఆ ధుని) వెలుగుతూనే ఉంది. ఆ రాత్రి నిస్త్రాణగా నిద్రలోకి కూరుకుపోబోయే ముందు నేను బాబాజీని మీరు కేరళీయులా అని అడిగాను.

“అబ్బే, కాదు. కానీ నేను కేరళలో బాగా తిరిగాను. త్రివేంద్రంలో నీతో పరిచయాన్ని తిరిగి ఏర్పరుచుకోవడం కోసం వచ్చిన ఆ సమయంలో నేను త్రివేంద్రం సముద్రతీరం దగ్గరగా ఉన్న అగస్త్యకూటం నుంచి తిరిగి వెళ్తున్నాను. అప్పుడు గురువాయూరూ, శబరిమలై కూడా వెళ్ళాను...”

“బాబాజీ! అది నా ప్రశ్నకు సమాధానం కాదు. రావల్జీతో మీరు స్థానికుడిలాగే మలయాళం మాట్లాడారు. కానీ మీరెప్పుడూ నాతో ఒక్క ముక్క కూడా ఆ భాషలో మాట్లాడలేదు” అని నేను (ప్రశ్నించినట్లు) అన్నాను.

బాబాజీ నవ్వుతూ అన్నారు: “నువ్వేమనుకుంటున్నావో నాకు తెలుసు: ‘బాబాజీ సర్వజ్ఞుడై ఉండాలి. ఆయనకు ప్రతీదీ తెలుసును’ అని. భౌతికమైన మెదడు ఉన్న ఏ మనిషీ సర్వజ్ఞుడు కాలేడన్నది సత్యం. ఒకటి మాత్రం జరుగుతుంది – కావలసినప్పుడు

ఎవరి మనస్సుతోనైనా శ్రుతి చేసుకొనే సామర్థ్యాన్ని సంపాదించుకోవచ్చు; ఆ మనస్సు సంపాదించిన జ్ఞానాన్ని తాత్కాలికంగా ఉపయోగిస్తూ కొన్ని పనులను సాధించవచ్చు. నేను మలయాళం మాట్లాడడం దానికి నిరూపణమే.

"ఇప్పుడు నువ్వు నిద్రపోవాలి. రేపు చాలా కష్టమైన ప్రయాణముంది మనకు. నీ మణిపూర చక్రంలో 'రం' బీజాక్షరంతోనూ, ప్రత్యేకమైన తుమ్మో ప్రాణాయామం తోనూ అగ్నిని ఆవాహనం చెయ్యి. చురుకుగా నాభిక్రియ చెయ్యి. కావలసినంత వేడి పుడుతుంది". బాబాజీ నా పక్కన కూర్చొని ఉండగా నేను నిద్రపోయాను.

మర్నాటి పొద్దున్న కనుమ శిఖరానికి ఎక్కడం ప్రారంభించాం. ఆ మొత్తం దృశ్యమంతా మంచు దిబ్బలూ, మంచుతో కప్పడిన రాళ్ళూను. నాకు భయంకరమైన తలనొప్పీ, వాంతీ వికారమూ వచ్చాయి. ప్రాణవాయువు కొరత వల్లనే ఇది వచ్చిందని బాబాజీ వివరించారు. బాగా అనుభవజ్ఞుడైన నేపాలీ పోర్టర్ ఫతే బహదూర్ కూడా తీవ్రమైన తలనొప్పి వస్తోందని చెప్పాడు. శ్వాసశ్వాసాభ్యాసం చెయ్యమని బాబాజీ మాకు సలహా ఇచ్చారు – అంటే కుక్కలాగ నాలుకను బయటకు వేలాడదీస్తూ ఊపిరిని తీసుకొని వదలడం చేయమని చెప్పారు. త్వరగానే సుందరమైన నీల పర్వతాన్ని దాటేశాం. మరికొన్ని గంటల్లో మేము మనా కనుమ శిఖరాన ఉన్నాం. మా పక్కన దేవసరస్సనే గడ్డకట్టిన సరస్సు ఉంది. బాబాజీ మమ్మల్ని కొన్ని నిముషాలు కూర్చొని ధ్యానం చెయ్యమని చెప్పారు.

నాకు ఆ దృశ్యం దివ్యంగా కనిపించింది – వైభవోపేతమైన హిమాచల (కదలని మంచుకొండ) హిమపరివేష్టిత శిఖరాలు చుట్టుముట్టి ఉండగా ఉజ్వలుడైన యోగేశ్వరుడు స్థిరంగానూ నిటారుగానూ పద్మాసనంలో కూర్చొని ఉన్నట్టుంది ఆ దృశ్యం. నేను కళ్ళు ముకుళించి నా సమ్ముఖాన ఆసీనుడై ఉన్న భగవత్సమానుడైన ఆ మూర్తిని ధ్యానించాను. నా యీ భౌతిక నేత్రాలతో మరి ఏ ఇతర దేవుణ్ణి చూశాను కనక?

ఏదో ఒక వింత అప్పుడు జరిగింది. తలనొప్పి మటుమాయమయింది. నా అంతరాత్మలోకి ఒక ప్రశాంత స్థితిని తీసుకు వచ్చినట్టయింది. తీవ్రమైన చల్లదనం ఉపశమనం కలిగించే వెచ్చదనంగా మారింది. ఆ క్షణంలో మేము, నేనూ బాబాజీ, ఇద్దరం కాము, ఒకటే ఆత్మ అన్న భావన అన్పట్టనిపించింది. నేను తేలిపోతున్నట్టుగా ఉన్నాను. కళ్ళు తెరిచి నిజంగా నేను గాలిలో తేలుతున్నానా అని చూసుకున్నాను. నేను తేలిపోవట్లేదని గ్రహించాను; కానీ ఆ పాటికే ఆ గాఢ ధ్యానస్థితి అదృశ్యమయి

పోయింది. బాబాజీ నవ్వుతూ అన్నారు - "ఇప్పటికిది చాలు. అబ్బాయీ, తొందర పనికిరాదు" అని. ఫతే బహదూర్ "ఛోటా జోగీ" (చిన్న యోగి) అని అంటూ నవ్వేడు.

అప్పుడు మేము (కనుమ) రెండోవైపుకు దిగడం మొదలుపెట్టాం. అక్కడ భారత సరిహద్దు అంతమై టిబెట్టు ప్రారంభమవుతుంది. అంతా శీతలతరంగా అవుతోంది. చుట్టూ అంతటా మంచే మంచు. సాయంత్రానికి మేము ముగ్గురమూ, గుర్రమూను టిబెట్‌లోని సమతల భూ ప్రాంతానికి చేరుకున్నాం. అక్కడి నేల ఎర్రగా ఉంది. ఇక మేము మంచు పెళ్ళల మీదగానీ మంచుమీద గానీ నడవక్కర్లేకపోయింది. ఆ రాత్రి ఒక చిన్న పచ్చికబయల్లో మా గుడారం వేసుకున్నాం. కొత్తవాళ్ళను చూసి నదురూబెదురూ లేకుండా అడవి గుర్రాలు దగ్గర్లోనే మేస్తున్నాయి.

చాలా రోజుల తరవాత, ఒక ధునిని వెలిగించడం జరిగింది. దాదాపు ఒక గంటపాటు ధ్యానం చేసిన తరవాత ఫతే బహదూర్ చేసిన చపాతీ, బంగాళాదుంపల కూరతో చక్కటి భోజనాన్ని ఆరగించాం. చేరువనే ఉన్న వాగునుంచి నీళ్ళు తెచ్చాడు అతను. కొద్దిసేపట్లోనే మేము నల్లటి టీ (Black Tea) తాగుతూ ఉల్లాసంగా మాటామంతీ చెప్పుకున్నాం. ఆ రాత్రి నక్షత్రాల కాంతితో వెలిగిపోయింది. సమీపంనుంచే వస్తూన్న భీకరమైన గుర్రుగుర్రు శబ్దాలతో నేను ఉలిక్కిపడి లేచాను. "నిద్ర పో. అది అడవి గుర్రాలను వేటాడుతున్న మంచు చిరుతపులి. నీకేం భయం లేదు" అని బాబాజీ అన్నారు. గుర్రాలు దీనంగా సకిలించి ఆ మీద సద్దుమణిగాయి. మంచు చిరుత తన తిండిని తింటూ చేస్తూన్న సంతుష్టికరమైన గురకలను విన్నాం మేము. మళ్ళీ నిద్రపోయాను నేను.

మరుసటి రోజు పొద్దున్నే తోలింగ్ మఠానికి బయలుదేరాం. ఆరు రోజుల పాటు ఆనందకరంగా ప్రయాణం చేసిన తరువాత తోలింగ్ మఠానికి చేరుకున్నాం. బద్రీనాథ్ నుంచి ఈ ప్రయాణాన్ని పూర్తి చేయడానికి మాకు ఇరవై ఒక్క రోజు పట్టింది. మా కళ్ళకు అగపడిన తొలి వస్తువు ఒక బ్రహ్మాండమైన బుద్ధవిగ్రహం - దాని శిరస్సు ఆ బౌద్ధమఠమంత ఎత్తుగా ఉంది. మా శిబిరాన్ని చేరువలోనే వేసుకోడానికి వాళ్ళు ఒప్పుకున్నారు.

బాబాజీ ఆ మఠం చుట్టు పక్కల మమ్మల్ని తిప్పారు. దానిలో స్త్రైణ దివ్యశక్తి తాలూకు భయానక దృశ్యమైన భద్రకాళితో సహా చాలా హిందూ దేవతా మూర్తులున్నాయి. ఆ విహారాన్ని కనిపెట్టుకుని ఉండే లామా మాతో ఆ తోలింగ్ మఠమే మౌలికమైన బదరీనాథని వాళ్ళు నమ్ముతారని చెప్పేడు. ఇప్పటి బదరీనాథ

దేవాలయం కట్టడానికి కారణం చాలా జనానికి తోలింగ్ మఠం అందుబాటులో లేకపోవడమేనట.

ఆ మఠాధిపతీ, పెద్ద లామా అయిన రిన్‌పోచేని (Rinpoche) దర్శించడానికి మమ్మల్ని తీసుకెళ్ళారు. బాబాజీ అంటే రిన్‌పోచే మహా గౌరవం కనబరిచాడు; బాబాజీ కూడా బదులుగా అంత గౌరవాన్నీ చూపించారు. వాళ్ళు టిబెట్ భాషలో మాట్లాడడం ప్రారంభించారు. ఈసారి నాకేమీ ఆశ్చర్యం కలగలేదు. మాటలైన తరవాత రిన్‌పోచే నన్ను దీవించారు. నా నాలుకను ఇవతలకు చాచి నేను ఆయన ముందు మోకరిల్లాను.

ఆ మఠం వసతిలో పదిమంది కన్నా ఎక్కువ సన్యాసులే ఉన్నారు. అక్కడ ఒక పెద్ద వంటిల్లు ఉంది. కానీ బాబాజీ మాత్రం గుడారంలో ఉండడమే నయమను కున్నారు; ఫతే బహదూరు మాకు వండిపెట్టాడు. భోజనం తరవాత, ఆ రాత్రి నాకు సాంప్రదాయికంగా నాథ్‌పంథ్‌ల దీక్షనిస్తానని చెప్పారు బాబాజీ. నేను నా చెవి ఉపాస్థిని పొడుచుకోనక్కర్లేదు. దానికి బదులు హిమాలయాల్లో నేనున్నంత వరకూ రాగి చెవిపోగులను ధరించాలి. నేను తిరిగి బయటి లోకంలోకి వెళ్ళినపుడు వాటిని తీసెయ్యాలి.

ఆ రాత్రి ధుని ముందు కూర్చొని నాథసాంప్రదాయిక గుప్తమంత్ర దీక్షను తీసుకున్నాను. బాబాజీ చాలా నేర్పుగా నా చెవి తమ్మెలను పొడిచారు; నేను రాగి పోగుల్ని పెట్టుకున్నాను. నేనొక యోగిలాగ కనిపించాలన్న నా దొడ్డ కోరిక అప్పుడు తీరింది. బాబాజీ చెప్పారు ఇలాగ: "నాథులమైన మేమందరం ఎక్కడికి వెళ్తే అక్కడ ధునిని వెలిగిస్తాం. కానీ నీ విషయంలో మాత్రం అది వర్తించదు. శివరాత్రి లేక గురుపూర్ణిమ మొదలైన విశిష్ట సమయాల్లో తప్పించి నువ్వు ధునిని పెట్టక్కర్లేదని మా గురువులు ఆజ్ఞాపించారు. కింది భూములకు వెళ్ళినపుడు నువ్వు ప్రత్యేకమైన కార్యాన్ని నిర్వహించాలి. కనక నీ రాగిపోగుల్ని కూడా నువ్వు తీసివేయచ్చు, మామూలు బట్టల్నే కట్టుకోవచ్చు. ఉచ్చతమ చైతన్య స్థాయి మీదనే నీ మనస్సును నిలుపుతూ భూమ్మీద సామాన్య మనిషిలాగే జీవించు. ఇప్పట్నించీ నువ్వొక నాథ్‌వి. మన పరంపరలో నువ్వు మధుకరనాథ్ – 'ఎమ్'గా ప్రసిద్ధుడివవుతావు".

నేను బాబాజీ పాదాల మీద సాగిలపడి నమస్కరించాను. ఫతే బహదూర్ దీర్ఘ ప్రయాణం కారణంగా అలసి నిద్రపోయాడు. మేము అగ్ని సమ్ముఖంగా మాటామంతీ చెప్పుకుంటూ కూర్చున్నాం. తోలింగ్ మఠంలోని బుద్ధుడే మౌలికమైన బద్రీనాథుడనే లామా విశ్వాసం విషయంలో మీరేమనుకుంటారని నేను బాబాజీని అడిగాను. "అసలు సంగతేమిటంటే, పురాతన కాలంలో భారతదేశమంతటా బౌద్ధ సన్యాసులూ బౌద్ధ

దేవాలయాలూ ఉండేవి. బద్రీనాథులోని దివ్యమూర్తి మఠం వేసుకొని కూర్చున్న బుద్ధుడే కావచ్చును. దానినే మహానుభావుడైన శంకరాచార్యులు మఠం వేసుకున్న నారాయణుడిగా మార్చి ఉండవచ్చు. మరెక్కడా నారాయణుడు పద్మాసనంలో ఆసీనుడై ఉండడు. అయినా నిజానికి దీని విలువెంత? బౌద్ధుడుగా గానీ హిందువుగా గానీ ఉండడం కన్నా ముఖ్యతరమైనవి స్వచ్ఛ జీవనమూ, భక్తీను. రిన్‌పోచే ఎంతగా పురోగమించిన ఆధ్యాత్మికుడో నువ్వు గమనించావా? అంచేత మనం ఈ వివాదాల్లోకి పోవద్దు" అని బాబాజీ సమాధానం చెప్పారు.

మర్నాటి పొద్దున్న కొండల్లో చిన్నచిన్న గుడిసెల్లో ఉండే ఖామ్ జిల్లా తాలూకు పొడుగాటి టిబెట్టువాళ్ళను చూశాను. వాళ్ళలో కొంతమంది వృత్తిపరంగా సందేశహరులు: వాళ్ళు గాలిలో తేలిపోవడానికి ఒక కౌశలాన్ని అభ్యసిస్తారు. ఇదే నేను చూసినవాటిలో గాలిలో పైకి లేచిపోయే ప్రక్రియకు (Levitation) బాగా దగ్గరగా ఉన్నది. పోల్‌వాల్ట్‌లో ఉపయోగించే గెడల మాదిరిగా వాళ్ళ దగ్గర పెద్ద పెద్ద కర్రలున్నాయి. వాటిని ఉపయోగించి వాళ్ళు ఎక్కువ దూరాలు ప్రయాణిస్తారు. అలా ప్రయాణిస్తున్నప్పుడు వాళ్ళు రమారమి గాలిలో ఎగురుతూన్నట్టుగా కనిపిస్తారు. వాళ్ళు గెడ తాలూకు ఒక చివర నేలకేసి కొడతారు; ఒక శ్వాసాభ్యాసం చేసి రెండో అంచును పట్టుకొని వాళ్ళు చాలా దూరానికే ఎగిరి గెంతుతారు.

మూడు రోజుల విశ్రాంతి తరవాత, మేము తూర్పువైపుకు నడిచాం – అదే కైలాసానికి దోవ. మూడు రోజుల్లో డాపా గ్రామాన్ని చేరుకున్నాం. అక్కడొక బౌద్ధ చైత్యముంది; ఒక పెద్ద లామావిహారం కూడా ఉంది. చాలామంది సన్యాసులు అక్కడ ఉంటున్నారు. దగ్గర్లో ఒక పెద్ద మార్కెట్టు ఉంది. అక్కడకు టిబెట్టువారితో వాణిజ్యం చేయడానికి భారత వర్తకులు వస్తూ ఉంటారు. అనుకోని దురదృష్ట విషయం ఏదో ఒకటి జరగడం వల్ల మేము డాపాను దాటి ముందుకు వెళ్ళలేకపోయాం. నేను జబ్బు పడ్డాను. ఒక భయంకరమైన జ్వరం నన్ను పట్టుకుంది. దుప్పట్లూ, అగ్ని స్థానానికి దగ్గరగా ఉండడం అనేవి ఉన్నా కూడా నాకు పలు తడవలు వణుకు పుట్టేది; తీవ్రమైన తలనొప్పి నన్ను పీడించింది. నా తలమీద ఎవరో సుత్తితో బాదుతూన్నట్టనిపించింది.

లామాల విహారంలో ఉన్న వైద్యుడు నాకు చాలా చేదైన మూలికల మోతాదు లిచ్చాడు కానీ జ్వరం మాత్రం నన్ను వదలలేదు. ఒక రాత్రి, ఒక్కణ్ణే గుడారంలో ఎక్కువ టెంపరేచర్‌తో అర్ధచైతన్యంతో పడున్నాను. అప్పుడు నాకో బాధపడే కుక్క మూలుగులాటి ఒక చిన్న ఏడుపు మూలుగు వినిపించింది. గుడారం ద్వారం వైపుకు

నా ముఖం తిరిగింది. అక్కడ నాకు గొరిల్లాలాగ కనిపించే పెద్దజీవి తాలూకు నీడ బొమ్మ కనిపించింది. నేను భ్రమపడుతున్నానా అని విస్తుపోయాను. నేను అరుద్దామను కున్నాను కానీ నా నోట్లోంచి ధ్వని ఊడిపడలేదు. నేను భయంతో వణికిపోయాను.

ఆ జీవి నా వైపుకు వస్తూంటే, ఫతే బహదూర్ గుడారంలో పెట్టిన హరికేన్ లాంతరు కాంతిలో నాకు అది, పసుపూ తెలుపూ కలిపిన రంగున్న బొచ్చుతో ఉన్నట్లు తోచింది. మళ్ళీ ఆ విచిత్రమైన మూలుగుడు ధ్వని చేస్తూ నా దగ్గరకు వచ్చి నా నోట్లోకి ఏదో ఒక దానిని అకస్మాత్తుగా కుక్కింది. జ్వరంలో ఉన్నా కూడా, నేను నా నోట్లోకి కుక్కిన ఆ చిక్కటి బంకలాటి పదార్థపు తీపిని చవిచూశాను. తరవాత అది వెనుతిరిగి గుదారంలోంచి పారిపోయింది. బయటనుంచి ఒక కేక వినిపించింది. ఆ మీద ఫతే బహదూర్ గుదారంలోకి పరుగెత్తుకుంటూ వచ్చాడు. రొప్పుతూ అతను అన్నాడు – "పర్వత మానిసి! నువ్వు బావున్నావు కదా". నేను గాఢనిద్రలోకి కొట్టుకుని పోయేముందు "అవును" అనే మాటను మాత్రమే అనగలిగాను.

మరునటి రోజు పొద్దున్నకు ప్రయాణం చేయగలిగినంతగా నాకు నయమయింది. "ఈసారి కైలాసానికి వద్దు. చాలా ఏళ్ళ తరవాత పెద్ద సమూహంతో నువ్వు వెళతావులే. మార్గమధ్యంలో గురుపూర్ణిమా ఉత్సవాన్ని చేసుకుంటారు కూడ. మనం ఇప్పుడు బదరీనాథ్‌కి తిరిగి వెళ్ళడం ప్రారంభించాలి" అని బాబాజీ ప్రకటించారు. ఒప్పుకోదం తప్పించి నాకు వేరే వికల్పం లేదు. మేము వెనకకు బయల్దేరాం. నేను చాలాసేపు అభాగ్యమైన ఆ పొట్టి గుర్రం మీద కూర్చునే ప్రయాణం చేశాను. దారిలో నేను బాబాజీని అడిగాను: "నిన్న రాత్రి నేను చూసినది 'యతి' నా?" అని.

"మనం ఊహాకల్పనల చేయవద్దు. ఏదెలా అయినా, అది (ఆ అనుభవం) నీలోనే ఉంచుకో. చాలామంది 'యతి' ఉందని నమ్మరు. నీకు కనిపించినది జ్వర ప్రకోపంలో కలిగిన భ్రాంతిరూపంగా వాళ్ళు తీసిపారేస్తారు" అని బాబాజీ అన్నారు.

బదరీనాథ్ చేరడానికి మాకు పదహారు రోజులు మాత్రమే పట్టింది. దారిలో చాలావరకూ గుర్రం మీదనే కుదురుకుని కూర్చుని ఉన్నాను (కనక) దివ్యదృశ్యాన్ని చూస్తూ ఆనందించగలిగాను. మంచు కొండకొమ్ములూ, అందమైన వాగులూ, గడ్డకట్టిన సరస్సులూ, ఉదయిస్తూన్న సూర్యుడు మంచు శిఖరాల్లో ప్రతిబింబించి సృష్టించిన అద్భుత క్షణాలూ నాకు ఆనందానుభూతిని కలగజేశాయి. బదరీనాథ్‌కు రాగానే గుర్రాన్నీ గుదారాన్నీ తిరిగి ఇచ్చేసి ఫతే బహదూరును పంపించేశాం. బాబాజీ అతనికి

బాగానే దబ్బిచ్చారు. ఫతే బహదూరు మమ్మల్ని అయిష్టంగానే వదిలి వెళ్ళాడు. ఆపాటికి, నేను తిరిగి మామూలు మనిషినయ్యాను.

చరణపాదుక గుహకు తిరిగి వచ్చిన తరవాత బాబాజీ నాకు అప్పుడప్పుడు ప్రత్యేకమైన తినుబండారాలు తెచ్చి ఇస్తూ తిరిగి నేను స్వస్థుణ్ణయ్యేలాగ ఉపచారాలు చేశారు. దాదాపు రెండు వారాల్లో నేను బాగుపడి మునుపటిలాగ తయారయ్యాను. "ఇప్పుడు నువ్వు పూలలోయకూ, హేమకుండ్ సాహిబ్‌కీ ఆ తరవాత ఐదు కేదారాలకూ ప్రయాణం చేయడానికి సిద్ధం కా," అని బాబాజీ అన్నారు.

# 26. పూలలోయ, హేమకుండం

ఒక చల్లటి ఉదయం బాబాజీ నేనూ పాండుకేశ్వర్ దగ్గరే ఉన్న గోవిందఘాటుకి బయల్దేరాం. ఈసారి, నేను ప్రయాణానికి చాలా తయారుగా ఉన్నాను; బాబాజీ చురుకుగా చకచకా నడుస్తూంటే ఆయన్ను సులువుగానే అనుసరించగలిగాను. ఇప్పుడిక నాకు చెప్పులవసరం లేదు. గురుశిష్యులిద్దరమూ చెప్పుల్లేకుండానే నడుస్తున్నాం. మనా కనుమ మీదకు ఎక్కే కష్టంతో పోలిస్తే ఇది బాలక్రీడే. ఎప్పుడు తిండి దొరికితే అప్పుడే తినడం నేర్చుకున్నాను; అవసరమైతే దీర్ఘకాలం వరకూ అన్నం లేకుండా ఉండగలుగుతున్నాను కూడా.

రాత్రుళ్ళు గుహల్లోనూ దారి పక్కనుండే ధర్మశాలల్లోనూ ఉంటూ మూడురోజుల్లో గోవిందఘాటు చేరుకున్నాం. ఆ రాత్రి గోవిందఘాట్‌లోని గురు ద్వారాలో ఉన్నాం. సిక్కుల గురుద్వారాల్లో ఉన్న గొప్పతనమేమిటంటే, వాటిలో ఏ ప్రయాణీకుడైనా మూడు రాత్రులుండవచ్చు; అవసరమైతే తిండీ దుప్పట్లూ ఉచితంగా సమకూరుస్తారు కూడ.

మరుసటి రోజు పొద్దుటే ఘంగేరియాకు (Ghangaria) వెళ్ళడానికి పధ్నాలుగు కిలోమీటర్ల శ్రమపూర్వక గమనాన్ని ప్రారంభించాం. ఎక్కుడు బాగా నిటారుగా ఉంది; దారి లక్ష్మణ్‌గంగా పక్కనుంచే వెళ్తుంది. దారిలో భ్యందార్ అనే కుగ్రామాన్ని దాటేం. గ్రామం దాటిన తరవాత, దారి కిందివైపుకు దిగుతుంది. అప్పుడు నది పక్కగా నడవచ్చును. బాబాజీ అక్కడి దృశ్య సౌందర్యాన్ని మౌనంగానే ఆస్వాదిస్తున్నారు. చాలా సేపటి వరకూ మా మధ్య మాటలే జరగలేదు. మాటల అవసరం లేదు. అది ఆనందమయ నిశ్శబ్దస్థితి.

అప్పుడే విలక్షణమైన పువ్వులు కనిపిస్తున్నాయి. బాబాజీ మౌనాన్ని విడిచిపెట్టారు. వృక్ష శాస్త్రజ్ఞుడికిమల్లే వివిధ పుష్పాలవైపు చూపిస్తూ "అది కోబ్రా లిల్లీ, పొద్దుతిరుగుడు పువ్వులాగ కనిపించే ఆ పువ్వు ఇమేలా" అని చెప్పడం మొదలెట్టారు. ఆఖరి నిటారైన ఆరోహణభాగం కాగానే మేము ఘంగేరియా చేరుకున్నాం. హేమకుండ్ సరస్సునుంచి పుట్టే లక్ష్మణ్‌గంగా మీదుగా ఉన్న చిన్న వంతెనను మేము దాటేం. అక్కణ్ణించి కుడివైపుకు పోయే దోవ సముద్రమట్టానికి 15,000 అడుగుల ఎత్తునున్న హేమకుండ్ సాహిబ్‌కు వెళ్తుంది; ఎడమవైపు పోయే దారి పూలలోయకు దారితీస్తుంది. ఇంకాపైన, లక్ష్మణ్‌గంగతో ఉధృతమైన వేగంతో వచ్చి కలిసే పుష్పవతీ నది మీద ఒక చిన్న ఇనప వంతెన ఉంది. అప్పుడే బాబాజీ సూచించినట్టుగా "నీలి గసగసాల జాతి మొక్కలు" కనిపించడం మొదలెట్టాయి.

మేము వంతెనను దాటి సన్నని దారి మీదుగా ఎక్కుతూ ఒక హిమానానదం (Glacier) అవశేషాలున్న చోటికి చేరుకున్నాం. ఆ మంచుదిబ్బను కూడా దాటి, రమారమి మూడు కిలోమీటర్లు పైకి వెళ్ళి, ఒక చిన్న చెక్క వంతెనను దాటిన తరవాత లోయలోకి ప్రవేశించాం. ఆ ప్రదేశ సౌందర్యం నన్ను నిర్ఘాంతపరిచింది. అంతటి వైభవాన్ని మాత్రం నేను ఎన్నడూ ఊహించలేదు. ఒక దివ్యమూర్తి రకరకాలుగా విడదీసి, కృషి చేసి, కుశలంగా ఏర్పరిచినట్టుగా రకరకాల పువ్వులతో విశాలమైన పచ్చికబయళ్ళు కనుచూపుమేర దాకా కనిపించాయి.

బాబాజీ ఆ పూల గురించిన జ్ఞానంతోనూ ఆ లోయకు సంబంధించిన ఇతర వివరాల విషయంలోనూ నన్ను మళ్ళీ ఆశ్చర్యపరిచారు. “ఇది హిమాలయ నీలి గోరింట (Balsam); ఈ తెల్లది హిమాలయ గలిజేరు (Hogweed); ఈ సుడులు తిరిగిన తెల్ల పువ్వు ఆల్ప్స్ పర్వతాల చిహ్నమైన ప్రసిద్ధ ఈడెల్‌వేయిస్ (Edelweiss). అక్కడ చూడు, ఆ అవతల వైపు, అవి జీరాడుతూన్నట్టుండే నీలిపూలు, అందమైన ఫర్-గెట్-మీ-నాట్లూ, నీలి గసగసాల జాతిపూలు, నీలి జరేనియాలూ, పొద్దుతిరుగుడు పువ్వులూ.. ఆహా- ఎన్నెన్నో రకాలు” అన్నారు బాబాజీ

“బాబాజీ! ఈ గుప్తస్వర్గాన్ని మహాజనం ఏ విధంగా కనుక్కోగలిగింది?”

“ఇది కొంతమంది యోగులకూ, స్థానికులకూ దీర్ఘకాలంగా తెలుసును. స్థానికులు ఇది దివ్యులూ నాజూకైన వారు అయిన గంధర్వాప్సరసలు ఉండే ప్రదేశమని నమ్ముతారు. మా గురుదేవులు, శ్రీ గురు బాబాజీ, ఈ లోయకు నన్ను తీసుకు రావడానికి ఇష్టపడేవారు. కొంచెంపైకి, ఆయన తరచూ వెళ్తూండే ఒక చిన్న గుహ ఉంది. అక్కడకు మనం వెళ్ళి, తెరిచిన కళ్ళతోనే ధ్యానం చేద్దాం. ఇటువంటి బ్రహ్మాండ ప్రాకృతిక సౌందర్య ప్రదర్శనలు దివ్యమైనవి. లోపల వెతుక్కునే దివ్య స్వరూపం ఇక్కడే నీ కళ్ళెదురుగానే ఉంది. విశ్రమించు, చూడు. ఈ సుగంధి వాయువును పీల్చు.

“ఈ స్వర్గం ఉనికి ప్రపంచానికెలా తెలిసిందన్న నీ ప్రశ్నకు జవాబేమిటంటే పర్వతారోహకుడూ, వృక్ష శాస్త్రజ్ఞుడూ అయిన ఫ్రేంక్ స్మిత్ 1931లో ఈ లోయను దర్శించడం జరిగింది. అతను నిర్ఘాంతపోయాడు. అతనే దీన్ని 'పూలలోయ' (Valley of Flowers) అని పిలిచాడు. నడు, ఆ గుహకు వెళ్దాం” అని బాబాజీ వివరించారు.

అటూ ఇటూ పుష్కలంగా తెల్లపూలున్న సన్నని లోయలోంచి నడుస్తూ ఒక రాతి సానువు కింద దాగి ఉన్న ఒక చిన్న గుహ దగ్గరికి చేరుకున్నాం. "మా గురుదేవులూ నేనూ ఇక్కడ ధ్యానం చేశాం. ఇప్పుడు నువ్వూ నేనూ కూర్చుందాం" అని బాబాజీ అన్నారు. ఆ అందమైన చోట మేము చాలాసేపే కూర్చున్నాం. మేము అసంఖ్యాకమైన రంగుల్లోనూ మందంగా మత్తు కలిగించే కొన్ని అసాధారణ పుష్ప సుగంధాల్లోనూ లీనమయ్యాం. బాబాజీ నిశ్శబ్దంగా కూర్చున్నారు.

కొంతసేపైన తరవాత ఆ నిశ్శబ్దాన్ని మృదువుగా భంగపరుస్తూ నేను "ఇప్పుడు నాకు అర్థమవుతోంది ఈశావాస్యోపనిషత్తు ఉట్టంకించిన 'ఈశావాస్యమిదం సర్వం' అనే వాక్యార్థం. చాలాకాలం దాకా దాని అర్థం ఈశ్వరుడు ప్రతి వస్తువులోనూ దాగి ఉన్నాడని అనుకున్నాను. కానీ ఇప్పుడు నాకు తెలుస్తోంది – ఇక్కడున్నదంతా, మనం చూస్తూన్నదీ, వాసన చూస్తూన్నదీ, తాకుతున్నదీ, రుచి చూస్తూన్నదీ అన్నీ ఈశ్వరుడి కన్నా వేరు కావని. మనం ఎక్కడో వెదుక్కోవలసిన పని లేదు" అని అన్నాను.

"ఆ! నెమ్మదిగానూ నిదానంగానూ (అడుగెయ్యి). తొందరపడకు. నీ మెదడు ఇప్పుడు తేటపడుతోంది. ఇక మార్గరెట్ లెగ్ స్మారక స్తంభాన్ని చూడడానికి వెళదాం. అక్కడ్నించి మనం ఘంగేరియాకు తిరిగి నడిచి వెళదాం" అని బాబాజీ అన్నారు. మేము లేచి కొంతదూరం నడిచాం. మార్గరెట్ లెగ్ అనే ఆవిడ ఎడింబరో బొటానికల్ గార్డెన్స్ నుంచి వచ్చిన వృక్ష శాస్త్రజ్ఞురాలంటూ బాబాజీ వివరించడం మొదలు పెట్టారు. ఆవిడ 1939లో ఈ పూల లోయను పరిశోధిస్తూండగా జారి కిందకు పడిపోయి చనిపోయింది. స్థానికులు ఆవిడను పూడ్చిపెట్టారు. తరవాత ఆవిడ చెల్లెలు వచ్చి ఇక్కడ స్మారక చిహ్నాన్ని కట్టించింది. సమాధి దగ్గర రాతి పలక మీద చెక్కిన వాక్యం ఇది – "నాకు సహాయం పంపే ఈ కొండల వైపుకు నా కళ్ళను తిప్పి ఉంచుతా" అని.

మేము ఎంత వీలైతే అంత వేగంగా నడిచి పొద్దుపోకముందే ఘంగేరియా చేరుకున్నాం. గాలి చాలా చల్లగానూ ఉల్లాసకరంగానూ ఉంది. రాజస్థాన్ నుంచి వచ్చిన ఒక సాధువుకి చెందిన ఒక చిన్న రాతి గుడిసెలో ఆ రాత్రికి ఉన్నాం. ఆ సాధువు బాబాజీకి తెలుసును. ఆయనకు బాబాజీ అంటే భక్తిపూర్వకమైన భయం ఉన్నట్టు కనిపించాడు. ఆయన మా గురించి మహా జాగ్రత్త తీసుకున్నాడు.

మర్నాడు పొద్దున్న హేమకుండ్ సాహిబ్‌కు (Hemakund Sahib) వెళ్ళాలని శ్రమతో కూడిన ప్రయాణాన్ని ప్రారంభించాం. హేమకుండ్ సాహిబ్‌కి ఎక్కుడు చాలా నిటారుగా ఉంది. అక్కడ, సిక్కు భక్తుల పెద్ద పెద్ద సమూహాలు ఉచ్చైస్స్వనాలతో

"వాహే గురూ" అని కీర్తిస్తూ, విశ్వాసంతోనే బలాన్ని పెంపొందించుకుంటూ, పైకి పోయే వంకర దారి మీదుగా ఎక్కుతున్నారు. మధ్యేమార్గంలో ఒక మజిలీ ఉంది. చాలామంది యాత్రీకులు అక్కడ విశ్రాంతి తీసుకొని మర్నాడు మిగతా దారిని పూర్తి చేస్తూ ఉంటారు. కానీ మేము మాత్రం కొన్ని నిముషాలే విశ్రాంతి తీసుకొని ఒక కప్పు టీ తాగి ముందుకు సాగిపోడమే మేలని అనుకున్నాం. సముద్రమట్టానికి 15,000 అడుగుల పైనున్న హేమకుండ్ సాహిబ్‌కి మేము బాగా సాయంత్రమయింతర్వాత చేరుకున్నాం. అనుకున్నట్టుగానే అక్కడ చలి మహాతీవ్రంగా ఉంది.

సిక్కుల చివరి గురువు గోవిందసింగ్, ఆయన పూర్వ జన్మల్లో ఒకదానిలో హేమకుండ్ సరస్సు సమీపంలో తపస్సూ ధ్యానమూ చేస్తూ చాలారోజులే గడిపారని సిక్కులు నమ్ముతారు. గాలిలో ప్రాణవాయువు భాగం తక్కువగా ఉంది. బాబాజీ శ్వాస లయను మార్చమని నాకు సలహా ఇచ్చారు. నాకు వచ్చిన కొంచెం తలనొప్పి కొంతసేపట్లోనే తొలగిపోయింది.

భాషాపరంగా 'హేమకుండ్' అంటే మంచు సరస్సు. అది అత్యంత అందంగా ఉంది. ఆ నీరు స్ఫటికంలాగ నిర్మలంగా ఉంది; జలతలంలోని కొంత భాగం గడ్డకట్టి ఉంది. చుట్టూ ఉన్న కొండకొమ్ములన్నీ మంచుతో కప్పడి ఉన్నాయి. మొత్తం దృశ్యం అద్భుతంగా ఉంది. ముముక్షువులైన కొంతమంది సిక్కులు న్యుమోనియా విపత్తును కూడా ఖాతరు చేయకుండా ఆ గడ్డకడుతూన్న నీళ్ళలో బుడుంగుమని త్వరత్వరగా మునుగుతున్నారు.

మేము గురుద్వారాకు వెళ్ళేం. అక్కడ వేడివేడి కిఛిడీ, చపాతీలూ, కడా ప్రసాద్ అనే ఒక తీపి వంటకమూ పెట్టేరు. చాలినన్ని ఉన్ని దుప్పట్లను సమకూర్చారు; నేను పెందరాళే నిద్రపోదామని ఒరిగాను. బాగా అలసిపోయాను.

తరువాతి రోజు పొద్దున్నే పాత లక్ష్మణ్ గుడికి సంక్లిష్టమైన యాత్ర మొదలు పెట్టేం. ఈసారి మేమొక్కళ్ళమే ఉన్నాం. లక్ష్మణ్ గుడి ఒకటి ఉందని చాలా తక్కువమంది ప్రయాణీకులకు మాత్రమే తెలుసును. శ్రమసాధ్యమైన ప్రయాణం తరవాత లక్ష్మణ్ గుడికి మేము చేరుకున్నాం. చలి కొరికేస్తోంది. ఆ గుడి, శిథిలమై పోయిన ఒక రాతి కట్టడం. (దర్శనానికి వచ్చే) జనాన్నుంచి పైసలు లాగడానికి అక్కడ పురోహితుడూ లేడు. రామాయణ పురాణ కావ్యంలో చారిత్రాత్మక వీరుడైన రాముడి తమ్ముడు లక్ష్మణుడి ప్రతిగా అనుకునే ఒక చిన్న మానుష ప్రతిమను అక్కడ ఎవరో ప్రతిష్ఠించారు. ఆ విగ్రహాన్ని కడగనూ లేదు శుభ్రం చేయనూ లేదు; దాన్ని గర్భగుడి గోడకు ఏటవాలుగా చేర్చి ఉంచారు.

"మా గురువుగారూ, నేనూ ఇక్కడ కూడా ఒక రాత్రంతా కూర్చున్నాం" అని అన్నారు బాబాజీ: "పర్వతాలమీదుగా దిగి వస్తూన్న అద్భుత కాంతులను మనం చూడవచ్చు. అవి సరస్సు వెళ్లే దిక్కులో కదులుతూ ఉంటాయి. కాని ఈసారి మనం రాత్రంతా ఇక్కడ గడపలేం. చలి ముమ్మరంగా ఉంది; నువ్వు ఇప్పుడిప్పుడే సన్నిపాత జ్వరం నుంచి బయటపడ్డావు". ఒక గంటపాటో మరికొంతో కూర్చొని ఆ దివ్య దిగ్దర్శనాన్ని నిశ్శబ్దంగానే ప్రశంసించాం. అరుదుగా కనిపించే బ్రహ్మకమలమనే నీలిచాయ ఉండే పద్మం ఆ ప్రదేశం చుట్టుపట్ల పెరిగేదే. బాబాజీ ఆధ్యాత్మికంగా ఉన్నతమైన స్థితిలో ఉన్నారు. ఒక శక్తిమంతమైన దీప్తితో వెలుగుతూన్నట్టు ఆయన ముఖం వెలిగిపోతోంది. ప్రశాంతి అక్కడ నిరుపద్రవంగా రాజ్యం చేస్తోంది. అకస్మాత్తుగా బాబాజీ 'ఇక మనం వెళ్ళాలి' అని అన్నారు.

వెనకకు గురుద్వారా వైపుకు మళ్ళాం. చపాతీలూ పప్పూ ఉండే వేడివేడి భోజనాల టైముకి చేరుకున్నాం. తరవాత శీఘ్రంగానే ఘంగేరియాకి దిగడం మొదలుపెట్టాం. చీకటి పడే వేళకు ఘంగేరియాకి వచ్చేశాం. ఆ రాత్రికి అక్కడే, జూనా అఖాడాకు చెందిన మునుపటి ఆ రాజస్తానీ సాధువుతోనే ఉన్నాం.

బాబాజీ ఆ రాత్రి బయటకు షికారు వెళ్ళడంతో నేనొక్కణ్ణే సాధువుతో ఉన్నాను. మేము ధునీ ముందు కూర్చున్నాం. సాధువు ఎండిన గంజాయి ఆకులూ పొగాకూ దట్టించిన మట్టి చిలుంను వెలిగించాడు. "ఈ పవిత్ర ధూమాన్ని ఒకసారి పీలుస్తావా?" అని ఆయన అడిగాడు. నేను వద్దన్నాను. "మీ బాబాజీ కూడా పీల్చరు. మీరు రాజయోగుల కోవకు చెందినవాళ్ళు. అంతస్సులోని మహాసత్యం మీద మీ అవధానాన్ని నిలపడానికి మీకు బహుశా ఇది అక్కర్లేదేమో. నీకు తెలుసునా? నువ్వు చాలా అదృష్టవంతుడివి. చాలా భాగ్యశాలివి. ఈ బాబాజీ చాలా గొప్పగా పురోగమించిన యోగి. ఆయన సులువుగా శిష్యుల్ని అంగీకరించరు. నేను నిజంగా శ్రద్ధాళువు అనుకున్న వాళ్ళను కూడా తిరస్కరించారు. బహుశా మీ ఇద్దరి మధ్యా ఏదో పూర్వజన్మ సంబంధం ఉండి ఉండాలి. తన సొంత కొడుకే అన్నట్టుగా ఆ రోజున నిన్ను ఆయన చాలా వాత్సల్యంతో చూడడం నేను చూశాను. నాకు వాస్తవంగానే ఆశ్చర్యమేసింది.

ఆ పొగకు కొంచెం ఎడంగా జరిగి కూర్చొని నేను చాలాసేపే ధ్యానం చేశాను. అదొక గొప్ప ప్రగాఢ ధ్యానం. నాకున్న కొన్ని సందేహాలు వాటికవే క్షణంలో విడిపోయాయి. సాధువు ఇచ్చిన పరుపులో నన్ను నేను చుట్టబెట్టుకుని నిద్రపోడానికి పడుకునే సమయానికి కూడా బాబాజీ తిరిగి రాలేదు. అమ్మకోసం నిరీక్షించే చిన్నపిల్లాడిలాగ నేను బాధపడ్డాను. నిదురతల్లి నన్ను తన హాయిగాలిపే చేతులతో, ఆప్యాయంగా నిమిరింది. నేను నిద్రపోయాను.

# 27. ఒక సిద్ధుని దర్శనం

మర్నాటి ఉదయం పెందరాళే కల్పేశ్వర్‌కి ప్రయాణం కట్టాం.

ఐదు కేదారాల్లోకీ కేదార్‌నాథ్ మహా ప్రసిద్ధమైనదీ, బహుశా మహా ప్రభావాత్మక మైనదీను. ప్రతి ఏడాదీ, వేలాది తీర్థయాత్రికులు తీవ్రశీతాన్ని కూడా లెక్క చేయకుండా కష్టమూ, బాగా నిట్రమూ అయిన పధ్నాలుగు కిలోమీటర్ల పాటు ఎత్తునెక్కి, కేదార సీమలో సముద్ర మట్టానికి 12,500 అడుగుల ఎత్తునున్న కేదారనాథ్ గుడికి వెళ్తూ ఉంటారు.

మిగిలిన నాలుగూ చాలావరకూ తెలియనివే, స్థానికులకూ కొంతమంది సాధువులకూ తప్పించి. జనం, ప్రసిద్ధ యాత్రాకేంద్రాలకే వెళ్తూ ఉంటారు. ఇవి మాత్రం జనానీకాల సందడి అంటకుండా, అకలుషితంగా మహా సుందరమైన ప్రాకృతిక పరిసరాల మధ్య ఉత్తమ ఏకాంతత్వంలో నిలిచి ఉన్నాయి. బదరీనుంచి బయలుదేరితే మొదట తగిలే కేదారాల్లో ఒకటైన కల్పేశ్వర్‌కు బాబాజీ ఇప్పుడు నన్ను తీసుకువెళ్తున్నారు.

గోవింద ఘాటు నుంచి జోషీ మఠానికి తీసుకుపోయే రోడ్డుమీదుగా మేము నడుస్తున్నాం. మధ్యాహ్నానికి మెయిన్ రోడ్డు దాటి కుడివైపునున్న 'పగదండీ' అని పిలిచే బురద దారిలో ప్రవేశించాం. మా ఎడమవైపు విష్ణుగంగ ప్రవహిస్తోంది. కొద్దిసేపట్లో ఆ బురద దారి కూడా అంతమయింది. కానీ బాబాజీకి దారి తెలిసినట్టే ఉంది. అడవిలోంచి ఒక్కోసారి రాళ్ళమీదుగా, ఒక్కోసారి వాటి మధ్యలోంచీ నడుస్తూ, కొద్దిసేపట్లోనే మేము చెయిమ్‌ఖాల్ అనే చిన్న గ్రామానికి చేరుకున్నాం.

బాబాజీని గుర్తించిన అక్కడి చిన్న ఘర్వాలీ సమూహం మమ్మల్ని స్వాగతించింది. ఆ గ్రామపెద్ద ఒక ముసలివగ్గు. ఆయన పాతకోటుకు చాలాచోట్ల అతుకులున్నాయి. ఆయన వంగి బాబాజీ పాదాలను తాకి "ప్రణామ్ బాబాజీ" అని అన్నాడు: "అయితే మీరొక శిష్యుణ్ణి తీసుకున్నారన్నమాట". బాబాజీ చిరునవ్వు నవ్వి అతన్ని దీవించారు. రామ్‌దానాతో చేసిన రొట్టెలు, వేడివేడి గుమ్మడి కూరతో మాకు కడుపు నిండా భోజనం పెట్టారు వాళ్ళు. పటిక బెల్లం ముక్క ఒకటీ బ్లాక్ టీ కప్పు ఒకటీ ఆ భోజనానికి ముక్తాయింపులయ్యాయి. మొత్తం గ్రామమంతా మా చుట్టూ నుంచొని చూస్తూ ఉంది. కొంతమంది ఆడవాళ్ళు వాళ్ళ పిల్లలతో ముందుకొచ్చారు బాబాజీ ఆశీస్సులనందుకోడం కోసం. వాళ్ళు బాబాజీని ఉండమని చెప్పడానికి ప్రయత్నించారు కానీ బాబాజీ వెళ్ళిపోవడానికే నిశ్చయించారు.

మా మధ్యాహ్న భోజనం తరవాత కొంతసేపటికే మేము చెయిమ్‌ఖాల్ నుంచి బయలుదేరాం. అప్పుడొక ఆరోహణం ప్రారంభమయింది. అది ముందుకు

సాగుతూంటే మరింత నిట్రమవుతూ వచ్చింది. మేము బర్కీ వైపుకు వెళ్తున్నాం. అక్కణ్ణించి కల్పేశ్వర్ బాగా చేరువ. కొన్ని గంటల్లో మేము బర్కీ చేరుకున్నాం. అక్కడొక చిన్న పాడుపడ్డ శివాలయం ఉంది. సాంవత్సరిక పూజాసమయాల్లో ఏడాదికొకసారి అది గిరిజనుల అవధానాన్ని కొంతకొంతగా పొందుతూ ఉంటుందని బాబాజీ చెప్పారు.

రెండు గంటల తరవాత నిండా బంతిమొక్కలున్న ఒక అందమైన అడవి గుండా నడిచి మేము ఉర్గం (Urgum) అనే అద్భుత లోయలోకి ప్రవేశించాం. సూరీడప్పుడే అస్తమించ బోతున్నాడు. ఆ దృశ్యం వర్ణ చిత్రకారుడికి స్వర్గప్రాయంగా ఉంటుంది. దూరంగా మంచుతో కప్పడిన కొండకొమ్ములు అస్తమిస్తూన్న సూరీడు కాంతిని పరావర్తిస్తున్నాయి. అన్ని చోట్లా బంతిచెట్లు బహు చిక్కగా ఎదిగి వున్నాయి. ఒకపక్కన వాగొకటి ప్రవహిస్తోంది. దానిలోని నీళ్లు స్వచ్ఛంగానూ స్ఫటికంలాగ నిర్మలంగానూ ఉన్నాయి. దాపునే ఉన్న ఒక జలపాతపు ధవళ జలాలు దట్టమయిన నీలినలుపు కొండకొమ్ముల మీదుగా ప్రవహిస్తున్నాయి. ఆ కొండకొమ్ములనుంచే ఆయుర్వేదంలో శిలాజిత్తని చెప్పే లక్కబంక కారుతూ ఉంటుందని బాబాజీ చెప్పారు.

ఏ విధమైన దోపిడీకీ లోనుకాని ఈ ప్రాకృతిక లక్షణాల మధ్య దాక్కొని ఉన్న ఒక సహజ గుహ మధ్యలో పాషాణలింగ రూపంలో కల్పేశ్వర శివుడు కాపుర 9ముంటున్నాడు. ఇత్తడి గంట వేలాడుతూన్న ఒక వింటి ద్వారం ద్వారా లోపలికి ప్రవేశించవచ్చు. బాబాజీ నేనూ మా రాకను సూచిస్తూ ఆ గంటను మోగించి ఆ గుహాలయంలోకి ప్రవేశించాం. ఉర్గం లోయలోని దేవగ్రాం అనే సమీప గ్రామం నుంచి వచ్చిన పూజారి బాబాజీకి అత్యంత భక్తితో మొక్కి పాదాలను తాకి చేతులు జోడించి వినమ్రుడయ్యాడు.

చీకటి పడబోతోంది. ఒక మాదిరి పెద్ద నూనెదీపంతో సాయంత్రపుటారతి ఈయడానికి అనుమతినడిగాడు పూజారి. పూజారి ఆరతినిస్తూండగా బాబాజీ 'ఓం నమశ్శివాయ' మంత్రాన్ని ఉచ్చరిస్తూ ఉన్నారు. నేను చిన్న వెండిగంటను మోగిస్తూ ఉన్నాను. పూజారి ఆరతిదీపాన్ని చుట్టూ తిప్పుతూ ఉండగా ఆ దీపపు కాంతిలో గర్భగుడిలో వెదజల్లినట్టున్న చాలా రాతిలింగాల్లో ఇదొక లింగమని నేను గమనించాను. ఆరాధన అయిన తరవాత, నిశ్శబ్దంగా కూర్చున్నాం. ఆ నిశ్శబ్దస్థితి సర్వవ్యాపి శాంతినీ ప్రేమనీ ఉట్టంకిస్తోంది.

పూజారి అప్పుడు మాకు (శివుడికి) నివేదితమైన కొంత తేనెను ఇచ్చాడు - అది చాలా తియ్యగా ఉంది; బంతిపూల మందవాసన కూడా దానికుంది. అతను మమ్మల్ని అతనితో పాటు దేవగ్రామానికి రమ్మని పట్టుబట్టాడు కానీ బాబాజీ మాత్రం

ప్రయాణీకుల కోసం కట్టిన ఒకే గది ఉన్న విశ్రాంతి గృహంలో ఉండడాన్నే ఎంచుకున్నారు. దానికి ద్వారబంధం తెరిచే ఉంది. ఆ ద్వారం ముందు ఒక నిప్పు గుండం ఉంది. పూజారి తాను వంటచెరకూ భోజనమూ తీసుకొని వెనక్కి వస్తానని చెప్పాడు. అలాగే బాబాజీ వచ్చారని గ్రామనేతకు చెప్తానని కూడా చెప్పాడు. కొద్ది సేపట్లో మేము మాత్రమే మిగిలాం. చంద్రుడు మబ్బుల మాటునుంచి బయటకు వచ్చాడు; ఆకాశం నక్షత్రకాంతితో వెలిగింది. చాలా చల్లగా ఉంది. మేము గది అవతల కూర్చున్నాం. ఉన్ని దుప్పటినీ మఫ్లర్‌నీ సరిగ్గా ఒంటిచుట్టూ కప్పుకోమని బాబాజీ నాకు గుర్తు చేశారు.

'చాలా ఏళ్ళు మా గురువుగారి మహా పెద్ద శిష్యుల్లో ఒకరు ఈ కల్పేశ్వరంలో ఉండేవారు. ఇప్పుడాయన రుద్రనాథ్‌కి మారారు. అక్కడాయనను కలవవచ్చునని ఆశించవచ్చు" అని బాబాజీ అన్నారు.

"బాబాజీ! నేనొక విషయాన్ని అడగవచ్చునా?" అని నేనన్నాను.

"కానీయ్" (అన్నారు బాబాజీ).

"మీరెక్కడ పుట్టారు? ఇప్పుడు మీకెన్నేళ్ళు?"

బాబాజీ నవ్వేరు. "అదంత ముఖ్యం కాదు. అయినా నువ్వు పట్టుబడితే (చెబుతాను) నా తల్లిదండ్రులు కాశ్మీరీలు. నా వయస్సు గురించి అంటావా, నేను కనిపించే దానికన్నా నాకు ఎక్కువ వయస్సే ఉంటుందని మాత్రమే చెప్పగలను. మహాయోగి శ్యామాచరణ్ లాహిరీ మా గురువులయిన శ్రీగురు బాబాజీని మొదటిసారి కలుసుకున్నప్పుడు, ఆయనను గుహలోని బాబాజీ పీఠం దగ్గరకు తీసుకొని వెళ్ళిన వాణ్ణి నేనే".

"అయితే అది జరిగి వందేళ్ళ పైబడి అయింది కదా!" అని ఆశ్చర్యపోతూ అన్నాను: "మీరు సుమారు ముప్పై ఏళ్ళను మించరని అనిపిస్తోంది".

"యుక్తాహారంతోటీ కాయకల్పాభ్యాసంతోటీ ఎవరైనా చాలా కాలం బతకవచ్చు; యౌవనాన్ని నిల్పుకోవచ్చు" అని అన్నారు బాబాజీ, "నువ్వు కూడా అప్పుడప్పుడు, తరవాతి జీవితంలో పైబడే సామాజికపు ఒత్తిళ్ళను ఓర్చుకోడానికి, కాయకల్పాభ్యాసం చెయ్యాల్సిన అవసరం ఉంటుంది".

"బాబాజీ, ఏమి ఒత్తిళ్ళండీ?" అని నేనన్నాను, "ఇక్కడింత బాగుందిగా. ఏ రకమైన ఒత్తిళ్ళూ లేవు. ఇక్కడ మీతో ఈ హిమాలయాల్లో తిరుగుతూ ఎప్పటికీ ఇక్కడే ఉంటాను. నేను కింది మైదానాలకు వెళ్ళదలచుకోలేదు".

బాబాజీ నన్ను ప్రేమగా చూశారు: "నీకు ఇష్టం లేకపోవచ్చు కానీ నువ్వు వెళ్ళాలి. నువ్వు పని చెయ్యాలి, మా గురుదేవుల పని. తక్షణమే కాదనుకో. అంచేత బాధపడకు. కొంత సమయం ఈ సుందర ప్రాంతాల్లో మనం తిరుగుదాం".

"మీరు నా దగ్గర ఉన్నంత వరకూ, మిమ్మల్ని నేను చూడగలిగినంత వరకూ నాకే సమస్యా ఉండదు. మీ గురుదేవులలాగే మీరు కూడా మీ శరీరాన్ని యౌవనంలో చెక్కుచెదరకుండా ఉంచుకుంటూ, నాకు ఎల్లప్పుడూ మార్గనిర్దేశం చేస్తూ ఉంటారని నేను నిశ్చింతగా అనుకుంటున్నాన"ని నేనన్నాను.

"కాదు. ఆ మహానుభావుడొక్కడే, మా మాస్టారు మాత్రమే, ఎవరినైతే మేము శ్రీగురు బాబాజీ అని పిలుస్తామో ఆయన మాత్రమే ఆ పని చేయగలరు. కారణమేమిటంటే ఆయనిక్కడ ఒక ప్రత్యేక ఉద్దేశం కోసం ఉండడమే. నా మాట అంటావా, భవిష్యత్తులో ఏదో ఒక సమయంలో నేను వెళ్ళిపోవాల్సి వస్తుంది, అంతవరకూ నేను నా శరీరాన్ని చక్కగా నిలుపుకోగలిగినా సరే" అని బాబాజీ బదులు చెప్పారు.

నేను విభ్రాంతి చెందాను. ఆవేశంతో కంపిస్తూ "బాబాజీ, మీరు ఎప్పుడూ వెళ్ళద్దండీ దయచేసి" అని నేనన్నాను.

"వెర్రివాడా! మార్గదర్శకత్వం భౌతిక శరీరం మీద ఆధారపడదు. అదీగాక, నువ్వు ఎక్కువగా ఈ (నా) శరీరానికి అంటిపెట్టుకొని ఉండవద్దు. నీకు ఇచ్చే శిక్షణ తాలూకు లక్ష్యం నిన్ను స్వతంత్రుణ్ణి చేయడమే. నువ్వు నీ కాళ్ళమీద నిలవాలి. గురువు మీద ఆధారపడడం కూడా ఒక ఆటంకమే. స్వేచ్ఛగా ఉండు" అని బాబాజీ చెప్పారు.

గ్రామాధికారితో సహా పూజారి వచ్చాడు. వాళ్ళు వంటచెరకు, ఆహారమూ తెచ్చారు. బాబాజీ విశ్రాంతి తీసుకోడానికి గ్రామానికి రాలేదని గ్రామపెద్ద అసంతృప్తితో ఉన్నారు.

"నీ ఆరోగ్యం ఎలాగుంది?" అని (గ్రామ పెద్దను) అడిగారు.

"మీ ఆశీస్సుల వల్ల బాగానే ఉంది" అన్నాడు గ్రామ నేత. "బాబా, మీతో ఒకయువయోగి కూడా ఉన్నాడే. మంచిది. తెలివిగా కనిపిస్తున్నాడు" నా వైపుకు తిరిగి అతను "నువ్వు చాలా అదృష్టవంతుడివి బాబాలాటి గురువు దొరికినందుకు" అని నాతో అన్నారు.

ధునిని వెలిగించి, భోజనాన్ని లోపల పెట్టి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్తూ "రేపు దయచేసి గ్రామానికి దయచేయండి బాబా" అని అన్నారు.

"సరే" అని బాబాజీ అన్నారు.

ధుని ముందు కూర్చొని మేము ధ్యానం చేశాం. అగ్నిజ్వాలలు ఆనందంగా నాట్యం చేశాయి; మా శరీరాలకు వెచ్చదనాన్నీ మా మనస్సులకు శాంతినీ ఇచ్చాయి. తరువాత మేము సుపరిచితమైన రామ్‌దానా రొట్టెలూ బంగాళాదుంప కూరా తిన్నాం. అయితే ఈసారి మా రొట్టెలను ముంచుకోడానికి పుష్కలంగా అడవి తేనె ఉంది. మర్నాడు చాలాదూరం ప్రయాణం చేయాలి కాబట్టి నన్ను పడుకోమన్నారు బాబాజీ.

తెల్లవారు ఝామున ఆ నదీ, ఆ పర్వతాలూ, సమృద్ధంగా ఉన్న ఆ బంతిపూల మొక్కలూ – అంతా అద్భుతంగా ఉంది. నదిలో ఒక మునుగు మునిగాం. తుడుచుకుని, బహుశా గఢ్వాల్ జిల్లాలో అత్యంత ఆకర్షణీయమైన లోయకు ప్రయాణించాం. కొంతసేపట్లోనే దేవగ్రామమనే కుగ్రామం చేరుకున్నాం. గ్రామపెద్ద నడిపించగా మొత్తం గ్రామమంతా మమ్మల్ని స్వాగతించడానికి వచ్చింది. ఆ గ్రామ పెద్ద నిరాడంబరమైన తన ఇంటికి మమ్మల్ని తీసుకొని వెళ్ళారు. మొదట, స్త్రీలు మా పాదాలను కడిగారు. పిమ్మట మమ్మల్ని మెత్తటి పరుపుల మీద కూర్చోబెట్టారు. సుష్టుగా భోజనం పెట్టారు. చోద్యంగా చూసే పిల్లలు మమ్మల్ని చూపిస్తూ ముసిముసినవ్వులు నవ్వుతున్నారు.

కొంతమంది గ్రామస్థులతో బాబాజీ మాట్లాడారు. ఆయనను వాళ్ళు ఎరిగినట్టున్నారు. "తరచు ప్రయాణిస్తూ ఉంటారు" అని ఆయన గురించి నాకు నేను అనుకున్నాను. ఒక గంటపైన అయిన తరవాత అయిష్టంగానే మేము ముందుకు సాగడానికి వాళ్ళు ఒప్పుకున్నారు. దారిలో తినడానికి మాకు రెండు సంచుల ఆహారమూ ఒక తేనె సీసా ఇచ్చిన తరవాతనే మమ్మల్ని వెళ్ళనిచ్చారు వాళ్ళు.

మేము వెళ్ళిపోతూంటే ఆ గ్రామపెద్ద "రుద్రనాథ్‌లో జోగి మహరాజ్‌ను కలుసు కున్నప్పుడు మా సాష్టాంగాలను వారికి అర్పించండి" అని మాతో అన్నారు.

పచ్చని ఉర్గం లోయ గుండా మేము నడిచాం. సన్నని జల్లు మా వెంట వస్తూనే ఉంది. పూర్తిగా ఏర్పడిన ఇంద్రధనుస్సూ మమ్మల్ని స్వాగతించింది. చాలా మితంగా మాట్లాడుకుంటూ మేము రెండు గంటల పాటు నడిచాం. ఎప్పటిలాగే ముందుగా బాబాజీ పర్వతపు మేకలాగ చురుకుగా నడుస్తున్నారు; వెనక శిష్యుడు (అంటే, నేను) అనుసరిస్తూ అతని గురువుగారి కదలికలను అనుకరించడానికి ప్రయత్నిస్తూ సాగుతున్నాను.

తటాలున కొందరు మనుషుల కంఠధ్వనులతో మా నిశ్శబ్దం భంగమయింది. మేము దేవదారు వృక్షాల వరస ఉన్న లోయలోకి దిగి దుమఖ్ అనే కుగ్రామంలో ప్రవేశించాం. పిల్లలు అరుస్తూ నవ్వుతూ పరుగెత్తుకుంటూ వచ్చారు. గ్రామపెద్ద, పెద్ద కొడుకు బాబాజీని స్వాగతించారు. బాబాజీ కిందటిసారి వచ్చి వెళ్ళిన తరవాత తన తండ్రి గతించాడన్న దుఃఖవార్తను చెప్పాడతను. నన్నూ బాబాజీని, గ్రామపెద్ద ఇంటికి తీసుకువెళ్ళి, రొట్టెలూ పప్పూ బంగాళాదుంపలతో భోజనాలు పెట్టారు.

దుమఖ్ కుగ్రామం ఒక స్వర్గధామం. దాపునే ఒక నీలి సరస్సుంది. మూడో నాలుగో ఏర్లు, లోయ వాలుమీదుగా గలగలలాడుతూ దిగుతున్నాయి. ఆ శుభ్రమైన నీళ్ళను నేను తాగేను. ఆ గ్రామస్థులు ఆ నీళ్ళకు ఔషధ గుణాలున్నాయని చెప్పుకుంటారు. ఆ గ్రామంచుట్టూ బ్రహ్మాండమైన దేవదారు చెట్లున్నాయి. ఆ కొండల మీదున్న ఒక ఎత్తైన ప్రదేశానికి తీసుకువెళ్ళి బాబాజీ నాకు దూరంలో దిగంతాన ఉన్న ద్రోణగిరి శ్రేణిని చూపించారు. గ్రామస్థులకు వీడ్కోలు చెప్పి మేము మా క్లిష్ట ప్రయాణాన్ని మళ్ళీ కొనసాగించాం.

సుదీర్ఘమైన ఆరోహణాన్ని చురుకుగా చేసి చీకటి పడుతూంటే పనర్ (Panar) చేరుకున్నాం. "కాకభుషుండి సరస్సు ఇక్కణ్ణించి మహా దూరమేమీ కాదు. కానీ మనమిప్పుడక్కడికి వెళ్ళలేం. పొద్దున్నే, ఆకాశం నిర్మలంగా ఉంటే, నందాదేవిని చూద్దాం. ఈ రోజు రాత్రి దగ్గరలో ఉన్న సహజమైన ఒక చిన్న గుహలో గడపాలి మనం. ఇక్కడ ఒకసారి మా గురువుగారితో బస చేసి ఉన్నాను. ఈ ప్రదేశాలు ఆ మహానుభావులకు ఇష్టమైన విడుదులు" అని బాబాజీ చెప్పారు.

నా గుండె ఆశతో మెరిసింది - ఆ మహా శ్రీగురు బాబాజీ వచ్చి దీవిస్తారా? ఇరుకైన లోయలోకి కిందికి దిగుతూ ఒక పెద్ద గుహాముఖానికి మేము చేరుకున్నాం. ఆపాటికి పూర్తిగా చీకటి పడిపోయింది. గుహలోంచి వెలుగు రావడం చూసి నేను ఆశ్చర్యపోయాను. నేను ఉత్తేజంతో కంపించిపోయాను. నా ప్రార్థనలు ఫలించబోతున్నాయా? ఆ మహా గురువు వచ్చి.... "త్వరగా లోపలికి రా. తుఫాను రావడానికి సన్నాహమవుతోంది. కొద్దిసేపట్లో మంచు కురవడం ప్రారంభమవుతుంది" అని బాబాజీ తొందరపెట్టారు.

సాధారణంగా తొణకని బెణకని బాబాజీ కూడా మేము గుహలో ప్రవేశిస్తూండగా "ఓహ్హో!" అని ఆశ్చర్యపోయారు. బాగా విశాలంగా ఉన్న గుహ మధ్యలో వెచ్చని ధుని వెలిగించి ఉంది. మాకెదురుగా నల్లటి చాయ ఉన్న ఒక పొట్టి, బుంగ బుగ్గల మనిషి

కూర్చొని ఉన్నారు. ఆయన భుజాల మీద పడుతూన్న పొడుగుపాటి జుట్టుతో, నేలాడుతున్న దట్టమైన గెడ్డంతో, బాబాజీలాగే చిన్న తెల్లని కటివస్త్రాన్ని కట్టుకొని ఉన్నారు.

మమ్మల్ని చూసి ఆయన 'ఓహో' అని అరుస్తూ గంతుతో లేచారు: "అహ్హహ్హా! మహా మహేశ్వరనాథుణ్ణే ఆశ్చర్యపరిచామే మేము. నువ్వు నేను రుద్రనాథ్‌లో ఉన్నా ననుకున్నావు. కానీ నేనిక్కడ పసర్‌లో ఉన్నాను" అని ఆయన అన్నారు. బాబాజీ ఆయన పాదాలు తాకబోతే ఆయన దాన్ని పడనివ్వలేదు. "మహేశ్, నువ్వు ఆ పని చేయనక్కర్లేదు". తరవాత ఆయన నా భుజాలమీద చేతులుంచి నా కళ్ళలోకి చూశారు. "శ్రీగురువుకి ఈ యువకుడి విషయంలో కొన్ని ఆలోచనలున్నాయి. మధూ, నీ గురించి ఆ మహానుభావుడు చెప్పారు. ప్రియ నేస్తమా, ఒక కఠిన జీవితం గడపడానికి సిద్ధం కా. నీకు లభ్యం కాగలిగిన ఉత్తమ మార్గదర్శి ఈ మహేశుడే అన్నది నా దృఢమైన విశ్వాసం".

"ఈయన నా పెద్ద గురుభాయి – తెన్‌కాశీ సిద్ధర్" అని బాబాజీ నాకు పరిచయం చేశారు. "ఈయన చాలా ఏళ్ళు తెన్‌కాశీ జలపాతాల దగ్గర ఉండేవారు. శ్రీగురు బాబాజీ ఈయనను హిమాలయాలకు వెళ్ళమని ఆదేశించారు. ఈయన తమిళమూ, మలయాళమూ రెండూ మాట్లాడతారు."

సిద్ధర్ నా వైపుకు తిరిగి తమిళంలో ఇలా అన్నారు: "నీకెలాగూ తమిళం తెలుసుగా. త్రివేంద్రం ఒక సరిహద్దు ప్రదేశం. అక్కడివాళ్ళు చాలామంది తమిళం అర్థం చేసుకుంటారు. అవునా?"

"అవును సిద్ధరే" అని నేను తమిళంలో జవాబు చెప్పాను. "నేను తమిళం బాగానే మాట్లాడగలను. నాకు తమిళం మాట్లాడే మిత్రులు చాలామందే ఉన్నారు"

"బాగుంది" అని సిద్ధర్ అన్నారు. "నువ్వు అన్నం కోసం ముఖం వాచి ఉంటావు. అవునా? చూడు, నీకోసం నేను అన్నం, నీకు ఇష్టమైన సాంబారూ చేశాను. అవి కూడా బాగా వేడిగా ఉన్నాయి. వాటితోబాటు కొంత రుచికరమైన పాల పాయసమూ" అని ధుని దగ్గర పేర్చి ఉన్న కొన్ని మట్టికుండల్ని చూపిస్తూ అన్నారు. "రా, సుష్టుగా తిందువు గాని"

ఓంకారాన్ని జపించి మేము రాత్రి భోజనం ఆరగించాం. కనీసం, నేను, ఆ భోజనానికి ఆనందించాను. భోజనమైన తరవాత సిద్ధర్ నాతో సుదీర్ఘంగా మాట్లాడారు. బాబాజీ వినడమే చేశారు. నాతో పునఃసంపర్కాన్ని సాధించడానికి బాబాజీ త్రివేంద్రానికి

వచ్చినప్పుడు, ఆయన (సిద్దర్) మా మాస్టారుతో బాటు దక్షిణాదికి వచ్చారని ఆ మాటల్లో చెప్పారు. ఆయన కోవలం కడలిగట్టు దగ్గరున్న అగస్త్య కూటానికి ధ్యానం కోసం వెళ్ళగా, బాబాజీ నన్ను కనుక్కోడమనే పనిలో ఉన్నారు. తమిళ సిద్ధ పురుష సంతతి బోధనల సారాన్ని చెప్పి, అగస్త్య శిష్యుడైన తిరుమూలార్ రచించిన గొప్ప "తిరుమన్తిరం" (Thirumantiram) చదవమని నాకు సూచించారు. తమిళ సిద్ధులకూ, నాథ్ పంథ్‌కీ, కాశ్మీరీ శైవానికీ, శ్రీగురు బాబాజీకి మధ్య ఉన్న సంబంధాన్ని వివరించారు. కొంతమంది శ్రీగురువును మహావతార్ బాబాజీ అని ఎందుకని పిలుస్తారని నేనడిగితే, శ్రీగురు బాబాజీ ప్రత్యక్ష శిష్యుడు కాని ఒక ఔత్సాహిక రచయిత, తరవాత ఎప్పుడో 'మహావతార్' అనే మాటను సృష్టించాడని ఆయన చెప్పారు. "మాకందరికీ ఆయన శ్రీగురువు. ఆయనను ఆవాహనం చేయడానికి పనికి వచ్చే మంత్రం "శ్రీగురుభ్యోనమః" అని ఆయనన్నారు. "ఎవరైనా ఆ మంత్రాన్ని సావధానంగా సవినయంగా జపిస్తే చాలు వెంటనే శ్రీగురు బాబాజీ అతనిని దీవిస్తారు".

"ఇప్పుడు నువ్వు నిద్రపో. రేపు రుద్రనాథ్‌కి వెళ్ళడానికి పెద్ద ఆరోహణమే ఉంది నీకు. ఇక్కడింకా కొంతకాలం ఉంటాను. నేను ఒకరికోసం ఎదురు చూస్తున్నాను".

నిప్పుకు అతి దాపులో ఉన్న ఒక మూలను ఎన్నుకొని నేను నా ఉన్ని దుప్పట్లోకి దూరిపోయాను. బాబాజీ, సిద్దరూ కొన్ని విషయాల గురించి చర్చించడం కొనసాగించారు. "శ్రీగురుభ్యోనమః" అని జపిస్తూ నేను నిద్రపోయాను. నన్ను శ్రీగురు బాబాజీ తన చంకలో మోస్తున్నట్టు కలగన్నాను.

మహాసిద్దర్‌కు వీడ్కోలు చెప్పి మేము పొద్దున్నే రుద్రనాథ్‌కి బయల్దేరాం. చుట్టూ ఉన్న కొండలన్నీ మంచుతో కప్పబడి ఉన్నాయి. గాలి చల్లగా ఉంది. నీలాకాశం నిర్మలంగా ఉంది. రాత్రి పడిన మంచు, కొండలనన్నిటినీ కప్పేసింది. దూరశిఖరాల వెనక నుంచి సూరీడు ఉదయిస్తూండగా, వాటి మొనల తెల్లదనం మిరిమిట్లు గొలిపే పసిడి పసుప్పచ్చగా మారింది.

చురుకైన నడకతో సాయంత్రానికి మేము రుద్రనాథ్ చేరుకున్నాం. మధ్యలో మధ్యాహ్నపూట, గుప్పెడు సెనగలు తిని దగ్గరలో ఉన్న సెలయేరులోని నీరు తాగడానికి కొన్ని నిముషాలు మాత్రమే విశ్రాంతి తీసుకున్నాం. మేము నిలుచున్న చోటునుంచి మంచుతో పూర్తిగా ముసుగై ఉన్న నందాదేవి శ్రేణి స్పష్టంగా కనిపిస్తోంది. కొద్దిగా కుడిపక్కకి ద్రోణగిరి పర్వతాలున్నాయి.

కల్పేశ్వర్‌లో మాదిరిగా రుద్రనాథ్‌లో కూడా గుడి లేదు; దేవతను ఆవరిస్తూ ఇటుకతో కట్టిన చిన్న దైవపీఠం మాత్రముంది. మంచుటోపీలతో ఉన్న నందాదేవి పర్వతశ్రేణికి అభిముఖంగా సముద్రమట్టానికి దాదాపు 8,200 అడుగుల పై చిలుకు ఎత్తున్న ఉన్న ఒక పర్వతపు వాలు మీద అది ఉంది. గుడికి పక్కనే ఉన్న ఒక చిన్నపాకలో మేము ఆ రాత్రి గడిపాము. ఆ పాక పూజారుల కోసమని నిర్మించినది. కానీ, మా అదృష్టం కొద్దీ, వాళ్ళు గోరేశ్వర్‌కి వెళ్ళారు. వాళ్ళు మర్నాడు తిరిగి వస్తారని పూజారి సహాయకుడు చెప్పాడు. మర్నాడు మేము తుంగనాథ్‌కి బయల్దేరదామని నిశ్చయించుకున్నాం.

# ౨8. కేదార్‌నాథ్ : మార్గాల ఆవిష్కరణ

తుంగనాథ్, మదమహేశ్వర యాత్రలను పూర్తిచేసుకొని గుప్తకాశీ, శోణప్రయాగల గుండా కేదారనాథ్‌కి చేరుకున్నాం. రెండుసార్లు కస్తూరీ మృగాలను చూడడం వినా చెప్పుకోదగినదేదీ జరగలేదు.

శ్రీగురు బాబాజీని అకస్మాత్తుగా చూడాలనే నా అభీష్టం మాత్రం తీరకుండానే ఉండిపోయింది. కేదార్‌నాథులోనైనా ఆయన కనిపిస్తారేమోనన్న ఆశను నేను ప్రకటించినప్పుడు, మా గురువుగారు నన్ను మందలించారు – క్రియాయోగ ధ్యేయమూ ఆధ్యాత్మిక అభ్యాసాల లక్ష్యమూ బాబాజీ మహారాజుని కలుసుకోడం కాదు; క్రమంగా వికసించి ఆధ్యాత్మిక జీవుడిగా మారడమే వాటి ధ్యేయం. శ్రీగురువు అవసరమని అనుకుంటే అడగకుండానే మన ఎదుట కనిపిస్తారు. అయినా నేనింకా ఆ మహాగురువు ఎక్కడో ఎప్పుడో ఒకప్పుడు నాకు కనిపిస్తారనే ఆశతోనే ఉన్నాను.

మందాకిని మీది వంతెనను దాటి గుడికి దారితీసే సన్నని రోడ్డు మీదకు ప్రవేశిస్తే ఎడమవైపు కొండల మీద పైపైన కట్టిన కొన్ని చిన్న కుటీరాలు కనిపిస్తాయి. ఇవి చాలావరకూ సహజంగా ఉన్న గుహలకు రూపాంతరాలు గానీ, పొడిగింపులు గానీ అయి వుంటాయి. వాటిలో ఏకాంతంగా యోగులు ఉంటూంటారు. అటువంటి కుటీరాల్లో ఒకటి బాబాజీకి ఇష్టమైనది. ప్రతి సంవత్సరమూ యాత్రా దినాల్లో కేదారనాథుకి తరచూ వద్దామనుకొనే ఒక ఉత్తర భారత వ్యాపారి కట్టాడు ఆ గుహావాసాన్ని. నాకు తెలిసిన కొద్దిమంది బాబాజీ శిష్యుల్లో ఇతనొకడు. ఇతన్ని నేను రెండుసార్లు చూశాను. 1983లో న్యూఢిల్లీలో ఇతను చనిపోయాడు.

బాబాజీ, నేనూ కేదారనాథు చేరగానే, శుభ్రం చేసి సిద్ధపరిచిన కుటిరాన్ని గమనించి ధునికోసం ఒక వారానికి సరిపోయే వంటచెరకు ఒక మూల పేర్చి ఉంచడం జరిగింది. ప్రతిరోజూ ఆ గుహా కుటీరానికి రెండు భోజనాలనూ, కాచిన పాలను పట్టుకెళ్ళి ఇవ్వాలని ఆ సజ్జనుడు తన వంటవాడికి పురమాయించి ఉంచాడు.

గుహనుంచి కనిపించే దృశ్యం చాలా సమ్మోహనంగా ఉంటుంది. మంచును చుట్టబెట్టుకున్న కేదార శిఖరాలు అస్తమిస్తూన్న సూరీడి కాంతితో ఎర్రబడి, లింగాయ తనమైన ఆ గుడికి పైన ఉన్నతంగా కనిపిస్తున్నాయి. అది అప్రమేయమైనది. ఆరాధించడానికి వీలైన పరిమాణాలకు అవతరించిందనడానికి సరళమైన ప్రతీక ఆ లింగం. మహాయోగి అయిన శివ ప్రభువు తాలూకు ప్రేరేపిత ఉద్రిక్త రుద్రరూపం లాటిది ఆ లింగం. చుట్టూ కేదార సహచరులు (పర్వతాలు) ఆ విధమైన మంచులాటి

తెల్లటి తొడుగులు తొడిగినవారే. చలి ఎంత తీవ్రంగా ఉన్నా నేను బాబాజీతో సహా అక్కడ చాలా ఆనందపూరిత దినాలను గడిపాను.

ప్రతి వుదయం లింగదర్శనం కోసం మేము గుళ్ళోకి వెళ్ళేవాళ్ళం. ఆ గుడి పెద్ద పురోహితుడు దక్షిణ భారతీయుడు. అతను బాబాజీని ఎప్పుడూ చాలా గౌరవంగా చూసేవాడు. లోపల ఎంతసేపు కావాలంటే అంతసేపు కూర్చోడానికి మమ్మల్ని అనుమతించేవాడు. ఆ గర్భగుడిలో శక్తి స్పందనలు స్పష్టంగానూ రూఢిగానూ వ్యాపించి ఉన్నాయి. అక్కడ అప్రయత్నంగానే గాఢధ్యానమగ్నుణ్ణి కాగలనని నాకనిపించేది.

ఆ తరవాత, మేము భైరవగిరులమీదకు ఎక్కేవాళ్ళం. భైరవగిరుల నుంచి కనిపించే దృశ్యం అద్భుతంగా ఉండేది. అక్కడ చాలావరకు కళ్ళు తెరిచి ఉంచే మేము ధ్యాన నిమగ్నులమై గంటల కొద్దీ గడిపేవాళ్ళం. భైరవనాథమూర్తిని ప్రతిష్ఠించిన చిన్నగుట్ట పక్కగా రెండు కుటీరాలున్నాయి. ఒకదానిలో జెడలు కట్టిన ఉదాసీ సాధు ఉండేవాడు; రెండో దానిలో గంజాయి పొగ తాగే నాగుడొకడుండేవాడు. ఇద్దరూ బాబాజీకి నమస్కరించి ఆశీస్సులనందుకోడానికి బయటకు వచ్చారు.

మేము మధ్యాహ్నానికి గుహకు తిరిగి వచ్చి వంటవాడు సమకూర్చిన భోజనం చేసేవాళ్ళం. అప్పుడప్పుడు ఢిల్లీ వ్యాపారి బాబాజీ దీవెనలను పొందడానికి తానే వచ్చేవాడు. కొన్ని సంశయాలను తీర్చుకుంటూ ఉండేవాడు. సాయంత్రాల్లో మేము గుహలోనే ఉండేవాళ్ళం. అప్పుడు బాబాజీ నాకు ఖేచర్ క్రియనూ, ఇతర ఉన్నత క్రియాయోగాభ్యాసాలనూ నేర్పేవారు. నాకు ఏమన్నా ప్రశ్నలుంటే వాటిని ఓర్పుగా వివరించి చెప్పేవారు. రాత్రిపూట, తేలికపాటి భోజనం తరవాత, ధునికి అభిముఖంగా కూర్చొని చాలాసేపు ధ్యానం చేసేవాళ్ళం. ఆ తరవాత నేను నిద్రించేవాణ్ణి. కానీ బాబాజీ మాత్రం, ఎప్పటిలాగానే, ధునికి ఎదురుగా బొమ్మలా అచలంగా కూర్చునేవారు. ఆ విధంగా ఆరు రోజులు గడిచాయి.

ఏడో రోజున బాబాజీ నాతో ఇలా చెప్పారు: "మా గురుదేవులతో ఉండడానికి నేను ఒక నాలుగు రోజులపాటు వెళ్ళి రావాలి. ఆయన ఇప్పుడు ఇక్కడ్నించి దగ్గర్లోనే ఉన్నారు కానీ నిన్ను నాతో మాత్రం తీసుకొని వెళ్ళలేను. రేపు పొద్దున్న శ్రీగురు బాబాజీ పంపించగా ముగ్గురు మనుషులు నీ దగ్గరకు వస్తారు. నువ్వు వికసించడానికీ, బహుపరిమితుల్లో నీ మెదడు ప్రవేశించడానికీ సహాయంచేసే ప్రత్యేకమైన ఒక ప్రక్రియ కోసం నిన్ను ఒక రహస్య ప్రదేశానికి తీసుకొని వెళ్తారు వాళ్ళు. నీకూ నాకూ మాత్రమే తెలిసిన సంకేత శబ్దాన్ని వాళ్ళు నీతో రహస్యంగా అంటారు. అప్పుడు వాళ్ళతో

నువ్వు నిరాటంకంగా వెళ్ళవచ్చు. నేను అక్కడుంటాను. అంతలోపు, నువ్వు విశ్రాంతంగా ఉంటూ నీ అభ్యాసాలను కొనసాగిస్తూ ఉండు. ఈ రోజు రాత్రి నువ్వేమీ తినద్దు. పుష్కలంగా నీరు తాగు."

ఇలా చెప్పి ఆయన నా తలను వాత్సల్యంగా నిమిరి వెళ్ళిపోయారు. నేను శ్రీగురు బాబాజీని చూడాలని చాలా ఆతురతతో ఉన్నానని ఆయన ద్వారా కబురు పంపిద్దామని అనుకున్నాను గానీ నిశ్శబ్దంగా ఉండడమే వివేకమని ఊరుకున్నాను. ఆయనకు తెలుసును. వేరే చెప్పుకోవాల్సిన పని లేదు. ప్రతిదానికీ ఒకసమయమంటూ ఉంటుంది.

వాళ్ళు మర్నాటి పొద్దున్నే వచ్చారు. వాళ్ళు ముగ్గురూ ఒకలాగే ఉన్నారు. వాళ్ళ శరీరాలమీద ఒక్క వెంట్రుక కూడా లేదు. అందరూ చక్కటి ఛాయలో ఉన్నవాళ్ళే. నడుము నుంచి మోకాళ్ళ దాకా ధోవతిలాగ చుట్టుకున్న తెల్ల బట్టను ధరించారు. వాళ్ళు పావుకోళ్ళు ధరించడం వల్ల నడుస్తుంటే టక్కుటక్కుమని ధ్వని వినిపించింది. వాళ్ళ పొడుగుపాటి, లేకువన్నె నల్లజుట్టు వారి భుజాలను తాకుతూ ఉంది; వాళ్ళ ముఖాలు ఆకుపచ్చ గుడ్డపట్టీలతో ఆచ్ఛాదితమై ఉన్నాయి. అవి జైన సన్యాసులు ధరించే శస్త్రచికిత్స సంబంధితమైన ముసుగుల్లాటి పట్టీల్లాగ ఉన్నాయి. వాళ్ళ ముఖాల్లో కనిపిస్తూన్న భాగాలు వెడల్పైన నొసళ్ళూ, లేడివన్నె కళ్ళూ మాత్రమే.

అందరూ కలిసి ఒకే కంఠస్వరంతో హిందీలో మృదువుగానూ దృఢంగానూ మాట్లాడారు: "మధూ! ఒక ప్రత్యేకమైన ప్రక్రియకోసం నిన్ను రహస్య ప్రదేశానికి తీసుకు వెళ్లడానికి మమ్మల్ని పంపించారు. మాతో రా."

"బాబాజీ నాకిచ్చిన సంకేత శబ్దాన్ని చెప్పండి" అని నేనడిగాను. వాళ్ళందరూ ఏకకంఠంతో ఆ శబ్దాన్ని చెప్పారు. నేను ఏ రకమైన తటపటాయింపూ లేకుండా వారి వెంట వెళ్ళాను. మేము కిందికి దిగాం; గుడిని దాటి దాని వెనక నడిచాం. ఒక చోట వాళ్ళు "ఆదిశంకరులు రహస్య మార్గాన్ననుసరించి మహా శ్రీగురువును కలుసుకున్న ప్రదేశం ఇదే. ఆ తరవాతనే ఆయన మహాజనానికి కనిపించకుండా ఉంటున్నారు" అని చెప్పారు. మరో పది నిముషాల పాటు నడిచిన తరవాత వాళ్ళు "ఇప్పుడు నీకు గంతలు కట్టాలి" అని అన్నారు. నా కళ్ళకు నల్లగుడ్డ కట్టి నడిపించారు. కొంతసేపైన తరవాత ఒక తలుపులాటి దాన్ని తెరిచిన చప్పుడు విన్నాను. అక్కడ నన్ను మేడమెట్ల మీదుగా కిందికి దించారు. అక్కడి నిశ్శబ్దాన్ని, ఇంతవరకూ వీస్తూన్న చల్లటి గాలి అకస్మాత్తుగా ఆగిపోవడాన్ని గమనించి, మేము భూగర్భంలో ఉన్న ఒక సొరంగంలో ఉన్నామని ఊహించాను.

మేము ఆగినప్పుడు అక్కడ నాకు ధూపపరిమళం వచ్చింది. అప్పుడు నా కళ్ళకున్న గంతలు తీసేశారు. నూనె దీపాలతో వెలుగుతూన్న ఒక పెద్ద భూగర్భ గుహలో నేను ఉన్నట్టుగా చూశాను. గుహామధ్యలో ఉన్న అగ్నిగుండం నుంచి సుగంధ ధూపం మావైపుకు వస్తోంది. గుహకు ఆ చివరన బాబాజీ కనిపించడంతో నాకు ఉపశమనం కలిగింది. "భయపడకు. ఎక్కువ సమయం లేదు కాబట్టి ధ్యానం కన్నా వేరే రీతుల్లో నీ మెదడులోని కొన్ని కేంద్రాలను ఉత్తేజపరచాల్సి వస్తోంది. మేం తొందరలో ఉన్నాం. ఈ కేంద్రాలు ఉత్తేజితాలైతేనే తప్ప, ఉచ్చతర పరిమితులకు నడపగలిగే నీలోని మార్గాలను తెరిపించాలంటే చాలా జీవిత కాలాలే పడుతుంది. సనాతనులు ఉపయోగించిన సోమరసాన్ని ఇప్పుడు నువ్వు తాగు. మేము దాన్ని నీ కోసమనే ప్రత్యేకంగా తయారు చేశాం" అని ఆయన నా చేతికి లేతాకుపచ్చ రంగులో ఉన్న ద్రవంతో నిండిన ఒక వెండిగిన్నెను అందించారు.

వజ్రాసనంలో కూర్చొని నేనా చేదుచేదుగానూ, తియ్యతియ్యగానూ ఉన్న కషాయాన్ని త్రాగేను. కాలేజిలో ఉన్నప్పుడు నా స్నేహితుడు రంజిత్‌తో కలిసి అరసీసా బీర్ తాగినప్పుడు ఏ అనుభవం కలిగిందో దానితో సమానమైన అవస్థా పరిణామమే మొదట్లో నాకు కలిగింది. ఆ తరవాత అది మారి మరికొంత తీవ్రమయింది. నన్ను తీసుకు వచ్చిన ఆ ముగ్గురూ బాసినపట్టు వేసుకొని కూర్చొని సామవేదసూక్తాలు గానం చేస్తున్నారు. నా మనస్సు ఆ సామగాన ప్రవాహంతో ఒకటై, వ్యాపించి నా శరీరంలోంచి బయటికి చిందిపోయింది. సాంద్రమైన బహువర్ణకాంతులు కనిపించాయి. నేను చదివిన ఎల్.ఎస్.డి. అనుభవాలను గురించిన ఆలోచనలు నాకు గుర్తుకు వచ్చాయి.

బాబాజీ నన్ను జాగ్రత్తగా ఎడమవైపునున్న రాతి పలక దగ్గరకు నడిపించి దానిమీద శవాసనంలో పొడుగ్గా చాచుకొని పడుకునేలాగ చేశారు. మాట్లాడుతూంటే ఆయన కంఠధ్వని ఎక్కణ్ణుంచో చాలా దూరం నుంచి వస్తూన్నట్టనిపించింది. "కళ్ళు మూసుకో. నీ ఆత్మను శరీరంలోంచి బయటకు వెళ్ళనీ" అని చెప్పారాయన. క్షణంలో రాతిపలక మీద వెల్లకిలా శవంలాగ చాచినట్టు పడున్న నా శరీరాన్ని నేను గుహ ఎడమ గోడ దగ్గర నిలుచొని ఆశ్చర్యంగా పరికిస్తూ ఉన్నాను.

బాబాజీ నిర్దేశప్రకారం సామగానాన్ని ఆపిన ఆ ముగ్గురు సహచరులూ ఒక నల్ల అర్ధగోళాన్ని తెచ్చి నా తలదాపున ఉంచారు. ఆ అర్ధగోళంనుంచి రెండు బంగారు తీగలను లాగి నా తలకు రెండు పక్కలా కలిపేరు. అప్పుడు వాళ్ళు ఆ పరికరంపైన

గట్టిగా నొక్కేరు. నేను నా సురక్షిత స్థలం నుంచి నా శరీరం మూర్ఛ తాలూకు హఠాదాక్రమణల్లాటి దాడులకు లోను కావడం చూశాను. ఒక నిముషం, నేను సురక్షితంగానే ఉన్నా నేను చూస్తున్నదానితో ఒక విధంగా భయపడుతున్నాను కూడ. మరు నిముషంలో నేను మళ్ళీ నా శరీరంలోనే ఉండి ఆ భయంకరమైన వణుకు రోగాన్ని అనుభవించాను.

కాల్చడం వల్ల వచ్చే విపరీతమైన నొప్పినా వెన్నెముక మీదుగా పైకి సాగింది. ఎంత వేడి పుట్టిందంటే నా మొత్తం ఒళ్ళు, ముఖ్యంగా నా తల మంటల్లో ఉన్నట్టని పించింది. దాదాపుగా అదే అంతమనుకున్నాను; నేను బయటపడనేమో అనిపించింది. త్వరలోనే, ఉపశమింపజేసే కలకల ధ్వనిగా మారిన ఒక గర్జన ధ్వని హఠాత్తుగా నా చేతనత్వంలో ప్రవేశించింది. జిమ్ రీవ్స్ (Jim Reeves) కంఠధ్వనితో ఎవరో సుదీర్ఘంగా సాగదీస్తూ ఓంకారాన్ని గానం చేస్తున్నట్టనిపించింది. వణుకులు తగ్గాయి; వేడి తగ్గింది. చలికాలం రాత్రిపూట హాయిగా వెచ్చదనాన్నిచ్చే కుంపటిలాగ, ఒక వెచ్చని వెలుగు నా ఒంటినీ ఆత్మనీ ముంచెత్తింది. నా తల పైభాగం నుంచి నా వెనుబాము మీదుగా కిందకి ఒక తియ్యని అమృతం ప్రవహించసాగింది. నఖశిఖ పర్యంతం నేను అద్భుతమైన బ్రహ్మానందకర పారవశ్యాన్ని అనుభవించాను.

నేను కళ్ళు తెరిచి చుట్టూ చూశాను. ప్రతీదీ తాజాగా సరికొత్తగా జీవశక్తితో స్పందిస్తూ ఉంది. నేను కొత్త మనిషినయ్యాను; (నాలోని) పాతమనిషి మటుమాయమై, చచ్చిపోయినట్టై, దానినుంచి తిరిగి కొత్తగా పుట్టినట్టయ్యాను. నేను ఇప్పుడిక వేరుగా ఉన్న ఒక వ్యక్తిని కాను. నా చైతన్య కేంద్రం, అలాగే కదలకుండా పడి ఉండే దుమ్ముకణం నుంచి మొదలుపెట్టి పాలపుంత వరకూ అంతటా ఉంది. అన్ని సరిహద్దులూ ముక్కలైపోయాయి. నన్ను చూస్తున్న బాబాజీని నేను చూసినప్పుడు, నేనే ఆయన అన్నట్టుగా ఉంది నాకు.

"అవును, నువ్వు ఇప్పుడు మళ్ళీ పుట్టావు. ఇదే 'ద్విజ' (తిరిగి రెండోసారి పుట్టడం) శబ్దం అసలైన అర్థం. ఇప్పుడు నీ కొత్త 'నువ్వు'తో సర్దుకుపోవడానికి కొంత సమయం పడుతుంది కనక నెమ్మదిగా లే. ఇప్పుడే పుట్టిన బిడ్డలాగ నువ్వు పాకాలి, తరవాత కూర్చోవాలి. చివరకు, అభ్యాసంతో పూర్తిగా పెరిగిన మనిషి తాలూకు నిదానమూ నిశ్చితమూ అయిన అంగ వేయగలిగినంతవరకూ తప్పటడుగులతో నడవాలి.

"నీకు ఆశీస్సులు. శ్రీగురు బాబాజీ తన పాత శిష్యుడు మధూను కొంత కాలం లోపులోనే ఋషీకేశం దగ్గర చూస్తానని వాగ్దానం చేశారు. ఇప్పుడు మనం మన

గుహకు పోదాం నడు. మరొకసారి నీ కళ్ళు మూసుకో, పద్మాసనంలో కూచో" అని బాబాజీ చెప్పారు. ఆయన ఆజ్ఞను నేను విధేయంగా పాలించాను. నన్ను శక్తిమంతమైన గాలి ఎక్కడికో తోసేస్తుందనిపించింది. కొన్ని క్షణాల తరవాత, నేను దిగుతూన్నట్లని పించింది. తరవాత కదలిక ఆగిపోయింది. బాబాజీ "నీ కళ్ళు తెరు" అని అన్నారు. నేను కళ్ళు తెరిచాను. మేమిద్దరమూ మా వసతి అయిన కొండకొమ్ము మీది గుహకు తిరిగి వచ్చినట్టు తెలిసింది. "భూమ్మీద నీ జీవితావధి సమయంలో ఒకానొక నిర్దిష్ట కారణంతో తప్పించి ఇటువంటి విధంగా ఒక చోట నుంచి మరొక చోటికి వెళ్ళడాన్ని నువ్వు ఎప్పుడూ తిరిగి చెయ్యకూడదు. ఇప్పుడు నువ్వు లాలాజీ దగ్గరకు పోయి నీకోసం కొంత ఆహారం పంపించమని అడుగు. ఇంతట్లో నేను ధునిని వెలిగిస్తాను" అని బాబాజీ అన్నారు.

కేదారంలో మరో నాలుగు రోజులున్నాం మేము. ఆ సమయంలో బాదరాయణ వ్యాసుడు విరచించిన "బ్రహ్మసూత్రాల" తాలూకు విషయాల గురించీ, "పిస్టిస్ సోఫియా" (Pistis Sophia) అనే ఆత్మజ్ఞాన సంబంధమైన గ్రంథం తాలూకు కొన్ని విషయాల గురించీ నేను చర్చించాను (ఆయనతో).

# 29. మింటినుంచి దిగి వచ్చిన నిప్పు బంతి

ఐదో రోజున మేము ఋషీకేశానికి శోణప్రయాగ, గుప్తకాశీ, రుద్రప్రయాగల గుండా దిగడానికి ఉపక్రమించాం. రుద్రప్రయాగలో రెండు నదుల సంగమానికి దాపుల్లో ఒక వైష్ణవ బైరాగి సాధువుతో రెండు రోజులు గడిపాం. మర్నాటికి దేవప్రయాగ చేరాం. అక్కడ నేపాలు నుంచి వచ్చిన ఒక ముసలి యోగితో రెండు రోజులు గడిపాం. ఆయనకు చాలాకాలం క్రితం పశుపతినాథ్ దగ్గర చాలా కొద్దిసేపు పాటు శ్రీగురు బాబాజీని కలుసుకొనే సౌభాగ్యం కలిగిందిట. ఆయన అనుభవాన్ని చెబుతూంటే వింటూ నేను పులకరించాను.

దేవప్రయాగనుంచి ఒక ఉదయం బయలుదేరి సాయంత్రానికి వశిష్ఠ గుహకు చేరుకున్నాం. కేరళీయ బ్రహ్మచారి గడ్డు పరిస్థితిలో ఉన్న నన్ను దయతో చూస్తూండగా, అక్కడ బొబ్బలూ పుళ్ళూ పడ్డ నా పాదాల బాధను పోగొట్టుకొని తిరిగి ఆరోగ్యం కుదుట పడేదాకా వశిష్ఠ గుహలో మునుపు చాలా రోజులే గడిపాను. ఈ బ్రహ్మచారి బాబాజీని మునుపు చూడలేదు; అతని గురువు శ్రీపురుషోత్తమానంద మాత్రం వశిష్ఠ* గుహలో ఆయన అక్కడకు వచ్చిన తొలి రోజుల్లో బాబాజీని కలుసుకున్నారు. అయినా ఆ బ్రహ్మచారి చాలా గౌరవాన్ని చూపించాడు; ఒక మహాత్ముడికీ యదగిన గౌరవాన్ని బాబాజీకి ఇచ్చాడు.

బాబాజీ వశిష్ఠ గుహలో ఉండదలచుకోలేదు. వశిష్ఠ గుహకు దాపుగా, గంగానది తాలూకు రాళ్ళగట్టుమీద నడుస్తూ, కుడివైపునున్న గుట్టల వైపుకు జాగ్రత్తగా చూస్తే, ఒక చిన్న గుహ, ఒక పెద్ద మర్రిచెట్టు ఊడల వెనక చక్కగా కప్పి ఉంచినట్టుంటుంది. దాన్ని అరుంధతీ గుహ అని అంటారు. ఈ గుహలో బాబాజీ ఉండడానికి నిశ్చయించారు. ఆ గుహ అంటే తనకు ఇష్టమనీ, (ఇంతకుముందు) చాలాసార్లు అక్కడ తాను ఉన్నట్టూ ఆయన చెప్పారు. మేము జారుతూన్న రాతి చపటా మీదుగా ఎక్కి అరుంధతీ గుహకు చేరుకున్నాం. అది ఇద్దరికి సరిగ్గా సరిపోతుంది. గుహ ముందర ధునికి సరిపడేటంత ఒక పెద్ద చపటా రాయి, కప్పులేని వరండాలాగ ఉంది. ఆకుపచ్చటి గంగాజలంలో మునిగి, చీకటిపడే లోపులోనే చుట్టూ ఉన్న అడవి నుంచి ధునిని వెలిగించడానికి సరిపడేటంత పొడి వంటచెరుకును పోగుచేసుకున్నాం. రోజుకోసారి నేను ఇద్దరికీ సరిపడేటంత భోజనాన్ని వశిష్ఠ గుహ నుంచి తెచ్చేటట్టు ఏర్పాటు చేసుకున్నాం. అరుంధతీ గుహలో ఒక వారం చక్కగా గడిపాం.

---

* *ఈ బ్రహ్మచారికి గురువైన శ్రీ పురుషోత్తమానంద, వశిష్ఠ గుహలో నివసించిన తొలి రోజుల్లో, బాబాజీ ఆయన్ను కలుసుకున్నారు.*

మేము చేరుకున్న సాయంత్రం ఎందుకోగానీ నేను బాగా అలసిపోయి ఉన్నాను. బాబాజీ ఎప్పుడెప్పుడు సమ్మతిస్తే అప్పుడు నేను ఆయన పాదాలను చాలా సంతోషంతో ఒత్తుతూ సేవచేసుకునే వాణ్ణి. నేను ఆ రోజున ఆయన పాదాలను ఒత్తుతూ నిద్రపోయాను. నేనెప్పుడు నిద్రపోయానో నాకు తెలియదు. ఏం జరిగిందో తెలియదు కాని మధ్య రాత్రి నేను ఉలిక్కిపడి లేచాను. ఏదో నా కాలిని పట్టుకుంది. ఏదో ఒక అదవిమృగం నన్ను అవతలకి లాగేస్తోందని నాకు మొదట అనిపించింది. నేను కూర్చుందామని ప్రయత్నిస్తూంటే బాబాజీ తన ఓదార్చే కంఠంతో "నిద్ర పో అబ్బాయీ, నువ్వు చాలా అలసిపోయావు. నీ కండరాలకు విశ్రాంతి అవసరం" అని అనడం నాకు వినిపించింది. ఆయన నా కుడికాలిని తన ఒడిలో పెట్టుకొని పిసుకుతున్నారని అప్పుడే, ఆ క్షణంలోనే అర్థమయింది.

"బాబాజీ (ఇదేమిటండీ)!" అని నా అసమ్మతిని కనబరుస్తూ కాలిని వెనక్కి లాక్కోడానికి ప్రయత్నించాను కాని వీలు పడలేదు. "శాంతంగా ఉండి నిద్రపో" అన్నారు బాబాజీ: "ఏం, నీ పాదాలు నా ఒళ్ళో ఉన్నాయి కనక నువ్వు నరకానికి పోతావని నీకు భయం వేస్తోందా? తప్పుదారిన పడ్డ లోకం కన్నా హీనమైన నరకం లేదు. నిద్ర పో నాన్నా, నిన్ను తెల్లవారుజామునే లేపుతాను నేను". చీకట్లో ఆ మహానుభావుడి కరుణకు అభిభూతుణ్ణై నేను నిశ్శబ్దంగా ఏడ్చాను. తరవాత మళ్ళీ నిద్రపోయాను.

చాలా ఆనందంగా ఆ వారం అరుంధతీ గుహలో గడిపాం. తెరిచిన కళ్ళతో ధ్యానం చేసే పద్ధతిని నాకు వివరించి చెప్పారు బాబాజీ. ఒక అందమైన సాయంత్రం బాబాజీ ఇలా చెప్పడం మొదలెట్టారు: "చాలామందికి మూసిన కళ్ళతో ధ్యానం చేయడం అంత సులువుగా చేతకాదు. వాళ్ళు ధ్యానం చేస్తున్నామనుకోవచ్చును గానీ వాళ్ళ మనస్సు బాహ్య ప్రపంచం పట్టు నుంచి విడలేక, ఒక అంతఃప్రపంచాన్ని ఆవాహనం చేసుకొని తిరిగి ఆలోచనా ప్రక్రియలో చిక్కుపడిపోతుంది. దానికి బదులు, నువ్వు కళ్ళను తెరిచి ఉంచి, నిరంతరంగా సాగే జీవన స్రవంతిని, స్తబ్ధతకు లోనయ్యే కదలిక లేని కుంట నీళ్ళ మాదిరిగా కాకుండా నిత్యం మారుతూ, నిత్య నవీనంగా ఉంటూ, స్ఫటికంలాగ స్వచ్ఛంగా సదా వ్యాపించే బ్రహ్మంలాగ ('బృహ' అనే క్రియా మూలానికి పెంపొందడమని అర్థం) కింద సాగిపోతూన్న గంగా ప్రవాహాన్ని పరికిస్తూ ఉండు.

"అలా పరికిస్తూ ఉంటే, అవధులులేని విశ్వజనీన జీవన ప్రవాహంతో ఒకటైపోతావు. ఏమీ ఊహించుకోవద్దు. నిష్కపటంగా ఏ స్థిరమైన లక్ష్యమూ లేకుండా

పరిశీలిస్తూ ఉండు. ఏమీ కలిగించుకోకుండా ఉండి ఆనందించు. ఈశోపనిషత్తు అన్నట్టు – తేనత్యక్తేన భుంజీథాః"*

అరుంధతీ గుహ దగ్గర జరిగిన రెండు అసాధారణ సంఘటనల్లో మొదటిదాన్ని నేను 'దోసె ఉపాఖ్యానం' అని వ్యవహరిద్దామనుకుంటున్నాను. గుహ దగ్గర ఉన్న రోజుల్లో ఆఖరి రోజు పొద్దున్న పూట, నేను క్రియాభ్యాసం చేస్తూ కనుబొమల మధ్య ఉండే ఆజ్ఞా చక్రపు రెండు రేకుల తెల్లని పద్మకేంద్రం మీద నా అవధానాన్ని నిలుపుదామని ప్రయత్నిస్తున్నాను. అయితే నేనెంత ప్రయత్నించినా నేను చూడగలిగినది మాత్రం, నాకు ఇష్టమైన పొద్దుటి ఉపాహారం దక్షిణ భారతీయ మసాలాదోసె బొమ్మే మొట్టమొదటిసారిగా నాకు అర్థమయింది ఈ మసాలా దోసె అంటే నా కింత ఇష్టమో. అది నా పాలిట దాదాపుగా ఒక ప్రబలమైన మొండిపట్టి పీడిస్తోంది. నేను ఆ బొమ్మను చెరిపేద్దామని ప్రయత్నిస్తూ గట్టిగా పెద్ద యుద్ధమే చేశాను.

బాబాజీ నా దగ్గరకు వచ్చి నా భుజం మీద తట్టి, "అయితే నువ్వు దేన్ని గురించి ధ్యానం చేస్తున్నావుట?" అని అడిగారు. "ఆజ్ఞాచక్రం" అని నేను జవాబు చెప్పాను. "అవునా? అది మసాలా దోసెలాగ ఉంది కదూ!!" అని అంటూ ఆయన నవ్వడం మొదలుపెట్టారు.

"బాబాజీ! నా మనస్సులో జరిగేదంతా మీకు తెలుసునని నేను ఎరుగుదును. నవ్వకండి. దయ ఉంచి దీని నుంచి నేను బయట పడేలాగ సాయం చెయ్యండి" అని నేను అర్థించాను.

ఏమీ అనుకోకు. నేను నవ్వనులే. రేపు మనం ఋషీకేశానికి వెళ్తున్నాం. అక్కడ ఈ పిచ్చి పోయేలాగ నేను సహాయపడతాను. మొదటి అడుగేమిటంటే నీకిష్టం వచ్చినంతగా మసాలా దోసెను తినడం. ఋషీకేశంలోని మద్రాస్ కఫే మంచి మసాలా దోసెలను చేసిపెడుతుంది. నీకు ఎన్ని కావాలో అన్నీ తెప్పిస్తాను. దానితో నువ్వు ఈ మొండి ఇష్టం తాలూకు ఉడుముపట్టునుంచి విడివడతావు. "యోగోభోగాయతే" అనే తాంత్రిక సూత్రం, ఒక్కోసారి విపరీత లౌల్యంతో తప్ప, ఉన్మత్తపరిచే ఆసక్తులు విడిచి

---

* *ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాంజగత్ ।*
*తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్యస్విద్ధనమ్ ॥ (ఈశావాస్యోపనిషత్ – 1)*

*ఈ జగత్తులో కదిలేదీ, కంపించేదీ, మారేదీ అయిన ప్రతీదీ – కదలని, కంపించని, మారని ఆత్మేశుడితో కూడి ఉంటేనే ఈ లోకం వాసయోగ్యంగా ఉంటుంది. జగత్తును నిర్మించి, ఈ ఆస్తినంతా ఇక్కడుండేవాళ్ళు వాడుకకోసం వదిలిపెట్టి, తాను కనుమరుగై ఉన్నాడు ఆత్మేశుడు. ఈ జగదాస్తి ఇక్కడున్న ఎవరిదీ కాదు. దానినంతనీ లోభపడకుండా, నాదేనని భావించకుండా, ఆసక్తిరహితంగా, ఉన్నంతకాలమూ ఆనందంగా, త్యాగబుద్ధితోనే అనుభవించాలి.*

పెట్టవనే సంగతి మీద ఆధారపడే ఏర్పడింది. అంచేత కొంచెం విశ్రాంతి తీసుకొని మళ్ళీ ప్రయత్నం చెయ్యి" అని బాబాజీ అన్నారు.

మర్నాడు నా కడుపు నిండా మసాలా దోసెలు తినబోతున్నానన్న ఆలోచనే అంతదాకా నా క్రియను అడ్డుకున్న బొమ్మను తుడిచిపారేసిందని గ్రహించి నేను ఆశ్చర్యపోయాను; తరువాత, నేను నా క్రియాభ్యాసాన్ని సులువుగానే పూర్తి చేసుకోగలిగాను.

రెండో సంఘటన నిజానికి మొదట్లో ఒక భయంకరమైన అనుభవమని చెప్పాలి. అరుంధతీ గుహలో ఉన్న మూడో నాటి రాత్రి మేఘగర్జన అని నేననుకున్న ఒక చప్పుడుతో నాకు మెలుకువ వచ్చింది. నేను కళ్ళు తెరిచాను. ధుని కాంతిలో బాబాజీ స్థూలరూపం కనిపిస్తోంది. ఆయన వీపు నా వైపుకు ఉంచి మామూలు ఆసనంలో కూర్చొని ఉన్నారు. ఇంకా పైకి చూశాను. రెండు విడిపోతున్న మబ్బుల మధ్య నుంచి సుమారు పూర్ణచంద్రుడి పరిమాణంలో ఉన్న ఏదో ఒకటి ఇవతలికి వస్తోంది. కానీ అది చంద్రుడు కానే కాదు; చంద్రుడు ప్రసరించే చల్లని తెల్లని వెండికాంతికి బదులు, ఆ వస్తువు ఒక అగ్నిగోళంలాగ మండుతోంది. అది దగ్గరకు వస్తూ ఉంటే గర్జన ధ్వని ఇంకా ఇంకా పెరుగుతోంది. అది గుహవైపుకు వచ్చి పిడుగుధ్వని చేస్తూ ధునిమీద వాలింది.

నాకు ఎంత భయం వేసిందంటే నేను సరిగ్గా కూర్చోలేకపోయాను కూడ. కానీ బాబాజీ మాత్రం తిన్నగా స్థాణువులాగ అప్రభావితంగా అచంచలంగా కూర్చొని ఉన్నారు. నేను ఆయనను పిలుద్దామని అనుకున్నాను కానీ నా స్వరతంత్రులు పని చేయడానికి నిరాకరించాయి. ఎలాగో అలాగ నేను కూర్చొనే స్థితికి నన్ను కూడదీసుకున్నాను. ఒళ్ళంతా భయంతో వణికిపోయింది.

నా చకిత చక్షువుల ముందు ఒక వింత దృశ్యం విస్ఫారుతూ కనిపించింది. ఫెళఫెళమనే ఉరుము ధ్వని ఆగిపోయింది. పూర్తిగా నిశ్శబ్దమయింది. రమారమి రెండడుగుల వ్యాసమున్న ఆ అగ్నిగోళం నిలువునా రెండుగా చీలి దాంట్లోంచి ఏదో బయటకు వచ్చింది. దాన్ని చూస్తూనే నా ఒంటిమీద వెంట్రుకలన్నీ నిక్కబొడుచుకొని నిలుచున్నాయి. అదొక పెద్ద పాము. దాని పడగ తాచుపాముకి మల్లే ఉంది. అది నీల విద్యుత్తుగా మెరుస్తోంది. పారదర్శకమైన ఊదారంగు గాజులాటి ద్రవ్యం లోపల సూక్ష్మ విద్యుత్తంతువులు వెలుగుతూన్నట్టు ఉంది ఆ పడగ. పాములాటి ఆ ప్రాణి కళ్ళు జ్వలించాయి; అది మెత్తగా బుసకొట్టింది. ఆ ప్రాణి ఎప్పుడైతే తన పడగను బాబాజీ పాదాల మీదకు వంచి తాకిందో ఆ క్షణంలోనే నా భయం కాస్తా పోయింది.

దాని తలను తన కుడిచేత్తో తాకి బాబాజీ దాన్ని దీవించాడు. తరువాత ఆయన చేసిన పని, అప్పుడు నేను చూస్తున్నదొక వెర్రి కలా, నిజమా అనే సందేహాన్ని కలిగించింది. ఆయన జవాబుగా బుసకొట్టారు!

ఆ నీలితాచు నిలువుగా లేచి బాబాజీకి ఎదురుగా కూర్చుంది. బుసబుసల సంభాషణ చాలాసేపే నడిచింది. అప్పుడు బాబాజీ "మధూ! ముందుకు రా. సర్పలోకపు ఉపనాయకుణ్ణి చూడు" అని అన్నారు. నేను ముందుకు సాగి జాగ్రత్తగా బాబాజీ వెనకగా కూర్చున్నాను. పాము బుసకొట్టింది. "నాగరాజుకి ప్రణమిల్లు" అని బాబాజీ చెప్పారు. నేను ఆ పాము ముందు బాగా వంగి నమస్కరించాను. అత్యంత సమీపంగా చూడడం వల్ల ఆ సర్పం చాలా పెద్దదనీ, దానికి తళతళా మెరిసే తెలివైన కళ్ళున్నాయనీ గమనించాను. ఆ మహాసర్పం బుసకొట్టి తన చీలిన నాలికతో నా తలను తాకింది. నేను ఇసుమంత కూడా భయపడలేదని గమనించాను. కానీ, నా శరీరమంతా సన్నని విద్యుల్లత ప్రసరించడం గమనించాను.

తర్వాత ఆకస్మికంగా అది ఆ గోళంలోకి తిరిగి ప్రాకింది. ఆ రెండు అర్ధగోళాలు మూసుకుపోయిన చప్పుడయింది. మళ్ళీ ఫెళఫెళార్భటులతోటి ఆ బంతి పైకి ఎగిరి కొంతసేపటికి మేఘాల్లో అంతర్ధానమయిపోయింది. దీన్ని వివరించమని బాబాజీని నేను అడగకుండా ఉండలేకపోయాను. "బాబాజీ! మీరు నాకు దీని వివరణ ఇచ్చి తీరాలి. దీన్ని నేను ఎవరికైనా చెబితే, నన్ను వాళ్ళు పూర్తిగా పిచ్చివాడిగా జమకడతారు; లేకపోతే, నేనేదో ఒక రకమైన కట్టుకథను అల్లుతున్నాననైనా అనుకుంటారు. అంచేత దీన్ని నాలోనే దాచుకోవాలి. అయినా నాకు మీరు దీన్ని వివరించి చెప్పాలి" అని నేను అడిగాను.

"అవును, నువ్వనేది నిజమే. నీ యీ అనుభవాన్ని చాలామంది నమ్మరు. అయినప్పటికీ, నువ్వు దీన్ని స్వీయచరిత్ర వ్రాసేటప్పుడు సాధారణ జనంతో పంచుకోవాలి. నమ్ముతారూ, నమ్మకపోతారూ అనేది పట్టించుకోనక్కర లేదు. అయినా నీకు దీన్ని వివరిస్తాను. నిజం కల్పనకన్నా చాలా విచిత్రంగా ఉంటుంది" అని బాబాజీ అన్నారు.

"మన పాలపుంతలో ఏడుగ్రహాలూ పద్దెనిమిది చంద్రుళ్ళూ ఉన్న నక్షత్ర మండలం ఒకటి ఉంది. ఆ గ్రహాల్లో ఒకటి సర్పలోకం: పరిపక్వత చెంది (జ్ఞానాత్మకంగా) బాగా వికసించిన ఫణులు (సర్పాలు) దీనిలో నివసిస్తూ ఉంటాయి. ఈ పాముల్ని నాగదేవతలని అంటారు. నువ్వు చూసిన అతను ఆ రాజ్యం తాలూకు ఉప నాయకుడు. అతనిని నాగరాజు అని అంటారు. నాగులకు మహానాయకుడు అయినవాడు ఐదు పడగల బంగరు సర్పం. అతను సనాతన భారతీయ గ్రంథాల్లో

అనంతుడుగా వర్ణితుడయ్యాడు.

"వేలాది ఏళ్ళ క్రితం, మానవజాతి ఇంకా మానసిక వికాసపు బాల్యదశల్లో ఉన్నప్పుడు, సర్పలోకంతో సక్రమమైన సంపర్కం ఉండేది. విజ్ఞులూ వికసితులూ అయిన నాగులు భూమి మీదకు తరచు వచ్చి చాలాకాలం గడుపుతూ మానవులకు బోధించి విద్యావంతులను చేసేవాళ్ళు. అన్ని సనాతన నాగరికతల్లోనూ కనిపించే నాగారాధనం, భూతకాలపు ఉన్నత నాగులకు మనమిచ్చే నివాళి. వాళ్ళకున్న గాఢ విజ్ఞానాన్ని చూసే వాళ్ళ ప్రతిమలను పూజించి ఆదరించడం జరిగేది. మొదట్లో కుండలినీ శక్తి రహస్యాన్ని మనకు బోధించినదీ వాళ్ళే. కుండలినీ శక్తికి ప్రతీక కూడా సర్పమే. అష్టాంగయోగాన్ని లోకానికిచ్చిన పతంజలి కూడా ఒక నాగుడే. అతనిని సగం పాముగా సగం మనిషిగా చిత్రిస్తూ ఉంటారు. ఫారో తలమీద ఉండే సర్పమూ, యోగదేవుడైన శివుణ్ణి చుట్టి ఉండే పామూ – అన్నీ కొంతమంది మానవులకు నాగ బోధకులు ప్రదానం చేసిన శక్తికీ విజ్ఞానానికీ ప్రతీకలే.

"అయితే, (ఇప్పుడు) అస్తమానూ జరుగుతూన్నట్టుగానే, మానవులు మహా శక్తివంతులవుతూంటే, మహాస్వార్థపరులు, కుటిల స్వభావులూ కావడం ప్రారంభమైంది. మనుష్యులు, పోనీ, వాళ్ళలో చాలామంది, వ్యక్తిగత లాభం కోసం చంపడానికి కూడా సిద్ధమైపోతారు. భౌతికంగానూ, వివేకాత్మకంగాను, ఆధ్యాత్మికంగానూ ఉన్నతులైన నాగుల ప్రాబల్యాన్ని చూసి కొంతమంది మనుష్యులు భయపడ్డారు. వారికి ఋణపడి ఉన్నామనే మాటను మరిచిపోయి ఆ నాగుల నుంచి పొందిన శక్తులను వాళ్ళకు వ్యతిరేకంగా ఉపయోగించడం మొదలుపెట్టారు.

"ఒక సమయంలో నాగుల సామూహిక సంహారాలే జరిగాయి. నాగుల ప్రధాన ప్రభువు భూమ్మీద ఉన్న నాగులనందర్నీ వెనక్కి రమ్మనడానికే నిశ్చయించుకొన్నాడు. ఆధ్యాత్మికంగా బాగా వికసితులైన కొంతమంది మనుష్యులతో తప్పించి తతిమ్మా అందరితోనూ సంబంధాలు తెంచేశాడు ఆయన. రాత్రికి రాత్రే, (మానవ లోకంలో ఉన్న) ఆ అందర్నీ సర్పలోకానికి చేర్చడం జరిగింది. జబ్బుగా ఉన్నవో బాగా ముసలిగా ఉన్నవో లేకపోతే, అరుదు సందర్భాల్లో, నాగుల ప్రధాన ప్రభువు ఇచ్చిన ఆజ్ఞలను ధిక్కరించి ఇంకా తామేదో విధంగా మనుష్యుల్ని బాగుచేయగలమనుకున్నవో ఇక్కడ ఉండిపోయాయి.

"ఇప్పుడు ప్రపంచంలో ఉన్న నాగులూ, సర్పాలూ, అప్పుడు వెనక మిగిలిన వారి సంతతివాళ్ళే. రక్తసంబంధీకుల కలయికల వల్ల కలిగిన సంతానం కారణంగా వాళ్ళు మాంద్యానికి ఎర అయిపోయారు కనకనే వారి పూర్వీకుల గొప్ప లక్షణాలు

కోల్పోయారు. అయినప్పటికీ, నేను చెప్పినట్లు ఆ లోకపు నాగులు మానవజాతిలోని వికాసవంతులతో సంపర్క మార్గాలను తెరిచే ఉంచుకున్నారు. మహానుభావుడైన షిర్డీ సాయినాథుడు మూడు రోజుల పాటు తన శరీరాన్ని వదిలివెళ్ళి నాలుగో రోజుకి తిరిగి వచ్చేసరికల్లా ఆయన చనిపోయాడని అనుకున్న మహాజనులందరూ ఆశ్చర్య పోయారు. ఆయన తిరిగి వచ్చి తన సన్నిహిత సహచర వర్గానికి తాను మరో లోకంలో ఏదో ఒక కలహాన్ని తీర్చడానికి వెళ్ళానని చెప్పారు.

"ఆయన చెప్పిన ఆ మరో లోకం ఈ సర్పలోకమే. ఆ దెబ్బలాటేమిటో నేను నీకు వివరించకూడదు కానీ అది పూర్తిగా పరిష్కారం కాలేదు. అది తిరిగి చెలరేగింది. నాగరాజు శ్రీగురువు దగ్గరకు సాయంకోసం వెళ్ళాడు. ఆయన సూచనతో నా దగ్గరకు వచ్చి ఆ విషయాన్ని చర్చించాడు", అని బాబాజీ మొత్తం సంగతిని వివరించారు.

"బాబాజీ! ఇదంతా ఎంత అసంబద్ధంగానూ అసాధారణంగానూ ఉందంటే, నేనెప్పుడైనా ఒక జీవిత కథ రాసినట్లైతే – అది నేను చేయవచ్చు ఎప్పుడో ఒకప్పుడు, మీరు అలాగ చెబుతున్నారు కనక – దాన్ని పాఠకులు మనఃస్థిమితం లేనివాడి వెర్రి మాటలుగానైనా, లేకపోతే వట్టి కల్పితకథగానైనా తీసిపారేస్తారు. నేను దాన్ని పట్టించుకోననుకోండి. అలాగే కానీండి" అని నేను అన్నాను.

బాబాజీ నవ్వేరు. "నేను మళ్ళీ చెబుతున్నాను. సత్యమెప్పుడూ కల్పిత కథ కన్నా చాలా వింతగా ఉంటుంది. ఈ కథ వాళ్ళ ఊహను ప్రబోధించగలిగితే వాళ్ళు ఏదో ఒక సమయంలో, శుష్కతర్కంతో గానీ, ఇప్పటి ప్రాప్య జ్ఞాన స్థాయిలతో గానీ అర్థం చేసుకోలేని ఉచ్చతర చైతన్య రాజ్యాలున్నాయని తెలుసుకోగలుగుతారని ఆశించవచ్చు.

"అయితే, నువ్వు నీ జీవిత కథను రాయడానికి ప్రయత్నం చేసే సమయానికి, విజ్ఞాన శాస్త్రలోకంలో కూడా అంతరిక్షమూ ఇతర గ్రహాల గురించిన జ్ఞానం బాగా పెంపొందే ఉంటుంది. ఇతర గ్రహాల మీదా లేకపోతే నక్షత్ర వ్యవస్థల్లోనూ జీవం ఉంది, లేకపోతే ఉండేది అనేమాట, ఇప్పటిదాకా ఆ విషయమై అనుమానించని విశ్వభాగాల్లో జీవరూపాలు వికసించి పోషితాలు కావడానికి ఆవశ్యకమైన నీరూ, ఇతర పరిస్థితులూ ఉన్నాయని కనుక్కోడం జరిగితే, బలపడుతుంది, బహుశా, పక్ష పాతరహితుడైన ఏ ఒక్క శాస్త్రజ్ఞుడైనా నీ కథనానికి కనీసం చూపించతగిన శ్రద్ధను చూపించడం యోగ్యమని అనుకుంటాడేమో మరి. అప్పుడు కూడా 'ఖాయం చేసుకున్న ప్రమాణాల' జాబితాలో చేరని దేనినైనా అశాస్త్రీయంగా తీసిపారేసే మూర్ఖ వైఖరినే అనుసరిస్తే మాత్రం ఏ రకమైనా ఆశా లేదు.

"ఇప్పుడు నువ్వు బాగా అలసిపోయుంటావు. వెళ్ళు నిద్రపో" అని బాబాజీ అన్నారు.

# ౩౦. స్వస్థత, పరమ గురువు దర్శనం

'మసాలా దోసె' ఉదంతమూ, నాగరాజు రావడమూ జరిగిన మరుసటి రోజు పొద్దున్న గంగానది కుడివైపు ఒడ్డుమీదుగా ఉన్న సన్నని దారిమీదుగా నడుస్తూ ఋషీకేశానికి బయల్దేరాం. వేగంగా ప్రవహించే నదీ, కిచకిచలాడే పక్షులూ, (ఎత్తైన) పర్వతాలూ, పట్నవాసుల లోభపు హింసకు లోనుగాకుండా తీవ్ర సాధన చేసే సాధువులుండే నిరాడంబర ఆశ్రమాలూ ఉన్న ఆ దృశ్యం చాలా ఆకర్షణీయంగా ఉంది. ఒకచోట, దాపునే ఉన్న పర్వతం పక్కన నెమళ్ళను చూశాం. వాటిలో ఒకటి, మగది – దాని తోకను విప్పార్చుకొని నృత్యం చేస్తోంది. రీసస్ కోతులూ, నల్లమొగం లంగూర్లూ కూడా ఉన్నాయి అక్కడ.

లక్ష్మణ్ ఝూలా దగ్గర కొంతసేపు ఆగేం. అది ఆ రోజుల్లో గంగ మీదుగా, సంధుల్లో సత్తువలేని సంకుచితమైన ఒక మోకు సేతువు (). సాధువులూ, అన్నిరకాల సన్యాసులూ లక్ష్మణ్ ఝూలాలో ఉండేవాళ్ళు. వివిధ శాఖలకు చెందిన చాలా పెద్ద ఆశ్రమాలు కూడా అక్కడ ఉన్నాయి. దానిమీదుగా నడుస్తూంటే తప్పెట్లూ తాళాలతో భక్తిగాన ధ్వని వినిపిస్తూ ఉంటుంది. అది చాలా సుందరమైన ప్రదేశం.

మేము బాగా కిందుగా ఉన్న ఒక స్నానఘట్టం దగ్గర ఆగేం. గంగానది శీతల జలాల్లో మేము పునర్జీవం పొందగలిగేలాగ ఒక మునక వేశాం. చేరువనే ఉన్న అన్న క్షేత్రమొకదానిలో నేను రొట్టె, పప్పూ సంపాదించాను; గంగానది ఒడ్డుమీద కూర్చొని ఆనందంగా మేము భోజనం చేశాం. నాకు తల్లీతండ్రీ, గురువూ, ప్రియసఖుడూ అయిన బాబాజీలాటి వ్యక్తితో చీకూచింతా లేకుండానూ ఏ నిర్బంధమూ లేకుండానూ ఆనందంగా తిరుగుతూంటే ఆహా! ఆ జీవితం ఎంత అద్భుతంగా ఉంటుంది!

మేము ఒక పెద్ద రావిచెట్టు నీడలో కొద్దిసేపు విశ్రాంతి తీసుకొని ప్రయాణాన్ని కొనసాగించాం. అపరాహ్ణం వేళకు మునీ–కీ–రేతీకి చేరుకున్నాం. ఋషీకేశం అంటే నాకు చాలా ఇష్టం. ఆ ప్రదేశంలో ఏదో అద్భుత తత్త్వం ఉంది. నేను మొదటిసారి చూసినప్పుడే నాకా భావం ఏర్పడింది. అప్పుడు నేను డివైన్ లైఫ్ సొసైటీలో ఉన్నాను. నేను తిరిగి అక్కడికి వచ్చినందుకు, అందులోనూ ప్రియ బాబాజీతో సహా వచ్చినందుకు చాలా సంతోషంగా ఉంది. నా గుండె మహా ప్రశాంతంగా ఉంది; ఆయన సన్నిధిలో ఆనందమగ్నమై ఉంది.

గంగకు ఒకవైపు బద్రీనాథ్‌కు పోయే యాత్రావ్యాకులమైన రోడ్డుంది; ఆ రోడ్డుకి రెండోవైపు డివైన్ లైఫ్ సొసైటీ, యోగ నికేతనమూ ఉన్నాయి. ఇతరాశ్రమాల్లో చాలా మటుకు (గంగకు) ఆవలి ఒడ్డునే ఉన్నాయి. మేము నడిచే క్లిష్టమార్గం మమ్మల్ని ఆ

రెండోవైపుకే తీసుకెళ్తుంది. గంగ ఒడ్డున పొడుగునా మహాత్ముల ఆశ్రమాలున్నాయి. కొంతమంది ఏకాంతంగా చిన్నచిన్న కుటీరాల్లో ఉంటూంటారు; మరికొందరు పెద్దపెద్ద ఆశ్రమాల్లో సహవాసులుగా ఉంటూంటారు.

బాబాజీ నన్ను నేరుగా మౌనిబాబా గుహకు తీసుకువెళ్ళారు. అది నీలకంఠ పర్వతం కొనమీద ఉన్న నీలకంఠ దేవాలయానికి వెళ్ళే దోవలో ఉంది. గంగ పక్కనే నడుస్తూంటే, ఈ రోజుకీ ఏనుగులు తిరుగుతూ ఉండే ఒక అడవికి మనం చేరుకుంటాం. దానిలో చాలాభాగం ఇప్పుడు రాజాజీ నేషనల్ పార్క్‌లో ఉంది. దట్టమైన అడవి ప్రాంతంలోకి ప్రవేశించబోయే ముందు ప్రసిద్ధ మహేశ్ యోగి కట్టించిన ఎయిర్ కండీషన్ గుహాలున్నాయి. ఒక యోగ సాధనాన్ని స్వతంత్రంగా ఉపయోగించు కోడాన్ని సాధ్యపరిచిన మొదటివాడు బహుశా మహేశ్ యోగే. ఆయన భావాతీత ధ్యానం (TM - Transcendental Meditation)గా పేరు పెట్టి దాన్ని ప్రపంచవ్యాప్తంగ చేశారు. ఇక్కడి నుంచి కొండపైకి ఒక గంట కష్టపడి ఎక్కితే మౌనిబాబా గుహ వస్తుంది.

బాబాజీకీ, మౌనిబాబాకీ మధ్య ఒక ఒప్పందం ఉంది. బాబాజీ ఋషీకేశానికి వచ్చినప్పుడు ఆయన ఉండడానికి ఈ గుహనిచ్చి మౌనిబాబా నీలకంఠగిరి శిఖరాగ్రంలో ఉన్న ఆయన కుటీరానికి మారుతూ ఉండడమే ఈ ఏర్పాటు. వాళ్ళు ఉపయోగించే ఉచ్చతర ప్రసార మాధ్యమాలు ఒక టెలిఫోను కన్నా కూడా బాగా నిర్దుష్టంగా పని చేస్తాయి.

గుహకు మేము చేరుకోగానే మౌనిబాబా తాలూకు ఒక యువశిష్యుడు మమ్మల్ని నమస్కారపూరితంగా పలకరించాడు. పొడుగ్గా నల్లగా దృఢకాయుడిలాగ ఉన్న ఇతదు పల్చటి కాషాయ గోచీ మాత్రమే పెట్టుకొని ఉన్నాడు. బెదురు పుట్టించే జుత్తు గుత్తులూ, దట్టమైన గెడ్డమూ ఉన్న అతణ్ణి బాబాజీ 'బేటా' (కుమారుడా!) అని సంబోధించారు. అతను బాబాజీ పాదాలను తాకేడు. అతనొక సనాతన సాధువు కనక బాబాజీ అతనికి నమస్కరించమని నాకు చెప్పారు. దానికి బదులుగా అతనూ నాకు, బాబాజీ శిష్యుడిగా మన్నించి తన మర్యాదను కనబరిచాడు.

విశాలమైన ఆ గుహద్వారంలో అప్పటికే ఒక ధుని వెలుగుతూ ఉంది; ఉన్ని దుప్పట్లు పరిచిన రెండు చెక్కబల్లలు మా మంచాలుగా నిలిచాయి. "నేను నీటికుండను తాజా జలాలతో నింపాను. మీ ఇద్దరికీ చపాతీలూ, పప్పూ, కూరలు తెచ్చాను" అని ఆ యువ సాధువు చెప్పాడు. "బాబా ఈ యువకుడి కోసం కొంత పటిక బెల్లం

కూడా పంపించారు. బాబా ఆజ్ఞానుసారంగా నేను పొద్దున్నా రాత్రీ భోజనం తెస్తాను. కొన్ని రోజుల్లోనే మిమ్మల్ని చూడగలనన్న ఆశను ఆయన వ్యక్తం చేశారు. ఆయన మీకు తన ప్రణామాలు పంపారు. మీకు ఇంకా ఏమన్నా కావాలంటే, నాకు తెలియ జేయండి" అని చెప్పి బాబాజీ పాదాల మీద సాగిలపడి నమస్కరించి వెళ్ళిపోయాడు.

"అరె, నీకు చెప్పడం మర్చిపోయాను. మౌనిబాబా ఒకసారి శ్రీగురు బాబాజీని కలుసుకున్నారు నీలకంఠ దగ్గర. ఆయన ఆశీస్సులను పొందారు" అని బాబాజీ అంటూంటే ఈయన ఎప్పుడైనా మర్చిపోవడం కూడా జరుగుతుందా అని చకితుణ్ణైయ్యాను.

మేము ఈ గుహలో అద్భుతంగా ఇరవై రోజులు గడిపాం. నాకు యోగ ప్రయోగంలోనూ పవిత్ర గ్రంథాల లోగుట్టుల విషయంలోనూ బాగా శిక్షణ దొరికింది. ఉపనిషత్తులూ, యోగసూత్రాలూ, హఠయోగా ప్రదీపికా, షట్చక్ర నిరూపణమూ, గోరక్ష శతకమూ, కులార్ణవ తంత్రమూ, మహానిర్వాణతంత్రమూ, ప్రసిద్ధ బౌద్ధ గ్రంథమైన నాగార్జునుడి ప్రజ్ఞాపారమితా అనేవి బాబాజీ నాతో చర్చించిన గ్రంథాల్లో కొన్ని. ఆయనకు పుస్తకాలు చూడవలసిన పని లేదు. ప్రతీదీ ఆయన మెదడులోనే ఉంది. ఏమేమి జరిగిందీ అన్న వివరాల్లోకి నేను దిగట్లేదు. అలా చేస్తే అనంతంగా రాసుకుపోతూ ఉండాల్సివస్తుంది. దానికి బదులుగా ముఖ్యమైనవీ సంబంధమున్నవీ అని నేననుకొనే మూడు సంఘటనలను చెబుతాను.

మొదటిది ఋషీకేశంలో ఉన్న మద్రాసు కేఫ్‌కి నేను వెళ్ళడం. ఆ రోజుల్లో అదొక చిన్న ప్రదేశమే. సన్యాసి అవుదామనుకొని భంగపడిన దక్షిణ భారతీయు డొకడు, అనుక్షణమూ పెరిగిపోతూన్న దక్షిణ భారత జనాభాకు తిండిని అందించ దానికి మొదలుపెట్టిన చిన్న అల్పాహారశాల అది. చాలా ఏళ్ళ తరవాత, అజ్ఞాత దౌర్జన్యకారులు అతన్ని చంపేశారు. ఆ తరువాత స్థానికులే ఆ ఉపాహారశాలను స్వాధీనం చేసుకొని నడుపుతున్నారు.

గుహకు వచ్చిన రెండో రోజున బాబాజీ నాకు ఇరవై రూపాయలు ఇచ్చి మద్రాసు కఫేకి వెళ్ళి మసాలా దోసెను తినమన్నారు. "ఎన్ని కావాలనుకుంటే అన్ని తిను. నిన్ను పూర్తిగా సంతృప్తి పరుచుకో" అని అన్నారు.

పడవనెక్కి నదిని దాటి, నేను క్రితంసారి ఇక్కడకు వచ్చినప్పుడు మద్రాసు కఫే ఎక్కడుందో కనిపెట్టినవాణ్ణే కనక దానికి వెళ్ళి మసాలా దోసె ఒకటి తెమ్మనమని పురమాయించాను. ప్రతి ముక్కనీ ఆస్వాదించాను. మరొకటి తెమ్మన్నాను. అదీ పూర్తిగా

తినేసి తరవాత కాఫీ తాగేను. నేను గట్టిగా తేన్చి శాల నుంచి ఇవతల పడ్డాను. ఆ తరవాత మరెప్పుడూ నాకు మసాలా దోసె అంటే ప్రత్యేక ఆకర్షణ లేకుండా పోయింది. ఆ పిచ్చి ఆసక్తి పూర్తిగా చెరిగిపోయింది. ఇప్పటికీ నేనప్పుడప్పుడు మసాలా దోసె తింటాను గానీ, అదంటే ఇప్పుడు ఆ వెర్రి యావ మాత్రం లేదు.

రెండో ఘటన ఒక అమెరికన్ యువతితో జరిగిన నా సమావేశం. నలుగురి లోనూ తెలియకుండా ఉండడం కోసం నేను ఆవిడ అసలు పేరు చెప్పట్లేదు. ఈ కథా ప్రసంగంలో జెన్నీ అనే కల్పితనామాన్నే ఉపయోగిస్తాను.

దాదాపు ప్రతిరోజూ, అధ్యయన సమావేశం తరవాత, మధ్యాహ్న భోజనానికి ముందుగా, ఒక్కణ్ణే గుహనుంచి కిందికి దిగి వచ్చి కొంచెంసేపు తిరుగుతూ ఉండేవాణ్ణి. నదిలో మునిగి, భోజనం వేళలో అక్కడి చల్లగాలినీ జలప్రవాహ ధ్వనినీ హాయిగా అనుభవిస్తూ గంగ ఒడ్డున కూర్చొనేవాణ్ణి. బయటకు ఒంటరిగా వెళ్ళి, సొంతంగా నాకు నేను తిరుగుతూ ఉండడాన్ని బాబాజీ ప్రోత్సహించేవారు; అది నాకు ఇష్టంగా కూడా ఉండేది.

ఒకరోజున, నేను తీరుబడిగానాకిష్టమైన రాయి మీద కూర్చొని ఉన్నాను. అప్పుడు నాకు కొద్ది దూరంలో మరొక రాయి మీద లేతనీలపు దుస్తులలో పసిడి జుట్టున్న ఒక యువతి కూర్చొని ఉండడం గమనించాను. ఆ అమ్మాయి పాదాలు చల్లని గంగాజలాల్లో మునిగి ఉన్నాయి. నేను కూర్చొన్న చోటునుంచి ఆవిడ విచారంతో కూడిన గంభీరమైన ముఖం నాకు కనిపించింది. మేనిఛాయను బట్టీ, జుట్టు రంగును బట్టీ ఆమె యూరోపియన్ గానీ అమెరికన్ గానీ అయి ఉండవచ్చునని నేను ఊహించాను.

నేను పరికిస్తూండగా, ఆమె అకస్మాత్తుగా వాంతి చేసుకోవడం మొదలెట్టింది. నీటివైపు నుంచి పక్కకు ముఖాన్ని తిప్పుకుంది ఆమె. చాలా నొప్పితో బాధపడుతోందని నేను చూశాను. వమనం చేసుకుంటూ ఆ అమ్మాయి తన చేతులతో పొత్తికడుపును గట్టిగా నొక్కి పట్టుకుంటోంది. డోకు ఆగగానే, తన దగ్గర ఫ్లాస్కులోని దాన్ని ఒక గుక్క తాగింది. ఆ సమయంలోనే ఆమె నన్ను చూసింది; కొంత కలవరపడిందని నేననుకున్నాను. ఆ అమ్మాయి ముఖం పాలిపోయింది; తన పాదాలను చూసుకొంది.

నా గుండెలో మహా సానుభూతి కలిగింది. నేను వెళ్ళి, ఆమెతో మాట్లాడి ఆమె చేతులు పట్టుకొని ఊరడించి, ఓదార్చి, ఏమైనా సాయం చేయగలనేమో కనుక్కుందా మని అనుకున్నాను. కానీ సందిగ్ధావస్థలో పడ్డాను. నేను స్వేచ్ఛామాత్రుణ్ణి; లోకం

ఉంఝాటంలో పడడం నాకిష్టం లేదు. సానుభూతిగా వేషం వేస్తూన్న కామవ్యామోహమా ఇది? అప్పుడు నాకు బాబాజీ అన్న మాటలు గుర్తుకొచ్చాయి: "నువ్వు పదమూడేళ్ళు, రోజుకి పదమూడు గంటలు చొప్పున చక్కగా ధ్యానం చేస్తూన్నప్పటికీ, సంకటంలో ఉన్న జీవి తాలూకు బాధనూ ఆక్రందననీ వినలేకపోతే మాత్రం నీ పదమూడేళ్ళ ధ్యానమూ శుష్కదండగే. ధ్యానం నీ గుండెని సుతిమెత్తగా చేయలేకపోతే, కిటికీలోంచి దాన్ని విసరిపారెయ్యి. దాని ఉపయోగం లేదు" అని.

నన్ను నేను "మూర్ఖుడా" అని తిట్టుకొని "నువ్వెంత స్వార్థపరుడివైపోతున్నావు" అని చీవాట్లు పెట్టుకొని, లేచి ఆమె దగ్గరకు వెళ్ళి "నీకేవిధంగానైనా సాయం చేయగలనా?" అని అడిగాను.

మొదట్లో ఆమె గతుక్కుమంది. తరవాత ఆమె తనను తానే శాంతపరచుకొని నావైపు చూస్తూ "ఎవరైనా సాయం చేస్తే బాగుణ్ణనిపిస్తుంది కానీ అది జరిగే పని కాదు".

"కానీ ఎందుకని?"

"అదొక పెద్ద కథ. నేను నా దుఃఖంతో మీమీద భారం మోపదలచుకోలేదు."

"దయచేసి చెప్పు. నేను తెలుసుకోవాలనుకుంటున్నాను", అని అంటూ నేను దాపునున్న మరో రాయి మీద కూర్చున్నాను.

"సరే, మీకు కావాలంటే (చెబుతాను)" అని ఆమె అంది.

అప్పుడామె తన కథను వివరించింది. ఒక సూక్ష్మజీవ శాస్త్రజ్ఞురాలు (Microbiologist) అయిన ఆమె అమెరికాలోని ఫిలడెల్ఫియా నుంచి వచ్చింది. ప్రయాణం చేయడం ఆమెకు ఇష్టం. నాలుగేళ్ళ క్రితం ఇండియాకు వచ్చింది. ఇతర ప్రదేశాలతో బాటు ఆమె హరిద్వారమూ ఋషీకేశమూ దర్శించింది. తనకే అర్థం కాని, విచిత్ర కారణం, ఆమెకు గంగానది మీదా, ఋషీకేశమనే తీర్థస్థల పట్టణం మీదా ప్రేమ కలిగింది. ఆ ప్రేమ ఎంతదంటే, ప్రతీ ఏడాదీ వచ్చి ఒక నెల గడుపుతూ ఉండడం సాగిస్తూ ఉంది ఆమె. హిందుత్వమన్నా, దాని గురువులన్నా, ఆశ్రమాలన్నా అటు నమ్మకం గానీ ఇటు ఇష్టంగానీ తనకు లేదని ఆవిడ నేరుగానే ఒప్పుకుంది. కానీ అక్కడ కొండల చుట్టూ తిరగడమన్నది ఆమెకు ఇష్టం; ఆవిడ ఇష్టపడిన నది పక్కన ఉందామని అనుకుంది.

ఆరు నెలల క్రితం ఒక విపత్తు వచ్చి మీద పడింది. తీవ్రమైన అజీర్ణంతోనూ మాటిమాటికీ వస్తూన్న పొత్తికడుపు నొప్పులతోనూ బాధపడుతూ ఆమె డాక్టరు దగ్గరికి

వెళ్ళింది. అవసరమైన పరీక్షలు చేయించిన తరవాత, ఆమె పెద్ద పేపుకి రాచపుండు (Cancer) పుట్టిందని నిర్ధారణ చేశాడు డాక్టరు. కంతులను చికిత్స చేసేవాడి (Oncologist) ఉపచారంలో రెండు నెలలు గడిచిన తరవాత జబ్బు తగ్గినట్టని పించిది. కానీ రెండు వారాల్లోపు లోనే ఇంతకు ముందుకన్నా ఎక్కువ తీవ్రరూపంలో రోగం తిరగబెట్టింది. డాక్టరు మరో రెండు నెలలె చికిత్సను కొనసాగించి ఇక లాభం లేదని వదిలేశాడు. తాను శాయశక్తులా ప్రయత్నించగలననీ, అయితే రోగం చాలా ముదిరిపోయిందనీ అతను చెప్పాడు. ఆమెకు అబద్ధపు భరోసాను కల్పించ దలచుకోలేదని కూడా అన్నాడు. ఆ డాక్టరు ప్రకారం ఆమె ఇక రెండు నెలల కన్నా ఎక్కువ బతకదు. నొప్పిని తగ్గించుకోవడానికి బాధానివారకాలైన మందులు తీసుకుంటూ ఉండడమొక్కటే ఆమె చేయగలిగినదని అతని అభిప్రాయం.

ఆవిడ పొట్టలో ఏ ఆహారమూ నిలవదు. ఆమె తీసుకొనే ద్రవాలు కూడా వాంతుల్లో పోతున్నాయి; మలంలో నెత్తుటి జాడలు కనిపిస్తున్నాయి. ఆ సమయంలోనే ఆమె ఋషీకేశానికి వెళ్దామన్న కీలక నిర్ణయం తీసుకొంది. ప్రేమించిన నదితోనే తానుందామనీ, చావు వచ్చే ముందు ఋషీకేశంలో సమయాన్ని గడపాలనీ ఆమె నిశ్చయించుకుంది. తన శరీరం రోగంతో నాశనమైపోతుంది కానీ హృదయమూ ఆత్మా మాత్రం నదీ శీతల జలాలతో ఉపశమనాన్ని పొంది ఋషీకేశంలో ప్రశాంతత పొందుతాయని ఆవిడ భావించింది.

ఆమె అన్న, తల్లీ, మిత్రులూ అందరూ ఆ నిర్ణయాన్ని వెర్రిగా తలచారు కానీ ఆవిడ మాత్రం దానికే కట్టుబడి, టికెట్టు కొని, టూరిస్టు వీసాను తీసుకొని వచ్చేసింది. అప్పటికి ఆమె వచ్చి ఉజ్జాయింపుగా రెండు వారాలయింది; రోగం ముదురుతూనే ఉంది. నీళ్ళను కూడా కడుపులో ఉంచుకోలేకపోతోంది. తానింక ఎన్నాళ్ళో ఉండనని ఆమె భావించింది. ఆవిడ చనిపోతే నేను వాళ్ళన్నకు ఆ వార్తను తెలియజేసి పెడతానా అని నన్నడిగింది. ఆమె స్వర్గాశ్రమంలో ఉంటోంది. ఆవిడతో బాటు ఆ ఆశ్రమానికి వెళితే, తాను తన అన్నగారి టెలిఫోన్ నంబరు ఇస్తానని చెప్పింది. దానితో పాటు పోస్టాఫీసులో పబ్లిక్ టెలిఫోనులో మాట్లాడడానికి చాలినంత డబ్బు ఇస్తానని చెప్పింది. మూడు రోజుల తరవాత ఆవిడకు తిరిగి వెళ్ళిపోడానికి టికెట్టుంది. కానీ అంతవరకూ తాను బతుకుతానన్న నమ్మకం లేదంది ఆమె.

తిరిగి మళ్ళీ మరొక తీవ్రమైన వాంతి రావడంతో ఆవిడ మాట్లాడడం మానవలసి వచ్చింది. ఆమె ముఖం కడుక్కొని పుక్కిలించిన తరవాత నేను "జెన్నీ! విను. నువ్వు గురువులను నమ్మవని నాకు తెలుసును గానీ నువ్వు దయచేసి వచ్చి మా గురువును

చూడు. ఆయన చాలా విభిన్నుడు. ఏం జరుగుతుందో నాకు తెలియదు కానీ ఆయన దీవెనలు మాత్రం నీకు ఏదో విధంగా మేలు చేస్తాయి. ప్లీజ్ జెన్నీ!" అని అర్థించాను.

"సరే. మీరు చాలా మంచివాళ్ళలా ఉన్నారు. నేను వస్తాను గానీ ఎప్పుడు?" అంది ఆమె.

"ఇక్కడ కొద్దిసేపు ఉండు. నేను వెళ్ళి నిన్నెప్పుడు ఆయన చూడగలరో కనుక్కొని వస్తాను. నేను తిరిగి వచ్చేలోపులో వెళ్ళిపోకు" అని నేనన్నాను.

"సరే"

నేను ఆ రోజు పరుగెత్తినంత త్వరగా ఎప్పుడూ పరిగెత్తలేదు. గుహాముందు నిలుచున్న బాబాజీ ఎదురుగుండా నిలిచేసరికల్లా నేను విపరీతంగా ఒగరుస్తున్నాను; గాఢంగా పీల్చి ఊపిరిని శాంతింపజేసుకొన్నాను. "ఇది చాలా త్వరగా తీసిన పరుగు" అని బాబాజీ వ్యాఖ్యానించారు.

"బాబాజీ! అక్కడున్న ఆ అమెరికన్ యువతిని నేను మీ దగ్గరకు తీసుకు వద్దామనుకుంటున్నాను" అని హఠాత్తుగా నా మాటలను వెళ్ళగక్కాను.

"ఓహో! ఇప్పుడు యోగి ఒక అమెరికన్ యువతిని చూశాడా..."

నేనెప్పుడూ ఇంతకుముందు అలా చెయ్యలేదు కానీ ఇప్పుడు మాత్రం ఆయన మాటకు అడ్డు వస్తూ "అదికాదు బాబాజీ! నేను.... కాదు కాదు ఆమె చాలా జబ్బుగా ఉంది..." అన్నాను.

"ఆమెను ఒక డాక్టరు దగ్గరకు తీసుకొని వెళ్ళు. డివైన్ లైఫ్ సొసైటీలో ఒక ఆసుపత్రి ఉంది. నేను డాక్టర్ను కాను. ఏది ఎలా ఉన్నా, నేను ఇప్పుడు ఒక అమెరికన్ అమ్మాయిని చూడదలచుకోలేదు"

"కానీ బాబాజీ!" నేను కళ్ళలో నీళ్ళు పెట్టుకుంటూ ప్రార్థించాను: "మీరు ఆమె పట్ల ఇంత కఠినంగా ఉండవద్దండి. ఆమెకు మీ ఆశీస్సులు అవసరం. మీరు ఆమెతో మాట్లాడక్కర్లేదు. మీ పవిత్ర దృక్కులు ఆవిడ మీద పడితే చాలు. ప్లీజ్ బాబాజీ..."

ప్రేమగా బాబాజీ నా భుజాల మీద చేతులు వేసి నవ్వుతూ "అబ్బాయీ, నిన్ను! ఊరికినే పరీక్షిస్తున్నానంతే. తప్పకుండా ఆ అమ్మాయిని చూస్తాను. ఆవిడను పైకి తీసుకురా. లేకపోతే నన్ను రమ్మంటావా అక్కడికి?" అని అన్నారు.

"అలా అక్కర్లేదండి. నేను ఆమెను తోడుకొని వస్తాను" అని అంటూనే బాణంలాగ దూసుకుపోయాను, ఆయనకు ధన్యవాదాలు చెప్పడం కూడా మర్చిపోయి. ఆమె అక్కడే నాకోసం నిరీక్షిస్తూ ఉంది.

"రా. త్వరగా. ఆయన నిన్ను చూస్తానన్నారు" అని నేనన్నాను.

ఆమె చాలా బలహీనంగా ఉండడం వల్ల ఈసారి మేం చాలా నింపాదిగా వెళ్ళాల్సి వచ్చింది. ఆమెకు నడవడమే కష్టంగా ఉంది. చాలాసేపు ఆమెను నేను పట్టుకోవలసి వచ్చింది. మేము గుహ దగ్గరికి చేరుకొనేసరికి ఆమె నిలువునా కూలిపోయే పర్యంతమయింది. "ఆమెకు నా కమండలువులోని నీళ్ళియ్యి. రగ్గుమీద కూచోబెట్టు" అని బాబాజీ హిందీలో అన్నారు.

వమనమవుతుందేమోనన్న భయంతో కామోసు ఆమె ఆ కొంచెం నీటిని జాగ్రత్తగా చప్పరించింది. ఆవిడ కూర్చున్న మీదట ఆమె ఎదుటగా బాబాజీ కూర్చున్నారు. కుడిచేతిని చాచి ఆశీర్వాదంగా ఆమె తలను తాకేరు ఆయన. ఆమె వెంటనే బలంగా ఒత్తి పలికే అమెరికన్ ఇంగ్లీషులో తన కథ చెప్పుకోవడం మొదలు పెట్టింది. ఆవిడ చాలా తొందరగా చెబుతోందని నేననుకొని నేనే వివరిద్దామన్న ఉద్దేశంతో ఆమెను మధ్యలో ఆపేను. బాబాజీ "అక్కర్లేదు. కొనసాగించు. నిన్ను నేను పూర్తిగా అర్థం చేసుకుంటున్నానులే. కానీ" అంటూ అచ్చూ మచ్చూ ఆ అమ్మాయి ఉచ్చరించిన తీరులోనే నొక్కి పలుకుతూ అన్నారు. "నా డాక్టర్లు ఇంక నాకు నెలన్నర మాత్రమే గడువు ఉందని ఇప్పుడంటున్నారు. నేను త్వరలోనే చనిపోబోతున్నాను సర్, అదీ నా పరిస్థితి" అని ఆమె తన కథను పూర్తి చేసింది.

బాబాజీ కళ్ళల్లో అనంతమైన దయ తొంగిచూసింది. "చూడు అమ్మాయీ! మనం అందరమూ చనిపోయేవాళ్ళమే. నువ్వూ నేనూ ఇతనూ అందరమూ చనిపోవడం ఖాయం. చావు తప్పించుకోడానికి వీలు లేనిది. అది మన నిత్య సహచరి. అంచేత బిడ్డా! దాన్ని ప్రశాంతంగా ఆమోదించు. మరణంతో సంధి చేసుకో. అప్పుడది నీకు స్నేహితుడిగా మారుతుంది. నీకొక చిన్నపాటి ధ్యానమూ, శ్వాస ప్రక్రియా నేర్పుతాను అవి నీ నొప్పిని అదుపులో ఉంచడానికి సాయపడతాయి. అందుచేత నువ్వు ప్రశాంతంగా నీ దేశానికి వెళ్ళిపో. మహానుభావులందరి ఆశీస్సులు నిన్ను పొదివి ఉంచాలి!" అని అన్నారు.

రోజుకు రెండుసార్లు అభ్యాసం చేయవలసిన ఒక చిన్న ప్రక్రియను ఆయన ఆమెకు నేర్పేరు. ఆమె ముఖంలోని బాధాకవళికలు తగ్గాయి. చాలావరకూ ఆ అమ్మాయి ప్రశాంతమై తేరుకొంది. ఆమెతో స్వర్గాశ్రమానికి వెళ్ళి దిగబెట్టమని నాకు బాబాజీ చెప్పారు. మేము (ఆశ్రమానికి) నడుస్తూంటే ఆమెకు వాంతి కాకుండా రెండు గంటల పై చిలుకే అయిందనిపించేసరికల్లా ఆవిడ ఆశ్చర్యపోయింది. ఆమె నాకు పుష్కలంగా

ధన్యవాదాలు చెప్పింది. స్వర్గాశ్రమంలో ఆవిడ దగ్గర సెలవు తీసుకొని నేను గుహకు తిరిగి వెళ్ళిపోయాను.

"అమ్మాయికిప్పుడు బాగుందా?" అని బాబాజీ అడిగారు. బాగానే ఉందని నేను చెప్పాను.

"నువ్వు ఇప్పుడు నీ పూర్వజన్మల్లో ఒకదానిలో నీకు సంక్రమించిన కర్మ సంబంధమైన ఋణాన్ని తీర్చుకున్నావు. చాలా జన్మల క్రితం, నువ్వు బాగా జబ్బు పడ్డప్పుడు ఆమె నీకు ఉపచారం చేసింది. ఇప్పుడు ఆమె కష్టంలో ఉన్నప్పుడు నువ్వు సాయపడ్డావు. ఇక ఇప్పుడు ఇంకేమీ ప్రశ్నలు వేయద్దు, అర్థమయిందా? మరోమాట ఆ అమ్మాయిని తిరిగి నేను చూసేది లేదు".

"సరే బాబాజీ" అని నేను అయిష్టంగానే అన్నాను, జెన్నీతో నా భూతకాలీన సంబంధం తాలూకు వివరణలు నాకు తెలియాలనే ఉంది కనక. అయినా ఏది మంచిదో, ఏమి చేయాలో, ఏమి చేయకూడదో ఆయనకే తెలుసును. ఇదంతా నేను అనుభవం కొద్దీ తెలుసుకున్నాను.

ఆమె వెళ్ళిపోయే రోజున వీడుకోలు చెప్పి వస్తానని బాబాజీ అనుమతిని తీసుకొని మరీ వెళ్ళాను. అప్పటికే ఆమె చాలా నయంగా ఉంది. రెండు రోజుల్లో రెండుసార్లు మాత్రమే డోకు వెళ్ళిందనీన్నూ, కొంత టీ తాగగలిగిందనీన్నూ ఒక బిస్కట్టు తినగలిగిందనీన్నూ ఆమె చెప్పింది. బాబాజీకి శతకోటి ధన్యవాదాలు చెప్పమనీ, ఆయనను ఎప్పటికీ గుర్తుంచుకుంటాననీ చెప్పమంది. "ఆయన నా జీసస్ క్రైస్టు" అని అంది.

నాతో ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా సంబంధం నిలుపుకుందామనుకుంది,క ఆనీ నాకు అటు ఒక చిరునామా లేదు, ఇటు ఒక టెలిఫోన్ నంబరైనా లేదు. మేము విడిపోయే సమయంలో, నన్ను కౌగిలించుకొని నా బుగ్గమీద ముద్దు పెట్టుకొని నన్ను ఆశ్చర్యపరిచింది. కలవరపడి, నేను ఆమె దగ్గర్నుంచి బయల్దేరి గుహకు తిరిగి వెళ్ళి పోయాను. "అవాక్కయ్యావు, అవునా?" అని నవ్వునాపుకుంటూ బాబాజీ ఇంతమాత్రమే అన్నారు.

కాలచక్రం తిరిగింది. త్వరలోనే జెన్నీ భూతకాలానికి అంకితమయింది. ఒక్కోసారి ఆమెను గురించి ఆలోచించేవాణ్ణి. ఏమయి ఉంటుందబ్బా అని అనుకునే వాణ్ణి. అంతే. బాబాజీ ఏమీ అనలేదు.

మూడేళ్ళ తరవాత, ఋషీకేశంలో నేనొక ప్రత్యేకమైన ఏకాంత స్థలంలో ఉన్నాను. బాబాజీ కైలాస పర్వతానికి వెళ్ళారు. నన్ను తీసుకొని వెళ్ళడానికి ఒప్పుకోలేదు ఆయన. రోజువారీగా నేనెలా మెలగాలో ఏం చేయాలో ప్రత్యేకమైన సూచనలనిచ్చారు. నా ఏకాంత నివాసాన్ని పూర్తి చేసుకొని ఆయన రాకకోసం ఎదురు చూస్తూ ఉండాలి నేను.

ఒక సాయంత్రం స్వర్గాశ్రమం దగ్గర గంగ ఒడ్డున కూర్చొని ఉన్నాను. అప్పుడు రాగిజుట్టూ, స్వచ్ఛ శరీరచ్ఛాయ గల ఒక అమ్మాయి నది దగ్గరకు నడిచి వెళ్తూ కనిపించింది. నేను నా కళ్ళను నమ్మలేకపోయాను. ఆమె జెన్నీనా? క్రితంసారి చూసిన దానికంటె ఇప్పుడు కొంచెం బొద్దుగా ఉంది. కానీ ఆమె తప్పకుండా జెన్నీనే. రూఢి చేసుకుందామని నిశ్చయించుకొని ఆమె దగ్గరకు పరిగెత్తుకొని వెళ్ళాను. ఆమె పాదాలను నీళ్ళలో ముంచి ఒక రాతిమీద కూర్చుంది. ఆమె వెనక ఆగి నెమ్మదిగా "జెన్నీ?" అని పిలిచాను.

ఆమె వెనక్కి తిరిగి నన్ను కొంతసేపు పరికించి తటాలున అరిచింది: "నిజమా! మధూ! నేను నమ్మలేకుండా ఉన్నాను" అని. ఒక్క ఊపున గెంతి నన్ను కావలించుకొని నా బుగ్గమీద ముద్దు పెట్టుకుంది. "ఏమైంది నీకు? నువ్వు ఇప్పుడు పంట్లామూ చొక్కా వేసుకొని చక్కటి బట్టలతో ఉన్నావు; నీ అందమైన జుత్తు గుత్తులను కత్తిరించు కున్నావు. కూర్చో, మాట్లాడుకుందాం. నీకోసం ఇక్కడా అక్కడా చూస్తూనే ఉన్నాను. ఆ గుహకు రెండుసార్లు వెళ్ళాను. అక్కడ ఇంగ్లీషు మాట్లాడలేని నగ్న సాధువొకడు కనిపించాడు!"

అప్పుడు ఫిలడెల్ఫియా వెళ్ళిన తరవాత ఏ విధంగా ఆమె ఆరోగ్యం బాగుపడడం మొదలెట్టిందో నాకు చెప్పింది. వమనం చేసుకోవడం చాలా తక్కువయింది; తరవాత పూర్తిగా ఆగిపోయింది. పొత్తికడుపు హఠాత్సంకోచాలు అదృశ్యమయ్యాయి; బాధానివారకాలు ఉపయోగించకుండానే సాగుతోంది. బాబాజీ చెప్పిన ప్రక్రియను అభ్యాసం చేయడమే ఆవిడ ఉపయోగించిన ఒకే ఒక్క చికిత్స. తాను మామూలుగానే తినగలుగుతున్నాని తెలుసుకొంది. డాక్టరు పెట్టిన రెండు నెలల గడువు అయిపోయిన తరవాత ఆమె ఇంకా బతికే ఉంది; అంతకు ముందు కన్నా ఇంకా ఎక్కువ ఆరోగ్యంగా ఉంది. మరో రెండు వారాలు ఆగి డాక్టరు దగ్గరకు వెళ్ళిందిట. ఆమె ఇంకా బతికి ఉండడాన్నీ అంత ఆరోగ్యంగా ఉండడాన్నీ చూసి ఆయన ఆశ్చర్యపోయాడట.

వరుసగా కొన్ని పరీక్షలు చేసి ఆమెకు పూర్తిగా నయమయిందని ఆయన ధ్రువ పరిచాడు. పుట్టకురుపు పూడుకుపోయింది. దాన్ని తనంత తానే తగ్గే అరుదైన

నిదర్శనగా చెప్పాడు ఆయన. అది నిజంగా ఒక మహాద్భుతం. కానీ నాకు ఆ విషయం తెలియపరచడానికి ఏ మార్గమూ లేదు ఆవిడకు. ఇంతలో ఒక లేబొరేటరీలో ఉద్యోగం దొరకడంతో చాలాకాలం దాకా సెలవు దొరకలేదుట. చివరకు ఒక రెండు వారాలకు సెలవు మంజూరు కాగానే, సమయాన్ని వృధాచేయకుండా వెంటనే ఇండియాకు చేరుకొని ఋషీకేశానికి వచ్చేసింది. ఆ మరుసటి దినమే ఆమె అమెరికాకు ఢిల్లీ నుంచి వెళ్ళిపోవాలి.

"నేను నిన్ను కనుక్కోడానికి విపరీతంగా ప్రయత్నించాను. నేను గురువుగారిని వ్యక్తిగతంగా కలుసుకొని ఆయనకు ధన్యవాదాలు చెప్పి కౌగిలించుకోవాలి..."

"ఒక్క క్షణం తమాయించు. ఆయనను ఇప్పుడు నువ్వు చూడలేవు. టిబెట్టులో ఉన్న కైలాస పర్వతానికి వెళ్ళారు. ఆయన మరో రెండు నెలల దాకా వచ్చే ఆస్కారం లేదు. నేనాయనను చూడగానే నీ ధన్యవాదాలను అందిస్తాను.

"నా సంగతంటావా, ఆయనతో మూడున్నరేళ్ళు గడిపిన తరవాత, బాబాజీ నన్ను ఇంటికి తిరిగి వెళ్ళిపొమ్మన్నారు. ఇప్పుడు ఏడాదికొకసారి ఆయన ఎన్నిక చేసిన చోట ఆయనతో బాటు దాదాపు ఒక నెల పాటు ఉంటూ ఉంటాను. మనం పరస్పరం కలవడం నిజానికి అదృష్టమే. ఇది కూడా ఆ ముసలాయన పథకమేనేమో"

"అయితే, శ్రీమాన్ దేశదిమ్మరీ! ఇప్పుడైనా మరి ఏదో ఒక చిరునామానో టెలిఫోన్ నెంబర్‌నో ఇవ్వగలవా నీతో అవసరమైనప్పుడు ఉత్తరం రాయడానికి గానీ, మాట్లాడ డానికి గానీ వీలుగా!" అని ఆమె అడిగింది.

నా అసలు పేరూ, అడ్రసూ, టెలిఫోను నెంబరూ చెప్పానావిడకు. ఆ చుట్టుపట్ల తిరుగుతూ మునుపటి రోజుల గురించి మాట్లాడుకుంటూ కొంత సమయం గడిపేం. రోజురోజుకీ ఋషీకేశం ఎక్కువ ఆర్భాటంగానూ సందడిసందడిగానూ తయారౌతోంది. మద్రాస్ కఫేలో కాఫీ తాగుతూ నా జీవితం గురించీ, బాబాజీ నా జీవితంలోకి ఏ విధంగా ప్రవేశించారో వివరించాను. తరవాత మేము స్వర్గాశ్రమానికి తిరిగి వచ్చాం. అక్కడే ఆవిడ కూడా ఒక గది బాడుగకు తీసుకుంది.

పొద్దున్న, పడవరేవునుంచి ఆవిడను పంపించాను. (నదికి) రెండోవైపు ఆవిడ కోసం టాక్సీవేచి ఉంది. ఆమె ఢిల్లీ వెళ్ళాలి. అక్కణ్ణించి అర్ధరాత్రి విమానాన్ని ఎక్కుతుంది ఆవిడ.

ఆమె తన అడ్రసును ఇచ్చింది కానీ నేను ఉత్తరం రాయలేదు. ఉత్తరాలు రాయడం నా నైజానికి వ్యతిరేకం. అంచేత రాద్దాం రాద్దామంటూ ఆ పనిని వాయిదా వేస్తూనే ఉండేవాణ్ణి.

ఋషీకేశానికి తిరిగి వచ్చిన తరవాత బాబాజీని కలుసుకొని నేను జరిగినదంతా చెప్పి జెన్నీ ధన్యవాదాలు ఆయనకు అందించాను. "ఠీఁ ఠీక్ హై (సరే మరి). అమ్మాయి మంచి పిల్లే. నా ఆశీస్సులెప్పుడూ ఉంటాయి. ఆ అమ్మాయి బాధ్యతను తీసుకుంటా. ఆమెకు మంచిదేదో అది చేస్తాను" – ఇదే ఆయన అన్నదంతా.

ఆ నెలాఖరుకు నేను ఇంటికి తిరిగి వెళ్లిపోయాను. రెండు నెలల తరవాత అమెరికానుంచి నాకో ఉత్తరం వచ్చింది. అది జెన్నీ నుంచి అనుకొని ఆతురతతో దాన్ని తెరిచాను. అది ఆమె అన్న రాసినది. దాంతోబాటు ఆమె రాసిన లేఖ కూడా జోడించి ఉంది. అన్న రాసిన లేఖ ఇదీ –

ప్రియమైన శ్రీమాన్ ఎమ్!

నేను జెన్నీఅన్నగారిని బెర్నార్డును. అక్టోబరు 16 రాత్రి జెన్నీ నిద్రలోనే కన్నుమూసింది. ఇండియా నుంచి వచ్చిన తరవాత ఆమె బాగానే ఉంటూ వచ్చింది. వైద్య నివేదిక ప్రకారం గుండె ఆగిపోవడంతో ఆమె నిద్రలోనే చనిపోయింది. ఆమె పడక ప్రక్కనే ఒక ఆసక్తికరమైన, మాకు మాత్రం చాలా దిగ్భ్రమ కలిగించే ఉత్తరం కనిపించింది. ఆమె దానిని రాసి మీ ఎడ్రస్ రాసిన కవర్లో పెట్టింది. బహుశా ఆ మర్నాడు ఆమె మీకు పోస్టు చేద్దామనుకుంది, కాని పంపించలేకపోయింది కనక దాన్ని మీకు పోస్టు చేయడమే సరైన పని అనిపించింది మాకు. మిమ్మల్ని జవాబు ఇమ్మనమని నిర్బంధించడం లేదు కానీ మీరు కనక రాస్తే మేము, ముఖ్యంగా మా అమ్మ, జెన్నీ తరఫున చాలా సంతోషిస్తుంది.

ధన్యవాదాలు

బెర్నార్డు.

మరో కవర్లో ఉన్న జెన్నీ రాసిన ఉత్తరాన్ని తెరిచాను. అది ఈ విధంగా ఉంది:

ప్రియమైన మధూ!

నిన్ను తిరిగి చూడడం నాకు చాలా బావుంది. నువ్వు నా ధన్యవాదాలు గురూజీకి అందించి ఉంటావనుకుంటాను. నేను మంచి స్వస్థతతో ఉల్లాసంగా ఉన్నాను కానీ నిన్న రాత్రి ఏదో ఒక విచిత్రమైనది జరిగింది. దాన్ని నీకు చెప్పి తీరాలి. నాకు ఒక స్పష్టమైన స్వప్నం వచ్చింది. గురూజీ నా ముందు మహా అందంగా నవ్వుతూ కనిపించి 'అమ్మాయీ, ఇప్పుడు నువ్వు చాలా బాగున్నావు కదూ, అవునా?' అని అడిగారు.

"అవునండీ గురూజీ" అని నేను సమాధానం చెప్పేను.

"అయితే ఇక బంగారుకొండా! నీ ఇంటికి, నీ నిజమైన ఇంటికి తిరిగి వెళ్ళడానికిది సమయం కాదంటావా? నిన్ను స్వాగతించడానికి నేను అక్కడుంటాను" అని అన్నారు.

తరవాత ఆయన ఇంద్రధనుర్వర్ణాల కాంతి జ్వాలలో మాయమైపోయారు.

మధూ! దీని అర్థమేమిటో నీకు తెలుసా? ఆయన నన్ను హిమాలయాలకు పిలుస్తున్నారంటావా? ఏదేమైనా, నువ్వీసారి ఆయనను చూసినప్పుడు ఆయనను ఈ విషయమై అడుగు. మళ్ళీ ఎప్పుడో ఒకసారి నిన్ను చూస్తానని ఆశిస్తున్నాను. జవాబు రాయి. సంబంధాన్ని నిలుపు.

ప్రేమతో
జెన్నీ.

నేను నా పడకగదిలోకి వెళ్ళి ఇంతకుముందు ఎప్పుడూ ఏడవనంతగా ఏడ్చాను. నేనొక మంచి స్నేహితురాలిని కోల్పోయాను; బాబాజీ చెప్పినదానికి అర్థమేమిటో?

ఆ రాత్రి ధ్యానం చేస్తూన్నప్పుడు బాబాజీని నా హృదయపద్మంలో దర్శిస్తూ ఆయనను సంబోధిస్తూ ఇలా అడిగాను: "దయచేసి చెప్పండి బాబాజీ! జెన్నీకి ఏమయింది? ఇటువంటి ప్రశ్నలకు మీరు సమాధానం చెప్పడానికి ఇష్టపడరని నాకు తెలుసు. నేను మీమీద ఆధారపడి ఉండాలని కూడా మీరు అనుకోరు. కానీ ఈ ఒక్క ప్రశ్నకూ, దయ ఉంచి బాబాజీ, సమాధానం చెప్పండి. జెన్నీ ఒక ప్రియమైన మిత్రురాలు. మీరూ ఆమెను వాత్సల్యంతో చూశారు"

ఆ రాత్రి కలలో దానికి జవాబు వచ్చింది. బాబాజీ మామూలుగా కట్టుకునే తెల్లబట్ట కాకుండా ఊదారంగు నడుము గుడ్డతో కనిపించారు. "నన్ను ఇటువంటి ప్రశ్నలతో మళ్ళీ విసిగించవద్దు. నువ్వు ధ్యానం చేస్తూన్నప్పుడు నన్ను చిరాకు పెట్టద్దు. ధ్యానమనేది ఉన్నతతరంగా పెంపొందడానికీ, ఇతరులకు సాయపడడానికీను. నన్ను మాటిమాటికీ పిలుస్తూ ఉండడానికి కాదు.

"ఏదేమైనా నువ్వు అడిగావు గకనక చెబుతున్నా: జెన్నీకి నేను ఇంటికి రమ్మని చెప్పేనంటే దానికి నా అర్థం, భూమ్మీద ఒక కష్టమైన బతుకు తరవాత ప్రతి మనిషీ చేరుకొనే విశ్రామ స్థానమే. అవును, ఆమె ఇక్కడుంది; నేనిక్కడ ఉండి ఆమెను స్వాగతించాను. కొంత విశ్రాంతి తరవాత, ఇండియాలో తగిన స్థలంలో ఒక అనుకూలమైన గర్భంలో చేరేలాగ నేను సాయపడతాను; ఆధ్యాత్మికంగా పెంపొంద

దానికి మద్దతు ఇస్తాను. ఇదీ నేను నీకు చెప్పేది. ఇంక మళ్ళీ ఈ విషయంలో ప్రశ్నలు వేయద్దు".

ఆ మాటలతో ఆయన ఒక బంగరుమబ్బు వెనక మాయమైపోయారు. నా సత్యమిత్రుడూ మార్గదర్శీ అయిన బాబాజీ మేలు ఎప్పటికీ మరవకుండా ఉంటూ, నేను ఊరడిల్లి మేలుకున్నాను.

ఇక ఇప్పుడు మూడో ఉదంతం. దీన్ని నా జీవితంలో అతి ముఖ్యమైనదిగా నేను భావిస్తాను. నేను చివరకు పరమగురువు, శ్రీగురు బాబాజీని చూడగలిగాను. అది ఈ విధంగా జరిగింది:

నీలకంఠ పర్వతం చుట్టుపట్ల ఉన్న అడవుల్లో బాబాజీ నేనూ నడుస్తున్నాం. చాలా దూరంగా ఒక ఏనుగు ఘీంకారాన్ని విన్నాం. కానీ దాని మీద శ్రద్ధ పెట్టడానికి వీల్లేకుండా అన్యమనస్కంగా ఉన్నాం. మేమొక వాడి వేడి చర్చ మధ్యలో ఉన్నాం. రాబోయే కాలంలో ఎప్పుడో నేను క్రియాయోగ దీక్షనివ్వడానికి సిద్ధంగా ఉంటానని బాబాజీ అన్నారు. అప్పుడాయన, క్రియాదీక్షను పొందాలీ అంటే మనిషికి ఇరవై ఒక్క లక్షణాలుండాలని ఒక జాబితాను పూసగుచ్చారు.

ఆయన పేర్కొన్న లక్షణాలను చూస్తూంటే, తగినవాడు ఎవరైనా క్రియను తీసుకోగలగడం దగ్గర దగ్గరగా అసంభవమని నేనన్నాను. అది నిజం కాదన్నారాయన. సామాన్యంగా మానవుల శీలమంటే నాకు చాలా అధమాభిప్రాయముందనిపిస్తోందని అన్నారు. సగటు మనిషికి ఆయన ఏకరువు పెట్టిన గుణాలు పూర్తిగా ఉండడం కష్టమని చెబుతూ ఆ జాబితాను కొంచెం తగ్గించమని నేను అభ్యర్థించాను. ఓ గంట పాటైనా మేము వాదించుకున్నాం. అది నిజానికి చాలా అసాధారణం. చివరకు ఆయన ఆ జాబితాని పదికి తగ్గించారు. అప్పటికీ నేను ఆ జాబితాలోని మొదటి నాలుగూ చాలని నా అభిప్రాయాన్ని వెలిబుచ్చాను. మానవజాతిమీద కరుణ కొద్దీ ఏదో ఒకటి చేయమని నేనాయనను బతిమాలేను.

కాలం మారిపోయింది; ఈ రోజుల్లో శిష్యులు గురువులకు 'కరుణ' శబ్దార్థాన్ని బోధిస్తున్నారని అప్పుడాయన అన్నారు. అదే నేను సహించలేనంత మాట. నేను గభాలున ఏడ్చేశాను. నన్ను బాబాజీ ఓదార్చడానికి చూస్తూంటే ఏదో ఒక అద్భుతం జరిగింది. గాలిలో ఒక మధురమైన సువాసన నిండింది. బాబాజీ అన్నారు: "అది సరే. నిన్ను బాధ పెట్టినందుకు నేనూ విచారిస్తున్నాను. ఇప్పుడు కళ్ళనీళ్ళు తుడుచుకొని నిలుచో. నీ కోరిక తీరబోతోంది" అని. ఆయనా నా పక్కన నిలుచున్నారు. మేమిద్దరం

నీలకంఠ మార్గం వైపుకు తిరిగాం. ఆ పొదుగుపాటి టేకు చెట్ల వెనకనుంచి ఎంత అందమైన, సర్వాతీతమైన మూర్తి ఉద్భవించిదంటే నా వెంట్రుకలు లేచి నిలుచున్నాయి. సహజ జ్ఞానంతోనే నాకు ఆయన శ్రీగురు బాబాజీ అని తెలిసింది. ఆయన ప్రేమతోనూ కరుణతోనూ నాకు దర్శనమివ్వడానికి వచ్చారు.

నా ప్రియమైన గురువు ఆయన పావన పాదాలమీద సాగిలపడ్డారు; నేనూ ఆయనను అనుసరించాను. "లే. నీతో ఒక జరూరు పని పడింది, మహేశ్!" అని మా గురువుగారిని మధురమైన కంఠధ్వనితో సంబోధిస్తూ "నువ్వు మధు చెప్పే మాటను వినాలి. కాలం మారింది. మనం జాబితాను చిన్నదిగా చేయాలనే అనుకుంటాను" అని అన్నారు.

"మీరు ఎలా అనుకుంటే అలాగే" అని అన్నారు మా గురువుగారు.

పసిడిఛాయతో ఉన్న ఆయను (శ్రీగురు బాబాజీ) మీంచి నా కళ్ళను తిప్పుకోలేక పోయాను. మోకాళ్ళ దాకా ఉన్న మెరిసిపోతున్న తెల్లని వస్త్రం తప్పించి తతిమ్మా ఒళ్ళంతా ఏ ఆచ్ఛాదనా లేకుండా, భుజాలమీద పడి వేలాడుతూన్న టేకువన్నె జుత్తుతో ఆయన నా ఎదురుగా నిలుచొని ఉన్నారు. ఆయన దివ్యంగా ఉన్నారు. ఆయన నుంచి వెలువడుతూన్న సువాసన నా ఆత్మలో ప్రవేశించింది. నావైపు తిరిగారు ఆయన. ఆ కరుణాపూరిత నేత్రాల్లోకి నేను చూస్తూ ఉంటే నా మనస్సు, నా పూర్వజన్మల వైపుకూ, ఆయనతో నాకున్న సంబంధం మీదకూ మళ్ళింది.

"ఇటురా" అని ఆయన నా భుజాల మీద తన చేతులు ఉంచారు. ఆయన నా చుబుకాన్ని మృదువుగా ముట్టుకుంటూ ఇలా అన్నారు: "మధూ! అబ్బాయీ! నువ్వు నీ వికాసాన్ని పెంపొందించుకోవడానికే ఈ జీవితాన్ని గడపవలసి వస్తోంది. పని చేసిన తరవాత మళ్ళీ నాదగ్గరకు తిరిగి వస్తావు. మహేశ్ చాలా దయాళువు. నీకు అతను ప్రత్యేక మార్గదర్శి". కన్నీళ్ళు నా ముఖం మీదుగా కిందకు జాలువారాయి. నా శరీరం మొత్తం ఆనందంతో స్పందించింది. అటువంటి అనుభూతిని అంతకు ముందెన్నడూ నేను పొందలేదు.

అప్పుడాయన మా గురువు గారి వైపుకు తిరిగి "ఈ యువకుణ్ణి నీ రెక్కల చాటున ఉంచుకొని (పెంచినందుకు) నేను చాలా కృతజ్ఞుణ్ణి. మహేశ్! నీతో మాట్లాడ దలచుకున్న ఒక ముఖ్యమైన విషయముది. సూక్ష్మశరీరంలో గురువారం రాత్రి నన్ను కలుసుకో" అని అన్నారు.

ఆయన ఆశీఃపూర్వకంగా చేతులను పైకి ఎత్తారు. మేము మళ్ళీ ఆయన పాదాల దగ్గర సాగిలపడ్డాం. మేము నేలమీంచి ముఖాలు ఎత్తేసరికి ఆయన అక్కడ లేరు. ఆ సుగంధము మాత్రం మిగిలి వుంది. మేము గుహవైపుకు నిశ్శబ్దంగా నడిచాం. నా గుండె ఇంకా శ్రీగురు బాబాజీతో నిండిపోయి ఉంది. ధ్యానం తరవాత నేను నిద్రపోయాను. బాబాజీ మాత్రం ఎప్పటిలాగే ధుని ముందు రాయిలా స్థిరంగా, పువ్వులా మృదువుగా కూర్చొని ఉన్నారు.

# 31. నిజమైన పవిత్రమూర్తి

మా తరువాతి గమ్యం ఉత్తరకాశీ. అది గంగానదీమూలమైన గంగోత్రికీ గోముఖానికీ ముఖద్వారం. తెహ్రీ, నరేంద్రనగరూ మొదలైన ప్రదేశాల మీదుగా ప్రయాణిస్తూ మేము ఉత్తరకాశీ చేరుకున్నాం. తెహ్రీ గుండా నడుస్తూన్నప్పుడు యోగి రామతీర్థులు పూర్ణనైరాశ్యంతో నదిలోనికి దుమికి ఆత్మహత్య చేసుకున్న ప్రదేశాన్ని బాబాజీ చూపించారు.

ఆ రోజుల్లో ఉత్తరకాశీ ఒక చిన్న ప్రశాంత హిమాలయ పట్టణం. బెనారస్‌లో మాదిరిగానే, భాగీరథీ అనే నామాంతరం ఉన్న గంగ, కొంతదూరం దక్షిణం వైపు నుంచి ఉత్తరానికి ప్రవహిస్తుంది (ఇక్కడ). (కాశీ అని కూడా పిలుచుకునే) బెనారస్‌లో మల్లేనే ఇక్కడ కూడా విశ్వనాథ దేవాలయమని చెప్పుకునే పురాతన సుందర శివాలయం ఒకటి ఉంది. యోగీశ్వరుడైన శివుణ్ణి విశ్వప్రభువు, విశ్వనాథుడు అని కూడా పిలుస్తారు.

ఒక చిన్న సాధువుల సమాజం అక్కడి శుభ్రమైన గాలినీ, సరళమైన జీవన స్థితులనూ తృప్తిగా అనుభవిస్తూ, సంచరిస్తూ, ధ్యానం చేస్తూ, రాజకీయాల్లోకి పోటీల్లోకీ తలదూర్చకుండా ప్రశాంతంగా బతుకుతూ ఉంటోంది. అక్కడ రెండో మూడో అన్న క్షేత్రాలున్నాయి. వాటిలో సాధువులకు రోజూ రెండుపూట్లా అన్నదానం జరుగుతుంది. వీటిని (ఈ అన్నక్షేత్రాలను) కాలీకంబ్లీవాలా ఆశ్రమమూ పంజాబ్‌సింధ్ ఆశ్రమమూ నడుపుతూ ఉన్నాయి. ఏకాంతంగా ఉంటూ ఆధ్యాత్మిక అభ్యాసాలలో మునిగి తేలేవాళ్ళ కోసం చిన్న కుటీరాలున్నాయి. టూకీగా చెప్పాలంటే, ధ్యానశీలురికీ, ఆలోచనాశీలురికీ అది ఒక ఆదర్శ ప్రదేశం. ఇండియాలో కొన్ని ఆశ్రమాల్లో విద్యాసంస్థలూ ఆసుపత్రులూ మొదలైన వాటిని నడపడంలో, బాగా అలిసిపోయిన సన్యాసులు ఏకాంతంలో ఉండి తమను తాము తిరిగి ఊర్జస్వంతులనుగా చేసుకోవడానికి వీలుగా ఆ ఆశ్రమాల వాళ్ళు నిర్ణీత సమయానికి ఉత్తరకాశీకి పంపుతూ ఉంటారు.

బాబాజీ రెండు పక్కపక్క కుటీరాలను ఏర్పాటు చేయించారు, ఒకటి ఆయన కోసమూ రెండోది నా కోసమనీను. మా ఇద్దరికీ సాదా భోజనం తీసుకురావడానికి నేను పంజాబ్‌సింధ్ అన్నక్షేత్రానికి రెండుసార్లు వెళ్ళాను. బాబాజీ అరుదుగానే తినేవారు; ఆయన కోసం తెచ్చింది చాలావరకూ కుటీరానికి దగ్గరగా వున్న అడవుల్లో చేరే ఊరకుక్కలకు పెడుతూండేవారు. ఆయన ఆ కుక్కలను ప్రేమించేవారు; ఆ కుక్కలూ ఆయనను ప్రేమించేవి.

వేదాధ్యయనంలో, ముఖ్యంగా సామవేదంలో, విశేష ప్రజ్ఞావంతుడూ తన శిష్యుడూ అయిన కృష్ణానందశర్మగారిని నాకు సంస్కృత పాఠాలు నేర్పడానికి బాబాజీ

పురమాయించారు. మేము వచ్చిన రెండు వారాల తరవాత, నన్ను ఉత్తరకాశీలో ఏప్రిల్ మధ్య దాకా ఏడు నెలల వరకూ ఉండమని ఆదేశిస్తూ, బాబాజీ గంగోత్రికి వెళ్ళారు. ఆయన తిరిగివచ్చినప్పుడు మేమిద్దరం కలిసి గంగానదీ మూలమైన గోముఖానికి నడిచి వెళ్ళి, అక్కడ నుంచి తపోవనానికీ, వాసుకీ సరస్సుకీ వెళ్ళాలి.

ఉత్తరకాశీలో నేనున్న సమయం నా జీవితంలో మహాద్భుత అనుభవాల్ని కలిగించింది. బాబాజీ నాకు నేర్పిన యోగప్రక్రియలను అభ్యసించడం, సంస్కృత తరగతులకు హాజరు కావడమే కాకుండా, అనేక రకాల సాధువుల సాంగత్యం చాలా ఆశ్రమాలను దర్శించడమూ కూడా జరిగింది. కాశీ విశ్వనాథ దేవాలయ ఆవరణమే నాకు ఇష్టమైన ప్రదేశం. అక్కడ నాకు విశిష్ట స్పందనలు కలిగేవి. తరుచు ఆధ్యాత్మిక అభ్యాసకులు కలిసేవారు కూడ. గర్భగుడిలోంచి ఇవతలకు వచ్చిన క్షణం నుంచీ గాఢధ్యానంలోకి ప్రవేశించేవాణ్ణి. అక్కడ ఆ ఆవరణలో కూర్చొని ధ్యానం చేసుకోడానికి ఒక ప్రశాంతపు మూలను ఎంచుకున్నాను. అక్కడే మాధ్యాహ్నిక భోజనానికి వెళ్ళే వేళ అయేంతవరకూ ఉండేవాణ్ణి. ఒకసారో రెండుసార్లో అక్కడి పూజారుల్లో ఒకరు నన్ను తిరిగి జాగ్రదవస్థకి తీసుకొని రావలసి వచ్చింది

ఒకసారి, నిజంగా గాఢమైన ధ్యానం తరవాత నేను కళ్ళు తెరవగానే, భయంకరమైన జుత్తుగుత్తులూ నెత్తుటితో నిండిన కళ్ళూ ఉన్న ఒక దిగంబరుడు నా పక్కనే మోకరిల్లి కూర్చొని నేనొక వింత నమూనా అన్నట్టుగా పరీక్షిస్తూండడం చూసి ఉలిక్కిపడ్డాను. నా తెరిచిన కళ్ళల్లోకి తొంగిచూశాడతను. నేనొక ఎక్స్‌రే యంత్రం ముందు ఉన్నాననిపించింది. తరువాత టోసినవ్వుతో అతను నాట్యం చేయడం మొదలు పెట్టాడు. పిచ్చివాడిలా సైగలు చేస్తూ "సిద్ధో, సిద్ధో, భాలో, భాలో హోయిగయిలూ" అని గట్టిగా అరవడం ప్రారంభించాడు. నేను నిలుచొని అతనితో మాట్లాడబోయే లోపులో అతను మంద్రంగా ఈలవేసి ఆవరణ నుంచి బాణంలాగ దూసుకుపోయి అదృశ్యమైనాడు.

అక్కడ రామకృష్ణ ఆశ్రమ వర్గపు పెద్ద సన్యాసి ఒకరున్నారు. ఆయన ఉత్తర కాశీలో ఒక రెడ్డెళ్ళ ఏకాంతవాసాన్ని గడుపుతున్నారు. మేము గొప్ప మిత్రులమయ్యాం. తరచు మేమిద్దరమూ కలిసి ఆలయ ఆవరణంలోకి ధ్యానం చేయడానికి వెళ్ళేవాళ్ళం. ఆ రోజున ఆయన నా నుంచి ఏమంత ఎక్కువ దూరంలో లేడు కనక అప్పుడు జరిగిందంతా కళ్ళారా చూశాడు. అంచేత నేనాయన దగ్గరకు వెళ్ళి దీని అర్థమేమిటని అడిగాను. ఎప్పటిలాగానే ఆ స్వామి మెత్తగా మాట్లాడుతూ "ఆయన దివ్యప్రేమతో

ఉన్మత్తుడైన పరమహంస అనుకుంటాను. ఆయన ఉచ్చరించిన శబ్దాలన్నీ బంగ్లా భాషవే. 'సిద్ధో' అంటే బాగా ఉడికినది; లేకపోతే దాని అర్థం సిద్ధుడు కావచ్చు, అంటే, సఫల యోగి అని. భాలో అంటే గొప్ప అని గానీ మంచి అని గానీ అర్థం. "హోయిగయిలూ" అంటే అయింది, జరిగింది అని అర్థం.

"అతను నీ ఆధ్యాత్మిక స్థితిని సూచిస్తూ ఆ మాటలు అన్నట్టయితే, నువ్వు చాలా అదృష్టవంతుడివనే నేనంటాను. ఆ రోజున నువ్వు నాతో మాట్లాడుతూ చెప్పిన గొప్ప బాబాజీ, నీ గురువు, నిన్ను బాగా పురోగమించిన ఆధ్యాత్మిక స్థితికే తెచ్చారు. నిన్ను సమాధిలో ఉండగా పరికిస్తూంటే నువ్వు నిస్సంశయంగా ఉచ్చ చైతన్య స్థితిలో ఉన్నావనిపిస్తోంది నాకు.

"మా (సన్యాసి) వర్గాన్ని స్థాపించిన స్వామీ వివేకానంద గారి గురువు శ్రీరామకృష్ణ పరమహంస ఈ మాటలే ఉపయోగించేవారు. ఆయన ఒక ఆధ్యాత్మిక జిజ్ఞాసువుని జాగ్రత్తగా పరీక్షించి ఆయన సంతృప్తి చెందితే 'సిద్ధో, సిద్ధో' – బాగా పక్వమయింది, బాగా పక్వమయింది – అనేవారని చెబుతారు. ఈ వ్యక్తి కూడా ఆ మాటలనే ఉపయోగించడం చూసి నాకు ఆశ్చర్యం వేసింది" అని అన్నారు.

దశనామీ వర్గానికి చెందిన లక్ష్మణపురీ అనే ఒక సన్యాసి ఒకరోజున నాతో, ఆధ్యాత్మికంగా బాగా ఉన్నత స్థాయికి చేరుకున్న ఒక పవిత్రమూర్తి నది ఒడ్డున తిరుగుతూ ఉన్నాడని చెప్పేడు. అంతకుముందే అతన్ని ఎరిగిన సన్యాసి ఒకడు ఉత్తరకాశీని దర్శించాడు. ప్రసిద్ధికెక్కిన మఠాల్లో ఒకదానికి చెందిన ఇతను సంచార సాధువును చూసినప్పుడు ఆయన పాదాల మీద సాగిలపడ్డాడు. తరవాత అతను ఆ సాధువు పూర్వచరిత్రను కొంతమందికి చెప్పేడు కూడ –

అతని అభిప్రాయంలో, ఈ పవిత్రమూర్తి మౌలికంగా ప్రసిద్ధ శంకరాచార్యులు స్థాపించిన పశ్చిమ భారతంలోని సంపన్న ప్రఖ్యాత దశనామీ వర్గపు మఠానికి చెందినవాడు. ఆ మఠ పీఠానికి అధిపతి కావలసిన సమయం వచ్చేసరికి, ఆయన అక్కణ్ణించి అదృశ్యమవుతూ వివరణగా ఒక పత్రంలో ఆ పీఠాధిపతి పదవికి అనుబంధమైన డాబుసరితనమూ ప్రత్యేకమైన హోదా తనకు ఇష్టం లేదని తెలియజేశారు. తాను తన మానాన తానే పోతున్నానని చెబుతూ, పరమాత్మే ఏకైక ఆశ్రయంగా తాను ఒక సంచార సన్యాసినవుతున్నానని చెప్పారు.

ఆయన దండిస్వామిగా ఉండేవారు. అంటే, తన విశిష్టమైన దర్జానూ హోదానూ చూపించే దండాన్ని పట్టుకొనే ఒక బ్రాహ్మణ సన్యాసి అని అర్థం. ఉత్తర కాశీకి వచ్చి

ఆ దండాన్ని నీటి కుండతో సహా గంగలో విసిరి పారేశారు. అంతకుముందు రోజుల్లో ఆయనను ఎరిగిన, ఆయన గురించి క్షుణ్ణంగా తెలిసిన సన్యాసి ఇక్కడకు వచ్చేంత వరకూ ఎవరికీ ఆయన పేరు కూడా తెలియదు. ఆయనను పట్టి 'స్వామీజీ' అని మాత్రమే సరళంగా సంబోధించేవాళ్ళు – 'స్వామీజీ' అంటే 'పవిత్ర సన్యాసి' అని అర్థం.

ఆయన చాలా సమయం గంగ ఒడ్డు మీదుగా నడిచేవారు, లేకపోతే కూర్చొనే వారు. రాత్రిపూటేమో ఆలయ ఆవరణంలో నిద్రపోయేవారు. ఆయన అరుదుగానే మాట్లాడేవారు; అన్నం కోసం అన్న క్షేత్రానికి వచ్చేవారు కాదు. అందుకని దక్షిణభారతం నుంచి వచ్చిన ఒక యువసాధువు ఆయనకు అన్నం పెట్టడమనే బాధ్యతను స్వీకరించి రోజుకోసారి ఆయనకోసం అన్నం తీసుకొని వెళ్ళేవాడు. ఆ పావనమూర్తి తన చేతుల్నే పాత్రగా చేసి దానిలో ఎంత పడితే అంతే తిని గంగనీళ్ళు తాగేవారని నాకు ఆయనను తెలిసిన వాళ్ళు చెప్పారు.

ఆయన దాదాపు మడమల దాకా చేరే పాత కాషాయపు బట్టను కట్టుకునేవారు; ఒక ఉన్ని దుప్పటి మాత్రమే ఆయన దగ్గర ఉండేది – అది పగటి పూట ధ్యానపీఠంగా పనికివచ్చేది; అదే రాత్రిపూట చలి నుంచి కాపాడడానికి పనికివచ్చేది.

"ఆయన దర్శనం చేసుకుంటే నీకు మంచిది" అని లక్ష్మణపురీ అన్నారు. అందుకోసం ఒక వెచ్చని సోమవారం పొద్దున్న ఆయనను దర్శించుకోవాలనే ఆశతో గంగ ఒడ్డుకి వెళ్ళాను. నేను ఎక్కువసేపు నిరీక్షించవలసిన పని పడలేదు. కాషాయం కట్టిన ఒక సన్నని పొడుగుపాటాయన నెమ్మదిగా గంగ ఒడ్డున నడుస్తున్నారు; స్వామీ లక్ష్మణపురీ చేసిన వర్ణనతో పూర్తిగా తులతూగినట్టున్నారు ఆయన. నేను నిలుచున్న దగ్గర్నుంచి కొద్ది దూరంలో ఒక పెద్ద చపటా రాయివైపుకు వెళ్ళి, దాన్ని ఎక్కి నదిని చూస్తూ మఠం వేసుకొని కూర్చున్నారు.

నేను ఆయన దగ్గరకు పోవడానికి అవసరమైన ధైర్యాన్ని పుంజుకొని నడిచి వెళ్ళి, నిశ్శబ్దంగా ఆ రాతి దగ్గర నిలుచున్నాను. ఆయన నా వైపుకు తిరిగారు. మహాభక్తితో ఆయనకు సాగిలపడి నమస్కరించి మౌనంగా ఉన్నాను. ఆయన ఎప్పుడో గాని మాట్లాడరని చెప్పడం బట్టి నేను ఆయనను అలజడి పెట్టదలచుకోలేదు. కానీ అనుకోనిదే జరిగింది. ఆయనే మాట్లాడారు. ఆయన మృదువుగా "నీ పేరేమిటి?" అని అడిగారు.

"మధు" అని నేను చెప్పాను.

"అయితే నువ్విక్కడేం చేస్తున్నావు? ఏమన్నా నేర్చుకుంటున్నావా?"

"సత్యాన్ని అన్వేషిస్తున్నాను" అని నేనన్నాను.

ఆయన కళ్ళల్లో దయ తొణికిసలాడింది.

"పాపం కుర్రాడా! అది చాలా కఠినమైన పని నాయనా! నేను చాలా ఏళ్ళు దానికోసం కష్టపడ్డాను. ఇప్పుడు నేను డెబ్భై ఏళ్ళవాణ్ణి. నేను నా దండాన్ని కూడా విసిరిపారేశాను. సావకాశపడిందాన్నే తింటూంటాను; అయినప్పటికీ సత్యం చేతికి చిక్కలేదు. వేదాంతం మీద దొరికే ప్రతి పుస్తకాన్నీ అధ్యయనం చేశాను; అయినా బ్రహ్మాన్ని కనుక్కోలేకపోయాను. నీకెవరైనా గురువు ఉన్నారా!" అని అడిగారు ఆయన.

"అవునండీ!" అని సగర్వంగా చెప్పాను. "ఆయన చాలా అద్భుతుడు. మహామహితాత్ముడైన శ్రీగురు బాబాజీకి ప్రత్యక్ష శిష్యుడాయన.నేను అదృష్టవంతుణ్ణి"

"పురాణ ప్రసిద్ధుడైన బాబాజీ గురించి నేను విన్నాను. అయితే, అటువంటి కథలూ గాథలూ చాలానే ఉన్నాయి. ఈ రోజుల్లో దేనిని నమ్మాలో దేన్ని నమ్మకూడదో ఎవరికీ అర్థం కాదు. గురువులు నకిలీ; ఆశ్రమాలు రాజకీయ క్రియాశీలతకు కేంద్రాలయ్యాయి. నిజమైన జిజ్ఞాసువుకు మతిపోతోంది. ఏదేమైనా, ఈ మహాబాబాజీని నువ్వు చూశావా?" అని అన్నారు ఆ ముసలి సన్యాసి.

"ఊఁ ఒక్కసారి చూశాను. నేను బాబాజీ అని పిలచే మా గురువుగారు తిరిగి ఇక్కడకు వచ్చినపుడు మీకు నచ్చుతుందంటే మిమ్మల్ని చూడమని ఆయనను నేను ప్రార్థిస్తాను" అని నేనన్నాను.

"కొన్ని వారాలక్రితం వరకూ, నాకు సాయం కావాలన్న మాటను ఒప్పుకోడానికి వీల్లేనంత గర్వంగా ఉండేవాణ్ణి కాని, ఇప్పుడేమో, సాయాన్ని కోరడానికి ఇష్టపడుతున్నాను; ఎవరికి తెలుసు, ఈ శరీరం ఇంకెంతకాలం పాటు ఉండగలదో? దయచేసి, తప్పకుండా ప్రార్థించు. నేనీ రోజున చాలానే మాట్లాడాను. నీ దారిని నువ్వు వెళ్ళు నాయనా" అని అంటూ ఆయన ఆ సమావేశాన్ని అకస్మాత్తుగా తుంచేశారు. నేను సాగిలపడి నమస్కరించి వెళ్ళిపోయాను. బాబాజీ ఉత్తరకాశీకి తిరిగి రాగానే ఆయనను ఆ పావనమూర్తి దగ్గరకు తీసుకొని వెళ్ళాను.

కానీ ఆ విషయం కన్నా ముందుగా మా సంస్కృతం మాస్టారు కృష్ణానంద శర్మగారు తైత్తిరీయ ఉపనిషత్తుని చదివే తీరును చెప్పే మొదటి పాఠాన్ని చెప్పినపుడు ఆయన పడ్డ ఆశ్చర్యాన్ని గురించి చెప్పి తీరాలి. మొదటి పాఠం కాగానే, ఒక్కసారి మాత్రం వినగానే నేను పూరితగా సరైన ఒత్తిడితోనూ స్వరంతోనూ చదవగలుగుతున్నా

నని ఆయన గుర్తించారు. ఇంతకుముందు అధ్యయన తరగతులేమైనా చేరేవా అని అడిగితే, నేను లేదని చెప్పినప్పుడు ఆయన నేను అబద్ధం చెబుతున్నానని అనుకున్నారు. నేను ఆయనతో అబద్ధం చెప్పాల్సిన కారణమేమీ లేదని చెప్పాను. అది నాకు చాలా సహజంగానే వస్తున్నట్లనిపిస్తోందని చెప్పాను. చివరకు ఆయన నిస్సహాయతను కనబరుస్తూ భుజాలను కదిలిస్తూ "బహుశా నువ్వు నీ పూర్వజన్మలో అధ్యయనం చేసి ఉంటావు. నాకు మరో వివరణ ఏమీ కనిపించట్లేదు. లేకపోతే బాబాజీ ఇంద్రజాలం కావచ్చు" అని అన్నారు.

భగవద్గీతను కంఠస్థం చేయడమన్న విషయంలో, ఉద్దీపనం కలిగించే ఆహారం తాలూకు ప్రాముఖ్యాన్ని నేను తెలుసుకున్నది కూడా ఉత్తర కాశీలోనే. గీతాపఠనం నాకు చాలా ఇష్టం. బాబాజీ తాను తన మాస్టారు నుంచి నేర్చుకున్నానన్న సుందరమైన పద్ధతినే ఆయన నాకు నేర్పారు. కానీ నేనెప్పుడూ పుస్తకాన్ని ఎదురుగానే పెట్టుకొనే వాణ్ణి. నాకు సంబంధించినంతవరకూ, దేనిని కంఠస్థం చేయడమన్నా అది పీడకలే నాకు. దేనినైనా అది చెప్పే విషయాన్ని తెలుసుకోడానికి చదవడమంటే నాకు ఆనందంగానే ఉండేది కానీ దానిని గుర్తుంచుకోవడమంటే మాత్రం అదొక కాలయాపనమనీ శక్తిని వ్యర్థం చేసుకోడమనుకొనీ అనుకొనేవాణ్ణి. కంఠస్థం చేయడమంటే నాకున్న ఈ ద్వేషాన్ని ఉత్తర కాశీలో దాటగలిగాను. కొంత సమయంలోనే గీతను కంఠస్థం చేయగలిగాను. అది జరిగిన వైనం ఇదిగో ఈ విధంగా -

అక్కడి చాలా ఆశ్రమాలు తరుచుగా సమృద్ధమైన విందులను ఏర్పాటు చేస్తూ ఉంటాయి. వాటికి సాధువులనూ బ్రహ్మచారులనూ ఆహ్వానిస్తూ ఉంటారు. తినడానికి ఉపక్రమించే ముందు, అతిథులైన సాధువులందరూ గీతలోని పదిహేనో అధ్యాయమైన పురుషోత్తమప్రాప్తి యోగాన్ని పఠిస్తారని అందరూ ఎదురుచూస్తూ ఉంటారు. పిన్నాపెద్దా అయిన సాధువుల్లో చాలామందికి ఆ పదిహేనో అధ్యాయం కంఠస్థమే. ఎవరికైతే రాదో ఆ కొద్దిమందినీ హీనంగా చూసేవాళ్ళు. అంచేత, రెండు విందులైన తర్వాత, దానిని కంఠతా పెట్టాలని నిశ్చయించుకున్నాను. మూడో విందు దగ్గర, ఏదో విధంగా సాయం పెట్టగలిగాను. నాలుగో (విందులో) నేను అనర్గళంగా చెప్పగలిగాను. అటువంటి సుష్టు భోజనానికి పదిహేనో అధ్యాయం వల్లెవేయడమన్నది చాలా తక్కువ వెలనియ్యడమే.

ఆ విందుల్లో ఒకదానిలో స్వామీ వెంకటేశానందను కలిశాను. సాయంత్రం ఆయన నన్ను తన కుటీరానికి రమ్మనమని పిలిచారు. ఋషీకేశం తాలూకు స్వామీ

శివానంద సరస్వతికి ప్రముఖ శిష్యుడాయన. ఆయనగారి లోతైన, వైదాంతిక జ్ఞానానికీ అంతర్దృష్టికి అందరూ చాలా గౌరవిస్తారు ఆయనను. మొదటి కలయిక తరవాత మేమిద్దరమూ చాలా సాయంత్రాలే గడిపాం. ఆయనను చేసిన చర్చల నుంచి నేను చాలా లాభాన్నే పొందాను.

చాలా ఏళ్ళ తరవాత స్వామీ వెంకటేశానందకూ జె.కృష్ణమూర్తి గారికీ మధ్య జరిగిన ఉల్లాసవంతమైన చర్చను నేను వినడం జరిగింది. ఆ చర్చలో ఎవరికైనా గురువు అవసరమని స్వామీ వెంకటేశానంద వాదించారు; ఎప్పటి మాదిరిగానే జె. కృష్ణమూర్తిగారు గురువనే వాడు అనవసరమే కాదు, అతను సత్యాన్వేషకుడికి అడ్డుగా కూడా నిరూపితుడవుతాడని వాదించారు. ఆ చర్చ ఏ స్థిరమైన పర్యవసానమూ లేకుండానే అంతమయింది.

మేలో బాబాజీ తిరిగి వచ్చారు. ఉత్తరకాశీలో మేమిద్దరం ఐదు రోజులు గడిపాం. తరువాత గంగానదీ మూలమైన గోముఖానికి వెళ్ళడానికి సమయమొచ్చింది. బాబాజీ వచ్చిన తరవాత రెండో రోజున, పూజనీయుడైన ఆ ముసలి పవిత్రమూర్తితో నా సమావేశాన్ని గురించి చెప్పాను ఆయనకు. "నాకు తెలుసును. అయితే, నేనాయనను చూడాలని నువ్వంటావు, అవునా?"

"మీరు మాత్రమే ఆయనకు సాయం చేయగలరని నేననుకుంటున్నాను" అన్నాన్నేను.

మర్నాడు, బాబాజీ నన్ను తీసుకొని బయలుదేరారు. ఆ పావనుణ్ణి కలుసుకోడానికి మేం వెళ్ళాం. మేము అక్కడకు చేరినప్పుడు ఆయన తన ఇష్టమైన రాతి మీద కూర్చొని ఉన్నారు. మమ్మల్ని చూసి, నిలుచొని, నేలమీదకు దిగి వచ్చారు. మేము చేరువ కాగానే ఆయన చేతులు జోడించి బాబాజీకి నమస్కరించారు. నేను ఆయనకు అభివాదం చేస్తూ అదే పని చేశాను. "స్వామీజీ! అభివాదాలు. మనం మాట్లాడుకుంటూంటే మధూను పంపించెయ్యమంటారా?" అని బాబాజీ అడిగారు.

"యోగి మహరాజ్! మీకు ప్రణామాలు. అతన్ని ఉండనివ్వండి. బహుశా ఈ చర్చనుంచి అతను లాభపడవచ్చునేమో! నాకే సమస్యా లేదు" అని ఆ ముసలి సన్యాసి అన్నారు. అంచేత నేను ఆ చర్చా సమయంలో ఉండడానికి ప్రత్యేక అవకాశాన్ని పొందినవాణ్ణయ్యాను. మేము అక్కడే కూర్చున్నాం. బాబాజీ ఆయన సూటి వైఖరిలో తక్షణమే చర్చను ప్రారంభించారు.

"స్వామీజీ! మీ విద్వత్తును నేను గౌరవిస్తాను. మఠానికి ఉత్తరాధికారిగా అయ్యే అవకాశాన్ని నిరాకరించిన మీ ధైర్యవంతమైన రీతికి కూడా నేను ఇంకా ఎక్కువగా మిమ్మల్ని గౌరవిస్తాను. మీరు మీ దండాన్నీ కిరీటాన్ని (మఠాధిపత్యాన్నీ) విసిరిపారేశారు. ఈ రోజున మీరు ఒక సాధారణ సంచార సన్యాసిలాగ జీవిస్తున్నారు. అది చాలా గొప్ప విషయమే! కానీ, మీ నెత్తిమీద మీరు మోస్తున్న జ్ఞాన విద్వద్భారాలు 'యథార్థాన్ని' అర్థం చేసుకోవడంలో బలవత్తరమైన అడ్డంకి అయి కూర్చొని ఉండడంవల్ల మీరు ఎదురుతెన్నులు చూస్తున్న బ్రహ్మానికి మీరు బహుదూరంగానే ఉండిపోయారు. ఇంకా చెప్పడం సాగించమంటారా?" అని బాబాజీ మధ్యలో అన్నారు.

"కానివ్వండి. మీరు చెప్పేదేదో నేను అందుకోడానికి ఉపక్రమిస్తున్నాను".

"మీరు సంపాదించిన జ్ఞానంతో మీరెంత పూర్తిగా నిండిపోయారంటే 'సత్యాన్ని' స్వీకరించడానికి మీలో చోటే లేదు. అది లోపలికి రావడానికి వేచి చూస్తూ ఉంది. మీమీద ఉన్న ఆ భారాన్ని తీసెయ్యండి. దానినంతనీ తోసెయ్యండి. శూన్యాన్ని కౌగిలించుకోండి. అప్పుడు మీరు దాన్ని పుష్కలంగా స్వీకరించగలుగుతారు".

"ఈశావాస్యోపనిషత్తులో ఉన్న శ్లోకం – 'విద్యను ఉపాసించేవాడు మరీ ఎక్కువ చీకట్లోకి ప్రవేశిస్తాడు'* – అనే వాక్యం అసలైన అర్థమేమిటబ్బా అని నేను విస్తుపోయే వాణ్ణి. 'విద్య' అంటే ఇక్కడ 'అపరావిద్య' లేక అముఖ్య జ్ఞానం మొదలైనవని చెప్పే సాంప్రదాయిక వివరణను నేనెప్పుడూ ఒప్పుకోలేకపోయాను. ఋషులు సూటిగా చెప్పేవారు కనక వాళ్ళు చెప్పదలచుకున్నది అపరా విద్యే అయితే అదే మాట వాడి ఉండేవారుగా (అని అనుకున్నాను). ఇప్పుడు నేను అర్థం చేసుకోడం మొదలు పెడుతున్నాను. అయ్యా, కొనసాగించండి" అని ఆ సన్యాసి అన్నారు.

"మీరు సరిగ్గా అన్నారు. 'అపరా' అనే శబ్దాన్ని ఎందుకు వాడలేదంటే విద్యకు విశేషణాన్ని వాడవలసిన అవసరమే లేదు. కనక నిజమేమిటంటే విద్యే, దానికదే, కేవల సత్యాన్ని అర్థంచేసుకోడానికి అడ్డంకి. నేను వివరిస్తాను (దీన్ని) మీరు చూడండి,

* *అన్ధంతమఃప్రవిశన్తియేఽవిద్యాముపాసతే ।*
*తతోభూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః ॥ (ఈశావాస్యోపనిషత్తు-9)*

*(అవిద్యను (అశుచిని శుచి అనుకోడం, అనిత్యాన్ని నిత్యమనుకోడం, దుఃఖాన్ని సుఖమనుకోడాన్ని) ఆరాధిస్తే అంధతమస్సులో ప్రవేశిస్తారు. విద్యను (శాస్త్రారణ్యంలో పడి జ్ఞానభారాన్ని పెంచుకోడాన్నీ, అదో గొప్ప అనుకొని గర్వపడడాన్నీ) ఉపాసించే వాళ్ళు అంతకన్నా మహాచీకట్లోనే మగ్గిపోతారు. విద్య అయినా, జ్ఞానమైనా జ్ఞప్తికి, అంటే, గతించిన కాలానికి ప్రతీక. కడచిన కాలమనే కనిపించని చీకట్లో తచ్చాడేవాళ్ళు నిత్యవర్తమానమైన సత్యప్రకాశాన్ని కనుక్కోవడం సంభవం కానేకాదు కదా!)*

నేను దేన్ని గురించిన జ్ఞానాన్నోసంపాదించాలని మొదలు పెట్టినప్పుడు, ఏ ప్రక్రియ ఇమిడి ఉంది దానిలో? మొదట నేను ఆ విషయాన్ని పరిశీలిస్తాను, తర్వాత అర్థం చేసుకుంటాను, తరువాత దాన్ని నేను జ్ఞప్తిలో పెట్టుకుంటాను. అవునాండీ?" అని బాబాజీ అన్నారు.

"నిజమేనండి"

"నాకు x లేక y గురించి తెలుసునని నేనంటే, దాని నిజమైన అర్థం ఏమిటంటే, ఆ అర్థం చేసుకున్న విషయాన్ని నేను నా స్మృతిలో ఉంచుకున్నాననీ, తక్షణమే దాన్ని గుర్తుకు తెచ్చుకోగలనని. అది ఏ జ్ఞానమైనా సరే, ఏ విద్యైనా సరే, జ్ఞానమంటే ఇంతే, అంటే, విద్య (జ్ఞానం) అంతా స్మృతే, లేదా, ధారణ అనే శబ్దానికి అర్థం, అది మునుపటి వస్తువని; వర్తమానంలో స్మృతే లేదు. జ్ఞాపకమంటే నిధిగా దాచిన సమాచారం, విషయం. అది ఎప్పుడూ భూతకాలంలోనే ఉంటుంది. మీ నిశిత బుద్ధితో నేను చెబుతూన్నదాన్ని తెలుసుకోగలుగుతున్నారా?"

"అర్థం చేసుకుంటున్నానండి"

"ఇప్పుడు చూడండి, 'సత్యం' మునుపటి వస్తువేదో కాజాలదు. అది 'శాశ్వత వర్తమానం'. అంచేత అది స్మృతిలో సంగ్రహించుకొని ఉంచుకొనేది కాదు. స్మృతి, గతించిన కాలానికి సంబంధించిన వస్తువు. మరోవైపు 'సత్యమ'నేది 'ఇప్పటిలో', వర్తమానంలో, శాశ్వతంగా ప్రవహిస్తూ జీవంతో స్పందిస్తూ ఉండేది కనక, జ్ఞానం (విద్య) దాన్ని స్పృశించలేదు.

"కేనోపనిషత్తు చెప్పే విధంగా, 'మనస్సు దాన్ని అర్థం చేసుకోలేదు'.* మన జ్ఞానవంతాలైన మస్తిష్కాల్లో పేర్చుకొని మోస్తూన్న చెత్తనంతనీ మనస్సు నుంచి తీసేసి, ప్రశాంతంగానూ స్థిరంగానూ దాన్ని చేస్తే, అది ఇంక ఏదో అవుదామనీ, ఏదో పొందాలనీ ప్రయాస పడదు కనక శాశ్వత వర్తమానమైన సత్యం ప్రకాశించదానికి దానిలో చోటు ఉంటుంది.

"గర్వమూ, వినికిడి జ్ఞానమూ అనే నల్లరంగు దట్టంగా పూసిన తలుపులూ, కిటికీ అద్దపు పలకలూ పూర్తిగా తెరవాలి మధురమైన దివ్యవాయువు లోపలికి ప్రవేశించదానికి. స్పష్టంగా చెప్పాననుకుంటాను".

---

* *యన్మనసా న మనుతే యే నాహుర్మనోమతమ్ ।*
*తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥ (కేనోపనిషత్తు 1-5)*
*(152వ పేజీ కూడా చూడండి)*

దీర్ఘమౌనం తరవాత ఆ ముసలాయన మాట్లాడాడు:

"ఆc! మహానిశ్శబ్దం. నా జీవితం పొడుగునా ఇంత నిశ్చల నిశ్శబ్దతతో నేనెప్పుడూ కూర్చోలేదు. ప్రత్యేకంగా ఏమీ చేయకుండా నదిని పరికిస్తూన్నప్పుడూ విశుద్ధాకాశాన్ని చూసేటప్పుడూ ఒకసారో రెండుసార్లో దాని గుమ్మంలో చేరినట్టు మాత్రం నేను ఒప్పుకుంటాను".

"ఆ నైశ్శబ్ద్యం మీకు సహజంగానే దానికదే సిద్ధిస్తూన్నప్పుడు దానికి అడ్డుపడకండి. నిశ్చలంగా ఉండండి, అంతే. శ్రీగురు బాబాజీ మీరు "సత్యాన్ని" కనుక్కొనేలాగ మిమ్మల్ని దీవించాలి.

"మిమ్మల్ని మళ్ళీ నేను చూడను. కొన్ని రోజుల్లో మేము గోముఖానికి వెళ్తాం" అని బాబాజీ లేచి నిలుచొని, ఆ ముసలాయనకు వీడుకోలు చెప్పారు. కళ్ళలో నీళ్ళతో ఆయన బాబాజీ పాదాల మీద సాగిలపడడానికి ప్రయత్నిస్తూంటే బాబాజీ ఆయన భుజాలను పట్టుకొని ఆపి, ఆ పనిని చెయ్యనీయలేదు.

"మీరు సన్యాసి వర్గానికి చెందినవాళ్ళు. కాషాయాన్ని కట్టేరు. అదీగాక మీరు చాలా శ్రద్ధాపరులు. బయట ప్రపంచం దృష్ట్యా మీరు నాకన్నా పెద్దవాళ్ళు. అంచేత మిమ్మల్ని నా కాళ్ళ మీద సాగిలపడడానికి ఒప్పుకోలేను. మీ కళ్ళలో నేనంటే ప్రేమ కనిపిస్తోంది. అదే చాలు," అని బాబాజీ అన్నారు.

గంగ ఒడ్డుమీద ఆయన నిలుచొని ఉండగా మేము వదిలి వెళ్ళిపోయాం. ఆయన కళ్ళు మేము కనిపిస్తూన్నంత వరకూ మా వెంటనే ఉన్నాయి. "బాబాజీ! నన్ను కూడా 'సత్యం' వైపుకు నడిపించండి. ఈ రోజున నేను ఒక గంభీరమైన విషయాన్ని నేర్చుకున్నాను. మీరు చాలా దయాళువులు" అని నేనన్నాను.

బాబాజీ నవ్వుతూ తన కుడిచేతిని నా భుజాల చుట్టూ చుట్టేరు. "ప్రతీదీ తగిన సమయంలో వస్తుంది. గురువారం పొద్దున్న మనం గోముఖానికి ప్రయాణం చేస్తాం" అని అన్నారు.

# 32. శ్రీవిద్యా దీక్ష

తరువాతి గురువారమే గంగ అనే మరో పేరున్న భాగీరథీ ఉత్పత్తి స్థానమైన గోముఖానికి బయల్దేరాం. సగర రాజవంశజుడైన భగీరథుడి ప్రేరణతో దివి నుంచి భువికి గంగ దిగి వచ్చింది కనక దానికి భారతీయ పురాణాల్లో భాగీరథి అని కూడా పేరు వచ్చింది. ఆ కథ తీరు ఇలాగ:

వేల సంవత్సరాల క్రితం, హిమాలయాలు ఇంకా చిన్నవిగా ఉన్నప్పుడు, శక్తివంతుడైన సగర మహారాజు చాలా యుద్ధాలే చేసి బహురాజ్యాలను గెలిచాడు. అప్పుడాయన అశ్వమేధ యజ్ఞం చేశాడు – ఒక గుర్రాన్ని చుట్టుపట్ల ఉన్న రాజ్యాల్లో విచ్చలవిడిగా తిరగనిస్తారు. ఎవరైనా దానిని పట్టుకుంటే, వాళ్ళు రాజుగారి సైన్యంతో యుద్ధం చేసి గుర్రాన్ని తమ సొత్తుగా కైవసం చేసుకోవాలి.

దేవేంద్రుడైన ఇంద్రుడు సగర యజ్ఞం సంపన్నమయితే ఆ రాజు చాలా శక్తివంతుడైపోయి, దేవ రాజ్యాలను కూడా కైవసం చేసుకొని తనను సింహాసన భ్రష్టుడిగా చెయ్యవచ్చునని భయపడ్డాడు. అందుచేత తన మాయాశక్తులను ఉపయోగించి, ఆ గుర్రాన్ని దొంగిలించి, దానిని కపిల మహర్షి ఆశ్రమం దగ్గర దాచాడు.

ఆ గుర్రం ఆచూకీ పట్టుకుందామని వెతుకుతూన్న సగర పుత్రులు అరవై వేలమందీ చివరకు కపిల మహర్షి ఆశ్రమానికి చేరుకొని అక్కడ ఆ గుర్రాన్ని కనుక్కొన్నారు. గుర్రాన్ని దొంగిలించడానికి బాధ్యుడు ఈ ఋషే అనుకొని వాళ్ళు ఆయనకు గుణపాఠం నేర్పాలని భయపెట్టారు. మహర్షి గాఢధ్యానంలో ఉన్నారు. ఆ (అరవై వేల మంది) గగ్గోలుకీ ధ్యానం చెదిరి ఆయన కళ్ళు తెరిచారు. అరుదైన క్రోధ ప్రకటనతో ఆయన చూపుకే ఒక్కరు తప్పించి అందరూ బుగ్గై పోయారు. ఆ ఒక్క కొడుకూ పశ్చాత్తాపం కారణంగా బతికిపోయాడు.

అతని కొడుకు అంశుమంతుడు. అతను తన పెత్తండ్రుల ముక్తి కోసం తీవ్ర తపస్సు చేశాడు. కపిల మహర్షి గుర్రాన్ని తీసుకుపోనిచ్చారు గానీ ఆ పెత్తండ్రుల ఆత్మలకు విముక్తి కలగాలంటే దివ్యనది గంగా జలాలు నేలమీదకు దిగి వచ్చి వారి బూడిదను తాకాలని నిర్దేశించారు. అంశుమంతుడు విశ్వప్రయత్నం చేశాడు కానీ గంగను భూమ్మీదకు రప్పించడానికి ఒప్పించలేకపోయాడు. అతని కొడుకు దిలీపుడు కూడా ప్రయత్నించి విఫలుడయ్యాడు. కానీ అతని పౌత్రుడు భగీరథుడు తన తీక్షణమైన తపస్సుతో దివ్య నదీమతల్లి గంగ గుండెను జయించాడు. ఆవిడ నింగినుంచి నేల మీదకు దిగి రావడానికి సమ్మతించింది. కానీ, ఒక సమస్య వచ్చి పడింది; గంగ

నేలమీదకు చేరేటప్పుడు శక్తివంతమైన ఆ నీటి తాకిడి మహోపద్రవాన్ని కలిగించవచ్చు, భూమికి అఘాతం ఏర్పడవచ్చు.

గంగానది దిగేటప్పుడు భూమిని రక్షించగలిగేది ఒకే ఒక్కడు; కైలాస పర్వతాన్ని అధిష్ఠించి ఉన్న మహాయోగి శివ మహాదేవుడొక్కడే. అంచేత. భగీరథుడు శివుణ్ణి (తపస్సు ద్వారా) అనునయించాడు. భగీరథుడి భక్తికి సంతుష్టుడై శివుడు తన శిరస్సు మీద వేగబలాన్వితమూ అల్లకల్లోలమూ అయిన గంగానది జలాలను గ్రహించి, తన జటాజూటం ద్వారా వాటిని నెమ్మదిగా భూమ్మీదకు వదిలిపెట్టడానికి అంగీకరించాడు. భగీరథుడు ఆవిడను ఈ విధంగా అవతరించడానికి ఒప్పించాడు. కనక, గంగాదేవికి భాగీరథి అనే పేరు వచ్చింది. గోముఖం గంగ అవతరించిన ప్రదేశంగా పరిగణింపబడింది.

గోముఖానికి తోవ గంగోత్రి గ్రామం, భైరవఘాటీల ద్వారా సాగుతుంది. గంగాదేవికి అంకితమైన గుడి ఒకటి గంగోత్రి గ్రామంలో ఉంది. అక్కడ చాలా ఆశ్రమాలున్నాయి. వేసవి కాలమంతా చాలామంది సాధువులు గంగోత్రిలో ఉంటూ ఉంటారు. ఉత్తర కాశీకి దిగేముందు గంగోత్రిలో గంగ పూర్తి వేగంతో ప్రవహిస్తూ ఉంటుంది. గంగోత్రి నుంచి ప్రకాశవంతమైన సుదర్శన శిఖరం కనిపిస్తుంది.

మేము గంగోత్రిలో రెండు రోజులు గడిపాం. ఉద్దాసిన సాధువర్గంలోని జూనా అఖాడాకు చెందిన ఒక కుటీరంలో ఉన్నాం. కొండల మీంచి ఉరికి వస్తూన్న నదీ గర్జన నన్ను బాగా ఆకర్షించింది. గంగోత్రి చేరడానికి మాకు నాలుగు రోజులు పట్టింది. మేము గోముఖ క్లిష్టయాత్రకు బయల్దేరే ముందు రోజు రాత్రి ధుని ముందు కూర్చుని ఉండగా బాబాజీ అకస్మాత్తుగా చెప్పారు: "ఆ ముసలి సన్యాసి (గంగ ఒడ్డున కూర్చునే పావనమూర్తి) ప్రశాంతంగానూ నిశ్శబ్దంగానూ శరీరాన్ని వదిలేశారు" అని. నేను ఆ విషయమై ఎక్కువ స్పష్టమైన వివరణ అడగడానికి ఉపక్రమిస్తే నన్ను ఆయన "ఇప్పటికి ఆ విషయమై ఇంకేమీ ప్రశ్నలు వెయ్యొద్దు" అని నివారించారు.

ఆ ముసలి పవిత్రమూర్తి గంగకు అభిముఖంగా తన ఇష్టమైన రాతిమీద కూర్చొని స్వానందమగ్నుడై నవ్వుతూ చనిపోయారని మేము గోముఖం నుంచి ఉత్తర కాశీకి తిరిగి వచ్చిన తరువాత స్వామీ లక్ష్మణపురీ చెప్పారు. మేము గోముఖానికి వెళ్ళిన నాలుగు రోజుల తరువాత అది జరిగింది. ఉత్తర కాశీ ప్రభుత్వ వైద్యశాల తాలూకు వైద్యాధికారి అభిప్రాయం ప్రకారం ఆయన గుండె ఆగిపోవడంవల్ల చనిపోయాడు.

మర్నాడు గంగోత్రి నుంచి గోముఖానికీ తపోవనానికీ ప్రయాసతో కూడిన మా యాత్రను మొదలుపెట్టాం. గంగోత్రి అనే పవిత్ర గ్రామం వదిలామంటే చాలు అంతా నిశ్శబ్దమైపోతుంది. భాగీరథికి ఆవలి ఒడ్డున సహజమైన గుహలు చాలా ఉన్నాయి. నాలుగు గంటల్లో మేము చిరబాసాకి (Chirbasa) చేరుకున్నాం. ఆ ప్రదేశంలో ఉన్న చాలా దేవదారు వృక్షాల కారణంగానే ఆ దేవదారు చెట్ల తోటకు ఆ పేరు పెట్టారు. ఇక్కడ నుంచి దూరంగా మెరుస్తూన్న గంగోత్రి మంచుదిబ్బ కనిపిస్తుంది.

ఒక అరగంట విశ్రాంతి తీసుకున్న తరవాత, నానబెట్టిన సెనగలు తిని నీళ్ళు తాగి మా ప్రయాణాన్ని కొనసాగించి కొండరావిచెట్లుతోట (Birch Grove) అయిన భోజబాసాకి చేరుకున్నాం. భోజబాసంలో ఎర్రటి వస్త్రాలు ధరించిన ఒక తాంత్రిక సాధువుకి మేము అతిథులమయ్యాం. ఆయనకు బాబాజీతో బాగా పరిచయమున్నట్టుగా ఉంది. మాకు సుష్టుగా రొట్టెలూ పప్పూ కూరలూ పెట్టిన తరవాత మరికొన్ని రోజులుండమని బాబాజీని అనునయిస్తూనే ఉన్నారు. బాబాజీ గోముఖంలోనే ఉందామని స్థిర సంకల్పంతో ఉన్నారు కనక, మధ్యాహ్న భోజనం కాగానే మేము మళ్ళీ బయలుదేరాం.

భోజబాసం నుంచి భాగీరథీ శిఖరాలు కనిపించడం మొదలు పెడతాయి. కొంత సమయమైన తరవాత, కడలిమట్టానికి 21,000 అడుగుల ఎత్తులో ఉన్న పిరమిడ్ రూపంలో (సూచ్యగ్రస్తూపాకారంలో) ఉన్న శివలింగ శిఖరాన్ని దర్శించాం. సుమారు ఒక గంట తరవాత మేము గోముఖానికి చేరుకున్నాం. నాకు ఆ దృశ్యం మతిని పోగొట్టింది. ఆవు నోరులాటి ఆకారంలో ఉన్న మంచుతో కప్పడిన ముట్టె నుంచి గంగాజలాలు బయటకు వస్తున్నాయి. ఆ ముట్టెకు అవతల 25 కిలోమీటర్ల పాటు కేవలం మంచు స్వరూపమైన గంగోత్రి మంచుదిబ్బ ఉంది. వేగంగా వస్తూన్న జలాల్లో మంచుబండలు తేలుతున్నాయి. ఎటువైపు తిరిగితే అటు వట్టి తెల్లటి మంచే మంచు. పారవశ్యావేశంలో నేను చుట్టూ గెంతులేసి నేలమీద పొర్లాడాను. "ఉపశమించు" అని బాబాజీ నవ్వుతూ అన్నారు. "త్వరగా ఒక మునుగు మునుగుదాం నడు". మేము ఒక మునక వేసి వెంటనే మమ్మల్ని పొడిగా తుడిచేసుకున్నాం. మా శరీరాలను వెచ్చచేయడానికీ, తడి బట్టలు ఆరడానికి సూర్యుడు కొద్దిసేపు బయటకు వచ్చాడు.

గోముఖానికీ తపోవనానికీ మధ్య కొన్ని గుహలున్నాయి. వాటిలో ఒక దానిలో బాబాజీ 'దాదా' (అన్న) అని పిలిచే ఆయన పూర్వ సహచరుడు ఉన్నాడు. ఆయన బెంగాలు నుంచి వచ్చారు; ప్రతి వేసవి కాలమూ ఆ గుహలో గడుపుతూ ఉంటారు.

మేము ఆ మంచుదిబ్బకు ఎడమవైపు నిటారుగా ఉన్న వాలు మీదుగా పైకి ఎక్కి ఒక అరగంటలో ఆ గుహకు చేరుకున్నాం. దాదా మా కోసం ఎదురు చూస్తున్నారు. మంచులో కూరుకుపోయిన అంత సుదూరమైన ప్రదేశంలో కూడా ఆయన ధునిని వెలిగించగలిగారు. ఆ గుహ చాలా పెద్దది. దాని ప్రవేశముఖం చాలావరకూ పెద్ద పెద్ద బండలే గోడలుగా అమరింది. నేలమీదున్న చెక్క పలకలు పక్కలుగా అమరాయి. ఆయన మాకు అదనపు రగ్గులు కూడా సమకూర్చారు.

రాత్రి భోజనంగా అన్నమూ బంగాళాదుంపలూ తిన్నాం; గుహలోనే రాత్రిని గడిపాం. బాబాజీ నాకు దొరకడం వల్ల నేను చాలా అదృష్టవంతుణ్ణని దాదాజీ అన్నారు. "ఆయన శిష్యులను స్వీకరించడానికి ఇష్టపడరు. నువ్వు చాలా అదృష్టవంతుడివి. నన్ను శిష్యుడిగా స్వీకరించమని నేనడిగిన ప్రతిసారీ 'దాదా, మనం మిత్రులుగానే ఉందాం' అని అన్నారాయన" అని దాదాజీ చెప్పారు.

మర్నాడు పొద్దున్న తపోవనానికి నడిచివెళ్ళాం. మాకు అక్కడికి వెళ్ళడానికి దగ్గరదగ్గర రెండు గంటలు పట్టింది. ఇప్పుడు శివలింగ శిఖరం కనిపిస్తోంది. స్వచ్ఛంగా వెండి మాదిరిగా ఉన్న హిమచూడ శిఖరాల విశాల విన్యాసం మీద సూర్యరశ్మి పరావర్తించి చిత్రవిచిత్రంగా ఉంది. కుడిపక్కన భృగుపంథ శిఖరమూ, మేరువూ ఉన్నాయి. శివలింగానికి ఎడమ పక్క భాగీరథీ శిఖరముంది. దానికి అవతల సతోపంథ్ మొన ఉంది. ఉత్తరంలో మనా పర్వతం, శ్రీకైలాస శిఖరము ఉన్నాయి. దక్షిణాన సుదర్శన శిఖరముంది.

మరో అరగంటలో మేము పర్వత శిఖరానికి చేరుకున్నాం. మేమున్న చోటికి దిగువ భాగంలో గంగోత్రి మంచుదిబ్బ పరచుకొని ఉంది. మరికొంత నడిచి గంగోత్రి మంచు దిబ్బా, కీర్తి మంచుదిబ్బా సంగమ స్థలానికి చేరుకున్నాం. కుడిపక్కన దూరంగా కేదార్‌నాథ్ కనిపిస్తోంది; ఎడమ పక్కన సతోపంథ్ కనిపిస్తోంది. తర్వాత కిందికి దిగి వచ్చి గుహకు చేరుకున్నాం. మేము గుహలో ఐదు రోజులు గడిపాం. ఒక వారానికి సరిపడే సరుకులూ వంటచెరకూ దాదాజీ మా కోసం సేకరించి ఉంచారు.

ఒకరోజున బాబాజీ దాదాజీతో ఇలా అన్నారు: "దాదా! రేపు మధూకి శ్రీవిద్యా దీక్షనియ్యి" అని.

"కానీ బాబాజీ! మీరు ఇక్కడ ఉండగా నేనెలాగ ఇస్తాను? మీరే ఆ పని చేయవచ్చుగా" అని దాదా అభ్యంతరం వెలిబుచ్చారు.

"కాదు. నువ్వే చెయ్యి. నిన్ను ఆ పనిని నిర్వహించమనడానికి నాకు కొన్ని ప్రత్యేకమైన కారణాలున్నాయిలే".

దాదాజీ ఒప్పుకున్నారు. కకార ధ్వనితో ఆరంభమయ్యే లోపాముద్ర వర్గానికి చెందిన శ్రీవిద్యా సంబంధమైన షోడశాక్షరీ మంత్రాన్ని (16 అక్షరాలున్న మంత్రం) ఆయన నాకు ఉపదేశించారు. "కుండలినీ శక్తి కోసం వెనుబాములోని మధ్యమార్గాన్ని క్రియాయోగం పరిశుద్ధపరుస్తుంది. శ్రీవిద్య తాలూకు ధ్వనిస్పందనలు మస్తిష్కమూ వెనుబాములోనూ ఉన్న కేంద్రాలను ఉత్తేజితం చేయడానికి పనికివస్తాయి; ఆరోహించడం ఆరంభించిన సర్పశక్తి (కుండలినీ శక్తి)ని గ్రహించడానికి వాటిని సిద్ధం చేస్తాయి.

"శ్రీవిద్యలో బాబాజీయే గొప్ప నేర్పరి. ఆయన ఆజ్ఞానుసారం చక్రధారణా ప్రక్రియను (చక్రాలను ధ్యానించడం) నేను ఇస్తున్నానంతే".

మర్నాడు నేను బాబాజీని అడిగాను: "బాబాజీ! మీరు నా గురువుగా ఉండగా, ఇంతదాకా నేను నేర్చుకున్న దాని దృష్ట్యా చూస్తే, ఇవన్నీ నేర్చుకోవాల్సిన పని ఉందంటారా? అందులోనూ మరొకరి దగ్గర్నుంచి! ఇలాగ అనడం తప్పైతే నన్ను మీరు క్షమించండి" అని.

బాబాజీ అప్పుడు చెప్పారు: "నాయనా! నీకు వేరువేరు రకాల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులూ, ఆధ్యాత్మిక బోధకులైన వాళ్ళూ తారసిల్లుతారు. (ఆధ్యాత్మిక) విషయంలో సాధ్యమైన ప్రతీదీ నువ్వు నేర్చుకోవాలన్నది మొదటిది; ఎవరైనా (నాకివి అన్నీ తెలుసును, నువ్వు అజ్ఞానివి ఈ విషయంలో అని అంటే నువ్వు బెదిరిపోకుండా ఉండాలనేది రెండోది; కొంతమంది జిజ్ఞాసువులకు వారి అభివృద్ధిని వేగవంతం చెయ్య డానికి శ్రీవిద్య కావలసి రావచ్చు. నీకది తెలియకపోతే, వాళ్ళకు నువ్వే విధంగా సాయపడగలవు?

"వివిధమైన సిద్ధాంతలూ అభ్యాసాలూ మూసల్లాటివి. ఆకారం లేనిదీ, వంచ గలిగినదీ, నిర్మలమైనదీ అయిన పదార్థాన్ని ఆ మూసల్లో వేస్తే దానికి ఏదో ఒక క్రమాన్ని తీసుకు రావచ్చును. కానీ, ఆ మూసను పగలగొడితేనే గానీ ఏర్పడిన దానిని ఇవతలకు తియ్యలేవన్న విషయాన్ని గుర్తుంచుకో.

"అంచేత మూసా అవసరమే, చివరకు దానిని పగలగొట్టడమూ అవసరమే. అర్థమయిందా?"

"చిత్తం బాబాజీ. ఇప్పుడిప్పుడే అర్థమవుతోంది" అని వినమ్రంగా అన్నాను.

గోముఖం నుంచి ఋషీకేశానికి తిరిగి వచ్చేశాం.

# 33. జర్మన్ డాక్టర్ నుంచి నేర్చిన పాఠాలు

నేను బాబాజీతో ఉన్న మూడున్నరేళ్ళలో మేము గోముఖానికి ఒకసారీ, గంగోత్రికి రెండుసార్లూ, యమునోత్రికి (జమునోత్రికి) ఒకసారీ, బద్రీనాథు కేదార నాథులకు రెండుసార్లూ వెళ్ళేం. గంగోత్రికి రెండోసారి వెళ్ళినప్పుడు బాబాజీ దగ్గర చదువుకున్న ఒక జర్మన్ నాడీశాస్త్ర నిపుణిడ్ని (న్యూరాలజిస్టును) నేను కలుసుకున్నాను. బాబాజీ అతనిని వట్టిగా జర్మన్ అనేవారు. ఈ జర్మన్ నాడీశాస్త్ర నిపుణుడి పేరును నేను చెప్పలేను. అతను, వ్యక్తిగత కారణాల వల్ల అజ్ఞాతంగా ఉండదలచుకున్నాడు. నేను కూడా అతనిని జర్మన్ అనే వ్యవహరిస్తాను. గంగోత్రిలో (మేమున్న) కుటీరం దగ్గర మమ్మల్ని చూడడానికి అతను వచ్చాడు.

బాబాజీ అతన్ని పరిచయం చేస్తూ ఇలా చెప్పారు: "ఈ జర్మన్ డాక్టరు స్టట్‌గార్ట్ (Stuttgart) నుంచి వచ్చినవాడు. ఇతనొక నాడీశాస్త్ర నిపుణుడు. నా దగ్గర పదేళ్ళు విద్యార్థిగా ఉన్నాడు. ఒక నెలపాటు అతను గంగోత్రిలో ఉంటాడు. నువ్వు అతని దగ్గర మొదటి అంగప్రత్యంగ రచన (Anatomy) గురించీ, పదార్థ తత్త్వ వివేచన (Physiology) గురించీ మెదడూ వెనుబాముల వ్యవస్థ గురించీ మూల విషయాలను నేర్చుకోవాలని నేననుకుంటున్నాను.

"నీ ఆత్మ గురించి నువ్వు తెలుసుకోవాలంటే మెదడు ఎలాగ పని చేస్తుందో కూడా తెలుసుకోవాలి. మనం సాధారణంగా మనస్సుగా పిలిచేదే ఈ మెదడు. నువ్వు దాన్ని బాగా అర్థం చేసుకుంటే, సామాన్య విచారణను మించిన ఉచ్చతర చైతన్యస్తరాలను పరిశీలించడం సులభమవుతుంది.

"మేము మాటల్లేకుండానే సంపర్కంలో ఉంటాం. (ఆ విధంగా) ఈ జర్మన్‌కు నీ గురించి చాలానే తెలుసును".

ఏ విషయాన్నైనా క్షుణ్ణంగా అధ్యయనం చేయడంలో జర్మన్‌లకుండే విలక్షణతను ఈ డాక్టరు కూడా పుణికి పుచ్చుకున్నవాడే. (అంచేతనే) అతను పట్టికలతోనూ పటాలతోనూ సన్నద్ధుడయి ఉండేవాడు. చిన్న మెదడు గురించీ, లింబిక్ వ్యవస్థా, లేక, సరీసృప సంబంధమైన మెదడూ అని పిలుచుకునే మధ్యమస్తిష్కం గురించీ, కార్పస్ కలోసంతో సంధితమై ఉండే రెండు అర్ధగోళాలతో కూడిన పెద్ద మెదడు గురించీ, వెన్నుపూస, స్వయంప్రేరిత నాడీమండలం, అనుకంపాత్మక నాడీవ్యవస్థ, వలలాగ అల్లుకొని ఉండే నాళాల సమూహం గురించీ, మెదడూ వెనుబాముల వ్యవస్థకు సంబంధించిన ప్రతిదాని గురించీ నేను అధ్యయనం చేశాను. ప్రత్యక్షంగా శవపరీక్ష

లేకపోతే, ఏ అంగానికి ఆ అంగం కోసి పరీక్షించడం అనేదొక్కటే మినహాయించడం జరిగింది.

17, 18 శతాబ్దాలప్పటి సమయంలోనే నాడీశాస్త్ర నిపుణులు, మెదటి రెండు అర్ధగోళాలూ పరస్పర సంబంధం కలిగి ఉన్నా, వాటి వాటి క్రియలను పరస్పరమూ పూరించుకుంటూన్నా, వాటికి వాస్తవంగా విలక్షణమూ నిరుపమానమూ అయిన వ్యక్తిత్వాలుంటాయని అనుమానించారని నేను మొట్టమొదటిసారిగా విన్నాను. ఈ జర్మన్ మహాశయుడు జర్మనీలోని తన ప్రయోగశాలలో హఠయోగ ప్రదీపిక, షట్చక్ర నిరూపణం మొదలైన పురాతన యోగ గ్రంథాల్లో లభ్యమయ్యే సమాచారాన్ని ఆధునిక నాడీశాస్త్రంలోని విషయాలతో పోల్చి చూస్తున్నాడుట. నాడీ శాస్త్రీయ పరిభాషలో వ్యవహరించే "చైతన్యాన్ని పెంపొందించుకోవడంలో అడ్డంకులను అధిగమించడాన్ని" వివరించే సంభావ్యతను పరిశోధిస్తున్నాడు.

ఇప్పుడు నేను ఆలివర్ సేక్స్ (Oliver Sacks) రాసిన పుస్తకాలూ, ఏన్టోనియో ఆర్ డెమేసియో రాసిన 'డేకార్ట్స్ ఎర్రర్' (Descartes' Error), నా మిత్రుడు వీ ఎస్ రామచంద్రన్ రాసిన 'ఫేంటమ్స్ ఇన్ ది బ్రెయిన్' (Phantoms in the Brain) మొదలైన పుస్తకాలను చదువుతూంటే ఆధునిక నాడీశాస్త్ర నిపుణులు ఇప్పుడు విపులీకరిస్తున్న వాటి బీజాలు అతని (ఆ జర్మన్) భావాల్లో ఇమిడి ఉన్నాయని అర్థమయింది. దురదృష్టవశాత్తూ, ఇప్పటి రచయితల్లో ఎవ్వరికీ కూడా పూర్వీకుల యోగసంబంధమైన బోధనల గురించిన గట్టి పునాది లేదు. ఇంకా అంతకన్నా దురదృష్ట కరమైనదేమిటంటే, నేను కలుసుకున్న మూడేళ్ళ తరవాత ఆ జర్మన్ డాక్టర్ ఒక రోడ్డు ప్రమాదంలో చనిపోవడంతో అతను చేస్తూన్న పరిశోధన అర్ధాంతరంగా తుంచి నట్టయిపోయింది.

అతను తిరిగి అతని పరిశోధనకు అనువైన పరిస్థితుల్లో పుడతాడని బాబాజీ అన్నారు. కానీ ఏ విధంగా, ఎప్పుడూ ఎక్కడా అనేవి నాకు తెలియదు. కానీ బాబాజీని ఆ జర్మన్ ఏ విధంగా మొట్టమొదట కలుసుకున్నాడనే ఆకర్షణీయమైన కథను, అతను చెప్పిన తీరులోనే ఇప్పుడు చెబుతాను:

"నేను హిమాలయాలకు రెండు కారణాలవల్ల ప్రయాణించాను. మంచుటోపీలు పెట్టుకున్నట్టుండే పర్వతాలను చూడాలనే కేవల ఆకర్షణ ఒకటి. హిమాలయాలను దర్శించిన ఇద్దరు జర్మన్ యాత్రికులు చేసిన దివ్యమైన వర్ణన నన్ను ప్రబలంగా ఆకట్టుకుంది. హిందూ తత్త్వశాస్త్రం, తంత్రమూ, యోగమూ అంటే నాకున్న అభిరుచి

రెండో కారణం. సర్ జాన్ వుడ్రోఫ్ రాసిన "ద సర్పెంట్ పవర్" (The Serpent Power) చదివిన మీదట, కుండలినీశక్తి మార్గాలకూ, మెదడూ వెనుబాములకూ మధ్య ఉన్న పోలికను చూసి నాకు ఆసక్తి రేగింది. పురాతన యోగులకు మొదటి నిర్మాణం గురించీ పదార్థ వివేచన గురించీ గాఢమైన ఎరుక లేనిదే శిరస్సులో ఉన్న చక్రం, బ్రహ్మరంధ్రం (బ్రహ్మానికి ద్వారం) మొదలైన వాటిని వర్ణించగలిగే వాళ్ళు కాదు.

"నిజమైన యోగులు ఇంకా ఉండే ఉంటే వారిని కలుసుకోవాలనే కోరికే నన్ను హిమాలయాలకు వెళ్ళేలాగ పురికొల్పింది. అప్పటికి నేను నాడీశాస్త్ర నిపుణుడిగా పూర్తి హోదాని పొందినవాణ్ణి. నేను స్టట్‌గార్ట్ (Stuttgart) ఆసుపత్రిలో పనిచేస్తు న్నాను. నా ప్రయాణానికి నిజమైన కారణాన్ని చెప్పకుండా, చాలా కష్టం మీద నేను ఒక నెల సెలవు సంపాదించాను. యోగంలో గానీ తత్సంబంధమైన విషయం మీద గానీ ఒక శాస్త్రజ్ఞుడు చూపించే ఏ రకమైన అభిరుచినైనా ఆ రోజుల్లోని శాస్త్రజ్ఞ సమాజం సాంప్రదాయ విరుద్ధంగాను, బొత్తిగా అశాస్త్రీయంగానూ పరిగణించేది.

"ఆ రోజుల్లో హిమాలయాలకు ప్రయాణం చేయడమూ అంత సులభమేమీ కాదు. ఢిల్లీకి విమానంలో వచ్చాను. ఆ తరవాత హరిద్వార్‌కి రైల్లో వెళ్ళడానికి పూర్తిగా ఒక రోజు పట్టింది. అక్కణ్ణించి బడబడలాడే పాత బస్సొకటి ఎక్కేను. అది ఋషీకేశానికి చేరడానికి దాదాపు సగం రోజు తీసుకుంది. ఋషీకేశంలో డివైన్ లైఫ్ సొసైటీలో ఉంటూ, ఆశ్రమ ముఖ్యుడైన స్వర్గీయ స్వామీ శివానంద సాయాన్ని యాచించాను. నేనేమీ తిరగక్కర్లేదనీ, తానే నాకు కావలసినది బోధిస్తాననీ స్వామి అన్నారు కానీ నాకు తృప్తి కలగలేదు – నా కళ్ళు పై హిమాలయాలమీద ఉన్నాయి. అంచేత కొన్ని రోజులు కాగానే ఉత్తర కాశీకి వెళ్లే బస్సు పట్టుకున్నాను. ఆ రోజుల్లో రోడ్లు చాలా అపాయకరంగా ఉండేవి; పూర్తిగా ఒక రోజు పట్టింది (ఉత్తర కాశీ ప్రయాణానికి) ఆ గఢ్వాలీ బస్సు డ్రైవర్ చాలా అజాగ్రత్తగా వున్నాడు.

"ఉత్తర కాశీ నుంచి మరో బస్సు పట్టుకొని మర్నాటికి గంగోత్రి చేరుకున్నాను. గంగోత్రి దగ్గర ఒక పాత ఆశ్రమంలో వసతి దొరికింది. అక్కణ్ణించి గోముఖానికి వెళ్ళే కష్టమైన ప్రయాణానికి పథకం వేసుకున్నాను. అన్నీ తెలిసిన ఒక యోగి ఎప్పుడు, ఎక్కడ దొరుకుతాడా అని అనుకుంటూ, ఒక రోజున గంగోత్రి గుడికి నడిచి వెళ్తూండగా, గోధుమ వన్నెని మించిన నల్లటి పొడుగు జుట్టుతో కేవలం తెల్లని కౌపీనం మాత్రమే ధరించి, పొడుగుపాటి చక్కటి ఛాయ కల దృఢకాయుడొకడు

నాకు ఎదురుగా వస్తూ కనిపించాడు. ఆయన నా వైపుకే తిన్నగా నడిచి వచ్చి జర్మన్‌లో 'గూటెన్ టాగ్' (Good Morning) అని అన్నారు.

"నేను నా చెవులను నమ్మలేకపోయాను. 'గూటెన్ టాగ్' అని నేను నత్తిగా అన్నట్టున్నాను. నా జర్మన్ అంత బాగుండదు. అంచేత మనం ఇంగ్లీషులో మాట్లాడు కుందామా? అని ఆ కొత్త మనిషి అన్నారు. 'తప్పకుండా' అని నేనన్నాను. 'సరే డాక్టర్, ఎక్కడైనా ఒక చోట కూర్చొని మాట్లాడుకుందాం. నా కుటీరానికి రా' అని అంటూ మళ్ళీ నాకు ఆశ్చర్యాన్ని కలగజేశారాయన. ఈ విధంగా జరిగింది మా కలయిక".

ఆ రోజున తనకు క్రియాయోగ దీక్ష ఇచ్చిన దగ్గర నుంచీ తాను అభ్యాసం చేస్తున్నాననీ, యోగాన్నీ వేదాంతాన్నీ బాబాజీ మార్గదర్శకత్వంలో నేర్చుకుంటున్నాననీ ఆ జర్మన్ చెప్పేరు. అతను ఆయనను గురువుగా అనుకున్నాడు. శ్రీగురువును కలుసు కోలేదు అతను. కానీ నేను (మధు) గడచిన జన్మలో శ్రీగురువు శిష్యుణ్ణని బాబాజీ అతనికి చెప్పారు.

యోగాభ్యాసాలు తీసుకొని వచ్చే చైతన్య పరిణామానికి ఒక శాస్త్రీయ ఆధారాన్ని స్థాపించడమే ఆ జర్మన్ జీవిత లక్ష్యం. నా పాఠాలు అయిపోయిన తరవాత మేము డాక్టరు దగ్గర వీడ్కోలు తీసుకొని ఋషీకేశానికి తిరిగి వచ్చేం. కొన్ని రోజుల్లో ఆ జర్మన్, గోముఖానికి అధిరోహించాలి.

# 34. త్రివేంద్రానికి తిరుగు ప్రయాణం

ఉజ్జాయింపుగా మూడేళ్ళు గడిచాయి నేను బాబాజీని కలుసుకొని. ఈ అపురూపమైన నా జీవిత స్థితి ఎప్పటికీ కొనసాగుతూ ఉంటుందని నేను అనుకున్నాను. హిమాలయాలను ప్రేమించాను; బాబాజీని ప్రేమించాను; ఏ రకమైన ఆస్తిపాస్తులూ లేకుండా పూర్తి స్వేచ్ఛతో తిరుగుతూ ఉండడాన్ని ప్రేమించాను. కటిక స్వార్థ లోభాలతో నిండి ఉండి నాగరికమని చెప్పుకొంటూ ఉండే సంఘంలో ఉంటూ చిక్కులూ వ్యథలూ పడుతూ బతకవలసిన అగత్యం నుంచి విముక్తి కలిగినందుకూ నాకు సంతోషంగా ఉండేది. నాకు బాబాజీ ఒక దేవుడు; ఆయనతో బాటు నదులూ పర్వతాలూ ఉన్న ఈ ఐంద్రజాలిక లోకం నాకు స్వర్గం. ఈ ఆదర్శ స్థితిని వదిలి వెళ్ళాల్సి వస్తుందన్న ఆలోచనే నా మనస్సును ఎప్పుడూ స్పృశించలేదు. అయితే ఈ నా కలను ధ్వంసం చేసేలాగ బాబాజీ అకస్మాత్తుగా ఒక పనిని చేశారు.

అప్పటికే కొన్నిసార్లు, ముఖ్యంగా ఆ సంవత్సరంలో, అప్పుడప్పుడు కొద్దిపాటుగా నాకుగా నేను బతికేలాగ నన్ను అవతలకు పంపించేవాళ్ళు. కానీ ఆ ఉదయం ఆయన చేసిన పని పూర్తిగా వూహించనది. నా హృదయాన్ని ఆఘాతపరిచింది. పొద్దుటి ధ్యానం అయిన తర్వాత ఆయన పాదాల మీద సాగిలపడి నమస్కరించడానికి వెళ్ళినప్పుడు, చాలా గంభీరమైన ముఖ కవళికతో "మధూ! మానసికంగా నువ్వు నామీద ఎక్కువగా ఆధారపడి ఉండడాన్ని గమనిస్తున్నాను. ఆధ్యాత్మిక బోధనల పూర్తి తాత్పర్యమేమిటంటే ఒకణ్ణి నిజంగా స్వతంత్రంగా చేయడం, తద్వారా అతనిని ముక్తిపరునిగా చేయడం. ఉపాధి పరిమితుల పంజరాన్ని ఛేదించుకొని బయటపడ్డ చైతన్యం కల యోగికి ఏ ఊతకర్రలూ అక్కర్లేదు; గురువుగారి ఆధారమూ అక్కర్లేదు."

తొలి ఆఘాతం తరవాత నాలో ఒక పెద్ద కోపతరంగం ఫెళ్ళున చిట్లడం చూసి నాకు ఆశ్చర్యం వేసింది. "అయితే ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?" అని ఆయన ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగాను: "నేను నాకు చెందిన వాటినన్నిటినీ (చివరకు) నా తల్లిని కూడా, వదులుకొన్నాను; నా సంబంధ బాంధవ్యాలన్నీ కాల్చేశాను. మీరే నా లంగరనుకున్నాను. కానీ ఇప్పుడది అలాకాదని తోస్తోంది. నేనేమి చేయాలనుకుంటున్నారో చెప్పండి. అదే చేస్తాను".

"వెళ్ళు. ఇక్కణ్ణించి నువ్వు వెళ్ళిపోవాలి. ఇప్పణ్ణించి నీకుగా నువ్వు స్వతంత్రంగా బతకాలి" అని బాబాజీ అన్నారు. నేను ఏడవలేదు, పితూరీ చేయలేదు, ఏదో సాకు చెప్పడానికీ చూడలేదు. "సరే బాబాజీ! మీరు కోరుకొనేది ఇప్పుడే జరిగి తీరుతుంది" అని నేను కోపాగ్రహాలతో మండిపోతూ, నా కొద్దిపాటి వస్తువుల్నీ – గుడ్డసంచీ, ఒక

దుప్పటీ, ఒక చేతికర్ర, ఒక నీటి కుండా – తీసుకొని, ఆయన పాదాలను తాకి బయటకు నడిచాను. ఆయన మౌనంగానే నా తలమీద చేతులనుంచారు; నేను కనిపించినంత వరకూ చూస్తూ నిలుచొని ఉన్నారు.

ఆయన చూపుకూ వినికిడికీ అందని చోటుకు రాగానే గంగ ఒడ్డున కూలబడి గట్టిగా ఏడ్చాను. నేను గగ్గోలుగా ఏడుస్తూంటే నా ఒళ్ళంతా ఊగిపోయింది. ఆ కన్నీళ్ళు నా కోపాన్నీ భయాన్నీ తుడిచేశాయి. ఒక యోగికి యోగ్యమైనట్టుగా, అందులోనూ మహా మహేశ్వరనాథుల శిష్యుడిగా, శ్రీగురు బాబాజీ శిష్యుడిగా, నన్ను నేను సంబాళించుకొని లేచి ఉత్తర కాశీ దిక్కుగా నడిచాను.

నేను ఒక అరగంటపైగా తెహ్రీ పోయే రోడ్డుమీద నడిచిన తరవాత వర్షం మొదలయింది. నేను ముద్దముద్దగా తడిసిపోయాను. నేను నడుస్తూనే ఉన్నాను. వాన ఆగింది. సూర్యుడు మళ్ళీ బయటకు వచ్చాడు. "అవును, సంచారం చేసే యోగి ఇలాగే బతకాలి. వాన తడుపుతుంది; ఎండ ఎండబెడుతుంది. అతను తిండిని అడుక్కుంటాడు. ఎక్కడ ఆశ్రయం దొరికితే అక్కడ పడుకుంటాడు" అని నాకు నేను చెప్పుకున్నాను. ఆనందం నా గుండెను నింపింది. నిజంగా, ఇది స్వేచ్ఛ తాలూకు తీపి రుచి.

చంద్రభాగా నదీతీరాల్లో పారవశ్యంతో నాట్యం చేస్తున్న నెమళ్ళను చూశాను. నా గుండెలోకి కూడా ఆ పారవశ్యం ప్రవేశించింది. నేను కూడా వాటిలో ఒక నెమలినై స్వేచ్ఛానందంతో నాట్యం చేశాను. నేనూ నెమళ్ళూ ఒకటయ్యాం. తరువాత అడుగుల చప్పుళ్ళు విన్నాను. నేను నాలోకి వచ్చాను; ఇక నెమలిని కాను. నా వెనకాతల ఎవరో నడుస్తున్నారు. వెనక్కి తిరిగి చూద్దామన్న దుర్వృత్తిని ఆపుకున్నాను. నేను ముందుకే సూటిగా చూస్తూ నడుస్తూ ఉన్నాను. నా కుడి భుజం మీద ఒక చెయ్యి నెమ్మదిగా తగిలింది. ఆ స్పర్శ చాలా పరిచితమయింది. అబ్బే, కాదు, అది కానేరదు అని నాకు నేను అనుకున్నాను. అప్పుడు వాత్సల్యభరితమైన కంఠధ్వని వినిపించింది – "మధూ!" అని.

"బాబాజీ!" అని నేను వెనక్కి తిరిగి చూశాను ఆయనను. నన్ను ఆయన అనురాగంతో చూస్తున్నారు. నేను కంటినీటిని ఆపుకుంటూ కొంత గంభీరత్వాన్ని చూపించాను. "అయితే నువ్వు వెళ్ళిపోతున్నావన్నమాట?" అని ఆయన అన్నారు.

"అవును బాబాజీ! నేను వెళ్ళిపోతున్నాను. మీరు నన్ను పొమ్మన్నారుగా"

"అహా! నేను నిన్ను పొమ్మన్నాను. అంచేత నువ్వు వెళ్ళిపోతున్నావు. (ఇప్పుడు) నిన్ను వెనక్కి రమ్మంటే తిరిగి వచ్చేస్తావా?"

నా మనస్సులోని ఒక భాగం రానని చెప్పి గట్టిగా ఉండమంది. కానీ మరొక భాగం ఎక్కువ సంఘర్షణ లేకుండానే గెలిచింది. నేను "అవును వస్తాను" అని అన్నాను.

"అయితే రా! వెనక్కి పోదాం రా! నిన్ను ఊరికినే పరీక్షించాను. సరే, ఇప్పుడు తిరిగి రా!" అని బాబాజీ అన్నారు.

నెమ్మదిగా, ఆయనను వెంబడించి ఋషీకేశానికి తిరిగి చేరాను. మేము నిశ్శబ్దంగా నడిచాం. నా గుండె ప్రేమతోనూ కృతజ్ఞతతోనూ పొర్లిపోతోంది.

ఆరు నెలల తరవాత, ప్రతీదీ బాగానే నడుస్తోందనుకుంటూన్నప్పుడు, ఇక్కడే ఈ ఇంద్రజాలిక హిమాలయ వాతావరణంలో ఎప్పటికీ ఉండిపోతానని అనుకూంటు న్నప్పుడు, బాబాజీ నా సంతృప్తి నుంచి నన్నొక కుదుపు కుదిపారు.

ఒక సాయంత్రం, ధుని పక్కన కూర్చొని, నెమ్మదిగా బాంబు పడేసారు. "మధూ! నువ్వేం నేర్చుకోవాలో అంతా నేర్చుకున్నావు. నీ హృదయ పద్మం వికసించింది. నువ్వు ఇప్పుడింక (ఈ ఎత్తుల్ని వదిలి) నేలమీదకు, బాహ్యలోకంలోకి వెళ్ళాల్సిన సమయమాసన్నమయింది. త్వరలో నువ్వు నాకు వీడ్కోలు చెప్పి మీ తల్లితండ్రుల దగ్గరికి వెళ్ళాలి" అని అన్నారు.

"కానీ బాబాజీ! నన్ను జిత్తులూ మోసమూ ఉన్న ప్రపంచంలోకి పంపించ దలచుకున్నారా? ఎక్కడ ప్రతివాడూ డబ్బు వెనకాతల పరుగెడుతూ ఉంటాడో, ఎక్కడ లోభమే పరిపాలించే చక్రవర్తో అక్కడికి వెళ్ళమంటారా? ఈ దివ్యభూమి మీద, ఏ బాధ్యతా లేకుండా, ఎప్పటికీ ఎందుకు తిరుగుతూ ఉండకూడదు? నేను మిమ్మల్ని ఎక్కువ సతాయించనని మాటిస్తాను. నేను దూరంగానే ఉంటాను. మీరు పిలిచినప్పుడే మీ దగ్గరకు నేను వస్తూ ఉంటాను" అని అభ్యంతరం వెలిబుచ్చుతూ గభాలున సిగ్గూ ఎగ్గూ వదిలి వెక్కివెక్కి ఏడ్చాను.

"కుదుట పరచుకో నిన్ను నువ్వు. నీకు తెలుసును నేను చాలా అరుదుగానే శిష్యులను స్వీకరిస్తానని. నిన్ను గ్రహించినది శ్రీగురువు గారి వ్యక్తమైన ఆజ్ఞ వల్లనే. నేను రూఢిగా నిన్ను ప్రేమిస్తున్నాను, సంరక్షిస్తాను కూడ. కానీ ఆయన (మా గురువు గారి) కోరికకు వ్యతిరేకంగా మాత్రం చెయ్యలేను. మూడున్నరేళ్ళ శిక్షణ తరవాత నిన్ను తిరిగి లోకంలోకి పంపించాలన్నది ఆయన కోరిక. నీకు ఆయన ఒక బోధనా లక్ష్యాన్ని యోచించి ఉంచారు.

"అదీగాక, నువ్వు ఇంత స్వార్థపరుడివీ సంకుచిత మనస్కుడివీ ఎలా కాగలవు? నాగరికమని చెప్పుకొనే ఈ లోకంలో భాగమైన బాధా, దుఃఖం అనేవాటి గురించి నిజంగా భయపడుతున్నానన్నావు. ఈ ప్రపంచంలో మంచివాళ్ళూ శ్రద్ధాళువులూ కూడా ఉన్నారు. వాళ్ళు నీ జ్ఞానంతో లాభపడతారుగా, గర్విష్ఠులూ అహంకారులూ అయిన స్వనియుక్త విజ్ఞాన బోధకులు 'పతితులైపోయారని ముద్రవేసినవాళ్ళకు కూడా సరైనసాధకాలను సమకూరిస్తే, ఉచ్చతర చైతన్య స్తరాలకు ఎగబాకగలిగే గొప్ప వత్తాసు వాళ్ళకు లభించగలదు.

"వాళ్ళను నువ్వు రోగిష్ఠులుగా అనుకున్నావనుకో. నిజానికి రోగిష్ఠులకే కదా డాక్టరు అవసరం ఉండేది. అంచేత మిగతా మానవజాతితో మమేకమై వాళ్ళ మీద జాలినీ నెనరునీ చూపించు. 'ప్రతి జీవినీ నిర్వాణానికి నడిపించేదాకా నేను మళ్ళీ మళ్ళీ పుడుతూ ఉండాలి' అనే మహా బోధిసత్త్వుడి శపథం ఎంత ఉన్నతమైన ఆదర్శమో నీకు తెలుసు. నువ్వు ఏమనుకుంటున్నావు చెప్పు నాయనా?" అని బాబాజీ అన్నారు.

అప్పటికి నన్ను నేను సంబాళించుకున్నాను. "నాకదేమీ ఎక్కువగా ఇష్టం కాదు. కానీ మీరూ శ్రీగురువూ గారూ ఏది కోరుకుంటున్నారో అది నేను చేస్తాను" అని అన్నాను.

"మంచి కుర్రాడివి. నీనుంచి ఆవేశభరిత విస్ఫోటం వస్తుందని అనుకున్నదే. అది పూర్తిగా సరైనదే. నువ్వు దీనితో (ఈనీ నిర్ణయంతో) బాగా సర్దుకుపోయావని అర్థమయింది. మంచిది" అని బాబాజీ అన్నాను.

"కానీ బాబాజీ! నా ప్రశ్న ఒకటి ఉంది. దీని అర్థం, మిమ్మల్ని మళ్ళీ చూడడం అంటూ ఉండదా, లేక..."

"కాదు కాదు నాయనా, అలాగ కానే కాదు. నువ్వు నన్ను చూస్తావు. నేను అవసరమనుకున్నప్పుడు నిన్ను కలుసుకుంటాను. ఆ సంపర్కం కలలో గానీ, ధ్యాన సమయంలో గానీ ఉంటుంది. నువ్వు ఎప్పుడెక్కడకు రావాలో చెబుతాను.

"ఎన్ని వివిధ మతరీతులున్నాయో వాటిలో సాధ్యమైన వాటన్నింటి బోధనల తోనూ నువ్వు పరిచితుడివి కావాలి. ఇప్పటికి బాగా ప్రతిష్ఠాపితమైన ఆశ్రమాల్లో నువ్వు సమయాన్ని గడపాలి. ప్రసిద్ధులూ, అలాగ కానివారూ అయిన వివిధ గురువులను కూడా కలుసుకోవాలి. ఎవరిని కలుసుకోదలుచుకున్నావో ఎక్కడికి వెళ్ళ దలుచుకున్నావో వాటిని నువ్వే ఎన్నుకోవచ్చు. కానీ తప్పనిసరిగా నువ్వు కొంత సమయం

వెచ్చించాల్సిన వాటిలో ఒకటి రామకృష్ణ మఠం; నీ శిక్షణ చివరి కాలంలో కలవవలసిన వాళ్ళలో ఒకరేమో జె. కృష్ణమూర్తి.

"తిరిగి వెళ్ళిన తరవాత, మామూలు బట్టలే కట్టుకో. అందరిలాగే బతుకు. ఏవో విశిష్టసామర్థ్యాలూ, ప్రత్యేక జ్ఞానమూ ఉన్నవాడిగా నిన్ను నువ్వు ప్రకటించుకో దానికి ఏ ప్రయత్నమూ చెయ్యవద్దు. దీనినంతనీ రహస్యంగానే ఉండనీ, ఎవరైనా నీకు ప్రత్యేక దక్షతలున్నాయని తెలుసుకుంటే, వాళ్ళను ఆ విషయమై మౌనంగా ఉండమనీ, దానిని ప్రచారం చేయవద్దనీ చెప్పు.

"చాలా ఏళ్ళ వరకూ, నువ్వు బోధన పనిని తీసుకోవద్దు. కానీ నువ్వా పనిని చేయవలసివచ్చినప్పుడు నీకు అనుమతినివ్వడం జరుగుతుంది. అది నీకే అర్థమవు తుంది. అప్పుడు నీ శిక్షక స్థితి ప్రారంభమవుతుంది. దాని తరవాత కూడా, నెమ్మది గానే దానిని కొనసాగించు. శ్రద్ధగా కావాలనుకునే జిజ్ఞాసువులకే, ఏ ప్రచారమూ లేకుండా, పెద్ద అనుయాయుల వర్గాన్ని ఆకట్టుకోవాలనే ప్రయత్నమేదీ చేయకుండా బోధించు. చవిటి నేలమీద వ్యర్థమయ్యే వేనకు వేలు బీజాల కన్నా (సారవంతమైన నేలమీద) విత్తిన కొన్ని మంచి విత్తనాలే బాగా ముఖ్యమైనవి."

"బాబాజీ! నాకోగంభీరమైన సమస్య ఉంది. మా తల్లిదండ్రులు నాకో అమ్మాయిని చూసి భార్యగా కట్టబెట్టవచ్చు. దానికి నేనేం చెయ్యాలి?"

"నువ్వు బాధపడవలసిన పని లేదు. ఏదీ కుదరదు. కానీ నేను నీకు చెప్పొచ్చే దేవిటంటే శ్రీగురువుగారి కోరిక ప్రకారం నువ్వు చివరికి పెళ్ళి చేసుకొని పిల్లలను కని గృహస్థులాగ బతకాలని. అందరికీ నువ్వు ఉదాహరణప్రాయంగా నిలవాలి. ఉచ్చతమ చైతన్యస్తరానికి చేరుకోవాలంటే సన్యాసి కావలసినదే అనుకొనే వాళ్ళున్నారు. దాన్ని కాదని ఋజువు చెయ్యి. శ్యామాచరణ లాహిరీ చాలా ఏళ్ళ క్రితం ఆ పని చేసి చూపించారు. ఇప్పుడు నువ్వు చేసి చూపించాలి. అదీగాక, నువ్వు పెళ్ళాడే వ్యక్తి నీ మనస్సును పరిపక్వం చేయడంలో తగిన పాత్రను నిర్వహిస్తుంది. జె. కృష్ణమూర్తితో నీకు సంభవించే సాహచర్యంలో ఆమె నీ జీవితంలోకి వస్తుంది."

నేను వేరే ఇతర విషయాలను చాలావాటినే చిన్నచిన్న వివరాల దాకా కూడా (ఆయన)తో చర్చించాను. ఆ మర్నాడు ఋషీకేశంలో రైలెక్కాను. బాబాజీ కొంత డబ్బు ఇచ్చారు. ఒక అగర్వాల్ గారి ఎడ్రస్ కూడా ఇచ్చి "ఢిల్లీకి వెళ్ళి అగర్వాల్‌ను కలుసుకో. నీకు తాలవ్యక్రియ నేర్పమని అతనికి నేను చెప్పాను. తరువాత త్రివేంద్రానికి వెళ్ళు. అగర్వాల్ నీకు టిక్కెట్లూ, మరికొన్ని పైసలూ ఇస్తాడు" అని అన్నారు.

మొట్టమొదటి సారిగా బాబాజీ నన్ను కౌగిలించుకున్నారు. నా కళ్ళలో నీళ్ళు నిండుతూండగా నేను (ఆయనను) విడిచి వెళ్ళాను.

ఢిల్లీలో రైల్వేస్టేషన్ నుంచి బయటకు వెళ్ళే గేట్ దగ్గర అగర్వాల్ గారు ఎదురు చూస్తున్నారు. "మీరు వస్తున్నారని బాబాజీ నాకు వార్త పంపేరు" అని అతనన్నాడు. గ్రేటర్ కైలాస్‌లో ఉన్న అతని ఇంటికి నన్ను కార్లో తీసుకొని వెళ్ళాడు. మర్నాడు పొద్దున్న నాకు అతను తాలవ్యక్రియను నేర్పాడు. సాయంత్రానికి దర్జీ రెండు జతల పాంట్లూ చొక్కాలూ పట్టుకొని వచ్చి నాకిచ్చాడు. "ఇవి బాబాజీ సూచనలు. మీరు వేసుకున్న బ్రహ్మచారి బట్టలు విడిచిపెట్టి, వీటిని వేసుకోవాలి. మీకోసం చెప్పుల జత, ఒక సంచీ కూడా నా దగ్గర ఉన్నాయి" అని అగర్వాల్ గారన్నారు.

మూడోరోజున మద్రాస్‌కు పోయే రైల్లో వెళ్ళడానికి స్లీపర్ టికెట్ ఒకటి నా చేతికిచ్చి, మరికొంత డబ్బును కూడా సమకూర్చారు. "మద్రాసు చేరుకున్న తరవాత, త్రివేంద్రానికి టికెట్టు కొనుక్కోండి. బాబాజీ చెప్పినది గుర్తుంచుకోండి. పూర్తిగా సాధారణంగానే పని చెయ్యండి. మీ ఆధ్యాత్మికమైన మొగ్గదలలన్నిటినీ పైకి కనిపించనీయకుండా చుట్టబెట్టి దాచుకోవాలి; ఆధ్యాత్మిక అభ్యాసాలను రహస్యంగా ఉంచాలి".

మద్రాస్ మెయిల్‌లో నన్నెక్కించి వీడ్కోలు చెప్తూ అగర్వాల్ గారు "శ్రీ గురూజీ కీ జై" అని నెమ్మదిగా అన్నారు.

# 35. లక్ష్య సిద్ధి కోసం సన్నాహాలు

సాయంత్రానికి రైలు త్రివేండ్రం చేరుకుంది. ఎప్పటిలాగే రైల్వేస్టేషన్ నిద్రపోతున్నట్టుగా ఉంది. రైలు దిగి స్టేషన్‌కి అవతల దగ్గరగా ఉన్న క్షౌరశాలకు పోయి, మా నాన్నకు నచ్చే రీతిలో 'చక్కటి కత్తిరింపు' చేయించుకున్నాను. భుజాల దాకా పొడుగ్గా ఉన్న నా జుట్టు రింగుల్ని మంగలి కత్తిరించాడు; గెడ్డాలు మీసాలూ పూర్తిగా తీసేశాడు. అప్పటికే చీకటి పడింది కనక, రోడ్డు మీద తెలిసినవాళ్ళు కనిపించినా నా గైర్‌హాజరీ గురించి వివరించుకోవాల్సిన ఇబ్బంది నాకు తప్పింది. నేను నడవడానికే నిశ్చయించుకున్నాను. నలభై ఐదు నిముషాల్లోపునే నేను ఇంటికి చేరాను. మా తల్లిదండ్రులు ఇల్లు మార్చి ఉండరని ఆశించాను.

జాగ్రత్తగా తలుపు తెరిచి తోటలోపలికి ప్రవేశించాను. అంతా ఇంతకు ముందులాగే ఉంది. అందరూ విశ్రాంతిగా కూర్చునే గదిలోకి వెళ్ళాను. నేను చూసిన మొదటి మనిషి మా నాన్న. ఆయన తనకు ఇష్టమైన చేతులున్న కుర్చీలో కూర్చొని పాల్ బ్రన్టన్ రాసిన 'సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా' (Search in Secret India) చదువుతున్నారు. నేను లోపలికి రావడం చూడగానే ఆయన పుస్తకం కింద పెట్టి నావైపు చూశాడు. ఆయన ఆశ్చర్యం వేసేటంత శాంతంగానూ నిమ్మళంగానూ ఉన్నారు. 'నువ్వెక్కడున్నావు? నువ్వే దుర్ఘటనలోనో మరో విధంగానో చచ్చిపోయావనుకుంటున్నాం మేము. ఈసారి నువ్వు ఎక్కడున్నా సరే మాతో సంపర్కంలో ఉండు. ఇప్పుడు వెళ్ళి మీ అమ్మను చూడు", అని ఆయన అన్నాడు.

నేను భోజనాలు చేసే చోటుకి లోపలికి వెళ్ళి, అక్కణ్ణించి వంటింట్లోకి వెళ్ళాను. మా అమ్మ మామూలుగానే, వండుతోంది. నన్ను చూడగానే ఆవిడ చేతిలోని పెద్ద గరిటె (Ladle) జారిపోయింది. నన్ను కావలించుకొని అదుపూ ఆపూ లేకుండా ఏడ్వడం ప్రారంభించింది. "మమ్మల్ని ఇక్కడ వదిలేసి నువ్వు ఎక్కడకు పోయావు? ఒక ఉత్తరమ్మునైనా ఎందుకు రాయలేదు? నీ చెల్లెళ్ళు ఎంతో బాధపడుతున్నారు" అంది ఆవిడ.

"ఒక విశిష్టమైన ఉద్దేశంతో నేను హిమాలయాల్లో ఉన్నాను. ఇంతకన్నా ఎక్కువగా ఏమీ చెప్పలేను. కానీ నేను మంచిపనిలోనే నిమగ్నమై ఉన్నాను చెడ్డ పనిలో కాదు. నువ్వు ధీమాగా ఉండు" అని నేనన్నాను.

"మళ్ళీసారి నువ్వు వెళ్దామనుకున్నప్పుడు, ఎక్కడున్నావో మాకు చెప్పు. మేము నిన్ను ఆపం. ఇప్పుడు వెళ్ళి నీ చెల్లెళ్ళను చూడు" అని మా అమ్మ అంది. నేను వాళ్ళ

గదిలోకి వెళ్ళాను. వాళ్ళు ఒక్కసారిగా అవాక్కయ్యారు. నా చిన్న చెల్లెలు నాకన్నా పధ్నాలుగేళ్ళు చిన్నది. అది నా దగ్గరకు 'దాదా, దాదా' అని పరిగెత్తుకుంటూ వచ్చింది.

అదొక ఉద్వేగపూరితమైన పునస్సమాగమం. రాత్రి భోజనానికి మా అమ్మ నాకిష్టమైన గుడ్డు కూరా, అన్నమూ వండింది.

ఇప్పుడు, ఈ అరవై ఏళ్ళప్పుడు, నేను చెప్పబోతూన్న అప్పటి సంగతులు ఎప్పుడు జరిగాయన్న విషయమై కచ్చితంగా ఫలానా తేదీ నాడని చెప్పలేకుండా ఉన్నాను. ఇప్పుడు అమెరికాలో మిచిగన్ కీనీలా కౌన్టీలో, లేక్ సుపీరియర్ దగ్గరున్న కాపర్ హార్బర్‌లోని అందమైన లేక్ ఫేనీ హోను పర్యవేక్షిస్తూన్న ఒక కొయ్య గదిలో కూర్చొని ఉన్న నేను, ఆ సంగతుల విషయమై సామాన్య కాలక్రమ పరంపరకు మాత్రమే అంటుకొని ఉండడానికి ప్రయత్నిస్తాను.

నేను త్రివేంద్రానికి తిరిగి వచ్చిన మొదటి సంవత్సరంలో, కన్యాకుమారిలో ఉండే మాయీ మా అనే నగ్న స్త్రీ సన్యాసిని రెండుసార్లు చూశాను. ఆవిడ నన్ను రెండోసారి వెళ్ళినప్పుడు కౌగిలించుకుంది. కన్యాకుమారికి వెళ్ళే దోవలో శుచీంద్రం దగ్గరున్న మరుత్వమలై కొండలకు వెళ్ళి అక్కడి గుహలో కొంతసేపు గడిపాను. మరుత్వమలై అంటే నాకెంత ప్రేమ కలిగిందంటే ఆ తరవాత వరసగా చాలా వారాంతాలు అక్కడికి వెళ్ళడం జరిగింది. కొన్నిసార్లు నా సన్నిహిత మిత్రులు నాతోబాటు వచ్చారు. రంజిత్ రెండుసార్లు వచ్చాడు; థామా ఛెన్ అని నేను ప్రేమగా పిలిచే మిత్రుడు థామస్ కురియన్ ఒకసారి వచ్చాడు; తమిళ సోదరుల్లో ఒకడైన శివానందుడు కూడా ఒకసారి వచ్చాడు.

ఒకసారి, ఏకాంతంగా ఆ గుహలో రెండు రాత్రులు గడిపాను. రెండో రోజు రాత్రి ఎవరో 'నాయినా, నాయినా' అన్నట్టనిపించిన శబ్దాలను గట్టిగా ఉచ్చరిస్తూ నా ధ్యానాన్ని భంగపరచారు. కళ్ళు తెరిచి చూస్తే నా దగ్గరగా ఒకతను నిలుచొని 'నాయినా, నాయినా' అని అరుస్తున్నాడు. అతను సన్నగా పొట్టిగా ఉన్నాడు. ఉబికినట్టు కళ్ళున్న అతను, చిరిగిన పాత ఖాకీ నిక్కరు వేసుకొని ఉన్నాడు. నేను కళ్ళు తెరిచి చూడగానే అతను చాలా ఉత్తేజితుడై తమిళంలో "నేను తిరుమూలార్ తత్వమైన శివరాజయోగాన్ని నేర్పడానికి వచ్చాను. మెదడులో మరో ఏడు కేంద్రాలున్నాయి. ఇది శ్రీగురువు ఆజ్ఞ. ఇప్పుడు నువ్వు నేర్చుకో" అని అన్నాడు.

నేను లేచి ఆయనకు నా ప్రణామాలు అర్పించాను. ఆయన కూర్చున్నారు. నన్ను ఆయన ఎదురుగా కూర్చోమని సైగ చేశారు. గుహాద్వారం నుంచి పూర్ణచంద్రుని

చల్లని కాంతి లోపలికి వస్తూండగా, ఆయన సరళమైన భాషలో శివరాజయోగం తాలూకు ముఖ్యమైన విషయాలను నాకు నేర్పారు. తరవాత ఆయన నేర్పిన అభ్యాసాలను నన్ను చెయ్యమన్నారు. ఆయన తృప్తి చెందినట్టున్నారేమో, ఆనందంతో చప్పట్లు కొడుతూ ఒక గెంతు గెంతి చీకట్లోకి పరిగెత్తుకొని వెళ్ళిపోయారు. చాలా ఏళ్ళ తరవాత, మిత్రుడు మదన్ గోపాల్‌తో మరుత్వమలై వెళ్ళినప్పుడు మళ్ళీ ఆయన్ను కలవడం జరిగింది. ఆయనేదో అర్థం కాని పైశాచికపు కూతలు కూస్తున్నాడని మా మిత్రుడను కున్నాడు కానీ, నేను ఆయనేదో ముఖ్యమైన విషయాన్ని చెప్పడానికి చూస్తున్నారని అర్థం చేసుకున్నాను.

స్వామీ అభేదానందను కూడా రెండుసార్లు కలుసుకోడం జరిగింది. పూంతురాలో ఒక నకిలీ సన్యాసిని కలుసుకున్నాను. చనిపోయిన అప్పటి పూంతురా స్వామికి తాను వారసుణ్ణని అతను చెప్పుకుంటున్నాడు. త్రివేండ్రంలో గీతోపన్యాసా లిస్తూన్న స్వామీ చిన్మయానందను కలుసుకున్నాను.

త్రివేండ్రం సార్వజనిక గ్రంథాలయమూ, బ్రిటిష్ కౌన్సిల్ గ్రంథాలయమూ, అమెరికన్ గ్రంథాలయమూ నేను తరచుగా చేరే ఇష్టమైన చోట్లు. బాబాజీ నన్ను చదవమని చెప్పిన జాబితాలోని తత్త్వశాస్త్ర గ్రంథాలనూ, మనోవైజ్ఞానిక శాస్త్ర గ్రంథాలనూ, శరీర ధర్మశాస్త్ర గ్రంథాల నన్నిటినీ చదివాను. ఆయన చెప్పని మరికొన్నిటిని కూడా చదివాను – పీజీ వుడ్‌హౌస్ నవలలూ (అవి ఇప్పటికీ నేను నిద్రపోయే ముందు ఇష్టంగా చదువుకొనేవి), కోనన్ డాయిల్, డికెన్స్, జేమ్స్ జాయిస్ మొదలైనవాళ్ళ నవలలూను. బాబాజీ జాబితాలోని పుస్తకాల్లో నాకు బాగా ఇష్టమైనవి బ్లావట్స్కీ రాసినవీ. జె.కృష్ణమూర్తివీను. జె. కృష్ణమూర్తి గారి 'కామెంటరీస్ ఆన్ లివింగ్' అనే పుస్తకం నాకు ఎప్పటికీ ఇష్టమైనదే. దాన్ని నే చదివిన ప్రతీసారీ, నాకేదో కొత్తది దొరుకుతూనే ఉంటుంది.

కొత్త స్నేహాలను కూడా పెంపొందించుకున్నాను. ప్రేమ్ కూ కిల్లయ్య, గోవిందన్ నాయిర్ లాటి కొంతమంది మిత్రులు విఖ్యాత కుటుంబాల నుంచి వచ్చిన వాళ్ళు; మరి కొంతమంది మిత్రులు పూర్తిగా సామాన్య పరిస్థితుల వాళ్ళు. కానీ నాకు మాత్రం అందరూ సమానమే.

రెండో కోవలోని వాళ్ళలో కొంతమంది ప్రకటిత దోషులు కూడా ఉన్నారు. వాళ్ళతో స్నేహంగా ఉండడమంటే, అప్పుడప్పుడు ముఠా యుద్ధాల్లో దిగబడడంతోనో, లేకపోతే తాగుడు మైకాల్లో పడడంతోనో దుఃఖాలను తలకెత్తుకోవడమే. కానీ దానిని

నేను లక్ష్య పెట్టలేదు. మార్పు బీజాలను నాటుదామని నా కోరిక; బహుశా అవి వచ్చే జన్మల్లో పరిపక్వం కావచ్చు. బాబాజీ నా కళ్ళు తెరిచారు. దురాచారులైన నేరగాళ్ళలో కూడా నేను అవ్యక్త మహాత్ముల్ని చూశాను. బాబాజీ ఎప్పుడూ అంటూ ఉండేవారు: "రోగిష్ఠులకే డాక్టరు అవసరం" అని.

మిగతా సమయాల్లో, మా నాన్న చేపట్టిన రోడ్డు నిర్మాణ పనుల్లో పర్యవేక్షణ చేస్తూ ఆయనకు సాయపడేవాణ్ణి. దినాంత సమయాల్లో ఒంటరిగా చాలా దూరాలు నడుస్తూ ఉండేవాణ్ణి. దేవాలయాలూ మసీదులూ చర్చిలూ దర్శించాను; ఎప్పుడూ ప్రచురితం కాని పద్యాలు రాశాను; వార్తాపత్రికలకు వ్యాసాలు రాయడానికూడా ప్రయత్నించాను. బాబాజీ నుంచి ఏ సంపర్క చిహ్నమూ లేకుండా ఒక ఏడాది ఆ విధంగా గడిచిపోయింది. ఆయన నాకు స్వతంత్రంగా బతకడం నేర్పుతున్నారని అనుకున్నాను.

ఒక రాత్రి నిద్రపోవడానికి ముందుగా ఆయన నేర్పిన ప్రక్రియనే ఉపయోగిస్తూ ఆయనకు ఒక సందేశం పంపాను. "మీరు నన్ను త్వరలో కలుసుకోకపోతే నేనే తిరిగి మిమ్మల్నివెదుక్కుంటూ హిమాలయాలకు వస్తాను. ప్రణామాలు" అని. ఆ రోజు రాత్రి బాబాజీ కలలో కనిపించారు. ఆకుపచ్చ నిలువుటంగీనీ తెల్ల తలపాగానూ ధరించి ఉన్న ఆయనను చూడడంతో నాకు ఆశ్చర్యమేసింది: "అజ్మీరుకు రా. నీ కోసం అక్కడ ఎదురు చూస్తూ ఉంటాను" అని అన్నారు.

# 36. ఒక సూఫీ గురువు దగ్గర నేర్చిన పాఠాలు

నేను అజ్మీరుకు వెళ్ళదలచుకున్నానని అమ్మానాన్నలకు చెప్పినపుడు వాళ్ళ వైపు నుంచి నాకు పెద్ద అభ్యంతరమేమీ కనిపించలేదు. మా అమ్మ దగ్గర నుంచి కొన్ని పైసలు కూడా దొరికాయి. వాటికి, ఖర్చుల నిమిత్తం అప్పుడప్పుడు నాకిచ్చిన డబ్బులు కలుపుకుంటే ఆ ప్రయాణానికి చాలినంత డబ్బు సమకూరింది. ఆ రోజుల్లో ఆ ప్రయాణం చాలా దీర్ఘమైనదే. నేను మద్రాసు వెళ్ళాలి (ముందర) తర్వాత ఢిల్లీ, అక్కణ్ణించి జైపూరుకు; చివరకు స్థానిక రైలునెక్కి అజ్మీరుకు వెళ్ళాలి. అజ్మీర్ షరీఫ్ భవన సముదాయానికిచేరుకున్నాను. అక్కడ ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీ అనే గొప్ప సూఫీ మహాత్ముడి సమాధి ఉంది. ముస్లింలూ, ముస్లింలు కానివాళ్ళూ ఆయనను పూజించేవారు. ప్రణామాలను అర్పించడానికీ, మధ్యవర్తిత్వాన్ని యాచించడానికీ అక్కడకు సందర్శకులూ భక్తులూ ఒక నిశ్చల ప్రవాహంగా వచ్చి బారులు కట్టేవాళ్ళు.

చాలా తీర్థయాత్రా కేంద్రాల్లాగానే అజ్మీరు కూడా నమ్మకం పేరుతో కుటిలంగా డోల్లా కొట్టించే ధూర్తుల ఉనికి విషయంలో ఏ రకంగానూ తీసిపోదు. కొంత రుసుము తీసుకొని విశిష్టమైన అనుగ్రహం కోసం ఆ మహాత్ముడి దౌత్యాన్ని వాగ్దానం చేస్తూ ఆ మోసగాళ్ళు అన్నివైపుల నుంచీ పట్టుకొని గుంజుతూ ఉంటారు. వాళ్ళలో చాలామంది తాము ఆ మహాత్ముడి ప్రత్యక్ష వంశీయులమని చెప్పుకుంటారు. వారి ప్రాముఖ్యాన్ని ప్రకటించుకోడానికి ప్రత్యేకమైన చిత్రవిచిత్ర అంగీలను ధరిస్తారువాళ్ళు.

పువ్వులూ శాలువలూ ధూపద్రవ్యాలూ సమాధి దగ్గర ఇవ్వదగిన ఇతర నివేదనీయ వస్తువులనూ అమ్మే షాపులూ అక్కడ చాలానే ఉన్నాయి. అది వారాంతం. ఉప్పొంగుతూన్నట్టున్న జన సమూహాల మధ్య నేను నాకు పరిచితమైన చిన్న కౌపీనం తప్పించి ఇంకేమీ ఉండని శరీరంతోనూ, జెడలు కట్టిన జుట్టుతోనూ ఉన్న ఒక రూపం కోసం చూస్తున్నాను. ఈ పొడుగుపాటి అంగీలూ, తలపాగాలూ పెట్టుకున్న ముస్లిమ్ ఫకీర్లతో పోల్చి చూస్తే ఆయన ఎంత వింతగానూ తగనట్టుగానూ ఉంటారో కదా అని అనిపించింది నాకు.

ప్రాకారానికి కుడివైపున ఒక పాత మసీదు ఉంది. ప్రాచీన చరిత్ర ప్రకారం అది ఆ మహాత్ముడు ఉపయోగించిన మసీదు. సమాధి ఉన్నగృహానికి దాపులోనే ఉంది అది. నేను ఆ దిక్కులోకి మళ్ళీ, మసీదులోకి వెళ్ళాను.

ఇంకా అప్పుడే ప్రార్థనా సమయం కాలేదు. బహుకొద్ది జనం జపమాలను లెక్కిస్తూనో, ఖురాన్ చదువుతూనో, నిశ్శబ్దంగా ధ్యానం చేస్తూనో లోపల కూర్చొని ఉన్నారు. నిలువుటంగీలు వేసుకొని తలపాగాలు చుట్టి ముస్లింలు అభ్యసించే ప్రార్థనా

రీతిలో, అంటే యోగులపరంగా వజ్రాసనంలో, కూర్చొని ఉన్నవాళ్ళలో ఒకాయన (మన) బాబాజీయే అనేసరికి నా ఆశ్చర్యాన్ని మీరూ ఊహించగలరు.

అచ్చంగా అచ్చూ మచ్చూ నాకు కలలో కనిపించినట్టుగానే ఆయన పొడుగాటి ఆకుపచ్చ అంగీ, తెల్లటి తలపాగా ధరించిఉన్నారు.

ఆయన నన్ను చేరువకు రమ్మనమని చేతితో సైగ చేశారు. నేను సాగిలపడి నమస్కరించే లోపులోనే ఆయన లేచి నిల్చొని, నన్ను తనవైపుకు గుంజుకొని ఫక్తు ముస్లిం రీతిలో మూడుసార్లు కౌగిలించుకున్నారు. కావలించుకుంటూ ఆయన "సాష్టాంగ ప్రణామాలు వద్దు. ముస్లిం శాసనం తెలియదా నీకు? ఒక్క పరమాత్మకే మనం సాగిలపడాలి. మహమ్మదు ప్రవక్తకు కూడా (సాగిలపడడం) కుదరదు. ఎవరినీ బాధపెట్టనంతవరకూ, పరిస్థితులకు సరిపోయేలాగ నిన్ను నువ్వు మలచుకోవాలి. ప్రతివాడూ తన సామర్థ్యానికి సరిపోయేలాగ, ప్రతివాడూ తన అవసరాలకు తగినట్టుగా అనేది మంచి సూఫీ సూక్తి, రోములో ఉన్నప్పుడు రోమన్లలాగే మసులుకోవాలి" అని గుసగుసలాడుతూ చెప్పారు.

అప్పుడు నేనాయన చేతులను పట్టుకొని వేళ్ళను చుంబించాను. "నా పక్కన వజ్రాసనంలో కూర్చో. సమాధి వైపు తిరుగు. మౌనంగా ధ్యానంలో కూర్చో" అని బాబాజీ చెప్పారు. నా హృదయం ఒక ఆనంద సంవేదనతో నిండిపోయింది. అది నా శిరస్సుకి ప్రయాణించింది. రమణీయమైన ఆకుపచ్చటి కాంతులూ ఊదారంగు కాంతులూ నా తల లోపల దర్శనమిచ్చాయి. బయటి ప్రపంచపు హడావుడినుంచి విడివడి ఆ ఆనందపూర్ణ స్థితిలో ఎప్పటికీ ఉండిపోదామనుకున్నాను, కానీ బాబాజీ నన్ను నా పరవశత్వం నుంచి ఇవతలికి గుంజేశారు. "పద, మనం వెళ్దాం" అని నన్ను ఆ భవన సముదాయంలో, ఆయన మార్గదర్శకత్వం చేస్తూ పర్యటింపజేశారు.

మొదట మేము సమాధిని చూశాం. రద్దీ చాలా భారీగా ఉన్నా, అక్కడి సంరక్షకులు బాబాజీ ముఖాన్ని చూసి మమ్మల్ని చాలా గౌరవంగా లోపలికి రమ్మన్నారు. లోపలి భాగం చాలా అందంగా ఉంది. భక్తి భావం సమాధి గృహమంతటా వ్యాప్తమై ఉందని వ్యక్తమౌతోంది. సమాధిని ఎరుపూ, ఆకుపచ్చ ముఖ్మల్ గుడ్డలతో చుట్టబెట్టారు. ఉవ్వెత్తుగా జనంవస్తూన్నా, ప్రధాన ఖాది మమ్మల్ని చాలాసేపే ఒక మూల నిలుచో నిచ్చాడు. ప్రతివాడూ ప్రార్థిస్తూ అరబిక్‌లో గానంచేస్తున్నాడు. నా వెంట్రుకలు నిక్క బొడిచాయి; కన్నీళ్ళు నా ముఖం మీదుగా జాలువారాయి. అదృశ్యంగా ఉన్న ఎవరితోనో బాబాజీ గుసగుసల సంవాదం చేస్తూన్నట్టుగా అనిపించింది. కొంతసేపైన తరవాత,

ఆయన వంగి నమస్కరించి, ఇక వెళ్ళవలసిన సమయమైందని నాకు సైగ చేశారు. ప్రధాన ఖాదిం బాబాజీ చేతుల్ని ముద్దిడిన తరవాత మాకు బయటకు దోవ చూపించాడు.

మేము సమాధి చుట్టూ ప్రదక్షిణం చేసి ఆ భవన సముదాయం నుంచి బయటకు వచ్చాం. ఒక పది నిముషాల నడక మమ్మల్ని ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీ నలభై రోజులు ఏకాంతంగా కూర్చున్న చోటు 'ఉస్మానీ చిల్లా'కు తీసుకు వచ్చింది. మండల దినాల పాటు ఏకాంతంలో చేసే ఇటువంటి తీవ్ర ధ్యానాన్ని సూఫీ పదజాలంలో 'చిల్లా' అని అంటారు. అదొక ప్రశాంత నిశ్శబ్ద స్థలం. అది ఒక సరస్సు నిరీక్షణలో ఉంది. అన్యథా శుష్కంగా ఉండే రాజస్థాన్ రాష్ట్రంలో అది నిజంగా చాలా శోభస్కరమైన దృశ్యమే. అక్కడ బాబాజీ నాకు ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీ జీవితం గురించీ, ఆయన సంస్థాపించిన శ్రేణి గురించీ, ఆయన బోధనల గురించీ సంక్షిప్తంగా చెప్పారు.

అస్ఫహాన్ చేరువలో ఉన్న సంజర్‌లో 1135లో పుట్టిన ఆయనకు మొయినుద్దీన్ హసన్ అని పేరు పెట్టేరు. ఆయన తండ్రిగారి పేరు ఘయాసుద్దీన్ హసన్. ఖొరస్సన్ లోని సూఫీ సముదాయానికి చెందినవాడు ఆ తండ్రిగారు. ఆయన తల్లి బీబీ మాహ్‌నూర్. ఆవిడ ఖాద్రియా అని వ్యవహృతమయ్యే సూఫీ శ్రేణిని స్థాపించిన జిలాన్ వాస్తవ్యుడు షేక్ మొహి ఉద్దీన్ అబ్దుల్ ఖాద్రి అనే గొప్ప సూఫీ మాస్టారు వంశానికి చెందినది. పదిహేనేళ్ళప్పుడే ఆయన(చిస్తీ) అనాథుడయ్యాడు. ఆ తరవాత కొద్ది సమయంలోనే వాళ్ళ తోటలో ఇబ్రహీమ్ ఖందూజీ అనే సూఫీ గురువును కలుసుకున్నారు. ఈ యువకుణ్ణించి ఒక ద్రాక్షపళ్ళ గుత్తిని స్వీకిరంచి, ఇబ్రహీం ఖందూజీ అతనికి తానప్పటికి కొంచెంసేపు చప్పరించిన ఒక మిఠాయి ముక్కను ఇచ్చారు. అది తినగానే, అతను హఠాత్తుగా ప్రపంచమంటేనూ దాని పద్ధతులంటేనూ విసుగువేసి వైరాగ్యంతో దానికి మించిన యథార్థాన్ని వెదకడం ప్రారంభించాడు.

అప్పుడు ఇల్లు వదిలి సూఫీ ప్రభావమూ, ఇస్లామ్ విద్వత్తుకీ కేంద్రాలైన బాగ్దాద్, సమర్‌ఖండ్, బుఖారాల్లోనూ బాగా విస్తృతంగా పర్యటించాడాయన. బాగ్దాద్‌లో ఆయన మహా సూఫీ బోధకుడైన అబ్దుల్ ఖాదిర్ జిలానీని కలుసుకున్నారని చెబుతారు. ఆ తరవాత మక్కా మదీనాలకు వెళ్ళారు. అక్కణ్ణించి వచ్చిన తరవాత ఇరాన్‌లోని హరూన్‌కి వెళ్ళారు. అక్కడ సాక్షాత్తూ ఆయన కోసమే ఎదురు చూస్తూన్న ఆయన గురువును కలుసుకున్నారు.

సిరియా వారైన ఖ్వాజా అబూ ఇషక్ స్థాపించిన చిస్తీ శ్రేణికి చెందిన బోధకులు హరూన్‌కి వెళ్ళారు. అక్కడ సాక్షాత్తూ ఆయన కోసమే ఎదురు చూస్తూన్న ఆయన గురువును కలుసుకున్నారు.

సిరియా వారైన ఖ్వాజా అబూ ఇషక్ స్థాపించిన చిస్తీ శ్రేణికి చెందిన బోధకులు హరూన్ వాస్తవ్యులైన ఖ్వాజా ఉస్మాన్ గారు. అంచేతనే (మన మొయినుద్దీన్ గారు) ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీ అయ్యారు తప్ప, కొంతమంది అనుకునే విధంగా, ఆయన చిస్తీ శ్రేణిని స్థాపించిన వారు కాదు.

తన గురువు సాహచర్యంలో మూడేళ్ళు తీవ్రమైన తపస్సులు చేసిన తరవాత, మొయినుద్దీన్ చిస్తీ తిరిగి బాగా ప్రయాణం చేశారు. ఆ ప్రయాణాల్లో మహాత్ముల్నీ ముస్లిం యోగుల్నీ (దర్వీషలను) కలుసుకున్నారు. వాళ్ళలో సుహర్‌వాదీ శ్రేణికి చెందిన మహానుభావుడు షేక్ అబూ నజీబ్ సుహర్వాదీ కూడా ఉన్నారు. చాలామంది సూఫీ మహాత్ముల సమాధులను దర్శించారు ఆయన. తాబ్రీజ్‌కు చెందిన అబూ సయ్యద్, అస్త్రాబాదుకు చెందిన నసీరుద్దీన్, హసన్ ఖిర్కానీ మొదలైన చాలామంది సజీవ సమకాలీన మహాకోవిదులైన సూఫీలను కూడా కలుసుకున్నారు. ఈ సమావేశాల గురించి చాలా ఆకర్షణీయమైన కథలు చెబుతారు.

ఆయనకు ఏభై నాలుగేళ్ళప్పుడు ఆయన గురువు షేక్ ఉస్మాన్ హరూన్ ఆయనను తన వారసుడిగా ప్రకటించారు; ఆయనకు తాను ప్రార్థన చేసుకొనే రగ్గునీ, చేతికర్రనూ ఇచ్చారు. ఆయనను బయటకు పోయి తన పనిని చేయమని పురమాయించారు. ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీ ఆ తరువాత హజ్ యాత్రకు వెళ్ళి కాబాకు ప్రదక్షిణం చేసి, మహమ్మద్ ప్రవక్త సమాధి ఉన్న మదీనా చేరుకున్నారు. ఆయనకు ఒక ప్రస్ఫుటమైన దర్శనంలో ఇండియాలోని అజ్మీర్‌కివెళ్ళి స్థిరపడమన్న ఆదేశం వచ్చిందని చెబుతారు.

ఆయన 1191లో మొదటిసారిగా అజ్మీరు చేరుకున్నారు. తరవాత 1200లో బాల్క్‌కూ బాగ్దాదుకూ ప్రయాణం చేశారు. కొంత సమయమైన పిదప ముల్తాన్, ఢిల్లీల మీదుగా అజ్మీరుకు తిరిగి వచ్చారు. ఖొరస్సన్ నుంచి వచ్చిన కుతుబ్‌షా అనే సూఫీ మహాత్ముణ్ణి ఢిల్లీలో దర్శించారు. ఆయన (కుతుబ్ షా) ఈయన శిష్యుడయ్యారు. తర్వాత మహాతపస్వి అయిన బాబా ఫరీద్ గంజ్-ఏ-షకర్ కూడా ఆయన శిష్యుడయ్యారు. ఢిల్లీకి చెందిన ప్రసిద్ధ సూఫీ మహాత్ముడు హజ్రత్ నిజాముద్దీన్ ఔలియా ఈ గంజ్-ఏ-షకర్ వారసత్వ రేఖకు చెందినవారే.

ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీ గారి జీవితావసాన సంవత్సరంలో అజ్మీర్‌లో ఆయన దగ్గర ఖొరస్సన్‌కు చెందిన కుతుబ్ షా ఉన్నారు. ఒక రోజున, ఆయన (ఖ్వాజా) తన అంగీనీ, తలపాగానూ, తన గురువు ఖ్వాజా ఉస్మాన్ హరూనీ గారి దివ్య

సార్వభౌమత్వాన్నీ అతనికి (కుతుబ్ షాకి) ఇచ్చి, మరికొన్ని రోజుల్లో తాను లోకాన్ని విడిచిపోతున్నానని చెప్పారు. తర్వాత ఢిల్లీకి వెళ్ళి అక్కడ స్థిరపడమని చెప్పారు. ఆయన కుతుబ్‌షాకి చెప్పిన చివరి మాటలివి: "ఎక్కడికి వెళ్ళినా వెళ్ళు; (కాని) పరిపూర్ణ మానవుడిగా జీవించు" అని.

కుతుబ్ షాను ఢిల్లీకి పంపేసిన ఇరవై రోజుల తరవాత, 1229 మే నెలలో ఒక రోజున ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీ తన రాత్రి ప్రార్థనలను చేసిన తరవాత పడక గదిలోకి వెళ్తూ తనను పొద్దున్న వరకూ ఎవరూ కలత పెట్టవద్దని ఆదేశించారు. రాత్రి పొడుగునా ఆ గది నుంచి మృదువుగా వాయించే సారంగిలాంటి నాదాన్ని తలపించే ఒక సంగీత ధ్వని వినిపిస్తూనే ఉందని చెబుతారు. పొద్దున్న ఆయన ప్రాతఃప్రార్థనలకు రాలేదేమిటా అని ఆ గది తలుపును తెరిచినపుడు, ముఖంమీద పరవశస్మితంతో ఆయన తన పక్కమీద చనిపోయి ఉండడాన్ని, వాళ్ళు చూశారు.

ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీ చాలా గ్రంథాలు రాశారని బాబాజీ చెప్పారు. లభ్యమైనవి ఇవి: అనీస్-ఉల్-అర్వాహ్, హదీస్-ఉల్-మారిఫ్, కన్జుల్ ఇస్రార్, కష్ఫుల్ ఇస్రార్.

ఇండియాలో సూఫీ భక్తితరంగంగా చెప్పదగిన సూఫీపంథా తాలూకు భక్తి మార్గానికి ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీ అగ్రగామి. ఏ సంగీత వాయిద్యాలూ లేకుండా ఖురాన్‌ను పాడడం తప్పించి ఇంకే రకమైన సంగీతాన్నైనా సాంప్రదాయిక ఇస్లాం నిషేధించింది. సూఫీల్లోని చిస్తీవర్గీయులు మాత్రం సంగీతాన్ని ఉపయోగిస్తారు. సంగీత వాయిద్యాలను వాయించడమూ, పాడడమూ అనేవి ఆధ్యాత్మికాభ్యాసంలోని ఒక పెద్ద అంశంగా వాళ్ళు భావిస్తారు. ఆ విధంగా ఉపయోగించే సంగీతాన్ని "సామ" అని అంటారు. అది సరిగ్గా జరిగినప్పుడు పాడేవాడినీ వినేవాడినీ ఇద్దరినీ అది పారవశ్యస్థితుల్లో ముంచుతుంది. ఆ స్థితులు చైతన్యం పెంపొందడానికి పనికివస్తాయి.

చిస్తీ శ్రేణి ప్రధానంగా సర్వత్యాగాత్మకమైన ప్రేమభావం మీద ఆధారపడింది. పరమాత్మ మేలిముసుగులో ఉన్న ప్రియతముడు; ఆ ప్రియతముడి మధురవదనం తాలూకు క్షణిక దర్శనం కోసం ఆత్రపడే ఆత్మతో ఉన్న ప్రియుడు గాయకుడు. సూఫీ తలమునకలుగా ప్రేమలో పడ్డవాడు. అతను కైపు పుట్టించే ఇష్క్ అనబడే ప్రేమ మదిరను తాగి తన పరిమితవ్యక్తిత్వాన్ని వదిలిపెట్టి తన ప్రియతముడి కళ్ళలోకి చూస్తూ, అతనికౌగిలిలో ఏకాంతంగా ఒక్క క్షణం ఉందామన్న తీరని కోరికతో చిక్కిపోతూ ఉంటాడు. శాశ్వతమైన దివ్యాత్మ ప్రేమలో తన అస్తిత్వాన్ని రూపుమాపుకోవడాన్ని 'ఫనా' అని అంటారు.

కవ్వాలీ పాటగాళ్ళూ గజల్ గాయకులూ చిస్తీ శ్రేణి, ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీకి బాగా ఋణపడి ఉన్నారు. ఇండియాలోని సూఫీ పుణ్యసమాధి గృహాల్లో, ముఖ్యంగా అజ్మీరులోనూ ఢిల్లీలోని నిజాముద్దీన్‌లోనూ, రాత్రింబగళ్ళు కొన్ని నిశ్చితమైన సమయాల్లో తబలా, హార్మోనియం వాయిద్యాల వంత సంగీతంతో హృదయాన్ని ద్రవింపజేసే మహా గొప్ప గజళ్ళనూ కవ్వాలీలనూ పాడుతూ ఉంటారు.

సాయంత్రమయింది. సూరీడు అస్తమించబోతుండగా ప్రార్థనా సమయాన్ని గుర్తుకు తెచ్చే పిలుపులు చుట్టుపట్ల ఉన్న ఒక అరడజను మసీదుల నుంచి వినవచ్చాయి. "ఇప్పుడు నిన్ను దగ్గర్లోనే ఉండే ఒక సజీవ సూఫీ-సయ్యద్ గుద్రీషాహ్ సాహెబ్-సమీపానికి తీసుకువెళ్తాను. నీ చిన్నప్పుడు నేర్పిన ముస్లిం ప్రార్థనా భంగిమలు గుర్తున్నాయా నీకు?" అని బాబాజీ అన్నారు.

"లేదండీ బాబాజీ. పూర్తిగా గుర్తు లేవు"

"సరే, ఫరవాలేదులే. ఇతరులేమి చేస్తున్నారో చూసి వాళ్ళని అనుసరించు. గుద్రీషాహ్ సాహెబ్ తన ఇంటిపక్కనే ఉన్న చిన్న మసీదులో జరిగే సాయం సమావేశానికి మనలను రమ్మనమని తప్పకుండా పిలుస్తారు. మనం ఆయనను కలుసుకోగానే సలాం అని చెప్పడమూ ఆయన చేతులను ముద్దెట్టుకోడమూ మరిచిపోకు".

మేము మెట్లు దిగి వరండాకి అడ్డంగా నడిచాం. తెల్లటి లేసు టోపీ పెట్టుకున్న ఒకయువకుడు ద్వారం దగ్గర అభివాదంతో ఆహ్వానించాడు. బాబాజీ మాట్లాడే లోపులోనే బూడిదరంగు గెడ్డంతో తలపాగా చుట్టుకున్న, బాగా వడలిపోయిన ముసలాయన ఒకడు ద్వారంలోంచి బయటకు నడిచివచ్చాడు. బాబాజీని చూడగానే, అతని ముఖం పరవసించిన బోసినవ్వుతో నిండిపోయింది. అతను నిజంగానే బాబాజీ వైపుకు పరిగెత్తి వచ్చి కౌగిలించుకుని ఆయన చేతులను ముద్దుపెట్టుకున్నాడు. బాబాజీ భుజాలను పట్టుకొని కళ్ళ వెంబడి నీళ్ళు కార్చేశాడాయన. చాలా ప్రేమగా ఆయన ముఖాన్ని చూస్తూ "బావాజీ! మీకు అనేక సలాములు. (మీ రాకతో) మాకెంత ఆధిక్యం దక్కింది! అదృష్టవంతుడైన ఈ యువకుడెవరు?" అని ఉర్దూలో అన్నారు.

బాబాజీ నన్ను నా పుట్టుపేరుతోనే పరిచయం చేశారు. "అలాగా!" అని తన విస్తుబాటును వ్యక్తీకరిస్తూ ఆయన "మీరు మాతో ప్రార్థనలో పాల్గొనరా? తరువాత మనం దర్గాకు వెళ్ళి అక్కడి కవ్వాలీ గాయకుల మెహఫిల్‌లో ఆనందిద్దాం. ఆ తరువాత, కొంత మంచి బిర్యానీ తిందాం, లేకపోతే మీరు శాకాహారానికే కట్టుబడి ఉంటారా? సమస్యేమీ లేదనుకోండి. రండి, ప్రార్థనకు వెళ్దాం," అని అన్నాడు.

రివాజుగా చేసే ప్రక్షాళనల తరవాత, మేము ప్రార్థనలకు వెళ్ళాం. అక్కడ చేరినవాళ్ళు తక్కువమందే ఉన్నారు. ఇమాంగా సయ్యద్ గుద్రీషాహ్ చెప్పించిన ఆచార సంబంధిత ప్రార్థనలయిన తరవాత కొంతసేపు మేము మౌనధ్యానంలో గడిపి ఆ మీద ఆయన ముందు నడుస్తూండగా దర్గాకు వెళ్ళాం. దారి పొడుగునా, భవన సముదాయంలోనూ ఎంతోమంది ఆయనకు సలాములర్పించడం చూసి ఆ వాడలో ఆయన లబ్ధప్రతిష్ఠుడని అర్థమయింది నాకు.

భావయుక్తంగానూ శరణాగతితోనూ సమాధి అవతల కూర్చున్న కవ్వాలీ గాయకులు తబలా హార్మోనియాల వాద్య సహకారంతో గానం చేశారు. అవన్నీ మౌలికంగా ప్రేమ పాటలే - సర్వప్రియతముడి కోసం, అతనితో సంయోగించి ఉండడం కోసం, అతను తన ముసుగును తీసి తన సుందర వదనారవిందాన్ని క్షణం సేపైనా దర్శించనిచ్చే అవకాశం లభించడం కోసం పడే గాఢ తపనను వ్యక్తీకరిస్తున్నాయి ఆ పాటలు. ఆ పాటలు నా హృదయాన్ని స్పృశించాయి.

గానసభ కాగానే గుద్రీషాహ్ సాహెబ్ మమ్మల్ని వారింటికి తీసుకొని వెళ్ళారు. అతిథి గదులుగా ఉన్న రెండు గదుల్లో ఒక గదిని మాకిచ్చారు. 'రాత్రి ప్రార్థనలు కాగానే మాతో రాత్రి భోజనాన్ని చేయడానికి రండి" అని చెప్పి ఆ ముసలాయన గదిని వదిలి వెళ్ళారు.

"నువ్విక్కడకు రావడానికి ఒక ఉద్దేశముంది. మూడు వారాల స్వల్ప వ్యవధికి నువ్వు షాహ్ సాహెబ్ విద్యార్థిగా ఉంటావని నేను ఆయనతో చెప్పేను. సూఫీ మార్గంలో నీకు త్వరగానూ జరూరుగానూ శిక్షణనివ్వడానికీ, ఆ అభ్యాసాల్లో నీకు దీక్షనివ్వడానికీ ఆయన ఒప్పుకున్నారు. దాని తరవాత నువ్వు తిరిగి ఇంటికి వెళ్ళిపోవచ్చు. నా మలి పిలుపు ఎప్పుడొస్తుందా అని నువ్వు ఎదురు చూడ్డవు గాని, రేపు నేను మహారాష్ట్ర వెళ్ళిపోవాలి. పూనే దగ్గరున్న ఆలందిలో జీవ సమాధి ఉన్న సంత్ జ్ఞానేశ్వర్ భక్తి పరంపరకు చెందిన నాథయోగుల్లో ఒకరిని నేను అక్కడ కలుసుకోవాల్సి ఉంది. నేను నిన్ను పరిశీలిస్తూనే ఉన్నాను. బాగానే చేస్తున్నావు నువ్వు.కానీ నువ్వు నీ కొత్త మిత్రుల్ని సంరక్షించుకుందామని, ముఠాకుమ్ములాటల్లో దూరవద్దని మాత్రం నేను నీకు సూచిస్తాను" అని బాబాజీ అన్నారు.

రాత్రి ప్రార్థన కాగానే సాక్షాత్తూ షాహ్ సాహెబ్బే మమ్మల్ని రాత్రి భోజనానికి పిలవడానికి వచ్చారు. ఆయనకు ఆరేడుగురు శిష్యులున్నారు. మేము మఠాలు వేసుకొని చాపలమీద కూర్చొని పింగాణీ పళ్ళేల్లో తిన్నాం. ఇద్దరు శిష్యులు వడ్డించారు.

"శాకాహారాన్ని ప్రత్యేకంగా బావాజీ కోసమని వండేరు. యువకుడా! నువ్వూ శాకాహారివే అయితే, నువ్వు కూడా ఆ ప్రత్యేక భోజనాన్ని ఆరగించవచ్చు" అని షాహ్ సాహెబ్ బాబాజీ నన్ను ఆశ్చర్యంలో ముంచేశారు. నావైపు కన్ను కొడుతూ "ఈ యువకుడికి బిర్యానీ అంటే చాలా ఇష్టంగా ఉండేది. కానీ అతను ప్రపంచంలో తన తల్లి చేసిన బిర్యానీయే ఉత్తమమైనదని అనుకుంటాడు" అని అన్నారు.

(ఆ మాటలతో) ప్రతివాడూ నవ్వేడు. మౌనప్రార్థన తరవాత నా జీవితంలో తిన్న శ్రేష్ఠమైన బిర్యానీల్లో ఒకటి తిన్నాను. భోజనం తరవాత నన్ను షాహ్ సాహెబ్ మూడు వారాల పాటు నేను చేరే హల్కా (సమూహం)లోని వాళ్ళకు పరిచయం చేశారు. నన్ను అందరూ కౌగిలించుకొంటూ "అల్లాకు జయం" అని అంటూ స్వాగతించారు.

మర్నాడు పొద్దున్న నన్ను షాహ్ సాహెబ్ దగ్గర వదిలిపెట్టి బాబాజీ వెళ్ళిపోయారు. ఆయనకు వీడ్కోలు చెబుతూండగా నేను అంతగా బాధ పడలేదు. సర్వావస్థల్లోనూ ప్రశాంతంగా ఉండే కళను నేను నేర్వడం ప్రారంభించాను. తరవాతి మూడు వారాల వరకూ నేను షాహ్ సాహెబ్ శిష్యుణ్ణి.

మొదటి కొన్ని రోజులు సూఫీ పంథా తత్త్వాన్నీ, సిద్ధాంతాన్నీ నాకు నేర్పారు. వేర్వేరు సూఫీ వర్గాల్ని గురించి కూడా చెప్పారు. తతిమ్మా సమయమంతా, సూఫీలు అభ్యసించే విధానాలూ ఉపాయాలూ చెప్పారు. మాటవరసకు, ఇస్లాం సంస్థాపకుడు ఇతర విషయాలతో బాటు "మన్ అరఫా నఫ్షూ, ఫా ఖాద్ అరఫా రబ్బూ" అని చెప్పారని నేను నేర్చుకున్నాను. దాన్ని ఈ విధంగా అనువదించ వచ్చు: "తనను తాను తెలుసుకున్నవాడు భగవంతుణ్ణి కూడ తెలుసుకుంటాడు" అని. ఆధ్యాత్మిక హృదయం "ఖల్బ్" అంటే ఏమిటో దాన్ని ఏ విధంగా నాలో మేలుకొల్పుకోవాలో అనే విషయాన్ని నేర్చుకున్నాను. జలాలుద్దీన్ రూమీ ఏర్పరచిన గిరగిరా తిరిగే మెవ్లావీ ఫకీర్ల గురించి నేర్చాను; వాళ్ళు ఎందుకని, దేని కోసమని గిరగిరా తిరిగేవారు అనే విషయాన్ని కూడా తెలుసుకున్నాను. ఆయన రాసిన పద్యగ్రంథం "మస్నవీ"కి టూకీగా ఉపోద్ఘాతాన్ని సమకూర్చారు; అలాగే ఆయన రాసిన 'ఫిహి మా ఫిహి" అనే గద్య గ్రంథానికి కూడా. దీనికి (ఫిహి మా ఫిహి)కి సుమారుగా "అది ఉంది, అయినా అది లేదు" అని అర్థం.

ఖాదిరియా వర్గ సంస్థాపకుడైన అబ్దుల్ ఖాదిర్ జిలానీ ప్రసంగాల గురించీ, ఉమర్‌ఖయ్యాం రుబాయితుల మార్మిక అర్థం గురించీ తెలుసుకున్నాను. చిస్తీ కవ్వాలీ

పాటగాళ్ళ పాటలు విన్నాను; కొద్దిగా పాడటమూ నేర్చుకున్నాను. నక్షాబన్దీ, రిఫాయీ, సుహర్వాదీ వర్గాల తాలూకు మహాబోధకుల గ్రంథాలూ, ముల్లా నసీరుద్దీన్ కథలూ నాలో అద్భుత పరిణామాలను కనబరిచాయి. ఇస్లాం పరిధిలో ఇటువంటివి ఉంటాయని కూడా నేను అంతకు ముందు అనుకోలేదు. అయితే, నాకు అత్యంత ఇష్టమైన గ్రంథం (మాత్రం) ఫరీదుద్దీన్ అత్తార్ రాసిన "మాన్తీక్-ఉత్-తాయిర్" (పక్షుల గోష్ఠి)

నా 'నెఫ్ష్'ని – నన్ను అదుపులో పెట్టే నా వ్యక్తిత్వాన్ని విచ్ఛేదించి నా కళ్ళముందు నగ్నంగా, ఉన్నదున్నట్టుగా అగుపించేంతవరకూ పగటిపూట అధ్యయనం, ధ్యానం, ఉపవాసం అనేమెరుగుబెట్టే విధాన క్రమంలో నన్ను ఉంచారు. నా శిక్షణ కాలం ఆఖరులో, ఇంకా నేను చదవవలసిన పుస్తకాలను నిర్దేశించారు. వాటిలో అలీ హుజ్విరీ విరచించిన ప్రామాణిక గ్రంథం 'కష్ఫ్-ఉల్-మెహ్‌జూబ్' (అవృతుడి ఆవిష్కారం) కూడా ఉంది. అప్పుడు షాహ్ సాహెబ్ నాతో "మీ 'బావా' చాలా మహాత్ముడు. ఆయన ఒక ఔలియా, ఒక పీర్, దైవానుగ్రహం వల్లనే నువ్వు ఆయనను కనుక్కో గలిగావు. నీకు ఇంకేదీ అవసరం లేదు. నీ ప్రయాణం చాలావరకూ అయిపోయినట్టే బిడ్డా! నీ దోవలో నువ్వు నడు. ఎల్లప్పుడూ అల్లా నీతోబాటే ఉండాలి" అని దీవించారు.

గౌరవపురస్కారంగా ఆయనకు నమస్కరించి, కౌగిలించుకొని నేను రైల్వే స్టేషన్‌కి బయల్దేరాను. కొన్ని రోజుల్లో ఇంటికి తిరిగి వచ్చాను.

# 37. రామకృష్ణ మిషన్

అజ్మీర్ నుంచి తిరిగి వచ్చిన మరుసటి సంవత్సరంలో నన్ను ఫార్మసీ విద్యార్థిగా చేర్పించారు. నా దేశదిమ్మరి ప్రవృత్తులను అదుపులో పెట్టాలంటే నన్నేదో, వారి దృష్ట్యా అర్థవంతమైన ఒక వ్యాపృత్తిలో పెట్టాలని మా తల్లిదండ్రులనుకున్నారు ఉత్తర కేరళలోని కేననోర్‌లో మా సన్నిహిత బంధువు భార్య ఒకావిడ డాక్టర్‌గా ఉండేది. ఫార్మసీ డిప్లమా కోసం కాలికట్ వైద్య కళాశాలలో నాకు ప్రవేశం దొరకుతుందని ఆవిడే సూచించింది. ఆవిడ అప్పుడూ, ఇప్పుడూ కూడా, మంచి స్నేహితురాలు నాకు. మా తల్లితండ్రులు ఉత్సుకతతో ఉన్నారు కనుక నేను ఆవిడ సూచనను స్వీకరించాను. మా నాన్న మద్రాసులో ఒక ఫార్మస్యూటికల్ వ్యాపార సంస్థను పెడదామన్న పథకం వేసుకున్నాడు. నేనీ చదువు చదివితే దీనికి బాగా పనికి వస్తుందని ఆయన అనుకున్నాడు.

నా వైపు నుంచి చూస్తే నేనొక విధంగా ఆ చదువును ఆస్వాదించినట్టే. నేను శరీర నిర్మాణ శాస్త్రమూ, పదార్థ వివేచన శాస్త్రమూ చాలా ఎక్కువగా చదవవలసి వచ్చింది. వాటిలో (శవాల) కోతలూ, ఆసుపత్రుల్లో ఉండే అజ్ఞాత వ్యక్తుల శవ నిధానానికి వెళ్ళడాలూ కూడా ఉండేవి. పాఠ్యప్రణాళికలో సేంద్రియ రసాయన శాస్త్రమూ ఫార్మకాలజీ కూడా భాగంగా ఉండేవి. మొదటి ఏడాది బాగానే చదివాను. పునఃపునః, దేశాటనం చెయ్యాలన్న కోరికా, వ్యాకులతా నన్ను పట్టుకొనేది. రెండో ఏడాది రెండో సగంలో ఆ కోరిక నన్ను మళ్ళీ దయ్యంలాగ పట్టింది. నిష్క్రమించడానికి నెమ్మదిగా నేను పథకాలు వేయడం మొదలుపెట్టాను. ఒక రాత్రి గంగ ఒడ్డున శ్రీ రామకృష్ణ పరమహంసతో బాబాజీ మాటామంతీ జరుపుతూన్నట్టుగా కలగన్నాను. దాన్ని ఒక సూచనగా తీసుకొని నేను ఒక రోజు పొద్దున్న ఎవరితోనూ చెప్పకుండా కాలికట్‌ను విడిచిపెట్టాను.

కారణాంతరంగా, చెన్నై చేరి, పిదప నేను ముంబైకి వెళ్ళే రైలెక్కాను. అప్పుడు రామకృష్ణ మిషన్ వారి ప్రధాన కార్యాలయం ఉన్న కలకత్తాకి చేరుకోడానికి అవసరమైన పైసలు లేవని నాకు తట్టింది. నా తోటి ప్రయాణీకుడు ఒకతను ముంబైలో ఖార్ దగ్గర ఒక అందమైన రామకృష్ణ మిషన్ కేంద్రముందని చెప్పాడు. అతను ఖార్‌లోనే ఉంటాడట. నాకు అభిరుచి గనక ఉన్నట్లైతే అక్కడ నన్ను దింపుతానని అతనన్నాడు. నేను సరే అని అన్నాను. అంచేత ఒక మధ్యాహ్నం నేను ఖార్‌లోని రామకృష్ణ మిషన్‌లో ఉన్నాను.

అది, ఎడారిలో నీటి చెలమలాగ, సందడులతో నిండిన ముంబై మధ్యలో

సేదదీర్చే ఒక శీతల స్థలం, మొదట శ్రీరామకృష్ణుల దివ్యాలయానికి ధ్యానంగా కూర్చున్నాడు. నేను మనవి చేసుకోగా శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యుడైన మహాపురుష మహారాజ్ శిష్యులూ, గరిష్ఠ సన్యాసీ, అధ్యక్షుడూ అయిన స్వామీ హిరణ్మయానంద గారిని కలుసుకోవడానికి సమయాన్ని మంజూరు చేశారు. ఆయన నా గురించి ఓర్పుగా విని నన్ను బ్రహ్మచారిగా స్వీకరించడానికి ఒప్పుకున్నారు. వివిధ కారణాల కొద్దీ నా అహిందూ నామాన్ని మాత్రం రహస్యంగా ఉంచడం మంచిదని చెప్పి ఆయన నాకు శివప్రసాదనే పేరు పెట్టారు. అప్పటి నుండి ఒకటిన్నర ఏడాది పాటు నేను బ్రహ్మచారి శివప్రసాదుగా ఉన్నాను.

విశ్రుతుడైన స్వామీ వివేకానంద ప్రారంభించిన శ్రీరామకృష్ణ మిషన్ నమ్మకమేమిటంటే మానవజాతికి చేసే సేవే శ్రేష్ఠమైన ఆరాధనా పద్ధతి అని. నేను చూసిన ఇతర ఆశ్రమాల్లో ఉండేవాళ్ళు సామాన్యంగా అధ్యనం చెయ్యడం, తినడం, నిద్రపోవడం అనే పనులే తప్పించి ఏ రకమైన సాంఘిక సేవలోనూ నిమగ్నులు కారు. అలాగే కాకుండా రామకృష్ణ మిషన్‌లోని సన్యాసులనందర్నీ సామాజిక సేవాక్రియల్లో విరామరహితంగా మునిగి ఉండేలాగ చేస్తారు. ఆసుపత్రులనూ, అనాథ శరణాలయాల్నీ, పాఠశాలల్నీ, కళాశాలల్ని, పెద్ద ప్రచురణాలయ విభాగాన్నీ- అన్నిటినీ చాలావరకూ సన్యాసులూ వాళ్ళ సహాయ సేవకులూ నడుపుతూ ఉంటారు. ఈ కార్యక్రమాలు వాళ్ళను సోమరిగాకాకుండానూ, చేస్తూన్న దానికి తృప్తి పడిపోయేలాగా చేయకుండానూ ఉంచుతూ ఉంటాయి.

చదువుకున్నవాడివీ వగైరా వగైరా వాడివీ కనక అని అంటూ, నేనేం సేవ చేయడాన్ని ఎన్నుకుంటానో అని నన్నడిగినప్పుడు, నేను గుళ్ళో శుభ్రంచేస్తూ సామాన్యంగా గుడి బాగోగులన్నీ చూసుకుంటూ ఉంటానని చెప్పి నాకుగా నేనే ఆ పనిని స్వీకరించాను. సాంప్రదాయకుడూ, వేరుగా అన్నిటికీ దూరంగా ఉండే సన్యాసిపురోహితుడూ అయిన భతుక్ మహారాజ్‌తో సంప్రదించిన తరవాత నాకా పనిని ఇచ్చారు. అక్కణ్ణించి నెమ్మదిగా గర్భగుడి పనులు చేసే స్థలానికి చేరుకొన్నాను. పళ్ళు కూరలూ తరుగుతూ, నివేదన కోసం పువ్వులు పోగు చేస్తూ,చివరకు గర్భగుడిలో తుడిచి శుభ్రపరచడానికీ రక్తమాంసాలతో సజీవంగా ఉన్నారా అన్నట్టున్న శ్రీరామకృష్ణుల చలవరాతి ప్రతిమ పట్ల శ్రద్ధ వహిస్తూ ఉండడానికీ నేను ఎదిగాను.

ఇతర సమయాల్లో మహాస్వామి యతీశ్వరానందుల శిష్యులైన స్వామీ గౌతమానందులనే అద్భుత సన్యాసి నుంచి నేను వేదాన్ని చదవడం, గానం చేయడం నేర్చుకున్నాను. ఆయన తరవాత మిషన్ తాలూకు పురాతన తమ కేంద్రాల్లో ఒకటైన

మద్రాసు రామకృష్ణ మఠానికి అధికారి అయ్యారు. స్వామీ వివేకానందులకు స్వయంగా దాని (మద్రాస్ మఠం) మూలాలతో సంబంధం ఉండేది. శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామీ రామకృష్ణానందులు ఆ కేంద్రానికి మొట్టమొదటి ప్రముఖుడు.

ఆ ఒకటిన్నర ఏళ్ళలో నేను చాలా నేర్చుకున్నాను. నా జీవిత ప్రయాణంలో సహాయకారిగానూ ప్రయోజనకారిగానూ ఉండే గుణాలను నేను అలవరచుకొని పెంపొందించుకున్నాను. వాళ్ళ గ్రంథాలయంలో చాలా పుస్తకాలున్నాయి. శ్రీరామకృష్ణుల మీదా, ఆయన ప్రత్యక్ష శిష్యుల మీదా ఉన్న సాహిత్యం చాలావరకూ నేను చదివాను. 'ఎమ్' రాసిన 'ద గాస్పెల్ ఆఫ్ శ్రీ రామకృష్ణ' (The Gospel of Sri Ramakrishna), స్వామీ శారదానంద రాసిన 'రామకృష్ణ ద గ్రేట్ మాస్టర్' (Ramakrishna The Great Master), 'కంప్లీట్ వర్క్స్ ఆఫ్ స్వామీ వివేకానంద' (Complete works of Swami Vivekananda), శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యుల్లో కొంతమంది జీవితాలూ అనేవి నాకు ఇష్టమైనవి.

రామకృష్ణ మిషన్ అధ్యక్షుడూ శారదాదేవి ప్రత్యక్ష శిష్యుడూ అయిన స్వామీ వీరేశ్వరానందులూ, కలకత్తాలో రామకృష్ణ సాంస్కృతిక సంస్థను తన ప్రయత్న పరంపరతో స్థాపింపజేసిన ప్రఖ్యాత స్వామీ రంగనాథానంద మొదలైన రామకృష్ణ శ్రేణిలోని కొంతమంది ఆదర్శప్రాయమైన సన్యాసులను నేను కలుసుకోగలిగాను. ఆ ఏడాది దుర్గాపూజను నిర్వహించినప్పుడు, ఖార్ కేంద్రంలో మరో వర్గానికి చెందిన గరిష్ఠ సన్యాసులు రాగా, వారితో ప్రతిస్పందించే అవకాశం లభించింది. ఈ సన్యాసులు తంత్రాల్లో కౌశలమున్నవాళ్ళు. వారిలో కొంతమంది తంత్ర సంబంధమైన ఆధ్యాత్మిక స్థాయిల్లో బాగా పురోగమించినవాళ్ళు.

నేను సన్యాసినే కాదలచుకుంటే, మఠంకన్నా మరో మంచి స్థలం నాకు లేదు. కానీ దైవసంకల్పరీత్యా నేను గృహస్థు కావలసి ఉంది. ఏదేమైనా నా విషయంలో బాబాజీ ప్రణాళికలు వేరు. ఒక సంవత్సరన్నర తరవాత, నేను ఖార్ రామకృష్ణ మిషన్ కేంద్రాన్ని నెమ్మదిగా వదిలి, మళ్ళీ తిరగడానికి స్వతంత్రుణ్ణైపోయాను.

శ్రీరామకృష్ణుల గురించీ స్వామీ వివేకానందుల గురించీ చాలా పుస్తకాలు చదివిన తరవాత నాకు రెండు ప్రాంతాలు చూడాలని గాఢమైన కోరిక ఏర్పడింది – కలకత్తాలో రామకృష్ణులు తన జీవితంలో చాలా భాగాన్ని గడిపిన, హుగ్లీ నదీతీరాన ఉన్న దక్షిణేశ్వర కాళీ దేవాలయం (ఒకటి); ఆ నదికి అవతలి ఒడ్డునున్న రామకృష్ణ మిషన్ ప్రధాన కేంద్రం బేలూరు మఠం (రెండవది).

బాబాజీ నుంచి (ఏదైనా) సంకేతం వస్తుందేమోనని ఎదురు చూశాను కానీ

ఏదీ రాలేదు కాబట్టి నేను ముంబై సెంట్రల్ రైల్వేస్టేషన్‌కు వెళ్ళి కలకత్తాకు టికెట్టు కొనుక్కున్నాను. నేను అక్కడకు (కలకత్తాకు) వెళ్ళడానికి మాత్రమే చాలినంత డబ్బు నా దగ్గర ఉంది. అంచేత నేను హౌరా స్టేషను నుంచి దక్షిణేశ్వర్ వరకూ ఉన్న దూరమంతా నడవవలసే వచ్చింది. ఇప్పటికీ, వేళకు తినడాలూ, మంచి భోజనాలు చేయడాలూ అలవాటు కావడంతో నేను దక్షిణేశ్వర్ వరకూ ఉన్న దూరమంతా నడవవలసే వచ్చింది. ఆ గుడి ప్రధాన ప్రవేశద్వారం బయట నేను, నాకు చాలా పరిచితమైన మూర్తిని – నా ప్రియతమ బాబాజీని – చూడగానే నా ఆనందాన్నీ ఉత్తేజాన్నీ మీరు ఊహించుకోవచ్చును. ఆకలీ, అలసటా మర్చిపోయి, నేను ఆయన పాదాలను తాకడానికి పరిగెత్తాను. ఆయన నన్ను వెచ్చగా కౌగలించుకొని 'ఆకలితో ఉన్న బ్రహ్మచారి మహారాజ్‌కి మొదట కొంత అన్నం" అని అన్నారు.

లూచీలూ, బంగాళాదుంప కూరా, సందేశ్‌లతో రుచికరమైన భోజనం చేసి మేము ఆలయ సముదాయంలోకి ప్రవేశించాం. నూట యాభై ఏళ్ళ క్రితం రాణీ రాసమణీ కట్టించిన ఆలయ సముదాయమది. దానిలో ఒకవైపు గోపాలకృష్ణుడికి ఒక చిన్న ఆలయముంది. అక్కడి ముఖ్యమైన ఆలయం భయంకరమూ, ఆగ్రహా పూరితమూ, అతి చంచల విస్ఫోటన రూపంలోనూ ఉన్న స్వచ్ఛశక్తికి ప్రతీక అయిన స్త్రీదేవత భద్రకాళీది. ఆలయ సముదాయంలోకి ప్రవేశిస్తూ ఉంటే కుడివైపున పన్నెండు లింగాలున్నాయి. అవి లింగరూపుడైన శివుడి పన్నెండు పవిత్ర జ్యోతిర్లింగాలకు ప్రతినిధులు. కాళిని ఆయన (శివుడి) భార్యగా చెబుతారు.

నేను గేట్లో ప్రవేశించగానే నాకు గగుర్పాటు పుట్టింది. నా మనఃస్థితిలో ఏదో మార్పు వచ్చినట్టనిపించింది. బాబాజీ ముఖం అసాధారణంగా గంభీరంగా ఉంది. ఆయన భద్రకాళీ ముఖ్య దేవాలయం వైపుకే చూస్తున్నారు. ఆది వారంలోని రోజు కనక దర్శనం చేసేవారి వరస బాగా పెద్దదిగా ఏం లేదు. కొన్ని నిముషాల్లోనే మేము మెట్లెక్కి కల్లోలరూప దేవత జగన్మాతకు ముఖాముఖీగా నిలుచున్నాం.

దశమహావిద్యలని చెప్పుకునే పది తాంత్రిక మహాశక్తుల్లోకల్లా దక్షిణేశ్వరంలోని భద్రకాళీ విగ్రహమే చాలా రౌద్రపూరితమైన రూపం. ఆవిడ నల్లగా ఉంది; కళ్ళు క్రూరంగానూ క్రోధంగానూ ఉన్నాయి. ఆవిడ నాలుక రక్తాన్ని కారుస్తూ నోటి బయటకు వేళ్ళాడుతూ ఉంది; విరబోసుకొన్న జుట్టు గాలికి ఎగురుతూ చిందరవందరగా ఉన్నట్టుగా ఉంది; మెడలో మానవ కపాలామాల, మొలకు చుట్టూ మానవ హస్తాలతో చేసినట్టున్న పొట్టి లంగా మినహాయించి ఆవిడ నగ్నంగానే ఉంది; నాలుగు

చేతులున్నాయి; ఒక అరచేయి కిందివైపుకు చూపిస్తోంది; ఒకటి ఆశీస్సునిస్తూ పైకి లేచి ఉంది; మూడోది రక్తమోడుతున్న కత్తిని పట్టుకొని ఉంది; నాలుగోది అప్పుడే కోసిన, రక్తం కారుతూన్న మనిషి తలకాయను పట్టుకొని ఉంది.

రౌద్రపు అంచులో ఉన్నట్టున్న విశృంఖల పారవశ్యంలో ఆవిడ నృత్యం చేస్తోంది. నిష్క్రియుడిగా కింద వెల్లకిలా సాగిలపడి ఉన్న శివప్రభువు వక్షస్సు మీద ఒక పాదం ఉంది; రెండో పాదం నృత్యభంగిమలో పైకెత్తి ఉంది - మొత్తానికి ఆ దృశ్యం రక్తమయంగా ఉంది. నా కళ్ళు ఆమె మీద వాలగానే ఏదో అసాధారణమైనది జరిగింది. వెనుబాము కింద నిద్రాణంగా ఉన్న అగ్నిశక్తిని క్రియాశీలకంగా చేసి తలవైపుకు ప్రయాణించేలాగ ఋజ్జగించాలని బాబాజీ నాకు నేర్పారు. ఆ అగ్నిశక్తి ఇప్పుడు తన చుట్లను దానికదే విప్పుకుంది. (కుండలినీ) అగ్ని నా వెనుబాము మీదుగా పైకి ఉరికినపుడు నేను స్పష్టమైన ప్రకంపనను అనుభవించాను. అది శిరఃశిఖరానికి చేరుకొనేసరికి ఇంద్రధనుర్వర్ణాల్లోకి పరిణమించింది. నేనొక మూలుగు మూల్గి కింద పడిపోయాను.

నేను లేచేసరికి, గుడికి ఎదురుగా ఉన్న నాట్యశాలకు ఒక మూల బాబాజీ ఒళ్ళో నా తల ఉన్నట్టుగా చూశాను. నా తలను ఆయన నెమ్మదిగా నిమురుతూ 'నీకిది భారమయింది కదూ? శరీరం ఆ తాకిడిని భరించలేకపోయింది. అదృష్టం కొద్దీ నేనిక్కడ ఉన్నాను. లేకపోతే నీకు పిచ్చెక్కిపోయేది' అని అంటున్నారు.

'నా ఒళ్ళంతా ఇంతకు ముందెన్నడూ నేననుభవించని మహానందంతో స్పందిస్తోంది' అని నేను నీరసంగా అన్నాను.

"నువ్వు బాగుపడతావులే. లేచి నిలుచో ఇప్పుడు. ఈ చుట్టూ నీకు చూపించనీ"

కొద్ది సమయం కాగానే మేము ఆ ఆలయ సముదాయం చుట్టూ తిరుగుతున్నాం. నా ఆనందం కొద్దిగా తగ్గుముఖం పట్టింది. నేను తాగినవాడి మాదిరిగా ఊగుతూ అల్లాడుతూ నడుస్తున్నాను. చిన్న కృష్ణ ప్రతిమ ఉన్న ప్రసిద్ధ గోపాలకృష్ణ దేవాలయాన్ని చూశాం. (గతంలో ఒకసారి) ఆ విగ్రహానికి అభిషేకం చేయిస్తుంటే పురోహితుడి చేతి నుంచి కిందపడి దాని కాలు విరిగిపోయింది. విరిగిన విగ్రహాన్ని పూజించవచ్చా అనే విషయాన్ని తేల్చడం కోసం వేదవేత్తల్లో శ్రేష్ఠుల్ని సంప్రదించారు. అందరి సామాన్య నిర్ణయమూ పగిలిన ప్రతిమను పూజించడం అమంగళప్రదమనే.

ఆ దేవాలయ సంస్థాపకురాలు రాణీ రాసమణి, కాళీ దేవాలయపు మహాత్ముడైన యువ పూజారి గదాధర్ చట్టోపాధ్యాయను (శ్రీ రామకృష్ణ పరమహంస అనే పేరు

తరవాత ఆయన భక్తులు పెట్టిన పేరు) కూడా ఈ విషయమై సంప్రదించాలని భావించింది. ఆవిడ ఆయనను దివ్యావేశపరుడిగా భావిస్తుంది. యువ రామకృష్ణుడు "ఇక్కడి ప్రఖ్యాత పండితుల్లాగ చదువుకున్న విద్వాంసుణ్ణి కాను. కానీ నాకొక ప్రశ్న ఉంది. ఒకవేళ రాణిగారి అల్లుడు కిందపడి కాలు విరగ్గొట్టుకుంటే, అతనిని గంగలో విసిరేసి కొత్తవాణ్ణి తెచ్చుకుంటుందా? విరిగిన కాలంటారా, దాన్ని ఎవరూ కనిపెట్టలేనంత బాగా నేను బాగు చేయగలను. అయినా, నిశ్చయించాల్సింది మీరే" – అని అన్నారు. రామకృష్ణులు తానే స్వయంగా బాగు చేసిన ఆ విగ్రహాన్నే తిరిగి ప్రతిష్ఠించారు. ఆ మూర్తికే ఆరాధన ఈ రోజుకీ జరుగుతూనే ఉంది.

ఏకైక సర్వోత్కృష్టుడూ, శాశ్వత కళ్యాణ స్వరూపుడూ అయిన సదాశివుడికి ప్రతీకలైన ఆ పన్నెండు లింగాలనూ దర్శించి మేము ప్రదక్షిణాలు చేశాం. పిమ్మట మేము ఆలయ సముదాయంలోంచి బయటకు వచ్చి నది పక్కనున్న చిన్న గదిలోకి వెళ్ళాం. శ్రీరామకృష్ణులు తన జీవితంలో అధిక భాగాన్ని ఆ గదిలోనే గడిపారు. నరేంద్రనాథ దత్తా అనే నిజనామధేయుడైన స్వామీ వివేకానందులతో సహా భవిష్యత్తులో ప్రఖ్యాతులైన రామకృష్ణ మిషన్ ధర్మ ప్రచారకులందరూ, ఇతర గొప్ప సాధకులూ, భైరవీ బ్రాహ్మణీ, గోపాల్ మా, తోతాపురీ మొదలైన ఆధ్యాత్మిక బోధకులూ శ్రీరామకృష్ణులతో సార్థక సమయాలను గడిపిన గది ఇది.

నేను బాబాజీతో సహా శ్రీరామకృష్ణులు శయనించిన మంచం దగ్గర కూర్చోగానే నా శరీరం మళ్ళీ కంపించింది; నా కళ్ళ వెంబడి నీళ్ళు అవిచ్ఛిన్నంగా స్రవించడం మొదలుపెట్టాయి. కళ్ళు మూసుకొని నేను, ఆ గురువూ, ఆయన శిష్యులూ బాగా సరదాగా నవ్వుతూనూ మాట్లాడుకుంటూనూ 'సందేశ్' తింటూనూ ఉన్న దృశ్య చిత్రాన్ని సందర్శించాను. చాలాసేపైన తరవాత, 'వెడదాం పద' అనే బాబాజీ కంఠధ్వనిని విన్నాను. మేము బయటకు వచ్చి, రామకృష్ణులు ఒక వేశ్య పాదాల మీద సాగిలపడి 'అమ్మా, కాళీమాతా! నువ్వెంత అందంగా ఉన్నావమ్మా! నువ్వెన్నెన్ని రూపాల్లో దర్శనమిస్తూ ఉంటావమ్మా!' అని అన్న వరండా దగ్గర ఆగేం.

ఆ తరవాత మేము నహబాత్‌ను దర్శించాం. ఇక్కడే, శ్రీరామకృష్ణుల సతి, పావనమాత శారదాదేవి ఉండేది. ఇక్కడే తనకుగా తాను తన శారీరక అవసరాలను పట్టించుకొని తన ప్రియ భర్తృమహాశయుడికి వండిపెట్టేది ఆవిడ. నవబత్ నుంచి గంగ ఒడ్డుకి నడిచాం మేము. కుండలినీ రహస్యాలను ఉద్ఘాటించిన స్త్రీ బోధకురాలు భైరవీ బ్రాహ్మణీ మార్గదర్శకత్వంలో రామకృష్ణులు తీవ్రంగా తాంత్రిక క్రియలను

అభ్యసించిన పంచవటీ తోటను బాబాజీ నాకు చూపించారు. ఒకసారి గదాధరుడు (శ్రీరామకృష్ణుడు) సమాధిలో ఉన్నప్పుడు భైరవీ బ్రాహ్మణి కొద్దిగా అన్నాన్ని తినమని అతన్ని బుజ్జగించడం తాను చూశావని బాబాజీ చెప్పారు. కొన్నేళ్ళ క్రితమైతే బాబాజీని ఈ విషయమై, మీకు చూస్తే ముప్పై ఏళ్ళకన్నా ఎక్కువ వయస్సున్నట్లనిపించదు కదా, మీరు ఆ దృశ్యాన్నెలా చూశారని ప్రశ్నించి ఉండేవాణ్ణి. కానీ, ఇప్పటికి, దేశకాలాల గురించిన సాంప్రదాయక భావనలను, ఆయన విషయంలో, తాత్కాలికంగా కొట్టిపారెయ్యడం నేర్చుకున్నాను.

భైరవీబ్రాహ్మణి కాశీలో ఉన్న నగ్న త్రైలింగస్వామి శిష్యురాలనీ, ఆవిడ చాలా పురోగమించిన యోగిని అనీ, శ్రీరామకృష్ణులను సాధారణ సాధకుడిగా భావించకుండా ఆయనను ఒక రకమైన దివ్యావతారంగానే భావించిందనీ బాబాజీ చెప్పారు. అప్పుడు ఆసక్తిని రేకెత్తించే ఈ కింద కథను చెప్పారాయన.

శ్రీరామకృష్ణుల్ని సాధికారికంగా అవతార పురుషుడిగా ఘోషిద్దామనే ఉద్దేశంతో, తన సిద్ధాంతాన్ని వివేచించి ఆలోచింపజేయడానికి చాలామంది మత విద్వాంసుల్నీ కోవిదుల్నీ దక్షిణేశ్వరానికి ఆహ్వానించింది ఆవిడ. ఆ విద్వాంసుల్లో చాలామంది ఆ కాళీ దేవాలయ యువ పూజారిని అవతారమూర్తిగా చెప్పదగిన కొన్ని అసాధారణ గుణాలూ లక్షణాలూ ఉన్నాయని అంగీకరించారు. చివరకు, ఆ యువ పూజారినే ఆ విషయమై అతనేమనుకుంటున్నాడో తెలుసుకోడానికి అడుగుదామని నిశ్చయించారు.

దీనికి కొన్ని రోజుల క్రితం శ్రీరామకృష్ణులు, గుడి దగ్గర అర్ధపారవశ్య స్థితిలో ఉన్నప్పుడు జారిపడి, చెయ్యి విరగొట్టుకున్నారు. విరిగిన చేయి, నిపీతంగావేసిన గుడ్డలో వేలాడుతుండగానే ఆ వివేచన సమితి ముందు ఆయన హాజరయ్యారు. ఆయనను ఈ విషయమై నిజాభిప్రాయాన్ని అడిగినపుడు ఆయన నవ్వి ఇలాగన్నారు. "పవిత్ర గ్రంథాలేమి చెబుతున్నాయో, లేకపోతే, మీరేమనుకుంటున్నారో నాకు తెలియదు గానీ, మీరు కనక నన్ను నిజంగా ఒక అవతారంగా భావిస్తే, ఉట్టిలా వేలాడుతున్న విరిగిన చెయ్యికల మొట్టమొదటి అవతారం ఇదవుతుందని నేను అనుకుంటున్నాను" అని. భైరవీ బ్రాహ్మణి మాత్రం నిస్సంశయంగా ఆయనొక ప్రత్యేకమైన దివ్యావతారమని రూఢిగా నమ్మింది.

"మీరేమనుకుంటారు?" అని బాబాజీని నేనడిగాను.

"అవును, ఆయన ఒక అవతారమే' అని ఆయనన్నారు.

దక్షిణేశ్వరం నుంచి గంగను దాటడానికి బోటునెక్కి అక్కడున్న రామకృష్ణ మిషన్

ప్రధాన కార్యాలయమైన బేలూర్ మఠానికి వెళ్ళాం. చెట్లతో నిండిన చాలా ఎకరాల భూమిలో ఉన్న బేలూరు మఠం తాలూకు ఆశ్రమం ఏ సమయంలోనైనా ఇంచుమించు రెండు వందల మంది సన్యాసులకూ, సహాయకులకూ వసతినిస్తుంది. దానిలో చాలా వసతి గృహ సమూహాలున్నాయి. కానీ, వాటిలోకెల్లా బహు ప్రభావాత్మకమైన నిర్మాణం శ్రీరామకృష్ణులకు అంకితమైన దేవాలయమే. టేకువెన్నె రాతితోనూ, నల్లరాతితోనూ కట్టిన ఆ ఆలయం దాని రమణీయమైన గుమ్మటాలతోనూ, చలవరాతి నేలలతోనూ వాస్తుకళా నైపుణ్యాన్ని ఆవిష్కరించే ఒక చమత్కారం.

గర్భగుడిలోని దేవతారూపం జీవపరిమాణంతో మఠం వేసుకొని సమాధి నిమగ్నుడై ఉన్న శ్రీరామకృష్ణుల చలవరాతి విగ్రహం. ఆ దేవాతాపీఠం కింద శ్రీరామకృష్ణుల భౌతికావశేషాలైన అస్థులూ, బూడిదా ఉన్నాయి. వాటిని స్వయంగా స్వామీ వివేకానందులే తలమీద పెట్టుకొని తెచ్చి ఆ పీఠంకింద స్థాపించారు. తరవాత మేము నది ఒడ్డున మీదుగా కట్టిన చిన్న చిన్న చైత్యాలను చూశాం. వాటిలో స్వామీ వివేకానంద, పావనమాత శారదాదేవితో సహా శ్రీరామకృష్ణుల శిష్యగణంలోని కొంతమంది భౌతికావశేషాలున్నాయి.

తరవాత బాబాజీ నన్ను అన్నశాలకు దగ్గరగా గంగ వైపుకు అట్టాలకం (Balcony) ఉన్న ఒక భవనం మొదటి అంతస్తు మీదకు తీసుకొని వెళ్ళారు. బాల్కనీలోకి తెరుచుకొని ఉన్న కిటికీల్లోంచి చూస్తే అక్కడ ఒక అందమైన, యోగ్యంగా సన్నద్ధమై ఉన్న ఒక పడక గది కనిపిస్తోంది. దానిలో నూకమాను (Rosewood)తో చేసిన నాలుగు స్తంభాలున్న మంచమూ, అండాకార దర్పణంలో ఉన్న ఒక ప్రఖ్యాత డ్రెస్సింగ్ టేబులూ, ఆ కాలానికి చెందిన ఒక సోఫా, పై బల్లను కదల్చడానికి వీలైన అమరిక ఉన్న రాతబల్లా, మెత్త ఉన్న ఒక కుర్చీ, నేలమీద పూర్తి ఉన్నితో చేసిన టర్కీ దేశంలో తయారైన మఖ్మల్ రగ్గూ వున్నాయి.

ద్వారమెక్కడుందా అని తొంగిచూశాను. అది ఎడమవైపుకు ఉంది కానీ తాళమేసి ఉంది. ద్వారబంధంపైన ఉన్న పలకమీద 'స్వామీ వివేకానందుల గది' అని ఉంది. ఆయన వాయించిన వాయిద్యాలు గదిలో ఒక మూలకు ఉన్నాయి. మరో మూల మంచి అభిరుచిని కనబరిచే చేతికర్ర, తోలు బూట్లూ, దూడతోలుతో చేసిన చిన్న పెట్టె ఉన్నాయి. అటువంటి విలాస సన్నివేశాలతో అంతటి గొప్ప సన్యాసి అయిన స్వామీ వివేకానంద ఏ విధంగా బ్రతికుంటారని అని ఆశ్చర్యమేసింది నాకు.

బాబాజీ తన మౌనాన్ని వీడి ఇలా అన్నారు: లోపల, బయటా కూడా స్వామిజీ ఒక రాజయోగి. సమీక్షించి పరిశీలించిన వాటన్నిటికీ ఆయన రాజులాంటివాడు.

గొప్ప యోగులు ఎక్కడుంటారు, ఎలాగ ప్రవర్తిస్తూ ఉంటారు అనేది వారి జీవిత లక్ష్యంమీద ఆధారపడి ఉంటుంది. బాహ్యాన్ని ఏ విధంగానూ లెక్కించనక్కర్లేదు; లక్ష్యమే ముఖ్యమైనది. స్వామీజీ జీవితం బాహ్యానికి సుఖమయంగా అయినది ఆయన బాగా విఖ్యాతి పొందిన తరవాతనే; బేలూరు మఠం కట్టినప్పుడే. ఆయన యౌవనంలో చెప్పలేని బాధలు పడ్డారు; ఒక్కోసారి తగిన తిండి లేకుండా కూడా ఉండేవారు. ఆ తరవాత కూడా ఎంత తక్కువ వ్యవధిలోనైనా సరే తన కమండలువు తీసుకొని, ఏ వస్తువులూ లేకుండా మళ్ళీ సంచార సన్యాసి కాడానికి సిద్ధమయ్యేవారు. ఆయన జీవితంలోని చాలా సంఘటనలు దీనికి తార్కాణంగా కనిపిస్తాయి.

"గుర్తుంచుకో! జనకుడు విదేహ రాజు. అయినప్పటికీ ఋషే, రాజర్షే నువ్వు కూడా రాజర్షిలాగే జీవిస్తావు"

"నేనా? బాబాజీ!" అని అభ్యంతరం చెబుతూన్నట్టు మాట్లాడాను. "మీరు నన్ను హిమాలయాల్లో ఏ బాధ్యతా లేకుండా సంచరించడానికి అనుమతిచ్చి ఉంటే, నేను దానినే ఎన్నుకునేవాణ్ణి. కానీ నేను మంచి కార్లను నడపడానికి ఇష్టపడతానన్న మాటను ఒప్పుకుంటానను కోండి"

"సంయమనం పాటిస్తూన్నంత సేపు అది బానే ఉంటుంది. కాని నువ్వు చాలా వేగంగా డ్రైవ్ చేస్తావు. జాగ్రత్తగా ఉండు" అని బాబాజీ అన్నారు.

బేలూరు మఠం భోజనశాలలో మంచి భోజనం చేసి ముఖద్వారానికి నడిచాం. అవతలకు చేరగానే బాబాజీ నాకు కొంత డబ్బునిచ్చి "ఇప్పుడు నువ్వింక ఇంటికి తిరిగి వెళ్ళిపో" మళ్ళీ దేశ దిమ్మరి పురుగు తొలిచేంత వరకూ వేచి ఉండు. నువ్వు మళ్ళీ బేలూరు మఠానికి వచ్చి కొంత దీర్ఘ సమయమే ఇక్కడ గడుపుతావు" అని చెప్పారు. తర్వాత బాబాజీ వెళ్ళిపోయారు. నేను మళ్ళీ బేలూరు మఠానికి వస్తానన్న ఆయన జోస్యం కొన్నేళ్ళ తరవాత ఫలించింది.

వెనక్కి తిరిగి వస్తూ నేను భువనేశ్వర్, పూరీలను దర్శించాను. జగన్నాథ మందిరంలో ఆధ్యాత్మిక భావావేశాల్లో మునిగిపోయాను. నా గుండె ఆనందంతో నిండింది. ఆవరణంలోని నేలమీద కూర్చొని చైతన్య మహాప్రభువు జీవితంలోని సన్నివేశం తరవాత సన్నివేశాన్ని దర్శించాను: ఇద్దరు ప్రకాశవంతులైన యువకులు – నితాయీ గౌరాంగులు – జగన్నాథుడి ఎదురుగా పరవశులై తాళాలూ తప్పెట్ల సహకారంతో నాట్యం చేస్తున్నారు.

నేను చైతన్య మహాప్రభువు స్థానాన్ని కూడా దర్శించాను. సముద్రతీరానికి దగ్గర, చైతన్యుల సన్నిహిత మిత్రుడూ శిష్యుడూ అయిన హరిదాసప్రభువు నివసించిన చిన్న

* ఒక హిమగిరి గురువర్యులకు శిష్యుడైన

ప్రదేశాన్ని కూడా చూశాను. జన్మతః హరిదాసు ముస్లిం. ఆయనకు జగన్నాథ మందిరంలోకి ప్రవేశాన్ని అనుమతించలేదు. అంచేత గుడిలోంచి రాగానే ప్రతిసారీ చైతన్య మహాప్రభువు నేరుగా ఆయన వసతికి తప్పనిసరిగా వెళ్ళేవారు. హరిదాసు "హరీ, హరీ" అని అంటూ చైతన్య మహాప్రభువు పాదాలను తన వక్షస్సుమీద ఉంచుకుని ప్రాణాలను వదిలిపెట్టాడని చెబుతారు.

# 38. శ్రీదేవి (శ్రీగురు బాబాజీ సోదరి); నీమ్ కరోలీ బాబా

ఇంటికి తిరిగి వచ్చిన ఎనిమిది నెలల తరవాత తిరిగి నేను రోడ్డెక్కాను. ఈసారి నేను ఢిల్లీకి వెళ్ళాను. కొన్నాళ్ళ క్రితం రైల్లో కలిసి, స్నేహితుడైన మంచి మిత్రుడు బాలచంద్రన్ నాయర్ దగ్గర పనిచేశాను. అతను నాకన్నా చాలా పెద్దవాడు. 'ఏక్సెన్ట్ (Accent)' అనే ఆధ్యాత్మిక సాంస్కృతిక చిత్రవర్ణ పత్రికను సంకలనం చేసి ప్రచురించేవాడు. సంకలనం తాలూకు మూలసూత్రాలు నేనతని దగ్గర్నుంచి నేర్చుకున్నాను; ఆ మేగజీన్‌కు బొమ్మలు గీసేను కూడా. బాలచంద్రన్ నాయర్‌ని నేను - చెట్టాన్, అంటే పెద్దన్న అని పిలిచేవాణ్ణి. ఇప్పుడతను కేరళలో కన్హన్‌కాడ్ అనే ప్రశాంత సముద్రతీర పట్టణంలో ఉంటున్నాడు. శ్రీకాంత్ అనే కలం పేరుతో ఆధ్యాత్మిక విషయాలమీద గొప్ప పుస్తకాలను ప్రచురిస్తూ ఉండేవాడు.

కొంతకాలమైన తరవాత దానిని వదిలేసి హిమాలయాలకు వెళ్ళిపోయాను. ఈసారి నేను వేరే మార్గాన్ని పట్టేను. హల్ద్వానీ గుండా వెళ్తూ చాలా ఏళ్ళ క్రితం ఉన్న మహాసిద్ధుడూ శ్రీగురు బాబాజీ శిష్యుడిగా అందరూ చెప్పుకునేవాడూ అయిన హీరాకుడ్ బాబా గుహను దర్శించి, నేను రాణీఖేత్, ద్వారహాట్‌లకు వెళ్ళి అక్కణ్ణించి కుకుర్‌ఛీనాకు వెళ్ళాను. మహాయోగి శ్యామాచరణ లాహిరీ శ్రీ గురువును కలుసుకొని దీక్షను తీసుకున్న గుహకు వెళ్ళాలని నా ఉద్దేశం.

పాండవులు వనవాసంలో ఉన్నప్పుడు ఇక్కడున్నారని స్థానికులు చెప్పుకునే పాండుఖాళీ గుండా కష్టమైన ప్రయాణం చేస్తూ ఒక రాళ్ళగుట్ట మీదుగా కిందికి పాకుతూ గుహను చేరుకున్నాను. అక్కడెవ్వరూ లేరు. గుహలో పూర్తిగా నిశ్శబ్దంగానూ ప్రశాంతంగానూ ఉంది. గుహలో కూర్చొని నా క్రియను చేస్తూ అప్రయత్నంగానే పరివర్తిత చైతన్యం తాలూకు గాఢ స్థితిలోకి చేరుకున్నాను. నా హృదయ కేంద్రంలో శ్రీగురు సన్నిధికి స్పష్టంగా భావించగలిగాను. సమాధిస్థితిలోంచి ఇవతలకు వచ్చి, గుహ లోపలకు కుడివైపునున్న ఏకైక ప్రవేశం ద్వారా చొరగలిగిన సొరంగాల గుహనాన్ని అన్వేషిద్దామని నిశ్చయించుకున్నాను.

బాబాజీ నన్ను తప్పకుండా కలుసుకుంటారనుకున్నాను. కానీ ఆయన ఎక్కడా కనబడకపోయేసరికి నాకు కొంచెం బాధగానే ఉంది. నేను ఆ సొరంగంలోకి ప్రవేశించాను. చాలావరకు నా చేతులతో సొరంగం పక్కలనూ పై కప్పునూ తాకుతూ దారిని చేసుకుంటూ లోపల చీకటిగా ఉన్నా వెళ్తూనే ఉన్నాను. పాములు గానీ

మంచుకొండ ఎలుగుబంట్లు గానీ చీకట్లో కాసుకొని ఉంటాయన్న భయం నన్ను తిరిగి ప్రవేశం ద్వారం దగ్గరకు వెళ్ళాలని ప్రేరేపించింది. కానీ అప్పుడే ఆ చివరన మిణుకు మిణుకుమనే కాంతిరేఖ కనిపించింది. ధైర్యం పుంజుకుని, నేను ముందుకు నడిచాను. కాంతి పెరిగింది. ఆ సొరంగం మరో పెద్ద గుహలోకి తెరుచుకుంది. దాని ప్రవేశం తూర్పువైపున ఉంది.

ఒక ధుని మండుతోంది. నా గుండె సంతోషంతో గంతులేసింది. అక్కడ పద్మాసనంలో, మండుకూరే రోకలిలాగ తిన్నగా కూర్చొని అగ్నిలోకి చూస్తూ బాబాజీ ఉన్నారు. ఆయన వెనక్కి తిరగలేదు గానీ ఉత్తినే అన్నారు - "రా రా మధూజీ"! చాలా సమయం అయింది అవునా?" అని. నేను ఆయన పాదాలమీద సాగిలపడ్డాను. అక్కడ మేము కూర్చొని చాలాసేపే మాట్లాడుకున్నాం. ఎప్పటిలాగానే ఆయన దయతో నాకు తిండి తెచ్చారు - చపాతీలూ, పప్పూ, కూర, దీర్ఘధ్యాన సమావేశం, రాత్రి భోజనం అయిన తరవాత నన్ను నిద్రపొమ్మని చెప్పారాయన.

"పంచకులీ అనే ఈ ప్రాంతం చాలా మంది మహాయోగులకూ సిద్ధులకూ కడపటి విరామ స్థలం. ఈ కొండల నిండా వెదజల్లినట్టు చాలా గోరీలుండడం నువ్వు చూడవచ్చు. ఒకానొక సమయంలో శ్రీగురువుకీ నాకూ కూడా ఇది ఒక ఇష్టమైన విడిదిగా ఉండేది. ఈ మధ్య మేము ఇక్కడకు తరచుగా రావడం మానేశాం". నేను నా పడకగోతాంను విప్పేసరికి బాబాజీ చప్పుడు చెయ్యకుండా నవ్వేరు. నేను దానిలో దూరేను. నేను మెలకువకూ నిద్రకూ మధ్య ఒక ప్రత్యేకమైన స్థితిలో ఉన్నాను. అప్పుడు గుహలోకి ఒక మధురమైన సుగంధం వీచినట్టయింది. నేను కూచోలేదు కానీ నిద్రను మాత్రం విడిచి అప్రమత్తమయ్యాను.

అర్ధపారదర్శకమైన తెల్లదుస్తులను చుట్టబెట్టుకొని తెల్లగా వెలుగుతూన్న మానవ రూపం ఒకటి గుహలోకి తేలి వచ్చింది. అది దిగి ధుని ఎదురుగా నిలిచేటప్పటికి, నేను అదొక స్త్రీ రూపం అని తెలుసుకున్నాను: చాలా అందంగా దట్టమైన పొడుగుపాటి నల్లజుట్టుతో ఉంది ఆవిడ. బాబాజీ లేచి నిల్చొని ఆవిడ పాదాలమీద సాగిలపడ్డారు. నేను కూడా నా పడక గోనె లోంచి ఇతలకు ఉరికి ఆమె పాదాలమీద సాష్టాంగపడ్డాను. "ఓహో మనల్ని చాలాచాలా క్రితం ఎరిగిన యువాత్మ ఇతనన్నమాట. నాన్నా దగ్గరకు రా" అని ఆవిడ శ్రావ్యకంఠంతో పిలిచింది.

నేనావిడ దగ్గరకు వెళ్ళేను. ఆవిడ తన చేతివేళ్ళను నా జుత్తులోకి జొనిపి, బుగ్గను నిమిరి, తన వక్షస్సు దగ్గరగా హత్తుకుంది. ఆ మధురసుగంధం నా ఆత్మను సంతృప్తం చేసి అణువణువునా ప్రతిస్పందించింది. ఎప్పుడో తప్పిపోయిన పసిబిడ్డ

తిరిగి తన తల్లిని కలుసుకుందా అన్నట్టుంది. "శ్రీగురువు నువ్వు ఇక్కడున్నావని చెప్పారు. ఈ యువకుణ్ణి చూడవచ్చు గదా అని అనుకున్నాను. ఇప్పుడిక నే వెళ్ళాలి" అని ఆవిడ బాబాజీతో అంది. ఆవిడ ఎలాగ వచ్చిందో అలాగే వెళ్ళిపోతూంటే, మేమిద్దరం మళ్ళీ సాగిలపడ్డాం.

"ఇదొక అరుదైన ఘటన. ఆవిడ శ్రీదేవి, శ్రీగురు బాబాజీ చెల్లెలు. సాధారణంగా పూర్తి ఏకాంత జీవితాన్ని గడిపే మహా వికసితాత్మ ఆవిడ. నువ్వు చాలా అదృష్టవంతుడివి!" అని బాబాజీ అన్నారు.

"బాబాజీ! ఇదంతా మీ ఆశీస్సులే" అని చెప్పి మళ్ళీ నిద్రకు ఉపక్రమించాను. ఈ అసాధారణ అనుభూతి గురించి గాఢాలోచన చేస్తూ, ఈ సంఘటనను నేను వర్ణిస్తే ఇంటిదగ్గర ఎవరైనా నమ్ముతారా అని అబ్బురపడుతూ నిద్రపోయాను.

మర్నాడు ఆ గుహను వదిలి ద్వారహాట్‌కు వచ్చేం. వెళ్ళిపోయే ముందు బాబాజీ నన్ను పిథోడ్‌గఢ్ జిల్లాలోని మాయావతిలో స్వామీ వివేకానంద స్థాపించిన అద్వైతాశ్రమానికి వెళ్ళమని సూచించారు. ఆ మీద మిహిర్‌తోలాలోని ఉత్తర బృందావనాశ్రమాన్ని చూసి ఆ ఆశ్రమాధిపతి శ్రీ మాధవ్ ఆశిష్‌ను కలుసుకోమని కూడా చెప్పారు. రాణీఖేత్, ఆల్మోరాల మధ్య ఉన్న కాయంచీకి కూడా వెళ్ళి అక్కడ అవధూత్ మహరాజ్ నీమ్ కరోలీ బాబాను చూడాలి. అక్కణ్ణించి కలకత్తాలోని బేలూరు మఠానికి వెళ్ళేముందు కాశీకి వెళ్ళి రామకృష్ణ సేవాశ్రమంలో ఉండాలి.

నేను ద్వారహాట్‌లో లోహఘాట్‌కి వెళ్ళడానికి బస్సెక్కాను. మాయావతికి పోయే జీపువాళ్ళను, ఎక్కించుకోమని అడిగి, నేను మాయావతికి చేరుకున్నాను. మాయావతి దగ్గర ప్రధాన స్వామీజీని కలుసుకున్నాను. ఆయన పేరేమిటో నేనిప్పుడు మర్చిపోయాను. ఆయన "ప్రబుద్ధభారత"కి సంపాదకుడు కూడాను. సాధారణంగా అక్కడ ఉండాలంటే ముందుగా తెలియపరచాలని స్వామి వివరించారు. కానీ, ఒక ప్రత్యేక సందర్భంగా ఎంచి నేను రెండు రోజుల పాటు ఉండడానికి ఆయన ఒప్పుకున్నారు.

నేను ఇప్పటివరకూ ఉన్న హిమాలయ ప్రాంత ఆశ్రమాల్లోకల్లా అత్యంత సుందరమైనది ఆ ఆశ్రమం. విగ్రహారాధన అంటేనచ్చనివాళ్ళ కోసమూ వైదాంతిక జీవిత మార్గాన్ని ఇష్టపడేవాళ్ళకోసమూ స్వామీ వివేకానంద ఈ అద్వైతాశ్రమాన్ని నెలకొల్పారు. ఇక్కడ శ్రీరామకృష్ణులకు అంకితమైన గుడి లేదు. అంచేత, దైనందిక పూజ కూడా లేదు. స్వామీజీ ఉపయోగించిన గదిని చూడడంతో నాకు గగుర్పొడిచినట్టయింది.

మాయావతిలోని అద్వైతాశ్రమంలో నేను స్వామీ దేవాత్మానందను కలుసుకున్నాను. ఆయన రామకృష్ణవర్గంలో సన్యాసి అయిన ఒక ఇరాకీ డాక్టరు. మేము చాలా మంచి మిత్రులమయ్యాం. నేను కాశీ వెళ్తున్నానని చెప్పినప్పుడు ఆయన నాకు అక్కడి రామకృష్ణ సేవాశ్రమం అధిపతికి ఉత్తరం రాసి ఇచ్చారు. తాను కూడా కొద్ది రోజుల్లో అక్కడికి వస్తున్నానని చెప్పారు. మాయావతి నుంచి మిహిర్‌తోలాకీ, 'గోపాల్ దా'గా తన దగ్గర సహచరులకు తెలిసిన శ్రీకృష్ణప్రేమ్‌గారి ఉత్తర బృందావనాశ్రమానికీ వెళ్ళేను. 1965లో గోపాల్ దా చనిపోయారు. నేను ఆయన శిష్యుడూ, వారసుడూ అయిన మాధవ్ ఆశిష్‌గారిని కలుసుకోవాలి.

మిహిర్‌తోలాలోని ఆశ్రమం ఆల్మోరాకు ముప్పై ఐదు కిలోమీటర్ల దూరంలో ఉంది. యశోదా మాయీ అనే బెంగాలీ మహాత్మురాలు స్థాపించిన ఆ ఆశ్రమంలో ఆవిడే కట్టించిన అందమైన చిన్న కృష్ణదేవాలయం కూడా ఉంది. ఆవిడ కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి చక్రవర్తిగారి అమ్మాయి. ఆమెకు ఏడేళ్ళున్నప్పుడు, ఎవరో కాదు సాక్షాత్తూ మహానుభావుడైన స్వామీ వివేకానందే, ఆవిడను 'కుమారీ పూజ' అనే పద్ధతిలో, జగన్మాతకు ప్రతీకగా పూజ చేసిన ఘనత ఆవిడకు దక్కింది. న్యాయమూర్తి చక్రవర్తిగారు దివ్యజ్ఞాన సమాజానికి (థియోసాఫికల్ సొసైటీ)కి చెందిన అనీబీసెంట్‌కు బాగా దగ్గర సహచరుడు. ఆయన దివ్యజ్ఞాని (థియోసాఫిస్టు) కనక, అజరామరులైన హిమాలయ గురువుల ఉనికిమీద నమ్మకమున్నవాడు.

యశోదా మాయీ మాత్రం సాంప్రదాయికమైన వైష్ణవ సాధకురాలు. ఆవిడకు కృష్ణప్రభువే సర్వస్వమూను. ప్రపంచాన్ని పరిత్యజించే ముందు కృష్ణప్రేమ్‌గారి పేరు ప్రొఫెసర్‌రోనాల్డ్ నిక్సన్. ఆయన బ్రిటిష్‌వాడు; ప్రజ్ఞావంతుడైన కేంబ్రిడ్జి పట్టభద్రుడు; లక్నో, బెనారస్ విశ్వవిద్యాలయాల్లో ఇంగ్లీషు సాహిత్యాన్ని బోధించేవాడు. ఆయన సంస్కృతంలోనూ, పాళీ భాషలోనూ కూడా పండితుడు. బెంగాలీ, హిందీ భాషల్లో అనర్గళంగా మాట్లాడుతాడు. ఈ విషయాలన్నీ నేను శ్రీమాధవ్ ఆశిష్ నుంచి తెలుసుకున్నాను. ఆయన కూడా ఒక బ్రిటిష్‌వాడే.

ఆ ఆశ్రమం ఒక ఏకాంత స్థలంలో ఉంది. చుట్టూరా దేవదారు వృక్షాలతో నిండిన పర్వతాలూ, లోతైన లోయలూ ఉన్నాయి. గేట్ లోపలికి వెళ్తే చాలు, నేనొక సమ్మోహనీవనంలో ఉన్నట్టనిపించింది నాకు. ఎక్కడ పడితే అక్కడ వికసించిన పువ్వులూ, పుష్కలంగా ఆకుపచ్చదనమూ ఉన్నాయి. అన్నిటికీ మించి అక్కడ నిశ్శబ్దం తాండవిస్తోంది. ఆకుపచ్చదనం మధ్యలో గుడి తాలూకు బూడిద వన్నె గుమ్మటం

కనిపిస్తోంది. మెట్లెక్కి, గుడిద్వారం బయట చెప్పులు వదిలి నేను గుళ్ళోకి ప్రవేశించాను. అదొక సాంప్రదాయక వైష్ణవ దేవాలయం. దానిలో రాధాకృష్ణుల సుందర ప్రతిమలున్నాయి. ప్రతీదీ అక్కడ వైష్ణవ శైలిలోనే తయారై ఉంది.

దీపాలను చూపిస్తూ క్రమంగా జరిపే ఆరతీ, గంటలు మోగించడం, జేగంటను కొట్టడం – అనేకర్మకాండలన్నీ శ్రద్ధగా అప్రమత్తంగా చేస్తున్నారు. శంఖాన్ని ఊదుతూ చేసే మధ్యాహ్న భోగం, అంటే అన్న నివేదనం కూడా అక్కడ జరుగుతోంది. నిజానికి ఆశ్రమమంతా గుడి చుట్టూరాగానే తిరుగుతుంది. గౌడ వైష్ణవ ఉపాసనా రీతిలోలాగే రాధాదేవతను, రాసవిహారీ కృష్ణదేవుణ్ణీ సజీవమూర్తిగానే చూస్తూ వారికి పవళింపు సేవా, మేల్కొల్పులూ మొదలైనవి జరుపుతుంటారు.

అది సాయంత్ర ఆరతి సమయం, నేను గుళ్ళో నిలుచొని ఉన్నాను. ఒక పాశ్చాత్యుడు వైష్ణవ దుస్తుల్లో, నుదుటి మీద పూర్తి వైష్ణవ కులచిహ్నంతో పిలక, కాషాయ ధోతీలతో లోపలికి ప్రవేశించాడు. నావైపుకు ఒక చూపు చూసి తిన్నగా గర్భగుడిలోకి వెళ్ళాడాయన. ఈ పొడుగుపాటి పాశ్చాత్యుడు పూజను విస్తృతంగానూ చాలా కుశలంగానూ నిర్వహించాడు. ఏ చిన్న అంశాన్నీ వదిలిపెట్టలేదు. నాతోబాటు గుడిలో ఇద్దరుముగ్గురు కన్నా లేరు. పూజ కాగానే బయటకు వచ్చి నా దగ్గరకు వచ్చాడాయన. నేను నమస్కరించి ఆయన పాదాలను స్పృశించాను. "మాధవ్ ఆశిష్‌ను. యశోదా మాయీ శ్రీకృష్ణప్రేమ్‌ల విధేయ శిష్యుణ్ణి. నువ్విప్పుడే వచ్చావా?" అని బ్రిటిష్‌రాణీ ఇంగ్లీషుబాణీలో ఆయన అడిగారు.

"అవునండీ మహరాజ్! నేను హిమాలయాల్లో ప్రయాణం చేస్తున్నాను. మా గురువుగారు ఈ ఆశ్రమాన్ని చూడాలని చెప్పారు. నేను ఒక రోజుకి ఇక్కడ ఉండవచ్చునాండి?" అని నేను అడిగాను.

"యువకుడా! నీ ఇంట్లోలాగ నిక్షేపంగా హాయిగా ఉండు. నేను నీకో గది చూపిస్తాను. అదృష్టంకొద్దీ, ఇప్పుడు చాలా తక్కువమంది సందర్శకులున్నారు" అని ఆయన అన్నాడు.

ఆ రాత్రిపూట, రుచికరమైన శాకాహార భోజనమైన తరవాత, శ్రీ మాధవ్ ఆశిష్ నాతో మాటామంతీ కోసం తన వసతికి పిలిచాడు. "నువ్వేమీ అనుకోకు. నాకు పొగ తాగే అలవాటు ఉంది" అని చెప్పి ఆయన ఒక అడవి పొద వేరుతో చేసిన పొగ గొట్టాన్ని వెలిగించాడు. మంచి పొగాకు తాలూకు నిండు వాసన గదినంతా నింపుతూ ఉండగా రాత్రి పొద్దెక్కేదాకా మాట్లాడుకుంటూనే ఉన్నాం. మీ బాబాగారి

ఆదేశాలను నువ్వు పాటించు. అదే నీకు బహు మంచి కావచ్చు. నీ కళ్ళల్లో ఏదో ఒక అద్భుతం కనిపిస్తోంది నాకు. మీ బాబాజీ యాదృచ్ఛికంగానైనా నీకు ఏదైనా ఒక వైష్ణవ మంత్రాన్నిచ్చారా?" అని ఆయన అడిగారు.

"అవును ఇచ్చారండి. లోకర్ క్రియలో మేము 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అనే మంత్రాన్ని జపించాలి" అని నేను చెప్పాను.

'హరీ! హరీ!' అని ఆయన చాలా భావావేశంతో అన్నారు.

'జయ శ్రీకృష్ణ! హిమాలయాల్లో ఉండే గొప్ప గురువర్యుల ఉనికిని నమ్మడానికి మాకు కారణముంది. బహుశా నీకు మాతో సంబంధముందేమో. ఇప్పుడింక ఆలస్యమయింది. నువ్వింక పడుకోవాలి!" దానితో, నన్ను పంపించేశారాయన. చాలా ఏళ్ళ తర్వాత కాశ్మీరువాసి డాక్టర్ కరణ్‌సింగ్ ద్వారా 'ఆశిష్ దా' (అలాగని శ్రీ మాధవ ఆశిష్‌ని ఆయన పిలిచేవారు) చాలా దీర్ఘరోగం తరవాత పోయారని విన్నాను. పుట్టపురుగు (Cancer) ఈ మహాత్ముణ్ణి కూడా వదిలిపెట్టలేదు. గోపాల్ దా రాసిన 'ద యోగ ఆఫ్ ద భగవద్గీత" (The Yoga of the Bhagavadgita), "ద యోగ ఆఫ్ ద కఠోపనిషద్" (The Yoga of the Kathopanishat) అనే రెండు గొప్ప పుస్తకాలను కూడా చదివాను నేను. అవి నిజంగా చాలా అంతర్‌దృష్టితో రాసినవి; ఆధ్యాత్మిక తీవ్రాన్వేషకులకు అవి చాలా ఉపయోగపడతాయి.

మర్నాడు శ్రీ మాధవ్ ఆశిష్ నుంచి సెలవు తీసుకొని కాయంచీ వైపుకు బయలుదేరాను, ఆ మహా నీమ్ కరోలీ బాబాగారి క్షణిక దర్శనమైనా నాకు దక్కుతుందేమోనని ఆశిస్తూ.

నేను చాలా అదృష్టవంతుణ్ణి. నేను కాయంచీ చేరగానే నీమ్ కరోలీ బాబా అంతకుముందు రోజునే వచ్చారనీ, ఇంకొన్ని రోజులు అక్కడ ఉంటారనీ నాకు చెప్పారు.

నీమ్ కరోలీ బాబా గడిపే చాలా ప్రాంతాల్లోలాగే ఇక్కడ ఆశ్రమంలో కూడా కపిముఖుడైన ఒక పెద్ద హనుమంతుడి విగ్రహం ప్రతిష్ఠితమయి ఉంది. వాయుపుత్రుడని కూడా చెప్పుకొనే ఈ అసాధారణ బలశక్తి సంపన్నుడు హనుమంతుడు అయోధ్యా రాజకుమారుడైన రాముడికి చాలా ఇష్టుడు. దగ్గర్లో జగన్మాత గుడి కూడా ఉంది.

జనుల విన్నపాలు వినడానికి బాబా ఒక ఎత్తైన వరండామీద కూర్చొని ఉన్నారు. అక్కడ నేలమీద చక్కటి బారులుతీరి వందకు పై చిలుకు జనం కూర్చొని ఉన్నారు.

మొదట పంక్తుల్లో చాలావరకూ పాశ్చాత్యులే ఉన్నారని నేను గమనించాను. ఉన్మత్త ఋషి అని ఎవరైనా పిలవగలిగే రూపానికి పూర్ణబింబంలాగ కనిపించారు నీమ్ కరోలీ బాబా. భారీ కాయం, చాలా లావుగా ఉన్నారు. దగ్గరగా కత్తిరించిన తెల్ల జుట్టుంది ఆయనకు. ఉత్తర ధ్రువ ప్రాంతంలోని సీల్ జాతికి చెందిన పొడుగాటి దంతాలున్న ఉభయచర క్షీరదం వాల్రస్‌కున్న మూతి వెంట్రుకల్లాగ ఆయన బూడిద వన్నె మీసాలు ఆయన గుండ్రని ముఖం తాలూకు పై పెదవిని అలంకరిస్తున్నాయి. ఆయన వక్షస్సుమీద ఏ బట్టా లేదు. ఆయన పెద్ద బొజ్జ చుట్టూ ఎరుపూ తెలుపూ నలుపూ గళ్ళున్న దుప్పటి చుట్టబడి ఉంది. వాన రానీ, ఎండ రానీ, ఇదే ఎప్పటికీ ఆయన విలక్షణమైన వేషం అని నేను తరవాత విన్నాను.

ఆయన బిగ్గరగా నవ్వుతున్నారు. చేతులతో దుడుకుగా సైగలు చేస్తూ అప్పుడప్పుడు ఏదో గుప్తానందాన్ని అనుభవిస్తున్నట్టుగా శరీరాన్ని అటూ ఇటూ ఊపుతున్నారు. సామాన్యంగా ప్రశ్నలకు ఆయనిచ్చే సమాధానాలు కొన్ని పొడిమాటల వాక్యాల ముక్కలు; కానీ చాలావరకు "రామ్! రామ్!" అని గట్టిగా అంటూంటారు. ఎవరో ఆయనకు వంగి నమస్కరించి నప్పుడు ఆయన అతని వీపుమీద గట్టిగా కొట్టి హిందీలో "ఆయనకోసం ఎక్కడ చూస్తున్నావు? ఆయన అంతటా ఉన్నారు. రామ్ రామ్ అని అను" అని, అప్పుడు ఇంగ్లీషులో 'వెరీ గుడ్; రామ్ రామ్' అని అన్నారు.

దూరం నుంచి ఈ సన్నివేశాన్ని చూస్తున్న నేను నాలాంటి అప్రముఖుడూ కొత్తగా వచ్చినవాడూ అయినవాణ్ణి ఆయన గమనించనైనా గమనిస్తారా అని అబ్బురపడ్డాను. అయితే, నేను పొరబడ్డాను. అకస్మాత్తుగా ఆయన తల పైకెత్తి నావైపు చూశారు. ఆయన కళ్ళు బాగా విప్పారాయి. నా మెడ మీదుగా తలవైపుకు వెళ్తున్న విద్యుదాఘాతంలాగ ఏదో అని అనిపించింది. 'బాబాజీ గారి కుర్రాడు. నువ్వు, నువ్వు ఇలా రా" అని అరిచాడాయన. ఇప్పుడాయన నన్నే చూపిస్తున్నారు. ఎవరో నాతో గుసగుసలాడుతూ "వెళ్ళు వెళ్ళు" ఆయన నిన్ను పిలుస్తున్నారు" అన్నారు.

నేను ముందుకు వెళ్ళాను. "పైకి రా" అని ఆదేశించారు ఆయన. మెట్లెక్కి ఆయన దగ్గర నిల్చున్నాను. నాకు సుగంధ ధూపం వాసన వేసింది. ఆయన పైకి ఎగిసి నన్ను గుంజేరు. నేనాయన ఒళ్ళో కూర్చొన్నట్టుగా కూలబడ్డాను. "మంచిది, మంచిది" అని అంటూ ఆయన తన దుప్పటి మడతల్లోకి చెయ్యి పెట్టి ఒక కుళ్ళిన ఆపిల్‌ను తీశారు. దాన్ని నా చేతిలో పెడుతూ "తిను" అని అన్నారు. ఆయన ఒళ్ళో కూర్చొని నేనా ఆపిల్‌తో ఏం చేయాలని తర్జనభర్జన పడ్డాను. అది కుళ్ళినట్టుగానూ

మలినంగా కూడానూ ఉంది. నాకు నిజంగా మరో అవకాశం కూడా లేదని అర్థం చేసుకొని, దాన్ని కొరికి త్వరగా తినడం పూర్తి చేశాను. విచిత్రమేమిటంటే దానికి మురిగిపోయిన రుచి లేదు.

"బాబాజీకి నా అభివందనాలు చెప్పు. రామ్ రామ్ అన్నానని చెప్పు. ఇక నువ్వు వెళ్ళవచ్చు" అని అన్నారు. నన్ను ఒళ్ళోంచి ఒక తోపు తోసి నా పృష్ఠభాగం మీద ఒక గట్టి దెబ్బ కొట్టేరు. నేను సాగిలపడి లేచి, నేను, ఇంతకు ముందు - చివరి వరసలో ఎక్కడో- కూర్చున్న చోటికి నడిచి వెళ్ళాను. ఆ రాత్రి, ఆశ్రమంలో ఉన్నాను. ఎవరో నాకు భోజనమూ వసతీ దయగా ఏర్పాటు చేశారు. అయితే, ఆ రాత్రంతా నాకు నిద్ర పట్టలేదు. నేను గాఢధ్యానంలో ఉన్నాను. పొద్దున్నే, దూరం నుంచే నీమ్ కరోలీ బాబాకు వంగి నమస్కరించి ఆశ్రమాన్ని విడిచి వెళ్ళిపోయాను. ఆనందమయమైన ఆ ధ్యానం మాత్రం తారాడుతూనే ఉంది.

క్రితం రాత్రి భోజనానికి ముందు, బాబా గురించి చాలా అద్భుత కథలే విన్నాను. కానీ అన్నిట్లోకల్లా నన్ను నిజంగా ప్రభావితం చేసినదీ, వినోదమనిపించినదీ ఒకటే - అది కథ. ఆ రోజులు హిప్పీలూ, పూలపిల్లలూ ఎక్కువగా ఉన్న రోజులు. తరవాత రామ్‌దాసుగా పేరు మార్చుకున్న రిచర్డ్ ఆల్పెర్ట్ అనే ఆయన ప్రోత్సాహం వల్ల చాలామంది హిప్పీలు నీమ్ కరోలీ బాబా వైపుకు ఆకర్షితులయ్యారు.

ఒక రోజున ఒక పాశ్చాత్యుడు తన జేబులోకి రహస్యంగా ఒక చిన్న సీసాను దూర్చడం చూసి బాబా "అదేమిటి?" అని అడిగారు.

"సీసా" అని అన్నాడు హిప్పీ.

"దాని లోపల ఏముంది?"

"మందు" అన్నాడు హిప్పీ.

"ఏ మందు?"

"బాబా"

"నాకియ్యి"

"కానీ, బాబా, ఇది చాలా తీక్షణమైన మందు..."

"ఇప్పుడది నాకియ్యి"

దడుపూ సంకోచాలతో వణుకుతూ అతను ఆ సీసాను ఆయన చేతికి అందించాడు. బాబా సీసాను తెరిచి పదో, ఆపైనో ఉన్న ఆ మాత్రలనన్నిట్నీ ఒకేసారి

నోట్లో వేసుకున్నారు. అతి మోతాదు ఎంత ప్రాణాంతకమో తెలిసిన ఆ పాశ్చాత్యులందరూ నిస్సహాయంగా బాబాను చూస్తూ నోళ్ళు వెళ్ళబెట్టారు.

ఒకటీ రెండు నిముషాల్లో బాబా ప్రవర్తన వెంటనే వింతగా మారింది. ఆయన గర్జించారు; అరిచారు; కళ్ళు గిరగిరా తిప్పేరు; నాలిక బయటకు పెట్టేరు; తన శరీరాన్ని వర్తులంగా తిప్పడం మొదలు పెట్టారు, హిప్పీలు మత్తుమందు దాని ప్రభావాన్ని చూపించడం ప్రారంభించిందనుకొని ఘోరం జరగబోతోందని అనుకున్నారు. దానికి బదులు, బాబా వింత ప్రవర్తన ఎంత ఆకస్మికంగా మొదలయిందో అంత అకస్మాత్తుగానూ ఆగిపోయింది. ఆయన ఒక పెద్ద నవ్వు నవ్వారు. "ఏమీ కాలేదు" లేదూ ఏమీ లేదు. రామనామం జపించింది. రామ్ రామ్ అని గానం చేయండి" అని అన్నారు.

ఆ పాశ్చాత్యులకు అక్కడ జరిగినదంతా వాస్తవంతా ఊహాతీతమే - 'పదార్థాన్ని మించినది మనస్సు' అనే దాన్ని నిజంగా నిరూపించే ఒక అద్భుతం.

---

౫ పందొమ్మిది వందల అరవైల్లో పొడుగుపాటి జుట్టూ, జీన్స్, పూసలూ వేసుకొని మతిని భ్రమింపజేసే మందులూ తీసుకుంటూ పరిపాటిని తప్పిన పిల్లలను హిప్పీలని అనేవారు. వాళ్ళు చేతుల్లో శాంతీ, ప్రేమలకు చిహ్నంగా పువ్వుల్ని పట్టుకొనేవాళ్ళు కనక "పూలపిల్లల"ని కూడా అనేవాళ్ళు.

# 39. కాశీవాసి అయిన అఘోరీ

ఆల్మోరా నుంచి నేను ఢిల్లీకి వెళ్ళాను. అక్కణ్ణించి కాశీకి చేరాను. కాశీలో నేను నేరుగా రామకృష్ణ మిషన్ వారి సేవాశ్రమానికి వెళ్ళాను. చెప్పినట్టుగానే ఇరాకీ డాక్టరు స్వామీ దేవాత్మానంద అక్కడ ఉన్నారు. అక్కడి గరిష్ఠ స్వామికి నన్ను పరిచయం చేశాడాయన. ఆ స్వామి పేరు నేను మర్చిపోయాను. ఆయన కూడా ఒక డాక్టరు. చాలా దయాపరుడు. ఆ ఇద్దరు డాక్టరుస్వాములూ రామకృష్ణ మిషన్ తాలూకు అప్పటి ప్రధాని కార్యదర్శుల్లో ఒకరైన స్వామీ హిరణ్మయానందులకు, నేను బేలూరు మఠంలో ఒక సన్యాసి సహాయకుడిగా చేరడానికి అనుమతి తీసుకోడానికి గాను ఉత్తరం రాయాలని అభిప్రాయపడ్డారు. స్వామీ హిరణ్మయానందులు అప్పుడు బేలూరు మఠంలోనే ఉన్నారు. అంతవరకూ (అనుమతి వచ్చేంతవరకూ) నేను రామకృష్ణ సేవాశ్రమంలో ఉండవచ్చునట.

అంచేత నేను స్వామీ హిరణ్మయానందులకు ఉత్తరం రాసి ప్రత్యుత్తరం కోసం ఎదురు చూస్తూ బెనారస్‌లో ఉజ్జాయింపుగా ఒక నెల వరకూ ఉన్నాను. పురాతన పురమైన కాశీని పరిశీలించడానికి అది నాకు మంచి అవకాశమయ్యింది.

కాశీ అంటే కాంతి, దీప్తి అని అర్థం. పురాతన కాలం నుంచీ కాశీ అని పిలవడం జరుగుతూన్న ఈ పవిత్ర నగరం విద్యకూ, సంస్కృతికీ, మత విచారణ తాలూకు సనాతన సంప్రదాయాలకూ కేంద్రంగా ఉంది. కాశీరాజ్యంలో ఉన్న బెనారస్ పట్టణానికి హెంగ్ నదిని (గంగానదిని) అనుసరిస్తూ తాను వచ్చానని ఐదో శతాబ్దంలో ఫా-హియెన్ (Fa-Hien) రాశాడు. హ్యుఎన్‌త్సాంగ్ (Huen Tsang) ఏడో శతాబ్దిలో దాన్ని వారణాసి అని వ్యవహరించాడు. కొంతమంది ముస్లిం పాలకులు దాని పేరును ముహమ్మదాబాదుగా మారుద్దామని చూశారు గానీ ఆ పట్టణం పేరు కాశీగానే, లేకపోతే, వారాణసిగానే కొనసాగింది. పురాణాలు కూడా ఈ పావన నగరాన్ని అవిముక్త క్షేత్రమనీ మహాశ్మశానమనీ, ఆనందవనమనీ పిలిచాయి. కానీ చాలావరకు హిందువుల్లో అధిక సంఖ్యాకులకు వాడుకలో ఉన్న పేరు అప్పుడూ, ఇప్పటికీ కూడా కాశీయే.

యాత్రికుల గుంపులూ, కంపుగొట్టే సందులూ, స్వేచ్ఛగా తిరిగే అపాయకరమైన కొమ్ములున్న ఎద్దులూ, మోసకారి కోతులూ, దుమ్మూధూళీ, ఈగలూ, బలవంతంగా కొల్లగొట్టే పండాలూ (పూజారులూ) ఉన్నప్పటికీ కూడా వారాణసిలో ప్రశాంతత ప్రత్యక్షంగా నేను అనుభవించగలిగాను.

ప్రతిరోజూ ఆశ్రమం నుంచి ఎక్కువ దూరం లేని దశాశ్వమేధ ఘాట్‌కి పిచ్చిగా తొక్కే సైకిల్ రిక్షాల పక్కల్లోంచి, కాషాయ బట్టల సన్యాసుల మధ్యలోంచీ నగ్న నాగాలూ భిక్షకుల మధ్యలోంచీ దారిని అల్లుకుంటూ వెళ్ళడం అలవాటుగా చేసేవాణ్ణి. వివిధ సన్యాసి వర్గాలకు చెందిన అఖాడాలూ, లేక, మఠాలు చాలానే ఉన్నాయి ఈ ఘాట్‌లో. పశ్చిమదేశాల నుంచి వచ్చిన హిప్పీలూ "పూలజనులూ" సాధువులతో కలిసిపోయి ఉన్నారు. శ్రీయోగిరాజ శ్రీ 108 భగవాన్ దాస్‌జీకా అఖాడా ఖాక్ ఛాంకా దగ్గర రామావత్ సాధువులు చరస్ గంజాయిలను తాగుతున్నారు.

ప్రతిరోజూ చాలా శవాలను కాలుస్తూ ఉండే మణికర్ణిక, హరిశ్చంద్ర ఘాట్లను కూడా దర్శించాను. కాశీలో శంకరుల సంప్రదాయ సంబంధీకులైన దశనామీ సన్యాసులే ఎక్కువ మంది ఉన్నా, వైష్ణవ శాఖల వాళ్ళకు కూడా వారి కేంద్రాలున్నాయి. నేను వీలున్నన్ని ఎక్కువ కేంద్రాలను – బౌద్ధ, జైన, సిక్కు నిర్మల్, ఉదాసీన, కబీర్ పన్థీ, నానక్ పన్థీ, రామానందీ, రామానుజీ, వల్లభ, మాధవ, నింబార్క, గౌడీయ, వీరశైవ కేంద్రాలే కాక, చివరికి సహజంగానే బాబాజీ వాళ్ళ నాథ్, లేక గోరఖ్‌నాథ్ పంథాల కేంద్రం కూడా చూడదలచుకున్నాను. నేను చాలామంది విద్వాంసుల్నీ పావన మూర్తుల్నీ కలుసుకున్నాను. వారిలో ప్రసిద్ధులైన దండి స్వామీ, విద్వత్ సిద్ధుడూ అయిన స్వామీ కరపాత్రీ జీ కూడా ఉన్నారు. ఆయనే నాకు 'కాశీ' అంటే కాంతి అని వివరించారు. కాశీలో జీవించిన పూర్ణపుణ్యాన్ని నిజంగా పొందాలంటే బ్రహ్మప్రకాశాన్ని పొందడమేనని ఆయన నాకు చెప్పారు. విద్వాంసుడూ మహాత్ముడూ అయిన ఈయనతో నేను చాలా సైద్ధాంతిక చర్చలనే జరిపాను. వైదాంతిక తత్త్వపు చాలా కొత్త కోణాలను కూడా నేర్చుకున్నాను ఆయన నుంచి.

స్వామీ హిరణ్మయానందుల నుంచి ఉత్తరం. రావడానికి ఇక మూడు రోజు లుండనగా, నేను ధైర్యం చేసి ఒక సాయంత్రం కాశీ విశ్వనాథుడి గుడిలోని లింగాన్ని దర్శించడానికి వెళ్ళాను. శివలింగాన్ని దర్శించి స్పృశించిన తరవాత నేను బయటకు వచ్చి మణికర్ణికా ఘాట్‌కి నడిచి వెళ్ళాను. చాలా శవాలను అక్కడ కాలుస్తున్నారు. ఆ ఘాట్ మెట్లు దిగి, సాపేక్షకంగా సద్దు లేని చోటు చూసుకొని గంగకు అభిముఖంగా కూర్చున్నాను. అక్కడ కూర్చుని ఉండగా నా ఆలోచనలు బాబాజీ వైపుకు మళ్ళాయి.

ఆయన ఆ క్షణంలో ఎక్కడ ఉండి ఉండవచ్చు? హిమాలయాల్లో ఎక్కడైనా సంచరిస్తూ ఉండవచ్చునా? ఆయన ఇప్పుడు నా పక్కనే కూర్చుని ఉంటే ఎంత బాగుంటుందో కదా! బాబాజీ బెనారస్‌లో చాలా ఏళ్ళు ఉన్నట్టుగా నాకొకసారి చెప్పారు.

ఆయన ఇప్పుడు యాదృచ్ఛికంగా బెనారస్‌లో ఉన్నారా? అదే అయితే, ఆయన ఇక్కడే ఉంటే, తప్పకుండా నాకు కనిపించకుండా దాక్కోరు.....

సూర్యుడస్తమిస్తున్నాడు. అన్ని దేవాలయాల్లోని గంటలూ, చిరు గంటలూ మోగుతున్నాయి. కొన్ని ఘాట్ల దగ్గర పవిత్ర గంగానదికి ఆరతినిస్తున్నారు.

'మధూ!"

సూపరిచితమైన ఆ కంఠధ్వనిని విని నేను ఉలిక్కిపడ్డాను. ఒక్క బాబాజీ తప్పించి మరెవ్వరూ అంత ప్రేమతో 'మధూ!' అని పిలవలేరు. ఆయన నా నుంచి మూడు మెట్ల అవతల ఉన్నారు. 'బాబాజీ!' అని నేను ఆనందంతో గట్టిగా అంటూ ఆయన పాదాలను స్పృశించాను. 'అయితే, ఎలా ఉన్నాడు బ్రహ్మచారి మహరాజ్?' అని ఆయన నవ్వుతూ నా భుజంమీద చేతులు ఉంచారు.

'దొడ్డ బాబాజీ! మీరు దగ్గర లేరన్న లోటు తప్ప (బాగానే ఉన్నాను)' అని నేనన్నాను.

'అది సరే గానీ ఇప్పుడు నీతో నేను గంటా రెండు గంటల కన్నా ఎక్కువసేపు ఉండట్లేదు. కాశీ అనే ఈ వైపరీత్యాల విచిత్రపురం, ఈ కాంతులపురం చాలావరకూ మారువేషంలో ఉండే చాలామంది వికసిత మహాత్ములకు నివాసస్థానం. త్రైలింగస్వామీ, శ్యామాచరణ లాహిరీలాటి మహాత్ములు ఒక లక్ష్యాన్నుద్దేశించి ప్రసిద్ధులయ్యారు కానీ చాలామంది అజ్ఞాతంగానే ఉంటారు. మనకు తెలియని వాళ్ళు, తెలిసిన వాళ్ళకన్నా సామాన్యంగా గొప్పవారై ఉంటారు.

'మణికర్ణికా దహన ఘాట్‌లలో ఉంటూన్న ఒక అటువంటి మహాత్ముణ్ణి నువ్వు కలుసుకోవాలని నేననుకుంటున్నాను. ఆయనొక అఘోరీ, సగం కాలిన శవాల మాంసాన్ని తింటాడనీ పూర్తిగా పిచ్చివాడిలా ప్రవర్తిస్తాడనీ నమ్మే మహాజనం ఆయనను వదిలేస్తుంది. ఆయనెప్పుడూ స్నానం చెయ్యడు. ఆయనగారి నగ్న శరీరం దుమ్ముతో కప్పడి ఉంటుంది. శ్మశానంలో మనుష్యుల తాలూకు, జంతువుల తాలూకు ఎముకల గుట్టల మధ్యలో ఒక పాడుబడ్డ గుడిసెలో ఉంటూంటాడాయన. కానీ నువ్వు అర్థం చేసుకో ఇవన్నీ తెరలని. ఇవన్నీ కట్టుదిట్టమైన తప్పుదారి పట్టించే ఒక ఉపాయం మాత్రమే. దానితో ఆయన అలజడికి దూరంగా ఉంటాడు. ఆధ్యాత్మిక ఏకాంతపు ఆనందాన్ని స్వేచ్ఛగా ఏ బెడదా లేకుండా అనుభవిస్తూ ఉంటాడు. ఆ ఆనందందాన్ని యోగ్యులతోనే పంచుకుంటూ ఉంటాడు. నడు, వెళ్దాం'.

మేము సగం మసకలో శ్మశానభూమిలో నడుస్తూ మణికర్ణికా ఘాట్‌లోని ఒక

ఒంటరి మూలకు చేరాం. ఒక చిన్న రేకు కప్పు నిర్మాణమున్న దిక్కు నుంచి హిందీ భాషలో అత్యంత చండాలపు బూతులను ఎన్నుకొని మరీ ఎవరో బిగ్గరగా అరుస్తున్నారు. మేము ఆ షెడ్డు దగ్గర చేరగానే నాకొక పెద్ద లావుపాటి ఆయన కనిపించాడు. ఆయన దిగంబరుడు. గడ్డమున్నవాడు. ఆయన తలచుట్టూ తలపాగాలాగ భీతిగొలిపే జడలు చుట్టబెట్టి ఉన్నాయి. ఆయన ఒక మూల కూర్చొని ఉన్నాడు; ఆయన ఎదురుగా ఒక స్త్రీ ఒక పురుషుడూ నిలుచొని ఉన్నారు. ఆ షెడ్డు మధ్యలో వెలిగించి ఉన్న కిరోసిన్ దీపపు కాంతిలో చుట్టూ వెదజల్లినట్టున్న బొమికలను చూశాను. ఇక ముందుకు నడవకుండా బాబాజీ నన్నాపారు. "ఆగు. ఆయన చేస్తున్న పనిని పూర్తి చెయ్యనీ" అని నెమ్మదిగా అన్నారు.

ఆ అఘోరీ నోరు చించుకుంటూ అరుస్తున్నారు: "అంటే నువ్వు, మితిమీరిన వడ్డీలను గుంజే నువ్వు నన్ను మోసగించవచ్చునను కుంటున్నావు. నువ్వు అప్పిస్తావు. దారుణమైన వడ్డీని వడ్డిస్తూ ఉంటావు. రక్తాన్నే పీల్చేవాడా! అంతంత వడ్డీలు చెల్లించలేకనో, నీ అప్పును తీర్చలేకనో ఉన్న ఎంతెంతమందికి చెందిన చిన్న చిన్న భూ భాగాలను లాగుకొని మోసం చేశావు నువ్వు? అంతా నీకిచ్చి పోగొట్టుకుంది కనకనే కదూ ఆవిడ ఆత్మహత్య చేసుకున్నది? దగాకోరు? ఇప్పుడు నాకు మిఠాయిలు పట్టుకొచ్చి ఇస్తున్నావు. ఉంపుడుదాని కొడకా! అది నీ పాపాలన్నిటినీ కడిగేస్తుందిటోయీ! పో! నీ మిఠాయిలను నేను తినను. అవి నాకు విషమే. నిన్ను తన్ని తగలెయ్యకముందే ఇక్కణ్ణించి పో!" అని.

సిల్కు చొక్కా వేసుకున్న ఆ వడ్డీ వ్యాపారి ఏదో గొణిగాడు. నాకు స్పష్టంగా అర్థం కాలేదు. దానికి ప్రతిగా ఆ అఘోరీ ఆ మిఠాయి పెట్టెలను విసిరేశాడు. ఒక స్వీట్ పెట్టె నావైపుకు ఎగిరి వచ్చింది. దాదాపుగా అది నా తలకు తగలబోయింది. సిల్కుచొక్కా మనిషి భయపడుతూ కొట్టబోతూన్న అఘోరీ తాలూకు కోపాన్నుంచి తప్పించుకొని షెడ్డులోంచి బయటకు పరిగెత్తాడు. అతను మమ్మల్ని దాటి తన దోవన వెళ్ళిపోయాడు.

ఇప్పుడు ఆ స్త్రీ ఒక్కత్తే ఆయన దగ్గర ఉంది. ఆవిడ ధైర్యానికి నేను బిత్తరపోయాను. జరిగినదంతా చూసిన తరవాత కూడా ఆవిడ ఇంకా అక్కడ నిలుచొని ఉంది. అఘోరీ ఆమె వైపుకు తిరిగి "నువ్వెందుకున్నావే ఇక్కడ? నేను పిచ్చి పట్టినట్టునున్నాను, కనిపించడం లేదా? నేను నిన్ను కొట్టకముందే వెళ్ళిపో" అని అన్నారు.

ఆవిడ మాత్రం అక్కడే కదలకుండా నిలుచొంది. "నాకేం భయం లేదు బాబా! మహామహితాత్ములు పిచ్చివాళ్ళల్లాగ ప్రవర్తిస్తారని విన్నాను. నేనీ లోకాన్ని అన్ని రూపాల్లోనూ చూసి విసుగెత్తి ఉన్నాను. నాకు 'సత్యం' ఒక్కటే కావాలి. మీరు నన్నేం చేయమంటే అది చేస్తాను. నేను మీ శరణాగతురాలిని" అని అంది.

అఘోరీ పగలబడి నవ్వారు : "ఆహ్హా! ఏం గొప్ప సాధుకురాలండీ! నీ బతుకంతా సినిమాల కృత్రిమ లోకంలో బతికావు. నీ నటనాచాతుర్యాలతో ప్రతివాణ్ణీ మోసం చెయ్యగలననుకుంటున్నావు. 'సమర్పణమా' నీ శ్రాద్ధమా? నువ్వు ఏమైనా చేస్తావా? సరే, ఇక్కడే, ఇప్పుడే నీ బట్టలన్నీ విప్పేసెయ్యి. నీ చూచుకాలను పీలుస్తాను. నీ చన్నులను నాకుతాను" అని అన్నారు. ఆమె నిర్ఘాంతపోయి నిశ్శబ్దంగా కొంతసేపు నిలుచొంది. తరవాత గట్టిగా బొబ్బ పెట్టింది – "దుష్టుడా! చండాలుడా! నేను నువ్వొక మహాత్ముడివనుకున్నాను. నిన్ను కటకటాల వెనకాతల పెట్టాలి!" అని అంటూ షెడ్డులోంచి పారిపోతూ నోరు చించుకుంటూ తిడుతూనే వెళ్ళింది.

మేము కొంతసేపు ఆగేం. అఘోరీ సంతోషంతో చప్పట్లు కొడుతూ ఘోషించారు: "మూర్ఖులు! వీళ్ళందరూ ఎక్కణ్ణుంచి వస్తారో దేవుడికే తెలుసు. చెత్త మాట్లాడతారు. వాళ్ళను తరిమిగొట్టేశాను. ఓహో! జోగి మహరాజ్! చీకట్లో దాక్కోకండి. దయచేసి రండి. మిమ్మల్ని వేచి ఉండేలా చేసినందుకు మన్నించండి". మేము షెడ్డులోకి వెళ్ళాం. అఘోరీ లేచి నిలుచొని మమ్మల్ని స్వాగతించారు. "అయ్యా కూర్చోండి" అంటూ మేము కూర్చొనేంత వరకూ వేచి ఉండి తరవాతనే ఆయన కూర్చున్నారు. చెత్తచెదారాలెన్ని ఉన్నా అక్కడ ఏ దుర్గంధమూ లేకపోవడం నన్ను ఆశ్చర్యపరిచింది. దానికి బదులు, మృదువైన గులాబీల వాసన వేసింది.

"జోగి మహరాజ్! మిమ్మల్ని చూసి చాలా రోజులయింది. ఆ నాటకాన్ని మీరు చూసి ఆనందించి ఉంటారు. అయితే, ఇతనేనా మీరు కనుక్కొన్న యువకుడు - ఊఁనన్ను చూసి భయపడ్డావుటోయీ?"

"లేదండీ" అని నేనన్నాను

"మిమ్మల్ని దర్శించడానికే అతనిని తీసుకొని వచ్చాను. మాకు ఎక్కువ సమయం లేదు. శ్రీ గురువు మిమ్మల్ని దర్శించమని మాకు చెప్పారు. మీ పరిణామాన్ని ఈ యువకుడు చూడాలని అనుకున్నారు. ఇంతవరకూ ఇటువంటిదేదీ అతను చూడలేదు" అని బాబాజీ అన్నారు.

'మీరంటూన్నట్టుగా కానివ్వండి, జోగి మహరాజ్! కానీ ఇంతకన్నా గొప్ప

సంగతులను చూపించాల్సింది ఇతనికి. ఏమైతేనేం లెండి. ఇదిగో ఇక్కడ వీడు వెళ్తున్నాడు!"

దిగ్భ్రమ చెందే మా కళ్ళముందే ఆ అఘోరీ శరీరం క్రమంగా వెలిసి లుప్తమయ్యింది. దాని స్థానే ఒక అత్యంతమైన అందగాడు, ఎర్ర సిల్కు నడుము కట్టుతో, మెడ చుట్టూ స్ఫటికమాల ధరించి ఉన్నవాడు కనిపించాడు. శ్రీగురువు తప్పించి అంత ఆకర్షణీయమైన వాణ్ణి మరొకణ్ణి నేను నా జీవితంలో చూడలేదు.

మేము ఇక వెళ్ళడానికి వెనుతిరుగుతున్నప్పుడు బాబాజీ అన్నారు: "ఇదీ ఆయన నిజరూపం. నువ్వు ఇంతకుముందు చూసినది వట్టి ముసుగు మాత్రమే ఇప్పుడు నువ్వు ఆశ్రమానికి తిరిగి వెళ్ళిపో. ఇవేళ నువ్వు చూసిన దాని గురించి ఒక్క మాట కూడా ఎవ్వరికీ చెప్పకు. బేలూరు మఠం నుంచి ఉత్తరం త్వరలోనే వస్తుంది. బేలూరు మఠానికి వెళ్ళి అక్కడ కొన్నాళ్ళుండు. నేను మళ్ళీ ఎప్పుడో నిన్ను కలుస్తాను". నేను ఆయన పాదాల మీద సాగిలపడ్డాను. నేను తిరిగి నిలువుగా నిలుచునే సరికి ఆ ఇద్దరూ లేరు.

నేను ఆశ్రమానికి ఆలస్యంగా తిరిగి వెళ్ళాను. నేను నేరుగా నాకిచ్చిన చిన్న గదికి వెళ్ళాను. కొంతసేపు ధ్యానం చేసి నిద్రపోయాను.

స్వామీ హిరణ్మయానంద నుంచి ఆ ఉత్తరం వచ్చింది. నాకు బేలూరు మఠానికి వెళ్ళి పూర్వార్హతా పరీక్షా శిక్షణా కేంద్రంలో (Pre-Probationers Training Centre-PPTC) చేరడానికి అనుమతి దొరికింది. నేను ఉపప్రధాన కార్యదర్శి స్వామీ ఆత్మస్థానందులకు నివేదించుకోవాలి. నేను కలకత్తా రైలెక్కి బేలూరు మఠానికి చేరుకున్నాను. నేను ఉప ప్రధాన కార్యదర్శితో భేటీ అయిన తరవాత నన్ను PPTC లో చేరనిచ్చారు. ఆ స్వామి చాలా గొప్పవాడని ఆయనతోటి గోష్ఠులతో నాకు తెలిసింది.

బేలూరు మఠంలో అధ్యక్షుడూ, ప్రధాన కార్యదర్శులతో సహా రామకృష్ణ వర్గంలోని గరిష్ఠ స్వాములను కలుసుకొని వారి ఆశీస్సులను అందుకునే అవకాశం నాకు కలిగింది.

రెండు నెలల తరువాత రామకృష్ణ విద్యా పీఠాధిపతి అయిన చందస్ మహరాజ్‌కు నన్ను పరిచయం చేశారు. ఈ విద్యాపీఠం (బెంగాలుకి) పొరుగు రాష్ట్రం బీహారులోని దేవగఢ్ ఊరి మగపిల్లలకు ఒక వసతి పాఠశాల. దాని అధిపతి అడిగిన మీదట నన్ను విద్యాపీఠానికి బదిలీ చేశారు. విద్యాపీఠం దగ్గర జీవితం వేరుగా ఉంది. పెద్ద పిల్లలకు ఇంగ్లీషు చెప్పేవాణ్ణి నేను. నన్ను ఆ పెద్ద పిల్లల వసతి గృహానికి సంరక్షకుడిగా చేశారు. అభిరుచి చూపించిన పిల్లలకు నా ఖాళీ టైములో మేజిక్, కరాటే నేర్పేవాణ్ణి.

పోకిరి పెద్ద పిల్లలు త్వరలోనే నాకు మంచి మిత్రులైపోయారు. 'కరాటే మహరాజ్' అనీ 'మేజిక్ మహరాజ్' అనీ నాకు మారుపేర్లు పెట్టేరు వాళ్ళు.

కేంద్రం పెద్దతో హుగ్లీ జిల్లా అంతటా తిరిగే అవకాశం దొరికింది నాకు. ఆ విధంగా శ్రీరామకృష్ణులతో సంబంధమున్న కామార్పుకూర్, జయరాం భాటీ మొదలైన ప్రాంతాల్ని దర్శించడం నాకు వీలుపడింది. పల్లె బెంగాల్ నాకు చాలా ఆకర్షణీయ మనిపించింది.

"ద్వాదశ జ్యోతిర్లింగాల్లో (దీప్తి ప్రతీకలు) ఒకటైన ప్రసిద్ధ వైద్యనాథ దేవాలయం విద్యాపీఠానికి ఏమంత దూరం కాదు. ఆ గుడిని నేను రెండుసార్లు దర్శించాను. వైద్యనాథ్ శివుడికి నివేదన చేయడానికి, ఆ నైవేద్యం పెట్టిన ప్రసాదాన్ని ఇంటికి తీసుకువెళ్ళడానికీ, మహాభక్తితో దానిని రుచి చూడడానికీ వీలుగా గంజాయిని (Marijuana) అమ్మడానికి అనుమతి ఉన్న ఒక షాపు ఉంది అక్కడ. బహుశా, ఆమ్స్టెర్డామ్ తప్పించి గంజాయిని బాహాటంగా అమ్మడానికి అనుమతి ఉన్నది ప్రపంచంలోనే ఇది ఒక్కగానొక్క ప్రదేశమనుకుంటాను. దగ్గర్లో ఇప్పుడు కీర్తిశేషులైన ప్రసిద్ధ బాలానంద్ బ్రహ్మచారి అప్పట్లో కట్టించిన ధ్యానగుహలున్నాయి. బాలానంద బ్రహ్మచారి గారు శ్రీ శ్యామాచరణ్ లాహిరీ గారి నుంచి క్రియాయోగాన్ని నేర్చుకున్నారు.

దేవగఢ్‌లో దగ్గరదగ్గరగా ఒక ఏడాది గడిపాను. అప్పుడే నాకు అక్కణ్ణించి కదిలిపోడానికి సంకేతమందింది. బాబాజీ ఒక రాత్రి కలలో కనిపించి "చాలించు ఇక ఈ స్కూల్ టీచర్ పాత్ర. కదులు. ఇప్పటికి ఇంటికి వెళ్ళిపో" అన్నారు. ఇదే విషయం మూడుసార్లు స్పష్టంగా తిరిగి తిరిగి చెప్పడం జరిగింది.

మర్నాడే నేను నా సామాను సద్దుకొని దేవగఢ్ వదిలేశాను. కొన్ని రోజుల్లో తిరిగి ఇంటికి వచ్చేశాను. అప్పటికి మా అమ్మానాన్నా చెన్నైకి మారిపోయారు. నేను ఒక మధ్యాహ్నం పూట వాళ్ళ చెన్నై ఇంటి దగ్గరకు చేరుకున్నాను. నేను చాలా దీర్ఘ సమయాల దాకా తరచు కనిపించకపోవడం, అకస్మాత్తుగా తిరిగి వస్తుండడమూ ఒక మామూలు కార్యక్రమం అయిపోవడం వల్ల అసలు నా రాకపోకలకు ఒక రకమైన పెద్ద ప్రతిస్పందనా ఉండేది కాదు. మా అమ్మానాన్నా మాత్రం నేనింకా బతికున్నానని చూసి వాళ్ళు ఆందోళన నుంచి విముక్తిని పొందేవాళ్ళు.

కొంతకాలంలోనే నేను కుదుటపడి మా నాన్న మొదలుపెట్టిన ఔషధాల వ్యాపారంలో సాయం చేయడం ప్రారంభించాను. నాకు వీలున్నప్పుడల్లా రామకృష్ణ మిషన్ కేంద్రం, ఆధ్యాత్మిక ప్రాముఖ్యత ఉన్న ఇతర ప్రాంతాల్నీ సందర్శిస్తూ ఉండేవాణ్ణి.

మా కొత్త ఇల్లు సముద్ర తీరానికి ఏమంత దూరం కాదు కనక నేను తరచుగా బీచ్‌కి వెళ్తూ ఉండేవాణ్ణి. నేను జె. కృష్ణమూర్తి గారి గ్రంథాలు (అంతకుముందు) చదివేను. కానీ వసంత విహార్‌లో ఉన్న కృష్ణమూర్తి ఫౌండేషన్ ప్రధాన కార్యాలయంలో ఆయనను సజీవంగా ఉపన్యసిస్తుండగా మొట్టమొదటిసారిగా విన్నాను. ఆయన వ్యక్తిత్వానికీ, ఉపన్యాసాల్లో సూటిగానూ ఉద్దేశానికి సంగతంగానూ ఉండే విషయాలకూ నేను ముగ్ధుణ్ణయ్యాను. కానీ ఆయనను వ్యక్తిగతంగా కలుద్దామన్న కోరిక మాత్రం నాకు అప్పుడు కలగలేదు.

నా స్కూలు రోజుల్లో నేను బాగా ఎరిగి ఉన్న త్రివేంద్రం రామకృష్ణ మిషన్ అధిపతి స్వామీ తపస్యానంద ఇప్పుడు చెన్నై రామకృష్ణ మిషన్ ముఖ్యుడిగా ఉన్నారు. విశ్వమంతటా ఉన్న రామకృష్ణ మిషన్‌కు ఆయన ఉపాధ్యక్షుడు కూడాను. బేలూరు మఠంలో ఉన్న మిషన్ అధ్యక్షుడికే కాక ఈయనకు కూడా, యోగ్యుడని అనుకున్న వాడికి రామకృష్ణ మూల మంత్రదీక్షనిచ్చే అధికారముందని నేను విన్నాను. ఎందుకోగాని ఆ మంత్రాన్ని గ్రహించాలన్న మహాకోరిక నాలో నిండుగా ఉండేది. ఒక ఆదివారం నేను మఠానికి వెళ్ళాను. ఆయనను కలుసుకొని నా కోరికను వెలిబుచ్చాను. కొద్దిపాటి తటపటాయింపు కూడా లేకుండా ఆయన "ఎల్లుండి గురుపూర్ణిమ. దీక్షకు సిద్ధమై రా. వచ్చే ముందు స్నానం చేసి, ఒక కొత్త ధోతీ, కొన్ని పూలూ, శ్రీరామకృష్ణులకు దక్షిణగా నివేదించడానికి కొంత డబ్బూ పట్టుకొని రా" అని అన్నారు.

ఆ విధంగా నేను శ్రీరామకృష్ణ మంత్రదీక్షను ఆ గురుపూర్ణిమ నాడు పొందేను. నాకు మంత్రదీక్షనిచ్చే కొన్ని నిముషాలూ స్వామీ తపస్యానంద గారి ముఖం కొంత ఎర్రబడి మెరిసింది. ఆయన ప్రత్యేకంగా కనిపించారు. నా హృదయ చక్రంలో స్పష్టంగా ఠాకుర్ (శ్రీరామకృష్ణులు) విరాజమానమై ఉండడం చూసి నా గుండె ఆనందంతో నిండిపోయింది.

బాబాజీ నుంచి మరో సంకేతం కోసం ఎదురుచూస్తూ మా అమ్మానాన్నల దగ్గర చెన్నైలో ఎనిమిది నెలలు గడిపాను.

# 40. ఆలందీ, షిర్డీ : ద్వారాల గుండా నడవడం

చెన్నైలో దివ్యజ్ఞాన సమాజ ప్రధాన కార్యాలయానికి కలిసి ఉన్న ఎలియట్స్ బీచ్ అనే ఒక వ్యక్తిగత బీచ్‌లో నేను నిశ్శబ్దంగా సముద్ర కెరటాలను పరికిస్తూ ఉండగా ఒక సాయంత్రం పూట బాబాజీ పిలుపు వచ్చింది. అక్కడెంత ప్రశాంతంగా ఉందంటే, చెన్నై వేడి వేసవిలో కూడా నాకు నిద్ర పట్టింది. బాబాజీ సుపరిచిత కంఠధ్వని నన్ను లేపింది – "ఆలంది దగ్గరున్న జ్ఞానేశ్వర సమాధికి వెళ్ళు. మూడ్రోజుల్లో బయల్దేరు" అని.

మర్నాడు రామకృష్ణ మఠం గ్రంథాలయంలో ఆ ఊరు ఎక్కడుందో తెలిసికొందామని అరగంటసేపు ప్రయత్నిస్తూ కూచున్నాను. ఆ గొప్ప మహారాష్ట్రీయ మహాత్ముడు జ్ఞానేశ్వర్ తాలూకు చిన్న జీవితచరిత్ర చదువుతూ, పూనే నుంచి ఆలంది పద్దెనిమిది కిలోమీటర్లు మాత్రమే అని తెలుసుకున్నాను. అంచేత రెండు రోజుల తరవాత పూనే వెళ్ళే రైలెక్కాను. అక్కణ్ణించి బస్సెక్కి ఆలంది చేరుకున్నాను.

అది నిజంగా చాలా ప్రశాంతమూ రమ్యమూ అయిన కుగ్రామం. జ్ఞానేశ్వర్ సమాధి గృహానికి నడిచి వెళ్ళాను. ఆ సమాధి చుట్టూ చాలామంది కూర్చొని ఉన్నారు. సంత్ జ్ఞానేశ్వర్ రాసిన 'జ్ఞానేశ్వరి'ని కొంతమంది చదువుతున్నారు. అది భగవద్గీతకు గొప్ప అనువాదమూ, వ్యాఖ్యానమూను. మిగిలిన వాళ్ళు కళ్ళు మూసుకుని ధ్యానం చేస్తున్నారు. చాలామంది పెద్దవాళ్ళే. బహుశా మహారాష్ట్రీయులు కావచ్చు. బాబాజీ మాత్రం కనుచూపు మేర దూరంలో లేరు. సమాధి నుంచి ఏమంత దూరం కాని ఒక రావిచెట్టు కింద చతికిలబడి గాఢమైన ఆలోచనలో కూరుకుపోయాను.

ఇక్కడ, సంత్ జ్ఞానేశ్వర్ గురించి సంక్షిప్తంగా చెప్పడం భావ్యంగా ఉంటుంది. జ్ఞానేశ్వరుడి తండ్రి విఠల్ పంత్. ఆయన సంసారాన్ని పరిత్యజించి, భార్య రుక్మిణీబాయికి చెప్పకుండా సన్యాసినైపోదామనే దృష్టితో బెనారస్‌కి వెళ్ళిపోయాడు. కాశీలో శ్రీరామానంద స్వామి శిష్యుడయ్యాడాయన. యాదృచ్ఛికంగా రామానంద స్వామి ఆలంది దర్శించినపుడు రుక్మిణీబాయి ఆయనను కలిసింది. ఆయన ఆవిడను "నువ్వు సుఖమయమైన దాంపత్య జీవితాన్ని గడుపుకుంటావు గాక!" అని దీవించారు. రుక్మిణి కళ్ళలో నీళ్ళు పెట్టుకొని తన భర్త కాశీకి వెళ్ళి సన్యాసి అయిపోవడం వల్ల అది సంభవం కాదని అంది. ఆమె మొగుడు తన శిష్యుడైన విఠల్ పంతేనని తెలుసుకొని రామానంద స్వామి తిరిగి కాశీ వెళ్ళినప్పుడు విఠల్ పంత్‌ను తెగడి, ఆలందికి తిరిగి పంపించేశారు. ఆలందిలో అతను తిరిగి భార్యను కలుసుకొని పునఃగృహస్థుడయ్యాడు.

నలుగురు మహాత్ములు వాళ్ళకు పిల్లలుగా పుట్టేరు. అయితే స్థానిక సాంప్రదాయక జనులు వాళ్లను వెలి వేశారు. అప్పటి సాధారణ నియమమేమిటంటే, సన్యాసి అయినవాడు గార్హస్థ్య జీవితానికి తిరిగి వస్తే అతనిని జాతిభ్రష్టుడిగా లెక్క వేయవలసినదేనని. అంచేత వాళ్ళు అధమతమ కులం కన్నా ఇంకా నీచంగా జమకట్టే వాళ్ళతో బాటు ఊరి పొలిమేరల్లో బతకాల్సి వచ్చింది.

పెద్ద కొడుకు గహినీనాథ్ శిష్యుడు. అతనికి నివృత్తినాథుడని పేరు. రెండోవాడు జ్ఞానేశ్వరుడు. అతను తన అన్నగారి శిష్యుడే అయ్యాడు. గొప్ప ఆధ్యాత్మిక సిద్ధి కారణంగా ఆయనను అన్నకన్నా గొప్పవాడిగా అనుకొనేవారు. (సోపాన్‌దేవ్ ఆయన తమ్ముడు) వాళ్ళ చెల్లెలు ముక్తాబాయి కూడా విశిష్టంగా పురోగమించిన యోగిని. ఈ పిల్లల అద్భుత జీవితం గురించి మహారాష్ట్రలో చాలా కథలు ప్రచలితమై ఉన్నాయి.

వేదాలు వల్లించిన బర్రె కథ నాకు చాలా ఇష్టం.ఆ కథ ఇది:

ఆ ప్రదేశంలోని సాంప్రదాయక పురోహితులు వేద పఠనం మీద పెద్ద పోటీలను పెడుతూన్నట్టు ఘోషించారు. శ్రేష్ఠుడిగా ఎన్నికగన్న వాడికి ఉత్కృష్టతమమైన బిరుదును ప్రదానం చేస్తారు. చాలామంది పండితులు పోగయ్యారు. వారిలో కుర్ర జ్ఞానేశ్వర్ కూడా ఉన్నాడు. పండితులు అగ్గిగుగ్గిలం అయ్యారు. కుల బహిష్కారం పొందినవాణ్ణి, పూర్వ సన్యాసికి పుట్టిన వాణ్ణి సాంప్రదాయక బ్రాహ్మణుల సభలో ఏవిధంగా పాల్గొనడానికి అనుమతించవచ్చును? అంచేత వాళ్ళు అతనిని దూషించి పొమ్మన్నారు. అతనొక కులభ్రష్టుడు కనకనే వేద పఠనానికి అనర్హుడని వాళ్ళన్నారు. ఏదేమైనా ఒక చిన్న కుర్రాడు ఎంతపాటి వేదాన్ని పఠించగలడుట? అతనికి వేదాలంటే ఏమిటో తెలుసునా అసలు అని వాళ్ళు వ్యంగ్యంగా ఎత్తిపొడిచారు.

"అదేమీ పెద్ద వ్యవహారం కాదు. బర్రె కూడా వేదాలను వల్లించకలదు" అని జ్ఞానేశ్వర్ అన్నాడు. అప్పుడాయన దారిన పోతూన్న గేదెను పిలిచి దాని తలమీద తన చేతిని పెట్టి దీవిస్తూ వేదాలను చదవమని దాన్ని ఆదేశించాడట. ఆ గేదె ఆయన మాటను శిరసావహిస్తూ, పరిపూర్ణ స్పష్టతతో వేదాలను వల్లించిందట. తన వాదాన్ని నిరూపించిన మీదట ఆయన ఆ సమూహంలోంచి బయటకు వెళ్ళిపోయాడుట.

చాలా చిన్న వయస్సులోనే ఆయన గీతమీద వ్యాఖ్యానాన్ని పూర్తి చేశాడు. దానిని 'జ్ఞానేశ్వరీ' అని అంటారు. అది గీతకన్నా కూడా (అక్కడి) ప్రజలలో బాగా వ్యాప్తి పొందిన పుస్తకం. ఆ వ్యాఖ్యానం పూర్తి కాగానే జ్ఞానేశ్వర్ తను వచ్చిన పని అయిపోయిందని, ఇక తాను బాహ్య ప్రపంచాన్ని వదిలిపెట్టే సమయమాసన్న

మయిందని ఘోషించాడు. ఆయన తాను పద్మాసనంలో కూర్చోడానికి వీలైనంత పెద్ద సమాధి బిలాన్ని తవ్వించుకొని దానిలోకి ప్రవేశించాడు. లోన కూర్చొని 'చివరి క్రియ' అనే శ్వాస ప్రక్రియను అభ్యసించి స్థిరమైపోయాడు. ఆయన ఆజ్ఞ ప్రకారం ఆ సమాధిని ఒక పలకతో మూసేశారు. దానిమీద సమాధి గృహాన్నొకదానికి కట్టేరు.

ఈ నిర్మాణాన్ని జ్ఞానేశ్వరుల జీవ సమాధి అని అంటారు. ఎందుకంటే ఆయనింకా సూక్ష్మరూపంలో ఉన్నారనే అందరూ నమ్ముతారు కనక. జనం ఆయనను గొప్ప మహాత్ముడిగా అనుకుంటుంది. ఆయన నాథశాఖకు చెందినవాడు. నాథ శాఖీయులు ఆయనను వారి ప్రఖ్యాత యోగుల్లో ఒకరిగా చెప్పుకుంటారు.

ఆ సమాధి ముందు నేను కూర్చొని ఉండగా, నా వెనుబాము కిందనున్న కుండలినీ శక్తి విప్పుకొని బుసకొడుతూ పైకి లేచి మొదట హృదయ కేంద్రానికీ తరువాత శిరఃకేంద్రానికి అప్రయత్నంగానే చేరుకుంది. నేను ఆనందంలోనూ ప్రదీప్తమైన తెల్లని వెలుగులోనూ స్నానం చేస్తూ గంటలకొద్దీ బయట ప్రపంచం గురించిన ఎరుక లేకుండా కూర్చుని ఉండిపోయాను. నేను తిరిగి ఈ లోకానికి వచ్చేసరికల్లా చాలా చీకటి పడింది. ఏదోవిధంగా నేను ఒక చౌల్ట్రీలో వసతిని సంపాదించగలిగాను. అక్కడ సాదా భోజనం కూడా సమకూర్చారు. నాలుగు రోజుల పాటు అక్కడ ధ్యానంలో నిమగ్నుణ్ణై ఆనందమయమైన సమయాన్ని గడిపాను. బాబాజీ జాడ లేదు గానీ అక్కడ నాకు బాగానే ఉంది.

అయిదో రోజు తెల్లవారుజామున నాలుగింటికి ధ్యానం చేసుకోడానికి సమాధి దగ్గరకు వెళ్లాను. అక్కడ ఒక ముసలాయన మాత్రమే ఉన్నారు. వాల్రస్ మీసంతో ఉన్న ఆయన జ్ఞానేశ్వరీ చదువుతున్నారు. నేను ఆయనకు కొంచెం దూరంగా కూర్చుందామని అనుకుంటూండగా, నా వైపుకు సాదాగా ఉన్న తెల్లని నడుము గుడ్డతోనూ పొడుగాటి జుట్టుతోనూ కౌమార దశలో ఉన్న ఒక చిన్న కుర్రాడు వస్తూండడం గమనించాను. అతను నవ్వి నన్ను కౌగిలించుకున్నాడు. నా శరీరమూ మనస్సూ ఆనందామృతంతో నిండిపోయాయి. బహుశా అతను జ్ఞానేశ్వర్ కావచ్చునన్న ఆలోచన నాకు వచ్చింది. అతను నాతో మృదువుగా హిందీలో 'నా అన్న మహేశ్వరనాథుడు సాయినాథ్ ఆస్థానంలో షిర్డీలో నీకోసం వేచి ఉన్నారు. ఈ రోజునే అక్కడికి వెళ్ళు" అని అన్నాడు.

అతను అప్పుడు సమాధి దగ్గరకు నడిచి అక్కడున్న మర్రిచెట్టు వెనక్కి వెళ్ళాడు. నేను ఆ చెట్టు దగ్గరకు వెళ్ళాను కానీ అతనెక్కడా కనిపించలేదు. అప్పుడు నాకర్థమయింది అదొక దర్శనమని. ఎంచేతనంటే జ్ఞానేశ్వరీ చదువుకుంటూ కూర్చున్న

ఆ ముసలాయన ఏదో అసాధారణాన్ని చూసిన వైనాన్నేమీ కనబరచలేదు. ఆయన చదువుతూనే ఉన్నాడు.

పూనే నుంచి షిర్డీకి వెళ్ళడానికి బస్సునొక దాన్నెక్కి రాత్రి బాగా పొద్దుపోయిన తరవాత చేరుకున్నాను. సమాధి సంస్థాన సముదాయం ముఖద్వారం దగ్గర బాబాజీ నిలుచొని ఉన్నారు: "రా,రా! అయితే, నువ్వు ఆ యువయోగిని కలును కున్నావన్నమాట. ఇక్కడ ఇప్పుడు అన్నీ మూసి ఉన్నాయి, కానీ, మనం సాయినాథుడు శయనం చేసిన 'చావడీ'కి వెళ్దాం" అని అన్నారు. మేము సమాధినీ గురుస్థానాన్నీ ధుని మండుతూ ఉండే ద్వారకామయినీ దాటి 'చావడీ' అనే చిన్న కట్టడం దగ్గరకు చేరుకున్నాం. కొన్ని ఊరకుక్కలు తప్పించి అక్కడ మరింకెవ్వరూ లేరు. చావడీకున్న కట్టె కవాటం మూసి ఉంది. ఇప్పుడు మేమేం చేస్తామబ్బా అని అబ్బురపడుతున్నాను. బాబాజీ 'నడు లోపలికి వెడదాం" అని అన్నారు.

"తలుపుకు తాళం ఉందిగా" అన్నాను నేను.

"నాకు తెలుసు. ఇప్పుడు నీ కళ్ళు మూసుకొని తలుపులోంచి వెళ్తున్నట్టుగానే నటించు" అని అన్నారాయన.

"కానీ బాబాజీ...."

"చెయ్యి అంతే. కళ్ళు మాత్రం తెరవకు"

కళ్ళు మూసుకొని నేను నా కుడి కాలును ముందుకు పెట్టి నా మోకాలిని వంచాను. ఏదో ఒక గుడ్డతెరను తోస్తున్నట్టనిపించింది. మిగతా నా శరీరమంతా తలుపుకు తగిలినప్పుడు కూడా అదే భావన కలిగింది నాకు. ఒక క్షణంలో ఆ భావన మాయమయింది. "సరే నీ కళ్ళు తెరు" అన్న బాబాజీ మాటలు వినిపించాయి.

నేను కళ్ళు తెరిచేసరికి చావడీ లోపల ఉన్నాం మేము. ఆ తలుపుకు ఇంకా తాళం వేసే ఉంది. బాబాజీ నా పక్కన నిలుచొని ఉన్నారు. తాళం వేసి మూసి ఉన్న తలుపులోంచి ఏదోవిధంగా నడవడమనే ఆశ్చర్యం నుంచి ఇంకా బయట పడకముందే అంతకన్నా అద్భుతమూ, నమ్మశక్యం కానిదీ అయిన మరో విషయాన్ని చూసి నేను అవాక్కయ్యాను.

పాత గుడ్డముక్కలను మెలి తిప్పి పేనిన తాడుతో కప్పు నుంచి వేలాడుతున్న సన్నని చెక్క పలక మీద షిర్డీ సాయిబాబా పడుకొని ఉన్నారు. షిర్డీ సాయిబాబా 1918లోనే చనిపోయారని అందరూ అంటారు! నేను ఆశ్చర్యంతోనూ భక్తిపూర్వక భయంతోనూ ఆయనను తేరిపారజూస్తుంటే నా వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

నా ఒళ్ళంతా కంపించింది. ఆ నేలకు మీద ఆయన కూర్చున్నారు. నేలకు ఆరడుగుల ఎత్తునున్న ఆ వింత పక్కమీంచి ఆయన ఎలాగ దిగి వస్తారబ్బా అని నేను విస్తుపోతూండగా, ఆయన నిమ్మళంగా పలక మీంచి జారి ప్రయత్నమేమీ లేకుండానే తేలుతూ కిందికి నేలమీదకు దిగారు. మామూలుగా ఆయన తలకు చుట్టబెట్టి ఉండే గుడ్డ మాత్రం లేదని గమనించాను. ఆయన గుండు పూర్తిగా తీసినట్టుంది. మా పక్కన నిలుచొని ఉన్నప్పుడు ఆయన అరడుగుల పొడుగుతో ఒక వస్తాదులాగ ఉన్నారు.

ఆయన బాబాజీని ముస్లిమ్ రీతిలో కౌగిలించుకున్నారు. వాళ్ళిద్దరూ మృదువుగా ఒకరి ముక్కునొకరు ముద్దెట్టుకున్నారు. నేను ఆయన పాదాల మీద సాష్టాంగపడ్డాను. ఆయన నన్ను లేవదీసి నిలబెట్టారు: "సలాం (శాంతి) కుర్రాడా! నీకు ఒక గొప్ప గురువున్నారు, ముర్షీద్. నాకూ ఒక గొప్ప గురువు ఉండేవారు, నా వెంకూశా. నేను చేసినదంతా ఆయనను తేరిపార చూడడమే. అల్లా మాలిక్ హై (భగవంతుడే యజమాని) రామ్ రామ్" అని అన్నారు.

"దయచేసి ఇతనిని ఆశీర్వదించండి బాబా" అని బాబాజీ అన్నారు.

"అల్లా మాలిక్ హై. నేను చేస్తూన్నలాటి పనినే నువ్వు చెయ్యాలి, కానీ మరోవిధంగా. సులభం కాదు, అబ్బాయి! ఈ లోకం పిచ్చిది, కానీ వాళ్ళు నేను పిచ్చివాణ్ణి అనుకున్నారు. హు అల్లాహ్, రామ్, రామ్, రామ్, రామ్. కబీర్ చేసిన పనిని చెయ్యి. గురువుగారి దీవెనలను తీసుకో". తన చెక్కపలక పక్కమీద వేసి ఉన్న దుప్పటి కిందచేయిపెట్టి, ఒక డబ్బు నోట్ల కట్టను తీశారు. "ఇదుగో, అల్లాహ్ భలా కరేగా (భగవంతుడు నీకు మంచి చేస్తాడు). ఈ డబ్బు తీసుకొని గంగాపూరు, పిఠాపురం, అక్కల్‌కోటా వెళ్ళు, వెళ్ళు, వెళ్ళు" అని అన్నారు.

నేనా డబ్బు తీసుకోడానికి తడపటాయించాను. బాబాజీ "తీసుకో" అని గుసగుసలాడారు. నేనా డబ్బు తీసుకొని తిరిగి ఆయన కాళ్ళమీద వాలేను. బాబాజీ సాయినాథ్ ఒకళ్ళనొకళ్ళు కౌగిలించుకున్నారు. మేము లోపలికి ఎలాగ వచ్చామో అదేవిధంగా బయటకు వెళ్ళాం. "మళ్ళీసారి మూసిన తలుపుల్లోంచి వెళ్దామని చూడకు. నీ ముక్కు పచ్చడి కాగలదు" అని బాబాజీ ఎకసక్కెమాడుతూ అన్నారు. అవతల ఇంకా చీకటిగానే ఉంది. కానీ కొద్దిసేపట్లోనే తెల్లారిపోతుంది ఇక.

"డబ్బు జాగ్రత్తగా ఉంచుకో. రేపు నీ ప్రయాణం ప్రారంభించు. నేనిప్పుడు వెళ్ళిపోవాలి. అవసరమైనప్పుడు నేను నిన్ను చూస్తాను" అని బాబాజీ అన్నారు. సాయినాథ్ చెప్పిన ఊళ్ళకు ఎలా వెళ్ళాలో సూచనలనిచ్చి ఆయన వెళ్ళిపోయారు.

తెల్లారిన తరవాత నేను గురుస్థానాన్నీ, సమాధినీ, ధుని మండుతున్న ద్వారకామాయినీ తిరిగి మరోసారి చావడినీ చూశాను. చావడిలో నిలుచొని, అక్కడున్న సాయిబాబా పెద్ద చిత్రాన్ని చూస్తూ, రాత్రి నాకు కలిగిన అసాధారణ అనుభవానికి విస్తుపోయాను. నాస్తా తరవాత, కోపర్‌గావ్ రైల్వేస్టేషన్‌కు బస్సులో వెళ్ళి రైలు కోసం ఎదురు చూస్తూ నిలుచున్నాను.

ఈ అధ్యాయం ముగించే ముందుగా, షిర్డీ సాయిబాబా జీవిత చరిత్రను సంక్షిప్తంగా చెబుతాను: 19 శతాబ్దిలో సగంపై చిలుకు ఏళ్ళు గడిచిన ఏదో ఒక సమయంలో మహారాష్ట్రలోని అప్పటి నిద్రాణమైన, అజ్ఞాత కుగ్రామం షిర్డీలో ఒక సంచార యువ మహాత్ముడు కనిపించాడు. ఆయన చూపులకు ఒక ముస్లిం ఫకీరులా ఉన్నారు. ఎవరికీ ఆయన పేరు తెలియదు. ఎక్కడ నుంచి వచ్చారో తెలియదు. కానీ, ఇప్పుడు సాయిబాబా సమాధి ఉన్న రోడ్డుకి అడ్డంగా అటువైపునున్న ఖండోబా దేవాలయం పూజారి మహల్సాపతి ఆయనను 'యా సాయీ' (మహాత్ముడా రా!) అని స్వాగతించాడు. ఆ పేరు అతికింది. ఆయనను సాయిబాబా అని అన్నారు.

ఏడాది పాటో మరికొంతో ఆయన షిర్డీలో ఉన్నారు. తన గురుస్థానమని పిలిచే వేపచెట్టు కింద నిద్రపోయేవారు. చాలాకాలం తరవాత, ఎవరో ఒకతను, ఒక సందర్శక మహాత్ముడి సూచనలను బట్టి, ఆ వేపచెట్టునంటుకొని ఉన్న స్థలాన్ని తవ్వగా ఒకానొక గుహకు తీసుకుపోయే సొరంగాన్ని కనుక్కొన్నాడు. ఆ గుహలో మూడు నూనె దీపాలు, ఇంకా ప్రదీప్తంగా వెలుగుతూ ఉన్నాయి. ఈ చోటునే ఇప్పుడు గురుస్థానమని అంటారు. కొంతకాలమైన తరవాత సాయిబాబా వెళ్ళిపోయారు; కానీ పొరుగునున్న రాహతా నుంచి వచ్చిన చంద్‌పాటిల్ అనే ముస్లిం తాలూకు పెళ్ళివారితో సహా తిరిగి వచ్చారు. దాని తరవాత, ఆయనెప్పుడూ షిర్డీని వదిలిపెట్టి వెళ్ళలేదు. ఆయన ఒక పాడుబడ్డ పాత మసీదులో ఉండేవారు. దానికే ద్వారకామాయీ అని తిరిగి పేరుపెట్టారు. మహాభారత సంబంధీకుడైన శ్రీకృష్ణుడున్న పురం పేరు ద్వారక.

అక్కడ సాయినాథ్‌గా కూడా పిలుపునందుకొనే సాయిబాబా, పవిత్రమైన అగ్నిని ధుని అనే పేరిట వెలిగించారు. ధునిని వెలిగించడమన్నది నాథ సంప్రదాయానికి అలవాటు. అక్కడే, రోజులో చాలాభాగం గడిపేవారు. సాయంత్రాలు ఆయన ఒక నూనె దీపాన్ని వెలిగించి, అందెలు కట్టుకొని పాడుతూ నాట్యం చేసేవారు. కొంతకాలం తరవాత చావడీని కట్టేరు. అక్కడ ఆయన రాత్రిని గడిపేవారు. ఆయన పడక ఒక సన్నని చెక్క పలక. నేలనుంచి ఆరడుగుల ఎత్తున పైనుంచి వేలాడుతూ ఉండేది.

చావడీ కప్పు మధ్యలోంచి చివికిపోయినట్టున్న పాత గుడ్డ పీలికలను మెలిపెట్టి అల్లిన తాళ్ళమీదుగా ఆ చెక్క వేళ్ళాడేది. ఏ రకమైన దృశ్యమాన ఆలంబనమూ లేకుండా ఆయన ఆ పక్కమీదకు ఎలాగ ఎక్కేవారో ఎవరికీ తెలియదు. పీలికల్లో చుట్టబెట్టిన ఇటుకే ఆయనకు తలగడ.

మడమల దాకా వచ్చే తెల్లని పొడుగుపాటి నిలువుటంగీని ధరించేవారాయన. తల చుట్టూ ఒక గుడ్డను చుట్టబెట్టుకొనేవారు. ఆయన బట్టలు తరచు మాసిపోయినట్టూ చిరిగినట్టూ ఉండేవి. ఆయన తలను గొరిగించుకునేవారు. ఒక ముస్లిం ఫకీరుకి మల్లే చక్కగా కత్తిరించినట్టున్న గడ్డమూ మీసమూ ఉండేవి. ఆయన మాటిమాటికీ 'రామ్ రామ్', 'అల్లాహ్ మాలిక్ హై' అనే మాటలను అంటూండేవారు. ఒక్కోసారి ఆయన పిచ్చివాడిలాగ ప్రవర్తించేవారు; కోపంతో మండిపడుతూ జనుల్ని కొడతానని దడిపిస్తూ ఉండేవారు. కానీ మరికొన్ని సందర్భాల్లో ఆయన ఎంతగా అనుకంపంతోనూ కరుణతోనూ ఉండేవారంటే ఆయనను ప్రతివాడూ ప్రేమించేవాడు.

షిర్డీలో ఆయన చాలా ఏళ్ళే ఉన్నారు. చాలా అద్భుతాలను చేసేవారు. తన దగ్గరకు వచ్చినవారి దుఃఖాలను రూపుమాపేవారు. 1886లో ఆయన మూడు రోజుల పాటు వైద్యపరంగా చనిపోయినట్టు పడున్నారు కానీ తిరిగి ఆయన శరీరంలోకి జీవం వచ్చింది. ఆయన 1918వ సంవత్సరం అక్టోబరు 15న చనిపోయారు. ఆయన చనిపోవడానికి ముందు, తన శరీరం చనిపోయిన తరవాత కూడా తాను షిర్డీలోనే ఉంటాననీ, శ్రద్ధాభక్తులతో అక్కడకు వచ్చేవాళ్ళతో తాను మాట్లాడతాననీ చెప్పారు. ఆ రాత్రి చావడీలో ఆ చిన్న నాటకం ఆయన ఆడకపోయి ఉంటే తీవ్ర సంశయాళువైన నా మనస్సు ఆ మాటను నమ్మి ఉండేది కాదు. అతి తక్కువ విశ్వాసమూ ఎక్కువ సంశయమూ ఉన్న నామీద కూడా అత్యంత దయ చూపిన ఆయనకు నేను ఎల్లప్పటికీ కృతజ్ఞతతో ఉంటాను; వంగి నమస్కరిస్తాను. పూర్తి వినయంతోనూ, ప్రేమతోనూ నేను ఆయనకూ, నన్ను షిర్డీకి తీసుకువెళ్ళిన నా ప్రియతముడైన బాబాజీకి మొక్కుతాను.

# 41. మరికొన్ని యాత్రలు : కొత్త అవగాహనలు

షిర్డీ నుంచి నేను గంగాపూర్‌కీ, నర్సోవాడికీ ప్రయాణం చేశాను. దత్తాత్రేయుల[1] అవతారంగా అందరూ విశ్వసించే మహాస్వామి నరసింహ సరస్వతి తన జీవితంలో చాలాకాలం నర్సోవాడిలోనే గడిపారు. అక్కణ్ణించి నేను స్వామీ సమర్థ అని అందరూ చెప్పే అక్కల్‌కోట మహారాజ్ సమాధి ఉన్న అక్కల్‌కోటకు వెళ్ళాను. ఈయనను కూడా దత్తాత్రేయ అవతారం అని విశ్వసిస్తారు.

ఆయన షిర్డీ సాయిబాబాకు సమకాలీనుడు. 1878లో చనిపోయారు. అక్కల్‌కోటలో ఒక మర్రిచెట్టు కింద ఉండేవారు కనక అక్కల్‌కోట మహారాజ్‌ను వటవృక్ష మహరాజ్ అని కూడా అంటారు. చాలా శక్తిమంతుడైన దివ్యపురుషుడుగా ఈయనకు ప్రతిష్ఠ ఉంది. చాలా అద్భుతాలను చేసిన ఈయనను మహారాష్ట్రలోనూ ఉత్తర కర్ణాటకలోనూ బాగా గౌరవిస్తారు. అక్కల్‌కోట మహరాజ్ పొడుగుపాటి దృఢకాయుడు. ఒక చిన్న గోచీ తప్ప మరేమీ ధరించేవారు కారు ఒంటి మీద. అక్కల్‌కోటలో కొలువుతీరి ఉన్నప్పుడు కూడా దూర ప్రదేశాల్లో ఉన్న భక్తులకు కూడా కనిపించేవారని చెబుతారు. మహారాష్ట్రలోని రాజసంబంధీకులైన పరిపాలకులు చాలామందీ, గ్వాలియర్ సింధియాలూ ఆయన అనుయాయులుగా ఉండేవారు.

నేను అక్కల్‌కోటలో మూడు రోజుల పాటు ఒక సత్రంలో ఉన్నాను. మూడో రోజున నాకు వచ్చిన స్పష్టమైన స్వప్నంలో అక్కల్‌కోట్కర్ మహరాజ్ ఎర్రగోచీ పెట్టుకొని కనిపించి "నేనూ షిర్డీలో ఉన్నవాడూ వేరుకాము. ఇప్పుడు నీవు పిఠాపురం వెళ్ళి శ్రీపాద వల్లభులకు నీ నమస్సులనర్పించు" అని చెప్పారు.

ఆంధ్రప్రదేశ్‌లో కాకినాడ దగ్గరున్న పిఠాపురానికి నేను ప్రయాణం కట్టాను. అక్కడ శ్రీపాద వల్లభుల గుడిని దర్శించాను. ఆయనను కూడా దత్తాత్రేయ అవతారంగా చెబుతారు. తరవాత కర్ణాటకలో గుల్బర్గా జిల్లాలోని మాణిక్‌నగర్‌కు వెళ్ళి మాణిక్ ప్రభు సమాధిని దర్శించాను. ఆయనను కూడా దత్తాత్రేయావతారంగానే చెబుతారు. శ్రీమాణిక్‌ప్రభు సమాధి దగ్గర నేను గాఢసమాధిలో ఉన్నప్పుడు నాకు బాబాజీ కనిపించి "చెన్నైలో ఉన్న నీ స్నేహితుడు బాలచంద్ర మెనన్ ఇంటికి వెళ్ళు. అక్కడ నుంచి సాధు వేషం వేసుకొని శివ అరుణాచలస్వామి స్థానమైన పవిత్ర తేజోగిరి తిరువణ్ణామలైకి వెళ్ళు. రమణ మహర్షి సమాధి దగ్గర కొంతకాలం గడుపు" అని చెప్పారు. నేను చెన్నైకి పోయి ఆయన చెప్పినట్టుగా చేశాను.

ఒక రోజు పొద్దున్న తెల్లారుతూనే నేను సన్యాసి వస్త్రాలు వేసుకొని నా మిత్రుడు మెనన్ ఇంటి నుంచి బయలుదేరాను. బస్సులోనూ, రైలులోనూ ప్రయాణం చేస్తూ,

అప్పుడప్పుడు నడుస్తూ నేను మొదట శ్రీరంగంలో ఉన్న రంగనాథస్వామిని ('జగన్నాటక ప్రభువు' అని అర్థం) దర్శించాను. ఇది అనంతుడనే ఐదు పడగల శేషుడి మీద శయనించిన విష్ణువు ఆలయం. శ్రీరామానుజాచార్యులు స్థాపించిన విశిష్టాద్వైత వేదాంత వర్గానికి చెందిన మహాముఖ్య ఆలయాల్లో ఒకటిగా దీన్ని అనుకుంటారు.

శ్రీరంగం దగ్గరలో వెల్లంకనీ మాత చర్చ్ అనే వర్జిన్ మేరీకి చెందిన ప్రసిద్ధ చర్చ్ ఉంది. ప్రతీ ఏడాదీ వేలాదిమంది సందర్శించే ఈ చర్చిలోకి వెళ్ళి కొన్ని నిముషాలు మౌనంగా కూర్చున్నాను. చర్చి లోపల చాలా నిశ్శబ్దంగానూ ప్రశాంతంగానూ ఉంది.

తరువాత నాగోర్ అనేచోట ఉన్న ఒక సూఫీ మహాత్ముడి సమాధి దర్గాకు నడిచి వెళ్ళాను. ఆ మహాత్ముడి పేరు అబ్దుల్ ఖాదర్. ఆయనను ప్రజాస్వామ్యం నాగోర్ ఆండవార్, అంటే నాగోర్ ప్రభువు, అని పిలుస్తారు. ఆయన గురించి చాలా అబ్బురపరిచే కథలను చెప్పుకుంటూ ఉంటారు. తరచుగా ఆయన కొన్నిరోజుల పాటు నేలమాళిగలోకి వెళ్ళిపోయి అదృశ్యమైపోయేవారు. బయటకు రాగానే ఆయన చిన్నపిల్లలకు చాలా భారీ మొత్తంలో మిఠాయిలను పంచిపెట్టేవారు. ఒక కథ చెబుతారు: ఆయన ఒకసారి తన వీపుమీద ఒక చిన్న కుర్రాణ్ణి ఎక్కించుకొని ఒక నిముషం పాటు కళ్ళు మూసుకోమని తరవాత తెరవమని అన్నారట. ఆ కుర్రాడు కళ్ళు తెరవగానే అతను పవిత్ర మక్కా పట్టణంలో ఉన్నాడుట. అదే పద్ధతిలో అతన్ని తిరిగి నాగోర్‌కు తీసుకువచ్చారుట. ఆశ్చర్యం తోటీ భయభక్తుల తోటీ ఉక్కిరిబిక్కిరైన ఆ అబ్బాయి తల్లిదండ్రులు అతనికి 'హాజీ – అంటే, మక్కాలోని హజ్‌కు యాత్ర జరిపినవాడు- అని పేరు పెట్టారు.

నాగోర్ నుంచి, ఒకలాగ చుట్టుతిరుగుడు దారినుపయోగించి, నేను తిరువణ్ణామలైకి బయల్దేరాను. దానికి కారణమేమిటంటే – కాంచీపురంలో వేంచేసి ఉన్న పెద్దవారూ మహా పూజనీయులూ శంకరాచార్యులూ అయిన కంచి మఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి గారిని చూద్దామని నా కోరిక.

ఆయనను కలుసుకొనే అవకాశాలు బొత్తిగా తక్కువే. ఎందుకంటే, ఆయన కొంతకాలంగా ప్రజలతో భేటీ కావట్లేదని విన్నాను. మహా అయితే, ఆయన సందర్శకులను దీవించడానికి వచ్చి కనిపించే కొద్దిసేపటిలో, దూరం నుంచి ఒక చూపు లభించవచ్చు. ఆచార్యులు మౌనంలో ఉన్నారు కనక నన్ను మాట్లాడవద్దనీ, ప్రశ్నలు అడగవద్దనీ హెచ్చరించారు. ఆయన మౌనాన్ని విడనాడారనీ కొన్ని మాటలు మాట్లాడవచ్చనీ సాయంత్రానికి మాకు సమాచారమందింది. జనం వరసగా నిలుచొని

ఒక చిన్ని పర్ణశాల ముందు, ఆయన కూర్చున్నచోటు మీదుగా దర్శనం చేసుకుంటూ ముందుకు నడిచిపోవాలి.

ఆయన ఒక దుర్బలమైన పెద్ద మనిషి; చాలా సన్నగా ఉన్నారు. నడుము చుట్టూ చుట్టబెట్టుకున్న ఒక కాషాయపు బట్ట, ఆయన తలకు ముసుగులాగ మరొక బట్టా తప్పించి మరేమీ బట్టల్లేవు. ఆయన ఒక దండాన్ని పట్టుకొని ఉన్నారు. ఆదిశంకరాచార్యులు స్థాపించిన దశనామీ సన్యాస వర్గాలకు చెందినవారని ఆయనను గుర్తింపజేసేది ఆ దండమే. దళసరి కళ్ళద్దాలున్నాయి; ఆయన నుదుటి మీద శివానుయాయుల చిహ్నమైన పవిత్ర విభూతి రాసి ఉంది. భక్తులు ఆయనను దర్శించి, కొద్ది దూరంగా సాగిలపడి, ముందుకు సాగిపోతూంటే ఆయన కుడిచేతిని యెత్తి దీవిస్తూ అప్పుడప్పుడు ఒకటి రెండు మాటలు మాట్లాడుతున్నారు. పవిత్ర యజ్ఞోపవీతాలను వక్షస్సుకు అడ్డంగా ధరించిన బలిష్ఠులూ దృఢకాయులూ అయిన బ్రాహ్మణులు జనసమూహాన్ని అదుపులో పెడుతున్నారు.

నేను ఆ వరసలో చేరాను. నేను సరిగ్గా ఆయన ఎదురుగా రాగానే, నావైపు నిశితంగా చూస్తూ తమిళంలో "నీ పేరేమిటి?" అని అన్నారు.

ఆచార్యుల పక్కన నిలుచుని ఉన్న దృఢ బ్రాహ్మణుడు సూచించినట్టుగా నోటికి చేతిని అడ్డంగా పెట్టుకుని నేను 'మధు' అని చెప్పాను. ఊపిరి ఆ మహాత్ముడికి సోకకూడదు అని దీని అభిప్రాయం.

ఆయన అస్ఫుటంగా నవ్వుతూ "నీ గురువు పెట్టిన పేరు కదూ! అవునా? న్యాయమూర్తి ఇస్మాయిల్ గురించి విన్నావా?" అని అన్నారు.

"లేదండీ" అని నేను నా తెలియనితనాన్ని ఒప్పుకున్నాను.

"ఆయన నీలాటివాడే. కానీ ఆయన కంబ రామాయణంలో మహాదిట్ట. ఊఁ, నువ్వు చాలా చెయ్యాలి. సత్సంగం చాలా ముఖ్యమైనది"

దానితో ఆయన కుడిచెయ్యి ఆశీస్సునిస్తూ పైకి లేచింది. అంతే, నన్ను ఆయన అనుచరులు ముందు నడవమన్నారు. చాలా ఏళ్ళ తరవాత, నా ఉద్యమంలో నాకు సాయం చేయడానికి ఒక ధర్మనిధిని ఏర్పాటు చేద్దామని మా స్నేహితులు భావించినపుడు (ఆయన చెప్పిన) 'సత్సంగం' అనే పేరు మనస్సుకు తటాలున గుర్తుకు వచ్చి, దానికి 'సత్సంగ్ ఫౌండేషన్' అని పేరు పెట్టడం జరిగింది. 'సత్' అంటే సత్యం, 'సంగ' అంటే కూటమి లేక గుంపు. ఆ శబ్దాన్ని మొత్తం, సత్యాన్ని కనుక్కొందామన్న సంకల్పమున్న జన కూటమి అని గానీ, మంచివారూ సత్యవంతులూ

అయిన జన సమూహమని గానీ అనువదించుకోవచ్చును. 'సత్యం' మీద అభిరుచితో ఒక చోటకు చేరడం అని కూడా అర్థం చెప్పవచ్చు. ఆచార్యులు నన్ను విడిచిపెడుతూ అన్నమాటలకూ దీనికీ ఏమన్నా సంబంధముందా అని నేను ఆలోచించాను.

తిరువణ్ణామలై చేరిన తరవాత, రామ్ సూరత్‌కుమార్ అని కూడా పిలువను అందుకొనే పంఖా బాబా అనే ఒక మహాత్ముడి కోసం ముందు వాకబు చేద్దామని నిశ్చయించు కున్నాను. కంచిలో ఒక రిటైర్డ్ ప్రొఫెసర్ చెప్పగా పంఖా బాబా అనే ఆయన శిశువు మాదిరిగానూ తరచు పిచ్చివాడుగానూ ప్రవర్తిస్తాడని విన్నాను. ఉత్తర భారతంలో ఎక్కడో ఆయన ఒక సమయంలో స్కూల్ టీచర్‌గా ఉండేవాడు. ఇంగ్లీషు, హిందీ భాషలు చక్కగా మాట్లాడతాడు.

గుడి రథం, పక్కన ఒక చిన్న గుడిసెలో ఆయన్ను చూశాను. ఆయన చుట్టూ కొంత మంది నిలుచొని ఉన్నారు. ఆయనది చక్కని గుండ్రటి ముఖం, పొడుగుపాటి పండబారిన జుట్టూ, వేలాడుతూన్న ముసలి గెడ్డంతో ఉన్న ఆయన ధోవతీ కట్టుకొని ఉన్నారు. ఆయన వేసుకున్న మీగడ వన్నె పాశ్చాత్య రీతి పాతకోటు బహుశా చాలా నెలల బట్టీ ఉతికినట్టుగా లేదు.

లోపలి నుంచే ఆయన నన్ను తేరిపారజూసి చేతిని ఊపుతూ, "రా, రా, కూచో ఇక్కడ" అని స్పష్టంగా ప్రేమ ఒలుకుతూన్న కంఠంతో పిలిచారు. నేను పాకలోకి దూరి కూర్చున్నాను. "దగ్గరగా, దగ్గరగా" అని ఆయన అంటే నేను ఆయనకు దగ్గరయ్యేంత దాకా ముందుకు జరిగాను – ఊం, నీ పేరేమిటి?" అని ఆయన అడిగారు.

"మధు, బాబా" అని నేనన్నాను.

"మధు, మధు" అంటూ ఆ పేరుని విని ఆనందిస్తూన్నట్లు కనిపించారు. "మధూ! అయితే నీకు నమాజ్ తెలుసునా?"

"తెలుసండీ. కాని నేనది చేయను. ధ్యానం చేస్తూ ఉంటాను" అని నేనన్నాను.

"ధ్యానం, నమాజూ అన్నీ ఒకటే. మెడిటేషన్, మధు – అన్నీ ఎమ్, ఎమ్, ఎమ్, ఎమ్. నువ్వు ఎమ్. హహ్హహ్హా" అని నవ్వారాయన. ఆ నవ్వు ఆయన కడుపులోతుల్లోంచి వచ్చి పెను అట్టహాసంగా వినిపించింది. "ఎమ్.ఎమ్, హహ్హా!"

ఆ పెనునవ్వుతో ఊగుతూ ఆయన తన కుడిచేత్తో నా భుజంమీద ఎంత గట్టిగా చరిచాడంటే నేను పట్టుకొని ఉన్న గుడ్డసంచీ నా చేతుల్లోంచి ఎగిరి ఆయన కాళ్ళ ముందు పడింది. ఆ సంచిలోంచి కొన్ని వేరుసెనగ కాయలు కిందికి దొర్లిపడ్డాయి.

"వేరుసెనగలు. ఈ బిచ్చగాడికి వేరుసెనగలంటే ఇష్టం" అని అంటూ ఆయన

కొన్ని వేరుసెనగల్ని చాలా అభిరుచితో తిన్నారు. "బాగుంది, బాగుంది. ఇప్పుడు నువ్వెక్కడికి పోతున్నావు?" అని అన్నారాయన.

"రమణాశ్రమానికి" అని నేను బదులు చెప్పాను.

మళ్ళీ ఆయన పగలబడి నవ్వారు. "రమణ అక్కడ ఉన్నాడా?" అని ఆయన అట్టహాస ధ్వనుల మధ్య అన్నారు. "అక్కడ ఆయన సమాధి మాత్రమే ఉంది. రమణని ఒకచోట ఉంచలేం. ఇక్కడ, అక్కడ, ప్రతిచోటా ఉంటాడు. సరే సరే వెళ్ళు సంతోషించు" అని అంటూ ఆయన మరో దెబ్బ కొట్టేరు నా భుజం మీద.

నేను వెళ్ళడానికి లేచాను. ఎవరో అన్నారు : "స్వామీ! నాకేమీ అక్కర్లేదు. మనశ్శాంతి మాత్రమే కావాలి" అని.

"మనశ్శాంతి!" అని అరిచారు పంఖా బాబా. ఆయన మొత్తం ఒళ్ళు బిగ్గర నవ్వుతో ఊగిపోయింది. "అతనికి మనశ్శాంతి కావాలట. ఈ బిచ్చగాడి మనస్సేమో ముక్కలైపోయింది. హహ్హా!"

నా సంచీని తీసుకొని, సాష్టాంగపడి, బయటకు వచ్చేశాను.

"ఎమ్, ఎమ్!" నా వెనక ఆయన కేక వేశారు. "మనస్సు ముక్కలైంది. మనస్సు లేదు. రమణకు చెప్పు".

నేను రమణాశ్రమం ఆఫీసుకు నడిచి వెళ్ళి వసతికోసం అడిగాను. ఇద్దరు సాధువులున్న ఒక శయనాగారంలో ఉండడానికి నాకు అనుమతినిచ్చారు. ఆ ఆశ్రమం చాలా ప్రశాంతమైన ప్రదేశం. పురాతన కాలం నుంచీ శివాయతనాల్లో ఒకానొక శ్రేష్ఠ ఆలయప్రదేశంగా పేరొందిన పవిత్ర తేజోగిరి అరుణాచలం, ఆశ్రమానికి అంత దూరమేమీ కాదు. శివుడి పవిత్ర హృదయకేంద్రంగా అరుణాచలాన్ని స్కాందపురాణం ఘోషించింది. భక్తియుతులైన యాత్రీకులు ఆ గిరి చుట్టూ, ముఖ్యంగా పూర్ణిమ నాటి రాత్రుల్లో, ప్రదక్షిణం చేస్తూ ఉంటారు.

రమణ మహర్షి పేరనే ఆ ఆశ్రమాన్ని పిలుస్తారు. ఆయన అరుణగిరిని ఒక గొప్ప ఆధ్యాత్మిక కేంద్రంగా భావించారు. ఆయన తన యౌవనంలో దానివైపుకు ప్రబలంగా ఆకర్షితులయ్యారు. ఇండియాలోనూ విదేశాల్లోనూ కూడా చాలామందికి శ్రీరమణ మహర్షి సుపరిచితులైనా, తెలియని వాళ్ళకోసం నేను ఆ మహాత్ముడి గురించి సంక్షిప్తంగా ఇక్కడ కొంత చెబుతాను.

1879లో డిసెంబర్ ముప్పైన తమిళనాడులోని ఒక చిన్న సుదూర కుగ్రామమైన తిరుచులీలో ఒక బ్రాహ్మణ కుటుంబంలో వెంకటరమణ (దీనినే తరవాత రమణగా హ్రస్వీకరించారు) పుట్టేరు. చూడముచ్చటగా తెలివిగా ఉన్న ఈ కుర్రాడికి బయటి

పనులంటే ఎక్కువ మక్కువ; ఎంత మత్తుగా నిద్రపోయేవాడంటే అతనిని లేపాలంటే చాలా ప్రయత్నం చేయాల్సి వచ్చేదిట. వెంకటరమణకు పన్నెండేళ్ళప్పుడు ఆయన తండ్రి సుందరం అయ్యర్ చనిపోయారు. అప్పుడాయన మదురైలో ఉన్న సుబ్బ అయ్యర్ అనే తన మామ దగ్గరకు వెళ్ళారు. ఆయనకు పదహారూ ఆ ప్రాంతాల్లో వయస్సున్నప్పుడు ఇక్కడే ఒక అసాధారణమూ స్వతస్సిద్ధమూ అయిన అనుభవం కలిగింది.

ఆయన మాటల్లోనే చెప్పాలంటే: "మధురైని పూర్తిగా వదిలి వెళ్ళిపోదామను కొనడానికి దాదాపు ఆరు వారాల ముందు నా జీవితంలో గొప్ప మార్పు వచ్చింది. అది చాలా ఆకస్మికంగా వచ్చింది. మా మామయ్య ఇంటి మొదటి అంతస్థులో నేను ఒంటరిగా కూర్చొని ఉన్నాను. నాకు రోగం రావడమే అరుదు. ఆ రోజున నా ఆరోగ్యంతో వచ్చిన ముప్పేమీ లేదు. కానీ అకస్మాత్తుగా దారుణమైన మృత్యుభయం నన్నావరించింది. నా ఆరోగ్య స్థితిలో అటువంటి దానికి కారణం లేదు; నేను దేనికో ముడి పెడదామని కూడా అనుకోలేదు; ఆ భయానికి కారణమేదైనా ఉందా అని చూడ్డానికీ నేను ప్రయత్నించలేదు. నేను చనిపోబోతున్నానని మాత్రమే నా భావన. ఇప్పుడు దీని విషయంలో నేనేమి చేయాలన్న దాని గురించి ఆలోచించడం మొదలుపెట్టాను. ఒక డాక్టరు దగ్గరకో, లేకపోతే పెద్దల దగ్గరకో, మిత్రుల దగ్గరకో పోయి సంప్రదిద్దామని కూడా నాకు తట్టలేదు. అప్పుడే అక్కడే నేనీ సమస్యను పరిష్కరించాలని నాకనిపించింది.

"మరణభీతి అనే హఠాత్తుగా వచ్చిన ఆ దిగులు నా మనస్సును అంతరంలోనికి తోసింది. నిజంగా మాటల్లో పెట్టకుండానే నేను నాలో ఇలా అనుకున్నాను: ఇప్పుడు చావు వచ్చింది. దీని అర్థమేమిటి? ఇక్కడ చచ్చిపోయేదేమిటి? ఈ శరీరం చచ్చిపోతుంది. వెంటనే చావు రావడాన్ని నేను నటించాను. శవంలో అవయవాలు బిగుసుకుపోయి గట్టిపడినట్టుగా, నేను నా అంగాలన్నిటినీ చాచి అవి గట్టిపడ్డాయని భావిస్తూ, నా విచారణకు ఎక్కువ వాస్తవికతను ఆపాదించడానికి నేను శవస్థితిని అనుకరించాను. ఊపిరిని కుంభించాను. ఒక్క ధ్వని కూడా 'నేను' అని గానీ, ఏ ఇతర మాటగానీ పలకడానికి వీలు లేకుండా నా పెదవుల్ని గట్టిగా మూసి ఉంచాను. సరే మరి, ఈ శరీరం చచ్చిపోయింది కదా అని నేను నాతో చెప్పుకున్నాను. కట్టెలా బిగుసుకుపోయిన దీనినిప్పుడు శ్మశానానికి తీసుకువెళ్లి కాల్చేసి బూడిదగా చేసేస్తారు. కానీ ఈ శరీరం చావగానే నేనూ చచ్చిపోయానా? ఈ శరీరాన్నే నేనా? ఇదేమో మాట్లాడదు. జడంగా పడి ఉంది. కాని నేను మాత్రం నా వ్యక్తిత్వం తాలూకు పూర్తి

శక్తిని అనుభవించగలుగుతున్నాను. నాలోని 'నేను' అనే కంఠధ్వని కూడా శరీరం నుంచి వేరుగా ఉంది.

"అంచేత నేను శరీరాన్ని మించిన చైతన్యాన్ని. శరీరం చనిపోతుంది కాని దానిని మించి ఉన్న చైతన్యాన్ని తాకలేదు. అంటే, నేను మరణమే లేని చైతన్యాన్ని అన్నమాట.

"ఇదంతా కూడా మందకొడి ఆలోచనేమీ కాదు; అది నాకు సుస్పష్టంగా సజీవమైన సత్యంలాగ దాదాపుగా ఏ ఆలోచనా ప్రక్రియా లేకుండానే సూటిగా, ప్రత్యక్షంగా దర్శనమిచ్చింది. "నేను" అనేది ఏదో చాలా యథార్థమైనది. అదే, నా ప్రస్తుత స్థితిలో, ఒకే ఒక్క నిజం. నా శరీరంతో సంబంధించి ఉన్న అచేతనతో కూడిన చేష్ట అంతా ఈ "నేను" మీదనే కేంద్రీకృతమై ఉంది. ఆ క్షణం నుంచీ మొదలుపెట్టి ఒక శక్తివంతమైన పరవశత్వం "నేను" లేక "ఆత్మ", తనమీద తానే అవధానాన్ని నిలుపుకొని కూర్చుంది. చావు తాలూకు దడువు బొత్తిగా మాయమైపోయింది. ఆ సమయం నుంచీ ఆత్మనిమగ్నత అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉంది.

"ఇతర ఆలోచనలు, సంగీతంలోని వివిధ స్వరాల్లాగ, వచ్చిపోతూ ఉండవచ్చు కానీ "నేను" అనేది మాత్రం అన్ని స్వరాలతో కలుస్తూ అన్నిటికీ ఆధారమై ఉండే ప్రధాన 'శ్రుతి' లాగ కొనసాగుతూనే ఉంది. ఈ శరీరం మాట్లాడడంలో గానీ, చదవడంలో గానీ, లేకపోతే ఇంకేదైనా పనిలో గానీ నిమగ్నమై ఉండవచ్చు గాక, నేను ఇంకా ఆ 'నేను' మీదనే ఏకాగ్రతతో నిలిచి ఉండడం జరుగుతూ ఉంది. ఈ సంక్షోభానికి ముందు, నాకు నా ఆత్మ గురించిన స్పష్టమైన అవగాహన లేదు, నేను ఎరుకతో దానివైపుకు ఆకర్షితుణ్ణి కూడా కాలేదు. స్పష్టమైన, లేకపోతే, ప్రత్యక్షమైన అభిరుచి దానిలో నాకు లేదు; శాశ్వతంగా దానిమీదే నిలిచిపోవాలనే ఏ రకమైన మొగ్గుదలా అసలు లేనే లేదు".

దీని ఫలితంగా ఆయన త్వరలోనే మధురైని వదిలి పెట్టారు. వెళ్తూ వివరణగా తాను ధర్మతత్పరతతో 'సత్యాన్ని' అన్వేషించదానికే పూనుకున్నాను కనక, తనకోసం వెదకవలసిన అవసరం లేదని రాసి మరీ బయల్దేరారు. 'అరుణాచలం' అనేమాట ఆయనను ఎప్పుడూ ఆకర్షిస్తూనే ఉంది. ఇప్పుడు, తనకు తానే విప్పుకొని ప్రత్యక్షమైన అంతరాత్మలో నిరాటంకంగా నిమగ్నమై ఉండిపోవాలన్న నిర్నిరోధమైన ప్రేరణతో ఆయన అరుణాచలానికి వెళ్ళడానికి రైలెక్కారు. సెప్టెంబరు 1896లో ఏదో ఒక

సమయాన ఆయన తిరువణ్ణామలై రైల్వేస్టేషన్‌కి చేరుకున్నారు. పావన తేజోగిరి అయిన అరుణాచలం రూపంలో ఉన్న తేజోరూప కాంతి ప్రతీక అయిన పరమాత్మ, తన ప్రియమైన అరుణాచల శివుడు ఉన్న స్థానానికి ఆయన చేరుకున్నారు.

అరుణాచల శివ దేవాలయానికి త్వరగా నడుస్తూంటే తన గుండె ఆనందంతో కొట్టుకుందని శ్రీరమణులే స్వయంగా చెప్పారు. గర్భగుడిలోకి ప్రవేశించి అత్యంత పారవశ్యంతో ఆయన అరుణాచలేశ్వర లింగాన్ని కౌగిలించుకున్నారు. మదురైలో ప్రారంభమైన దాహక సంవేదన ఇప్పుడు మాయమై కాంతిలో కలిసిపోయింది. తన గుండె మధ్యలోనే సత్యమైన పరమానందాత్మను కనుగొన్నారు కనక ఆయన ప్రయాణం అంతమయిపోయింది. ఆ తరవాత, ఆ ఉచ్ఛ స్థితిలో నిమగ్నమై ఉండిపోడానికి ఆయన ఏకాంతాన్ని మాత్రమే కోరుకున్నారు.

మొదట, గుడి తాలూకు నేలమాళిగలో ఉన్నారు. స్థానికుడైన శేషాద్రి స్వామి అనే మహాత్ముడు ఆయనను కనుక్కొని "ఎవరూ గుర్తించని వజ్రముంది ఇక్కడ" అని ఘోషించారు. ఈ దయామూర్తి, తేళ్ళు కుట్టిన ఆయన (రమణ) శరీరానికి పరిచర్య చేశారు. త్వరలోనే ఆయన మరొక ఏకాంత దేవాలయానికి, అక్కణ్ణించి మరో చోటికి- అలాగ వరసగా కదులుతూనే ఉన్నారు. ఆయనెప్పుడూ మాట్లాడేవాడు కాదు కనక ఆయననందరూ మౌన బ్రాహ్మణ స్వామి అని అనేవాళ్ళు. ప్రచారాన్ని తప్పించుకోడానికి ఆయన కొండకు చేరుకున్నారు. వివిధ గుహల్లో ఏకాంత ఆలయాల్లోనూ కొంతకాలం గడిపిన తరవాత, విరూపాక్ష గుహలో పదిహేడేళ్ళ పాటు స్థిరపడ్డారు.

త్వరలోనే పరిచారకులూ భక్తులూ ఉన్న ఒక చిన్న సమూహం ఆయన చుట్టూ చేరింది. మహా విద్వాంసుడూ ఆధ్యాత్మిక జిజ్ఞాసువూ అయిన కావ్యకంఠ గణపతి శాస్త్రిగారు అక్కడకు వచ్చారు. సనాతన ఉపనిషత్తులు చెప్పే ఉచ్ఛతమ సత్యస్థితిలో సుప్రతిష్ఠితుడైన ఒక మహర్షి ఇక్కడ జీవించి ఉన్నాడన్న మాటను మొదట వ్యాపించేలాగ చేసిన వ్యక్తి ఈయనే.

ఆయనకు తొలి పాశ్చాత్య అనుయాయుడని చెప్పదగిన ఎఫ్.హెచ్. హాంఫ్రీస్ అనే ఒక బ్రిటిష్ పోలీస్ ఆఫీసరు కూడా ఇక్కడే ఆయనను కలుసుకున్నాడు. రమణ మహర్షి తల్లి కూడా వచ్చి ఇక్కడే స్థిరపడ్డారు. ఆవిడ చివరి రోజు వరకూ కొడుకుతోనే ఉంది. అప్పటికి ఆయనను శ్రీరమణ మహర్షి అని పిలవడం మొదలుపెట్టారు. ఈ బిరుదును కావ్యకంఠ గణపతి శాస్త్రిగారు ఇచ్చారు. కొంతమంది ఆయనను 'భగవాన్'

అని కూడా పిలిచారు కానీ ఆయన మాత్రం తిరువణ్ణామలైకి మొదట వచ్చినప్పుడెంత సాదాగా ఉన్నారో ఆ తర్వాతా అంత సాదాగానే ఉన్నారు.

విరూపాక్ష గుహ నుంచి మహర్షి స్కందాశ్రమానికి మారేరు. కొండవాలు మీద దీనిని ఒక భక్తుడు కట్టాడు. ఆయన తల్లి పోయినపుడు ఆ స్కందాశ్రమానికి కొంత దూరంలోనే ఆవిడను పూడ్చిపెట్టారు. తరవాత, మహర్షి తన తల్లి సమాధి చుట్టూ పెరిగిన చిన్న ఆశ్రమానికి మారిపోయారు. 1950లో ఆయన శరీరాన్ని వదిలేవరకూ అక్కడే ప్రశాంతంగా బతికారు. ఇంగ్లీషు మాట్లాడే భారత జనానీకానికీ సమస్త ప్రపంచానికీ శ్రీరమణ మహర్షి బాగా తెలియడానికి కారణం ఆయనను కలుసుకున్న ఒక బ్రిటిష్ పాత్రికేయుడు, పాల్ బ్రంటన్, రాసిన పుస్తకాలే.

రమణ మహర్షి ప్రయాణం చెయ్యలేదు. తరవాతి ఏళ్ళలో తన దర్శనం కోసం వచ్చే జన సమూహాలకు ఎప్పుడూ లభ్యమవుతూ, మౌనంగా బోధిస్తూ ఆయన తిరువణ్ణామలైలోనే ఉన్నారు. చాలా తక్కువ మాటలే మాట్లాడేవారు. కానీ ఆయన సన్నిధిలో చాలామంది, అలజడి చేసే ఆలోచనలు వాటికవే అణిగిపోగా, చెప్పలేనంత శాంతినీ నెమ్మదినీ పొందేవాళ్ళు.

నేను తిరువణ్ణామలైలో శ్రీరమణ మహర్షి సమాధి దగ్గర, స్కందాశ్రమంలోనూ విరూపాక్ష గుహలోనూ, అరుణాచలం మీద ఇతర ప్రదేశాల్లోనూ ధ్యానం చేస్తూ మూడు రోజులు గడిపాను. చివరి రోజున ఏకాంతాన్ని చవిచూస్తూ తాబేలు రాతి మీద ఒక్కణ్ణే కూర్చొని ఉండగా, మునుపటిలాగ ఇప్పుడు బాబాజీ తాలూకు భౌతిక సన్నిధి లేదే అనే వెలితిని నేను అనుభవించట్లేదని తటాలున తెలుసుకున్నాను. తిరువణ్ణామలైలో నన్ను కలుసుకుంటారేమో అని నేను అనుకున్నాను కానీ ఆయన రాలేదు. అయితే అది నా స్థైర్యాన్ని తారుమారు చెయ్యలేదు.

సూర్యుడు మహావేడిగా ఉన్నాడు; వీస్తున్న గాలీ వేడిగానే ఉంది. కానీ నా గుండె మాత్రం నా వక్షస్సులో ఎక్కడో ప్రారంభమై తల వరకూ వ్యాపించిన ఉల్లాసకరమైన వెచ్చదనంలో నిమగ్నమై ఉంది. ఆ గాలి ఒక చిరిగిన కాగితం ముక్కను తెచ్చి నా కాళ్ళ దగ్గర పడేసింది. నేను దానిని తీశాను. ఏదో ఒక పుస్తకంలోని అచ్చొత్తిన పేజీలో భాగం అది. దానిని చదువుతూంటే, అవి శ్రీరమణ మహర్షి మాటలని అర్థమయింది. దానిలో ఉన్నదిది:

"మనం ఎంత ఎక్కువగా అణకువతో ప్రవర్తిస్తే అంత మంచిది మనకు. ఇతరులకు దానంగా ఇచ్చేది ప్రతీదీ, నిజానికి, ఏకాత్మకు చేసే నివేదనే. తనకు సంబంధం లేని దానిని దేనినీ కోరుకోకపోవడమే వైరాగ్యమంటే. తన ఆత్మను పట్టుకొని

ఉండడమే జ్ఞానం. దురభిమానం నుంచి విడివడడం. వైరాగ్యమూ జ్ఞానమూ ఒకటే. ప్రతివాడూ తనలోకి లోతుగా మునిగి అమూల్యమైన ఆత్మను అవగతం చేసుకోవాలి. దేవుడూ గురువూ ఒకరే. గురువు అనుగ్రహం పొందినవాడెప్పటికీ నిరాకృతుడు కాడు. కానీ శిష్యుడేమో....."

ఆ క్షణమే నాకు తట్టింది బాబాజీ నా మనస్సులోని ఒక విడదీయరాని భాగమని. తానే అయినవాణ్ణి తానేవిధంగా కోల్పోగలడు? అదీ అసలు సంగతి.

తిరువణ్ణామలైనుంచి నేను చెన్నై తిరిగి వచ్చి ఇంటి దగ్గర పది నెలలున్నాను. మా నాన్నకు ఆయన ఫార్మస్యూటికల్ వ్యాపారంలో సాయం చేస్తూ పగళ్ళు గడిపేను; సాయంత్రాలు సముద్రతీరంలో నడకకు వెళ్ళేవాణ్ణి. రెండుసార్లు కృష్ణమూర్తి ఫౌండేషన్ ప్రధాన కార్యాలయానికి వెళ్ళి జె. కృష్ణమూర్తి గారి ఉపన్యాసాన్ని విన్నాను. బాబాజీ నాకు కృష్ణమూర్తిని కలుసుకోవాలని చెప్పినా ఆ క్షణంలో మాత్రం ఆ రకమైన మొగ్గుదల నాకు కలగలేదు. ఆదివారాలు నేను మామూలుగా దివ్యజ్ఞాన సమితి గ్రంథాలయంలో గడిపేవాణ్ణి. లేకపోతే, పురాతన కపాలేశ్వర దేవాలయానికి వెళ్ళేవాణ్ణి. అప్పుడప్పుడు షిర్డీ సాయిబాబా గుడికి వెళ్ళేవాణ్ణి; లేకపోతే, ఎగ్మోర్ రైల్వేస్టేషన్ దగ్గరున్న సూఫీ మహాత్ముడు మోతీ బాబా దర్గాకి వెళ్ళేవాణ్ణి.

నడిమి సమయంలో "ప్రోబ్" (Probe) అనే వర్ణచిత్ర పత్రికకు దక్షిణ భారతదేవాలయాల మీద, హిమాలయాల్లోని ఆలయాల మీద వ్యాసాలను రాయడం ప్రారంభించాను. ఒక రోజున అండమాన్ దీవుల్లోని పోర్ట్‌బ్లెయిర్ నుంచి ప్రచురితమయ్యే 'ద అండమాన్ టైమ్స్' (The Andaman Times) అనే చిన్న వార్తాపత్రిక గురించి చదివాను. వార్తాపత్రికల నుంచీ పుస్తకాల నుంచీ అండమాన్ దీవుల గురించి అంతా చదివి వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. ఆ సంపాదకుడికి ఉత్తరం రాస్తే అతను నన్ను (విలేఖరిగా) నియోగించి సహకరించడానికి ఇష్టపడ్డాడు. అంతే, నేను పోర్టుబ్లెయిర్‌కి ఓడెక్కాను. ఈసారి మా అమ్మానాన్నలకు నాకు ఉద్యోగం వచ్చిందని, పాత్రికేయుణ్ణి కాబోతున్నాని చెప్పి మరీ బయలుదేరాను. ఈ ఒక్కసారికైనా వాళ్ళు సంతోషపడ్డారు.

---

1. సృష్టికర్త బ్రహ్మ, సర్వపోషకుడు విష్ణువూ యోగిదేవుడు శివుడూ ముగ్గుర్నీ కలబోసిన దివ్య అవతారమే దత్తాత్రేయుడని అంటారు. తం విధించిన నియమాలను కూడా, ఇతరమైన అన్ని నియమాలతో సహా పాటించకుండా, గాలిలాగ స్వేచ్ఛగా తిరిగే పవిత్రజనుల రక్షక దేవత ఈయన. ఇటువంటి వాళ్ళని అవధూతలని అంటారు. వారిలో దిసమొలతో ఉండేవాళ్ళను దిగంబరులని అంటారు. 'అవధూతగీత'లో అవధూతల అలవాట్లూ బోధనలూ ఉంటాయి.

# 42. తాజ్ ముంబై దగ్గర బాబాజీ

పర్యటక శాఖ వాళ్లు యాత్రికులను ఏదోవిధంగా ఆకర్షించడానికి చేసే ప్రకటనరీత్యా అండమాన్ దీవులు 'బంతిపూసూరీడి నేల''. అది నిజంగా ఒక సుందర ప్రదేశమే. నా పాత్రికేయ ప్రాతినిధ్య పత్రంతో సాధారణ పర్యటకుడు వెళ్ళలేని అండమాన్ నికోబార్ దీవుల్లోని భాగాల్లోకి కూడా నాకు ప్రవేశం దొరికేది. నరభక్షకులని చెప్పుకునే జరావాలుండే జరావా రిజర్వ్‌లోకీ వెళ్ళగలిగాను. ఉప్పు ఉపయోగం కూడా తెలియకుండా, ఒంటరిగా ఉన్న ఉత్తరాది కావలి దీవుల్లో (North Sentinel Islands) నివసించే సెంటినెలీస్ అనే పొడుగాటి బట్టలేని నిగ్రాయిడ్ జాతుల్ని కూడా చూశాను.

స్థానిక రాజకీయ నేతల మధ్య ఉండే రాజకీయ రచ్చలకు నేను అగుపడేవాణ్ణి. నా ప్రెస్ కార్డుతో ఎవరి కార్యాలయంలోకైనా స్వేచ్ఛగా నడచి వెళ్ళగలిగేవాణ్ణి. వార్తలనెలాగ పోగు చెయ్యాలో, ఉన్న చోటుకు సరిపోయేలాగ సమాచారాన్ని, ముఖ్య విషయాలను పోగొట్టకుండా, ఏ విధంగా కుదించాలో అనే విషయాలను నేర్చుకున్నాను. ఇది, కథానికలను రాయడానికి నేను చేసిన ప్రయోగాల్లో నాకు బాగా సాయపడింది. నేను రాసిన 'ద ఐలెండ్ బాయ్' (The Island Boy) అనే కథానికను ఢిల్లీ హిందూస్తాన్ టైమ్స్ వారు ఈ పత్రిక తాలూకు కల్పిత కథాసాహిత్య పుటల్లో ప్రచురించారు. చారిత్రకంగా పోర్టుబ్లెయిర్ ఒక ఆకర్షణీయమైన ప్రదేశం. (దాన్ని గురించి) నేను ప్రధాన భూభాగంలోని వార్తాపత్రికలను చాలా వ్యాసాలను రాశాను. ఉదాహరణకు, రెండో ప్రపంచ యుద్ధ సమయంలో, దాన్ని కొన్ని రోజులపాటు జపాన్ వారు ఆక్రమించి చెన్నై (అప్పటి మద్రాసు) మీద బాంబులను వేయడానికి ఒక స్థావరంగా ఉపయోగించారు. పోర్టుబ్లెయిర్ పట్టణానికి చాలా దగ్గరగా భూగర్భంలో సొరంగాలూ, రక్షణ స్థానాలూ కనిపిస్తాయి. పోర్టుబ్లెయిర్‌లో అపఖ్యాతిపాలైన వేరువేరు చిన్న చిన్న గదులున్న జైలు కూడా ఒకటి ఉంది. అక్కడే మొండి నేరగాళ్ళను బ్రిటిషువాళ్ళు నిర్బంధించి ఉంచేవాళ్ళు. దానిని తర్వాత వీర సావర్కార్ లాంటి రాజకీయ విప్లవవాదులను ఖైదు చేయడానికి ఉపయోగించారు. ఆ ప్రదేశం గురించి చాలా వ్రాయవచ్చును. వ్రాయడం గురించి అలా ఉంచి, ఆ ప్రదేశం మాత్రం ధ్యానానికి చాలా బాగా పనికివచ్చే ప్రదేశం అని చెప్పాలి. పట్టణంలోని చాలా భాగాల నుంచి కొన్ని నిముషాల్లోనే బీచ్‌కు చేరుకోవచ్చును.

నేను పూర్తిగా ఒక ఏడాది అండమాన్ దీవుల్లో ఉండి ఆనందించాను. సంపన్నుడైన ఒక మోపలా వ్యాపారికో, లేకపోతే, ఒక ఎస్టేట్ యజమానికో

అల్లుడైపోయే ప్రమాదం నుంచి నన్ను చాలా జాగ్రత్తగా కాపాడుకుంటూ గడిపాను. దీవిలో ఉండే సంపన్నులైన వలస జనం, ప్రధాన భూభాగం నుంచి వచ్చే యువకులూ, విద్యావంతులూ అందగాళ్ళూ అయిన మగాళ్ళ కోసం గాలం వేస్తూ ఉండేవాళ్ళు, తమ ఆడపిల్లలనిచ్చి పెళ్ళి చేయడానికి. అక్కడి ఆడపిల్లలు నిజంగానే అందంగానూ చురుకుగానూ ఉన్నారు. కానీ నన్ను ముందరే హెచ్చరించబట్టి నేను చాలా జాగ్రత్తలు తీసుకున్నాను.

ఒకే ఒక్క అప్రీతికరమైన ఘటన జరిగింది: వడపోయని నీరు తాగడం వల్ల నాకు అమీబయోసిస్ రోగం అంటుకుంది. రాత్రిళ్ళు దోమతెర ఉపయోగించాను గనక మెదటి చలిజ్వరం (Cerebral Malaria) అనే మరో సంభావ్య అపాయం నుంచి తప్పించుకున్నాను. ఆధ్యాత్మిక ప్రాముఖ్యమున్న గొప్ప విషయమేమీ జరగలేదు అక్కడ. ఒక ఏడాది కాగానే, నేను రాజీనామా ఇచ్చి కలకత్తాకు ఓడలో వచ్చాను. అది మూడు రోజుల సముద్ర ప్రయాణం.

కలకత్తా చేరిన తరవాత, నేను మళ్ళీ బేలూరు మఠమూ దక్షిణేశ్వర్ దగ్గరి కాళీమాత దేవాలయమూ సందర్శించాను. దక్షిణేశ్వర్‌లో ఉన్న యోగదా సత్సంగ సొసైటీ ప్రధాన కార్యాలయాన్ని కూడా సందర్శించాను. (అక్కడ) మృదుభాషీ నిండు సజ్జనుడూ అయిన ఆ వర్గంవారి పెద్ద అమెరికన్ స్వామి, స్వామీ శాంతానంద గారితో 'క్రియ' గురించి వ్యక్తిగతంగా చర్చించాను.

పట్టణానికి (కలకత్తాకి) తిరిగి రాగానే, తెలిసిన ఒకాయన, ప్రసిద్ధ క్రియాయోగ గురువూ, శ్రీగురు బాబాజీ శిష్యుడూ అయిన (శ్యామాచరణ్ లాహిరీ) మనుమడు శ్రీ సత్యచరణ్ లాహిరీ, ఆయన అనుయాయి ఇంట్లో బసచేసి ఉన్నాడని చెప్పారు. నేను శ్రీసత్యచరణ్ లాహిరీని కలుసుకొని ఒక గంటపాటు ఆయనతో చర్చించాను. ఆయన ఉదార స్వభావుడూ, సంస్కారవంతుడూను. ఆయన తాతగారు శ్యామాచరణ్ లాహిరీ మహాశయుల గురించి అంతవరకూ తెలియని కొన్ని సంగతులను నాకు చెప్పారు. మేము క్రియాయోగం గురించి కూడా పర్యాలోచన జరిపాం. కరెస్పాండెన్స్ కోర్సుల ద్వారా క్రియాయోగాన్ని బోధించడం సాధ్యపడదన్న విషయంలోనూ, దానికి గురుశిష్యుల మధ్య సన్నిహితమైన వైయక్తిక సంపర్కం అవసరమన్న విషయంలోనూ ఆయన నాతో ఏకీభవించారు.

మనఃస్ఫూర్తిగా నవ్వుతూ, ఆయన ముంబైలో తన పర్యటనల్లో ఒకసారి తనను కలుసుకున్న ఒక ఆవిడ గురించి చెప్పారు. తాను హిమాలయాలకు ఎలా వెళ్ళిందీ,

శ్రీగురు బాబాజీని ఎలా కలుసుకున్నదీ చెప్పింది ఆవిడ. పరమహంస యోగానందగారు ఆవిష్కరించిన పదం 'మహావతార్ బాబాజీ'ని ఆవిడ శ్రీగురు బాబాజీకి బదులు ఉపయోగించింది. ఆయనతో (శ్రీ గురు బాబాజీతో) ఆవిడ మూడు గంటల పాటు ధ్యానం చేస్తూ గడిపినట్టు చెప్పిందిట. ఆ సమావేశం కథ చెప్పిన కొన్ని నిముషాల తరవాత ఆవిడ శ్రీసత్యచరణ్ లాహిరీని తనకు క్రియాయోగ దీక్షనిమ్మని అడిగిందిట. ఆయన నిరాకరించాడుట. "బాబాజీని కూడా ఒక వ్యాపారాంశంగా మార్చేశారు" అని బాధగా తలను ఊపుతూ సత్యచరణ్ లాహిరీ అన్నారు. "నా మాటలను గమనించండి. రాబోయే కాలంలో ప్రతి అప్పన్నా సుబ్బన్నా వెంకన్నా బాబాజీతో ప్రత్యక్ష అనుసంధానం తమకు ఉందని చెప్పుకుంటూ, మంచి వ్యాపారమే చేస్తారు దానితో" అని అన్నారు.

కలకత్తా నుంచి నేను కాశీకి వెళ్ళాను. బెనారస్‌కిది నా రెండోసారి ప్రయాణం. కాశీ విశ్వనాథుడి దేవాలయాన్ని తిరిగి చూద్దామన్న కోరికతో బాటు సారనాథ్‌కి వెళ్దామన్న కోరిక కూడా ఉంది నాకు. అక్కడ బుద్ధుడు తన తొలి ధర్మోపదేశం చేసి, ఆయనే పేరు పెట్టి వ్యవహరించిన 'ధర్మచక్రాన్ని" కదిలించి పురోగమింపజేశాడు. దారిలో, రాజ్‌ఘాట్‌లో కృష్ణమూర్తి ఫౌండేషన్ వాళ్లు నడుపుతున్న కృష్ణమూర్తి కేంద్రమూ, వసంతకాలేజీ, స్కూలూ అనే వాటిని చూశాను.

ఇంకా కొంత సమయం పయనించడానికి అవసరమైన డబ్బును నేను దాచి ఉంచానని లెక్కలేసుకొని, ముంబైకి వెళ్ళి ఎలిఫెంటా గుహలు చూడవచ్చు గదా అని ఆలోచించాను. కాశ్మీర్‌లోని అనంతనాగ్ దగ్గరున్న భాంజో గుహాలయాలకు మల్లేనే, ఈ గుహలను కూడా పురాతన కాలంలో దీక్షాకర్మకాండలకు ఉపయోగించేవాళ్ళని నాకు బాబాజీ చాలాకాలం క్రితమే చెప్పారు. గేట్ వే ఆఫ్ ఇండియా నుంచి పడవలో వెళ్తే అవి కొద్ది దూరంలోనే ఉన్నాయి. పర్యటకులు ఉపయోగించే చాలా పడవల్లో ఒక పడవలో నేనెక్కి, కొంతసేపట్లోనే ఆ గుహలను చేరుకున్నాను.

మరాఠీలో ఎలిఫెంటా గుహలను ఘరాపురీ గుహలని అంటారు. అవి అరేబియా సముద్రంలోని ఒక ద్వీపంలో ఉన్నాయి. వాటికి మూల సంస్కృత నామం 'అగ్రహారపురి' అని బాబాజీ నాకు చెప్పారు. 'అగ్రహార' అంటే 'అతి ముఖ్యమైన కంఠహారం' అని అర్థం. బ్రాహ్మణ సమాజం ఉండే ప్రదేశాన్ని సూచించడానికి ఈ మాటను ఉపయోగిస్తారు. ఆ రోజుల్లో అతి ఉత్కృష్టంగా వికసించిన ఆధ్యాత్మిక రహస్య దీక్షితులను మాత్రమే బ్రాహ్మణులని వ్యవహరించేవారనీ, అటువంటి బోధక

సమాజమే ఆ గుహల్లో నివసించేవారనీ బాబాజీ దీనికి కారణంగా నాకు వివరించి చెప్పారు. కొత్త శిష్యుల్ని అక్కడికి తీసుకొచ్చి రహస్య ప్రక్రియల్లో దీక్షనిచ్చేవాళ్ళు. ఏ కారణం చేతనో పోర్చుగీస్ వాళ్ళు ఈ గుహల్ని ఎలిఫెంటా అని పిలిచారు. 17వ శతాబ్దిలో లక్ష్యాన్ని కొట్టే అభ్యాసంలో ఉపయోగిస్తూ అక్కడున్న చాలా శిల్పాలను పాడుచేశారు.

రాతితో తొలిచిన ఆ గుహా సముదాయంలో ఒక ప్రధానమైన గది, ఇతర ఆవరణలూ, ఉప ఆలయాలూ ఉన్నాయి. వాటిలో చాలా గొప్ప ఉబ్బెత్తు శిల్పాలూ (Reliefs), చెక్కిన శిల్పాలూ ఉన్నాయి. అక్కడ శివాలయం ఒకటి ఉంది. శివుడు యోగుల అధిష్ఠాన దేవత. గదిలో శివుడు అర్ధనారీశ్వరుడిగా (సగం మగ-సగం ఆడగా) ఉన్నాడు - ఎడమ భాగం స్త్రీ శక్తిని సూచిస్తూ సుందర స్త్రీ ఆకృతిని కనబరుస్తోంది; కుడి భాగం పురుష లక్షణంతో శివుడి సుసౌష్ఠవ పురుష ఆకృతిని కనబరుస్తోంది.

ఇది (అర్ధనారీశ్వర రూపం) ఒక పరిపూర్ణ యోగికి ప్రతీక అని బాబాజీ చెప్పారు. పరిపూర్ణుడైన యోగి తనలోని స్త్రీ పుం లక్షణాలను సంతులనం చేసుకుంటాడు. ఈ సంతులనాన్ని సాధించడానికి వెనుబాము రెండు పక్కల ఉన్న ఇడా పింగళా శక్తులను కూర్చి, మెదడూ, వెనుబాములు వ్యవస్థలో మధ్యనున్న సుషుమ్నా నాడిని తెరిపించుకుంటాడు యోగి. ఈ మధ్య నాడి తెరచుకున్నవాడే జ్ఞానవంతుడైన యోగి. మధ్యనాళిక (నాడి) తెరచుకొన్నప్పుడు మహా సృజనాత్మక శక్తి నిరాటంకంగా నర్తిస్తూ పైకి లేచి శివ మహాసన్నిధికి చేరి, శిరశ్చక్రంలో అతని కౌగిలిని పొందుతుంది. మహా పారవశ్యాన్ని కలిగించే ఈ సంయోగమే మనిషిని మహావ్యాప్తమైన చైతన్యంతో విశేష మానవునిగా మారుస్తుంది.

గుహ అవతల ఇరవై అడుగుల ఎత్తున్న పొడుగాటి త్రిమూర్తి శివశిల్పముంది. ఈ శిల్పమూర్తి సృష్టి స్థితి లయల చిహ్నాలను కలబోసి చేసినది. హాలులో నటరాజ రూపంలో పారవశ్యంతో నృత్యం చేస్తూన్న నాట్యచక్రవర్తి శివుడి విగ్రహం ఉంది. ఆ మహాద్భుత శిల్పాలను చూస్తూ నేను విస్తుపోయాను. ఎప్పుడో సుదూరమైన గడిచిన కాలంలో వీటిని చూసిన జ్ఞాపకాలు నా మనస్సులో మెరిశాయి. కొంతసేపు నేను ధ్యాన నిమగ్నుణ్ణయ్యాను. అప్పుడు నేను మళ్ళీ ప్రధాన భూభాగానికి వెళ్ళాలని గుర్తుకు తెచ్చుకొని బోటెక్కి, గేట్ వే ఆఫ్ ఇండియాకి తిరిగి వెళ్ళాను.

గేట్ వే ఆఫ్ ఇండియా నుంచి, టాటాల సొంతమైన వైభవోపేత తాజ్‌మహల్ పేలస్ హోటల్ కనిపిస్తుంది. అదొక అద్భుత వాస్తు శిల్పం. శతాబ్దంపై చిలుకుగా

ద్వాని మహాద్వారాల ద్వారా రాజులూ, వాణిజ్య దురంధరులు, రాజకీయవేత్తలూ, సమాజపు వివిధ శ్రేణుల్లోని ప్రభావశాలులూ విజయం చేశారు. ముంబై పౌరులకు అది గేట్ వే ఆఫ్ ఇండియా కంటె తక్కువ ముఖ్యమైన స్మృతి చిహ్నం కాదు. నేను తాజ్‌మహల్ హోటల్ ముఖద్వారం వరకూ నడిచి అక్కడున్న, ఒకే మాదిరి దుస్తులు ధరించిన కావలివాళ్ళను చూస్తూ నిలుచున్నాను. లోపలికి వెళ్ళి చాలా ఖరీదైన కాఫీని తాగి, లోపలంతా చూసి వద్దామా అని ఆలోచించాను. అప్పుడే, నిగనిగలాడే నలుపూ, పైన అలంకరణ కోసం వేసిన రంగు పొరతో ఉన్న మెర్సిడెస్ కారు ప్రవేశద్వారానికి సుతారంగా జారుతూ వచ్చి ఆగింది. యూనిఫాంలో ఉన్న కారు డ్రైవరు కారులోంచి ఇవతలకు ఉరికి కారు తలుపులు తీశాడు. ముందు తలుపులోంచి పూర్తిగా గెడ్డం గీసుకున్న ముఖంతో, సూటు వేసుకున్న ఒక మధ్య వయస్కుడూ, శరీరచ్ఛాయను బట్టీ సాధారణ వేషభాషలూ స్వభావాన్ని బట్టీ నాకు పార్సీలాగ అనిపించిన వాడూ దిగాడు. వెనకవైపు తలుపులోంచి సొగసైన లేత లేడివన్నె పాశ్చాత్య దుస్తుల్లో ఉన్న ఒక అందమైన యువతీ, మూడు భాగాల్లో ఉన్న ముదురు నీలం సూటూ, అదే రంగు తలపాగానూ పెట్టుకున్న పొడుగాటి, చూడచక్కగా, ముచ్చటగా ఉన్న ఒక సర్దార్జీ (సిక్కు) దిగారు. సిక్కు పెద్దమనిషీ ఈ యువతీ ఇద్దరూ చలవ అద్దాలు పెట్టుకున్నారు.

ఆ సిక్కు పెద్దమనిషే నా అవధానాన్ని తదేకంగా ఆకర్షించాడు. ఆయనలో ఏదో నాకు సుపరిచితమనిపించింది. ఆయన నడకలోని ఠీవా? లేక, ఆయన ఆరడుగుల పొడగరితనమా? లేక, ఆయన మహాముచ్చటైన ఒంటిరంగూ, అందమైన లక్షణాలా? - ఏదబ్బా అని నేను తెలుసుకుందామని అనుకుంటూండగా ఆయన తన చలవ అద్దాలను తీశాడు. ఆయన కళ్ళను చూశాను. ఆయన వాస్తవంగా నావైపే చూస్తున్నారు. ఆ కళ్ళను గురించి నేనెప్పుడూ పొరబాటు పడను; ఆయన బాబాజీయే, నా మిత్రుడూ, నా మాస్టారూను. బాబాజీ సర్దారుగా మారువేషంలో ఉండడం చూసి, నాకు, అది చాలా సరదా సన్నివేశమనిపించి నవ్వుతో ఊగిపోయాను నేను. సర్దారు తన సహచరులతో ఏదో గుసగుసలాడారు. వాళ్ళు హోటల్లోకి వెళ్ళిపోయారు. ఆయన నేను నిలుచున్న చోటుకు, నా వైపుకే వచ్చారు. "మధూ, ఆ ముసిముసి నవ్వులు ఆపు. జనం మధ్యలో సాగిలపడి నమస్కరించవద్దు" అని అన్నారు.

ప్రయత్నపూర్వకంగా నేను నవ్వును నిగ్రహించుకొని "అసలు ఏం సంగతండీ మీరు సర్దార్‌లాగ వేషం వేసుకున్నారు బాబాజీ?" అని అడిగాను.

"రా" అని అన్నారు. మేము ఇద్దరం రోడ్డు దాటి గేట్ వే ఆఫ్ ఇండియాకు వచ్చాం. "నువ్వు నాతో వచ్చినవాళ్ళను చూశావు కదా! వాళ్ళు పార్సీలు. బాగా పాశ్చాత్యీకృతమైన అతి సంపన్న కుటుంబానికి చెందిన వాళ్ళు. మొగుడు ఒక పెద్ద పారిశ్రామిక సామ్రాజ్యానికి అధ్యక్షుడు. అతని భార్య విదేశాల్లో చదువుకున్న యువతి. ఒక తాగుబోతుగా తయారయింది. ఆ అమ్మాయి తండ్రికి నేను గురువును. ఆమె తండ్రి మరణశయ్య మీద, నేను అతని ఒక్కగానొక్క కూతురి మంచిచెడ్డల్ని చూస్తానని మాట ఇచ్చాను. ఆ మాటను ఇప్పుడు నిలబెట్టుకుంటున్నాను. నేను ఆధ్యాత్మిక శక్తులున్న ఒక సిక్కు వ్యాపారినని ఆవిడ అనుకుంటోంది. నేను ఆమె తండ్రికి గురువునన్న మాటనూ అంగీకరిస్తోంది. ఆమె నాన్నకు నేను ఏభై ఏళ్లు పైగా తెలిసి ఉన్నవాణ్ణయినప్పటికీ, నేనింత యువకుడిలాగ కనిపిస్తున్నానేమిటబ్బా అన్నదే, ఆ దంపతుల్ని దిగ్భ్రాంతికి గురి చేస్తోంది.

"ఆమె ఇప్పుడు మెరుగుపడిందా?" అని నేనడిగాను.

"కొంత సమయం పడుతుంది. కాని ఆమె మారుతుంది. నిన్ను ఆశ్చర్యపరిచే పద్ధతిని ఉపయోగిస్తున్నాను. అప్పుడప్పుడు ఆవిడతో కూర్చొని నేనూ తాగుతూ ఉంటాను. త్వరలోనే ఆవిడ తనకు తానుగా తాగుడు మానేస్తుంది. వింత పద్ధతే. కానీ, కొన్నేళ్ళ తరువాత నువ్వు కూడా బహుశా ఇదేవిధంగా, నీ పూర్వజన్మల్లో నీతో లంకెపడి ఉన్న కొంతమంది ప్రత్యేకుల విషయంలో చేస్తావు. ఇప్పుడు నేను బార్‌లో తాగడానికి ఆమెతో పాటు కూచోవాలి. అయితే నువ్వు ఎలిఫెంటా గుహలు చూశావన్నమాట?" అని అన్నారు.

"అవును బాబాజీ!" ఆ అద్భుత శిల్పాలన్నీ చూశాను"

"సరే మరి. నేనిప్పటికి వెళ్తున్నాను. నువ్వు ఇంకా తాజ్‌లోకి వెళ్ళి ఒక కప్పు కాఫీ తాగాలనుకుంటున్నావా?"

"లేదండి."

"నువ్వు ముంబై విడిచి వెళ్ళేముందు హాజీ అలీ దర్గాను తప్పకుండా చూడు. అప్పుడు ఢిల్లీ వెళ్ళి కొంతకాలం అక్కడ గడుపు. అక్కడ నీకు పాత్రికేయుడి ఉద్యోగం దొరుకుతుంది. ఏడాదో, ఆపైనో అయిన తరవాత, నువ్వు చెన్నై వెళ్ళి జిడ్డు కృష్ణమూర్తిని కలుసుకో. నువ్వు కలవవలసిన ముఖ్యుల్లో అతను చివరివాడు. నువ్వు ఆధ్యాత్మికంగా పరిపక్వం కావడానికి వీలుగా కృష్ణమూర్తి నీకు కొన్ని సాధనాలను సమకూరుస్తాడు.

ఢిల్లీలో ఉన్నప్పుడు, కాశ్మీర్ వెళ్ళి అనంతనాగ్ దగ్గరున్న గుహాలయాలను దర్శించు, ఇప్పుడు నువ్వు నా పాదాలను తాకు, కానీ సాగిలపడవద్దు"

"సర్దార్ బాబాజీ" వెళ్లి తాజ్‌మహల్ పేలస్ హోటల్‌లోకి ప్రవేశించారు. సముద్ర తీరానికి దగ్గరగా అరేబియా సముద్రంలోని ఒక చిన్న రాతి దీవిమీద కట్టిన హాజీ అలీ దర్గాను సందర్శించాను. ప్రధాన భూభాగం నుంచి ఒక రోడ్డు తిన్నగా అంతదాకా వెళ్తుంది.

దాదర్‌లో దారి పక్కనున్న ఒక చిన్న భోజనశాలలో మంచి రుచికరమైన మహారాష్ట్రీయ పగటి భోజనాన్ని తిని న్యూఢిల్లీకి టికెట్టు కొనుక్కున్నాను. అదృష్టవశాత్తూ మర్నాటికే ఒక స్లీపర్ టికెట్టు లభ్యమయింది. ముంబై సెంట్రల్ స్టేషన్ దగ్గర్లో నా బాడుగ వసతిలో రాత్రికి పడుకొని, మర్నాడు పొద్దున్న న్యూఢిల్లీ రైలు ఎక్కాను.

# 43. లక్ష్మణ్ బొ, జె. కృష్ణమూర్తులను కలుసుకోవడం

న్యూఢిల్లీ రైల్వేస్టేషన్లో రైలు దిగిన నాకు పహాడ్‌గంజ్ ప్రాంతంలో ఉన్న చిన్న వసతిగృహంలో ఒక గది దొరికింది. త్వరగా స్నానం చేసి, ఇంగ్లీషు వారపత్రిక 'ఆర్గనైజర్' (Organiser) ఆఫీసుకి ఆటో రిక్షాలో వెళ్ళాను. అప్పుడు నాకు అది, అతివాద దక్షిణ పక్ష రాష్ట్రీయ స్వయంసేవక సంఘమనే హిందూ వ్యవస్థ తరఫున ప్రచురణ కొనసాగిస్తుందన్న విషయం తెలియదు. నాకు సంబంధం ఉన్నంత వరకూ ఢిల్లీలో నేనెరిగిన ఎడ్రస్ అదొక్కటే. నా మిత్రుడు నాయర్ "ఏక్సెంట్" (Accent) మేగజిన్‌ను మూసేసి చెన్నైకి తిరిగి వెళ్ళిపోయాడు; బాబాజీ శిష్యుడైన పంజాబీ వర్తకుడు చనిపోయాడు.

'ఆర్గనైజర్'' తాలూకు చెన్నై విలేఖరిని నాకు మా మిత్రుడు నాయరే పరిచయం చేశాడు. ఈ విలేఖరి పేరు నేనిప్పుడు మర్చిపోయాను. అతను నన్ను హిందూ ధర్మం తాలూకు అర్థాన్ని గురించీ, నేను పుట్టుకతో హిందువుని కాకపోయినా ఎందుకని హిందువుగా నన్ను నేను చెప్పుకోడానికి గర్విస్తున్నానో (దానికి కారణం నేను గొప్పదీ పురాతనమైనదీ అయిన హిందూస్తాన్‌కు చెందినవాణ్ణి కావడం) దాన్ని వివరిస్తూ ఒక వ్యాసం వ్రాయమని ప్రోత్సహించాడు. "నన్ను హిందువని వ్యవహరిస్తే నేనెందుకు గర్వపడుతున్నాను" అనే శీర్షికతో వ్రాసిన వ్యాసాన్ని "ఆర్గనైజర్" ప్రచురించిన తరువాత, నేను మరికొన్ని హిందూ తత్త్వాలకూ, మతానికీ సంబంధించిన వ్యాసాలను కూడా ఇచ్చాను. ఆ విధంగా నేను అప్పటి సంపాదకుడు, (కీ॥శే॥) కేఆర్ మల్కానీతో సంపర్కంలో ఉండేవాణ్ణి. నాకు వ్రాసిన ఉత్తరంలో ఆయన నేనెప్పుడైనా ఢిల్లీకి వస్తే తనను కలుసు కోవాలని వ్రాసాడు.

నేను కలుసుకున్నప్పుడు మల్కానీగారు పక్కాగా సాహెబ్ లాగా పూర్తిగా పాశ్చాత్యీకృతుడై ఉన్నారు. ఆయన ఆర్ఎస్ఎస్‌తో కూర్చి చెప్పే, ముస్లిం అంటే ద్వేషమూ, క్రిస్టియన్ అంటే వ్యతిరేకతా అనే లక్షణాలను పూర్తిగా వేరుగా కనిపించారు. అయితే, (ఆయనే కాకుండా) నానాజీ దేశ్‌ముఖ్ లాంటి మరికొన్ని మినహాయింపులు ఉన్నాయనుకోండి. ఆరెస్సెస్‌లో బహుకాలం నుంచీ ఉన్న ఆయన పూర్తిగా లోపలిదాకా నిష్పక్షపాతి. మల్కానీజీ తనకుగా తాను నన్ను ఈ నానాజీ దేశ్‌ముఖ్ దగ్గరికి తీసుకువెళ్ళి పరిచయం చేశారు. అలాగే యువకుడైన తన ఉపసంపాదకుడు బాలశంకర్‌ని కూడా నాకు పరిచయం చేశాడు. బాలశంకర్ నాలాగే కేరళీయుడు.

బాలశంకర్ ఢిల్లీలో నాకు వసతిని చూసి పెట్టాడు. వాళ్ళ వంటవాళ్ళు వండుకొనే యువ కేరళీయ ఆరెస్సెస్ గణసమూహంతో నేను విడిదిని పంచుకోవాలి. ఇక్కడే

ఆరెస్సెస్ సిద్ధాంతాలూ, దాని అంతర్గత క్రియాకలాపాలూ మొట్టమొదటిసారిగా బట్టబయలై నాకు అగుపడ్డాయి. వాళ్ళు భవ్యమైన నెట్‌వర్కుని పెంపొందించుకున్నారు. మనం అసంభవం అనుకునే ప్రదేశాల్లో కూడా ఆరెస్సెస్ మనుష్యులు అవుపిస్తారు. మాటవరసకు, ఢిల్లీలో నాతోబాటు ఉన్న ఆరెస్సెస్ యువకుల్లో ఒకడు తరవాతి కాలంలో ప్రధానమంత్రి పీవీ నరసింహారావు గృహకార్యాలయ సిబ్బందిలో ఒకడుగా ఉండేవాడు. అతను పీవీ నరసింహారావుగారు భగవద్గీతమీద నా కేసెట్‌ను వింటూండగా తాను చూశానని నాకు రాశాడు.

అలాగే, ప్రచార సాధనాల్లోనూ, న్యాయవ్యవస్థలోనూ, సైన్యంలోనూ, ఉద్యోగాల్లోనూ అన్నిచోట్లా ఆరెస్సెస్ మనుష్యులూ, లేకపోతే వారి సానుభూతిపరులూ ఉన్నారు. వారి సిద్ధాంతాల గురించి ఏమి చెప్పుకున్నా సరే కానీ, వారందరూ మంచి పనిమంతులుగానూ పూర్తి క్రమశిక్షణాయుతులుగానూ నాకు కనిపించారు.

నానాజీ దేశ్‌ముఖ్ నన్ను చూసిన వెంటనే నామీద ప్రేమాతిశయాన్ని కనబరిచారు. నా వ్రాతల నమూనాలు చూసిన తరువాత, నన్ను ఆ తరవాతి సోమవారం దీన్‌దయాల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ (DRI) సంచాలకుడు శ్రీదేవేంద్ర స్వరూప్ అగర్వాల్‌కు నేను దానిలో చేరుతూన్నట్టుగా నివేదించమన్నారు. ఆయన DRI తాలూకు త్రైమాసిక పరిశోధనా విషయ పత్రిక 'మంథన్' (మథించడం, చిలకడం)కు సంపాదకుడు కూడాను. స్వయంగా నానాజీయే ఆ DRI ని స్థాపించినవాడూ, అధ్యక్షుడూను. డీఏవీ కాలేజ్‌లో "చరిత్ర విషయానికి ప్రాచార్యుడుగా ఉన్న అగర్వాల్ గారు నన్ను ఇంటర్వ్యూ చేసి 'మంథన్' ఇంగ్లీషు పాఠాంతరాన్ని పరిష్కరించడంలో తనకు సహాయకుడిగా నన్ను నియోగించారు. నా ఆఫీస్ DRI హైటెక్ ప్రధాన కార్యాలయంలో ఆయన ఆఫీసు పక్కనే ఉండేది. నేను హిందీ పాఠాంతరాన్ని సంకలనం చేయడంలో సాయపడే బాగా పెద్దవాడైన చంద్రకాంత్ భరద్వాజ్ గారి గదిలో ఆయనతో బాటే ఉండేవాణ్ణి. ఆయన తరచుగా ఆఫీసుకు వచ్చేవారు కాదు కాబట్టి సామాన్యంగా ఆ గది మొత్తం నాకే ఉండేది. బాగా ఎక్కువగా పుస్తకాలున్న గ్రంథాలయమూ, ఎప్పుడడిగితే అప్పుడు టీని సరఫరా చేయడమూ అదనపు ఆకర్షణలు. చదవడం, ఆలోచించడం, రాయడం అనేవాటికి అంకితమైన యువ మనస్సుకి అది చాలా ఆదర్శప్రాయంగా ఉండేది.

నాలుగో అంతస్తులో ఉన్న నానాజీగారి ఇంట్లోనే నేనూ దేవేంద్రజీ మధ్యాహ్న భోజనం చేసేవాళ్ళం. ఆయన (నానాజీగారు) ఊళ్ళో ఉంటే, మాతోబాటే భోజనం చేసేవారు. ఆ భోజన సమయ సంవాదాలు చాలా మంచి భోగట్టాలు తెలియజేసేవిగా

ఉండేవి. నానాజీ దేశ్‌ముఖ్ చిరకాలానుభవం ఉన్న ఆరెస్సెస్ ప్రముఖుడు. ఆయన చాలా ఏళ్ళు పార్లమెంటు సభ్యునిగా ఉండేవారు. ఆరెస్సెస్‌కి రాజకీయ సంఘటనమైన జనసంఘ్ పార్టీ నుంచి ఎన్నికైనవారు. అప్పటి ప్రధానమంత్రి ఇందిరాగాంధీ ఘోషించిన నిరంకుశ ఆత్యయిక స్థితి తాలూకు అధికార శాసనానికి విరుద్ధంగా ఉత్థితమైన విప్లవోద్యమం ముగ్గులోకి – వయసు మళ్ళిన, సోషలిష్టు అయిన – జయప్రకాశ్ నారాయణ్‌ను లాగడానికి ఈ నానాజీగారే బాధ్యులు.

ఇది, ఇందిరాగాంధీ ప్రభుత్వాన్ని కూలదోయడంలోకి పర్యవసించింది. సాధారణ ఎన్నికలు ఘోషితమయ్యాయి. వాటిలో జనతాపార్టీ అధికారానికి వచ్చింది. పార్టీకి నానాజీ ప్రధాన కార్యదర్శిగా ఉండేవారు. మితవాదులూ సోషలిస్టులూ కలిసిన అపూర్వ సమ్మేళనం ఆ పార్టీ. నూతన ప్రయోగంగా ప్రారంభమైన ఆ జనతా పరిపాలన అంతఃకలహాల కారణంగానూ కొంతమంది అధికారదాహంవల్లా రెండు మూడేళ్ళు మాత్రమే ఉండి పడిపోయింది.

నానాజీ పార్టీకి రాజీనామా ఇచ్చి రాజకీయాల నుంచి రిటైరైపోయారు. ఆయన సాంఘిక సేవ వైపుకు మళ్ళారు. ఆ క్షేత్రంలో ఆయన మహా గొప్ప పనులు చేశారు. సామాన్యపు, ఆషామాషీ రాజకీయవాదుల కన్నా ఆయన చాలా వేరుగా ఉండేవాడు. ఎందుకంటే ఆయన తన తప్పుల్ని ఒప్పుకొనేవాడు; తాను వ్యతిరేకించి పోరాడిన ఇందిరాగాంధీ అన్నా కూడా ఆయనకు ఏ రకమైన వైషమ్యము లేదు. నిజానికి ఆయన నాతో ఆవిడ ఒక గొప్ప నాయకురాలు అనీ, కానీ ఒక ప్రత్యేకమైన కుట్రదారుల ముఠా ఆవిడను తప్పుదారి పట్టించి ఆత్యయిక పరిస్థితిని ఘోషించే తప్పిదం ఆవిడచేత చేయించారని చెప్పడం నాకు జ్ఞాపకముంది.

నానాజీతో పని చేస్తూన్నప్పుడూ, అప్పుడప్పుడు ఆయనతో కలిసి ప్రయాణం చేసేటప్పుడూ నేను పలు పార్శ్వాలను కనబరిచే, పలు అంతస్తుల్లో ఉండే రకరకాల రాజకీయ, సామాజిక, సాంస్కృతిక సిద్ధాంతాలనూ, పనిమంతుల్నీ, నేతలనూ కలుసుకోవడం జరిగింది. దానితో నాకు ఇంతవరకూ తెలియని దేశ వ్యవహారాలను చూసే పాలనావ్యవస్థ గురించి నా మనస్సుకు అవగతం కావడం ప్రారంభించింది. అప్పటి ఆరెస్సెస్ ముఖ్యుడు బాలాసాహెబ్ దేవరస్, తరవాత అధిపతి అయిన సుదర్శన్ గారూ మొదలైన ఆరెస్సెస్ నేతల నుంచి మొదలుపెట్టి, సోషలిస్ట్ నాయకుడైన జార్జ్ ఫెర్నాండెజ్ మొదలైన వాళ్ళవరకూ అందరూ నానాజీ స్నేహితులూ, సహచరులూను. వాళ్ళందరితో నేను ప్రతిస్పందించగలిగాను.

ఒక ఏడాది లోపునే నేను 'మంథన్' అనే ఇంగ్లీష్ పాఠాంతరానికి సంయుక్త సంపాదకుణ్ణయ్యాను. పుస్తకాలను సమీక్షిస్తూనూ, మంథన్ కోసం కొన్ని ఇతివృత్తాలను సంగ్రహించేటప్పుడూనూ నేను మత రాజకీయాల గురించి బోలెడంత తెలుసుకున్నాను. తీరిక వేళల్లో ఢిల్లీ నిండా ఉన్న పురాతన స్మృతి నిర్మాణాలను చూస్తూనూ, చారిత్రక ప్రాముఖ్యత ఉన్న ఆగ్రా, ఫతేపూర్ సిక్రీ మొదలైన ప్రదేశాలకు వెళ్తూనూ సమయం గడిపేవాణ్ణి. ఢిల్లీకి దగ్గరలోని హరిద్వార్, ఋషీకేశ్, మథుర, బృందావనం కూడా సందర్శించాను. బాబాజీకి ఇష్టమైన విడుదులన్నిటినీ సందర్శించినా కూడా హరిద్వార్‌లో గానీ ఋషీకేశ్‌లో గానీ బాబాజీని పట్టుకోలేక పోయాను. అయితే, అది నన్ను ఎక్కువగా ప్రభావితం చేయలేదు. నామానాన నేనున్నాను. ఆయనమీద ఆధార పడకుండా నా కాళ్ళమీద నేను నిలుచోగలుగుతున్నాను - ఇదే బాబాజీ ఉద్దేశం కూడా.

నన్నీవిధంగా స్వతంత్రుడిగా తీర్చిదిద్దినందుకూ, నాకు ధ్యానం చేయడాన్ని కానుకగా ప్రదానం చేసినందుకూ నేను ఆయనకు ఎప్పటికీ కృతజ్ఞుణ్ణే. నిరాటంకంగా, కళ్ళు తెరిచీ, మూసీ కూడా నేనూ అంత సమయమూ ధ్యానం చేస్తూనే ఉంటున్నాను; అయితే, నా చిత్కేంద్రం మీద ప్రత్యేకధ్యాస ఉంచుతూ ప్రతిరోజూ తెల్లవారు జామున ధ్యానానికి కూర్చోడమనే నియమాన్ని కూడా కచ్చితంగా, ఖండితంగా పాటిస్తున్నాను. నాలో ఏమైనా అసాధారణ సామర్థ్యాలు ప్రకటమైనప్పటికీ వాటిని సామాన్య జనానీకాన్నుంచి గుప్తంగా ఉంచుకోగలిగాను. జీవితం గొప్పది. నేను జీవిక కోసం పని చేస్తున్నాను. దానితోబాటే అంతస్సులో ఆనందమయ ఆధ్యాత్మిక స్థితిని అనుభవిస్తూ ఉన్నాను.

కొంతకాలం తరవాత, ఒక పరిశోధన పత్రిక తాలూకు పరిమితి పరిధిలోనే పని చేయడమనేది ఊపిరాడనివ్వనట్టనిపించింది. ఇక ప్రస్తుతం జరిగే విషయాలను నివేదించే పత్రికా రచనలో ప్రయత్నం చేద్దామనిపించింది.

భారత అంతర్జాతీయ కేంద్రంలో మత సామరస్యం మీద జరిగిన సభలో జనానికి ఇష్టమైన శైలిలో ప్రచురితమయ్యే చిన్నసైజు వారపత్రిక (Weekly Tabloid) 'న్యూవేవ్' సంపాదకుడు గణేశ్ శుక్లా అనే అతన్ని కలుసుకున్నాను. నేనే జనాదరణను పొందిన ఆ చిన్న పత్రికను చదివాను. కొద్దిగా అతివాదం వైపుకు మొగ్గు చూపినా దానిలోని విషయమూ శైలీ రెండూ నాకు నచ్చాయి. 'న్యూవేవ్' కోసం నేను పని చేయదలచు కున్నానని నా కోరికను వెలిబుచ్చినపుడు శుక్లాగారు తక్షణమే ఒప్పుకున్నారు. మర్నాడే నేను "మంథన్"లో రాజీనామా ఇచ్చి "న్యూవేవ్"లో చేరాను. మా సంపాదకుడు

అసంతృప్తి చెందాదు కానీ, నానాజీ నేను మార్పు ఎందుకు కావాలనుకుంటున్నానో అర్థం చేసుకున్నారు.

"న్యూవేవ్" కి విలేఖరిగా పని చేస్తున్నప్పుడు నా ఆధ్యాత్మిక జీవితానికి సూటిగా సంబంధించిన రెండు ముఖ్య సంఘటనలు జరిగాయి: ఒకటి నేను కాశ్మీరుకి వెళ్ళి కాశ్మీర్ శైవ మహాబోధకుడైన స్వామీ లక్ష్మణ్ జూ ను కలుసుకోడం; రెండోది, ఢిల్లీలోని కాన్స్టిట్యూషన్ క్లబ్ దగ్గర జె. కృష్ణమూర్తి గారితో జరిగిన చిరు సమావేశం.

కాశ్మీర్ అద్భుత సౌందర్యానికి కాణాచి అయిన భూమే కాదు, పురాతన కాలం నుంచీ అది ఆర్యుల నాగరికతకు ఆలవాలంగా కూడా ప్రసిద్ధికెక్కింది. గొప్ప గణితజ్ఞుడైన పైథాగరస్ కూడా తనకున్న గణిత, ఆధ్యాత్మిక జ్ఞానాలకు తాను "బ్రాఖ్మన్స్ ఆఫ్ కాశ్మీయర్" (Brachmans of Kashmere)కు ఋణపడి ఉన్నానని చెప్పుకున్నాడు. గొప్ప చైనా యాత్రికుడూ చరిత్రకారుడూ అయిన హ్యూయాన్‌త్సాంగ్ తన జ్ఞానాన్ని పెంపొందించుకోడానికి కాశ్మీర్ (631 A.D.లో) వెళ్ళాడు. కాశ్మీర పండితుల్ని వారి విద్యాపాండిత్యాల దృష్ట్యా ఆయన ప్రస్తుతించాడు. మరొక చైనా యాత్రికుడు ఆన్‌కాంగ్ 760 A.D. లో కాశ్మీర్ వెళ్ళి అక్కడ బౌద్ధ భిక్షువుగా బతికాదు. మతమూ తత్త్వశాస్త్రమూ అనే విషయాలను లోతుగా అధ్యయనం చేస్తూన్న మూడు వందల పైచిలుకు మఠాలు కాశ్మీర్‌లో ఉన్నాయని ఆయన చెప్పాడు.

అదీగాక కాశ్మీర శైవమనేది శివానుయాయుల తాలూకు తత్త్వానికీ, అభ్యాసానికీ గంభీరమైన చేరికనిచ్చే మార్గం. అదే అనుభూతి వాదానికీ తదభ్యాసానికీ కాశ్మీర్ మనకు ప్రదానం చేసిన అనుపమాన బహుమానం.

కాశ్మీర్ లోయ తాలూకు సన్నివేశ సౌందర్యం గురించి చెప్పాలంటే, ఈ అందమైన రాష్ట్రానికి ఒకసారివెళ్తే చాలు మొగలాయీ చక్రవర్తులు 'భూలోక స్వర్గం' అని వర్ణించిన మాటలతో ఎవరైనా ఏకీభవించి తీరుతారు. 'అగర్ ఫిరదౌస్ బర్ రుయే జమీన్ అస్త్, హమీన్ అస్త్, ఓ హమీన్ అస్త్, ఓ హమీన్ అస్త్' (భూమ్మీద స్వర్గమంటూ ఒకటి ఉంటే అది ఇదే! అది ఇదే! అది ఇదే!) అని వాళ్ళు పర్షియన్ భాషలో వర్ణించారు తూర్పున టిబెట్ సరిహద్దుగా; ఉత్తరాన చైనీయుల తుర్కిస్తాన్, రష్యాలు సరిహద్దుగా; పడమట ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దుగా ఉన్న దీని జీవన సంస్కృతులు బహువిధ ప్రభావాల మేలుకలయిక. షాహ్ హమధానీ లాంటి గొప్ప సూఫీలు ఈ సమ్మిళిత సంస్కృతికి దోహదం చేశారు. సాటిలేని ఉపనిషత్తులకు ప్రప్రథమ తర్జుమా పర్షియన్‌లోకి జరిగిందని చాలా తక్కువ మందికే తెలుసును. నియంత అయిన మొగల్ చక్రవర్తి ఔరంగజేబు అన్న, పూజ్యుడైన దారాషికో ఆ అనువాదానికి యోచన చేసి ఆ ఆలోచనను కార్యరూపం దాల్చేలా చేశాడు. కాశ్మీరు సూఫీల బోధనలను లోతుగా అధ్యయనం

చేస్తూ అతను శ్రీనగర్‌లో ఉన్నప్పుడు ఈ పనిని నెరవేర్చాడు.

కాశ్మీరును సందర్శించడంలో నా ప్రత్యేకమైన ఉద్దేశం మహాయోగి అయిన శ్రీ లక్ష్మణ్ జూని కలుసుకోడానికి ప్రయత్నం చేయడమూ; బాబాజీ చెప్పిన అనంతనాగ్ దగ్గరి భాంజోలో ఉన్న ఐదవ, ఆరవ శతాబ్దాల నాటి దేవాలయాలను సందర్శించడమూను. మతసంబంధమైన, ఉచ్చతర రహస్యాల్లోకి గుప్తంగా దీక్షల నివ్వడానికి ఈ పిరమిడ్ దేవాలయాలకు చెందిన హైరోఫాంట్స్ కూడా ఈ గుహ్య అభ్యాసాల్లో దీక్షను స్వీకరించడానికి అంతదూరం నుంచీ వచ్చేవాళ్ళు. ఇతిహాసం, ప్రకారం, జీసస్ క్రీస్తు కూడా కాశ్మీర్‌లో కొంత సమయం గడిపాడు.

ఆ గుహలను సందర్శించిన తరవాత, నేను ప్రసిద్ధ హజ్రత్ బాల్‌లో సహా చాలా సూఫీ ప్రార్థనా స్థలాలకు వెళ్ళాను. శ్రీ శంకరులు ప్రతిష్ఠించిన లింగం ఇప్పటికీ ఉన్న శ్రీ ఆదిశంకరాచార్యుల కొండలపైకి ఎక్కాను.

అన్నిటికన్నా మకుటాయమానమైన సంఘటన కాశ్మీర్ శైవంలో అతి కుశలుడైన శ్రీ లక్ష్మణ్ జూ తో సమావేశం కావడమే.

ఒక ఆదివారం మధ్యాహ్నం మూడున్నర ఆ ప్రాంతాల్లో నేను శ్రీ లక్ష్మణ్ జూ ఆశ్రమానికి చేరుకున్నాను. ఆయనను జనానీకం స్వామీజీ అని పిలిచేవారు. ఆ రోజు స్వామీజీ మహాజనాన్ని కలిసే రోజు అని నాకు చెప్పారు. బహువర్ణాలతో కూడి ఉన్న తోటగల ఆ అందమైన ఆశ్రమం, ఆయన వ్యక్తిగత వసతి గృహం. మొగల్ గార్డెన్స్ దగ్గరి కొండప్రాంతం మీద ఉన్న అది, దాల్ సరస్సుకు అభిముఖంగా ఉంది. దానిని నిషాత్ బాగ్ అని అంటారు. ఆ సన్నివేశం మనోజ్ఞంగా ఉంది. పిన్నాపెద్దా అన్ని రకాల వాళ్ళతోనూ ఆ ప్రదేశం నిండి ఉంది. నేను ఆ మందిలో కలిసి స్వామీజీ కోసం నిరీక్షిస్తూ నిలుచున్నాను. ఆయన కాశ్మీర్ శైవం విషయంలో మహోత్కృష్టమైన సజీవ ప్రమాణమని బాబాజీ నాకు చెప్పారు. అది కూడా వట్టి సిద్ధాంతంలో మాత్రమే కాదు. ఆయన ఆ విషయంలో సంపూర్ణ ప్రవీణుడు.

కొంతసేపు కాగానే జనసమూహం అకస్మాత్తుగా వదలడం మానేశారు. నేను ముఖం పైకెత్తి చూడగానే, సన్నని, దాదాపు ఆరడుగుల పొడగరి, నున్నగా గెడ్డం గీయించుకున్న ముఖంతో, బాగా చూడముచ్చటగా ఉన్న ఒకాయన, కత్తిరించిన నెరసిన జుట్టుతో, కాశ్మీర్ ఫెరాన్ (Pheran) ధరించి మొగసాల నుంచి కిందికి దిగుతున్నారు. ఆయన్ను చూస్తే అందాజాగా డెబ్భై ఏళ్ళ వరకూ ఉండవచ్చుననిపిస్తుంది. (అయితే) ఆయన నడకలో చాలా పడుచుతనపు చురుకుతనం కనిపిస్తోంది. ఆయన ప్రవర్తనా విధానాన్ని చూస్తే కులీనత్వమూ వైభవమూ ఉట్టిపడుతున్నాయనిపిస్తుంది.

ఆ జనసమ్మర్దంలో నేను నిశ్శబ్దంగానే నిలుచొని ఆ మహానుభావుడికి వంగి నమస్కరించాను. ఆయనతో వ్యక్తిగతంగా మాట్లాడడానికి అవకాశమేమైనా దొరకగలదా నాకు అని వితర్కించుకున్నాను. అక్కడ చేరిన కొంతమందితో వినోదకరంగా కొన్ని మాటలు మాట్లాడి వాళ్ళను దీవించిన తరువాత ఆయన నేరుగా నేను నిలుచున్న చోటకు వచ్చి, దరహాసంతో వెలిగిపోయే ముఖంతో నా చేయి పట్టుకోడం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. నా కళ్ళల్లోకి తొంగిచూస్తూ దేనికోసమో వెదుకు తూన్నట్టనిపించారు. ఒక ఆనందమయమైన జలదరింపు నా ఒంటి నిండా పాకినట్టయి నేను కంపించిపోయాను.

నా చేతిని ఇంకా పట్టుకునే ఆయన 'నడు, మనం వెళ్దాం' అని నన్ను ధ్యానమందిరమనే కట్టడం దగ్గరకు తీసుకువెళ్తాంటే ఆశ్చర్యపోవడం అప్పుడక్కడ గుమిగూడిన వారిందరి వంతూ అయిందనిపించింది. లోపలికి వెళ్ళగానే, ఆయన ఒక కాశ్మీరు రగ్గు మీద కూర్చొని, దాపునే వేసి ఉన్న మరో రగ్గు మీద నన్ను ఆయనకు ఎదురుగా కూర్చోమని సైగ చేశారు. ఆయన ముందుకు నావైపుకు వంగి నా చేతిని పట్టుకొని "ఇంకా దగ్గరగా కూచో నాయనా! నేను నీ కోసం ఎదురు చూస్తున్నాను. నన్ను నమ్మవా; ఉండు! సంశయాల దాశరాజా!" అని అన్నారు.

ఆయన ఫెరాన్‌లోంచి నల్లగా ఉన్న ఒక వస్తువును తీసి నా కళ్ళ ఎదురుగా పెట్టి "దీన్ని చూశావా? దీన్ని నువ్వు గుర్తించావా?" అని అడిగారు.

నేను నిర్ఘాంతపోయాను. బాబాజీ ఆయన మెడలో ధరించే రుద్రాక్షల్లాగ పెద్దగా, దాదాపు నల్లగా కనిపించింది అది నాకు. "నాకు ఇరవై ఏళ్ళున్నప్పుడు బాబా మహేశ్వరనాథ్ ఇది ఇచ్చారు. ఆ విషయం నీకు ఇప్పుడు నేను చెప్పాను కనక నీకు తప్ప ఇంకెవ్వరికీ తెలియదు. ఒక ఏడాది తరవాత నేను అభినవగుప్తుల వ్యాఖ్యానంతో భగవద్గీతను ప్రచురింపజేశాను. నేనా పని చేయాలని బాబా కోరిక. మీ గురువుగారు నిన్ను నా దగ్గరకు పంపడం నాకు చాలా సంతోషకరమైన విషయం. బాబాజీ నా వ్యక్తిగతమైన గురువు కాకపోయినా, నాకు ఆయనంటే మా గురువుస్వామీ మెహతాబ్ కక్ కన్నా గానీ, లేకపోతే, మా పరమగురువు స్వామి రామ కన్నా గానీ తక్కువ గౌరవం లేదు. మీ గురువుగారు నిన్ను కనుక్కోడంవల్ల నువ్వు అదృష్టవంతునివవడమే కాదు శ్రీ గురువుతో నీ అనుబంధం తిరిగి స్థాపితమయింది."

నా కళ్ళలో నీళ్ళతో నేను "స్వామిజీ! ఇంతకన్నా నేనింకేం చెప్పగలను? నా గురించి మీకంతా తెలిసినట్టే ఉంది" అని అన్నాను.

ఒక అరగంట పాటు మేము కాశ్మీర శైవంలోని కొన్ని విషయాలనూ, వాటి అభ్యాసం గురించీ చర్చించుకున్నాం. నా రోజువారీ క్రియాభ్యాసంలో కొన్ని మార్పులను

సూచించి, నన్ను 'ప్రత్యభిజ్ఞా హృదయం', 'విజ్ఞాన భైరవం', 'పరాత్రిశిక వివరణ' అనే గ్రంథాలను చదవమని చెప్పారు. మా సమావేశాన్ని ముగించే ముందు ఆయన 'బోధ పంచదశిక', 'పరప్రవేశిక' అనే సంస్కృత పుస్తకాలను 'ఫిఫ్టీన్ వెర్సెస్ ఆఫ్ విజ్డమ్' (Fifteen Verses of Wisdom) 'ఎన్ట్రెన్స్ ఇన్టూ సుప్రీమ్ రియాలిటీ' (Entrnace into Supreme Reality) అని ఇంగ్లీషులోకి అనువదించిన రెండు చిన్న పుస్తకాలను ఇచ్చారు.

నేనాయన ముందు సాష్టాంగపడి లేచాను. "నువ్వు బాబాజీని తిరిగి సందర్శించి నపుడు నా ప్రణామాలను చెప్పు. అమృతేశ్వర భైరవుడు, మోక్షసుధా ప్రభువు నీకు ముక్తిని ప్రసాదించుగాక!" అని అన్నారు. ఇవే ఆయన నాతో అన్న చివరి మాటలు.

కాశ్మీర్ నుంచి నేను ఢిల్లీకి తిరిగి వచ్చాను.

ఢిల్లీకి తిరిగి వచ్చిన రెండు వారాల తరవాత, రెండు రోజుల పాటు కానిస్టిట్యూషన్ క్లబ్ ఆవరణంలో జె. కృష్ణమూర్తి గారు సాయంకాల ప్రవచనాలిస్తున్నా రని విన్నాను. వివిధమైన కారణాలవల్ల మొదటి రోజు వెళ్ళలేకపోయాను. ఆఖరి రోజున, ప్రవచనం ప్రారంభం కావడానికి కొన్ని నిముషాల ముందరే చేరుకున్నాను. శ్రోతలందరూ నిజంగానే సంఘంలోని ఉన్నత వర్గంవారే, శ్రేష్ఠ వర్గం వారే. అక్కడ సంపన్న వ్యాపారులూ, పారిశ్రామికవేత్తలూ, వివిధ రాజకీయ పార్టీలకు చెందిన రాజకీయవేత్తలూ, బుద్ధిజీవులూ, శాస్త్రజ్ఞులూ, ప్రసార మాధ్యమ వర్గీయులూ ఉన్నారు. పాత్రికేయుడిగా నేను వక్తను స్పష్టంగా చూడగలిగే మంచి సీటుని సంపాదించగలిగాను. సభికులు నిశ్శబ్దంగా ఆయన కోసం నిరీక్షిస్తూ కూర్చున్నారు.

సరిగా ఆరు కాగానే టంచనుగా ఆయన లోపలికి వచ్చారు. మచ్చలేని లేత లేడివన్నె సిల్కు కుర్తా, తెల్ల పైజామాలు వేసుకొని వచ్చి వేదిక మీద బాసినపట్టు వేసుకొని కూర్చున్నారు. ఆయన నెరసిన జుట్టూ, ముచ్చటైన ముఖము – వీటిలో ఆయన ఆధునిక బుద్ధిడిలాగ కనిపించాడు. చేతులు జోడించి అభివాదనం చేసి మాట్లాడటం మొదలుపెట్టారు. పరిచయాలు లేవు; జ్యోతిప్రజ్వలనాలూ లేవు; ఏ ప్రదర్శనా లేదు. సూటిగా తాను చెప్పదలచుకున్న విషయానికి వెళ్ళిపోయారు. చాలా సంవత్సరాల క్రితమే అయినా ఆయన ప్రారంభ వాక్కులు నాకు స్పష్టంగా గుర్తున్నాయి: "ఏదో ఒక నమ్మకం కోసం గానీ, ఏదో ఒక ఆదర్శం కోసం గానీ, లేకపోతే ఏదో ఒక వ్యవస్థకోసం గానీ ఏ రకమైన ప్రచారమూ మేము చేయట్లేదని నేను స్పష్టంగా చెప్పదలచుకున్నాను! మీరూ నేను కలిసి లోకంలో ఏం జరుగుతుందో అన్న విషయాన్ని పరిశీలిస్తున్నాం...."

హింసా, దౌర్జన్యాల స్వరూపాంగాలను విచ్ఛేదించి, వాటి తత్త్వాన్ని వివేచించి

ఆయన వాటిని బహిర్గతంచేసి చూపిస్తూంటే ఒక గంటసేపు అంతా నిశ్శబ్దమే అక్కడ. ఏవిధంగా శతాబ్దాల కొద్దీ మతం కూడా హింసను ప్రోత్సహించి ఆజ్యం పోసిందో కూడా విప్పి చెప్పారు. మానవులందరూ వారి అంతరాల్లో లోతుగా ఎంత హింసాపూరితులై ఉంటారో గుర్తించమని ఆయన అందరినీ ప్రేరేపించారు. చేతులు జోడించి ప్రార్థిస్తూ ఈ దౌర్జన్యం ఎంత లెక్కలేని హానిని చేకూర్చిందో వారిని వారినే చూడమని నివేదించారు. అన్ని రకాల హింసల్నీ రోజువారీ జీవితంలో జాగరూకతతో వదిలి పెట్టమని మనవి చేశారు.

అది ఏ సిద్ధాంతాన్నో తత్త్వాన్నో విపులీకరించడం కాదు. అది అవచేతనంలోకీ, అచేతనంలోకీ చేసే ఒక ప్రయాణం. అది స్వయంగా తనను తాను పరిశోధించుకోడం; తనను తాను కనుక్కోడం. ఆ ప్రవచనంలో శ్రోతలెంత నిమగ్నమైపోయారంటే, కృష్ణమూర్తి గారు మాట్లాడడం మానిన తరవాత కొన్ని నిముషాల దాకా ఎవరూ కదలనైనా కదల్లేదు. తరవాత చేతులు మళ్ళీ జోడించి 'నమస్తే' చెప్పి ఆయన వేదిక నుంచి లేచి వెళ్ళిపోయారు. అప్పుడు నాకు ఏదో బాగా వ్యక్తిగతమైన, సన్నిహితమైనది జరిగింది. వెళ్ళిపోతూ ఆయన తటాలున ఆగి, వెనక్కి తిరిగి కొన్ని క్షణాలు నా కళ్ళలోకి సూటిగా చూశారు. తరవాత, ఆయన తిరిగి వెళ్ళిపోయారు.

నా శరీర వ్యవస్థలోకి ఒక శక్తి స్పష్టంగా ప్రవేశిస్తున్నట్టని పించింది. నేను బస్సునెక్కి నా గదికి తిరిగి వచ్చిన తరవాత కూడా ఆ వింత శక్తి ప్రభావం ఉండనే ఉంది. ఏదో ఒక సుసూక్ష్మ ఆనందాసవాన్ని నేను తాగినట్టు నాకనిపించింది. అది నేను వివరించలేను. నేను నా గదిలోకి ప్రవేశించగానే మేడమీద ఉండే నా మిత్రుడు షెరిడాన్ నన్ను 'తాగేవా ఏమన్నా' అని అడిగినట్లు నాకు జ్ఞాపకం. ఆ షెరిడాన్ తర్వాత రాష్ట్రపతి అబ్దుల్ కలాంకు వ్యక్తిగత కార్యదర్శి అయ్యాడు. నిలకడలేని తప్పటడుగులు వేస్తూ నడిచాను. ఆ నిషానుభూతి రాత్రంతా ఉంది. నేను తెల్లారుతూండగా నిద్రపోయాను.

ఆ మర్నాడే, నేను గణేశ్ శుక్లా గారికి నా రాజీనామా పత్రమిచ్చి "న్యూవేవ్" ను వదిలేశాను. ఆ తరవాత రోజు నేను బెనారస్ వెళ్ళడానికి రైలెక్కాను. బెనారస్‌లో జూనా అఖాడాలో ఉండడానికి అనుమతిని పొందాను. దగ్గర్లోనే రాజ్ ఘాట్‌లో కృష్ణమూర్తి సెంటర్ ఉంది గానీ నాకు అక్కడికి వెళ్ళామన్న స్ఫురణ కలగలేదు. దానికి బదులు ఒక పూర్తి ఏడాది పాటు అనేక ఘాట్ల మీదుగా నడుస్తూ, అప్పుడప్పుడు కాశీ విశ్వనాథుడి గుడిని దర్శిస్తూ గడిపాను. ఏ అపేక్షా లేని, ఏ ఒడంబడికలూ లేని పూర్ణ స్వేచ్ఛలో నేను లీలగా ఉల్లాసంగా తుళ్ళుతున్నాను.

# 44. వసంత విహార్

ఒక పూర్ణిమనాటి రాత్రి, మణికర్ణికా ఘాట్ మీదుగా దాటిపోతూన్న ఒక బోట్‌ను పరికిస్తూండగా, జె. కృష్ణమూర్తిగారిని వ్యక్తిగతంగా కలవాలన్న ఒక అపరాని కోరిక నన్ను ఆవహించింది. మరుసటి పొద్దుటే రాజ్ ఘాట్‌కు వెళ్ళి, కృష్ణమూర్తి సెంటర్‌కి అప్పటి ముఖ్యాధికారి అయిన ఉపాసనీ గారిని కలుసుకున్నాను. దర్యాప్తు చేయగా ఆయన, కృష్ణమూర్తిగారు చెన్నైకి ఒక వారంలో వస్తారని నాకు తెలియచెప్పాడు. అంతకుముందుగానే నేను చెన్నై వెళ్ళి, ప్రసిద్ధ స్వాతంత్ర్య సమరయోధుడూ, అప్పటి కృష్ణమూర్తి ఫౌండేషన్ ఉపాధ్యక్షుడూ అయిన అచ్యుత్ పట్వర్ధన్‌ను కలుసుకోమని ఆయన నాకు సూచించారు. కృష్ణమూర్తిగారు రాగానే ఆయన (పట్వర్ధన్ గారు) బహుశా నాతో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేయగలరేమో అని అన్నారు.

ఆయనకు కృతజ్ఞతను తెలియజేసి నేను చెన్నైకి టికెట్టు కొందామని రైల్వేస్టేషన్‌కి వెళ్ళాను. ఆ రోజు నుంచి మూడో రోజుకి ఒక సెకండ్ క్లాస్ స్లీపర్ టికెట్టు దొరికింది. అలాగ, నేను కొన్ని రోజుల తరవాత చెన్నైకి చేరుకొని, మా అమ్మానాన్నలున్న ఇంటికి వెళ్ళడానికి బదులుగా గ్రీన్‌వేజ్ రోడ్డులో ఉన్న కృష్ణమూర్తి ఫౌండేషన్ ప్రధాన కార్యాలయానికి నేరుగా వెళ్ళాను. అక్కడ ఆఫీసులో శ్రీ అచ్యుత్ పట్వర్ధన్ గారితో కలవడానికి ఏర్పాటు చేయమని అడిగాను. ఆఫీసు మేనేజర్ పట్టాభిగారు ఇంటర్‌కామ్ ద్వారా అచ్యుత్ పట్వర్ధన్ గారిని కలుసుకోవడం కోసం అక్కడే వేచి ఉండమన్నారు. దాదాపు ఒక అరగంటలో పట్వర్ధన్ గారు ఆ గదిలోకి వచ్చారు.

అచ్యుత్ పట్వర్ధన్ గారు చారిత్రకంగా స్వాతంత్ర్యం కోసం చేసిన పోరాటంలో ప్రసిద్ధులు, క్విటిండియా ఉద్యమంలో భాగంగా ఆయన బాగా చిన్నప్పుడే ఇండియాలో బ్రిటిష్ సామ్రాజ్య ప్రధాన కార్యాలయం వరకూ, తన సహచరురాలు అరుణా అసఫ్ అలీతో సహా నడిచి, ఇంగ్లండ్ జాతీయ పతాకాన్ని కిందికి లాగి భారతదేశ పతాకాన్ని ఎగరవేసినవారు. ఇంతటి వాడని వినబట్టే నేను ఆయన చాలా ప్రభావకరంగా దృఢ శరీరుడై ఉంటాడని ఊహించాను. కానీ లోపలికి వచ్చిన మనిషి చాలా పల్చగా, దాదాపు చుంచెలుక మాదిరిగా చిన్నగా ఉన్నారు. కానీ ఆయన కళ్ళు మాత్రం తీక్ష్ణంగానూ అప్రమత్తంగానూ ఉన్నాయి. డెబ్బై పై చిలుకు ఏళ్ళున్నవాడిలా మాత్రం లేరు. యౌవనోత్సాహంతో చాలా మర్యాదగానూ, సరసంగానూ ఉన్నారు. నన్ను కలుసుకొనే లోపులో ఆయన తన వంతు పని చేసుకొనే వచ్చారు. రాజ్ ఘాట్ నుంచి ఉపాసనీ ఫోన్‌లో నా గురించి చెప్పాడు; (ఆ వివరాలను) ఢిల్లీలో ఆయన బాగా ఎరిగిన నానాజీ దేశ్‌ముఖ్‌తో కూడా సరిచూసుకున్నారు. నా గురించి నమ్మదగిన

ఆధారాలతోనూ నా పూర్వరంగంతోనూ తృప్తి చెందిన ఆయన చాలా స్నేహపూర్వకంగా ఉన్నారు.

ఒక నెలలో కృష్ణమూర్తిగారు వస్తారని చెప్పారు. ఆ మధ్య సమయంలో వసంత విహార్ అనే పేరున్న వారి ప్రధాన కార్యాలయంలో నేనుండవచ్చు. "కె"తో (కృష్ణమూర్తి) వ్యక్తిగత సమావేశానికి ఆయన ప్రయత్నించి ఏర్పాటు చేస్తానన్నారు. నేను కృతజ్ఞతలు చెప్పి ఆయన చెప్పినదానికి అంగీకరించాను. భోజనశాలకు దగ్గరగా ఒక చిన్న గదిని నాకు కేటాయించారు. అచ్యుత్‌జీతో బాటే భోజనశాలలో నేనూ భోజనం చేసాను. అప్పుడప్పుడు మధ్యాహ్న భోజన సమయంలో గానీ రాత్రి భోజన సమయంలో గానీ కొంతమంది అతిథులు ఉంటూండడం కద్దు. అది మొత్తం శాకాహారుల సంస్థ; తాగుడూ, పొగాకూ వాడకాలు అక్కడ లేవు. ఇవి నాకు చక్కగా సరిపడ్డాయి. సాయంత్రాలు ఐదున్నరెకరాల తోటలో అచ్యుత్‌జీతో నడకకు వెళ్ళేవాణ్ణి; లేకపోతే దగ్గర్లోనే ఉన్న దివ్యజ్ఞాన సమాజం తాలూకు విస్తృత సంస్థానంలోనైనా తిరిగేవాళ్ళం. మమ్మల్ని అక్కడకు కారులో దింపి, తిరిగి తీసుకొని వచ్చే ఏర్పాటు జరిగేది.

మా వయస్సులో బాగా తేడా ఉన్నా, మా సాంఘిక హోదాలో కూడా తేడా ఉన్నా సరే మేమిద్దరం మంచి మిత్రులమయ్యాం. ఆయన వయస్సు నా వయస్సుకు మూడింతలు కన్నా ఎక్కువ. రాజకీయ సాంఘిక రంగాల్లో బాగా ప్రసిద్ధుడు ఆయన. మేము వివిధ విషయాల మీద చర్చించుకొనేవాళ్ళం. అంతటి స్థాయి ఉన్న ఆయన నుంచి నేను చాలానే నేర్చుకోవాలి. ఆయన చెప్పిన ఒక ఉదంతం నేనెప్పటికీ మరిచిపోలేను. యువకుడిగా ఉన్నప్పుడు ఈయన మహాత్మాగాంధీ నాయకత్వం వహించిన భారత స్వాతంత్ర్య సంఘర్షణలో చేరడానికి 'కే' గారి అనుమతి అడిగారుట. తన (కే గారి) దృష్ట్యా 'స్వాతంత్ర్యం' అంటే పక్షపాతమూ, పగా, దౌర్జన్యాల నుంచి పరమ స్వాతంత్ర్యాన్ని పొందడమే. ఈ స్వాతంత్ర్య సంఘర్షణ దానిని సాధించగలదంటే "చెయ్యి, నీకు చేద్దామనిపిస్తే, నన్నడగవద్దు" అని అన్నారని వినికిడి. ఆ తరువాత, బ్రిటిషు వారు భారత్‌ను వదిలి వెళ్ళిపోయిన మీదట, ఇండియా పాకిస్తాన్‌లు విడిపోయాయి. దాని ఫలితంగా రక్తపాతమూ దౌర్జన్యమూ జరిగాయి. వీటి తరువాత అచ్యుత్‌జీ 'కే'ను కలుసుకున్నప్పుడు, 'కే' ఆయనతో వ్యంగ్యంగా ఆ అర్థరహితమైన హింసా, విభజన తాలూకు రక్తపాతమూ నిజమైన 'స్వాతంత్ర్యమూ' అని అడిగారుట.

ఈ విధంగా కృష్ణమూర్తిగారికోసం నిరీక్షిస్తూ నేను ఆయన గురించి అందుబాటులో ఉన్న సాహిత్యమంతా చదివాను; ఆయన ప్రవచనాల ఆడియో టేపులు విన్నాను. కృష్ణమూర్తిగారితో నా వ్యక్తిగత సమావేశం గురించి చెప్పే ముందు

ఆయనగారికి వ్యక్తిత్వం గురించిన లఘు రచనను మీ ముందుంచుదామను కుంటున్నాను.

రష్యా కులీన కుటుంబం నుంచి వచ్చిన ప్రవాసి హెలీనా పెట్రోవ్నా బ్లావట్స్కీ (Helena Petrovna Blavatsky) 1873లో (ఇండియాకు) రావడంతోనే ఇదంతా ప్రారంభమైంది. నిగూఢ దృగ్విషయాల గురించి ఆరా తీయడంలో తనతో జతకూడిన కర్నల్ హెన్రీ స్టీల్ ఆల్కాట్‌తో కలిసి ఆవిడ దివ్యజ్ఞాన సమాజాన్ని ప్రారంభించింది. బ్లావట్స్కీని హెచ్‌పీబీ అనేవాళ్ళు. హెచ్పీబీ చాలా వివాదాస్పదమైన వ్యక్తి. గుప్త పద్ధతులతో ఆవిడ వస్తువులను రూపొందేలాగ చేయడమన్నది కొంతమంది దృష్టిలో దివ్యం; మరికొంతమంది దృష్టిలో వట్టి మాయతో చేసిన కుయుక్తులు. ఆల్డస్ హక్సలే ఆవిడను పండింతమన్యురాలనీ ఒక పెద్ద ధూర్తురాలనీ తీసిపారేశారు.

హెచ్పీబీ తాను నిగూఢ హిమాలయిక గురువుల తరఫున పని చేస్తున్నట్టుగా వాదించేది. వాళ్ళే తనను దివ్యజ్ఞాన సమాజాన్ని స్థాపించమని ఆజ్ఞాపించారని కూడా చెప్పేది. వాళ్ళలో ఇద్దరు మాస్టర్లను మోర్యా, కుతుమీలాల్ సింగ్ కింద చెబుతూ, వాళ్ళతో తాను టిబెట్‌లోనూ కారకోరం శ్రేణిలోనూ ఉండేదాన్ననీ, వాళ్ళలో ఒకరు తనకు వ్యక్తిగతమైన గురువనీ చెప్పేది ఆవిడ.

తన మహదాడంబరంతోనూ, నిస్సంశయంగా ఉన్న విపుల జ్ఞానంతోనూ, ఆకర్షించగలిగే వ్యక్తిత్వంతోనూ ఆవిడ, గొప్ప వక్తా, నాస్తికురాలూ, ఫేబియన్ సొసైటీలో సభ్యురాలూ, జార్జ్ బెర్నార్డ్ షాకి సన్నిహిత మిత్రురాలూ అయిన అనీబిసెంట్‌ను ఆకట్టుకొంది. హెచ్పీబీ రాసిన "సీక్రెట్ డాక్ట్రిన్" ప్రతి నొకదానిని సమీక్ష కోసం తనకివ్వగా దానిని చదువుతూ అనీబిసెంట్ ఎంత ముగ్ధురాలయిందంటే ఆవిడ హెచ్పీబీని కలుసుకొని ఆవిడకు శిష్యురాలైపోయింది. కృష్ణమూర్తిగారి జీవితంలో అనీబిసెంటు చాలా ముఖ్య పాత్రను పోషించింది.

కృష్ణమూర్తిగారి జీవితంలో బహుశా అత్యంత కీలకమైన పాత్ర పోషించిన మరో మనిషి సీడబ్ల్యూ లెడ్ బీటర్. ఇంగ్లండ్ చర్చ్ పౌరోహిత్యం నుంచి బహిష్కృతు డైన ఇతను బాగా చదువుకున్నవాడూ, బహుముఖ వ్యక్తిత్వం కలవాడూను. అతీంద్రియమైన నిగూఢ విషయాల మీద ఆయన రచనలు, ఆకర్షణీయమైనవే అయినా, చాలామందికి వాటిలో ఉన్న సంగతులు నిజాలా కల్పితాలా అనే అనుమానాన్ని కల్గిస్తాయి. సీడబ్ల్యూ లెడ్ బీటర్ (సీడబ్ల్యూఎల్) తన వేలాదే తెల్లగెడ్డంతోనూ స్ఫురల్లక్షణాలతోనూ ఒక బైబిల్ సంబంధిత ప్రవక్తలాగ ఉంటాడు. ఆయన కూడా హెచ్పీబీని కలుసుకొని ఆవిడ శిష్యుడైపోయాడు. త్వరలోనే ఆయన

కూడా ఒక ప్రముఖ దివ్యజ్ఞానిగా మాన్యతను అందుకున్నాడు. బ్లావట్స్కీ మరణం తరవాత, సీడబ్ల్యూఎల్ తానే ధవళావాసం (హిమాలయాల) తాలూకు దివ్యజ్ఞాన గురువులతో ప్రత్యక్ష సంపర్కం గలవాణ్ణని చెప్పుకొని, వారి స్థానే, తానే దీక్షలనూ దీవెనలనూ ప్రదానం చేసేవాడు. నిగూఢ విషయాలకు సంబంధించిన విషయంలో అనీబిసెంట్ ఆయన మీదనే అత్యంతమూ ఆధారపడేది.

భవిష్యద్బుద్ధుడూ, యుగావతార పురుషుడూ, మహా ప్రభువూ ఆయన మైత్రేయ బుద్ధుడు శరీరం ధరించి అవతరించడానికి సమయం పరిపక్వమయిందన్న భావం దివ్యజ్ఞానుల్లో వ్యాప్తం కావడానికి చాలావరకు సీడబ్ల్యూఎల్లే బాధ్యుడు. ఇప్పటికే పుట్టిన నిర్మలమూ శీలవంతమూ ప్రత్యేకంగా సుశిక్షితమూ అయిన ఒక మానవ శరీరాన్నే ఆ మహాప్రభువు స్వీకరించడమో ఆవేశించడమో చేస్తాడు కనక ఈ అవతారం చాలా నిరుపమానమైనది. అంచేతనే ప్రముఖ దివ్యజ్ఞానులు మైత్రేయ ప్రభువుకు వాహకం కాదగిన యోగ్య యువకుడి కోసం చూస్తూ ఉన్నారు.

హెచ్పీబీ ఇంకా బతికుండగానే, దివ్యజ్ఞాన సమాజం చెన్నైలోని అడయారులో మూడు వందల ఎకరాల సంస్థానంలో తమ ప్రధాన కార్యాలయాన్ని స్థాపించింది. అడయారు నదీతీరంలో యూరోపియన్ శైలి కట్టడాలతోనూ వృక్షాలతోనూ ఉన్న ఈ వైభవోపేతమైన ప్రాకారం తమకు సొంతదైన బీచ్ కూడా ఉందని గొప్పలు చెప్పుకుంటుంది. ఇక్కడే, ఈ నది పక్కనే, కృష్ణమూర్తినీ అతని సోదరుడు నిత్యానందుణ్ణీ చాలా చిన్న వయస్సులోనే కనిపెట్టి, చిన్నారి కృష్ణమూర్తి తాలూకు కాంతిమండలం నిష్కళంకమూ నీతిమంతమూ దీప్తిమంతమూ అని తన దివ్యదృష్ట్యాది శక్తులతో తాను తెలుసుకున్నాననీ, మైత్రేయ ప్రభువు గ్రహించి వినియోగించడానికి అది (ఆ శరీరం) యోగ్యమైనదనీ సీడబ్ల్యూఎల్ ఉద్ఘోషించాడు.

చాంతాడులాంటి కథను చిటికలో చెప్పాలంటే, ఎత్తు పళ్ళూ పేలజుట్టూ ఉన్న కృష్ణుణ్ణీ, అతని తమ్ముడు నిత్యుణ్ణీ, రిటైరైన చిన్న ప్రభుత్వోద్యోగి అయిన వాళ్ళ తండ్రి నారాయణయ్య నుంచి తీసుకొని పోయి, పక్కా సాహిబ్బులుగా (గౌరవనీయులుగా) తయారై ఆ విధంగా ప్రవర్తించేంత వరకూ సీడబ్ల్యూఎల్లూ, ఆయన ఎన్నుకొన్న మరికొందరూ శిక్షణ నిచ్చారు. దివ్యజ్ఞానులు దత్తతకు తీసుకోక ముందు ఈ కృష్ణుడు వట్టి మందబుద్ధి అని ప్రతీతి; పరీక్షల్లో ఎప్పుడూ ఉత్తీర్ణుడయ్యే వాడు కాదు; కేంబ్రిడ్జి ఆక్స్‌ఫర్డుల్లో చదవడానికి అర్హతను పొందినవాడు కాదు. అతని తమ్ముడు నిత్యుడేమో చాలా మెరుగ్గా ఉండబట్టి చాలా బాగా చదువుకున్నాడు. ఏమైతేనేమి, దివ్యజ్ఞానులు వాళ్ళను పడమటి దేశాలకి తీసుకువెళ్ళడం వల్లనూ దివ్యజ్ఞాన

సమాజ ప్రచారం ఆధారంగానూ ఆ యువకులిద్దరూ ప్రజాబాహుళ్యానికి బాగా నచ్చిన వాళ్ళయ్యారు.

భవిష్యత్ యుగపురుషుడు కనక కృష్ణుణ్ణి రాజకుమారుడిలాగ పరిగణించి ఆదరించే వాళ్ళు. ఆయన సావిల్ రో సూట్లు వేసుకునేవాడు; ఖరీదైన కార్లను నడిపేవాడు; ఇంగ్లండు, యూరపు, యూఎస్యేల్లోని ఉచ్చస్థాయి సమాజ మండలాల్లో సాధారణంగా అతని పేరే చెప్పుకుంటూండేవాళ్ళు. క్షయరోగంతో చిన్న తమ్ముడు నిత్యుడు చనిపోగానే అతన్ని ఒక మహోత్పాతం దెబ్బ కొట్టింది. దివ్యజ్ఞాన సమాజ సంబంధమైన మాస్టర్లు తనను చావనివ్వరని ఊహించుకొని కృష్ణుడు, దివ్యజ్ఞానం చెప్పే దాంట్లో, అంత కాకపోతే కనీసం సీడబ్ల్యూఎల్ తాదృశులు చెప్పే దాంట్లో పూర్తిగా నమ్మకాన్ని కోల్పోయాడు; ఆ అధికార సోపాన వ్యవస్థ నుంచి దూరం కావడం ప్రారంభించాడు. చివరకు, 1929 ఆగస్టు మూడున హాలెండ్‌లోని ఆమెన్ దగ్గర జరిగిన దివ్యజ్ఞానుల అంతర్జాతీయ సమ్మేళనంలో కృష్ణమూర్తి దివ్యజ్ఞాన సమాజం నుంచీ, దాని సిద్ధాంత భావాల నుంచీ పూర్తిగా తన సంబంధాలను తెంచుకొని, తాను అధిపతిగా ఉన్న 'ఆర్డర్ ఆఫ్ ద స్టార్'ను రద్దు చేసి ఈ విధంగా ఘోషించాడు: "సత్యం మార్గరహితమైన స్థలం. దానిని ఏ విధమైన మార్గం మీదుగానైనా చేరలేం..." అని.

(ఇది విని) అనీబిసెంట్‌తో సహా శ్రోతలందరూ నిర్ఘాంతపోయారు. ఆయన "ఈ వర్గానికి (ఆర్డర్‌కి) నేను ముఖ్యుణ్ణి గనక నేనే దీన్ని విచ్ఛిన్నం చేయదలచు కున్నాను. మీరు ఇతర వ్యవస్థలను ఏర్పరచుకోవచ్చు. (వాటిని నడపడానికి) మరొకరి కోసం మీరు ఎదురుచూడవచ్చు. దానితో నాకు సంబంధం లేదు; కొత్త పంజరాలతోనూ, ఆ పంజరాలకు కొత్త అలంకారాలను సృష్టించడంలోనూ నాకు ఏ ప్రమేయమూ లేదు. మనుషుల్ని సంపూర్ణంగానూ ఏ ఒడంబడికలు లేకుండానూ స్వతంత్రంగా ఉండేలాగ చేయడమే నా ఏకైక ఆసక్తి" అని అన్నారు. అనీబిసెంట్ ఆ ఆఘాతం నుంచి కోలుకోలేకపోయింది. త్వరలోనే చనిపోయింది ఆవిడ. కృష్ణమూర్తి కొంతమంది మిత్రులతో "కృష్ణమూర్తి రైటింగ్స్ ఇన్కార్పొరేటెడ్" అనే సంస్థను నెలకొల్పారు. దాంట్లో రాజగోపాల్ అనేవాడు పరమ ముఖ్యుడు. అతను కూడా సీడబ్ల్యూఎల్‌కి (కృష్ణమూర్తిలాగ) దొరికినవాడే. ఈ సంస్థ ప్రపంచవ్యాప్తంగా కృష్ణమూర్తి ఉపన్యాసాలకూ, ఇతర పనులకూ అవలంబాన్నిచ్చేదిగా ఏర్పడింది. "కామెంటరీస్ ఆన్ లివింగ్" అనే శీర్షికతో కృష్ణమూర్తి ఉపన్యాసాల మొదటి సంపుటిని చాలా నేర్పరితనంతో సంకలనం చేసినవాడు రాజగోపాలే.

కొన్నేళ్ళ తరవాత రాజగోపాల్ విరోధపడ్డాడు. దీర్ఘంగా చాలాకాలం వరకూ సాగిన కటుత్వం, చట్టపరమైన పోట్లాట్ల తరవాత రాజగోపాల్‌ను తీసేశారు. రాజకీయ పరంగా శక్తివంతులైన కృష్ణమూర్తిగారి కొత్త మిత్రుల సాయంతో 'ద కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియా', 'ద కృష్ణమూర్తి ట్రస్ట్ ఇంగ్లండు', కాలిఫోర్నియాలోని ఓజాయ్ దగ్గర ప్రధాన కార్యాలయంతో 'ద కృష్ణమూర్తి ఫౌండేషన్ ఆఫ్ అమెరికా' అనేవి స్థాపితాలయ్యాయి. ఈ సంస్థలు ప్రసారం కోసం రికార్డైన ఆయన గారి ఉపన్యాసాలను ప్రచురించేవి; ఇండియాలోనూ విదేశాల్లోనూ కృష్ణమూర్తిగారి క్రియాకలాపాలన్నిటి విషయంలోనూ శ్రద్ధ వహించేవి.

దివ్యజ్ఞాన సమాజం ప్రధాన కార్యాలయానికి ఏమంత దూరంగా లేని కృష్ణమూర్తి ఫౌండేషన్ తాలూకు వసంతవిహార్ అనే భారతీయ ప్రధాన కార్యాలయంలో నేను కృష్ణమూర్తిగారి రాక కోసం వేచి చూస్తున్నాను.

నవంబర్ చివర్లో ఒక రోజున కృష్ణమూర్తి చెన్నైకి చేరుకున్నారు. ఆయన వచ్చినది అర్ధరాత్రి విమానంలో. అంచేత నేను మర్నాటి మధ్యాహ్న భోజనమప్పుడే ఆయనను చూడగలిగాను.

అచ్యుత్ పట్వర్ధన్ చిన్న తమ్ముడు పద్మాకర్ పట్వర్ధన్ అతని దాక్షిణాదిభార్య సునందతో సహా వాళ్ళ ప్రయాణాల నుంచి, కృష్ణమూర్తిగారి రాకకు కొన్ని రోజుల ముందుగా వెనక్కి తిరిగి వచ్చారు. కృష్ణమూర్తి బులెటిన్‌ను సునంద సంకలనం చేస్తూ ఉంటుంది. వాళ్ళకున్న శంకించే స్వభావం వల్లా, సందేహం వైపు మొగ్గుదలవల్లా నాలాటి సామాన్యుల్ని కృష్ణమూర్తి నుంచి దూరంగా ఉంచుదామనుకున్నప్పటికీ, అచ్యుత్‌జీ సిఫారసుతో భోజనశాలలో కృష్ణమూర్తితో భోజనం చేసే చిన్న సమూహంతో బాటు నన్ను కలవనిచ్చారు.

వసంత్‌విహార్ దగ్గర జరిగే బహిరంగ ఉపన్యాసాలకూ సభలకూ చాలారోజులు సమయముంది కనక అప్పుడు అక్కడ చాలా తక్కువమంది సహవాసులే ఉన్నారు. పగటి భోజనం దగ్గర గానీ రాత్రి భోజనం దగ్గర గానీ ఏమంత మాటలేమీ జరగలేదు. బాగా ధనాన్ని దానం చేయగల అప్పటప్పటి తాజా అతిథిని గానీ, లేకపోతే ఫౌండేషన్ కార్యక్రమానికి పనికి రాగలిగిన ఎవరైనా ప్రభావశాలి అయిన వీఐపీని గానీ అప్పుడప్పుడు కృష్ణమూర్తితో భోజనానికి పిలిచేవారు. కృష్ణమూర్తికి ఎంత దూరంగా వీలుంటే అంత దూరంగా ఉండేది నా సీటు. చివరకు, కృష్ణమూర్తిగారు వచ్చిన మూడు నాలుగు రోజుల తరవాత, మేడ మీదున్న తన పడకగదిలో నన్ను ప్రత్యేకంగా

ఒక అరగంట పాటు లేకపోతే, ఆయనకు ఇష్టమైనంత సేపు కలవదలచుకున్నారని శ్రీమతి సునందా పట్వర్ధన్ నాకు సూచించింది. ఆవిడ ఆయనను కృష్ణాజీ అని సంబోధించేది. ఈ అవకాశాన్ని నాకు సంపాదించి పెట్టడానికి అచ్యుత్‌జీయే ప్రయత్నించి సాధించి ఉంటారని నాకు తెలుసు.

మిద్దెమీదున్న పడకగదిని పవిత్రంగా చూసేవారు. ఏ కొత్తవాళ్ణీ కనీసం మెట్లెక్కడానికి కూడా ఒప్పుకునేవాళ్ళు కాదు. అంచేత ఈ ప్రత్యేక అవకాశాన్ని నాకు కలగజేసినందుకు నేను పులకరించిపోయాను. కొంచెం బెరుకుగా గదిలోకి ప్రవేశిస్తూ నేను, నేల మీదున్న రగ్గుపైన మఠం వేసుకుని కూచున్న కృష్ణాజీని చూశాను. "మీరు తలుపు మూయవచ్చునండి" అనేవి ఆయన మొదటి పలుకులు: "ఇక్కడకు వచ్చి కూర్చోండి" అని అన్నారు. జాగ్రత్తగా, రగ్గు అంచున కూర్చున్నాను నేను.

"అలా కాదండి, ఇక్కడకు రండి" అని అంటూ ఆయన ముందుకు రావాలని సూచించారు. కొన్ని అడుగుల దూరంగా ఆయనకు అభిముఖంగా కూర్చున్నాను నేను. ఒక నిముషం పాటు, నా ఎడమ చేతిని పట్టుకుని వదిలేశారు ఆయన. ఆయన సన్నిధిలో నేను ఎక్కువగా చకితపడనూ లేదు, భయపడనూ లేదు; పైపెచ్చు, ఒక మంచి మిత్రుని సమీపంలో కూర్చున్నానన్న భావం కలిగింది నాకు. ఎనభయ్యో పడిలో కూడా ఆయన నిజంగానే చాలా అందంగా ఉన్నారు. అంతకు ముందు చెన్నైలో జరిగిన ఉపన్యాసాల్లోనూ, తిరిగి ఢిల్లీలోనూ కొన్నిసార్లు కృష్ణమూర్తిని కొంత దూరం నుంచి నేను చూశాను. జార్జి బెర్నార్డ్‌షా ఆయనను చూడటానికి వెళ్ళి, తాను చూసిన మనుష్యులందరిలోకీ యువ కృష్ణమూర్తే 'అత్యంత సుందర మానవుడు' అని వ్యాఖ్యానించిన సందర్భంలో ఆయన ఏ అనుభూతిని పొందేడో దానిని నేను మొట్టమొదటిసారిగా అర్థం చేసుకోగలిగాను.

"ఉపనిషత్తుల్లో 'దగ్గరగా కూర్చో' అని చెబుతారు కదూ!" అని కొంటెగా నవ్వుతూ అన్నారు. "అయినా, వాటిని నేనెక్కువగా చదువుకోలేదనుకోండి".

"నేను అది నమ్మలేదు సార్. మీ దివ్యజ్ఞాన సంబంధిత దినాల్లో ఉపనిషత్తులు చదివే ఉంటారు తప్పకుండా" అని నేనన్నాను.

"నాకు తెలియదు. బహుశా నేను చదివే ఉంటాను. స్పష్టంగా నాకు గుర్తు లేదు" అని అన్నారు; తటాలున సంభాషణ దిశను మళ్ళిస్తూ, "మీ గురించి చెప్పండి. మీరు హిమాలయాల్లో ఒక గురువుతో తిరుగుతూ ఉండేవారని అచ్యుత్ చెప్పాడు నాకు. ఆయన ఎవరు? ఏం చేసేవారు? మీకు తెలుసనుకుంటాను, గురువు అవసరమన్న మాటను నేను నమ్మనని" అని అన్నారు.

"మీకివ్వలసిన గౌరవాన్ని మీకిస్తూనే, మీతో నేను ఏకీభవించలేను అని చెబుతున్నాను సార్. గురువుమీద పూర్తిగా ఆధారపడనంత వరకూ ఎవరికైనా గురువు అవసరమనే నేను అనుకుంటాను. నేను నా గురువును బాబాజీ అని పిలుస్తాను. ఆయన మొదటినుంచీ స్పష్టంగా చెబుతూనే వచ్చారు తన మీద ఆధారపడకుండా ఎవరి కాళ్ళమీద వాళ్ళు నిలవడం అలవరచుకోవాలని. అదీగాక, ఆయనకు ఒక వ్యవస్థ గానీ, ఒక పతాకం గానీ లేవు. ఆయనకు ఉండడనికి ఓ ఇల్లంటూ కూడా లేదు. ఆయన ఒక చోట నుంచి మరొక చోటికి సంచరిస్తూ ఉంటారు; తరచు గుహల్లో ఉంటూంటారు.

"'సత్యం' కూడా వ్యవస్థీకృతమైతే అది దాని సత్యత్వాన్ని కోల్పోతుందన్న మీరు చెప్పే కథనాన్ని విన్నాను నేను. అయినప్పటికీ, మీరు 'కృష్ణమూర్తి ఫౌండేషన్' అనే సంస్థకు ఆధిపత్యం వహించి నడుపుతున్నారు. బాబాజీకి అలాంటివి ఏమీ లేవు. ఆయన పూర్ణ స్వతంత్రుడు" అని అన్నాను నేను.

(ఈ మాటలు విని) కృష్ణమూర్తిగారు నన్ను బయటకు పొమ్మనమని సులువుగానే అనవచ్చు గానీ దానికి బదులు దానినంతనీ చాలా జాగ్రత్తగానూ అతి గంభీరంగానూ ఆయన విన్నారన్న మాటను నేను ఒప్పుకొని తీరాలి.

"మీరు చెప్పినది రైటే. నిజాయితీగా చెప్పాలంటే ఈ మొత్తం నాటకంతో నేనూ విసుగెత్తిపోయి ఉన్నాను. చాలా ఏళ్ళ క్రితమే నేను దివ్యజ్ఞాన సమాజపు దీక్షలూ అధికారసోపాన పరంపరలూ వదిలిపెట్టి ఇవతలికి వచ్చేశానని మీరు ఎరుగుదురు. కొంతకాలముంటే, మీరే చూడగల్గుతారు. బహుశా దీన్ని కూడా, నేనింక మొయ్యలేనని తెలిసినప్పుడు, చెత్తకుప్పగా వదిలిపారేస్తాను. ఇలాగ నేనన్నానని ఎవరికీ చెప్పకండి, సరేనా?" అని అంటూ ఆయన నా భుజాలమీద తడుతూ నవ్వేరు.

"అది సరే కానీ, ఇప్పుడు మీరు, ఎవరన్నారు – ఆం బాబాజీ దగ్గరనుంచి నేర్చిన దానితో సంతృప్తిపడితే, ఇక్కడెందుకున్నారు?"

"సార్, మిమ్మల్ని కలుసుకోమని బాబాజీయే సూచించడం వల్ల"

"కానీ, ఎందుకండీ? ఏమైనా కావాలనుకుంటే కొంతకాలం ఇక్కడ మీరు ఉండవచ్చును. నేను విన్నదాన్ని బట్టి, మీరు ఒక సంచారకుల్లాగే కనిపిస్తున్నారు. అంచేత, మీరెంత కాలం ఇక్కడుంటారో నాకు తెలియదు. అయితే, దాన్ని పట్టించుకోనక్కర్లేదనుకోండి".

"నాకూ తెలియదు సార్. నేను ఏ మాటనూ ఇవ్వదలచుకోలేదు".

"అది బాగుంది. కానీ నాకు చెప్పండి, మీ బాబాజీ ఈ దివ్యజ్ఞాన సమాజ మాస్టర్ల గురించీ, ఈ భవళావాసం గురించీ మీకు తెలిసిన మిగతా సంగతుల గురించీ ఏమన్నా చెప్పారా?"

"హిమాలయాల్లో గొప్ప మార్గదర్శకులు ఉన్నారండి. బాబాజీయే వాళ్ళలో ఒకరు. ఆయన గురువు, మరొకరు. ఆయనను మేము శ్రీగురువని అంటాం, ఆయనను నేను కలుసుకున్నాను కూడ. మరో ఒకరిద్దరు ఆయన శిష్యులూ (వాళ్ళ కోవలో వారే). అయితే బ్లావట్స్కీ కొంత ఎక్కువగానే పెద్దది చేసి చెప్పిందనీనూ ఆవిడ తరవాత ఇతరులూ మరికొంత మోతాదు పెంచి అతిశయంగా చెప్పారనీనూ బాబాజీ అంటారు. చివరకు బహిర్గతమైన వికార చిత్రాలు మూల విరాట్టుల కన్నా బాగా వేరైపోయాయి".

కృష్ణమూర్తి తన అరచేతులు రెండూ రుద్దుతూ చాలా ఆలోచనలో మునిగి "అచ్చంగా నేననుకున్నట్టే. ఈ మనిషి, బాబాజీ, చాలా ఆసక్తికరమైన వాడిలాగే ఉన్నారు. సరే, మీరిక్కడేమి చేయదలచుకున్నారు?"

"ఎన్ని వీలైతే అన్ని కేసెట్లను విందామనుకుంటున్నాను. ఇక్కడ మీరు నాకు కేటాయించే ఏ పనైనా చేస్తాను అని అన్నాను. రికార్డైన ఉపన్యాసాలకు ప్రతులు రాయడం కూడా నాకిష్టమే".

"మీరు కామెంటరీస్ ఆన్ లివింగ్" చదివారా?"

"చదివానండీ, ఒకసారి"

"ఫస్ట్ అండ్ లాస్ట్ ఫ్రీడం చదవండి"

"సరేనండి. అయ్యా, నేను ఒక ప్రశ్న వేయవచ్చునా?"

"వేయవచ్చు ముమ్... మీ పేరును నేను తిన్నగా పట్టుకోలేదు"

"ముంతాజ్" అని నేనన్నాను

"సరే, సరే, 'ఎమ్' అనేది ఇంకా సులువుగా ఉంటుందేమో!"

"సార్, మీరు లైంగిక సంబంధం గురించీ, ప్రేమ, ఈర్ష్యా, కోపం వగైరాల గురించీ, మీకేదో వాటితో సన్నిహితమైన అవగాహన ఉన్నట్టుగా మాట్లాడుతూ ఉంటారు. కానీ చాలామంది మిమ్మల్ని బ్రహ్మచారిగా అనుకుంటారు. ఆ పక్షంలో మీకివన్నీ ఎలా తెలుసు మరి?"

"సార్, ప్రత్యక్షానుభవమొక్కటే నేర్చుకొనే అనుభూతి. నా వ్యక్తిగత జీవితం గురించి ఏదైనా ప్రపంచానికెలాగ తెలుస్తుంది? నా గురించి జనులేమనుకుంటారో నాకు పట్టింపు లేదు. కానీ, గుర్తుంచుకోండి, నాకు వ్యక్తిగతంగా తెలియని వాటి

గురించి నేనెప్పుడూ మాట్లాడనని. (దీని నుంచి) మీరు మీమీ నిష్కర్షలను తీసుకోవచ్చును", అని ఆయన తీవ్రమూ గంభీరమూ అయిన చూపును నిగుడిస్తూ చెప్పారు.

"అది మరో ప్రశ్నకు దారి తీస్తోంది సార్! ఎవరి ఆధ్యాత్మిక అభివృద్ధికైనా పెళ్ళి ఆవశ్యకమని మీరు అనుకుంటారా?" అని నేనడిగాను.

"నిజాయితీతో చెప్పాలంటే, ఆధ్యాత్మిక అభివృద్ధి అంటే మీరేమనుకుంటున్నారో నాకు తెలియదు. కానీ, జీవితమంతా లైంగిక ప్రవృత్తులనే దెయ్యాల పీడకు ఎర కావడం కన్నా పెళ్ళిచేసుకోవడమో లేకపోతే ఆ సంబంధాలను అనుభవించడమో మేలని నేననుకుంటాను. ఆ (పిచ్చిలో) కాలిపోవడం కన్నా పెళ్ళిచేసుకోవడమే మంచిది" అని అన్నారు ఆయన.

అంతటి ముఖ్యుడి అమూల్య సమయాన్ని తీసుకుంటూ ఆయన నెత్తి మీద ఇంకా కూర్చోడం భావ్యం కాదని నేను చేతులు జోడించి "నమస్తే సార్! మీ సమయాన్ని ఇంకా నేను తీసుకోదలచుకోలేదు. దీనికి నా కృతజ్ఞతలు" అని అన్నాను.

ఆయన కూడా చేతులు జోడించి చాలా ఉదారంగా ఇలా అన్నారు: "మీరు వెళ్ళిపోయే ముందు మరొక్కమాట. ఇక్కడ మీకు కొంతమంది 'మాకు కృష్ణాజీ ముప్పై ఏళ్ళుపైగా తెలుసును' అనో లేక అటువంటి మాటలను చెప్పేవాళ్ళో తగలచ్చు. మేము మీకు ఆయన బోధనల గూఢార్థాలను వివరించి చెపుతామని చెప్పేవాళ్ళూ తారసిల్లవచ్చు. ఉద్రేకపడకుండా వాళ్ళను ఉపేక్షించండి. వాళ్ళకు బహుశా ఏ ఒకటీ అర్థమై ఉండదు" అని.

(ఆ మాటలకు) నేను కలవరపడ్డాను. దానితో, చాలా ఏళ్ళ క్రితం యువ బ్రహ్మచారిగా నేను రామకృష్ణ మిషన్‌లో చేరినప్పుడు స్వామీ రంగనాథానంద చేసిన హెచ్చరిక జ్ఞాపకానికి వచ్చింది - ఆయన ఇలా అన్నారు: "ఒక ఆశ్రమం చిన్న లోకం లాంటిది. అన్ని రకాల వాళ్ళూ ఇక్కడ కలుస్తారు. వాళ్ళందరూ గొప్ప సాధకులనో లేకపోతే ఆధ్యాత్మికంగా పురోగమించిన మహాత్ములనో భ్రమలో పడి ఆయాసపడకు. నువ్వు నీ పనీ నీ సాధనా చేసుకుంటూ పో. నీ కళ్ళనెప్పుడూ తెరిచే ఉంచుకో" అని.

ఈ ఇంటర్వ్యూ ఏర్పాటు చేసినందుకు నేను అచ్యుత్‌జీకి కృతజ్ఞతలు చెప్పాను. కుతూహలంతో ప్రశ్నలు వేసేవాళ్ళకు కృష్ణమూర్తిగారితో నా సమావేశం గురించిన వివరాలను చెప్పకుండా తప్పించుకున్నాను. కృష్ణమూర్తిగారిని నేను వ్యక్తిగతంగా

కలవాలని ఎంతెంతగా ఇష్టపడినా, రాబోయే కాలంలో కాబోతామనుకొనే శక్తులు మాత్రం నాకు అటు ప్రవేశం లేకుండా చేస్తూ ఉండేవి. ఎవరికీ తెలియకుండా నేనెక్కడ కృష్ణమూర్తిగారి గదివైపు మెట్లు ఎక్కుతానో అని నా కదలికలను కూడా చాలా జాగ్రత్తగా పరిశీలించేవాళ్ళు. అధ్యయనం చేయడంలోనూ, టేపులను వినడంలోనూ, నడకల కోసం వెళ్ళడంలోనూ నా సమయాన్ని వెచ్చించడం కొనసాగించాను. అప్పుడప్పుడు, అచ్యుత్‌జీ తనతో నడకకు రమ్మనమని అడుగుతూండే వారు. అప్పుడు నేను హిందూ తత్త్వం, మహాత్మాగాంధీ, సోషలిజం స్వాతంత్ర్యోద్యమం, దివ్యజ్ఞానం, సహజంగానే చివరకు కృష్ణమూర్తిగారు – ఇలాగ విభిన్న విషయాల గురించీ దీర్ఘంగా చర్చిస్తూ ఉండేవాళ్ళం. కొంత సమయంలోనే పట్వర్ధన్‌లు నన్ను నమ్మడం ప్రారంభించి పరిపాలనా సంబంధమైన పనులను కూడా నాకు ఇచ్చేవారు.

ఉపన్యాసాల సమయం చేరువవుతున్న కొద్దీ కృష్ణమూర్తి ఫౌండేషన్ తాలూకు సభ్యులు ఇటు ఇండియా నుంచీ, అటు విదేశాల నుంచీ కూడా రావడం మొదలు పెట్టారు. ఫౌండేషన్‌కు మరో ఉపాధ్యక్షురాలైన పుపుల్ జయకర్ వచ్చారు. ఆవిడ కృష్ణమూర్తికి ముందునుంచీ సహకారీ, మిత్రురాలు కూడాను. ఆవిడ తాలూకు ఒక విధమైన దర్ప ప్రవర్తనను చూస్తే చాలు ఆవిడ రాజకీయంగా చాలా శక్తిమంతురాలని మనం ఊహించుకోవచ్చును. అప్పటి ప్రధానమంత్రి ఇందిరాగాంధీ ఆవిడకు చాలా సన్నిహిత మిత్రురాలు. అదీగాక ఆవిడ, కేబినెట్ మంత్రి స్థాయి ఉన్న 'ఫెస్టివల్ ఆఫ్ ఇండియా'కి అధ్యక్షురాలు. అయితే నాతో మాత్రం చాలా మృదువుగానూ ప్రేమగానూ ప్రవర్తించేదని ఒప్పుకోవాలి. ఏదేమైనా, ఈ సంస్థకు సంబంధించి నేనెంత వరకూ పనికి వస్తానన్న సంగతిని ఆమె ఇంకా బేరీజు వేస్తోందని నాకు అనిపిస్తూనే ఉండేది.

ఫౌండేషన్ తాలూకు వివిధ పాఠశాలల ప్రధానాధ్యాపకులూ, అధ్యాపకులతో సహా చాలామందే వచ్చారు. వాళ్ళలో కొంతమంది ఫౌండేషన్ తాలూకు పాలకమండలి సభ్యులు. ఋషీవేలీ స్కూల్ ప్రధానాధ్యాపకురాలు మిసెస్ రెబెకా థామస్‌తో నాకు చాలా మైత్రి ఏర్పడింది. ఆవిడ చాలా దక్షురాలు. ఆవిడ భర్త థామస్‌గారు కోశాధికారి. ప్రతిదాంట్లోనూ బాగా తప్పులు పట్టి గేలి చేస్తూ ఉండేవాడైనా, ఆయన అనుభవ సిద్ధుడు. ఆయన కృష్ణమూర్తి సిద్ధాంతాల నుండి దూరంగా ఉండడానికే ప్రయత్నించే వాడు. ఈ ఇద్దరితో నా మిత్రత్వానికి పాక్షిక కారణం వారిద్దరూ నా పుట్టిన ఊరు త్రివేంద్రం నుంచి వచ్చిన వాళ్ళు కావడమే. అంచేత మేము మలయాళంలో మాట్లాడు కోవచ్చు కూడాను. జనులను భాష దగ్గరకు తెచ్చినట్టు ఇంకేదీ తీసుకురాలేదు. అదీగాక

తరవాత బయట పడిందేమిటంటే ఆ థామస్‌గారికి మా కుటుంబం బాగా తెలుసునన్న విషయం.

నేను పరిచయం కలుపుకున్న కొద్దిమందిలో పుపుల్ జయకర్ కూతురు రాధికా హెర్జ్‌బర్గర్ ఒకతె. ఆమె నిజంగా నికార్సైన, బొత్తిగా అహంకారం లేని సాధుస్త్రీ. బౌద్ధుల అధ్యయన విషయంలో ఆమెకు డాక్టరేటు ఉంది. కెనడాలోని ఆన్టేరియో విశ్వవిద్యాలయంలో సాంకేతిక తర్కాన్ని బోధించే ప్రొఫెసర్ (డాక్టర్) హాన్స్ హెర్జ్‌బెర్గర్‌ను పెళ్ళాడింది ఆమె.

మేధావులూ సోషలిష్టులూ విద్యావంతులూ బౌద్ధ విద్వాంసులూ దివ్యజ్ఞానులూ సంఘంలోని ఉన్నత వర్గాల వారూ వసంతవిహార్ లోనికీ బయటకూ తిరుగుతున్నారు. జేకే ఫౌండేషన్ పాలకవర్గ సభ్యులు పూర్తిగా వేరే ప్రత్యేక వర్గం వారు; వాళ్ళు ఇతరుల కన్నా ఉత్తములని ఎంపిక నొందిన వాళ్ళు. అంచేత వాళ్ళకు చెప్పుకోదగిన ఆదరణ నివ్వాలని నాకు చెప్పారు. నేను తరవాత కలుసుకున్న ఆ సభ్యుల్లో కొంతమంది నిజంగా చాలా మంచివాళ్ళే; కానీ వారిలో మరికొంతమంది తాము ప్రతీ ఇతరుడి కన్నా చాలా పైనున్నవాళ్ళమని అనుకునే వాళ్ళు.

ఉపన్యాసాలకు చాలామందే హాజరయ్యారు. వేదిక మీద మఠం వేసుకొని, బుద్ధుడి మాదిరి స్థిరంగా కూర్చున్న కృష్ణమూర్తిగారిని చూసి, డైనింగ్ టేబుల్ దగ్గర పరిహాసాలాడే ఆయనేనా ఈయన అని విస్తుపోయేవాణ్ణి. ఉపన్యాసాలయిపోగానే కృష్ణ మూర్తిగారు ఋషీవేలీ స్కూల్‌కి వెళ్ళి, అక్కణ్ణించి తిరిగి చెన్నై వచ్చి అమెరికాకు తిరిగి విమానం మీద వెళ్ళిపోతారు. జనసమూహాలు మాయమయ్యాయి. అచ్యుత్‌జీ, ఆయన తమ్ముడు పద్మాకర్, పద్మాకర్ భార్య సునందలు, కృష్ణమూర్తిగారితో పాటు ఋషివేలీకి వెళ్ళారు. తాత్పర్యతః నేనొక్కణ్ణే మిగిలాను. ఆఫీసు సిబ్బందీ, వంటింటి సిబ్బందీ, వసంత విహార్‌లో వారాంతాల్లో ఉంటూ ప్రతులు (Transcripts) రాయడంలోనూ ఉత్తర ప్రత్యుత్తరాలు రాయడంలోనూ సాయపడుతూండే ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వార్తాపత్రిక ఉపసంపాదకుడు కే. కృష్ణమూర్తి మాత్రమే నాతోబాటు ఉన్నారు అక్కడ. కృష్ణమూర్తి గారు ఉచ్చరించే ప్రతీ మాటనూ పట్టుకొని వేళ్ళాడే నిజమైన భక్తుడిగా అతన్ని చెప్పు కోవచ్చు.

కృష్ణమూర్తిగారు ఋషీవేలీ నుంచి పదిరోజుల తరవాత వచ్చి కాలిఫోర్నియాకు వెళ్ళిపోయారు. పట్వర్ధన్లు చెన్నైకి తిరిగి వచ్చారు. వాళ్ళకు నాతో బాగా స్నేహం కుదిరింది కనక త్వరలోనే నాకు పరిపాలనాంగ కార్యనిర్వహణాన్ని అప్పగించారు. అప్పుడప్పుడు, బాగా దూరంకాని లీత్ కేసిల్ స్ట్రీట్‌లో ఉన్న, మా అమ్మా నాన్నలను

చూసి వస్తూ ఉండేవాణ్ణి. మా చెల్లెలు ఐఏఎస్‌కు ఎంపికయింది. తరవాత ఆమె మద్యం తయారీ వ్యాపారిని (Brewer) ఒకతనిని పెళ్ళిచేసుకుని బెంగళూరు వెళ్ళిపోయింది. మా చిన్నచెల్లెలు కాలేజీలో చదువుతోంది. ఆమె మా తల్లిదండ్రులతో ఉండేది.

ఈ విధంగా ఒక ఏడాది గడిచింది. మళ్ళీ కృష్ణమూర్తిగారు వచ్చారు. ఈసారి నేను ఆయనను తీసుకు రాదానికి పట్వర్ధన్లతో సహా ఎయిర్‌పోర్టుకు వెళ్ళాను. ఆయనతో బాటు ఆయన వ్యక్తిగత డాక్టరు పర్చూర్, ఆయన సన్నిహిత మిత్రురాలు మిసెస్ మేరీ జిమ్బలిస్ట్ వచ్చారు. ఆమె 'ద టెన్ కమాండ్‌మెంట్స్' సినిమాను నిర్మించిన హాలివుడ్ నిర్మాత సామ్ జిమ్బలిస్ట్ కూతురు. ఫౌండేషన్‌కు సంబంధించిన చాలా మంది భారతీయుల్నీ విదేశీయుల్నీ కూడా కలుసుకున్నాను నేను. అప్పటికీ, కృష్ణ మూర్తిగారు చూడడంతోనే నన్ను గుర్తించడం మొదలెట్టారు. కొన్నిసార్లు కొంతసేపు మాట్లాడడం కూడా చేసేవారు. ప్రాకారం లోపల ఆయన నడిచేటప్పుడు నేను కూడా ఆయనతో బాటు నడుస్తూ అక్కడున్న కట్టడాలకు ఏయే మార్పులు చేశామో మొదలైన వాటిని చూపించేవాణ్ణి. ఒకరోజున మధ్యాహ్న భోజనానికి ఆయనను తీసుకు రావడానికి పైకి వెళ్ళాను. యథాలాపంగా మేజిక్‌లో నాకున్న ఆసక్తి గురించీ ప్రావీణ్యం గురించీ చెప్పాను.

"మీరు గాలిలో తేలగలరా?" అని అడిగారు ఆయన, బహుశా నేను చెయ్యలేనని చెబుతానని ఆశిస్తూ.

"అవును, నేను తేలగలనండి" అన్నాను.

"మీరు నవ్వులాటకనటం లేదు కదా" అన్నారాయన.

'అయ్యా! మీరు నన్ను అనుమతిస్తే భోజనశాలలో రేపు మధ్యాహ్న భోజన వేళ ఆ భ్రాంతిని నేను ప్రదర్శిస్తాను" అని అన్నాను.

"సరే", అన్నారాయన.

మర్నాడు డైనింగ్ టేబుల్ దగ్గర ఒక ప్రత్యేకమైన బల్ల వేశాను. కృష్ణమూర్తిగారూ, మరో డజనుమంది అతిథులూ, వాళ్ళెవరెవరో – నాకు ఖచ్చితంగా గుర్తు లేదు కానీ – వాళ్ళ ముందు నన్ను నేను ఒక గుడ్డతో కప్పుకుని ఆ బల్ల మీద పడుకుని గాలిలోకి తేలాను. కృష్ణమూర్తి బిగ్గరగా అరవడం నాకు వినిపించింది: "జీసస్! ఆయన చేశాడా పనిని!" అని. నేను ఆయనకు ఆ మోసం ఎలా చేస్తారో, అదెంత సీదాసాదాయో చెప్పినప్పుడు ఆయన ముఖంమీద కనిపించిన పూర్తి అపనమ్మకపు చూపు నాకింకా

జ్ఞాపకముంది. "అయితే అక్కడ మీరు నన్ను తెలివితక్కువ వాజమ్మను చేశారన్నమాట" అని మాత్రం అన్నారు.

మళ్ళీ ఉపన్యాసాలు ప్రారంభమయ్యాయి. పొద్దుటిపూటల్లో ప్రశ్న-సమాధానాల సమావేశాలుండేవి. నన్ను బాగా నిర్విరామమైన పనిలో ఉంచారు. నా పనిలో భాగంగా నేను విదేశీ అతిథుల బాగోగులను చూడాలి. ఉపన్యాసాలు కాగానే కృష్ణమూర్తిగారు ఇంగ్లండుకు వెళ్ళారు. అతిథులందరూ వెళ్ళిపోయారు. తిరిగి అక్కడ శాంతీ, నెమ్మదీ ఏర్పడ్డాయి. ఎయిర్‌పోర్ట్ లోపల సెక్యూరిటీ చెక్ జరిగే చోటునుంచి వెనుదిరిగి నాతో "నేను తిరిగి వచ్చినప్పుడు మిమ్మల్ని చూస్తానని ఆశిస్తున్నాను" అని కృష్ణాజీ అనటంతో మళ్ళీ సంచారానికి పోదామనుకున్న నా పథకాలను వాయిదా వేసుకున్నాను.

వసంతవిహార్‌లో ఉన్న సంవత్సరాల్లో చాలా రకరకాల జనాలు సమాజంలోని శ్రేష్ఠవర్గంవారూ, కృష్ణాజీని దివ్యుడని భావించే నిజమైన భక్తులూ, అపనమ్మకస్తులూ, మేధావులూ, పెద్దపెద్ద వాళ్ళతోనూ, శక్తిమంతులతోనూ సంబంధమున్న పుపుల్ జయకర్‌నుంచి కొన్ని "ప్రసాదాల"ను ఎక్కువగా ఆశిస్తూ వచ్చే కళాజన సమూహాలూ, తాము ప్రవేశించిన చిక్కు మార్గాన్ని చూసి గందరగోళపడే కొంతమంది నిజమైన ఆధ్యాత్మిక జిజ్ఞాసువులూ –నాకు అగుపించారు.

వాళ్ళందరూ చాలావరకూ సాధువులూ, శాంతికాముక సమాజమూను. కానీ చిన్న అంతర్భాగ సమూహం ఒకటి ఉండేది – వాళ్ళను, మరో మంచి నాణ్యమైన మాట లేదు కనక, 'అతివాద కృష్ణమూర్తైట్లు' అని పిలవచ్చును. భారతీయ ప్రాచీన సంప్రదాయాల గురించి లోతుగా అధ్యయనం చేయకపోవడం వల్ల వాళ్ళు, తమ అజ్ఞానాన్ని కప్పిపెట్టుకోవడం కోసం సనాతన గ్రంథ జ్ఞానమవసరం లేదనే కృష్ణమూర్తి గారి (ఎంగిలి) మాటలను ఉదాహరిస్తూ ఉంటారు. బాబాజీ శిక్షణలో హిందూ ప్రజ్ఞా గ్రంథాలను లోతుగా అధ్యయనం చేయడం వల్ల సంప్రదాయాన్నీ క్రమశిక్షణనూ పూర్తిగా అనాదరించే ఈ తీరును చూసి నాకు చాలా బాధ వేసేది.

మొత్తం మీద చూస్తే, కృష్ణమూర్తి వ్యవస్థతో పదేళ్ళపాటు నాకు ఏర్పడిన సంబంధం నిజంగా చాలా గొప్ప విద్యానుభవమే. ఇప్పటికీ, నేను ఉపన్యాసాలతో బాగా ఉత్తేజితుడినయి ఉన్నాను; రోజువారీ ఏర్పాట్లు చేయడంలో చిన్నగా సాయపడుతూ ఉండేవాణ్ణి.

ఏప్రిల్ 1985లో ఒక రోజున బాబాజీ నుంచి ఒక సూచన అందింది. ఆయన ఆ కబురును తన అననుకరణీయమైన రహస్యశైలిలోనే పంపించారు. నేనొక

సాయంత్రం వసంత్‌విహార్ గేట్ల దగ్గర నిలుచొని ఉన్నాను. నడకకు వెళ్ళాలా, లేకపోతే జాన్ బాల్డాక్ రాసిన "ఎసెన్స్ ఆఫ్ రూమీ" (Essence of Rumi) చదవాలా అని నాలో నేనే తర్జనభర్జన చేసుకుంటూండగా నేను రోడ్డుమీద నుంచి వస్తూన్న కాషాయ దుస్తుల సాధువుని ఒకణ్ణి చూశాను. ఆయన దగ్గరకు వచ్చేసరికి అతను చెప్పుల్లేని కాళ్ళతో నడుస్తున్నాడని చూశాను. నున్నగా గడ్డం గీసుకుని, గుండుతో ఉన్న ఆయనకు వర్చస్సుగల యువకముఖం ఉంది. ఆయన గంధంతో వైష్ణవ శాఖ నామాలను తన నుదుటిమీద ధరించి ఉన్నాడు. ఆయన సరిగ్గా నా దగ్గర వరకూ వచ్చి "రాధే రాధే" అని అభివాదం చేశాడు. నేనూ "రాధే రాధే" అని బదులు పలికి త్వరగా ఆయన పాదాలను తాకేను. అదృష్టవశాత్తూ కృష్ణమూర్తిగారి తాలూకు శ్రేష్ఠవర్గ అనుయాయులు ఎవ్వరూ నా చుట్టుపట్ల లేరు. లేకపోతే వాళ్ళు నేను చేసిన పనిని మూర్ఖపు చేష్టగా జమకట్టేవారు.

ఉపోద్ఘాతమేమీ లేకుండానే ఆ సన్యాసి నేరుగా విషయానికి వచ్చేశారు: "బాబాజీ నిన్ను నాలుగు రోజుల్లో చూడదలచుకున్నారు. ఆయన నీకు మౌనీబాబా గుహ దగ్గర దొరుకుతారు. ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా బయల్దేరు. రాధే రాధే" (అని చెప్పారు).

అది చెప్పి వెళ్ళిపోయాడాయన. రోడ్డు చివరన అదృశ్యుడైపోయాడు. నేను శీఘ్రంగానే వెళ్ళడానికి ఏర్పాట్లు చేసుకున్నాను. మొదట నేను కార్యదర్శికి చెప్పాను. నేను చాలా జరూరుగా హిమాలయాలకు వెళ్ళాలి కనక రెండు వారాలు సెలవు తీసుకుంటున్నానని సూచించాను. సెలవు మంజూరయింది. నేను రైల్వేస్టేషన్‌కి వెళ్ళి మర్నాడు ఢిల్లీ వెళ్ళడానికి టికెట్లు కొనుక్కున్నాను.

# 45. బాబాజీ దేహత్యాగం

నేను ఋషీకేశ్ చేరిన రోజునే తిన్నగా మౌనీబాబా గుహకు వెళ్ళిపోయాను. బాబాజీ (అక్కడ) ఒంటరిగా ఉన్నారు. "అలఖ్ నిరంజన్" అని ఆయన నన్ను పలకరించారు. ఆయన పాదాలమీద నేను సాగిలపడ్డాను. "మౌనీబాబా ఉత్తరకాశీ వెళ్ళారు. అవును, చాలాకాలమయింది. చూపే లేదు. నువ్వు బాగున్నట్టున్నావు" అన్నారు ఆయన.

"అవునండి బాబాజీ! చాలాకాలమే అయిపోయింది. నేను మీమీద ఆధారపడి లేనని నిరూపించాలని మీరనుకుంటున్నారు కూడా కదా! అయినా ఇక్కడకు రావడం నాకు చాలా బాగుంది. మీరెప్పటిలాగే ఉజ్జ్వలంగా భాసిస్తున్నారు".

"సరే, అది చాలు. నువ్వు నన్ను ఇబ్బంది పెడుతున్నావు. ఇప్పుడు నా మాట విను. ఒక ముఖ్యమైన పని ఉంది. అది నువ్వు చేసి తీరాలి. నేను వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నాను"

"ఎక్కడికి బాబాజీ? నేనూ మీతో వస్తాను"

"కాదు నాయనా. నువ్వు రాలేవు. నువ్వు చేయాల్సిన పని ఉంది. నేను నా శరీరాన్ని వదిలి పెట్టేద్దామనుకుంటున్నాను"

పిడుగు పడ్డట్టుగా నా తల తిరిగింది. "కానీ బాబాజీ నేను...." ఇక నా నోట్లోంచి ఏ మాటలూ ఊడిపడలేదు. నేను కళ్ళు వెడల్పుగా తెరుచుకుని రెప్పలార్పకుండా తదేకంగా ఆయన్ని చూస్తూ ఉండిపోయాను.

"ఇప్పుడు నువ్వు ధైర్యాన్ని పుంజుకో నాయనా! నేను నువ్వు ఒక యోగివను కున్నాను. సరే, కొన్నిసార్లు నెమ్మదిగా ఊపిరి పీల్చు. ఇప్పుడు ఊపిరిని వదిలిపెట్టు. ఆఁ. అర్థదీ. ఇప్పుడెలా ఉంది నీకు?

"సరే బాబాజీ! ఇందాకటి కన్నా బాగానే ఉంది. కానీ, మీరు అకస్మాత్తుగా చెప్పడంతో నేను బాగా విచలితుణ్ణైపోయాను. ఇప్పుడు నేను సిద్ధంగా ఉన్నాను. చెప్పండి, నేనేం చెయ్యాలో". నా కళ్ళల్లోంచి నీళ్ళు చిమ్ముకొని ఇవతలకు రాకుండా తంటాలు పడుతున్నాను.

"నేను చేయవలసిన పని అయిపోయింది. నువ్వు చెయ్యవలసినది చాలా ఉంది. మొదట కొన్ని ముఖ్యమైన సంగతులు సంక్షిప్తంగా చెబుతాను. నేను పోయిన తరవాత నా శరీరాన్ని ఏ విధంగా సంస్కరించాలో చెబుతాను. శ్రీ గురువు, నా మిత్రుడు నాగరాజు తప్పిస్తే, నా నిష్క్రమణం గురించి తెలిసిన వాడవు నువ్వొక్కడివే. ఇప్పుడు జాగ్రత్తగా విను".

క్రియాభ్యాసం గురించిన సూక్ష్మ విషయాలకు సంబంధించి కొన్ని సూచనలు చెప్పి, యోగులు మరణసమయంలో అభ్యసించే చివరి క్రియాదీక్షనిచ్చారు నాకు. ఒక యోగి శరీరాన్ని చాలిద్దామనుకుంటే, అతను ఈ చివరి క్రియను చేస్తూ శారీరక కర్మలనన్నిటినీ ఆపు చేసి, నిమ్మళంగా శరీరం నుంచి వెళ్ళిపోతాడు.

శ్రద్ధ, సత్యసంధత అనే రెండు నియమాలకు లోబడి ఉన్న ఎవరికైనా నేను క్రియాయోగదీక్షని ఇవ్వవచ్చునని అప్పుడు నాకు ఆయన అనుమతినిచ్చారు.

ఆ తరవాత ఆయన నన్ను అచేతనావస్థలోకి నెట్టి, నా గడచిన కాలంలోకి, ఈసారి ఇంతకు ముందు కన్నా ఎక్కువ వివరాల్లోకి వెళ్ళేలాగ చేశారు. శ్రీగురు బాబాజీతో నా సంబంధం ఆయన గొప్ప నాథయోగిగా తన పాత్రను నిర్వహిస్తూన్నప్పటిది. నేను అప్పుడు శ్రీకృష్ణుడి సంతతిగా చెలామణీ అయిన చంద్రవంశానికి (యదువంశానికి) చెందిన ఒక ఉగ్రయోద్ధను. నేను ఆ సమయంలో జైసల్మేరు తాలూకు ఎడారి రాజ్యాన్ని స్థాపించడంలో మునిగి ఉన్నాను. అప్పుడు ఆయన మొట్టమొదటిసారిగా నా గురువు.

(ఆ జన్మనాటి) ఋణానుబంధాలూ కార్మిక సంబంధాలూ కారణంగా ఇప్పుడు ఈ జీవితంలో తరవాత తరవాత మునుపటి భారత రాజవంశాలకు చెందిన వాళ్ళు నాకు సహచరులూ శిష్యులూ అవుతారని, నేను అచేతనావస్థలోంచి బయటకు వచ్చిన తరవాత, బాబాజీ నాతో చెప్పారు.

ఆ పూర్వజన్మల్లో రకరకాల పాత్రల్లో నాతో సన్నిహితంగా ముడిపడిన వారి జీవితాల బాధ్యతను నేను తీసుకోవలసి వస్తుందని బాబాజీ నాకు చెప్పారు. వాళ్ళను చూడగానే నేను గుర్తించగలుగుతాననీ, సహాయం అడిగినవాణ్ణెవణ్ణైనా సరే నేను ఏ విధంగానూ తిరస్కరించకూడదనీ చెప్పారు.

నేను పెళ్ళి చేసుకోవాలన్న విషయాన్ని పునః ఉట్టంకించారు. వైవాహిక జీవితం భావావేశపూరిత సన్నివేశాలను అదుపులో పెట్టగలిగే పరిపక్వతను నాకందిస్తుందని ఆయన అన్నారు. "ఆధ్యాత్మిక జిజ్ఞాసువుకు వివాహం చేసుకోకుండా ఉండడం ఏ రకమైన ప్రత్యేక యోగ్యతా కాదు. ఏదేమైనా, అది నీ విషయంలో మాత్రం అనువర్తించదు. ముందుకాలంలో నీ దగ్గరకు వచ్చే వాళ్ళలో చాలామంది పెళ్ళైన వాళ్ళే ఉంటారు. నువ్వు కనుక వైవాహిక జీవితమేమిటో తెలుసుకోకపోతే వాళ్ళకు సలహాను ఇవ్వలేవు, సహాయమూ చేయలేవు".

నా స్వీయకథను రాయడం ప్రారంభించాలని కూడా బాబాజీ నొక్కి చెప్పారు.

కైలాసానికీ మానస సరోవారికీ వెళ్ళడానికి కొంత ముందుగా మొదలుపెట్టి, అక్కణ్ణించి తిరిగి వచ్చిన ఒక ఏడాదిలోపులో దాన్ని పూర్తి చేయాలని కూడా చెప్పారు. ఆయన చెప్పిన మరికొన్ని విషయాలు పూర్తిగా గోప్యమైనవి; నేను వాటిని వెల్లడించకూడదని ఒట్టుపెట్టుకున్న రహస్యాలు.

ఇదంతా పూర్తైన తర్వాత, ఆయన దేహాన్ని పరిత్యజించిన మీదట దాన్ని ఏ విధంగా సంస్కరించాలన్న విషయమై సూచనలివ్వడం ప్రారంభించారు.

"బాబాజీ! మీరు చెప్పబోయేముందు, తప్పకుండా ఈ పని మీరు చేయదలచు కున్నారా అనే విషయమై దయ ఉంచి చెప్పండి. కొంత సమయం పాటు దీన్ని వాయిదా వెయ్యలేరా? దయ ఉంచి...."

"అబ్బాయీ, నీకు తెలుసును, నేనేమైనా ఒకటి చేయదలచుకుంటే, దాన్ని అలాగ చేయడానికి ఘనమైన కారణాలుంటాయని. నేను ఈ పనిలో ముందుకు సాగదలచుకున్నాను. నా మనశ్శక్తుల్లో ఎనభై శాతం నీకు బదిలీ అవుతాయి. కానీ నువ్వు ఆ సామర్థ్యాలను పైకి కనపడనీయకుండా దాచుకోడానికి ఒక విధంగా బాగా కష్టపడాల్సి వస్తుంది; మరి ఏ ఇతరుడిలాగే బతకడాన్ని నటించవలసి వస్తుంది. నువ్వా పని చేయగలవని నాకు నమ్మకముంది. శ్రీగురువు కొద్ది సమయంలో వచ్చి నిన్ను దీవిస్తారు.

"నేను వెళ్ళిపోయిన తరవాత, నువ్వు కృష్ణమూర్తి ఫౌండేషన్‌కు తిరిగి వెళ్ళు. కృష్ణమూర్తి కూడా త్వరలోనే నిష్క్రమిస్తాడు. ఆయన వచ్చిన ఉద్దేశం నెరవేరింది. తర్వాత జరిగే దాన్నంతనీ నిశితంగా పరిశీలించు. నీ గుండెలోనే నేనుంటానన్న మాటను గుర్తుంచుకో. ఇప్పుడు ఇక్కడ చేయవలసినదిదిగో ఇది".

నీలకంఠ పర్వత పాదాల దగ్గర, మౌనీబాబా గుహకు చేరువలో అడవిలో ఉన్న ఒక ఏకాంత స్థలాన్ని నాకు చూపించారు. బాబాజీ నాకు ఒక గెడ్డపారా, ఒక గెడ్డపలుగూ, ఒక తవ్వుగోలా సమకూర్చారు. ఫలానా కొలతలున్న ఒక పెద్ద గొయ్యిని నేను తవ్వాలి. ఈ విషయంలో నాకే రకమైన అనుభవమూ లేకపోయినా సరే అది నేనొక్కణ్ణే చెయ్యాలి. దానికోసం బాబాజీ నా మనస్సుకు కావలసిన నేర్పునీ, నా శరీరానికి కావలసిన బలాన్ని సమకూరుస్తారు.

రెండు రోజుల్లో ఆ గొయ్యి సిద్ధమయింది. నా చేతులు పూర్తిగా కదుములు కట్టేశాయి. మూడో రోజు గురువారమయింది. ఆ రోజున బాబాజీ నాకు మరికొన్ని వ్యక్తిగతమైన ఆదేశాలిచ్చారు. అదే రాత్రి మేము గొయ్యి తవ్విన స్థలానికి వెళ్ళేం.

నిర్మలమైన ఆకాశంలో పూర్ణచంద్రుడు వెలిగిపోతున్నాడు. చల్లని గాలి వీస్తోంది. "మనం శ్రీగురువు కోసం నిరీక్షిద్దాం" అని బాబాజీ అన్నారు.

కొంతసేపట్లోనే, నేను ఇంతకుముందు అరుంధతీ గుహ దగ్గర చూసిన లాంటి కాంతిబంతే అంతరిక్షంలో కనిపించింది. అది పున్నమినాటి చంద్రుడికి దగ్గరగా వస్తున్న కొద్దీ, (ఆకాశంలో) రెండు చంద్రుళ్ళున్నట్టుగా అనిపించింది. అది మా దగ్గరకు వేగంగా చప్పుడు చేస్తూ వస్తూ ఇంకా పెద్దదిగా అయింది. ఈసారి (అప్పటిలాగ కాకుండా) అది నేలమీదకు దిగడం చాలా సాఫీగా జరిగింది. అది మా ముందు దిగుతూంటే పిడుగుపాటు ధ్వనీ లేదు, ఏ రకమైన చప్పుడూ లేదు.

వెలుగుతూన్న ఆ గోళం తెరుచుకుంది. దానిలోంచి శ్రీగురువు బయటకు అడుగు పెట్టారు. ఆయన వెనక, వెలిగిపోయే నీలచ్ఛాయతో ఉన్న అత్యంత సుందరుడైన దిగంబరుడు కూడా దిగేడు. మేము సాగిలపడిన తరవాత, శ్రీగురువు నాతో ఇలా అన్నారు: "నువ్వు ఇంతకుముందు నాగరాజును కలుసుకున్నావు. ఈసారి ఆయనే మరో రూపంలో ఉన్నారంతే సర్పలోక జీవులు కామరూపులు. ఇప్పుడిక అసలు వ్యవహారం

"నీ గురువు శరీర మనస్సులనుంచి కొన్ని ప్రత్యేకమైన తత్వాలను నీ శరీర మనస్సుల్లోకి బదిలీ చేద్దామని మేము నిశ్చయించుకున్నాం. దీనికి కారణమేమిటంటే నువ్వు ఇప్పటి ప్రణాళికలో చాలా పనిచేయాల్సి వుంది. మీ గురువు ఏ పతాకమూ ఏ సంస్థా లేకుండా మహా నిశ్శబ్దంగా పని చేశాడు కానీ నువ్వు మాత్రం వేరు విధంగా పని చేయాల్సి ఉంటుంది. 1991 వరకూ మీ గురువులాగే నువ్వు కూడా నిశ్శబ్దంగానే పని చేస్తావు. దాని తర్వాత క్రమంగా నీ గురించి చాలా ఎక్కువమందికి తెలియడం జరుగుతుంది. నువ్వు సిగ్గుపడో, బెదిరో సంకోచించకు. అదే (ఆ విధానమే), క్రియా నిర్వహణకు కావాలి. ఈ పావన భూమిలో కూడా మానవజాతి ఎంత ఘోరంగా స్వార్థపరమూ హింసాత్మకమూ అవుతుందో నువ్వు చూడబోతావు. మహేశ్! నువ్వు అంగీకరిస్తున్నావా?"

"అవునండి. ఈ మాటలు మీ నోటి నుండి రావాలని నేను కోరుకున్నాను. ఇక సమయమయింది. నన్ను దీవించి మీ దగ్గరే ఉంచుకోండి" అని బాబాజీ అన్నారు.

శ్రీగురువూ, నాగరాజూ, నేనూ పరికిస్తూండగా బాబాజీ గోతిలోకి దిగి, పద్మాసనంలో కూర్చొని, కొన్ని సెకండ్లపాటు బలంగా ఉచ్ఛ్వాసనిశ్వాసాలను చేశారు. ఆయన కళ్ళు నాసటి మధ్యలో స్థిరంగా నిలిచి ఉన్నాయి. చాలా బలమైన శక్తివంతమైన

నిశ్వాసం తరవాత, ఆయన నిశ్శబ్దుడైపోయారు; ఆయన శరీరం పూర్తిగా నిశ్చలమై పోయింది.

ఆయన శిరస్సు అగ్రం నుంచి ఇంద్రధనుర్వర్ణ కాంతి బహిర్గతమై నా హృదయంలో ప్రవేశించింది. నా అంతర్వ్యక్తిత్వం శాశ్వతంగా మారిపోయింది. ఇక అప్పటినుంచీ బాబాజీ శక్తులు నా ద్వారా పనిచేయడం మొదలుపెట్టాయి. ఆ మీద, ఆయన శిరస్సులోంచి ఒక ధవళకాంతి బహిర్గతమై ఆకాశం వైపుకు ఆరోహించింది. కొన్ని సెకన్లలో అది రోదసిలో అదృశ్యమయింది. శ్రీగురువు అప్పుడన్నారు: "ఇక్కడనుకొన్నది అయిపోయింది. నీకు ఏ ఆదేశం ఇవ్వడం జరిగిందో దానిని నువ్వు చెయ్యి. నేనిప్పుడు వెళ్ళిపోవాలి. నాతో సంపర్కం ఏ విధంగా పొందాలో నువ్వెరుగుదువు". నేను శ్రీగురువుకీ నాగరాజుకీ సాష్టాంగపడి నమస్కరించాను. వాళ్ళు తమ విమానంలోకి ఎక్కి త్వరలోనే వెళ్ళిపోయారు.

ఆ రాత్రంతా సమాధిని (మట్టితో) నింపుతూ పని చేస్తూనే ఉన్నాను. నిండిన మొదటి తవ్వుగోలలోని మట్టిని వేయడానికి నిజంగా చాలా బాధాకరమనిపించింది. కానీ అనావేశంగానూ చాలా నిబ్బరంగానూ నేను సమాధిని మట్టితో నింపిన రీతిని చూస్తే నాకే ఆశ్చర్యమేసింది.

కొంతసేపటికి బాబాజీ దేహం ఉన్న గొయ్యి నిండి పూర్తిగా పూడ్చుకుపోయింది. నాకు చెప్పినట్టుగానే పై తలాన్ని గట్టిగా చేశాను; గడ్డి మొలిచిన చిన్న మట్టి పెళ్ళల్ని దానిమీద వేసి నీళ్ళు పోశాను. సమాధిని కట్టడం గానీ, సమాధి స్థలాన్ని గుర్తించడానికి ఒక చిన్న రాతిపలకను పెట్టడం గానీ బాబాజీ నిషేధించారు కనక, నేను ఆ పవిత్ర స్థలం దగ్గర సాష్టాంగపడి లేచి వెళ్ళిపోయాను.

నేను గుహకు తిరిగి వచ్చేసరికల్లా తెల్లారింది. ఉదయిస్తూన్న సూర్యుడు కొండల రేఖాచిత్రాన్ని కెంపువన్నెతో నింపుతున్నాడు. పక్షుల కిలకిలరావాలు చేస్తున్నాయి. గాలి మందంగా వీస్తోంది. హఠాత్తుగా నా గుండె దుఃఖంతో తడిసిపోయింది. సిగ్గూ బిడియం విడిచిపెట్టి నేను భోరుమని ఏడుస్తూంటే నా శరీరం మొత్తం ఊగిపోయింది. ప్రేమ, కృతజ్ఞత, విరహంతో నిండిన కన్నీళ్ళు విరివిగా ప్రవహించాయి. నా దుప్పటి మీద పడుకొన్నాను, అలసిపోయి ఉన్నాను కనక అలా ఏడుస్తూనే నిద్రపోయాను. అది గాఢమైన స్వప్నరహితమైన సుషుప్తి – నేను లేచేసరికి పూర్తిగా కుదటపడ్డాను. ప్రశాంతంగా నా బాధ్యతలను మొయ్యడానికి సిద్ధమయ్యాను.

# 46. "కె" గారి నిష్క్రమణ

రెండు రోజుల పాటు ఋషీకేశ్ చుట్టుపట్ల తిరిగాను. మూడో రోజున, ఢిల్లీకి రైలెక్కి, అక్కడ నుంచి బస్సు మీద అమృతసర్‌కు వెళ్ళాను. అమృతసర్ దగ్గరున్న సిక్కుల స్వర్ణ దేవాలయం చూడాలని ఎప్పుడూ మనసుగా ఉండేది. బాబాజీకి సిక్కుల పవిత్ర గ్రంథం 'గ్రంథసాహిబ్' అంటే చాలా గౌరవముండేది. సిక్కులు దేవుడూ, గురువూ అని ఆరాధించే ఆ గ్రంథం ఉన్న ప్రధాన కేంద్రాన్ని హర్‌మందిర్ సాహెబ్ అనీ స్వర్ణ దేవాలయమనీ అంటారు.

బంగరు గుమ్మటాలున్న ఆ సుందర దేవాలయాన్ని సిక్కుల నాలుగో గురువు గురు రామదాసు ప్రారంభించారు; ఐదో గురువు, గురు అర్జున్, దాన్ని పూర్తి చేశారు. నీటిబుగ్గ నుంచి వచ్చే నీటితో నిండే అమృత సరస్సునే సరోవరం మధ్యలో ఉంది ఈ హర్‌మందిర్ సాహెబ్. ఈ సరస్సును బట్టే ఆ ఊరుకు అమృతసర్ అనే పేరు వచ్చింది. వాఘా దగ్గరున్న పాకిస్తాన్ సరిహద్దుకు ఈ ఊరు బాగా సమీపంలో ఉంది.

తెల్లవారు ఝామున నేను ఆలయంలోకి ప్రవేశించాను. హర్‌మందిర్ సాహెబ్ దగ్గర 'రాగీ'లు గ్రంథసాహెబ్‌ను ఆత్మను ఉత్తేజపరిచేలాగ పాడుతూ ఉంటే నేను గాఢమైన సంతోష పారవశ్యంలో మునిగిపోయాను. ఆ రోజున గ్రంథసాహెబ్‌లో చేర్చిన కబీర్ పాటలను పాడడాన్ని విన్నాను: "ప్రేమ ప్రవేశించని ఎదద, కబీర్ మాటల్లో, ఒక శవదాహకశాల లాటిది. అది చనిపోయినదే...". పవిత్ర గ్రంథానికి నా జోహార్లు అర్పించిన తరవాత, మధురమైన కడా ప్రసాదాన్ని ఆరగించి, భవన సముదాయంలోంచి బయటకు వచ్చాను.

ఒక బస్సు పట్టుకొని ఢిల్లీకి ప్రయాణించాను. ఢిల్లీలో నేరుగా ఉత్తర ఢిల్లీ రైల్వే స్టేషన్‌కు పోయి అనారక్షితమైన రైలుపెట్టెలో చెన్నైకి పోవడానికి టికెట్టు కొన్నాను. అది మహా అలపుతో నిండిన రెండు రోజుల ప్రయాణం. నేను చాలా తక్కువగానే నిద్రపోగలిగాను. డబ్బూ పదవీ ఉన్నవాళ్ళకి సామాన్య నాగరికులూ, అందులోనూ కటిక నిరుపేదలూ, ఏ విధంగా ప్రయాణం చేస్తున్నారో అన్న సంగతే తెలియదు – (నిజానికి) అదొక పీడకల!

చెన్నైకి తిరిగి వచ్చి వసంతవిహార్ దినచర్యలో మళ్ళీ కుదురుకున్నాను. మొదట్లో చాలా కష్టంగా ఉంది. సెలవుల్ని గడపడానికి మాత్రమే ఋషీకేశానికి వెళ్ళేననీ, అక్కడ ముఖ్యమైనదేదీ జరగలేదనీ, అనేదానిని నటించడం కోసం నే పడిన ఒత్తిడిని త్వరలోనే దాటేశాను.

ఆ సంవత్సరం అక్టోబరులో కృష్ణమూర్తిగారు జబ్బు పడ్డారని విన్నాను. అయినా సరే, ఇండియాకు వస్తున్నారని చెప్పారు.

వచ్చీ రాగానే, ఆయన ముందుగా వారాణసి వెళ్ళేరు. అక్కడ బౌద్ధవిద్వాంసుల కూటమితో ఒక చర్చల పరంపరలో పాల్గొన్నారు. వాళ్ళలో ఒకాయన పండిత జగన్నాథ ఉపాధ్యాయులు. మైత్రేయబుద్ధుడి బోధనగా అందరూ నమ్మే కాలచక్రతంత్రమనే మహాయాన గ్రంథం తాలూకు విమర్శనాత్మక ముద్రణను ఆయన ప్రచురిద్దామని చూస్తున్నారు. ప్రవాసంలో ఉన్న అప్పటి టిబెట్టు ప్రభుత్వ అధిపతి సామ్దంగ్ రిన్‌పోచే, ఆ చర్చల్లో పాల్గొన్నవాళ్ళలో మరొక విద్వాంసుడు. "ప్రపంచంలోని ఈ భాగంలో, ఈ భారతదేశంలో ఏదైనా పవిత్రమైనదీ, శాశ్వతమైనదీ ఏమైనా ఉందా? ఉంటే, ఈ ప్రపంచ భూభాగం ఎందుకని ఇంత భ్రష్టుపట్టిందిట?" అనే కృష్ణమూర్తి ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలేవీ దొరకలేదు.

కానీ అప్పటికి ఆయన జబ్బుగా ఉన్నమాట స్పష్టంగా తెలుస్తోంది. ఆయన తన మరణమనే ప్రశ్నను దాని తరవాత ఏమి జరగాలీ అనేవాటిని చాలా నిశితంగా పరిశీలిస్తున్నారు. భారతదేశానికి రావడానికి ముందు, స్విట్జర్‌లాండ్‌లోని సానెన్ దగ్గర 'ఈ లోయ నాకు వీడ్కోలు పలుకుతోంది' అని అన్నారు. సానెన్‌లోని చివరి ఉపన్యాసంలో ఆయన నచికేతో పాఖ్యానాన్ని తిరిగి చెప్పారు: చాలా ప్రశ్నలకు సమాధానాలను కనుక్కోడానికి మృత్యు నివాసానికి వెళ్ళాడు కుర్రాడు ఈ నచికేతుడు. ఆ కథ కఠోపనిషత్తులోది.

1929లో ఆయన రాసినది ఆయన ఆలోచనా ప్రక్రియలో ఇప్పుడు బాగా మున్ముందుగా ఉంది: "కృష్ణమూర్తి చనిపోయినప్పుడు, అది ఎలాగైనా అనివార్యమే, మీ మనస్సుల్లో నియమాలను పేర్చుకోవడం మొదలుపెడతారు. ఎందుకంటే, కృష్ణమూర్తి అనే వ్యక్తి మీ దృష్టిలో సత్యానికి ప్రతినిధి కనక. అంచేత మీరు ఒక ఆలయం కడతారు; దాంట్లో ఆరాధనా కాండలను చేస్తారు... వ్యక్తినైన నా మీద మీరు పెద్ద పెద్ద పునాదులు కడితే, మీరు ఆ ఆలయ కట్టడంలో చిక్కుబడిపోతారు. అంచేత ఆ ఆలయం నుంచి మిమ్మల్ని ఇవతలికి లాగడానికి మీకు మరో గురువు కావల్సి వస్తాడు. కానీ మానవ మనస్సెటువంటిదంటే ఆ కొత్త బోధకుడి చుట్టూ కూడా మీరు మరో ఆలయం కట్టేస్తారు. ఈ విధంగా అనంతంగా సాగుతూనే ఉంటుంది".

ఆయన తనమీద మనుషులు కట్టుకున్న పునాదుల్ని కదిలించి కకావికలు చేద్దామని విపరీతంగా ప్రయత్నిస్తున్నారు. జనులు, తాము ఎక్కడ క్షేమంగానూ సురక్షితంగానూ ఉండడానికి అలవాటు పడ్డారో, ఆ ఆలయాలను ధ్వంసం చేయడానికి ఆయన తప్ప మరెవ్వరూ సిద్ధంగా లేరు.

నవంబర్లో ఋషీవేలీ చేరుకోగానే ఆయన పూర్తిగా శక్తి ఉడిగిపోయి ఉన్నారు. ఆయన ఆరోగ్యం దెబ్బ తింటోంది. ఆందోళన కలిగించే రీతిలో ఆయన బరువు కోల్పోయి కృశించి పోతున్నారు. ఋషీవేలీలో తన చివరి ఉపన్యాసాన్ని ఆయన తన 'చివరి ప్రదర్శన'గా చెప్పేరు. ఉపాధ్యాయులతోనూ విద్యార్థులతోనూ తిరిగి తిరిగి పర్యాలోచనం చేస్తూ మీరు ఇతరత్రా ఉన్న స్కూళ్ళకన్నా ఏ విధంగా వేరుగా ఉన్నారో ఘనమైన కారణాలను ఉట్టంకించి చెప్పమని ఆయన పదేపదే ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. వాళ్ళ సమాధానాలతో ఆయన బొత్తిగా సంతృప్తి పడలేదనిపిస్తుంది.

ఉపన్యాసాలివ్వడానికి డిసెంబరు 22న చెన్నైకి చేరుకున్నారు. ఆయన ఇంకా ఎక్కువ బరువును కోల్పోయారు. టెంపరేచర్ చాలా ఎక్కువగా ఉంది కూడాను. తాను ఆ ఉపన్యాసాలను పూర్తి చేయగలనా లేదా అని సందేహపడ్డారు కూడాను. ఆయన ఆరోగ్య పరిస్థితి చాలా గడ్డుగా ఉందని ఆయనగారి సన్నిహితులకు తెలుస్తూనే ఉంది. అప్పుడప్పుడు ఆయన ఇస్తూన్న సూచనలనుంచి బహిర్గతమైన దృశ్యాన్ని బట్టి ఆయన జీవితం చివరకు వస్తోందనిపిస్తోంది.

"ఓరి దేవుడా! ఏమి తరమండీ ఇది!" అని ఆయనే ఒకసారి వాపోయిన ఈ తరంలోని పక్షపాతగ్రస్తులూ స్వార్థావృతమనస్కులైన వారి అంతస్సులోకి చొరబడడానికి బహిరంగోపన్యాసాల్లో ప్రయాసపూర్వకంగా ఉపయోగించవలసిన విపరీతమైన శక్తియుక్తులే కాకుండా, ఆయన పేరిట ఉన్న ఫౌండేషన్‌లోని పరితృప్తులనూ దాంబికులనూ మార్చి మరొకళ్ళను నియమించడమనే కఠినమైన కార్యం కూడా ఆయనను వేధిస్తోంది. నేపథ్యంలో ఉత్తరాధికారం కోసం కుమ్ములాట ఉండనే ఉంది.

ఫౌండేషన్‌ను రద్దు చేద్దామన్న యుద్ధంలో ఓడిపోయాడాయన. వారి వారి అధికారి పదవుల్లో సురక్షితంగా ఉన్న ప్రముఖ సభ్యుల్లో ఏ ఒక్కళ్ళూ ఆ రద్దుకు సుముఖంగా లేనేలేరు. అంచేత ఆయన తాను ఏ ఫౌండేషన్‌లోనూ భాగస్వామిని కానని చెబుతూ సంస్థనుంచే వేరుపడ్డాడు. నేను నిజానికి ఆ సమయంలో కృష్ణమూర్తి ఫౌండేషన్ సభ్యుణ్ణి కాకపోయినా కూడా, ఒక మంచి మిత్రుడి ద్వారా వ్యక్తిగతంగా కృష్ణమూర్తి గారు నన్ను ఒక ప్రత్యేకమైన సమావేశానికి రావలసినదని పిలిచి, ఆ సమావేశం అంతంలో తన పేరనున్న అన్ని సంస్థల నుంచీ తాను వేరుపడుతున్నానని ఘోషించాడు. మూడేళ్ళ క్రితం వ్యక్తిగతంగా ఆయనను కలుసుకోడానికి నాకు అవకాశం ఇచ్చినప్పుడు ఆయన అన్న మాటలు నాకు బాగా గుర్తున్నాయి: "ఇక్కడ కొన్నాళ్ళుంటే, మీరే చూడగలుగుతారు. నేనింక ఈ బరువును మోయలేని పరిస్థితే వస్తే బహుశా దీన్ని కూడా చెత్తకుప్పలోకి తోసేస్తాను"![1]

ఎవరో ఒకరు ఆడది గానీ మగవాడు గానీ తన వారసులమని ఘోషించు కోవచ్చనే విషయాన్ని ఆయన చాలా గంభీరంగా తీసుకోబట్టే కృష్ణమూర్తి ఫౌండేషన్ తాలూకు నియమాలూ నిబంధనల్లో ఈ క్రింది ఉప నిబంధనను ఆయన అనుబంధించాడు: "ఏ పరిస్థితిలో కూడా తన తన పరిధిలో, ఫౌండేషన్ గానీ ఇతర సంస్థల్లో ఏదైనా గానీ, లేకపోతే వీటి సభ్యుల్లో ఎవరైనా గానీ, కృష్ణమూర్తి బోధనలకు హక్కుదార్లుగా చెప్పుకోడానికి వీల్లేదు. ఎవరూ ఎక్కడా కూడా తన బోధనలకు అధికారిగా నిలబడి చెప్పుకోడానికి వీల్లేదని ఘోషించిన కృష్ణమూర్తి మాటలకు ఇది అనుగుణంగానే ఉంది," అని.

ఈ సమయంలోనే పరిస్థితులు నన్ను కృష్ణమూర్తిగారికి సన్నిహితుడిగా చేశాయి. కృష్ణమూర్తి ఫౌండేషన్ తాలూకు పాత కార్యదర్శితో సహా ప్రధాన కార్యాలయంలోని మునుపటి పోషక రక్షక గణంలో ఉన్న అందర్నీ తీసెయ్యడంలో కృష్ణమూర్తిగారు కృతకృత్యులు కావడం వల్ల, కొత్త వ్యవస్థ అంతా రోజువారీ పరిపాలనా విషయంలో నామీదే ఎక్కువగా ఆధారపడవలసి వచ్చేది. కృష్ణమూర్తిగారు కొత్త కార్యదర్శిగా నియమించిన రాజస్థాన్ రిటైర్డ్ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్, మహేశ్ సక్సేనా అప్పుడే పదవిని చేపట్టేరు కనక, ఆయనకూ చాలా సాయం కావలసి వచ్చేది. కృష్ణమూర్తిగారు స్వయంగా నేనంటే చాలా ప్రేమగా ఉంటూ నాకు ఆయన పడకగదికి రావడానికి స్వేచ్ఛనిచ్చారు.

నిజానికి పాత వ్యవస్థలో వారిని తన దగ్గరకు రానీయడం ఆయనకు సుతరామూ ఇష్టం లేదు. ఇప్పట్నించీ నేనే ఆయనను పడకగది నుంచి ఉపన్యాస వేదిక వరకూ తీసుకువెళ్ళాలనీ, ఉపన్యాసాలు ప్రారంభించడానికి ముందుకు లేపెల్ మైక్రోఫోన్‌ను ఆయన కోసం బిగించడం, ఉపన్యాసాలు కాగానే దాన్ని తీసెయ్యడం కూడా నేనే చెయ్యాలని ఆయన నాతో అన్నారు. ఆయన బరువు తగ్గిపోవడం సాగుతూనే ఉంది; అలాగే టెంపరేచరూ పెరుగుతూనే ఉంది. డాక్టరుగారు దానికి కారణాన్ని ఇదమిత్థంగా చెప్పలేకపోయారు. ఉపన్యాసాలు జరుగుతూండగా ఆయనకు అప్పుడప్పుడు 104° వరకూ టెంపరేచర్ ఉన్నప్పటికీ, జనాలు గుర్తించలేని కొద్ది స్పష్టతా లోపం తప్పించి, ఆయన ఎప్పటి మాదిరిగానే శక్తిమంతంగానూ ఖండితంగానూ మాట్లాడుతూనే ఉండేవారు.

చివరి ఉపన్యాసం 1986వ సంవత్సరం జనవరి నాలుగున జరిగింది. అది "(ఈ)వీడు మాట్లాడుతూన్న విషయంలో మీరు దయచేసి భాగస్వాములవుతారా?" అనే మాటలతో మొదలై, "ఇది చివరి ఉపన్యాసం. కొంచెం సేపు నిశ్శబ్దంగా మనం

---

*1. 44వ అధ్యాయం, 325వ పేజీని చూడండి.*

కూర్చోవాలని మీరు కోరుకుంటున్నారా? సరే, అయ్యా మీరందరూ నెమ్మదిగా ప్రశాంతంగా కొద్దిసేపు కూర్చోండి" అనే వాక్యాలతో అంతమయింది. ఆ రాత్రి ఆయన అపస్మారంలో ఉన్నారు; కానీ మర్నాటి పొద్దున్న తన గదిలో నిమ్మళంగా కూర్చొని టెన్నిసన్ పద్యాల్లో ఒక పద్యాన్ని చదివే రీతిని చూస్తే ఆయన సంస్కృతంలో గానం చేస్తున్నారా అన్నట్టుగా నాకనిపించింది.

ఆయనిక ఎక్కువ కాలం ఉండరని నాకు చాలా గట్టిగా అనిపించింది. ఆయన గదిలో బాగు చేయించవలసినవాటిలో ఒక పాత కుర్చీతో సహా కొన్ని వస్తువులున్నాయి. మళ్ళీ మీరు తిరిగి వచ్చేసరికల్లా ఇవి సిద్ధంగా బాగై ఉంటాయని నేను చెబుతూన్నప్పుడు ఆయన తన బలహీనమైన చేతుల్ని నా భుజాల మీద పెట్టి నా కళ్ళలోకి చూస్తూ "అయ్యా, ఈ సర్కసు అయిపోయింది. నేను మళ్ళీ తిరిగి రావట్లేదు" అని అన్నారు. నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆయన గదినుంచి కిందికి దిగి వస్తూ, మెట్లపైకి వెళ్తూన్న రాధికా హెర్జ్‌బెర్గర్‌ను చూసి ఆవిడకు కూడా ఈ విషయం తెలుసునని నాకు ఎందుకో అనిపించింది.

ఆ రాత్రి ఆయన ఓజాయ్‌కి వెళ్ళారు. ఆయనకు వీడ్కోలు చెప్పడానికి నేను ఎయిర్‌పోర్టుకి వెళ్ళేను. విషమమైన ఆయన భౌతిక పరిస్థితి దృష్ట్యా, ఎయిర్‌పోర్టు అధికారులు విమానాల రోడ్డు తార్‌మెక్* వరకూ ఆయన కారులో వెళ్ళడానికి అనుమతినిచ్చారు. అదే నేను ఆఖరిసారిగా ఆయనను చూడడం. కారు ముందరికి వెళ్తూంటే, అక్కడున్న మేము ముగ్గురం మా చేతులు జోడించి 'నమస్తే' చెబుతూండగా ఆయన ఎప్పటి మాదిరిగానే మర్యాదపూర్వకంగా మా నమస్సులకు బదులు నమస్సులను చెప్పారు.

అప్పట్నించి రమారమి ఒక నెలకు 1986, ఫిబ్రవరి 17న ఓజాయిలో ఆయన చనిపోయారు. డాక్టర్లు చావుకు కారణంగా క్లోమానికి పట్టిన కేన్సర్ అని నిర్ధారించారు. ఆయన మరణానికి కొన్ని రోజుల ముందు చేసిన మాటల రికార్డింగ్‌లో, తన శవానికి ఎటువంటి దీర్ఘకర్మకాండలూ జరిపించవద్దనీ, దాన్ని విద్యుత్ శవ దహనశాలకు పంపించమనీ మనవి చేశారు. అది బహిరంగంగా ప్రసారానికి ఉద్దేశించినది కాదు కనక ఆ టేపులో చెప్పిన విషయాలను బయటపెట్టడానికి నాకు స్వాతంత్ర్యం లేదు. కానీ ఒక్క విషయం మాత్రం చెప్పకుండా ఉండలేకపోతున్నాను: తన శరీరంలో ఎన్నెన్ని గొప్ప శక్తులు పని చేస్తున్నాయో ఎవరికీ తెలియదని సాక్షాత్తూ కృష్ణమూర్తిగారే స్వయంగా దానిలో చెప్పేరు.

* తార్ మెకడమ్. విమానాశ్రయాల్లో విమానాలు దిగడానికీ, బయలుదేరి వెళ్ళడానికీ తారూ, కంకరా మొదలైన వాటితో బాగా దట్టించి వేసిన రోడ్డు భాగాన్ని తార్‌మెక్ అని అంటారు.

# 47. వివాహమూ, నీల్‌బాగ్‌కి మారడమూ

కృష్ణమూర్తిగారు గతించిన తరువాత కొత్త వ్యవస్థ మహేశ్ సక్సేనాగారి కార్యదర్శి కత్వంలో కొంతకాలం సాఫీగానే నడిచింది. రిటైర్డ్ గరిష్ఠ పోలీస్ ఆఫీసర్ కనక ఆయనకు మంచి పరిపాలనా కౌశలాలున్నాయి. కొన్ని తరఫుల నుంచి వ్యతిరేకత ఉన్నప్పటికీ నన్ను ఆయనకు సాయం చేయడానికిగానూ సంయుక్త కార్యదర్శిగా నియోగించడంలో ఏదో విధంగా కృతకృత్యుడయ్యాడు. కృష్ణమూర్తిగారి మరణం తరవాత జరిగిన కృష్ణమూర్తి ఫౌండేషన్ పాలకవర్గ సమావేశంలో నన్నుకూడా పాలకవర్గంలోకి ఎన్నిక చేసుకున్నారు.

కానీ ఎందుకనో సక్సేనా మాత్రం కృష్ణమూర్తి ఫౌండేషన్ తాలూకు వాతావరణంలో ఇమడలేకపోయారు. ఆయన సాంప్రదాయిక వాతావరణం నుంచి వచ్చినవారు. ఇప్పుడు మొదటిసారిగా వసంతవిహార్ ప్రధాన కార్యాలయానికి పొడుగాటి జుట్టుతో మోకాలు వరకూ ఉన్న టీకువన్నె స్నానపుటంగీగా వర్ణించదగిన బట్టల్లో విధి నిర్వహణలో, ఆవరణలో అటూ ఇటూ సగర్వంగా తిరిగే పోలీస్ వాడున్నాడు. వసంతవిహార్‌లోని సందర్శకులూ నివాసులూ మామూలుగా అలవాటు పడ్డ "హెల్లో సార్", "గుడ్ మార్నింగ్"ల స్థానే ఇప్పుడు సాంప్రదాయిక "నమస్తే"లు వచ్చాయి.

త్వరలోనే నాతో వ్యక్తిగతంగా మాట్లాడేటప్పుడు ఇక్కడ సంగతులు సజావుగా సాగట్లేదని ఆయన బయటపెట్టేరు. ఆయన శాంతిభద్రతలకు అలవాటు పడ్డవాడు; తనకింద పనిచేసే ఉద్యోగుల నుంచి విస్పష్టమైన విధేయతకు వాడుకపడ్డవాడు. ఇప్పుడు ఇక్కడి ఆలోచనాపరమూ క్రియాపరమూ అయిన పూర్ణస్వేచ్ఛ ఆయనను చికాకు పెట్టింది. దీనితో ఆయన అప్పుడప్పుడు కనబరిచే దురావేశభరిత ప్రవర్తనా, వ్యాకులత్వపు దాడులకు లొంగిపోవడమూ, కలిసి నాకు ఆయనలో ఏదో వ్యక్తిత్వ పరమైన అస్తవ్యస్తత ఉందన్న శంకను లేవదీశాయి. చివరికి, ఈ దుర్లక్షణాలన్నీ కలిసి అతన్ని కూలదోయడంతో, ఆయన రాజీనామా చేయాల్సి వచ్చి బెనారస్‌కి వెళ్ళిపోయాడు. కానీ అది చాలా సమయం తరవాతనే జరిగింది.

నేను కృష్ణమూర్తి ఫౌండేషన్‌లో సభ్యుడిగా ఎన్నికైన కొన్ని నెలల తరవాత ఏదో ఒక ఘటన జరగడం వల్ల నా జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభమయింది. అందమైన ఇరవై ఐదేళ్ళ అమ్మాయి ఒకతె వసంతవిహార్‌కి వచ్చి నన్ను కలుసుకుంది. ఆమె పేరు సునంద సనాది. కొన్నేళ్ళుగా ఋషీవేలీ స్కూల్లో ఆమె ఇంగ్లీషు అధ్యాపకు రాలుగా ఉండేది. ఇంగ్లీషు సాహిత్యంలో ఆమెకు పోస్టు గ్రాడ్యుయేట్ డిగ్రీ ఉంది. చెన్నైలో ఏమైనా ఉపాధ్యాయేతర ఉద్యోగం దొరుకుతుందేమోననే సంభావ్యతను

పరిశీలిస్తోంది ఆమె. ఆమె తండ్రి ఒక రిటైర్డ్ సైనికాధికారి; ఆమె తల్లిదండ్రులు పురుషవాల్కం అనే చెన్నై శివారు పేటలో ఉండేవారు. ఋషీవేలీలో ఒకసారి ఆమెను చూశాను. అయితే మేము అధికారికంగా కలుసుకోలేదు. ఆమె మాజీ విద్యార్థుల్లో ఒకరు కొన్ని నెలల క్రితం సునంద మంచి టీచరూ, మంచి మనిషీ అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చడం జరిగింది.

ఆ రోజుల్లో కృష్ణమూర్తి బులెటిన్ ప్రచురణను సమన్వయపరచడమన్నది వసంత విహార్‌లోని నా బాధ్యతల్లో ఒక భాగం. సాహిత్య విద్యార్థిని కనక బులెటిన్ విషయంలో సాయపడగలదని నేననుకొని తనను దానికోసం ప్రయత్నించమని సూచించాను. సక్సేనాగారు వెంటనే ఒప్పుకున్నారు. మొదట్లో వారం పొడుగునా ప్రధాన కార్యాలయంలో ఉండడమూ, వారాంతానికి ఇంటికి వెళ్ళడమూ అనే ఏర్పాటు జరిగింది. అది ఆవిడకు బాగానే నప్పింది.

నా యౌవనం నుంచీ కూడా స్నేహపూరిత అనుబంధాలు నాకు కొద్దిమంది ఆడవాళ్ళతో ఉండేవి. అయితే నేను వాటికి అంత ప్రాముఖ్యమేమీ ఇవ్వలేదు. నేనప్పటికే ముప్పై ఐదేళ్ళవాణ్ణి. కానీ మానవ సంబంధాల్లో చిక్కుపడదామన్న మొగ్గుదల ఏమీలేకపోయినా, పెండ్లి నాకు ఆదర్శ స్థితినివ్వడమే కాక, నా చైతన్య వికాసానికి ఒక ఆవశ్యకమైన మెట్టు అనే బాబాజీ ఆలోచనలు నా మనస్సులో మెదలడం మొదలుపెట్టాయి. అన్నిటికీ మించినదేమిటంటే, నిష్కపటంగా, ప్రేమగా, అందంగా ఉన్న ఆమె మంచి కుటుంబం నుంచి వచ్చిన అమ్మాయి కావడం.

కృష్ణమూర్తిగారితో ఒకసారి పెండ్లి గురించి నేను చర్చించినపుడు ఆయన సెయింట్ పాల్‌ను ఉదాహరిస్తూ "కామంతో లోపల కాలిపోవడం కన్నా పెళ్ళి చేసుకోవడమే మెరుగు" అని అన్నారు. నేను నిజానికి కాలిపోవట్లేదనుకోండి. కానీ కొద్ది కాలం కలిసి పనిచేయడంతో, నేనూ సునందా ఇద్దరమూ ప్రేమ, అనురాగాల తాలూకు మందవాయువు వీస్తోందన్న సంగతిని గ్రహించాం. మేము పెళ్ళి చేసుకుందామనుకున్నాం కానీ అది అంత సులభమేమీ కాదు.

ఒక కారణమేమిటంటే, ఆమె ఉడిపిలోని సారస్వత బ్రాహ్మణ కుటుంబం నుంచి వచ్చిన అమ్మాయి (ఆమె తల్లి ధార్వాడ్ నుంచి వచ్చిన ఆవిడ); ఇక నేనేమో బ్రాహ్మణుణ్ణి కాకపోవడమే కాదు, జన్మతః హిందువుకాని జాతికి చెందినవాణ్ణి కూడాను. రెండోదేమిటంటే, నాకు వచ్చే గౌరవ వేతనం చాలా తక్కువది; నాకంటూ ఒక సొంత ఇల్లు కూడా లేదు. అయితే, మేమిద్దరం కలిసి, వివాహం హైందవమూ వైదికమూ కావాలన్న

ఆమె తల్లిదండ్రుల షరతుకు ఒప్పుకొని ఆ సమస్యను ఒక కొలిక్కి తెచ్చాం. కొద్ది పరిచయం మాత్రమే ఉన్న నాలాటి కొత్తవాడిమీద అంత విశ్వాసాన్ని ఉంచడమనే విషయంలోనే కాదు, అప్పటి కాలమాన పరిస్థితుల్లో ఆదర్శప్రాయమైన ధైర్యాన్ని కనబరిచి ఆమె తీసుకున్న నిర్ణయానికి కూడా నేనామెను మెచ్చుకున్నాను. ఆమె తల్లి తండ్రులకు ఆ నిష్పక్షపాత వైఖరే లేకపోతే ఇది సంభవమయ్యేది కాదని కూడా నేను ఒప్పుకొని తీరాలి.

ఇది (స్వీయకథను) రాస్తూన్న సమయానికి మా వైవాహిక జీవితానికి ఇరవై మూడేళ్ళు నిండాయి; మాకు ఇద్దరు, ఎదిగిన పిల్లలున్నారు. మేము అసలు పొరపొచ్చాల్లేకుండా ఉన్నామని నేను చెప్పను. కానీ, మొత్తానికి మాది, ఒకళ్ళనొకళ్ళు ప్రేమించుకుంటూ, సమస్యలను కలిసి పరిష్కరించుకుంటూ నడుపుకుంటూన్న సుసంఘటితమైన కుటుంబమే.

మళ్ళీ వసంతవిహార్ స్థితిగతులకు తిరిగి వద్దాం. మేమిద్దరం యువోత్సాహయుక్తులమైన దంపతులం. కృష్ణమూర్తి ఫౌండేషన్ తాలూకు ప్రధాన కార్యాలయమున్న సుందరమైన ఐదెకరాల ఎస్టేట్‌లో కలిసి పనిచేస్తూ బతుకుతూ ఉన్న మాకు అక్కడ సంగతులు సజావుగా నడవట్లేదన్న విషయం కొద్దిసమయంలోనే తేటపడింది. ఒక కారణమేమిటంటే, సక్సేనా తాలూకు శారీరక, మానసిక ఆరోగ్యాలు రెండూ, రోజురోజుకీ దిగజారిపోవడం. అదీగాక ఆయన తన దాపునున్న మనుషుల్ని చికాకు పరిచేలాగ అనుమానిస్తూ ఉండడాన్ని గమనిస్తూ వచ్చాం. సంప్రదాయ నిమగ్నమైన ఆయన మనస్సు కృష్ణమూర్తి తరహా ఆలోచనా సరళికి సుతరామూ సర్దుకోలేకపోవడమన్నది, ఆయన స్థితిని మరీ తీవ్రతరం చేసిన ఒకానొక అంశమని నేను వ్యక్తిగతంగా భావిస్తాను. సునందను నేను పెళ్ళి చేసుకోవడమన్నదే కాదు, అసలు నేను పెళ్ళి చేసుకోవడమన్నదే ఆయనకు ఇష్టం లేదు కనక, ఆయన నాతో మరీ అతిగా విరోధించడం మొదలుపెట్టాడు కూడాను.

ఇంతలో సునంద గర్భిణి అయింది. సంతానాన్ని పెంచడానికి వసంతవిహార్ యోగ్యమైన స్థలమా అన్న దాన్ని కూడా మేము ఆలోచించడం మొదలుపెట్టాం. సరిగ్గా ఆ సమయంలో అక్కణ్ణించి కదిలిపోడానికి భగవంతుడే పంపించేడా అన్నట్టు ఒక అవకాశం దానికదే మాకు తారసిల్లింది. ఒక రాత్రి బాబాజీ మా ఇద్దర్నీ దీవిస్తూన్నట్టూ, ఇక్కణ్ణించి కదిలిపోడానికి ఇది సమయమన్నట్టూ నేను కల కన్నాను. మరునాటి రోజు పొద్దున్న, ఋషీవేలీ స్కూలువారు నీల్‌బాగ్ స్కూలును

కొనబోతున్నారనీ, వాళ్ళు దాన్ని అక్కడ ఉండి నడపగలవాళ్ళ కోసం చూస్తున్నారనీన్నూ విన్నాను.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సరిహద్దుకు దగ్గరగా, కర్ణాటక రాష్ట్రం తాలూకు పల్లె జిల్లాల్లో లోతట్టుగా ఉన్న రాయలపాడు ఊరికి సమీపంగా ఉన్న ఏడున్నర ఎకరాల రమణీయమైన వృక్ష సంపత్తి మధ్యలో నీల్‌బాగ్ స్కూలు ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న ఋషీవేలీ స్కూలు అక్కణ్ణించి గంటన్నర దూరంలోనే ఉంది. మంచి సంస్కృత జ్ఞానమున్న గొప్ప శిల్పకళాకారుడూ, వడ్రంగీ, విద్యావేత్తా అయిన డేవిడ్ హోర్స్‌బరో అనే ఒక స్కాట్ దేశస్థుడు ఆ చూడచక్కటి భూమిని కొని, ఇంగ్లీషు శైలిలో మట్టిగోడల కుటీరాన్నొకదాన్ని కట్టి మొదట్లో అక్కడ స్థిరపడ్డాడు. అతని ఇంటి చుట్టూ స్కూలు పెంపొందింది. పొరుగునున్న గ్రామంలో ఉన్న పేద పిల్లల కోసం ఉచితంగా నడుపుతున్న స్కూలు అది. మొదట్లో డేవిడ్ ఋషీవేలీలో పనిచేసేవాడు. ఆ తరువాత బ్రిటీష్ కౌన్సిల్ వారి విద్యా విషయక భాగంలో పనిచేశాడు. ఆయన ఇప్పుడు వట్టిగా గ్రామంలోని పిల్లలకు ఉచితంగా చదువు చెప్పించడమే కాక, నూతన రీతుల్లో విద్యా బోధనలను చేసే మెలకువల్లోనూ ప్రావీణ్యాల్లోనూ శిక్షణనిచ్చి మంచి టీచర్లను తీర్చిదిద్దాడు కూడాను.

దురదృష్టవశాత్తూ డేవిడ్ అతని అరవైల్లో, కాలేయవ్యాధి వల్ల చనిపోయాడు. ఆయన వారసులు ఆ ఆస్తినీ, ఆ స్కూలునీ సజావుగా నడపడం చేతగాక అమ్మేసి, ఇంగ్లండుకు తిరిగి వెళ్ళిపోదామనుకున్నారు. సరిగ్గా ఆ సమయంలోనే ఋషీవేలీ వాళ్ళు దానిని తీసుకుందామని నిర్ణయించుకున్నారు. అది ఒక రమణీయమైన పల్లె వాతావరణమున్న ప్రదేశం. అక్కడి కట్టడాలన్నీ మట్టితో కట్టినవైనా, అవన్నీ బ్రిటిష్ ప్రమాణాల ప్రకారం డేవిడ్‌కి మిత్రుడైన బేకర్ అనే వాస్తుశిల్పి కట్టేడు. దానిలో స్నానాల తొట్టెలూ, కట్టె సీట్లతో వెస్టర్న్ టాయిలెట్లూ ఉన్నాయని గొప్పగా చెప్పుకునే వారు కూడాను.

నాకు మంచి స్నేహితురాలూ, ఋషీవేలీ స్కూలు నిర్దేశకురాలూ అయిన డాక్టర్ రాధికా హెర్ట్జ్‌బెర్గర్ నీల్‌బాగ్ స్కూలును తీసుకుందామన్న ప్రయత్నానికి సారథ్యం వహించింది. నేను నీల్‌బాగ్‌కు బదిలీ అవుదామనుకుంటున్నానని నేనావిడతో ఆలోచన చేసినప్పుడు, ఆవిడ చాలా సంతోషించింది. ఆవిడ మేము (అక్కడ వసంత విహార్‌లో) పడుతున్న (ఇరకాటాన్ని) అర్థం చేసుకుంది. ఆ విధంగా మేము సునంద గర్భవతిగా ఉండగానే నీల్‌బాగ్‌కు మారిపోయాము.

నీల్‌బాగ్‌లో మేము గడిపిన పదేళ్ళూ నాకు చాలా ముఖ్యమైనవి. మా పెళ్ళైన తరవాత అది మా మొదటి వ్యక్తిగతమైన ఇల్లు. అలా ఎందుకంటున్నానంటే, మేము ఒక అందమైన, స్వతంత్రమైన కుటీరంలో ఉండడం తటస్థించింది కనక. సునంద విద్యాసంబంధ విషయాల్లో తలమునకలయ్యేది; నేనేమో పరిపాలనను చూసుకొనేవాణ్ణి. అదీగాక, (రెండోదీ ఏమిటంటే) మా ఇద్దరు పిల్లలూ, కొడుకు రోషన్, కూతురు అయిషా, వరసగా తొమ్మిదీ, ఏడూ ఏళ్ల వచ్చేదాకా ఇక్కడే పెరిగారు. ఇక మూడోది. మా ఇక్కడి నివాస సమయం తాలూకు ఉత్తర భాగంలోనే నేను నా తొలి బహిరంగ ఉపన్యాసాన్ని బెంగళూరులో ఇవ్వడం తటస్థించింది. అప్పట్నించీ ఉపన్యాసాలనివ్వడం కొనసాగిస్తున్నాను. నాలుగో విషయమేమిటంటే, ఇక్కడే "ద సత్సంగ ఫౌండేషన్" (The Satsang Foundation) ఏర్పడింది. ఐదోది, ఇక్కడున్నప్పుడే త్రివేంద్రం తాలూకు నా పాత మిత్రుడు రాధాకృష్ణన్ వెంట ఢిల్లీ నుంచి వివేక్ మహేంద్రు నన్ను చూడడానికి వచ్చాడు. తరవాత బాబాజీ లక్ష్యాన్ని నిర్వర్తించడంలో క్రియాశీలక పాత్రను పోషించాడతను. ఇక్కడే నేను నా మొదటి పుస్తకాన్ని – "ద లిటిల్ గైడ్ టు గ్రేటర్ గ్లోరీ అండ్ ఏ హేపియర్ లైఫ్" (The Little Guide to Greater Glory and a Happier Life) రాశాను. ప్రస్తావనలో చిట్టచివరిదే గానీ ప్రాముఖ్యతలో తక్కువదేమీ కానిది – ఇక్కడున్నప్పుడే నేను కృష్ణమూర్తి ఫౌండేషన్ నుంచి రాజీనామా చేశాను.

# 48. నీల్‌బాగూ, సత్సంగ్ రైలూ

అటు ఆధ్యాత్మిక రీతి దృష్ట్యా, ఇటు ప్రాపంచిక రీతి దృష్ట్యా రెండు విధాలా నీల్‌బాగ్‌లో గడిపిన పదేళ్ళూ నిజంగా సార్థకమైనవీ, ఒక విధంగా ప్రతిఫలాన్ని ప్రధానం చేసినవీ అయ్యాయి. లోతట్టు పల్లె జిల్లాలో, ఎన్నో చెట్లూ, చుట్టూ పుష్కలమైన పచ్చదనమూ ఉన్న నీల్‌బాగ్ నా ధ్యానగత మనస్సుకి చాలా అమరినట్టుగా ఉండేది. పెళ్ళి చేసుకున్న తరవాత మొదటి ఇల్లు కావడంతో, అది మేము ఒకళ్ళొకళ్ళను అర్థం చేసుకోడానికీ, యోగ్యమైన సంబంధాన్ని నిర్మించుకోడానికీ బాగా సహాయపడింది. ఇక మా పిల్లల విషయమంటారా, వాళ్ళేమో ప్రకృతికి అతి చేరువగా ఉన్న స్వేచ్ఛా వాతావరణంలో పెరిగారు. దాన్ని వాళ్ళు చాలా ఇష్టపడ్డారు కూడాను.

వారానికి ఒకసారి నా మోటార్‌బైక్ మీద ఋషీవేలీ వెళ్ళి తొమ్మిదో క్లాసు వాళ్ళకు సంస్కృత తరగతులను తీసుకొనేవాణ్ణి; ఎప్పుడైనా కమిటీ సమావేశాలు జరిగితే వాటికి హాజరయ్యేవాణ్ణి కూడాను. త్వరలోనే ఒక పాత కారును కొన్నాను. ఆ రోజుల్లో భరించగలిగిన సామర్థ్యం అంతే మరి. తరచు దానిమీద బెంగళూరు వెళ్తూండేవాళ్ళం. అక్కడ నా తల్లిదండ్రులూ, అత్తమామలూ ఉండేవారు. దారి మధ్యలో పెద్ద దూరం కాని ఒక సుందర సరస్సు దగ్గర మజిలీ చేసేవాళ్ళం. అక్కడి తెల్ల పక్షుల్నీ కోతుల్నీ చూస్తూ ఉండేవాళ్ళం. అక్కడి జీవితం మాకు బాగా నచ్చింది; స్కూలు ప్రధానాధ్యాపకురాలైన సునంద ఆ స్కూలును ప్రేమించింది. డేవిడ్ హోర్స్‌బరో దగ్గర శిక్షణ పొందిన ఇందిరా సీతారామన్ అనే ఒక ఉపాధ్యాయురాలు ఆమెకు సమర్థంగా సహాయపడేది. అక్కడే ఆవిడ భర్త సీతారామ్‌ను కలుసుకున్నాను. అప్పట్నించీ ఆయన నాకు ప్రియమిత్రులు.

నీల్‌బాగ్‌లో ఉన్నప్పుడే నా తొలి పుస్తకం 'ద లిటిల్ గైడ్ టు గ్రేటర్ గ్లోరీ అండ్ ఎ హేపియర్ లైఫ్' రాశాను గానీ, దానిని అప్పుడే ప్రచురించాలనే ఉద్దేశం లేదు. దానికి కారణం, నా బహిరంగ బోధన దశ ఇంకా ప్రారంభం కాకపోవడమే. నా జ్ఞానాన్నీ నా అనుభవాల్నీ సాధ్యమైనంత వరకూ నాలోనే ఉంచుకున్నాను. సింహావలోకనం చేస్తే, బాబాజీయే గనక నాకు తన అనుకరణీయ రీతిలో అనుమతి నివ్వకుండా ఉంటే, నేను సంతోషంగా ప్రచ్ఛన్నంగానే ఆనందంగా జీవిస్తూ ఏ తలనొప్పులూ లేకుండా ఉండిపోయేవాణ్ణనిపిస్తుంది. కానీ అలా జరగడానికి వీల్లేదు. బాబాజీ నాకు వేరే పథకాలను వేసి పెట్టి ఉంచారు.

నా ఆధ్యాత్మిక అనుభూతులనీ, సాహసమైన పూనికలనీ నాలోనే ఉంచుకున్నప్పటికీ, ఆ రోజుల్లో నా సంపర్కంలోకి వచ్చిన చాలామందికి ఆ విషయాలు తెలియక

పోయినా కూడా, నా పాత స్నేహితుల్లో కొంతమంది, స్కూలులోనూ, కాలేజీలోనూ నాతో చదువుకున్నవాళ్ళు, ఆధ్యాత్మికమైన నా మొగ్గుదలల గురించీ, పరిశోధనల గురించీ ఎరిగినవాళ్ళే. వాళ్ళలో ఒకడు ప్రేమ్ కూకిల్లయ. అప్పుడతను బెంగలూరులో ఉద్యోగం చేస్తున్నాడు. అతను, జుయెలర్ వీధిలో ఉన్న మంగయ్య చెట్టీ అండ్ సన్స్ అనే నగల వ్యాపారి దగ్గరకు ఏదో పాత బంగారు ఆభరణాన్ని మార్పిడి చేయడానికో, లేకపోతే అటువంటి ఏదో పనికోసం వెళ్ళాడు. ఆ షాపును నడిపే ఇద్దరు సోదరుల్లో చిన్నవాడి పేరు మోహన్‌కుమార్. అతనితో మాట్లాడుతూండగా, బల్ల మీద స్వామీ ముక్తానంద రాసిన పుస్తకమొకటి ప్రేమ్ కంటబడింది. దాని గురించి అడగగా, అదొక ఆధ్యాత్మిక గ్రంథమనీ, తనకు ఆ విషయంలో అభిరుచి ఉందనీ మోహన్‌కుమార్ చెప్పాడు.

పుట్టుకతో హిందువు కూడా కాని తన పాత మిత్రుడొకడు హిందూ తత్త్వంలోనూ ఆధ్యాత్మిక విషయాల్లోనూ లోలోతుకి అధ్యయనం చేసి, యోగాన్ని అభ్యసించి, హిమాలయాలకు కూడా వెళ్ళాడనీ, అతనికి కొంత మేజిక్ కూడా తెలుసుననీ ప్రేమ్ యథాలాపంగా అతనికి చెప్పేడు. మోహన్ నన్ను కలవడానికి బాగా శ్రద్ధ కనబరిచాడు. బెంగలూరు నుంచి మూడు గంటల కారు ప్రయాణ దూరంలో రాయలపాడు అనే లోతట్టు గ్రామంలో నేను ఉంటానని అతనికి చెప్పడం జరిగింది. అత్తారింటి వాళ్ళూ తల్లితండ్రులూ రెండు వైపుల వాళ్ళూ బెంగలూరులో ఉండడం వల్ల నేను అప్పుడప్పుడు బెంగలూరుకి వస్తూ ఉంటానని కూడా అతనికి తెలియజెప్పాడు. ఆ రోజుల్లో నీల్‌బాగ్‌కు టెలిఫోన్ సౌకర్యం ఉండేది కాదు. అంచేత, నన్ను తరవాత చూసినప్పుడు, మోహన్ నన్ను కలవడానికి ఉత్సుకతతో ఉన్నాడని చెప్తానని, ప్రేమ్ అతనికి మాటిచ్చాడు.

మూడు వారాల తరవాత మా అత్తారింటికి వెళ్తూ మధ్యలో బెంగలూరులోని ప్రేమ్ తాలూకు ఆఫీసుకు వెళ్ళాను. అప్పుడు మోహన్‌తో అతను కలవడం గురించిన కథను విన్నాను. దానిమీద అప్పుడు ఎక్కువ శ్రద్ధ చూపించలేదు; అంతా మరిచిపోయాను కూడ. బెంగలూరికి ఆ తరువాత సారి వచ్చినప్పుడు, రిలయన్స్ స్టేషనర్స్ (షాపు) నుంచి ఆయిల్‌పెయింటూ, బ్రష్షులూ కొందామని నేను కమర్షియల్ స్ట్రీట్‌కి వెళ్ళాను. మా ఆవిడ, వాళ్ళమ్మగారి కొన్ని ఆభరణాలను మెరుగు పెట్టించమని నాకు ఇచ్చిందని జ్ఞాపకం వచ్చింది. ఒక నగల వ్యాపారి కోసం చూస్తూ నేను జుయెలర్స్ స్ట్రీట్‌లోకి నడిచి, మంగయ్య చెట్టీ అండ్ సన్స్ కొట్టు ఎదురుగా నిలుచున్నాను. లీలామాత్రంగా ప్రేమ్ ఈ షాపు పేరును చెప్పినట్టు గుర్తుకొచ్చింది.షాపులోకి వెళ్ళి బల్ల వెనక ఒక ముసలాయన, ఒక పడుచువాడూ

కూర్చుని ఉండడాన్ని చూశాను. ముసలాయన పైసలు లెక్కపెట్టడంలో మునిగిపోయి ఉన్నాడు. నేను ఆ పడుచతని దగ్గరికి వెళ్ళి నాకేమి కావాలో దాన్ని వివరించాను. అప్పుడు త్రివేంద్రం నివాసి మా మిత్రుడు ప్రేమ్ వచ్చే షాపు ఇదేనా అని అడిగాను.

ఆ యువకుడే మోహన్. అతను అవునని చెప్పి, ప్రేమ్ కొన్నాళ్ళ క్రితం షాపుకి వచ్చాడని కూడా చెప్పి నేను అతని మిత్రుణ్ణా అని అడిగాడు. నేను ప్రేమ్ మిత్రుణ్ణే అని చెప్పడంతో, అతను నాకు హిమాలయాలకు వెళ్ళిన మరో మిత్రుడున్నాడా అని అడిగాడు. జీన్సూ, ఎర్ర టీ - షర్టూ వేసుకున్న నన్ను చూసి అతను బహుశా ప్రేమ్ వర్ణించిన యోగి మిత్రుడనై ఉంటానని అనుకోలేదు.

అబద్ధం చెప్పడానికి ఇష్టపడక, ప్రేమ్ చెప్పినవాణ్ణి నేనే అని చెప్పాను. అంతే. తాను స్థానిక దివ్యజ్ఞాన సమాజ సభ్యుణ్ణనీ, ఆ సమాజంలో నేను ఒక ఉపన్యాసం ఇవ్వగలనా అని మోహన్ అడిగాడు. (అప్పటివరకూ) నా ఆధ్యాత్మిక జీవితం గురించి బహిరంగంగా ఎప్పుడూ చెప్పలేదనీన్నూ, ఆ ఉద్దేశమూ నాకు లేదనీన్నూ అతనితో అన్నాను. హిమాలయాల్లో నా యాత్రల గురించి చెప్పినా చాలునని అతను అన్నాడు. దాని గురించి ఆలోచిస్తానని చెప్పి, అతనితో నా వ్యవహారాన్ని పూర్తి చేసుకుని, వీలైనంత త్వరగా అక్కణ్ణించి బయటపడ్డాను.

మోహన్‌తో జరిగిన ఈ సమావేశం వెనక బాబాజీ హస్తముందన్న నా అనుమానం, రెండు రోజుల తరవాత జరిగిన దానితో ధ్రువపడింది. ఈ సంఘటన జరిగిన తరవాత రెండో రాత్రి నాకు ఒక స్పష్టమైన కల వచ్చింది. చాలాకాలం తరవాత బాబాజీ నాకు కలలో కనిపించారు. ఆయన ఎంత విచిత్రంగా కనిపించారంటే, నేను కలలో కూడా బిగ్గరగా నవ్వడం మొదలుపెట్టాను. నేను ఏదో ఒక రకమైన రైల్లో ఉన్నాను. దానికి "సత్సంగ్" అని రాసిన బేనర్ అంటించి ఉంది. బూట్లూ టోపీ లేని రైల్వే గార్డు యూనిఫాంలో ప్లాట్‌ఫాం మీద బాబాజీ కనిపించి మాటిమాటికీ ఈల ఊదేస్తున్నారు. రైలు వేగంగా కదలడం ప్రారంభమయింది. నేను లేచిన తరవాత కూడా ఇంకా నవ్వుతూనే ఉన్నాను. కానీ ఎప్పుడైతే ఆ కల తాలూకు అంతస్సూచనలు నాకు స్ఫురించాయో, అప్పుడే నా ముఖం మీది నవ్వు తుడిచిపెట్టుకుపోయింది. నేను బహిరంగానికి దిగాలని నాకు పచ్చజెండా చూపించారన్నమాట. త్వరలోనే నా కుటుంబంతో గడిపిన ప్రశాంతమైన వ్యక్తిగత జీవిత విషయంలో నేను సమాధానపడవలసి వస్తుంది. ఉచ్చతర శక్తులు నన్ను ఒక నిమిత్తమై పనిచేయాలని కోరినప్పుడు, అన్ని వ్యక్తిగత యోచనలను పక్కకు పెట్టాల్సిందే అని నాకు బాగా తెలుసును కనకనే నా భయాలన్నిటినీ నాలోనే ఉంచుకున్నాను.

రెండు వారాల తరవాత, మోహన్‌కిచ్చిన నగలను తిరిగి తీసుకోడానికి వెళ్ళినప్పుడు, అతను నన్ను దివ్యజ్ఞాన సమాజంలో ప్రసంగించమనడానికి అనునయంతో ప్రయత్నం చేస్తూంటే నేను ఒప్పుకున్నాను. ఆ మర్నాడే ఆదివారం కావడంతో నన్ను సాయంత్రం ఐదింటికి సమాజం తాలూకు సేనాశిబిరం బసకు (Cantonment Lodge) తీసుకొని వెళ్ళడం జరిగింది. అది నా తొలి సత్సంగం. అది సమాప్తమైన తరువాత అక్కడికి చేరిన ముప్ఫై పై చిలుకు మంది నాతో కరచాలనం చేసి, వాళ్ళు హాజరైన గొప్ప ప్రసంగాల్లో ఇదొకటి అని అన్నారు. నేను మౌనంగా బాబాజీకి నా కృతజ్ఞతలు తెలిపాను. ఒక క్రమపద్ధతిలో అటువంటి కార్యక్రమాలకు నేను రావడం సంభవమేనా అని అక్కడి నిర్వాహకుల్లో ఒకరైన నాయుడుగారు అడగడం జరిగింది. సత్సంగ్ రైలు కదలడం మొదలుపెట్టింది – ఈల ఊదడం జరిగింది.

ఆ తొలి సత్సంగంలో భారతీయ వాయుసేన నుంచి రిటైరైన యుద్ధ విమాన చోదకుడు (Pilot) గ్రూపు కెప్టెన్ రత్నాకర్ సనాదికి నన్ను పరిచయం చేశారు. ఆయన సునందకు చుట్టమని తేలింది. సునంద తండ్రి రమేశ్ సనాది భారతీయ సేనాదళం నుంచి లెఫ్టనంట్‌కర్నల్‌గా రిటైరయ్యారు. కబ్బన్ రోడ్డు మీదున్న ఆయన (రత్నాకర్ సనాది) పెద్ద ఇంటి తోటలో ఉన్న పనస చెట్టుకింద చాలా ఇష్టాగోష్ఠి సత్సంగాలు జరిగాయి. ఆ రత్నాకర్ సనాది గారే నేను రాసిన “లిటిల్ గైడ్” అనే పుస్తకాన్ని ముద్రించి ప్రచురించమని నన్ను ప్రేరేపించి ఉత్సాహాన్నిచ్చారు. ఆ పుస్తకం తాలూకు మూలప్రతి అప్పటికే టైపయి సిద్ధంగా ఉంది.

పుస్తకాన్ని ప్రచురించాలంటే ప్రచురణకర్త కావాలి. పుస్తకాన్ని ప్రచురించాలనే ఉద్దేశంతోనూ సత్సంగాలనూ నిర్వహించడం కోసమూ సత్సంగ ఫౌండేషన్ ఏర్పడింది. నన్ను అధ్యక్షుడిగా చేశారు; రత్నాకర్ సనాది కోశాధికారిగానూ మోహన్ మొదటి కార్యదర్శిగానూ నియమితులయ్యారు. కొద్దిమంది సన్నిహితులైన మిత్రులు మొదటి సభ్యులయ్యారు. కానీ పుస్తకాన్ని ముద్రించడానికి ఏ నిధులూ బొత్తిగా లేవు. మారిస్ (Maurice) అని తనను పరిచయం చేసుకున్న ఒక ఇటాలియన్ సజ్జనుడు సరిగా అదే సమయానికి కనిపించాడు. అతను నా మొదటి పుస్తకం “ద లిటిల్ గైడ్ టు గ్రేటర్ గ్లోరీ అండ్ ఏ హాపియర్ లైఫ్” ప్రచురించడానికి ద్రవ్య సహాయం చేశాడు. ఇది నేను రాస్తూన్న సమయానికి ఆ పుస్తకం మూడో ఎడిషన్ వస్తోంది. నన్ను ‘ఎమ్’ అని తొలిసారిగా పిలవడం మొదలుపెట్టింది; మారిస్సూ, రత్నాకర్‌లే. తరవాత అది ‘శ్రీ ఎమ్’ లేక ‘మిస్టర్ ఎమ్’గా మారింది. నా మనస్సులో “ఎమ్”ను శ్రీగురువూ, బాబాజీ నాకు ప్రదానం చేసిన పేరు “మధు”తో పోల్చుకుంటాను నేను.

న్యూఢిల్లీ నుంచి వచ్చిన ఒక కొత్త వ్యక్తి వివేక్ మహేంద్రు అనే అతను నన్ను మొదటిసారిగా కలుసుకున్నది ఈ నీల్‌బాగ్‌లోనే.

నేను, జర్మనీలోని ఆకెన్ నుంచి వచ్చిన హాన్స్ కేలి ఛాస్‌ను కలుసుకున్నాను. ఆయనా, వివేక్‌లాగే, నాకు సన్నిహిత మిత్రుడిగానూ సహచరుడిగానూ కొనసాగుతున్నారు. వివేక్ మహేంద్రు ఒక స్విచ్‌గేర్ కంపెనీకి సంచాలకుడు. వాళ్ళకు జలంధర్‌లోనూ న్యూఢిల్లీలోనూ నోయిడాలోనూ ఫ్యాక్టరీలూ ఆఫీసులూ ఉన్నాయి. త్రివేంద్రం రోజుల నుంచీ నాకు చిరకాల మిత్రుడైన రాధాకృష్ణన్ నాయర్ చెన్నైలో అతని (వివేక్) సేల్స్ మేనేజరు. వివేక్‌కి మతం మీద మనశ్శక్తి మీద అభిరుచి ఉంది. అమ్మకాలు చేసే తన సిబ్బందికి తరచు దాని గురించి ప్రసంగిస్తూ ఉంటాడు ఆయన. వివేక్, చెన్నైకి వ్యవహారాలు చూడడానికి వచ్చిన పర్యాయాల్లో ఒకసారి నాయర్ నా గురించి చెప్పి "లిటిల్ గైడ్" ప్రతినొకదానిని ఆయనకు ఇచ్చాడు. చెన్నై, నీల్‌బాగులూ మూడు వందల ఏభై కిలోమీటర్ల ఎడంలో ఉన్నా కూడా ఆ రోజుకారోజే నన్ను చూస్తానని వివేక్ పట్టుబట్టి వచ్చారు. నేను ఆ మధ్యాహ్నం బెంగలూరు వెళ్ళవలసి ఉంది. మేము ఇద్దరం వివిధ ఆధ్యాత్మిక విషయాలు మాట్లాడుకుంటూ ప్రయాణం చేశాం. ఆ తరువాత మేము తరచు కలుసుకుంటూనే ఉన్నాం. ఆయన నాకు సన్నిహిత మిత్రుడు.

ఇదే రీతిలో ఆ పుస్తకం చాలామంది ఇళ్ళల్లోకి దారి చేసుకుంది. త్వరలోనే అంకితభావం గల జనసమూహం నాచుట్టూ కేంద్రీకృతమయింది. అలాగ సత్సంగ్ కుటుంబం పెరుగుతూనే ఉంది.

# 49. కైలాస - మానస సరోవర యాత్ర

నా పుస్తకాన్ని చూసిన ఒక ముఖ్య పురుషుడు కాశ్మీరు రాజవంశానికి చెందిన డాక్టరు కరణ్‌సింగ్ గారు. ఆయన- ప్రముఖ రాజకీయవేత్తా, గొప్ప విద్వాంసుడూ, శ్రద్ధాయుతుడైన ఆధ్యాత్మిక అభ్యాసీ - అన్నీ కలబోసిన ఒక అరుదైన ఉదాహరణ. ఆయన చాలామంది ఆధ్యాత్మిక గురువులను కలుసుకుని ప్రతిస్పందించినవాడు. హిమాలయాల్లో ఉన్న మిహిర్‌తోలా ఆశ్రమాధిపతి శ్రీకృష్ణప్రేమ్ దగ్గర దీక్షను గ్రహించినవాడు ఆయన.

బెంగలూరు వచ్చినప్పుడు ఒకసారి ఆయన (డాక్టర్ కరణ్‌సింగ్) "లిటిల్ గైడ్"లో ఇచ్చిన చిరునామా, టెలిఫోన్ నంబరును బట్టి మోహన్‌కుమార్‌ను కనుక్కొని టెలిఫోను మీద అతనితో సంపర్కం కలుపుకున్నారు. నేను అప్పుడు బెంగలూరులో ఉన్నానని తెలిసి, నన్ను కలవాలని ఆయన పట్టుబట్టారుట. మధ్యాహ్నం ఆయన బస చేస్తూన్న రాజభవన్‌లో సమావేశాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. మొట్టమొదటి సమావేశంలోనే మేము బాగా కలిసిపోయాం. ఆయన చాలా ఉదారుడు, నిరహంకారి, యుగయుగాల సంప్రదాయాలతో ఉజ్జ్వలమైన ఒక రాజవంశ వారసుణ్ణి గుర్తుకు తెచ్చే మర్యాదనూ హోదానూ ఆయన ప్రదర్శించడం నేను గమనించాను. ఆధ్యాత్మిక, లౌకిక విషయాలు రెండిట్లోనూ విశేష ప్రజ్ఞనీ, అసాధారణ జ్ఞానాన్ని కలిగిన ఆయన దాన్ని గొప్ప హుందాతనంతోనూ అణకువతోనూ కనిపింపజేస్తారు.

లోగడ ఉన్న భారతీయ రాజవంశాలతో నాకు విస్తృత సంబంధ బాంధవ్యాలు రూపొందడానికి నా మొట్టమొదటి లంకె ఈయనే. బహుశా రాచరికంతో నాకున్న పూర్వజన్మ సంబంధాలే వారి వారసులు నాలో చూపిస్తూన్న ఆసక్తిని వివరించ గలవేమో. ఢిల్లీలో, తమ ట్రస్టుకి చెందిన రామాయణ విద్యాపీఠంలో, నా మొదటి సత్సంగాన్ని డాక్టర్ కరణసింగే ఏర్పాటు చేశారు. ఆ తరవాత "ద జువెల్ ఇన్ ద లోటస్" (The Jewel in the Lotus), "విజ్డమ్ ఆఫ్ ద ఋషీస్" (Wisdom of the Rishis) అనే నా రెండు పుస్తకాలకూ తొలిపలుకులు వ్రాసారు; ఆయన నాతో సంబంధాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. ఆయనకు నా హృదయంలో ప్రత్యేకమైన స్థానముంది. ఢిల్లీలో ఉన్నప్పుడు ఆయనతో కొంత సమయం గడిపే అవకాశాన్ని గానీ, లేకపోతే, ఆయనతోబాటు భోజనం చేసే అవకాశాన్ని గానీ నేను ఎప్పుడూ జారవిడవను.

డాక్టర్ కరణ్‌సింగ్‌ను కలుసుకున్న సమయానికి దరిదాపుగానే నేను కృష్ణమూర్తి ఫౌండేషన్‌కు రాజీనామా ఇచ్చాను. కారణాలైతే చాలానే ఉన్నాయి కానీ చాలా ముఖ్యమైనవి మాత్రం ఇవి: కృష్ణమూర్తి ఫౌండేషన్ తాలూకు లక్ష్యాలూ ధ్యేయాలు కన్నా వేరే ఉద్దేశాలతో సత్సంగ్ ఫౌండేషన్ అప్పటికే ఏర్పడిపోయి దానికి నేను అధ్యక్షుణ్ణి

కావడం వల్ల దానికే ఎక్కువగా నా శక్తినీ సమయాన్నీ వెచ్చిస్తాను గనక కృష్ణమూర్తి ఫౌండేషన్‌లో నేను ఇంకా కొనసాగడం సబబు కాదనిపించడం మొదటి కారణం. రెండోదేమిటంటే, కృష్ణమూర్తిగారు గతించిన దగ్గర్నుంచీ ఆయన పట్ల గౌరవ మర్యాదలు ఏమీ నాలో తగ్గకపోయినా, ఆ సంస్థ మీద ఆసక్తి మాత్రం తగ్గిపోవడం. ఆయన పోయిన తరవాత దానిలోని గుజ్జు పోయి పట్టి పై చిప్పే మిగిలిందని నా భావన.

మొదట అచ్యుత్ పట్వర్ధన్ గారికి నా నిర్ణయాన్ని చెప్పి ఆ మీదనే రాజీనామాను పంపించాను. కృష్ణమూర్తిగారితో జరిగిన నా మొదటి సమావేశం తరవాత "ఈ పక్షి ఎక్కువకాలం నీ పంజరంలో ఉండదు" అని ఆయన వ్యాఖ్యానించారని పట్వర్ధన్ గారన్నారు. నేనూ సునందా నీల్‌బాగ్‌లోనే ఉంటూ పనిచేయడం సాగించాం. చాలా అయిష్టంగానే నా రాజీనామాను అంగీకరించడం జరిగిన ఒక నెలకు నేను విదేశాల్లో నా మొదటి బోధనా పర్యటనకు వెళ్ళాను.

భారతదేశంలోని బైబిల్ సొసైటీ బైబిళ్ళను పంచిపెట్టే పద్ధతిలోనే అమెరికాలో గీతా సొసైటీ పెట్టిన, నాసా (NASA) లోని గరిష్ఠ శాస్త్రజ్ఞుడు డాక్టర్ రామానంద ప్రసాదు భగవద్గీతానువాదాలను ఉచితంగా పంచిపెడుతూ ఉంటారు. ఆయనకు నా ఉనికిని గురించి నా సుమిత్రుడు మోహన్‌కుమార్ ద్వారా తెలిసింది. తరవాత ఆయన నన్ను బెంగుళూరులో కలుసుకుని సంయుక్త రాష్ట్రాలకు (అమెరికాకు) రమ్మనమని ఆహ్వానించాడు. ఆయన కాలిఫోర్నియాలోని ఫ్రీమాన్ట్‌లో ఉంటున్నప్పటికీ వివిధ ప్రాంతాల్లో ప్రసంగాలనూ చర్చలనూ ఏర్పాటు చేస్తానని అన్నారు.

ఈసారి, బాబాజీ నుంచి ఏదో ఒక ప్రత్యేకమైన సంకేతం కోసం ఎదురు చూడకుండానే నేను ఒప్పుకున్నాను. అప్పటికే, నా పని ప్రారంభమయింది. "ఎమ్" ఇంక ఏ విధంగానూ తన చాటుతనాన్ని నిలబెట్టుకోడానికి వీలు లేదు. ఆ విధంగా 2000 సంవత్సరంలో మొదటిసారిగా నేను యూఎస్సేకి ప్రయాణం చేశాను. నా ప్రియమైన పాత మిత్రుడు థామస్ కురియన్ చెన్నై నుంచి శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్ళడానికి టికెట్లు కొనుక్కొనివచ్చి ఇచ్చాడు. విదేశాలకు ఇదే నా మొదటి ప్రయాణం. కొంతసమయం తరవాత మహేంద్రూ కుటుంబానికి పాత మిత్రుడు, ఢిల్లీలో వివేక్ మహేంద్రూ ద్వారా పరిచితుడైన హాన్స్ కేలిఫౌస్ నన్ను జర్మనీలోని ఆకెన్‌కి రమ్మనమని ఆహ్వానించారు. అచిరకాలంలోనే నేను దాదాపు ప్రతీ ఏడాదీ జర్మనీకీ, సంయుక్త రాష్ట్రాలకీ (అమెరికాకీ) వెళ్తూనే ఉన్నాను.

బోధనలు ప్రసారమవుతున్నాయి. కానీ రహస్యంగానూ అతి సూక్ష్మంగానూ బాబాజీ అనుసరించిన పద్ధతిలో ప్రసారం సాగింది. "గుణం ముఖ్యం. పరిమాణం

కాదు. ఆధ్యాత్మిక వికాసమన్నది వ్యక్తిగతమే తప్పించి మూక సంఘటన కానే కాదు. సాంకేతిక ధ్యాన పద్ధతుల్లో దేనినైనా సరే స్వతంత్రంగా విక్రయించుకోడానికి హక్కులనివ్వడం (Franchises) వల్ల జరిగే మంచి బహు స్వల్పం. ప్రతీ వ్యక్తీ ప్రత్యేకుడే. నువ్వు చేయవలసిన పని ప్రారంభమైనప్పుడు ప్రకటనల తీవ్రమైన దాడులూ, కుమ్ములాటలూ వద్దు" అని బాబాజీ చెబుతూ ఉండేవారు.

నెమ్మదిగానూ నిదానంగానూ సత్సంగ్ ఫౌండేషన్ దానితోబాటు దాని కార్యకలాపాలు పెంపొందుతున్నాయి; దానితోబాటు కూడా పెరుగుతోంది. నా పిల్లలూ పెరుగుతున్నారు. సరిగ్గా ఆ తరుణంలోనే, కృష్ణమూర్తి ఫౌండేషన్ తరఫున నీల్‌బాగ్‌ను నడుపుతూన్న ఋషీవేలీస్కూలువాళ్ళకి, ఈ ఉచిత పాఠశాలను కొనసాగించడానికి కావలసిన డబ్బు వసతులు నిండుకోడం మొదలుపెట్టాయి. దాన్ని కొనుక్కొని నడపడానికి ఒకతను ఆసక్తి చూపించాడుట. ఆ మాటను నాకు చెప్పగానే, నేను సంతోషంగా ఒప్పుకున్నాను. కొంతకాలం నుంచీ నేనిక్కణ్ణించి కదిలిపోయి సత్సంగ్ ఫౌండేషన్ తాలూకు కార్యకలాపాలకి ఎక్కువ సమయాన్ని కేటాయించాలని చాలా గట్టిగా అనుకుంటున్నాను.

ఋషీవేలీ స్కూల్ సంచాలకురాలు, నా ప్రియ మిత్రురాలు, డాక్టర్ రాధికా హెర్జ్‌బెర్గర్ నా భార్య సునంద తిరిగి ఋషీవేలీలో బోధించడానికి వస్తే బాగుంటుందని కోరింది. (ఆ పక్షంలో) మా ఇద్దరు పిల్లలకూ పన్నెండో తరగతి వరకూ ఋషీవేలీ స్కూలులో ఉచిత విద్య లభిస్తుందని కూడా అంగీకారానికి వచ్చాం. బాబాజీకి తప్ప మరెవరి కోసమూ పని చేయడం ఇష్టం లేకపోవడం వల్ల నేను ఋషీవేలీలో ఉండటానికి వెళ్ళకూడదనే నిర్ణయించుకున్నాను. నా సంచారక దినాల్లాంటి పరిస్థితిలో పడి నీల్‌బాగ్ అమ్ముడుపోయిన తరవాత నేనెక్కడుండాలన్న సందిగ్ధ స్థితిలో ఉండిపోయాను.

మహా యూదు బోధకుడూ, ఆధ్యాత్మిక గురువూ అయిన జీసస్ మాదిరిగా నేను "పాములకు కన్నాలున్నాయి. నక్కలకు బొర్రెలున్నాయి. కానీ మనిషికి పుట్టిన నాకు ఈ తలను ఎక్కడ దాచుకోవాలో తెలియదు" అనే యోచనలోనే ఆనందించాను. కానీ ఆ పరిస్థితి ఎంతోకాలం సాగలేదు. దీనికి ఒక ఏడాదికి ముందు నేను మదనపల్లె శివార్లలో ఒక పావు ఎకరం పై చిలుకు స్థలాన్ని కొనడం తటస్థించింది. నేను ఋషీవేలీ స్కూలుకు చేసే రాకపోకలు చాలావరకూ ప్రతివారమూ మదనపల్లె అనే ఈ చిన్నపట్నం మీదుగానే సాగేవి. ఆ వ్యాపార వ్యవహారకేంద్రానికి చాలా దూరంగా ఉండబట్టి ఆ స్థలం నాకు చాలా చవకగానే దొరికింది. అది లంబాడి ఆదివాసీ గ్రామానికి ఎక్కువ దూరమేమీ కాదు కనక దాన్ని అనువైన పరిసరాలున్న దానిగా

అనుకునేవారు కాదు. లంబాడీలను దొంగలనీ బందిపోట్లనీ అనుకునేవారు. అయితే నేను మాత్రం ఆ స్థలం మదనపల్లె వ్యాపారాల హడావుడి బయట ఉందనీన్నూ, గుట్టలూ పరిపొలాలూ చుట్టూ ఉన్న లోయ గూటిలో దూరి హాయిగా వెచ్చగానూ ఉందనీన్నూ చాలా సంతోషించాను. నా లంబాడీ ఇరుగుపొరుగు వారి విషయం వరకూ నా ఉద్దేశమేమిటంటే, ఏ జాతి వారినైనా సరే అటువంటి కించపరిచే పేర్లతో పిలవడం తప్పని నేను భావిస్తాను. వాళ్ళ సమీపంలో బతుకుతూ నాకే సమస్యలూ రాలేదు. నేను ఆ స్థలాన్ని ఏదో ఆవేశంతో కొన్నాను కానీ దానితో నేనేం చెయ్యగలనో అప్పుడు నాకు తెలియదు. ఇప్పుడు అదే మంచి కొనుగోలుగా మారింది.

నీల్‌బాగ్ ఉన్న పల్లె జిల్లాలో అమ్మకం దస్తావేజును ప్రభుత్వ పట్టికల్లో నమోదు చేయడానికీ పొలం నేలను బదిలీ చేయడానికీ జరగగలిగే జాప్యాలూ కాలయాపనలూ అన్నీ కలిపి దరిదాపుగా ఓ ఏడాది పట్టి ఉండేది. అంచేత, నేను నా ఆదాల మొత్తాల నన్నిటినీ పెట్టుబడి పెట్టి, మదనపల్లెలోని ఒక వడ్డీ వ్యాపారి నుంచి ఎక్కువ వడ్డీకే కొంత డబ్బు అప్పు తెచ్చి నేను కొన్న ఆ స్థలంలోనే ఒక ఇల్లు కట్టడం ప్రారంభించాను. ఒక ఏడాదిలోపులోనే నేను ఒక నిరాడంబరమైన నివాసాన్ని పూర్తి చేయగలిగాను. నీల్‌బాగ్ స్కూలు అమ్మకంకాగానే నేను నా ఇంట్లోకి మారిపోయాను. పై హిమాలయ శ్రేణుల్లోని శాశ్వత హిమాల జ్ఞాపకార్థం ఈ ఇంటికి "స్నో వైట్" అని పేరు పెట్టాను.

నా భార్య సునందా, పిల్లలూ ఋషీవేలీ స్కూల్‌కి మకాం మార్చారు; నేను మాత్రం "స్నో వైట్"కి ఇప్పటిదాకా మారేను. చిన్న పిట్టలాగే ఉన్న సత్సంగ్ ఫౌండేషన్ తన రెక్కలను విప్పుకొని ప్రపంచవ్యాప్తంగా ఎగరడానికి చేయగల కార్యకలాపాలన్నిటికీ త్వరలోనే మదనపల్లె ఇల్లే కేంద్రమయింది. ఇక్కడే, సంఘంలోని నిమ్నజాతుల పిల్లల కోసం ఒక తరగతి గదీ, పదిహేను మంది పిల్లలూ, బోధకులెవరూ లేని సత్సంగ్ విద్యాలయమనే ఒక ఉచిత పాఠశాల తాలూకు నిరాడంబరమైన మూలాలు ప్రారంభ మయ్యాయి. ఇప్పుడు నేనిది (స్వీయకథా) రాస్తున్న సమయానికి, అది ఒక అందమైన విద్యాకేంద్రంగా పెంపొందింది. అన్ని ప్రకారాలుగానూ మంచి విద్యను ఉచితంగా దరిదాపుగా నూట ఇరవై మంది పిల్లలకు ప్రదానం చేస్తోంది.

కొన్నేళ్ళ తరవాత, ఐసీఎస్ఈ (ICSE) సిలబస్‌ను చెప్పే వసతి గృహంతో కూడిన స్కూలు "పీపల్ గ్రోవ్ స్కూల్" (PGS)[1] అనే పేరుతో పుట్టింది. అందమైన గ్రామీణ సన్నివేశంలో, కొండలూ అడవులూ, ఒక చిన్న సరస్సూ ఉన్న స్థలం మధ్యలో తిరుపతికి దగ్గరలో PGS ఉంది. మాజీ భారత రాష్ట్రపతి డాక్టర్ అబ్దుల్ కలాం ఈ స్కూలును సందర్శించినపుడు అతడు పిల్లలతో ప్రతిస్పందిస్తూ "మీ సృజనాత్మక

శక్తిని పెంచుకుంటూ మీరు పెంపొందడానికి నోచుకున్న చాలా అందమైన ప్రదేశం ఇది" అని వర్ణించారు. ఇక్కడ పిల్లలు వట్టి విద్యా సంబంధ విషయాలు మాత్రమే తెలుసుకోరు; మనం జీవితమని పిలిచే బహు పరిమితాత్మకమైన యథార్థాన్ని గురించి కూడా నేర్చుకుంటారు. బాబాజీ ఆ రావి చెట్టు కింద కూర్చొని, ఆ చెట్టు వృక్ష శాస్త్రీయనామం "ఫైకస్ రెలిజియోసా" (Ficus Religiosa) తాలూకు అర్థాన్ని వివరిస్తూన్నట్టుగానూ, లేకపోతే, ఆ చెట్టు కొమ్మమీద కూర్చున్న పిట్ట ఏ వర్గానికి చెందినదో ఆనవాలు పడుతూన్నట్టుగానూ తరచూ నేను ఊహిస్తూ ఉంటాను.

సత్సంగ్ ఫౌండేషన్ తాలూకు వివిధ క్రియాకలాపాలు – అవి, స్కూళ్ళు కానీండి, మానవులను ఏకతాటి మీదకి తీసుకు రావడానికి ప్రయత్నం చేసే 'మానవ ఏకతా మిషన్' (Manav Ekta Mission) కానీండి, లేక, అగుపించే అన్ని ఆకారాల వెనక ఉన్న సత్యమైన యథార్థాన్ని వెదకడానికి ఆసక్తి ఉన్నవాళ్ళను వ్యక్తిగతంగా మార్గనిర్దేశం చేయడానికి ఇండియాలోనూ విదేశాల్లోనూ నేను చేసే ప్రయాణాలు కానీండి – అన్నీ నెమ్మదిగానూ నిదానంగానూ ముందుకు సాగుతున్నాయి. ఈ సదుద్దేశానికి ఆలంబనంగా నిలవడానికి కలిసి వచ్చిన వ్యక్తులందరి వల్లనూ ఇది సంభవమయింది.

మరొక మంచి పదం లభించకపోవడంతో నేను ఆ వ్యక్తులను వర్ణించడానికి "సిద్ధపరిచేవాళ్ళు" (Providers) అనే మాటను ఉపయోగిస్తున్నాను. ఈ పదాన్నే మహానుభావు డైన రామకృష్ణ పరమహంస, తమ లక్ష్యం నెరవేరడానికి కావలసిన ద్రవ్యాన్నిచ్చిన మాథుర్ బాబూ మొదలైన ధనవంతుల్ని వర్ణించడానికి వాడేరు. కొంతమంది పైసలను సమకూర్చారు; కొంతమంది స్వచ్ఛందంగా తమ లౌకిక సదుపాయాలనీ, అమూల్యమైన సమయాన్నీ త్యాగం చేస్తూ సహాయాన్ని చేకూర్చారు. సత్యాన్వేషణే ప్రముఖ లక్షణంగా ఉన్న కొంతమంది నిజమైన జిజ్ఞాసువులు కూడా వచ్చారు. ఆధ్యాత్మిక దృష్టికోణంతో చూస్తే ఈ చివరి కోవ వారే నాకు చాలా ముఖ్యులు. బాబాజీ తన ప్రణాళికలకు సాయపడడానికి నా దగ్గరకు పంపిన వాళ్ళందరికీ నేను శాశ్వతంగా కృతజ్ఞతాబద్ధుణ్ణీ అయి ఉండడమే కాదు, వారికి నేను కార్మికంగా ఋణపడి ఉంటాను కూడ. ఈ మొత్తం జరుగుతూన్న పనికి నేను నిమిత్తమాత్రుణ్ణి మాత్రమే.

నేను ఏ ఒక్కరి పేరూ ప్రత్యేకంగా చెప్పను. ఎందుకంటే, వాళ్ళు తత్తరపడవచ్చు నన్నదొకటి; అదీగాక, నేను ఎన్ని పేర్లను రాయాలంటే ఆ జాబితాయే అనంతమై

1. *నా మిత్రుడు రమేశ్ రెడ్డి అమ్మగారు శ్రీమతి వారణాసి రుక్మిణీ రామసామిరెడ్డి గారు దానం చేసిన ఒక అందమైన లోయలో చాలా రావిచెట్లున్న చోట పీపల్ గ్రోవ్ స్కూలు* PGS (Peepal Grove School) *స్థాపితమయింది.*

పోతుంది నాకు. వీరందరి మీదా బాబాజీ దీవెనలు పుష్కలంగా కురుస్తాయనీన్నూ, ఆయన అనంత అనుగ్రహం వల్ల వాళ్ళు తమ ధ్యేయాన్ని విడిచిపెట్టకుండా దాని వైపుకు క్రమంగా కదులుతూ ఉండగలుగుతారనీన్నూ మాత్రం చెప్పగలను. నా విషయమంటారా, నేను బాబాజీ బానిసను. అవసరమైతే నేను రాత్రింబగళ్ళు వాళ్ళతో బాటు, కష్టపూరితమే అయినా, వారి స్తవనీయ ప్రయాణంలో నడుస్తూ శ్రమిస్తాను.

ఆధ్యాత్మిక ప్రయాణంలో ఒక భాగంగా, సన్నిహిత మిత్రుల బృందాలను బద్రీ, కేదార్, గోముఖం, ఋషీకేశం, అజ్మీర్, దక్షిణేశ్వరం, కన్యాకుమారీ, బాలక్‌నాథ్, గోరఖ్‌పూర్, అయోధ్య, ఇతర ప్రదేశాలకూ తీర్థయాత్రగా తీసుకువెళ్ళడం నేను కొన్నేళ్ళ క్రితం నుంచీ ప్రారంభించాను. కైలాసానికీ మానస సరోవరానికీ చేసిన ప్రయాణమే అన్నిట్లోకల్లా చాలా కష్టమైనది. అది నాకు చాలా ప్రముఖమైనది కూడాను. నా వెంట వచ్చిన ఏభై పై చిలుకు మందీ కూడా మేము మునుపు చేసిన యాత్రల కన్నా ఇది ఎంత వేరుగా ఉందో తెలిసికొనే ఉంటారని నేననుకుంటాను.

చాలా ఏళ్ళ క్రితం బాబాజీతో బాటు కైలాసానికి సగం దోవే వెళ్ళి, అనారోగ్యం కారణంగా, ఆ యాత్రను పూర్తి చేయకుండా తిరిగి రావలసి వచ్చిందని మీకు జ్ఞాపకం ఉండవచ్చు. చాలా ఏళ్ళ తరవాత బహుజనాలు నా వెంట రాగా కైలాసానికి నేను వెళ్తానని అప్పుడే నాతో బాబాజీ అన్నారు. ఆ సమయంలో, ఈ 'బహుజనాలు' ఎవరా అని విస్తుపోయాను.

ఒక సుమిత్రుడు చొరవ తీసుకుని అన్ని ప్రాతికూల్యాలను ఎదిరించి ఆ పర్యటనను నిర్వహించాడు. మొత్తం యాత్రలోని అన్ని వివరాలనూ నాతో వచ్చిన నగరవాసులు ఎదుర్కొన్న కష్టాలనూ నేను వర్ణించట్లేదు. కారణమేమిటంటే, ఒక మంచి మిత్రుడు ఈ యాత్రా చరిత్రను ఇంతకుముందే రాశాడు. కానీ, నా వ్యక్తిగత అనుభూతులను కొన్నిటిని వర్ణిస్తాను. మొదటిది, మానస సరోవరం కంటికి కనిపించినపుడూ; రెండోది, మొట్టమొదటిసారిగా కైలాస పర్వతానికి ముఖాముఖీగా యమద్వారం దగ్గర నిలుచున్నప్పుడూ; మూడవది, కడలి మట్టానికి 18,500 అడుగుల ఎత్తున ప్రాణవాయువు సరిపోకపోవడం వల్ల మాలో చాలామంది ఊపిరి అందక ఆయాసపడుతూ డోల్మో లా పాస్ ఎక్కి రాత్రి గుడారాల్లో బస చేసినప్పుడూను.

నేను మానస సరోవరం చూడగానే, ఆకుపచ్చ కత్తు× కలిసిన నీలంవన్నెమణి రంగున్న ఈ పావన సరస్సును చూస్తున్నది ఇదే నా మొదటిసారి కాదని నాకు తెలిసింది. టిబెట్టు గుండా భారతదేశంలోకి ప్రవహించే బ్రహ్మపుత్రానదికి ఇదే మూలం. ఆ జలాలను దర్శిస్తూంటే నా వెనుబాము గుండా పులకరింతలాటి భావావేశం

ప్రవహించింది. నా పూర్వజన్మ తాలూకు దృశ్యాలు ఒకటి తరవాత ఒకటి నా మనస్సులో మెరవడం మొదలెట్టాయి. మంచుబట్టను కట్టినట్టున్న గుర్లమాంధాత పర్వతశ్రేణి పాదం సమీపాన ఉన్న ఒక గుహలో ఒక తెల్లని నూలు గోచీగుడ్డను ధరించి ఉన్న యోగిగా నన్ను చూసుకున్నాను. కుడివైపున, దూరంగా కైలాస పర్వత శిఖరం ఎత్తుగా కనిపిస్తోంది.

నేను ఆ సరస్సులో ఒక మునక వేద్దామని సిద్ధపడుతూండగా, అప్పుడే వయసులో అడుగు పెడుతూన్న, జడలు కట్టిన జుట్టున్న యువ సన్యాసి ఒకడు కౌపీనం ధరించి, నాథపంథ్ లాంఛనమైన చిమ్టా (పట్టుకారు) పట్టుకొని నీటిలోంచి బయటకు రావడాన్ని చూశాను. అతను బాగా చూడముచ్చటగా ఉన్నాడు. పెదవులపై నవ్వు కదలాడుతోంది. నా దగ్గర నిలుచున్న వాళ్ళ ఖాళీముఖ వైఖరి చూసి వాళ్ళేమీ చూడట్లేదని నాకర్థమయింది. ఏ కారణానికో గాని, అది నాకు మాత్రం కలిగిన ప్రత్యేక దర్శనం.

అతను నీళ్ళల్లోంచి రాడానికి నేను ఎదురు చూస్తున్నాను. సావధానంగానూ సగౌరవంగానూ నిలుచున్న నా పక్కనుంచి నడుస్తూ ఆయన "నేను సిద్ధినాథుణ్ణి. జలంధరీప, గురు గోరఖుల శిష్యుణ్ణి. శ్రీగురువు నీకోసం వేచి ఉన్నారు. అలఖ్ నిరంజన్" అని నాకు చెప్పి వెళ్ళిపోయారు. ఇంకెవ్వరూ ఏదీ చూడలేదు, ఏమీ వినలేదు కూడాను. నేను సాగిలపడి నా నొసటిని నేలకు తగిలించినపుడు, వాళ్ళు ఆ సరస్సుకీ, కైలాస పర్వతానికీ సాష్టాంగపడుతున్నాననుకున్నారు. దాని తరవాత, నేను సరస్సులో మునిగాను, ఇతరులు కూడా మునిగారు. అది చాలా చల్లగా ఉంది గానీ బహు పుష్టినీ పావిత్ర్యాన్నీ ఇచ్చింది. నేను వేరే స్థలానికి చేరిన భావన కలిగింది నాకు.

తరవాత, మేము యమద్వారానికి చేరుకున్నాం. ఇక్కడ మహాకైలాసం తాలూకు అతి సన్నిహిత రూపాన్ని చూశాం. కైలాసం హిందువులకూ, బౌద్ధులకూ, టిబెట్టులోని బోన్పాలకూ అతి పవిత్రమైనది. హిమాన్ని చుట్టబెట్టుకున్న ఆ మహాశిఖరం మాపైన ఉన్నతంగా కనిపిస్తూంటే, నన్ను ఒక అసాధారణమైన గాఢ ధ్యానస్థితి ఆవరించింది.

మా బృందంలోని కొంతమంది గుర్రాలనెక్కడానికి ఎంచుకున్నారు కనక వాళ్ళు ఆ గుర్రాలనూ, పోర్టర్లనూ ఏర్పాటు చేసేదాకా వేచి ఉండాల్సి వచ్చింది. ఇతరులు నాలాగే పరిక్రమాన్ని నడుస్తూనే చేద్దామనుకున్నారు. కానీ మేము యమద్వారం దగ్గర అరగంట సేపు ఆగేం. కైలాసానికి అభిముఖంగా ఒక రాతిమీద కూర్చొని నేను నా లోలోపల్లో నిమగ్నమయ్యాను. తాండవ నృత్యమనే ప్రళయకాల నృత్యం చేస్తూన్నప్పుడు

× రంగులోని సూక్ష్మభేదం

తన చేతిలో శివ మహాదేవుడు పట్టుకున్న డమరుక ధ్వని నా అంతఃశ్రోత్రంలో డగ్ డగ్ డగ్ డగ్.... అని వినిపించింది. ఇది త్వరలోనే బిగ్గరగా ధ్వనిస్తూ నా తల లోపల విస్ఫోటం చెందుతూన్నట్టు భం, భం, భం అనే శబ్దాలతో భర్తీ చెందింది. నా అంతర్నేత్రానికి ప్రచండమైన శంకురూపంలో ఉన్న సుడిగాలి దూరంగా కనిపించింది. అది నావైపుకు వస్తూ నన్ను తనతో తీసుకు వెళ్తానని భయపెట్టింది. అకస్మాత్తుగా నేను నాథుల 'అలఖ్ నిరంజన్' అనే బిగ్గర అభివాదన ధ్వనిని విన్నాను. దానితో ఆ పెనుతుఫాను ఆగిపోయింది. గాలి సుడులు తిరగడం ఆగిపోయింది. అక్కడ పరమనిశ్శబ్దం తాండవించింది. నేను కళ్ళు తెరిచాను. 'శివో2హం' అని నడవడం మొదలెట్టాను. ఆ "శివో2హం" ఆ ప్రయాణమంతటా ఆ తరవాత కూడా నాతోనే నిలిచింది.

పరిక్రమం చేస్తూన్న రెండో రోజున సముద్ర స్థాయికి 18,500 అడుగుల ఎత్తునున్న డోల్మా లా పాస్ దాటి రాత్రి ఎనిమిదింటికి విడిది స్థానానికి చేరుకున్నాం. ఆక్సిజన్ స్థాయిలు బాగా తక్కువగా ఉండడం వల్ల మేము బాగా అలసి సొలసి పోయాం. ఆ రోజు మేము నిజంగా బాగా క్లిష్టమైన దారి మీదుగా ఇరవై రెండు కిలోమీటర్లు నడిచాం.

నా గుడారంలో కుదుటపడి కూర్చున్న తర్వాత, రాత్రి భోజనమయిన మీదట నన్ను అలజడి పెట్టవద్దని మా మిత్రులకు సూచించాను. మాలో చాలామంది ముక్కుల్లోంచి రక్తం కారుతూ బాధపడ్డారు. నా ముక్కును శుభ్రంగా తుడుచుకుని, ఆ రాళ్ళ దగ్గర మూత్రకోశాన్ని ఖాళీ చేసుకొని, గుడారం గుడ్డ అంచులను జిప్పుతో మూసేసి, పద్మాసనంలో కూర్చొని నా ఏకాగ్రతను ఆజ్ఞాచక్రం మీద నిలిపాను. నా తలకు రక్తం ఒక్కుమ్మడిగా ఎక్కింది; నా వెనుబాము మీదుగా ఒక మెరుపు తీగ పైకి వ్యాపించింది. కొన్ని సెకన్లలో నేను నా శరీరంలోంచి బయటపడి, ఆనందపూర్ణమైన వెండిలాటి వెలుగు కోశంతో చుట్టుకుపోయాను.

ఈ నూతన కాంతి రూపమైన నేను, చాలా వేగంగా బహు పూజనీయులు వసించే బహుస్తరాల గుండా గడిచి, దీప్తమైన నీలిరంగుతోనూ, ఉపశమింపజేసే కాంతితోనూ ధగధగలాడే అద్భుత ప్రదేశానికి చేరుకున్నాను. ఒక తెల్లని స్ఫటిక మందిరం తాలూకు ముందువాని రెండు పెద్ద నీలితాచులు కావలి కాస్తున్నాయి. అవి వాటి పడగలను ఊపుతూ నన్ను లోపలకు ప్రవేశించమన్నాయి. మధ్య హాల్‌లో పైకి లేవనెత్తి ఉన్న ముదురు ఎరుపు పరుపు మీద మహాపురుషుడైన మహాదేవుడు దీప్తసూర్యం లాగ ప్రకాశిస్తున్నాడు. ఆయన మాటిమాటికి శివ భోలేనాథుడి ప్రకాశమయ

రూపంలోకి మారుతూ నెలవంకను తలమీదా, నల్లతాచును మెడ చుట్టూను ధరించి ఉన్నాడు. ఆయన శరీరం హిమధవళంగా ఉంది; ఆయన మూడో కన్ను ఒక నీలిముత్యంలాగా కనిపిస్తోంది.

ఆయనకు అటూ ఇటు ఐదుగురు – బాబాజీ, బైబిలుకి సంబంధించిన ప్రవక్తలాగ కనిపించే ఒకతను, చిమ్టాతో ఒక నాథుడు, నేనింతవరకూ చూసిన వారిలోకల్లా అత్యంత ప్రశాంతమైన దయాపూర్ణ నేత్రాలతో తెల్ల తలపాగా ధరించిన ఒక గెడ్డపు మనిషీ, జడలు కట్టిన జుట్టును ముడిగా చుట్టి, చుట్టలు తిప్పిన మీసంతో, వదులుగా ఉన్న ఎర్ర అంగీని తొడిగి మంగోలియా వారి లక్షణాలున్న మరొక మనిషీ – కూర్చొని ఉన్నారు. వాళ్ళందరూ నాలాగే వెండివెలుగులీనుతున్న శరీరాలతో ఉన్నారు. మల్లెల సుగంధం  అక్కడ గాలిని నింపింది. నేను చాలాసార్లు సాగిలపడి లేచి, నేలమీద మఠం వేసుకుని కూర్చున్నాను. బాబాజీ ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ (ఇలా అన్నారు):

"మధూ! కైలాసానికి (వచ్చిన నీకు) స్వాగతం. ఈయన గొప్ప యూదు మాస్టారు ఈశా, లేక, యేసు; ఆ నాథుడు మరెవరో కాదు. శ్రీ గోరఖ్‌నాథుడే; మహా ప్రేమపూరిత నేత్రాలు కలవాడు గొప్ప నానక్‌దేవుడు; మీసమూ ఎర్ర అంగీ ఉన్న ఆయన అసమాను డైన పద్మసంభవుడు గురు రిన్‌పోచే. ఈ మేమందరమూ శ్రీగురు బాబాజీ శిష్యులం. శ్రీ గురు బాబాజీయే ఈ ప్రకాశించే శూన్యం, ఆదినాథుడు, సింహాసనస్థుడైన ఈ శివమహాదేవుడు. మహా పీర్ సాయినాథ్, గరీబ్‌నవాజ్‌గా ప్రసిద్ధుడూ, పూజనీయుడూ అయిన షేక్ ఖ్వాజా మొయినుద్దీన్ చిస్తీ ఇక్కడ ఉండలేకపోయారు కానీ వారి ప్రేమనూ దీవెనలనూ నీకు అందించమన్నారు. ఈ రోజున ఇక్కడ ప్రకటం కావాలని అనుకోని కైలాస నివాసి శంకర భగవత్పాదుల్లాటి ఆదిగురువులూ గొప్ప యోగులందరూ కూడా నీకు అభినందనలూ ఆశీస్సులనూ ఇస్తున్నారు".

"బాబాజీ! నన్ను ఇక్కడ ప్రవేశించడానికి అనుమతించినందుకు మీకూ శ్రీగురువు గారికీ నా కృతజ్ఞతలు. నేను మీలాగే ఇక్కడే ఉండిపోవాలని అనుకుంటున్నాను. కలియుగాంధకారంతో మసకబారిపోయిన భూమి మీదకు తిరిగి వెళ్ళాలన్న అభిరుచి బొత్తిగా లేదు. నేనిప్పటికి చాలినంతగానే చేశాను. మీరు మార్గదర్శకత్వం కోసం నా దగ్గరకు పంపించిన వాళ్ళు ఇప్పుడు వాళ్ళను వాళ్ళు చూసుకోగలరు. వాళ్ళకి సాయపడ డానికి ఎప్పుడూ మీరు ఉండనే ఉన్నారని నాకు తెలుసు.

"నా శరీరానికి అప్పుడే అరవై ఏళ్ళునిండాయి. అది గంభీరంగా జబ్బు పడడానికి ముందే, లేకపోతే, అది బలహీనపడక ముందే దాన్ని వదిలివేయడం మంచిదని

నాకనిపిస్తోంది. భౌతికంగా నేను ఎవరి మీదా ఆధారపడి ఉండదలచుకోలేదు" అని నేను అర్థించాను.

"నేను (గతంలో) నన్ను వదిలిపెట్టి లోకంలోకి వెళ్ళమన్నప్పుడు ఏ పరిస్థితిలో ఉన్నావో అదే పరిస్థితిలో మళ్ళీ నువ్వున్నావు. నువ్వు తిరిగి వెళ్ళాలనే నేను మళ్ళీ చెబుతాను. ఆధ్యాత్మికంగా గానీ లౌకికంగా గానీ నీ మీద ఆధారపడిన వాళ్ళూ, నీ సహచరులూ వాళ్ళ బాగు వాళ్ళు చూసుకునే స్థితికి ఇంకా వికసించలేదు. నీకుగా నువ్వు ఎన్నుకొని పెళ్ళి చేసుకున్న నీ భార్యకూ, నీ పిల్లలకూ నీ అవసరం ఇంకా ఉంది. అటు లౌకిక కుటుంబ బాధ్యతలూ ఇటు ఆధ్యాత్మిక కుటుంబ బాధ్యతలూ రెండూ నీకు పూర్తి కాలేదు. అంచేత ఉండు. తొందరపడకు.

"అదీగాక, నీ తరవాత నీ ఆధ్యాత్మిక బాధ్యతలు తీసుకొని నీ పనిని కొనసాగించ గలిగేవాణ్ణి ఇంకా నువ్వు నిర్ణయించుకోలేదు గదా. అంతవరకూ నువ్వు అక్కడే ఉండాలి. సమస్యేమీ లేదు. నువ్వు ఇక్కడికి నీ ఇష్టం వచ్చినప్పుడు రాడానికీ పోవడానికీ నీకు స్వేచ్ఛ ఉంది. ఇదీ మేము అనుకునేది; ఇదీ శ్రీగురువు అనుకునేది. అయితే, నీ నిశ్చయాన్ని నువ్వు చేసుకోడానికి నీకెప్పుడూ స్వేచ్ఛ ఉంది" అని బాబాజీ చెప్పారు.

నేను తల వంచుకొని నిశ్శబ్దంగా నిలబడి ఉన్నాను. అప్పుడు గురు రిన్‌పోఛే ఇలా మాట్లాడారు: "మధుపా! బోధిసత్త్వ మార్గాన్ని అవలంభించు. ఇతరులకు అందరికీ నిర్వాణ సిద్ధిని కలిగించడానికి తాను మళ్ళీ మళ్ళీ రావడానికి బోధిసత్త్వుడెప్పుడూ సిద్ధంగా ఉంటాడు. అర్‌హంత్ వట్టిగా తన ముక్తినే చూసుకుంటాడు. ఓం వజ్రసత్త్వ హూమ్".

మహా ప్రభువు యేసు ఇలా అన్నారు: "మానవపుత్రుడా! ఒక్క ఆత్మకు సహాయం కలుగుతుందంటే చాలు నీ శరీరాన్ని సిలువ మీద ఎక్కించడానికైనా సిద్ధపడు"

నానక్‌దేవ్ ఈ విధంగా చెప్పారు: "పరమాత్మ అనుగ్రహపూర్ణుడు. ఆ అనుగ్రహం అవతరించడానికి నువ్వు నిమిత్తానివి కా. సత్‌నామ్, హరిహరీ, యా రబ్".

శివ గోరఖ్ ఇలాగన్నారు: "ధునిని శాశ్వతంగా వెలిగించి ఉంచుతూ దాని రక్షణ బాధ్యత నంగీకరించే విశ్వాసపాత్రుడు నీకు దొరికేంత వరకూ నువ్వు దాన్ని కొనసాగిస్తూనే ఉండాలి. అలఖ నిరంజన్, భంభోలే"

"ఎప్పటిలాగే నేను మీ విధేయ సేవకుణ్ణి. వ్యక్తిగత ముక్తితో తృప్తిచెందే సూక్ష్మాహంకారం ఇంతవరకూ నా అంతర్మనస్సులో తారాడుతూనే ఉందని తెలుసుకున్నాను. ఈ రోజున దాని మూలాలను పెకలించి నాథమునుల ధునిలో ప్రజ్వలించే విజ్ఞానాగ్నిలో హుతం చేయడం జరిగింది. జై భోలేనాథ్, భం భోలే.

విశ్వాధిపతి అయిన జగన్నాథుడికి జయము! రబ్-ఇల్-ఆలిమీన్. నేనిప్పుడే వెనక్కి తిరిగి వెళ్ళిపోతాను. శ్రీగురూ! నన్ను దీవించండి" అని నేనర్థించాను.

ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూన్న శూన్యం నుంచి శ్రీగురువు మధుర కంఠధ్వని అప్పుడు వినవచ్చింది: "మధూ! శ్రీమధూ! నేనెప్పుడూ నీతోనే ఉన్నాను. నా అంతస్సులోని అగ్ని తాలూకు విస్ఫులింగానివి నువ్వు. ప్రశాంతిగానూ సహర్షంగానూ నువ్వు ఇక వెళ్ళు".

"శ్రీగురుభ్యోనమః" అని ఉచ్చరిస్తూ నేను సాష్టాంగపడ్డాను. తక్షణమే నేను గుడారంలో ఇంకా పద్మాసనంలోనే ఉన్న నా శరీరంలోకి తిరిగి వచ్చేశాను. నా చేతినున్న గడియారాన్ని చూసుకున్నాను. అప్పుడు మధ్యరాత్రి దాటి ఒక నిముషమయింది.

తటాలున వచ్చిన విపరీతమైన తలనొప్పితో నా తల కొట్టుకుంది; తరవాత నా ముక్కు నుంచి చాలా ఎక్కువగా రక్తం కారడం మొదలయింది. దాన్ని తుడుచుకోడా నికి నా దగ్గరున్న అన్ని తువ్వాళ్ళను ఉపయోగించవలసి వచ్చింది. రక్తప్రవాహం ఆగగానే నా తలనొప్పి మటుమాయమయింది. నా తలకు వేగంగా పైకెక్కిన రక్తమంతా ఈ విధంగా అవతలకు ప్రవహింపజేయబడిందా అనిపించింది. నా ముక్కునీ ముఖాన్నీ నా దగ్గరున్న సీసాలోని నీటితో కడుక్కొని కాళ్ళను ఒకసారి చాచి, ఆ మీద తిరిగి పద్మాసనంలోకి ముడుచుకుని గాఢధ్యానంలోకి ప్రవేశించాను. ఈసారి నేను నా చుట్టూ ఉన్న జడల బర్రెలూ పొట్టి గుర్రాలతో సహా అన్నిట్లోనూ అందరిలోనూ నన్ను భావించగలిగాను.

పొద్దున్నే మేము పరిక్రమ తాలూకు చివరి భాగాన్ని నడిచి మానస సరోవరం చేరుకున్నాం. దీనిలో మా బృందంలో ఒకతను తన గుర్రం మీంచి కింద పడడం, అతని పక్క ఎముకా వీపులకూ దెబ్బ తగలడమనే ఒకానొక చిన్న ఘటన తప్పించి పెద్ద దుర్ఘటన ఏదీ జరగలేదు. మాతోబాటు వచ్చిన సుమిత్రుడైన మా డాక్టరు గారు బాగా కలత చెందారు గానీ, శ్రీగురు అనుగ్రహం వల్ల అతనికి బాగు అవుతుందని నాకు తెలుసును.

# ౫౦. ప్రయాణం కొనసాగుతూనే ఉంది

ఇది ముగింపు అధ్యాయం. చాలా చిన్నదిగానే ఉంటుంది. హరిద్వారంలో నా గుడారంలో కూర్చొని దీనిని రాస్తున్నాను. గంగాశీతల జలాలు ఇక్కడ నుంచి ఎక్కువ దూరమేమీ లేవు. పూర్ణకుంభమేళాకు ఇక్కడకు చేరిన మా పెద్ద బృందంలో రమారమి ఎనభై ఐదు మందే ఉన్నారు. పూర్ణకుంభమేళ పన్నెండేళ్ళకొకసారి జరుగుతూ ఉంటుంది. భారతదేశంలోని అన్ని దిక్కుల నుంచీ వచ్చి చేరుకున్న వందలాది పావన పురుషుల మధ్యనూ, వారి దగ్గర దీవెనలందుకొని పవిత్ర నదిలో స్నానం చేయడానికి వచ్చిన వేలాది జనాల మధ్యనూ కొన్ని రోజులు గడుపుదామని మేము ఇక్కడ ఉన్నాము. ఒక ప్రశాంత ప్రదేశంలో మా గుడారాలు మేళా తాలుకు మోటైన తోపులకూ, గడబిడలకూ దూరంగా ఉన్నప్పటికీ, మేము మేళా క్రియాకలాపాల్లో భాగం పంచుకోవాలని కోరుకొన్నప్పుడు నడిచి వెళ్ళగలిగేటంత దగ్గరలోనే ఉన్నాయి.

ఈ నా స్వీయకథను ముగించే ముందు కొన్ని ముఖ్యమైన సంగతులను చెప్పి, ఆ మీద కృతజ్ఞతల పర్వానికి వస్తాను. నేను ధుని ముందు కూర్చొని అగ్నీ, పరమాత్మ సాక్షులుగా ఆ సంగతుల్ని చెబుతున్నాను.

ఈ స్వీయకథలో నేను రాసిన వాటితో వాస్తవికత దృష్ట్యా ఏకీభవించనివీ, ముఖ్యంగా నన్ను మహా మహిమాన్వితుడిగా చేయాలన్న ఉద్దేశంతో, నిజాలను బహు వక్రీకరించి చెప్పేవీ అయిన విషయాలతో నా తరవాత వచ్చే ఈ మీదట వచ్చే నా గురించిన ఏ జీవితకథనైనా సరే సాధికారికమని మీరు సమ్మతించవద్దు.

మరో ముఖ్యమైన సంగతి, ఇదీ: ఇప్పటివరకూ నేను నా ఆధ్యాత్మిక వారసుడిగా ఎవరినీ ఎన్నిక చెయ్యలేదు. నాకు బాగా సన్నిహితంగా చాలా శ్రద్ధాభక్తులతో కూడినవారున్నారు కానీ బ్రహ్మాండమైన ఆ గురుతర బాధ్యతను నెత్తికెత్తుకోగలిగిన వాళ్ళి ఎవర్నీ నేనింకా గుర్తించలేదు. బహుశా వాళ్ళలోనే ఎవరో ఒకరు దానికి ఆవశ్యకమైన యోగ్యతలనూ అర్హతలనూ పెంపొందించుకోగలుగుతారేమో, లేకపోతే, ఇప్పటి బృందంలోని కొందరికి మళ్ళే, నాతో మునుపటి (జన్మల) సంబంధాలు కలిగిన ఒక నూతన పరిపక్వాత్మ కనిపించవచ్చునేమో మరి. నేను ఓర్పుగా వేచి ఉండి, సమయం పక్వం కాగానే సుస్పష్టమైన సూచనలిస్తాను.

ఆధ్యాత్మిక వారసుడి లక్షణ సంపుటి గురించి తేటపరచవలసిన అతి ముఖ్యమైన నిర్దేశం ఇదీ: అనుకోకుండా నా మరణానికి ముందే నేను నా ఆధ్యాత్మిక వారసుణ్ణి నిర్దేశించకపోతే మాత్రం, తన కలలో నేను కనిపించి చెప్పినట్టుగా గానీ, భూతాల లేఖనం ద్వారానో, మరో అటువంటి వ్యర్థప్రలాపాల ద్వారానో తన పరిచయ

నిదర్శనాలను చూపించబోయినా, అటువంటి వారినెవ్వరినయినా సరే అంగీకరించవద్దని నేను నా మిత్రులను హెచ్చరిస్తున్నాను. నా ఆలోచనలను వ్యక్తీకరించడానికి గానీ జనాన్ని ఆదేశించడానికి గానీ, ఎటువంటి రకమైన అనిర్దిష్ట మాధ్యమాలనూ (Mediums) నేనెప్పటికీ ఉపయోగించనని ఈ రాతమూలంగా తెలియచేస్తున్నాను.

సత్సంగ్ ఫౌండేషన్ వ్యవహారాలనూ స్కూళ్ళనూ నడపడానికి పరిపాలనా పదవులను నిర్వహిస్తున్న శ్రద్ధావంతులూ దక్షులూ దయావంతులూ అయిన వాళ్ళెవరూ, ఎట్టి పరిస్థితుల్లోనూ, నేను అలాగ నా శరీరం నిశ్చేష్టమయ్యే లోపునే నిశ్చింతగా అక్షరాలా చెప్పితే తప్పించి, తమను తాము నా ఏకైక ఆధ్యాత్మిక వారసులుగా భావించుకోవద్దని ఖండితంగా చెబుతున్నాను.

ఇది చెప్పిన తర్వాత ఇప్పుడు బాబాజీ ప్రణాళికను అమలుపర్చడంలో నాకు సాయంచేసిన వాళ్ళందరికీ నేను నా కృతజ్ఞతలు చెప్పుకుంటాను:

మొదట, నాకు కేటాయించిన పనిని చేయడానికి వీలుగా నన్ను ఈ లోకంలోకి తీసుకువచ్చిన నా తల్లికీ తండ్రికీ నేను ధన్యవాదాలు తెలుపుకుంటాను. వాళ్ళను నా తొలి సిద్ధిప్రదాయకులుగా చెప్పుకుంటాను. నాలాంటి వెర్రి మగడి వైపరీత్యాలన్నిటినీ ఓర్చుకుంటూ సంబాళించుకుంటూ సహించుకుంటూ వచ్చిన నా భార్యకూ, నా విలక్షణతలను అర్థం చేసుకుంటూ సానుభూతి కనబరచిన నా పిల్లలకూ నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. ఆ తరవాత, నా చిన్నప్పటి నుంచీ ఇప్పటివరకూ నా సాయం చేసిన, నిస్వార్థంగా నా కార్యకలాపాల భారాన్ని ఆధారభూతులై, అటు ఆధ్యాత్మపరంగానూ ఇటు లోకపరంగానూ నాకు సమకూర్చిన వారందరికీ నా ధన్యవాదాలను ఏకరువు పెడతాను.

వీరందరికీ, అజ్ఞాతంగానూ మౌనంగానూ ఉన్నవాళ్ళకూ కూడా నా పునః పునః సాష్టాంగ ప్రణామాలను చేస్తూ, తిరిగి తిరిగి వంగి నమస్కరిస్తూ, సంపూర్ణ వినమ్రతతో వారి కాలి బొటనవ్రేళ్ళను నేను చుంబిస్తాను. శ్రీగురువు తమ అనంత, అపార అనుగ్రహాన్ని వీరందరి మీద వర్షించాలి.

ఇది ఈ స్వీయకథ ముగింపే, కానీ మీ ఆసక్తికరమైన ఆధ్యాత్మిక యాత్రకు ఇది ప్రారంభం కావాలని నేను ప్రార్థిస్తాను. ప్రేమతోనూ, స్నేహంతోనూ-

ఎమ్.

శ్రీ ఎమ్ కేరళలోని తిరువనంతపురంలో పుట్టేరు. పందొమ్మిదిన్నరేళ్ళప్పుడు హిమాలయాలకు పోవా విచిత్రమైన అనివారణీయ అభిలాష చేత ఆకర్షి ఇంటిని వదిలేశారు.

బదరీనాథ్‌లోని హిమాలయ దేవాలయానికి అవతల ఉన్న వ్యాస గుహలో తన గురువర్యుణ్ణి కలుసుకొని, మంచు చుట్టబెట్టుకున్న హిమాలయ ప్రాంతాలన్నిట్లోనూ స్వేచ్ఛగా తిరుగుతూ మూడున్నరేళ్ళు గడిపారు. తన మాస్టారు మహేశ్వరనాథ్ బాబాజీ నుంచి నేర్చుకున్నది ఆయన చేతనత్వాన్ని పూర్తిగా మార్చింది.

తిరిగి సమతలం మీదికి వచ్చిన తరవాత, తన గురువుగారు ఆదేశించినట్టు ఆయన, జీవిక కోసం పని చేస్తూ, సాంఘిక బాధ్యతలను తీర్చుకుంటూ సామాన్య జీవితాన్ని గడిపారు. అదే సమయంలో తాను నేర్చుకొని అనుభూతం చేసుకున్న దాన్ని బోధించడానికి సమాయత్తం కూడా అయ్యారు. తన మాస్టారి దగ్గర్నుంచి వచ్చిన సంకేతాన్ని బట్టి ఆయన తన జీవితంలోని బోధనా దశలో ప్రవేశించారు. ఈ రోజున, ఆయన తన అనుభవాలనూ విజ్ఞానాన్నీ పంచుకోడానికి ప్రపంచవ్యాప్తంగా పర్యటిస్తూ ఉన్నారు.

దాదాపుగా అన్ని ప్రధాన మతాల బోధనలతోనూ సమాన పరిచితి కలిగిన, జన్మతః ముమ్తాజ్ అలీ ఖాన్ అయిన శ్రీ ఎమ్ తరచూ అంటూంటారు: "లోనున్న కేంద్రానికి వెళ్ళండి. సిద్ధాంతాలు వ్యర్థం" అని.

శ్రీ ఎమ్ వివాహితులు. ఆయనకు ఇద్దరు పిల్లలు. ఆయన సాదా జీవితాన్ని–బోధించడం, విద్యా ఉ త్కృష్టతను పెంపొందించే ఉదార సంస్థ 'ద సత్సంగ్ ఫౌండేషన్'కు నాయకత్వం వహించి ముందుకు నడిపించడం - ద్వారా గడుపుతూ ఉంటారు.

ప్రస్తుతం ఆయన బెంగలూరు నుంచి మూడు గంటల దూరంలో, ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న మదనపల్లెలో నివసిస్తున్నారు.

ఆయనతో సంప్రదించడానికి:
www.satsangfoundation.org లేక



తన విజ్ఞానమయ, శక్తిమయ, ప్రేమమయ మహాగురువును నిగూఢమైన హిమాలయ మహోన్నతుల్లో కనుగొన్న ఒక యువకుడు భారత దాక్షిణాత్య సముద్రతీరం నుంచి ఆ ఎత్తులకు చేసిన ఆసక్తికరమైన ప్రయాణం.






Magenta Press

Price Rs. 330/-